# కుటుంబరావు సాహిత్యం

## రెండవ సంపుటం

సంపాదకుడు

**కేతు విశ్వనాథరెడ్డి**



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం.	: 1970

ప్రతులు	: 1000

ప్రథమ ముద్రణ	: మే, 1988

ద్వితీయ ముద్రణ : మే, 1996



టైటిల్ డిజైన్ : చంద్ర

**వెల : రూ. 100-00**

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్,

హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,

హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004.

భూమిక

# మధ్యతరగతి వైరుధ్యాలను చిత్రించిన వాస్తవిక వాది

కుటుంబరావు సృష్టించిన పురుష పాత్రల గురించి రెండు ప్రధానమైన వాదాలున్నాయి. మొదటివాదం ప్రకారం: ప్రధాన పురుష పాత్రలు మధ్యతరగతిలో పుట్టినవి. ఆర్థిక మాంద్యపు రోజుల్లో ఆస్తి హరించుకుపోయినవి లేదా పుట్టు దరిద్రపువి. ఉన్నతాదర్శాలకూ, కఠిన వాస్తవాలకూ పొంతన కుదరక జీవితంలో ఎన్నో ఒడిదుడుకులకులోనై రకరకాల వృత్తులకు పూనుకున్నవి. మిగతా వారికంటే ఎక్కువ సాంఘిక చైతన్యమూ, ఎక్కువ తెలివితేటలూ కలవి. మిగతావారి కంటే ఎక్కువ బాగుపడలేక పోయినవి. ఈ పాత్రలు ఆదర్శవాదులైన అభాగ్య యువకులు, అసమర్థపు జీవయాత్రికులు. రెండో వాదం ప్రకారం: పురుష పాత్రలు వంచకులూ, అభివృద్ధి నిరోధకులూ, పురుషుని ఆధిక్యతలో నమ్మకం ఉన్నవాళ్లూ, డబ్బుతప్ప మరొక విలువ తెలియని వాళ్లూ. రెండో వాదానికి రాజనీతి తత్వశాస్త్ర దృష్టిని జోడిస్తే కుటుంబరావు రచనల్లో (కథల్లో) చాలా తరచుగా తారసపడే మధ్యతరగతి పాత్ర రెండవ ప్రపంచ యుద్ధకాలంలో పర్మిట్లూ, కోటాలూ, లైసెన్సులూ, కాంట్రాక్టులూ చేపట్టి ధనికులై యుద్ధం తరువాత బహుశా మధ్యతరగతి విడిచిపెట్టి ఒక మోస్తరు పెట్టుబడిదారులై తరువాతి కాలంలో ఆధునిక భారత పాలక వర్గంలో ఒక భాగంగా మారిన లంపెన్ బూర్జువావర్గం.

...

కుటుంబరావు పాత్ర నిర్మాణ దృష్టిలోని సంశ్లిష్టతే పరస్పర విరుద్ధమైన ఈ రెండు వాదాలకూ తావు ఇచ్చింది.

ఈ సంశ్లిష్టత ఏ రకంగా ఉంటుందో అరుణోదయంలోని ఒక సన్నివేశం ఆధారంగా మనం తెలుసుకోవచ్చు:

అరుణోదయంలోని ప్రధాన పాత్ర రామ్మూర్తి. సంఘం ఏ గిరిగీసినా అందులో ఉండటానికి సిద్ధపడే వ్యక్తి. రాజకీయ విజ్ఞాన రహితమైన రాజకీయ చైతన్యం అతనిది. ఆర్థిక సంక్షోభపు రోజుల్లో ఆస్తి హరించుకొనిపోగా, పత్రికలనీ,

సినిమాలనీ, నాటకాలనీ, వ్యాపారమనీ, తిరిగి తిరిగి, డక్కామొక్కీలు తిని యుద్ధం అయిపోయేసరికి చాటుమాటు వ్యాపారంలో పాతికవేలు వెనకేసుకొని కూర్చున్న వాడతను. శాంతి కరువై ఉన్న ఆ రోజుల్లో పాతికేళ్ళ పేరులేని కుర్రాడొకడు రామ్మూర్తి వద్దకు వచ్చాడు. కవిత్వమూ, పత్రికా సాహిత్యమూ, కళలూ, రాజకీయాలూ, ఆర్థిక సమస్యలూ, ప్రజాజీవితంలో ఆందోళనా, అశాంతీ మొదలైన వాటన్నిటి గురించీ రామ్మూర్తితో మాట్లాడే సందర్భంలో ఆ కుర్రాడు అంటాడు:

"మీ రెంతైనా చెప్పండి. జీవితం గురించి మనకి కొన్ని మూల సూత్రాలు తెలిస్తేగాని మనకి పై విషయాలంతు బట్టవు. విశ్వమానవాత్మ ఏకత్వ సిద్ధి కోసరమే పాటుబడుతున్నది. కాని దాన్ని పడకుండా చెయ్యడానికి నిరోధక శక్తులు చాలాఉన్నై. సోషలిస్టులే వర్గ కలహం ప్రారంభిస్తున్నారని కొందరంటారు. అంతా వుత్తదీ! వర్గవిభజనా, ఒక వర్గాన్ని మరో వర్గం అణగదొక్కటమూ ఏనాడో ప్రారంభమయింది. అణగదొక్కబడకుండా చూచుకోవడానికి కింది వర్గం ప్రయత్నాలు సాగించగానే అప్పుడే వర్గవిభజన ప్రారంభమైనట్లు మాట్లాడతారు. 'ఐక్యతా నినాదం ఫాసిస్టు నినాదం' అంటూ ఆమధ్యని పత్రికల్లో రాశారు. సామ్యవాదం సూచించే ఐక్యతనూ, వర్గ రాహిత్యాన్నీ అర్థం చేసుకున్నవాడికి ఐక్యత ఎప్పుడు పోట్లాడి సాధించాలో, ఎప్పుడు సౌమ్యంగా సాధించాలో బోధపడుతుంది. సంఘంలో అశాంతికి ఒకే ఒక కారణం దోపిడీ. అదే లేనినాడు ఏ ప్రచారమూ అశాంతిని వ్యాప్తి చెయ్యలేదు. దోపిడీ తరగతుల వారీగా జరుగుతున్నది. జీవిత సూత్రాన్ని చేతుల్లోకి పట్టుకొని కదిలించలేక దానికి చిక్కిపోయినవాడు ఈ పరిస్థితినేమీ చెయ్యలేడు. కింది వాణ్ణి దోస్తాడు, పైవాడి చేత దోపిడి చేయించుకుంటాడు. వాడే కళలు సృష్టించినా, ఏ రాజకీయాల్లో పాల్గొన్నా, ఏ ఆర్థిక సమస్యల్ని గురించి మాట్లాడినా ప్రపంచానికి పిసరంతైనా ఉపయోగంలేదు. జీవిత సూత్రాన్ని చేతబట్టినవాడు దాన్ని మరింత చిక్కుపరుస్తాడో, చిక్కువిడదీస్తాడో అది వాడి ఆదర్శాలను బట్టి ఉంటుంది. వాడు మంచికి పనిచేస్తే వాడివల్ల లోకానికి ఉపకారం ఉంది. చేడుకు పని చేస్తే అపకారం ఉంది. వాడి సాంఘిక చైతన్యం గురించీ, వాడి రాజకీయాల గురించీ, వాడు సృష్టించే కళల్ని గురించీ ఉదాసీనంగా ఉండటం బుద్ధిమంతుడి లక్షణం కాదు...."

"అరుణోదయంలోని కుర్రాడనే జీవిత సూత్రం రామ్మూర్తి లాంటి ఆస్తిపరుడికి అందినా దాన్ని అతను మరింత చిక్కుపరుస్తాడు. అతను సంఘంలో కలిగే మార్పును ఏనాడూ తాత్వికంగా ఆలోచించినవాడు కాదు." కళలు ప్రజల ఆధీనంలోకి పోతూ వుండటం అతను గమనించాడు. అది తప్పని నమ్మాడు. నమ్మినవాడు వాటికి ఎడంగానూ ఉండలేదు; ఈ మార్పు తప్పనిసరి అని తెలుసుకొని, ఈ మార్పులోనుంచి సాధ్యమైనంత ఉన్నతాదర్శం సాధించి, ప్రజలను అత్యధికమైన మేలు కళల ద్వారా సాధించే ఉద్యమం నిర్మించటానికి ప్రయత్నం చెయ్యనూ

లేదు. తానేదైతే కళాపతనం అని నమ్మాడో దాన్నే ఆశ్రయించి స్వార్థం గడుపు కున్నాడు.

"దీనికి కూడా రామ్మూర్తిని మనం తప్పులు పట్టలేం. అతనికి కళాసృష్టిచేసే ప్రతిభ లేదు. సాంఘిక వ్యవస్థలోనూ, కళలలోనూ కలిగే పరిణామాన్ని తాత్వికంగా అవగాహన చేసుకునే విజ్ఞానమూ అతనికి లేవు. ఈ రెండూ లేని మధ్య తరగతి సంస్కారి ఏ విధంగా ప్రవర్తించాలో రామ్మూర్తి ఆ విధంగానే ప్రవర్తించాడు."

సుభద్రపట్ల రామ్మూర్తి చూపిన సంస్కారం పై వర్ణాల వాళ్ళ అహంకారం కంటే పైవర్గాలవాళ్ళ నైచ్యం కంటే భిన్నమైంది కాదు. "ఎక్కడో మురుగులో పొర్లాడే పందిని తెచ్చి తనూ వెంకటేశ్వర్లూ కలిసి పైకి లాగి ఒక మనిషిని చేసి నందుకు ఇప్పుడు సొంత లాభం చూసుకోవటమే చేసేదని" అడిగాడు కూడా.

రామ్మూర్తి లాంటి మధ్య తరగతి సంస్కారులందరికీ కనువిప్పు తెచ్చుకోవా లనుకుంటే కనువిప్పయ్యే జవాబును సుభద్ర ఇచ్చింది కదా :

"మీ కేఁవయ్యా? మీరంతా నాబోటి పందుల్ని పట్టుకొచ్చి మనుషుల్ని చేస్తారు. ఇంకెవరన్నా పందుల్ని చూడరాదా?"

సుభద్ర అట్టడుగు వర్గం మనిషి. ఆమె గొంతు వ్యాపారానికి, శరీరం సెక్సు దోపిడికీ గురి అయింది. ఆమెకున్న పాటి మానవత్వం రామ్మూర్తిలాంటి వాళ్ళలో ఉందని చెప్పలేం.

రామ్మూర్తి వంటి వ్యక్తి వాదినీ, ఆదర్శరహితుణ్ణి కుటుంబరావు ఒక ప్రధాన పాత్రగా తీసుకోవడమెందుకు? జీవితంలోని ప్రకాశం, గడ్డురోజులలోని సత్యం రామ్మూర్తి కంటే భిన్నమైన వ్యక్తులు. ఐనా సొంత ఆర్థిక పరిస్థితులలో వస్తున్న మార్పులవల్ల తమ కలలు ఎంత అవాస్తవికమైనవో, తమ భ్రమలు ఎంత గడ్డువో, తామెదుర్కొనే సత్యాలు ఎంత కర్కశంగా ఉంటాయో అనుభవం ద్వారా తెలుసు కున్నవాళ్లే. తమ ఆదర్శాల పరిధి వ్యక్తి మాత్రమైందనీ, వ్యక్తి పరిధిలోని ఆదర్శా లను కూడా గట్టిగా ఆచరించగల ఆత్మశక్తి లేనివాళ్ళమనీ తెలుసునని అనుకోలేము.

పెళ్ళినాడిచ్చిన కట్నంలోని కథకుడూ, వ్యర్థ జీవితంలోని మార్కండేయులు, ఆత్మ సంయమనంలోని కథకుడు, భగవద్భక్తిలోని కథకుడు, స్వర్గంలో ఖైదీలు లోని ప్రకాశం, ఈ జీవితం ఇట్లా ఎందుకైందని ప్రశ్నించి బాధపడ్డవాళ్ళు. ట్యూటర్ లోని శేఖర్ జీవితం ఇట్లా ఎందుకుందో తెలిసినవాడు కమ్యూనిస్టని ముద్ర వేయించు కున్నా కథలో అతని కార్య శీలతకు స్థానంలేదు. నాకు తెలీదు, బతక నేర్చినవాడు, మిత్రద్రోహం, రసికుడు, పిరికిగుండె, దేశీయ పరిశ్రమ, ఫారిన్ కొలాబరేషన్‌లోని ప్రధాన పాత్రలు పరవంచకులు. కిందివాళ్ళను దోచిన వాళ్ళు. తాత్త్విక విశిష్టత

లోని కార్మిక నాయకుడు, కార్మికులను ముంచినవాడు. పశ్చాత్తప్తుడు, విమోచనం, అంతరాత్మ, కర్మ సిద్ధాంతులు లోని ప్రధాన పాత్రలు పాత సంస్కారాన్ని ఎదిరించిన వాళ్ళు. మైరావణ రక్తబిందువులులోని ఆచార్లు, రాఘవులు, శాస్త్రి వర్గ రాజకీయాలను వంటబట్టించుకున్న వాళ్ళు.

జీవితంలోని దక్షిణామూర్తి తప్పితే మిగతా పాత్రలు ఆర్థిక సంక్షోభ దశకూ, రెండవ ప్రపంచ యుద్ధ కాలానికీ, ఆటు తర్వాత స్వాతంత్ర్యానంతరం తొలి దశాబ్దానికీ సంబంధించినవి. 70 తర్వాత రాసిన గల్పికలలోని పాత్రలు కూడా దీనికి పెద్దగా మినహాయింపుకాదు.

జీవితంలోని దక్షిణామూర్తి వీరేశలింగం సంస్కరణోద్యమ వారసుడు. ఆదర్శాలు తన జీవితంలో ఆచరించడమే కాకుండా చుట్టూ కొంత సాంఘిక చైతన్యాన్ని కల్గించటానికి ప్రయత్నించినవాడు. సంస్కరణోద్యమ దశావిశేషం వెనకబడ్డాక మద్రాసులో ఆస్తిపాస్తుల సంపాదన గొడవల్లో పడిపోయాడు. ఆ కాలంలో మద్రాసు నగరంలో అతనికి బలంగా అందిన ఆదర్శం అదే మరి.

కుటుంబరావు కల్పించిన మధ్యతరగతి పాత్రలన్నీ ప్రవృత్తినిబట్టీ, ప్రవర్తనను బట్టీ, కుటుంబ, సామాజిక సంబంధాలను బట్టి స్థూలంగా వ్యక్తివాద పాత్రలే. ఒక దశలో ఆదర్శాలు కనబరచిన ఆ దశ గడిచిపోగానే ఆదర్శరహితమై పోతాయి. ఇటువంటి వాటినే కుటుంబరావు ప్రధానంగా సృష్టించడమెందుకు? సృష్టించడంలోని ఆయన ఆంతర్యమేమిటి? జీవిత సూత్రాన్ని చేతబట్టి చిక్కు విడదీయగల ఆదర్శపాత్రలనో, ధీర పాత్రలనో మైరావణుని రక్తబిందువులులోలాగా ఆయన ఎందుకు సృష్టించలేక పోయారు?

ఈ ప్రశ్నలకు జవాబులు మధ్య తరగతి కనపరుస్తూ వచ్చిన వర్గ చైతన్య చరిత్రలో దొరుకుతాయి. దానిపట్ల కుటుంబరావు చూపిన అవగాహనలో దొరుకుతుంది. మధ్యతరగతి ఆలోచనాశీలిగా ఆయన సమగ్రమైన ప్రపంచ జ్ఞానంలో దొరుకుతుంది. నిజాయితీపరుడైన కల్పనా సాహిత్య రచయితగా ఆయన మనస్తత్వ పరిజ్ఞానంలోనూ శిల్పప్రావీణ్యంలోనూ దొరుకుతుంది. ఒక మాటలో చెప్పాలంటే ఆయన వాస్తవిక వాదంలో దొరుకుతుంది.

మధ్యతరగతి వర్గ చైతన్యాన్ని ఆయన ఒక జడ పదార్థంగా ఏనాడూ చూడలేదు. ఆ చైతన్యం ఏకోన్ముఖమైందని ఆయన నమ్మలేదు. చరిత్ర ప్రభావంలేని 'గొంగళి పురుగు'గా మధ్య తరగతిని ఆయన పరిగణించలేదు. ఆయన పాత్రలు సరళమైన క్లర్కు సూర్యారావులూ కావు; వేతన శర్మలూ కావు. మధ్యతరగతి వర్గం ఆయన దృష్టిలో అద్వైత పదార్థమూ కాదు; కేవల ద్వైతమూ కాదు; విశిష్టాద్వైతమూ కాదు. అది కుటుంబరావు దృష్టిలో ఒక సంశ్లిష్ట జీవ పదార్థం. దాని

స్వభావాన్ని నిర్ణయించేది ఆర్థిక యాదార్థ్యమూ, చరిత్ర వాస్తవమూ. దానిలోని మనుషులు మూసపోసిన వాళ్ళుకాదు; ప్రత్యేక లక్షణాలూ, సామాన్య లక్షణాలూ కలిసిన సజీవ వ్యక్తులు. మరొక రకంగా చెప్పాలంటే "typical characters in typical setting." వీళ్ళ setting in కార్యశూరత్వం కంటే ఆలోచనా పటిమ ఎక్కువ. శ్రామికవర్గ చరిత్ర సృష్టించగలిగేవాళ్ళు కాదుకానీ, ఆ చరిత్రను గమనించగలవాళ్ళే, వ్యక్తిగత వైరుధ్యాలు లేనప్పుడు ఆ చరిత్రలో ప్రయాణంకూడా చేయగలిగినవాళ్ళే.

ఆంధ్ర చరిత్రలో మధ్యతరగతిలోని ఒక పాయకు చెందిన వ్యక్తులు సంస్కరణోద్యమ కాలంలోనూ, జాతీయోద్యమ కాలంలోను సామాజిక రాజకీయ పాత్రలను నిర్వర్తించారు. ఫ్యూడల్ వ్యతిరేక భావాలనూ, వలస వ్యతిరేక భావాలనూ ప్రదర్శించారు. కానీ వర్గపోరాటం తీవ్రరూపంలో లేకపోవడంవల్ల కావచ్చు, ఉద్యమ రంగాలతో ప్రత్యక్ష పరిచయం లేకపోవడం వల్ల కావచ్చు. ఈ పాయకు చెందిన వ్యక్తులు అధికశాతం వామపక్ష భావాల పొలిమేరలోనే ఉండిపోయారు. అయితే వాళ్ళ భావసంస్కారం వామపక్ష భావాలకు వ్యతిరేకమైందని కానీ, అనుకూలమైందనికానీ చెప్పలేము.

సంస్కరణోద్యమ, జాతీయోద్యమ దశల్లోని కాల్పనికావేశాలూ, ఊహలూ, భ్రమలూ పచ్చి సామాజిక వాస్తవాల ముందు చరిత్రగతిలో ఎంత అవాస్తవమైనవో ఈ పాయకు చెందిన వ్యక్తులు అనుభవంలో తెలుసుకోగలిగారు. ఆర్థిక సంక్షోభం మూలంగా ఆస్తి సంబంధాలలో వచ్చిన మార్పుల ప్రభావం మానవ సంబంధాలను ఏ రకంగా మార్చివేస్తూ వచ్చిందో గమనించగలిగారు. కుటుంబ సంబంధాలూ, స్నేహాలూ, ప్రణయాలూ, పత్రికలూ, సినిమాలూ, నాటకాలూ, సాహిత్యమూ, కళలూ ఏ మార్పులకు గురి అవుతూ వచ్చాయో పరిశీలించగలిగారు. అయితే అచ్చమైన పారిశ్రామిక కార్మిక మనస్తత్వాన్ని అలజడీ, అనుభవాల తర్వాత అలవర్చుకున్న కొత్త జీవితంలోని విరల్‌వంటి వారు వీళ్ళుకారు. తెనాలి, మద్రాసులకూ బొంబాయికీ పారిశ్రామికీకరణంలో ఉన్న తేడాలవల్ల మాత్రమేకాక ఈ పాయకు చెందిన వాళ్ళందరూ గ్రామీణాస్తితో సంబంధాలు పోగొట్టుకున్నా, కార్మికులు మాత్రంకారు. ఒకరకంగా తెల్లచొక్కాల ఉద్యోగులు. సంపాదనలో ఒక్కొక్కప్పుడు తేడాలులేకపోయినా సంస్కారంలో తేడాలున్నవాళ్ళు - తమ చదువుల వల్లా, తమ కుటుంబ సంబంధాలవల్లా, సమాజంలో విద్యాధిక వర్గానికున్న గౌరవం వల్లా, అనుభవజ్ఞానం వల్లా.

మరొక పాయకు చెందినవాళ్లు సవర్గ దుర్మార్గులూ, వర్గభ్రష్టులూ. వారసత్వంలోని రామదాసు, ట్యూటర్‌లోని వాణిదంపతులు, దేశీయ పరిశ్రమలోని గిర్ధర్‌భాయి, ఫారిన్ కొలాబరేషన్‌లోని పాపారావు వర్గసోపానాలు ఎక్కుతూ పోగలిగినవారు. మిగతా వాళ్ళలో చాలామంది వృత్తి ఉద్యోగ ఆదాయ వర్గాలవాళ్ళే.

మరికొంత మందిని వ్యాపారం దాటి పరిశ్రమల యాజమాన్యం దాకా వెళ్ళగలిగిన వాళ్ళు అని అనుకోలేం.

సవర్గ దుర్మార్గులనూ, వర్గభ్రష్టులనూ, ఉన్నతవర్గాలకు ఎగబాకాలనే వాళ్ళనూ కుటుంబరావు మధ్యతరగతి దూది మనసుతో చూడలేదు. వాళ్ళపట్ల ఆయనకు దాక్షిణ్యమూలేదు. ఈ వైఖరిని ఆయన కథాగమనంలో, సన్నివేశాను గుణమైన పాత్రల స్వభావ పరివర్తన చిత్రణలో కథనశైలిలోని టోన్‌లో మనం స్పష్టంగా గుర్తించవచ్చు. చిత్రించిన జీవితంలోని సంఘర్షణలకూ పరిస్థితులకూ అనుగుణంగా పాత్రల స్వభావ పరివర్తన ఎట్లా జరుగుతూ పోయిందో మనం గమనించకపోతే, కుటుంబరావు టోన్‌లోని వ్యంగ్యాన్నీ, అధిక్షేపణనూ, తాట స్థ్యాన్నీ, సహానుభూతినీ మనం పట్టించుకోకపోతే మధ్యతరగతి జీవితం పట్లా, ఆ జీవితం నుంచి ఆయన తీసుకున్న ఇతివృత్తాలపట్లా, ఆ ఇతివృత్తాలలోని పాత్రల పట్లా, ఆయన పాఠకుల్లో కలిగించాలనుకున్న ప్రాపంచిక దృక్పథం పట్లా మనకు సరైన సంస్కారం ఏర్పడదు.

కుటుంబరావు వాస్తవిక వాద చిత్రణతో వచ్చిన చిక్కే ఇది. ఏరకం జీవితాన్ని ఆయన ఆమోదిస్తున్నాడు, దేన్ని ఖండిస్తున్నాడు అనే విషయాన్ని మనం స్పష్టంగా గుర్తించలేకపోతే కుటుంబరావు యాంత్రిక భౌతికవాదిగా, స్వాభావిక వాదిగా కనిపిస్తాడు; ఆయనలోని చారిత్రక ఆశావాదం మనకు సంపూర్ణంగా అర్థం కాదు; ఆయన చిత్రించిన మధ్య తరగతిలోని సంశ్లిష్టవర్గ స్వభావం మనకు పట్టుపడదు; ఆ తరగతిలోని వైరుధ్యాలూ మనకు అవగతం కావు.

అరుణోదయంలోని పేరులేని కుర్రాడొకడు శుద్ధ కళావాదుల మీద దండెత్తుతూ అంటాడు:

"....సమగ్రమైన ప్రపంచ జ్ఞానం, పరిశుద్ధమైన అంతఃకరణా, సంఘానికి అభ్యుదయం చేకూర్చాలనే దృఢసంకల్పమూ, మనస్తత్వం గురించిన విశాల పరిజ్ఞానమూ, మానవ మనస్సును కదిలించే అపార ప్రజ్ఞా, వీటివెంట సంప్రదాయ సిద్ధంగా వస్తున్న శిల్పంలో ప్రావీణ్యత సంపాదించడమూనూ, కావలిస్తే వీటికోసం ప్రచారం చెయ్యి...."

కుటుంబరావు తమ రచనల్లో వీటికోసం ప్రచారం చెయ్యలేదని అనగలమా? ఈ 'ప్రచారం' ఏ వర్గ జీవితాన్ని గురించి రాసే రచయితకైనా తోడ్పడదని చెప్పగలమా?

హైదరాబాదు
16 మే 1988

కేతు విశ్వనాథరెడ్డి

# తన రచనల గురించి ...

దిగువ ఇస్తున్న ఉత్తమ కథ చర్చ అచ్చంగా కుటుంబరావు తమ రచనల మీద వెలిబుచ్చిన అభిప్రాయాలతో కూడుకున్నది కాదు. పాలగుమ్మి పద్మరాజు, కొడవటిగంటి కుటుంబరావుతో ఈ చర్చను 1953 ఫిబ్రవరి 12న మద్రాసు ఆలిండియా రేడియోవారు విమర్శక రంగం అనే శీర్షికలో ప్రసారం చేశారు. కుటుంబరావు సాహిత్య తత్వాన్ని, రచనాధోరణులను అవగతం చేసుకోవడానికి దోహదం చేస్తుందనే ఉద్దేశంతో ఈ చర్చను ఈ సంపుటంలో సమకూరుస్తున్నాము. ఆంధ్రజ్యోతి సంపాదకుడి నోటును కూడా పొందు పరుస్తున్నాము. (సంపాదకుడు).

## ఉత్తమ కథ

కుటుంబరావు : ఏమండీ పద్మరాజుగారూ, మీరు కొత్త కథానిక ఏదైనా రాస్తున్నారా?

పద్మరాజు : లేదండి. ఈమధ్య కథానికల మీదకి మనస్సంతగా పోవడం లేదు.

కు : ఎందుచేత?

ప : ఒకటికారణం, రాసిన కథలకి తగినంత ప్రచారం రాకపోవడమూ, రెండోది రాస్తున్నకొద్దీ దానిమీద మోజు తగ్గడమూను.

కు : కథలమీద మోజు తగ్గటం అన్నారే నా అనుభవంలో కూడా కథ రాయలంటే ముందుండినంత ఉత్సాహం ఇప్పుడు ఉండటంలేదు. దీనికి కారణం కథానిక యువకుల సొమ్మేమోనని నాకనిపిస్తున్నది. మీరేమంటారో....

ప : కేవలం వయస్సే కారణం అని అనను గాని మీరు చెప్పినది ఒప్పుకుంటాను. నేనొకప్పుడు పద్యాలూ, పాటలూ రాసేవాణ్ణి. ఇప్పుడసలు వాటిమీదకు మనస్సే పోదు. ఈ మనస్సులో వచ్చే మార్పు—అంటే మనిషి అభిరుచుల్లోను, భావావేశంలోను, దృక్పథంలోనూ వచ్చే మార్పు—ముఖ్యకారణ మనుకుంటాను, కొందరు ఎన్నేళ్ళు వచ్చినా కావకవిత్వమూ చిన్న కథలూ రాయగలిగుండవచ్చు.

కు : ఈ విధంగా వార్ధక్యంలోకూడా చిన్నతనంలోలాగే రాయటానికి ప్రయత్నించే వాళ్ళని ఒకరిద్దరిని చూస్తున్నాను; వారిలో మానసిక పరిణామం పూర్తిగా స్తంభించిపోయినట్లు వారి రచనలను చూస్తేనే తెలుస్తుంది. ఇంకొక విషయం కూడా ఉంది. నేను పదిహేను పదహారేళ్ళ కిందట రాసిన కొన్ని కథలు తిరిగి చూసుకుంటే వట్టి పిందెల్లాగున్నాయి.

ప : మనం వెనకరాసిన కథల్ని ఇప్పుడు మనం విమర్శించుకోటంలో కొంచెం పొరపాటుందనుకుంటాను. ఏ వుత్సాహమైతే మనచేత ఆ కథలు రాయించిందో ఆ వుత్సాహంతో మనకిప్పుడు అంత ప్రమేయం లేకపోవడం మీరన్న దానికి కారణం. కాని ఆ వుత్సాహానికి తప్పకుండా విలువవుందని నేనంటాను.

కు : విలువ లేకేం, వుంటుంది. ఆ విలువను పాటించేవాళ్లు ఇప్పటికీ వాటిని చదివి సంతోషిస్తూనే ఉంటారు.

ప : అదేలెండి. కథానిక యువకులచేతుల్లోనే బాగా నడుస్తుంది; అని ఒప్పుకోవచ్చు. వయసుమీరిన కొద్దీ లోకాన్ని గురించిన అనుభవం పెరిగి చెప్పదల్చుకున్న విషయం కథానికలో ఇమడ్చడం కష్టమవుతుందనుకుంటాను.

కు : అవును పద్మరాజుగారూ. నేనింకా కథానికలు రాస్తూనే వున్నానుగాని కథ ఆలోచించినప్పుడల్లా ఆ పాత్రల వెనుకవుండే వాతావరణమూ మనస్తత్వమూ నా వూహలో తెగ పెరిగి పెద్ద కథ రాయాలనే ప్రేరణ కలుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు బుద్ధి-నాటకం రాయాలన్నంతదాకా పోతుంది.

ప : నాటకాల విషయం వచ్చిందికనక చెపుతున్నాను. ఈ మధ్య నేను రాసినవన్నీ నాటికలూ, నాటకాలూను. ఇంకో ధోరణిలోకి మనసుపోవటంలేదు. ఇందుకనే నాటకాంతం సాహిత్యం అని పెద్దలన్నా రనుకుంటాను.

కు : మీ అనుభవం తెలియదుకానీ నేను ఒకప్పుడు కథలో శిల్పంతప్ప మరేమీ చూసేవాణ్ణికాదు. అప్పటి నా ఉద్దేశంలో కధకి శిల్పంతప్ప ఇంకేమీ అవసరం లేదు. ఆ వైఖరి ఇప్పుడు మారిందనుకోండి.

ప : ఇప్పుడు మీ అభిప్రాయం, శిల్పం ప్రధానం కాదంటారా?

కు : అదికాదు. ఇప్పుడు కథాశిల్పం గురించి నాకు ఏ విధమైన జంకూలేదు. ఒకప్పుడు 'నా శిల్పం ఎంత బాగుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి. ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శనకోసమే కథ రాయటం వట్టిదండుగగా కనిపిస్తోంది. కాని కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం అనాడేకాదు ఈనాడుకూడా ఒప్పుకుంటాను. కథలో శిల్పం లేకపోయినాక ఇంకెన్నున్నా దండుగే.

ప : నా బాధేమిటంటే ఈ విషయం గుర్తించిన కథారచయితలు చాలా తక్కువమంది కనిపిస్తున్నారు. ఇప్పుడు వచ్చే పత్రికల్లో కొన్ని వందల కథలు ప్రచురణ అవుతున్నాయి. దాదాపు ఒక్క కథలోకూడా చక్కని శిల్పం కనిపించడం లేదు. చెప్పదలచుకున్న విషయం ఎంత నిజమైనా, ఎంత వాస్తవికమైనా కథానికలో శిల్పం కనపడకపోతే కథ కుంటుపడుతుంది.

కు : మీరు చెప్పినదానికి ఒక ప్రబలమైన కారణం ఉందనుకుంటాను. ఈ రోజుల ప్రభావాన్ని బట్టి కథకులు ముఖ్యంగా ఈనాటి యువకులు తమ కథల ద్వారా పరిస్థితులను మార్చాలని చూస్తున్నారేగాని, కథయొక్క వాస్తవికత శిల్పంమీద యెంత ఆధారపడివుందో గ్రహించటంలేదు. ఒక ఉదాహరణ చెపుతాను. నేను వట్టి అభూతకల్పనలు కథలుగా రాసే రోజుల్లో అప్పటికే పేరుపడ్డ ఒక కథకుడు నా కథలు చదువుతున్నంతసేపూ అవి నిజమైనట్టే అనిపిస్తుందన్నాడు. ఇది కేవలం శిల్పపు ప్రభావమే అనటానికి నాకేమీ సందేహం లేదు. ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపంచేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు.

ప : పాత్రలూ, సన్నివేశాలూ వాస్తవికాలైనంతమాత్రాన్ని కథలో వాస్తవికంగా కనిపిస్తాయని ఋజువేంలేదు. మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతిగాని వాస్తవం కాదు.

కు : అదీనిజమే. ఇతివృత్తంనుంచి శిల్పాన్ని వేరుచేయటం సాధ్యంకాదని అనుకున్న తర్వాత, శిల్పంతో ప్రమేయంలేకుండా ఇతివృత్తంలోని ఒక పాత్రగాని ఒక సన్నివేశంగాని యథార్థం అనుకోవటంలో అర్థమేలేదు. నా ఉద్దేశంలో అనేక మంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలత్కారంగా తమ ప్రయోజనం జోడించటంవల్లనే అని.

ప : నాకు ఒక్కొక్కప్పుడనిపిస్తుందీ, అసలు యథార్థం అనేదే మనిషి మనిషికీ మారుతుందేమో అని. ఒకే సన్నివేశం ఉందనుకోండి, అది ముసలివాళ్ళకో రకంగాను, చిన్నపిల్లలకి మరోరకంగాను కనిపిస్తుంది. ఒక చిన్నపిల్లవాడు ఒక చావును గురించికాని, తల్లిదండ్రుల మధ్య తనకి తెలియని కారణాలవల్లవచ్చే ఘర్షణల్ని గురించికాని చెప్పడం ప్రారంభించినపుడు చాలా చిత్రమైన భావన కలుగుతుంది. ఆలాగే కథాశిల్పంలో ఏ దృష్ట్యా సన్నివేశాల్నీ, పాత్రల్నీ చిత్రించాలో నిర్ణయించుకోడం చాలా ప్రధానమని నాకు తోస్తుంది.

కు : అందుకేం సందేహంలేదు. అక్కడే రచయితయొక్క ఆశయం వ్యక్తమయేది కూడాను. మీరన్నట్టు జీవితంలోని ప్రతీ సంఘటనా చూసేవారినిబట్టి

కు : ఈ విధంగా వార్ధక్యంలోకూడా చిన్నతనంలోలాగే రాయటానికి ప్రయత్నించే వాళ్ళని ఒకరిద్దరిని చూస్తున్నాను; వారిలో మానసిక పరిణామం పూర్తిగా స్తంభించిపోయినట్లు వారి రచనలను చూస్తేనే తెలుస్తుంది. ఇంకొక విషయం కూడా ఉంది. నేను పదిహేను పదహారేళ్ళ కిందట రాసిన కొన్ని కథలు తిరిగి చూసుకుంటే వట్టి పిండెల్లాగున్నాయి.

ప : మనం వెనకరాసిన కథల్ని ఇప్పుడు మనం విమర్శించుకోటంలో కొంచెం పొరపాటుందనుకుంటాను. ఏ వుత్సాహమైతే మనచేత ఆ కథలు రాయించిందో ఆ వుత్సాహంతో మనకిప్పుడు అంత ప్రమేయం లేకపోవడం మీరన్న దానికి కారణం. కాని ఆ వుత్సాహానికి తప్పకుండా విలువవుందని నేనంటాను.

కు : విలువ లేకేం, వుంటుంది. ఆ విలువను పాటించేవాళ్లు ఇప్పటికీ వాటిని చదివి సంతోషిస్తూనే ఉంటారు.

ప : అదేలెండి. కథానిక యువకులచేతుల్లోనే బాగా నడుస్తుంది; అని ఒప్పుకోవచ్చు. వయసుమీరిన కొద్దీ లోకాన్ని గురించిన అనుభవం పెరిగి చెప్పదల్చుకున్న విషయం కథానికలో ఇమడ్చడం కష్టమవుతుందనుకుంటాను.

కు : అవును పద్మరాజుగారూ. నేనింకా కథానికలు రాస్తూనే వున్నానుగాని కథ ఆలోచించినప్పుడల్లా ఆ పాత్రల వెనుకవుండే వాతావరణమూ, మనస్తత్వమూ నా వూహలో తెగ పెరిగి పెద్ద కథ రాయాలనే ప్రేరణ కలుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు బుద్ధి-నాటకం రాయాలన్నంతదాకా పోతుంది.

ప : నాటకాల విషయం వచ్చిందికనక చెపుతున్నాను. ఈ మధ్య నేను రాసినవన్నీ నాటికలూ, నాటకాలూను. ఇంకో ధోరణిలోకి మనసుపోవటంలేదు. ఇందుకనే నాటకాంతం సాహిత్యం అని పెద్దలన్నా రనుకుంటాను.

కు : మీ అనుభవం తెలియదుకానీ నేను ఒకప్పుడు కథలో శిల్పంతప్ప మరేమీ చూసేవాణ్ణికాదు. అప్పటి నా ఉద్దేశంలో కథకి శిల్పంతప్ప ఇంకేమీ అవసరం లేదు. ఆ వైఖరి ఇప్పుడు మారిందనుకోండి.

ప : ఇప్పుడు మీ అభిప్రాయం, శిల్పం ప్రధానం కాదంటారా?

కు : అదికాదు. ఇప్పుడు కథాశిల్పం గురించి నాకు ఏ విధమైన జంకూలేదు. ఒకప్పుడు 'నా శిల్పం ఎంత బాగుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి. ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శనకోసమే కథ రాయటం వట్టిదండుగగా కనిపిస్తోంది. కాని కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం ఆనాడేకాదు ఈనాడుకూడా ఒప్పుకుంటాను. కథలో శిల్పం లేకపోయినాక ఇంకేమున్నా దండుగే.

ప : నా బాధేవిటంటే ఈ విషయం గుర్తించిన కథారచయితలు చాలా తక్కువమంది కనిపిస్తున్నారు. ఇప్పుడు వచ్చే పత్రికల్లో కొన్ని వందల కథలు ప్రచురణ అవుతున్నాయి. దాదాపు ఒక్క కథలోకూడా చక్కని శిల్పం కనిపించడం లేదు. చెప్పదలచుకున్న విషయం ఎంత నిజమైనా, ఎంత వాస్తవికమైనా కథానికలో శిల్పం కనపడకపోతే కథ కుంటుపడుతుంది.

కు : మీరు చెప్పినదానికి ఒక ప్రబలమైన కారణం ఉందనుకుంటాను. ఈ రోజుల ప్రభావాన్ని బట్టి కథకులు ముఖ్యంగా ఈనాటి యువకులు తమ కథల ద్వారా పరిస్థితులను మార్చాలని చూస్తున్నారేగాని, కథయొక్క వాస్తవికత శిల్పంమీద యెంత ఆధారపడివుందో గ్రహించటంలేదు. ఒక ఉదాహరణ చెపుతాను. నేను వట్టి అభూతకల్పనలు కథలుగా రాసే రోజుల్లో అప్పటికే పేరుపడ్డ ఒక కథకుడు నా కథలు చదువుతున్నంతసేపూ అవి నిజమైనట్టే అనిపిస్తుందన్నాడు. ఇది కేవలం శిల్పపు ప్రభావమే అనటానికి నాకేమీ సందేహం లేదు. ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపంచేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు.

ప : పాత్రలూ, సన్నివేశాలూ వాస్తవికాలైనంతమాత్రాన్ని కథలో వాస్తవికంగా కనిపిస్తాయని ఋజువేంలేదు. మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతిగాని వాస్తవం కాదు.

కు : అదీనిజమే. ఇతివృత్తంనుంచి శిల్పాన్ని వేరుచేయటం సాధ్యంకాదని అనుకున్న తర్వాత, శిల్పంతో ప్రమేయంలేకుండా ఇతివృత్తంలోని ఒక పాత్రగాని ఒక సన్నివేశంగాని యథార్థం అనుకోవటంలో అర్థమేలేదు. నా ఉద్దేశంలో అనేక మంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలత్కారంగా తమ ప్రయోజనం జోడించటంవల్లనే అని.

ప : నాకు ఒక్కొక్కప్పుడనిపిస్తుందీ, అసలు యథార్థం అనేదే మనిషి మనిషికీ మారుతుందేమో అని. ఒకే సన్నివేశం ఉందనుకోండి, అది ముసలివాళ్ళకో రకంగాను, చిన్నపిల్లలకి మరోరకంగాను కనిపిస్తుంది. ఒక చిన్నపిల్లవాడు ఒక చావును గురించికాని, తల్లిదండ్రుల మధ్య తనకి తెలియని కారణాలవల్లవచ్చే ఘర్షణల్ని గురించికాని చెప్పడం ప్రారంభించినపుడు చాలా చిత్రమైన భావన కలుగుతుంది. అలాగే కథాశిల్పంలో ఏ దృష్ట్యా సన్నివేశాల్నీ, పాత్రల్నీ చిత్రించాలో నిర్ణయించుకోడం చాలా ప్రధానమని నాకు తోస్తుంది.

కు : అందుకేం సందేహంలేదు, అక్కడే రచయితయొక్క ఆశయం వ్యక్తమయ్యేది కూడాను. మీరన్నట్టు జీవితంలోని ప్రతీ సంఘటనా చూసేవారినిబట్టి

వేరు వేరు అంతరార్థంతో కనిపిస్తుంది. ఈ వైవిధ్యాన్ని కథాకారుడు కాచివడపోసి నిగ్గుతేల్చి ఏ దృక్పథంనుంచి ఆ సంఘటనలోని సత్యాన్ని లోకానికి వ్యక్తం చేయాలో నిర్ణయించుకోవాలి. నిర్ణయించుకున్న అనంతరం అతని కథ వివిధ మనస్తత్వాలవారికి ఒకే అనుభూతినివ్వగలగాలి. ఇందులోనే కళ అనేదాని విశాల ప్రయోజనం ఇమిడివుంది.

ప : నేనిందాక చెప్పిన ఉదాహరణ ఉందనుకోండి. ఒక కుర్రవాడిద్వారా తల్లిదండ్రుల మధ్య జరిగే ఘర్షణ కథకుడు చిత్రిస్తున్నాడనుకోండి, అతని రచనని బట్టి ఒక కుర్రవాడి అనుభూతేకాకుండా అసలు ఆ తల్లిదండ్రుల మధ్య ఏర్పడిన సమస్య వారివారి మనస్తత్వాలుకూడా కథలో వ్యక్తంకావాలి. అవి కుర్రవాడి మాట ల్లోనే వ్యక్తం కావాలి. ఇదే అన్నిటికంటే కష్టమైనపని.

కు : అవును. లేనిపక్షంలో కథ కాకుల్ని కొట్టి గద్దలకి వేసినట్లవుతుంది. కథకుడి ప్రయోజనం కోసం కథలోని పాత్రలు బలి అవుతాయి. సాధారణంగా కథకుడి ప్రయోజనంలో సాంఘికమైన విలువ లోపించినపుడు ఇటువంటి రచనలు రాయటం జరుగుతుంది. దానిని సహృదయులు ఆదరింపలేరు. శిల్పందృష్ట్యా కూడా అది మంచి రచన అనిపించుకోదు.

ప : ఉత్తమ కథలుగా ప్రఖ్యాతి పొందినవి చదివితే వాటిలో మనకి కొన్ని లక్షణాలు కనిపిస్తాయి. ఒకటి - విషయాన్ని సూక్ష్మంగాను, సూటిగాను చెప్పడం, సామాన్యంగా కొత్తగా రచన ప్రారంభించే రచయితలు తమకు తోచినవన్నీ విధి విరామంలేకుండా వర్ణించేస్తుంటారు. ఈ సందర్భంలో చెహూవ్-గోర్కీకి ఇచ్చిన సలహా ఒకటి జ్ఞాపకం వస్తుంది నాకు. ప్రకృతి వర్ణన కథలోని పాత్రలతోటీ, సన్నివేశాలతోటీ సంబంధం లేకుండా ఉండడం పెద్దలోపం అంటాడతను. గోర్కీ 'పడవ ప్రయాణం' అనే కథలో దీర్ఘంగా నదీ, చెట్లూ, చేమలూ, పడవా అందులోని వ్యక్తులూ, సూర్యాస్తమయం, చంద్రోదయం దీర్ఘంగా వర్ణించుకుంటూ వెళ్ళాడు. దాన్ని విమర్శిస్తూ చెహూవ్ అన్నాడు: "నువ్వు వెన్నెలనీ వనాన్ని వేరే వేరేగా వర్ణిస్తున్నావు : నువ్వు చెయ్యవలసినది వెన్నెలపడి వనం ఎక్కడెక్కడ వెలుగు తోందో, ఆ భాగాలు వర్ణిస్తేచాలు. అప్పుడు వెన్నెలనీ - వనాన్నే కాకుండా ఆ రెంటికీ ఉన్న అనుబంధాన్ని కూడా చెపుతున్నావన్నమాట; అటువంటివి ఏరుకోవడం లోనే కథాశిల్పం వుందీ"— అన్నాడు.

కు : శిల్పం చెడకుండా వర్ణనలు చెయ్యటంలో చలంగారు ఒక్కొక్కప్పుడు అద్భుతంగా రాస్తారు. కాని, అప్పుడప్పుడు ఆయన రచనలోనే వర్ణనలు పాత్రల మనస్థితినిమించి వెళ్ళిపోయినట్టు కనిపిస్తుంది. నామట్టుకు నేనెప్పుడూ నా కథలలో ప్రకృతిని పాత్రలకి అనువుగా వుపయోగించుకోలేను. అందుచేత వర్ణనల జోలికి పోను.

ప : ఒక్క వర్ణనలేకాదు. ఇతివృత్తానికి సంబంధంలేని ఇతర విషయాల్ని కూడా కథల్లో ఇరికించడం జరుగుతోంది. కొద్దిమంది సిద్ధహస్తులు ఏ విషయాన్ని తీసుకొచ్చినా కథలో దానికి స్థానం కల్పించగలుగుతారు. దానివల్ల విచిత్రమైన ప్రయోజనాల్ని కూడా సాధించగలుగుతారు. మొపాసా "నెక్ లేస్" అనే కథలో కాలగతి సూచించడంకోసం ఫ్రాన్స్‌లో జరిగిన రాజకీయ పరిణామాలను కథతో బాటు ఏ సంబంధమూ లేకపోయినా వర్ణించి కథకు అద్భుతంగా ఉపయోగించుకున్నాడు.

కు : కాదా మరి ? శిల్పంలో పొదుపూ ఉండాలి. ఉపజ్ఞా ఉండాలి. మన కథకుల్లో వేలూరి శివరామశాస్త్రిగారి రచన ఎంత బిగువుగా పొంకంగా ఉంటుందో చూడండి. మంచికథ ఏది చదివినా అందులో ఒక వ్యర్థపదం వున్నట్టుగాని వొక వాక్యం తేలిపోయినట్టుగాని వుండకూడదు. మరో విషయం ఏమిటంటే కథని ఏ పాత్ర ద్వారా చెప్పాలో కథకుడికి తెలియాలని మీరిందాక అన్నారే, కొందరు కథకులు కథను స్వానుభవంగా చెప్పాలో మరొకరి అనుభవంగా చెప్పాలో కూడా నిర్ణయించుకోలేరు. నేను నేను అని కథ చెప్పుకుపోతూ ఇతర పాత్రలు అనుకున్న విషయాలు, రహస్యంగా చేసేపనులూ విపులంగా వర్ణిస్తారు.

ప : దీనికి కారణం రచనమీద కేంద్రీకరణ లేకపోవడం. చాలా కథలు ఎక్కడో మొదలు పెడతాయి - ఎక్కడో ఆఖరవుతాయి. నాకు కథారచనకి ఒక ప్రధాన సూత్రం వుందనిపిస్తుంది. కథా ప్రారంభం ఏమిటో, కథ ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా, చివరిదాకా జ్ఞాపకం వుండాలి.

కు : ఈ సూత్రాన్ని అక్షరాలా పాటించినట్టయితే మంచి కథలకి కొన్నిటికి దెబ్బ తగులుతుందేమో అని నా అనుమానం. అయినా ఆ సూత్రంలో ఒక సత్యం లేకపోలేదు. అదేవిటంటే ఒకే చిన్న కథను నాలుగైదు పాత్రల దృక్పథం నుంచి రచింప కూడదనేది. ఆ విధంగా దృక్పథాలు మార్చి కథ చెప్పటం పెద్ద కథలకీ, నవలలకీ సరిపోతుంది. ఈ కారణంచేతనే పాత్రల పరిణామం చిన్న కథలో సాధ్యం కాదు. కాని కొందరు కథకులు కథాశిల్పం తెలుసుకోలేక చిన్న కథలోనే ఒక జీవిత కథని ఇమడ్చటానికి ప్రయత్నిస్తారు.

ప : నవలకీ కథానికకీ వున్న పెద్ద భేదం ఇక్కడేనని అనుకుంటాను. ఒక పాత్ర జీవితకథని అమరణమూ వర్ణించినా చిన్నకథలో ఆ పాత్రలోని ఏ ఒక్క విచిత్ర ప్రకృతినో స్పష్టంచేయడంమట్టుకు సాధ్యమవుతుంది. అంతేగాని, అతని మానసిక పరిణామం పూర్తిగా చిత్రించడానికి సాధ్యం కాదు.

కు : ఇంతకీ శిల్పానికి రచనయొక్క ప్రయోజనానికీ అవినాభావం ఉన్నదని గ్రహించినట్టయితే, శిల్పంలో దోషాలన్నిటికీ మూలం కథ ప్రయోజనంలో దొరికిపోతుంది. కనీసం శిల్పం బాగుండి ప్రయోజనం పల్చబడవచ్చుగాని, శిల్పం పల్చబడి ప్రయోజనం విస్పష్టం కావడం సాధ్యంకాదు.

ప : రచయితకుండే ప్రయోజనాలకు ఆనాటి సమాజంలో ఉన్న పరిస్థితులకు చాలా దగ్గిర సంబంధం ఉండాలి. లేకపోతే ఆ రచన ఎందుకూ పనికిరాకుండా పోతుంది. తనకోసమే తను రాసుకుంటున్నాను, అనెవరైనా అన్నారంటే అది వట్టి బూటకం. ప్రతీ రచయితా ఒక పాఠకుణ్ణి మనస్సులో పెట్టుకోకుండా అసలు రచన సాగించలేడు.

కు : అంతేగదామరి. కథకుడు ఇతివృత్తం ఎన్నుకోవటంలోగాని దానికి తగిన శిల్పం అమర్చుకోవటంలోగాని పూర్తిగా ఏకాకిగా ఉంటాడు. ఆ కథ రచించ టంలో అతను పెట్టుకునే ఆశయం ఒకటే, అతణ్ని సామాజికుణ్ని చేస్తుంది. అతను ఒంటరిగా తన గదిలో కూర్చొని కథ రాస్తున్నప్పటికీ అతని మీద కథ చదవబోయే సహృదయుడి ప్రభావం అనుక్షణమూ వుంటుంది. ఈ సహృదయుణ్ణి స్పష్టంగా భావనచెయ్యలేని రచయిత తన ప్రయోజనాన్ని కూడా స్పష్టంగా చూడలేదని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

ప : ఈ సహృదయత అనేది పైపైని వుండే వాదాలలోగాని, విశ్వాసాల్లో గాని కనిపించే సామ్యంగాదు. అది మనిషి లోలోపల స్థిరంగా వుండే మానవత్వానికి సంబంధించింది. అంచేత రచయిత స్పష్టంగా వ్యక్తపరచే సిద్ధాంతాలతో సానుభూతి లేనివారు కూడా అతని రచనలు చదివి ఆనందించడానికి సాధ్యమౌతోంది.

కు : అప్పుడేగదా కళద్వారా సంస్కారం అనేది సాధ్యపడేది? ప్రతి రచనని దాన్ని ఆమోదించేవాళ్ళే చదవాలంటే రచన చెయ్యటమే వృధా. ఇంతకన్న ప్రచార సాహిత్యమైనా మెరుగే.

ప : ప్రచార సాహిత్యానికీ కళకీ ప్రధానమైన భేదంవుంది. సామాజిక సిద్ధాంతాలు జన బాహుళ్యానికి అనువర్తిస్తాయి, వ్యక్తులదగ్గిరికి వచ్చేసరికి ఆ సిద్ధాంతాల నిజానిజాలు ఋజువు కావు; వ్యక్తి సమస్య, సంఘ సమస్య కొంత దూర దూరంగా వుంటాయి. వ్యక్తి దగ్గరికి వచ్చేసరికి ప్రతీ సమస్యా ఒక నైతిక, ఆధ్యాత్మిక స్వరూపాన్ని పొందుతుంది. అంచేతే సాహిత్య స్వరూపంలో ముఖ్యంగా చిత్రణ జరిగేది ఈ వ్యక్తియొక్క నైతిక సమస్యకి, సమాజ నియమాలకీ మధ్యవచ్చే ఘర్షణే. సిద్ధాంతాలకి మొత్తం సంఘం ముఖ్యం; కళకి వ్యక్తి ప్రధానం.

కు : అందుచేతనే రచయితకు సంఘ సమస్యల్ని గురించి వుండే విశ్వా సాలు నేరుగా రచనలో పెట్టడానికి అవకాశంలేదు. రచన యెప్పుడూ జీవితం నుంచి రావలిసిందేగాని సిద్ధాంతాలనుంచివచ్చే అవకాశంలేదు. కాకపోతే యేమిటంటే జీవి తంలో మనుష్యులు ఎదుర్కొనే నైతిక ఆధ్యాత్మిక సమస్యలని తాను అర్థంచేసుకో టానికి ఇతరులకీ విస్పష్టంగా చెప్పటానికీ ఈ రచయిత విశ్వసించే సాంఘిక సిద్ధాం తాలు తోడ్పడవచ్చు. ఒక ఉదాహరణ చెప్తాను. ఒక రచయిత ధనికవాదం

సంఘానికి ఉపకరించేదని నమ్ముతాడనుకోండి; ఆ రచయిత దృష్టి నుంచి ఏక నిరుద్యోగి ఆర్థిక సమస్య ఒక విధంగా గోచరిస్తుంది. ఈ నిరుద్యోగి అతని దృష్టికి సోమరిపోతుగానో అసమర్థుడుగానో గోచరిస్తాడు. ఆ రచయిత ఆ నిరుద్యోగిని ఆ విధంగానే చిత్రిస్తాడుకూడా. నిరుద్యోగానికి ప్రధానకారణం పెట్టుబడిదారీ అని మరొక రచయిత నమ్ముతాడనుకోండి; అతని దృష్టికి నిరుద్యోగి సమస్యలు తీర నివిగాను, నిరంతరం పెరిగేవిగాను గోచరిస్తాయి. ఈ నిరుద్యోగులందరూ సంఘటితపడి పెట్టుబడిదారీని ప్రతిఘటిస్తేతప్ప ఈ సమస్య పరిష్కారమయ్యేది కాద న్నట్టు అతడికి గోచరిస్తుంది.

ప : ఏ సిద్ధాంతాల్లో నమ్మకం ఉన్నా సమాజం ఎలా మారాలని రచయిత నమ్ముతున్నా తను చిత్రించే జీవితంతో రచయితకు దగ్గర సంబంధమూ ఆ జీవితాన్ని గురించిన పరిపూర్ణమైన అనుభవమూ ఉండాలి. వట్టి సిద్ధాంతాలేగాని, రైతుల్ని గురించి కూలీల్ని గురించీ ప్రత్యక్షమైన అనుభవంలేక ఈనాటి కథకుల్లో చాలామంది మంచి కథలు రాయలేకపోతున్నారని నా నమ్మకం.

కు : చిత్రం ఏమిటంటే, ఈ రైతుల్తోను కూలీల్తోను సన్నిహిత సంబంధం ఉన్న వాళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు సరియైన కథలు రాయలేకపోతున్నారు. వీరిని గురించి ఒకవైపు కొన్ని **సిద్ధాంతా**లున్నాయి. మరొకవైపు **అనుభవం** ఉన్నది. కాని, ఈ రెంటినీ సమన్వయించే శక్తి రచయిత కుండటంలేదు. దానికి ప్రధాన కారణం యేమిటంటే-రచయితకుండే సానుభూతి వెంట, ఆ రైతు కూలీల జీవితంలోని సత్యాన్ని గ్రహించే శక్తికూడా లేకపోవటం; ఈ రైతుకూలీ పొద్దస్తమానం చెమటోడుస్తున్నాడని విచారిస్తాడు. ఎవరో ఒకరు చెమటోడ్చకుండా పొలాలు పండవనేది గ్రహించలేడు. చెమటోడ్చేవాడు ఎక్కడ అన్యాయానికి గురవుతున్నాడో కనుక్కో లేడు. అన్యాయానికి గురి అవుతున్నాడని మాత్రం తెలుసుకుంటాడు. ఈ రకం సానుభూతి సిద్ధాంతాలూ మంచి రచనలు చెయ్యటానికి చాలవు. మీరు చెప్పినట్టు తాను రచించే విషయాన్ని గురించి **అనుభవంతో పాటు ఆ అనుభవం** వెనక **ఉండే జీవిత సత్యాన్ని తెలుసుకునే శక్తి కూడా ఉండాలి.**

ప : ఒక్క చెమటోడ్చడమే రైతుకూలీ జీవితంలో ముఖ్యఘట్టమని రచయిత అనుకోడం దేనికారణం. రైతుకూలీ ఒక వ్యక్తిగా కాక తన సిద్ధాంతంలో ఇమిడే ఒక భావంగా అతనికనిపిస్తాడు. అంతేకాదు. ఒక రైతుకూలీ తన భార్యాపిల్లలతో ఇరుగుపొరుగులతో పంచకునే సుఖదుఃఖాలని గురించి కూడా అతను తలపెట్టడు. అంచేత ఒక అసంపూర్ణమైన చిత్రాన్ని ప్రదర్శించడం జరుగుతుంది.

కు : అవునుగాని, ఒకటడుగుతాను చెప్పండి. కళగా ఏ రచనైనా అన్ని రకాల వ్యక్తులకీ ఒకే భావన, అనుభూతీ ఇవ్వాలనుకున్నాంగాని ప్రత్యక్షంగా చూసినట్టయితే ఇది సాధ్యం కానట్టు కనిపిస్తుంది. మీరేమంటారు?

ప : పాత్రల చిత్రణా విషయంలో చదివే అందరికీ కొంచెం ఇంచుమించుగా ఒకటే అనుభూతి కలుగుతుందని అనుకుంటాను. అయితే మీరన్న వాటి వెనకవున్న అంతరార్థం గురించిగాని, రచనలో వ్యక్తమయే సత్యాన్ని గురించిగాని భిన్నాభిప్రాయాలు తప్పకుండ కలుగుతాయి.

కు : అవునుగదా. అటువంటప్పుడు రచయిత ఎటువంటి జీవితసత్యాన్ని చిత్రించాలన్న సమస్య కలగటంలేదా? సంఘంలోవుండే వివిధవర్గాలలో ఏ వర్గాన్ని తన కళకి సహృదయులుగా ఎంచుకోవాలో తేల్చుకోవాల్సిన అవసరం ఏర్పడు తోందిగదా.

ప : రచయిత సమాజంలో భాగమేకనుక అతని సానుభూతి కొంచెం ఇంచుమించుగా ఏదో ఒక వర్గంతో ముడిపడివుంటుంది. అంచేత ఆ వర్గాన్నే అతను మనస్సులో పెట్టుకుని రచన సాగించడంకూడా జరుగుతుంది. ఇంక మిగతా వర్గాలవారికి అతని రచనల్లో వున్న జీవిత సత్యంతో మట్టుకు సానుభూతి వుండదు.

కు : ఈ రచయిత తన వర్గాన్ని గురించే రాయాలని కూడా లేదు. అనేకమంది ప్రసిద్ధ కథకులు తమకు చాలాదూరంగా వుండే వర్గాలను గురించి కూడా కథలురాసి, ఆయా జీవితాల్లోని సత్యాన్ని ప్రదర్శింపగలిగారు. జీవిత టాల్‌స్టాయ్ మంచి ఉదాహరణ అనుకుంటాను.

ప : మీరన్న జీవిత సత్యం టాల్‌స్టాయ్ తరచు తన రచనలో ఇరికించే సిద్ధాంతాలు కావని నేననుకుంటాను. ఆ సత్యాలు అతని వ్యక్తిగతమైనవి. మీరన్న జీవిత సత్యం ఇంతకంటే సూక్ష్మమైనదీ, సూత్రప్రాయంగా చెప్పడానికి వీల్లేనిదీ అనుకుంటాను.

కు : నిజమే. రచనలో రచయిత ప్రవేశపెట్టటానికి యత్నించే నీతివేరూ, రచనద్వారా బయటపడే జీవిత సత్యం వేరూను. మనం అనేక పాతకథలు చదివి, వాటిల్లో కొత్తనీతులు చూడగలుగుతాం : కాని, నీతివుండే ప్రతికథలోనూ జీవిత సత్యం ఉండవలసిన అవసరం లేదు. రచనలలో జీవిత సత్యం వ్యక్తం కావాలంటే రచయితకి జీవితం ఎంతబాగా తెలియాలో ఆ జీవితం తాలూకు పరమార్థం కూడా అంతబాగా తెలియాలి.

ప : నీతులూ, సిద్ధాంతాలూ, అలావుంచి రచనల్లో వ్యక్తమయే ఈ జీవిత సత్యమే ఒక్కొక్కరికీ ఒక్కొక్కరకంగా అర్థమౌతుందని మనం ఇందాకా అనుకున్నాం. అయితే ఈ భిన్న సత్యాల్లో ఏదో ఒకటి నిజమైనదై యుండాలి. దాన్ని నిర్ధారణ చెయ్యడం ఎలాగ?

కు : సంఘంలో ప్రతివ్యక్తి అనుక్షణమూ తనకు కావలసిన సత్యం గురించి అన్వేషిస్తాడు. నిరుద్యోగి ఉద్యోగం దొరికేచోట్లు చూస్తాడు. పారిశ్రామికుడు తనకిందవున్న ఉద్యోగుల సంఖ్య తగ్గించేందుకు మార్గాలు చూస్తాడు. ఇటువంటి సత్యాలు ఆయావ్యక్తుల జీవితాలను ముందుకు తీసుకుపోతాయనటానికి సందేహంలేదు. కాని, ఇవి సామాజిక జీవితాన్ని ముందుకు తీసుకుపోయే సత్యాలు మాత్రం కావు; ఒకేదేశంలో ఒక మనిషి నుంచి ఇంకో మనిషి లాభం పొందినపుడు దేశంలోవున్న డబ్బు పెరగనట్టు, జీవిత సత్యం అయినపుడు దానికి రెండు దాఖలాలుండాలి. ఒకటేమిటంటే సత్యం అనేది అన్ని వర్గాల వారికీ నిర్వివాదంగా వినపడాలి. రెండవది ఆ సత్యం తెలుసుకోవటంవల్ల ప్రతివ్యక్తికీ **సమాజ స్వరూపాన్ని గురించిన జ్ఞానం విధిగా అభివృద్ధిచెందాలి.**

ప : కథల్లో సామాజికమైన సమస్యలు చిత్రించినట్టయితే ఆ జీవిత సత్యం అనేది కొంతవరకు గుర్తుపట్టడానికి అవకాశం వుంటుంది. కాని, సాహిత్యంలో గొప్పస్థానం సంపాదించుకున్న కొద్దిమంది రచనల్లో స్పష్టమైన ప్రయోజనంకాని, ఒక జీవిత సత్యంకాని ఎత్తి చూపడానికి కనపడదు. వాటి సాహిత్య ప్రయోజనాన్ని ఎలాగ అంచనా వెయ్యడం.

కు : ఇందులో ఒకటుందనుకుంటాను. సామాజిక సమస్యనెత్తుకున్నప్పుడు ఆ సమస్యను కథకుడు సరిగా చిత్రిస్తున్నాడో తారుమారు చేస్తున్నాడో ప్రజలకి సులభంగా తెలిసిపోతుంది. అంతేగాక ఆ సమస్య ఎట్లా పరిష్కారం కావాలనే విషయం జనబాహుళ్యానికి తెలిసి వుంటుంది. కాని, స్పష్టమైన ప్రయోజనంకాని, జీవితసత్యంకాని ఎత్తిచూపడానికి కనపడని గొప్ప రచనల్లో రెండు రకాలుంటాయని నా అనుమానం. ఒకటి, రచయిత ప్రతిభావంతుడై ఉండి కూడా, తానే సాంఘిక సత్యాన్ని సరిగా అవగాహన చేసుకోకపోవటం. నిజానికి వాస్తవ జీవితాన్ని గురించి వాస్తవంగా రాయటానికి ఇది అడ్డు కాదు. ఇందుకు గొప్ప వుదాహరణ జేమ్స్‌జోయ్స్ రాసిన యులిసిస్ నవల. ఇక రెండవది, రచయితకి ఒక ప్రయోజనం వుండీ కూడా తాను చెప్పదలచుకున్న జీవితసత్యాన్ని నిగ్గు తియ్యడానికి బదులు రచనలో అంతటా సరిచేస్తాడు. ఇటువంటి రచనలో ఒక సాంఘిక సమస్య వుండదు. కాని, సంఘం యొక్క ప్రతిబింబం సజీవంగా రచన అంతటా గోచరిస్తూంటుంది. దీనికి మంచి వుదాహరణ గోర్కీ నాటకం: "లోవర్ డెప్త్స్" అంతర్జాతీయ కథానికల పోటీలలో బహుమానం పొందిన మీ 'గాలివాన' తీసుకోండి. ఇందులో ప్రత్యేకించి ఒక సాంఘిక సమస్యలేదు. కాని ఆ కథ అంతటా వాస్తవ మనస్తత్వ చిత్రణం గోచరిస్తుంది. అందులో కనిపించే సాంఘిక సత్యం ఏమిటీ అంటే ఒక వాక్యంలో చెప్పటం సాధ్యం కాదు. కాని, అటువంటి సాంఘిక సత్యం దానిలో తప్పకుండా ఉంది.

ప : అంటే ఏ రచనకైనా బలాన్ని చేకూర్చేది ఈ జీవిత సత్యమే అనాలి. ఇది మానవత్వమంత విశాలమైంది కూడాను. అంటే కళ నిష్ప్రయోజనమైంది కాదనీ, దానికి జీవితంతో, మనం నివసించే సమాజంతో దగ్గర సంబంధం వుండడమేకాక జీవితాన్ని అర్థం చేసుకోడానికి ఒక దృష్టిపథాన్ని కూడా కలిగించాలి.

కు : అంతే, మీకభ్యంతరం లేకపోయినట్లయితే - **యథార్థమయిన కళ 'జీవితం యొక్క జీవితం' అంటారు.**

ప : మనం కథానికలతో ప్రారంభించి చాలా విశాలమైన సాహిత్య సమాలోచనలో పడ్డాం. అయితే ఉత్తమ రచనలకి అన్నిటికీ ఉండవలసిన లక్షణాలు సామాన్యంగా ఒకటేగనక ఈ సమాలోచన తప్పదనుకుంటాను. మన చర్చలో తేలిన అంశాల్లో గుర్తుంచుకోవలసినవి; ఇవి అని నాకు తోస్తుంది. ఉత్తమకథకి మొట్ట మొదట ఉండవలసింది శిల్పం. రెండోది వాస్తవికత. మూడోది జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం.

—ముద్రణ: ఆంధ్రజ్యోతి మాసపత్రిక, మార్చి 1953



1941 లో కొడవటిగంటి కుటుంబరావు

# వరుసగా

## నవలలు



## కథలు

గల్పికలు



నాటిక

# అరుణోదయం

రామ్మూర్తి ఎక్కడా తప్పకుండ బియ్యే పాసయినాడు. అన్ని పరీక్షల్లోనూ ఫస్టుమార్కులే. ఉపాధ్యాయులంతా రామ్మూర్తిని ఎత్తేసేవాళ్ళు. రామ్మూర్తి పెద్దవాడై చాలా గొప్పపనులు చేస్తాడని తెలుసు వాళ్ళకు. ఫస్టుమార్కు లొచ్చేవాళ్ళు ఊరికే పోరు. అటువంటి వాడు తమ శిష్యుడని చెప్పుకోగలగటం ఎంత ఘనమైన విషయం!

చదువైపోతూనే రామ్మూర్తి భార్య కాపారాని కొచ్చింది. తల్లిదండ్రు లిద్దరూ చచ్చిపోయినారు. అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ ఎవరూ లేరు. ఇరవై ఎకరాల సుక్షేత్రమైన మాగానీ ఉంది. ఇల్లుంది. రామ్మూర్తి భార్యతో స్వర్గ సుఖం అనుభవించసాగాడు.

పరీక్షల్లో ఫస్టుమార్కులొచ్చినా, ఆడదాన్లో ఇంత ఆనందం వుంటదని రామ్మూర్తికి స్పష్టంగా తెలీదు. కామసుఖం గురించి బహిరంగంగా మాట్లాడే వాళ్ళంటే అతనికి భయంగానూ అసహ్యంగానూ ఉండేది. తిండి పదార్థాలను గురించి లొట్టలు వెయ్యడానికి స్త్రీ సుఖం తెలుసుకుని నిట్టూర్చటానికీ ఏం తేడా?

నిజం చెప్పాలిసొస్తే రామ్మూర్తి స్తబ్ధు. అతని బుద్ధికి చైతన్యం తక్కువ. ఫస్టు మార్కులు రాకపోతే తాలూకాఫీసులోగాని, కలెక్టరాఫీసులోగాని, మునసబు కోర్టులోగాని గుమాస్తా చెయ్యవలసిన మనిషి. అతనికి ప్రపంచజ్ఞానం శూన్యం. అతనిలో కొంతయినా సంచలనం తెప్పించిన మనిషి భార్యే!

కల్యాణి పెద్ద చైతన్యంగల మనిషని కాదు. ఆమె అతనికన్న కూడా స్తబ్ధు. ఆమెకు చిన్నతనంనుంచీ తిండిలోతప్ప మరి దేన్లోనూ ఆనందం కనిపించేది కాదు. కాపరానికి వచ్చిన తరువాత కొద్దికాలానికి దాంపత్యంలోకూడా కొంత ఆనందం కనిపించింది. కాని ఆ ఆనందం చెయ్యరానిపని చేసేటప్పుడు పిల్లలకు కలిగే ఆనందం కంటే ఆట్టే హెచ్చయినది కాదు.

కల్యాణిలో కామోష్ణత లేకపోవటమూ, చూసే మగవాళ్ళనందర్నీ ఆకర్షించే లక్షణాలు లేనిది కావటమూ, రామ్మూర్తికి చాలా నచ్చింది. భార్యలు 'నిరపాయకరంగా' ఉండటం భర్తల కెంతో హాయి. అసలు సంఘమే అటువంటి వ్యక్తుల్ని అధికంగా ఆదరిస్తుంది.

రామ్మూర్తికూడా నిరపాయకరమైన మనిషే గనక, అందరూ అతన్ని ఆదరించేవాళ్ళు. అతను ఒకరితో మాట్లాడడు. మత విషయికంగాగాని రాజకీయంగాగాని 'కొత్తపద్ధతులు' కోరే వాడుకాడు. మీటింగులూ, చర్చలూకూడా అతని కక్క

ల్లేదు. సంఘం ఏ గిరిగీసినా అందులో ఉండటానికి సంసిద్ధుడే. అటువంటి మనిషిని చూస్తే ఎవరి కిష్టం ఉండదు?

ఉద్యోగం చెయ్యాలనే ఆలోచన రామ్మూర్తికి స్వతహాగా కలగనేలేదు. ఒకరికి పదిమంది, ఒకటికి పదిసార్లు, "ఏమోయ్, పాపం! ఇంత పెద్ద చదువు చదివి ఊరికే ఉన్నావేం?" అని అడిగేసరికి లోకదాసయిన రామ్మూర్తి లోకహితంగా ప్రవర్తించలేకపోయినందుకు పశ్చాత్తాప పడసాగాడు. ఉద్యోగం చెయ్యటమే? ఎట్లా చెయ్యటం?

ఉద్యోగాలు చేసేవాళ్ళంతా, ముష్టివాళ్ళల్లనే, జాలిపడవలసిన వాళ్ళని రామ్మూర్తి దృఢ విశ్వాసం. ఉద్యోగం దొరికేవరకూ ఉద్యోగం ముష్టెత్తాలి. ఉద్యోగం దొరికిన తరువాత—పాపం వాళ్ళకీ కూలివాళ్ళకీ తేడాలేదు, జీతంలో తప్ప. ఏ ఆధారమూ లేనివాళ్ళు ముష్టెత్తకా, కూలీ చెయ్యకా ఏంచేస్తారుగాని, ఇంత తినేటందుకున్నవాడు ఉద్యోగాలు చెయ్యటం దేనికో అతనికి అర్థమయ్యేది కాదు. బోలెడంత డబ్బుండికూడా వ్యాపారం చేసేవాళ్ళని చూస్తే అతనికి మరీ అసహ్యం. మరింత డబ్బుతో ఏంచేస్తారూ? రామ్మూర్తికి డబ్బంటే గౌరవం లేదు.

చేసే పనినిబట్టి ఉద్యోగాలంటే రామ్మూర్తికి అసహ్యమనుకోరాదు. ఎందుచేత నంటే ఉపాధ్యాయులూ, ప్లీడర్లూ, మునసబులూ, జడ్జీలూ, పత్రికా నిర్వాహకులూ మొదలైనవాళ్ళూ, నటులూ, నాటకాలు రాసేవాళ్ళూ, తదితరులూ చాలా గౌరవించ దగినవారే? ఆమాటకొస్తే పొలాలు దున్నేవాళ్ళూ, బట్టలు నేసేవాళ్ళుకూడా సంఘానికి ఉపకారమే చేస్తున్నారు. కాని, పాపం, వాళ్ళు జీవితానికింత సహకారం చేస్తూకూడా జీవించలేరు. వారి పుణ్యకాలమంతా పనిలోనే గడుస్తుంది. వాళ్ళు చేసేపని అయినా ఎంతసేపూ మరొకరికి ఉపకరించవలసిందే గాని తమ కుపకరించదు—ఆ నాలుగు రాళ్ళూ తేవటం తప్ప.

తాను సమగ్రంగా జీవిస్తున్నట్టే రామ్మూర్తి భావించాడు. రోజల్లా తన యిష్టం వచ్చిన పని చెయ్యొచ్చు. పుస్తకాలు చదువుకోవచ్చు. భార్యతో సల్లాపాలాడవచ్చు. ఎవరైనా స్నేహితులువస్తే బాతాఖానీ కొట్టుకోవచ్చు. ఈ క్షణాన ఇక్కడుండాలని నియమం లేదు. ఈ పని చెయ్యాలనే నిర్బంధంలేదు. జీవితాని కింకేంకావాలి?

అయితే మరి లోకం తనను ఏదన్నా చెయ్యమంటున్నదే? ఏమీ చెయ్యకుండా ఉంటే తనది నిరర్థకజీవితం అన్నట్టు భావిస్తున్నదే? ఈ సమస్య ఎట్లా పరిష్కరించటం? బోలెడంత విశ్రాంతీ, గౌరవమూ కలిగిన ఉద్యోగం ఏముంటుంది? ఈ ప్రశ్న రామ్మూర్తి బుర్రలో ఒక మూల వుంటూ వచ్చింది.

ఇట్లా ఉంటూ ఉండగా రామ్మూర్తి కారణాంతరాలచేత క్లబ్బులో చేరవలసి వచ్చింది. అతని స్నేహితులు చేరమని నిర్బంధించారు. "రోజల్లా మీ ఆవిడ కెదురుగా కూర్చుంటూనే ఉంటివిగదా! సాయంకాలం పూటయినా అట్లా క్లబ్బుకు రాగూడదూ? ఎంత ప్రేమగల పెళ్ళామైనా కొంతకాలం కంటి ఎదట లేకుండా ఉంటేనే

సొంగుడిమీద ఎక్కువ ఆపేక్షగా ఉంటుంది." అని ఏమేమిటో అన్నారు. అన్నీ అబద్ధాలు. లోక సామాన్యంగా నిజమే అయినా తనకూ తన భార్యకూ వర్తించవు. కాని ఏమిటి చెయ్యటం? రామ్మూర్తి క్లబ్బులో మెంబరుగాచేరి వెళ్ళసాగాడు.

ఇది నిజానికి చాలా మంచిపనే అయింది. క్లబ్బులో తనని అందరూ కొంచెం గొప్పగానే చూడసాగారు. తనకు ఫస్టుమార్కు లొచ్చినందుకు గర్వంగా చెప్పుకునే తన సహాధ్యాయులు కొందరు క్లబ్బులో ఉన్నారు. ఈ సంగతి రామ్మూర్తికి ఇదివరకు స్పష్టంగా తెలియదు.

అదీకాక క్లబ్బు ద్వారా రామ్మూర్తి జీవితంలోకి ఒక నూతనాంశం ప్రవేశించింది. కళలు అతనిదగ్గిరికి వచ్చినై. ఒకనాడు క్లబ్బుకు యడవల్లి సూర్యనారాయణ[1] వచ్చాడు. తన బాల్యస్నేహితులలో ఒకడై ఇప్పుడు తన కెడమయిపోయిన సాంబశివరావు ఒక్క యడవల్లినేగాక, సంజీవరావు[2]నూ, హరిప్రసాదరావు[3]నూ, దాశరధి[4]నీ,

1. యడవల్లి సూర్యనారాయణ (1888-1939): ప్రఖ్యాత గాయకుడైన రంగస్థల నటుడు, చలనచిత్ర నటుడు. 1912- 15 మధ్య ప్రసిద్ధిపొందిన గుంటూరు అమెచ్యూర్ డ్రమటిక్ క్లబ్ సంస్థాపకుల్లో ఒకరు. 1932 లో వెలువడిన పాదుకా పట్టాభిషేకం, శకుంతల చిత్రాల్లో నటించారు. కపిలవాయి రామనాథశాస్త్రికి పద్యపఠనం నేర్పిన గురువు.
2. సంజీవరావు (1889—1957): ఉప్పలూరి సంజీవరావు, స్త్రీ పాత్ర ధారణలో స్ఫుటమైన కీర్తి తెచ్చుకున్న కొద్దిమంది నటుల్లో ఒకరు, గాయకుడైన నటుడు. శకుంతల, సావిత్రి, సంపూర్ణ రామాయణం, ద్రౌపది, లవకుశ, హరిశ్చంద్ర మొదలైన నాటకాల్లో స్త్రీ పాత్రలు ధరించారు. యడవల్లి, ఉప్పలూరు నటించిన మైలవరం కంపెనీ శకుంతలకు విపరీతమైన జనాదరణ ఉండేది. 1932 లో బెంగుళూరులో హచ్చిన్స్ కంపెనీ వీరి పాటలను రికార్డు చేసింది.
3. హరిప్రసాదరావు (       -1936) : కూచిపూడి భాగవతుల వంశానికి చెందిన ప్రఖ్యాత గాయకుడైన రంగస్థల నటుడు. గుంటూరు ఫస్టు కంపెనీ (1882-1912) అని పిలువబడే హిందూ నాటక సంఘ సంస్థాపకుల్లో ఒకరు. సత్య హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడుగా, శాకుంతలలో దుష్యంతుడుగా, వేణీ సంహారంలో దుర్యోధనుడుగా పాత్రలు ధరించేవారు.
4. దాశరధి ? (1898—1964) చోరకుడి దాశరధిరావు : ప్రముఖ రంగస్థల నటుడు. విక్టోరియా మెమోరియల్ క్లబ్ స్థాపక సభ్యులు. గుంటూరు అఫిషియల్ డ్రమటిక్ క్లబ్ వారి నాటకాల్లో వేషాలు వేసేవారు. తిరుపతి కవుల ప్రశంసల నందుకున్న నటుడు.

కోపల్లె హనుమంతరావు[1]నూ, బెల్లంకొండ నరసింహారావు[2]నూ, ఇంకా అనేక మంది మేటి నటుల్ని స్వయంగా ఎరుగునని బయటపడ్డది. యడవల్లి అవలీలగా పది పెసరట్లు తినగలడనీ, బెల్లంకొండ[3] హరిశ్చంద్రలో పద్యాలన్నీ అవలీలగా హరిప్రసాదరావుకు నకలు దించగలడనీ, సాంబశివరావు చెప్పుకొస్తుంటే, రామ్మూర్తికి చెప్పరాని అసూయ వేసింది. బెల్లంకొండ సుబ్బారావూ, స్థానం,[4]

---

1. కోపల్లె హనుమంతరావు ( ? ) : ప్రఖ్యాత రంగస్థల నటుడు. గాయకుడు. స్త్రీ పాత్రలు ధరించేవారు. గుంటూరు ఫస్టు కంపెనీ ప్రదర్శిస్తూ ఉండిన బలిజేపల్లివారి హరిశ్చంద్రలో చంద్రమతి పాత్ర ధరించేవారు. హరిశ్చంద్ర పాత్రను హరిప్రసాదరావు ధరించేవారు.

2. బెల్లంకొండ నరసింహారావు ( ? ) ? : రంగస్థల నటుడు.

3. బెల్లంకొండ ( ? ): బెల్లంకొండ సుబ్బారావు కావచ్చు. రంగస్థల నటుడు. శ్రీకృష్ణ పాత్రలో ఉత్తమ నటుడుగా ప్రసిద్ధి చెందారు. వీరి పద్యపఠనంవల్ల తిరుపతి వెంకటకవుల నాటకాలకు ఖ్యాతి వచ్చింది. గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర మొదలైన నాటకాల్లో నటించేవారు.

4. స్థానం (1902–1971) : స్థానం నరసింహారావు. "తెలుగు నాటకాలు పుట్టినాక స్త్రీ పాత్ర ధారణలో స్ఫుటమైన కీర్తి తెచ్చుకున్న ఎంతోమంది లేరు: ముప్పిడి జగ్గరాజుగారూ, ఉప్పలూరి సంజీవరావుగారూ, పారుపల్లి సుబ్బారావుగారూ, స్థానం- ఈ నలుగురే కనిపిస్తారు. వీరిలో నిస్సందేహంగా స్థానం అగ్రగణ్యుడు." (కొడవటిగంటి కుటుంబరావు, నటకావతంసుడు, వసుధ, ఏప్రిల్ 1971). సమ్మోహనశక్తిగల నటుడు, నాటక ప్రయోక్త 1939 లో వచ్చిన రాధాకృష్ణ చిత్రంలో ముఖ్యనటుడు. ఫస్ట్ కంపెనీ వారి కృష్ణలీలలు నాటకంలో యశోదగా, రుక్మాంగద నాటకంలో మోహినిగా నటించారు. రామ విలాస సభవారి రోషనార నాటకంలో ట్రాజిక్ హీరోయిన్ రోషనారగా, సారంగధర నాటకంలో చిత్రాంగిగా, కన్యాశుల్కంలో మధురవాణిగా నటించారు. కుటుంబరావు ఉద్దేశంలో "స్థానం నిర్వహించిన అన్ని పాత్రలలోకి అత్యుత్తమైనది మధురవాణి." సత్యభామ పాత్రలో ప్రసిద్ధిపొందారు. శ్రీకృష్ణ తులాభారంలోని "మీరజాలగలడా నా యానతి ...." అనే ప్రసిద్ధమైన పాట ఆయన రాసిందే. నటస్థానం అనే స్వీయచరిత్ర వెలువరించారు.

మాధవపెద్ది,[1] జొన్నవిత్తుల శేషగిరి,[2] అద్దంకి,[3] పారుపల్లి సుబ్బారావు[4] మొదలైన వాళ్ళు పైకొస్తున్న కుర్రాళ్ళని సాంబశివరావు ఆశీఃపూర్వకంగా పరామర్శించేసరికి, రామ్మూర్తి సాంబశివరావుతో పాతస్నేహం బలపరుచుకోవటానికి తీర్మానించు కున్నాడు.

సాంబశివరావు స్నేహితానికే రామ్మూర్తి మురిసిపోతుంటే, సాంబశివరావు తలదన్నినట్లు సీతారామయ్య ఒకనాడు నలుగురు వల్లెవాటు—గిరజాలవాళ్ళను క్లబ్బుకు పట్టుకొచ్చాడు. తీరా విచారిస్తే వాళ్ళు సాహితీ సమితి[5] వారని తేలింది.

---

1. మాధవపెద్ది (1897–1957) : మాధవపెద్ది వెంకట్రామయ్య. ప్రఖ్యాత రంగస్థల నటుడు. తెనాలి రామ విలాససభ నటుల్లో ఒకరు. కొ. కు, మా గోఖలేల బంధువు. 1937 లో వెలువడిన విజయదశమి చిత్రంలో ముఖ్య నటుడు.
2. జొన్నవిత్తుల శేషగిరి (1905–1932) : జొన్నవిత్తుల శేషగిరిరావు ఆంధ్ర గంధర్వ అని పేరు పొందిన ప్రఖ్యాత గాయకుడైన రంగస్థల నటుడు. 1930 లో బెంగుళూరు హెచ్. ఎం. వి.వారు ఆయన గానాన్ని రికార్డు చేశారు. బాలగంధర్వను తన గాన మాధుర్యంతో మెప్పించిన గాయకుడు.
3. అద్దంకి (1898– ? ) : అద్దంకి శ్రీరామమూర్తి సుప్రసిద్ధ రంగస్థల నటుడు; చలన చిత్ర నటుడు. పద్యపఠనంలో శాస్త్రీయ సంగీత ధోరణికి ప్రాధాన్యం ఇచ్చేవారు. అద్దంకి పాడిన పద్యాలు, కృతులు, శ్లోకాలు గ్రామఫోను రికార్డులుగా వెలువడ్డాయి. 25 చిత్రాల్లో నటించారు. 1940లో వచ్చిన భోజ కాళిదాసులో కన్నాంబ సరసన, 1941 లో వచ్చిన భక్తి మాలలో భానుమతి సరసన ప్రధాన పాత్రధారి.
4. పారుపల్లి సుబ్బారావు ( ? ) : ప్రముఖ రంగస్థల నటుడు; చలన చిత్ర నటుడు. స్త్రీ పాత్ర ధారణలో ఆయనకు ప్రఖ్యాతి చేకూర్చిన పాత్ర పానుగంటి రాధాకృష్ణలో రాధ పాత్ర.
5. సాహితీ సమితి (1919–?): తల్లావఝుల శివశంకరశాస్త్రి 1919లో తెనాలిలో స్థాపించిన నూతన కవితాసమితి "పిఠాపురంలోని దేవులపల్లి కృష్ణ శాస్త్రి,నూజివీడులోని నండూరి సుబ్బారావు, తెనాలిలో వఝూ బాబూరావు, వీర రాఘవస్వామి, గుంటూరులో నోరి నరసింహశాస్త్రి, బెజవాడలో కొడాలి ఆంజనేయులు, బందరులో విశ్వనాధ సత్యనారాయణ, అడవి బాపిరాజు మొదలైన వారందరినీ సభ్యుల్ని చేసి శివశంకర శాస్త్రిగారు సాహితీ సమితికి సభాపతి అయ్యారు. దేశమంతా తిరిగి నూతన కవిత్వాన్ని సభలలో పాడి వినిపిస్తూ ప్రచారం చేశాడు."(ఆరుద్ర రచనలు : ప్రజాకళలూ, ప్రగతి వాదులూ

ఒకరు సమితి సభాపతి తల్లావఝుల శివశంకరశాస్త్రి[1], మరొకరు దేవులపల్లి కృష్ణశాస్త్రి[2] మరొకరు మునిమాణిక్యం నరసింహారావూ,[3] నాలుగో ఆయన వేదుల సత్యనారాయణ.[4] అందరి పేర్లూ రామ్మూర్తి విన్నట్టే ఉన్నాయిగాని ఎవరెవరేం రాశారో అతనికి తెలీదు. రామ్మూర్తి ఎప్పుడైనా పత్రిక తిరగేసేవాడే. అతనికి పద్యాలెవరు రాసినా ఒకటిగానే ఉండేవి. కథలూ అవీ అసలు చదివేవాడు కాడు. బతికున్న రాతగాళ్ళకన్న పాతకవులే గొప్పవాళ్ళనే దృఢవిశ్వాసంతప్ప రామ్మూర్తికి సాహిత్యం గురించి

---

ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ, పుట 153) వాడుక భాషలోని నవ్య సాహిత్య రచనలకు ప్రోత్సాహకంగా శివశంకరశాస్త్రి సంపాదకత్వాన 1920లో సాహితి పత్రిక మొదలయింది. నవ్య సాహిత్య ప్రక్రియలకు వికాసానికి సాహితి దోహదం చేసింది.

1. తల్లావఝుల శివశంకరశాస్త్రి (1882-1979): బహుభాషా కోవిదుడు, భావ కవి, భావ కవితా ప్రచారకుడు. సాహితి సమితి, సాహితి, (1919) సఖి (1925) పత్రికల సంస్థాపకుడు, నవ్య సాహిత్య పరిషత్తు నిర్వాహకుడు. వీరి కృతులు కొన్ని హృదయేశ్వరి ఆవేదన, పద్మావతిచరణ చారణ చక్రవర్తి, దీక్షిత దుహిత, దివ్యలోచనములు, పుష్యపూర్ణిమ, గేయ నాటికల రచనలో సిద్ధహస్తులు.

2. దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980). తెలుగు కాల్పనిక కవుల్లో అగ్రగణ్యుడు. వియోగ మాధుర్యాన్ని, వ్యక్తి శోక సౌఖ్యాన్నీ, వ్యక్తి స్వేచ్ఛనూ, దేశారాధననూ కవితల్లో నిబద్ధించినవాడు. హరిజనోద్యమానికి, ఆకలికి సైతం స్పందించినా సకాలకంగా కాల్పనిక కవి. భావ కవిత్వానికి ఒక కొత్త స్ఫూర్తినీ; గాఢమైన భావుకత్వాన్నీ సమకూర్చినవాడు. కృష్ణ పక్షము (1925) ప్రవాసము, ఊర్వశి, పల్లకి, మహతి, కన్నీరు ప్రసిద్ధి పొందిన కావ్యాలు.

3. మునిమాణిక్యం నరసింహారావు (1898-1973): అచ్చమైన తెలుగు మధ్య తరగతి సంసార కథల స్రష్ట. నాజూకైన హాస్యరచనలు చేసినవాడు. రచనలు: కాంతం కథలు (1925) కాంతం కైఫీయతు, కాంతం కాపురం; నేను మా కాంతం మొదలైనవి. 20 పైన చిన్న కథల సంపుటాలు వచ్చాయి. నాటికలు, చిన్న నవలలు రాశారు.

4. వేదుల సత్యనారాయణ (1900–1976) : ఉత్తమ భావకవి. దీపావళి ( ? -1937)ముక్తఝరి (1968) వీరి కృతులు. పద్యరచనలో, గేయ రచనలో శ్రవణ పేయతకూ, భావ చిత్రాలకూ పేరుపొందిన భావుకుడు. రవీంద్రుని నవలలను కొన్నిటిని తెలుగులోకి అనువదించారు.

స్పష్టమైన అభిప్రాయం లేదు. సుమతి శతకం పద్యాలైనాసరే[1], పూర్వం అనేకసార్లు విన్న కవిత్వం బాగున్నట్లుండేది. కొత్త పద్యాలన్నీ గొడవగానే ఉండేవి. కాని అతని అదృష్టంవల్ల ఆనాడు దేవులపల్లి వారు క్లబ్బులో కొన్ని సొంతపద్యాలు కూడా చదవటం జరిగింది. రామ్మూర్తికి ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది. ఆధునిక కవిత్వంలో ఇంత రసమూ జీవమూ ఉన్నాయని అతనికి తెలీదు. కవిత్వాన్ని ఆస్వాదించే 'విద్య' అతనికిన్నాళ్ళు లేకపోయింది. కృష్ణశాస్త్రి చదివిన పద్యాలిప్పుడు తన తలలో జోరీగలల్లే చేరి ఆలోచన తోచనివ్వటంలేదు. ... ఏ సనంత శోక భీకర తిమిర లోకైక పతిని....శోక భీకరతిమిర....కంటక కిరీటధారినై కాళరాత్రి[2]....ఇటువంటి తుంపులు అతని మనస్సులో చేపలు ఈదినట్టు ఈదసాగినై.

రామ్మూర్తి తను ఇంతకాలమూ సమగ్రంగా జీవించటం లేదని తెల్సుకున్నాడు. కవిత్వం ! తన జీవితంలో కవిత్వం లోపించింది. అన్నం తినటం, త్రేన్చటం, నిద్రపోవటం గుర్రుపెట్టటం—వొట్టి జిడ్డు. రెక్కలులేని బతుకు ! పాకటం, పాకటం - ఒకటే పాకటం. ఏమిటి జీవితం ? పాతకవిత్వం చెత్త. దానికి రెక్కలు లేవు....ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు[3] ....ఛీ ఛీ! వొట్టి వచనం; వొట్టి దుమ్ము! భావం మెరుపల్లే మెరవాలి, చలించాలి !

కవిత్వం రాయాలనే ఆలోచన వెంటనే రామ్మూర్తికి రాలేదుగానీ, కవిత్వంలో ఓలలాడుదామనే కాంక్ష అప్పటి కప్పుడే అతనిలో ఉద్భవించింది. వెళ్ళిపోవటానికి కవులు లేవగానే రామ్మూర్తి గుండె గుబుక్కుమంది. మళ్ళీ వీళ్ళు కనిపించరు. తను ఇంటికివెళ్ళి దుమ్ములో పాకాలిసిందే?

కవులంతా సీతారామయ్య ఇంటికి వెళ్ళుతున్నారు. వారి వెంట క్లబ్బు మెంబర్లు కొందరు వెళ్ళుతున్నట్లు రామ్మూర్తి వాసన పట్టాడు. ఊళ్ళోనుంచి సర్కసు వెళ్ళి పోతుంటే ఊళ్ళోపిల్లల కెంత దిగులేస్తుందో రామ్మూర్తి కంత దిగులేసింది.

ఏమిటి చెయ్యటం? సీతారామయ్యను తను బాగా ఎరగడు. ఈ కవులతో తనకు పరిచయం కలిగించేవాడే లేడు. తనకు పరిచయం కూడా చాలదు. స్నేహం కావాలి. తనకు కవిత్వం రాదు, కవిత్వం గురించి తెలీదుకూడాను. అటువంటి తనతో ఈ కవులెందుకు స్నేహం చేస్తారూ?

---

1. సుమతి శతకం పద్యాలు (సుమారు 1300) బద్దెన రాశాడనే ప్రతీతి ఉంది. రాజనీతి, గృహనీతి ఉన్న అశేష జనాదరణం పొందిన నీతి శతకం సుమతి శతకం.

2. ఏ ననంత శోక భీకర.... దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన ప్రఖ్యాత గేయం లోని 2, 3 పాదాలు :"నన్నుగని...."

3. ఉప్పు కప్పురంబు : వేమన పద్యం మొదటి పాదం.

అంతా ఎనిమిది పదిమందిగా కదలి వెళుతున్నారు—మాట్లాడుకుంటూ. ఇద్దరు ముగ్గురు సుబ్బారావుల పేర్లూ, ఒకరిద్దరు నరసింహ శాస్త్రిలపేర్లూ, ఒకరిద్దరు రామ్మూర్తులపేర్లూ వినిపిస్తున్నై సంభాషణలలో. అనామకుడైన మన రామ్మూర్తి ఆకస్మికంగా ఆలకించటం మానేసి పరికించాడు. కవుల వెంట వెళ్ళే వాళ్ళలో తన పాత స్నేహితుడైన సుబ్బారావున్నాడు. ఎవరో తనను గొలుసు వేసి లాగుతున్నట్టుగా వెళ్ళిపోతున్న బృందంలో చేరి రామ్మూర్తి సుబ్బారావును రాచుకుంటూ నడవసాగాడు.

అందరూ కలిసి సీతారామయ్య గారింట్లో ప్రవేశించారు. సీతారామయ్యగారి డాబామీదికందరూ చేరారు. ఏదో సంభాషణ సాగింది. సాహిత్య పరిషత్తు[1] గురించి, పిఠాపురం రాజా[2] గారిని గురించీ సభికులవేవో మాట్లాడుకున్నారు. గురజాడ అప్పారావు[3] గురించి కూడా మాట్లాడారు. గిడుగు రామ్మూర్తి[4] గారిని గురించి మాట్లా

---

1. సాహిత్య పరిషత్తు : ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రస్తావన. దింపుడు కళ్ళం లోని కావ్య భాషను బతికించాలనే తాపత్రయంతో 1911 లో ఏర్పరచిన సంస్థ కరుడుగట్టిన కావ్య భాషావాదులు ఇందులో సభ్యులు. జయంతి రామయ్య పంతులు ఈ పరిషత్తు చోదకులు. పిఠాపురం రాజా దీని పోషకులు.

2. పిఠాపురం రాజా : రావు వేంకట సూర్యారావు బహదూర్(1885-1964)కవి పండిత పోషకుడు. సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ కారకుడు, ప్రచురణ సహాయకుడు.

3. గురజాడ (1861-1915) : భాషనూ, సాహిత్యాన్ని ప్రజలకు చేరువలోకి తెచ్చిన సాహితీవేత్త. కవిత్వంలో, కథానిక రచనలో, నాటక రచనలో స్వచ్ఛమైన వాస్తవికవాది. "తెలుగుజాతికొక కొత్తచూపు, తెలుగు సాహిత్యానికొక కొత్తరూపూ, తెలుగు భాషకొక కొత్త స్ఫూర్తీ" ఇచ్చినవాడు. వివరాలకు చూడండి : కె.వి. రమణారెడ్డి 'మహోదయం', విశాలాంధ్ర ప్రచురణాలయం వెలువరిస్తున్న గురజాడ రచనల సంపుటాలు.

4. గిడుగు [1863-1940]: గిడుగు రామమూర్తి పంతులు. వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజ సారథి. తెలుగుపత్రిక [1919] సంపాదకులు. బాలకవి శరణ్యము, ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము రచనలద్వారా ఆధునిక యుగంలోని కావ్య భాషావాదులను ఎదుర్కొన్న భాషావేత్త. ఆనాటికి భారతదేశంలో అగ్రగణ్యుడైన భాషా శాస్త్రజ్ఞుడు. గిరిజన భాషలను వెలుగులోకి తెచ్చినవాడు. ఆయన రచనలు, వ్యాసావళి, గద్యచింతామణి, బాలకవి శరణ్యం, ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు విమర్శనము.

చారు. తను ఎన్నడూ వినని ఈ గిడుగువారి పెద్దమనిషి—తనకు సనామకుడు ఉద్దండుడని రామ్మూర్తికి తెలిసింది. తెనాలిలో సాహితీ సమితి[1] పనిచెయ్యటం గురించీ, సాహితిపత్రిక[2] నడపటం గురించి కథలు వింటుంటే, రామ్మూర్తికి అప్పుడే భూమిమీద కళ్ళు తెరిచినట్టయింది. సాహిత్య పరిషత్తు పాండిత్యం ద్వారా కవిత్వాన్ని ఎట్లా చంపినదీ, చిన్నయసూరి వ్యాకరణంతో[3] భాషను చంపినదీ రామ్మూర్తి టూకీగా తెలుసుకున్నాడు.

ఇంకో విశేషమేమిటంటే తనకు తప్ప, తక్కినవారందరికీ జరిగే సంభాషణ గురించి అంతో ఇంతో తెలిసినట్లు రామ్మూర్తికి స్పష్టమయింది. తాను చాలా చిన్నమనిషి అనే పిరికితనం అతన్ని పట్టుకుంది.

ఉన్నట్టుండి సభాపతిగారు, "ఇక్కడున్న అన్నగార్లందరితోడీ మనం పరిచయం చేసుకుంటే బాగుంటుందేమో ?" అని సూచించారు. రామ్మూర్తికి భయం వేసింది. ఒక్కొక్కరివంతే రాసాగింది. ప్రతివాళ్ళూ కవులలో ఎవరో ఒకరికి ఏదో విధంగా కావలసినవాళ్ళే. కొందరు బంధువులు, కొందరు మిత్రుల బంధువులు, ఒకరిద్దరు స్వయంగా మిత్రులు. తన గతేమిటి? రామ్మూర్తి సిగ్గుతో కుంగిపోవలసినవాడే. అయితే అతన్ని మునిమాణిక్యం ఉద్ధరించాడు. అతని పేరూ ఇంటిపేరూ వినగానే మునిమాణిక్యం నరసింహారావు, "ఏమంహోయ్! మీకో అబ్బాయిగాని కనీసం అమ్మాయిగాని ఉంటే నేనొచ్చి ఒకదెబ్బకొట్టాలి!" అన్నాడు.

రామ్మూర్తి తెల్లమొహం వేశాడు.

"ఎందుచేతనంటే మీ నాన్నగారు చిన్నతనంలో నాకు మేస్టరు. నన్ను నిష్కారణంగా కొట్టారు." అన్నాడు మునిమాణిక్యం.

దేనికి కొట్టారని ఎవరో అడిగారు. "పొడుమ్బుక్కుచేస్తారు" అని నల్లబల్ల మీద రాస్తూంటే రామ్మూర్తి తండ్రిగారుచూసి కొట్టారట. మరీ అన్యాయం ఏమిటంటే పొడుమ్ముక్కు మేస్టరు రామ్మూర్తిగారి తండ్రిగారు కారట. ఈ కథవిని అందరూ నవ్వారు. రామ్మూర్తికి పెద్ద బరువు దించినట్లయింది. తనకు పిల్లలు లేరనీ, ఊళ్ళో వుండే పక్షంలో తన యింటికి కూడా కవులందరు వేంచేస్తే చాలా సంతోషిస్తాననీ రామ్మూర్తి సాహసించి అనగలిగాడు.

---

1. తెనాలిలో సాహితీ సమితి : 1919లో ఏర్పడిన సాహితీ సమితి.
2. సాహితీ పత్రిక : సాహితీ సమితి ఉద్యమ ప్రచారానికి దన్నుగా 1920లో వెలువడిన ద్వైమాసిక సాహిత్యపత్రిక. కొత్త కవిత్వానికీ, కొత్త వచన రచనలకూ, ఆధునిక వచన శైలికి స్థానం ఇచ్చిన పత్రిక. తల్లావఝుల శివశంకరశాస్త్రి సంపాదకులు.
3. చిన్నయసూరి వ్యాకరణం : చిన్నయసూరి (1809-1862) రచించిన నిర్ణాయక కావ్య భాషా వ్యాకరణం బాల వ్యాకరణం, 1858లో వెలువడింది.

# 2

ఇప్పుడు రామ్మూర్తికి జీవితం కొంతవరకు కరతలామలక మయింది. అతని ఇల్లు కవులకూ, నటకులకూ తదితర కళాకారులకూ రహదారి కావటం చూసి, ప్రజలు వెనకటి మోస్తరుగా చీటికీ మాటికి, "ఏదో ఒకటి చెయ్యరాదా?" అని అనటం తగ్గించారు. "ఏదో ఒకటి చేస్తున్న" వాలకం రామ్మూర్తిలో కొందరికయినా కనిపించటం ముదావహమైన సంగతి. ఇటువంటి సూక్ష్మాలు గ్రహించలేని మందబుద్ధులు నోరు చేసుకుని రామ్మూర్తిని ఇంకా "ఏమోయ్! ఊరికే కూర్చోకపోతే ఏదైనా చెయ్యరాదా" అని అడిగితే, అతనిపుడు తడుముకోకుండా, "నేను అదే ప్రయత్నంలో ఉంటున్నాను," అని ఏదో పత్రికల్ని నడపటం గురించీ, సాహితిని పునఃప్రచురణ చెయ్యటం గురించీ అస్పష్టంగానూ ఉదాత్తంగానూ మాట్లాడేవాడు.

ఇది చాలా యోగ్యమైన సమాధానం. ఉత్తమ తరగతి పత్రిక పెట్టడం మాటలుకాదు. డబ్బుదేమిటి ? డబ్బున్నది. మంచి ప్రింటింగెవరు చేస్తారు ? సొంతంగా ప్రెస్ పెడితే తప్ప అది సాధ్యంకాదు. రామ్మూర్తి గొప్ప ప్రెస్సూ, పత్రికా నిర్వహించబొయ్యేవాడి వాలకం కష్టపడి సాధించాడు. ఆధునిక కవులూ, కథకులూ అతని ఆప్తులే గనక అతని మాటలంతా విశ్వసించారు. కొందరు శకున పక్షులు మాత్రం అక్షింతలు వేశారు — నటులవెంటా కవులవెంటా తిరిగిన వాళ్ళెవరూ బాగుపడలేదనీ, కొంపగుండం చేసుకోవటానికే ఇతనీ పత్రిక గురించి ఆలోచిస్తున్నాడనీనూ. ఇట్లా మాట్లాడే శకునపక్షులకు రామ్మూర్తి మరో రకమైన కారణం కూడా కల్పించాడు. అక్షింతలు చల్లటానికి, కొందరితోనైనా అతను తనకు నాటక కంపెనీ పెట్టాలని ఉన్నట్టూ, వీలయితే మంచి థియేటరుకూడా కట్టించాలని ఉన్నట్టూ చెప్పాడు. అతని మొహం ఎదట అనకపోయినా, అనేక మంది అప్పుడే అతను దివాలా ఎత్తినట్టుగా రూఢిచేసుకున్నారు. తరువాత కాలక్రమాన అతని ఆస్తి యావత్తూ పోయినప్పుడు కొందరు పెద్దలు, "ఇట్లా అవుతుందని మేం ఎనిమిదేళ్ళక్రితమే చెప్పాం!" అనటానికి ఆస్కారం ఏర్పడ్డది. అయితే ప్రతి చెడువెంటా కొంత మంచి ఉంటుంది గనక, అతను మరికొంత కాలానికి పత్రికా సంపాదకుడై దానివెంటనే నాటక కంపెనీకూడా నడిపినప్పుడు, కొందరు సహృదయులు,"రామ్మూర్తికీ ఆలోచనలు, పదిహేను సంవత్సరాల క్రితమే ఉండేవి." అని చెప్పుకునే అవకాశం లభించి అతనికి రావలసిన ఖ్యాతికంటె అధిక ఖ్యాతి కూడా వచ్చింది.

కాని న్యాయంగా 1924 కు అతనికి రెండు ఆలోచనలు గొంతెమ్మ కోరికల స్వరూపంలో మటుకే ఉండినై. ఒక సంవత్సర కృషి ఫలితంగా రామ్మూర్తికి లభ్యమైన దేమంటే అనేకమంది రచయితలతోటీ నటకులతోటీ స్నేహమూ, రచనా నాట్య శిల్పాలనుగురించి ఎటువంటి వారితోగాని స్వేచ్ఛగా సంభాషించే

శక్తీ ఆటోగ్రాఫులతో సహా ఆధునిక గ్రంథాలూ, నాటకాలన్నిటికీ కాంప్లిమెంటరీలూనూ. ఇది తక్కువైన విషయం కాదు. ఈపాటి పరపతికోసం చాలామంది ఆంధ్రులు చాలా సంవత్సరాలు శ్రమపడ్డారు. కాని రామ్మూర్తి దీనిమీద తన యావచ్ఛక్తినీ- డబ్బుతో సహా- కేంద్రీకరించాడు. అది అందరికీ సాధ్యంకాదు.

ఇంతకంటె కూడా రామ్మూర్తి గర్వంగా చెప్పుకోదగిన అంశం ఏమిటంటే, రామ్మూర్తికి ఒకటి రెండు 'చిన్నపొత్తాలు' అంకితం అయినై.

తాను రచయితల జాబితాలో కెక్కటానికి, రామ్మూర్తి చేసిన ప్రయత్నాలంత సఫలం కాలేదనే చెప్పాలి. ముఖ్యంగా అతను కవిత్వం రాయాలనిపడ్డ బాధ బొత్తిగా వృధా అయిపోయింది. ఏకారణంచేతో మొదటినుంచీ అతనికి మత్తేభ శార్దూలాది వృత్తాలిష్టం. ఆ వృత్తాలలో ఆధునిక కవిత్వం చక్కగా నడవటానికవకాశం లేదనే అనాలి. రామ్మూర్తి రాసిన వృత్తాలు చూసి సాటి కవులు కూడా, సహృదయులు సహితం, అంతబాగా కుదరలేదనే అనవలసివచ్చింది. గీతాలు రాసి చూడమన్నారు కొందరు. ముత్యాల సరాలయితే[1] ఇంకా బాగుంటుందేమోనని మరి కొంద రభిప్రాయపడ్డారు.

ఇవి రాయటానికి రామ్మూర్తి చేసిన కృషి వర్ణనాతీతం. ఎన్నోవందల గీతాలూ, డజన్ల కొద్ది ముత్యాలసరాలూ కంఠస్థం చేశాడు. వాటి నడకను రక్తంలో కెక్కించుకున్నాడు. వాటి ధ్వని చెవులో మోగించుకున్నాడు. ఎన్నో డజన్ల గీతాలూ, ముత్యాల సరాలూ రాశాడు కూడానూ. ఛందస్సూ, యతులూ, ప్రాసలూ అన్నీ దిగినై కాని పద్యాలకి రెక్కలు లేవు. ఉన్న సంగతి అనుకోక తప్పేదేముందిగనక? రామ్మూర్తి ఆత్మ ఇతరకవుల రెక్కలమీద ఎగరవలసిందేగాని సొంత రెక్కల మీద ఎగరటానికి నోచుకోనట్టు కనపడ్డది.

రామ్మూర్తికి ప్రోత్సాహం ఇచ్చింది ఒక్క సభాపతిగారే.

"భేషుగ్గా" ఉన్నవి భాయీ, మీరేమి సంకోచించకండి. వీటిని నిరాక్షేపణగా పత్రికలకి పంపవచ్చు.

---

1. ముత్యాల సరాలు : వాడడానికి అనువుగా గురజాడ ఆవిష్కరించిన గీతం. పేరు గురజాడ కల్పించిందే. నాలుగు పాదాల గీతం. మొదటి మూడు పాదాల్లో 3 + 4, 3 + 4 = 14 మాత్రలుంటాయి. నాలుగో పాదంలో 7 నుంచి 12 మాత్రల వరకూ ఉంటాయి. గురజాడ నియమిది. మిశ్రగతిలో నడిచే వృషభగతి రగడకు ఈ ఛందస్సు దగ్గరగా ఉంటుంది. ఒక జాతి పార్శీగజల్ నడకను ముత్యాలసరాల్లో తేవడానికి ప్రయత్నించినట్లు గురజాడ చెప్పారు.

ఎవరికీ తెలీకుండా రామ్మూర్తి ఆ పనికూడా చేసిచూశాడు. ఆ రోజుల్లో అట్టే పత్రికలు లేవు. ఉన్న ఒకటి రెండు పత్రికలు కూడా రామ్మూర్తి పద్యాలను తగిన కీతిని ఆదరించలేదు.

"అట్లా అయితే ఆ పద్యాలు నిజంగా గొప్పవే నన్నమాట !" అన్నారు సభాపతిగారు.

ఈ విధంగా కవిత్వంకోసం దాదాపు రెండు సంవత్సరాలు వృధా అయి పోయినై. మరో సందర్భంలో ఎవరో ఒకరు, "నిజమైన కవితావేశం రావాలంటే అనేకరకాల అనుభవాలుండాలి. జీవితపు కట్టుబాట్లను తెంచి స్వచ్ఛందంగా ప్రవర్తించినవాళ్ళే గొప్ప కవిత్వం రాశారు" అన్నారు. ఈ సత్యాన్ని నిరూపించ టాని కా పెద్దమనిషి ఇచ్చిన ఉదాహరణలు వింటున్న కొద్దీ రామ్మూర్తికి మతిపో సాగింది. అతను దేనికైనా సంసిద్ధుడేగాని నియమా లుల్లంఘించటానికి మాత్రం సంసిద్ధుడు కాడు. అందులోనూ ప్రత్యేకించి అతని జీవితానికి ధృవతార అయిన కల్యాణికి యత్కించిత్తు అన్యాయమూ చెయ్యటమనేది అతని కార్యక్రమంలో ఎక్కడా లేదు.

గడిచిన రెండు సంవత్సరాల కాలంలోనూ, కళాస్పర్శ తగిలి రామ్మూర్తి మానసిక జీవితం ఇంత పరివర్తనకు గురి ఐనప్పటికీ, అందులో పీఠం వేసుకున్న కల్యాణిలో మాత్రం అణుమాత్రం మార్పు రాలేదు. ఆమె ఎప్పటిలాగే స్తబ్దుగా ఉంది. నూతన సాహిత్యమూ, భావకవిత్వమూ,[1] దీక్షితులుగారి కథలూ,[2] ముని

1. భావ కవిత్వము : 1910 నుంచి 1935 వరకూ సాగిన ఒక కవితాధోరణి. కాల్పనికోద్యమ కాలంలో వెలువడిన భావ ప్రధాన కవిత్వం. ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం, ప్రశస్త కవిత్వం, ప్రబోధ కవిత్వం, ప్రవాస కవిత్వం, ప్రపత్తి కవిత్వం, ప్రహ్లాద కవిత్వం, స్మృతి కవిత్వం దీని శాఖలు. నిజానికి ప్రబోధ కవిత్వానికున్న ప్రత్యక్ష సామాజిక ప్రేరణ మిగతావాటికి తక్కువ. ఈ కవిత్వం కోరిన స్వేచ్ఛ వ్యక్తి స్వేచ్ఛ. తెలుగు ఆర్థిక జీవితంలో వచ్చిన మార్పులు ప్రత్యక్ష ప్రేరణ కంటే పాశ్చాత్య పెట్టుబడిదారీ వర్గం ఉదారవాదంలో భాగంగా వచ్చిన కాల్పనికోద్యమ ప్రేరణ మన భావ కవిత్వ ఆవిర్భావానికి కారణమని ఒక వాదం ఉంది.

2. దీక్షితులుగారి కథలు: చింతా శంకర దీక్షితులు [1891–1960] కథాసాహిత్యంలో బాల సాహిత్యంలో కృషి చేసిన ఉత్తమ రచయిత. భావకవికూడా. కొ.కు. "పదేపదే చదివి ఆధునిక రచన చింతా దీక్షితులుగారి ఏకాదశి అన్న కథల సంపుటి." అందులో "సాహితికి కథ" అన్న కథగాని కథ నన్ను చెప్ప తరం కానంతగా టికిల్ చేసిందని కొ.కు. నాకు నచ్చిన గ్రంథాలూ, రచయితాలూ అనేవ్యాసంలో [తరుణ] అన్నాడు. రాసిన కథలు, ఆయన కథా సంపు

మాణిక్యంవారి కాంతమూ[1] ఆవిడ జీవితాన్ని మానసిక జీవితాన్ని - అణుమాత్రం కదిలించలేదు. ఆమె మానసిక అరణ్యంలో ఒక్క ఆకు కదలలేదు; ఆమె భావనా సముద్రంలో ఒక్క తరంగం పుట్టలేదు.

ఈ సంగతి రామ్మూర్తి గ్రహించకపోలేదు. కాని అతనికి భార్యమీద అనురాగం తగ్గటానికి బదులు హెచ్చింది. ఇల్లువదిలి దూరం వెళ్ళుతున్నవాడికి ఇంటి మీదమమ కారం హెచ్చినట్టుగా, రామ్మూర్తికి తన భార్యయొక్క నిశ్చలత్వం మరింత ఆకర్ష వంతంగా కనిపించింది. అదీకాక ఆమె అతని ఉత్సాహాన్ని భంగపరచలేదు. ఎందుకు భంగపరచటం? తనమీద భర్తకు మమకారం హెచ్చుతున్నకొద్దీ, అతనెన్ని ఆటలాడినా, చివరకు తన దగ్గరకే వస్తాడనే ధైర్యం ఆమెకు జాస్తి కాజొచ్చింది. అట్లాకాక అతను తనకు ఎడంగా పోతున్నట్టుతోస్తే, అతనిలో మార్పు తెచ్చే అంశం ఎంత అల్పమైన దైనా, ఆమె దాన్ని గురించి తీవ్రంగా ఆందోళన చేసి ఉండును. భర్తల వ్యాపకాలను గురించిన మంచి చెడ్డలు నిర్ణయించేటందుకు భార్యలకు కొన్ని గీటురాళ్ళుంటై. వాటి రహస్యం చాలామంది మగవాళ్ళకు తెలీదు.

వ్యసనాల్లోకి దిగకుండా తనకు కవిత్వం అబ్బని పక్షంలో, కవిత్వం వద్దని తీర్మానించుకున్నాడు రామ్మూర్తి. ఈ సూత్రం నిజమవునో కాదో అతనికి తెలీదు కాని, ఇది విన్నప్పటి నుంచీ అతనికి కవిత్వం రాయటంలో బొత్తిగా ఆసక్తి పోయింది. కాని ఇప్పటికీ కవిత్వం చదివే ఆసక్తి మటుకు దక్కింది.

ఈ దశలో అతను తలవని తలంపుగా ఒక కథ్ రాశాడు. ఈ కథ రామ్మూర్తి జీవితంలో ఒక ముఖ్య ఘట్టమని చెప్పాలి. అది ఆటే గొప్ప కథ కాదు. తానే రాసినప్పటికీ అది గొప్ప కథ అని రామ్మూర్తి కూడా అనుకోలేదు. అందులో ఉన్న కథాంశంలో నూతనత్వం ఏమీ లేదు. ఒక ప్లీడరుగారు తన దగ్గిరకి క్లయింటుగా వచ్చిన ఒక వేశ్య వలలో చిక్కుపడి ఆస్తియావత్తూ పోగొట్టుకొని, చివరకు ఇంటిమొహం చూడని స్థితిలో ఉంటే, అతని పిల్లలిద్దరూ జబ్బుతో మంచానపడి వైద్యుణ్ణి తెచ్చే వాళ్ళుకూడా లేక చనిపోతారు. ప్లీడరుగారికి వేశ్యలను గురించీ, వేశ్యవృత్తిని గురించీ జ్ఞానం కలిగి, పశ్చాత్తప్తుడై భార్య దగ్గిరికివచ్చి యథా ప్రకారం కాలక్షేపం చేస్తాడు. అదీ కథ.

---

టాలు ఏకాదశి [1925], హాస్యపు కథలు [1946], మిసెస్ వటీరావు కథలు [1946], దాసరి పాట. ఇతర రచనలు : ప్రజా వాఙ్మయం, దీక్షితులు నాటికలు, లీలాసుందరి [పిల్లల కథలు 1948], శంకర దీక్షితులు, మారుతి అనే కలం పేర్లతో రచనలు చేశాడు. చిత్రలేఖ అనే మొట్టమొదటి [?] అపరాధ పరిశోధక నవల రాశారు.

1. మునిమాణిక్యంగారి కాంతం : మునిమాణిక్యం నరసింహారావు సృష్టించిన మధ్యతరగతి 'ఉత్తమ ఇల్లాలు' పాత్ర కాంతం.

ఈ కథలో నూతనత్వం ఏమీలేదు కనుకనూ, రచనాశిల్పంలో కూడా ప్రత్యే కత ఏమీ లేదు కనకనూ, గొప్ప కథ కాదనుకోవడంలో రామ్మూర్తి సామాన్య విమర్శకులుపడే పొరపాటే పడ్డాడు.

ప్రతి గొప్ప కథకుడూ ఒకే ఒక కథ రాస్తాడు. కావలిస్తే దాన్నే మళ్ళీ మళ్ళీ రాస్తాడు. ఆ కథను అయిదారు వివిధ సమయాల్లో వేరువేరు పేర్లతో చదివిన తరువాత, ఆ సంఘం ఆ కథకుణ్ణి గుర్తించి నీరాజనం పడుతుంది. కథావిషయంలో నూతనత్వమూ, సహజత్వమూ, ఉదాత్తతా, దృక్పథమూ అనేవిగాని, రచనా శిల్పంలో విశిష్టతా, ఏకత్వమూ, ధ్వనీ మొదలైనవిగాని సంఘం అడగదు. వాటిని గురించి విమర్శకులు, తమ గొప్పతనం చాటుకోవటానికి, ఏమేమిటో చెబుతారు. సంఘానికి అదంతా అనవసరం. సంఘానికి పాత కథలు కావాలి. తెలిసిన కథలు కావాలి. అవి ఫలానా వాడి సొత్తని సంఘం స్పష్టంగా గుర్తించాలి; అప్పుడు సంఘం ఆ కథకుణ్ణి గుర్తిస్తుంది. గౌరవిస్తుంది. ప్రతిసారీ మరో కథ రాసేవాణ్ణి గురించి ఏమనుకోవాలో సంఘానికి నిజంగా తెలీదు. సంఘంలో నిత్యమూ జరిగే సంఘటనే కానివ్వండి, ఒక్కసారి అచ్చులో చదివినంత మాత్రాన సంఘం తలకెక్కదు. దశాబ్దాలపాటు చదవగా చదవగా సంఘం దాన్ని ఆమోదించటం మొదలు పెడుతుంది—ఎంత అభూతకల్పన అయినాసరే. అందుచేతనే మన సంఘానికి అనేక వేల మార్లు విన్న రామాయణ కథ తెలిసినంత బాగా, కొన్ని వందలసార్లు మాత్రమే విన్న భారతకథ తెలీదు.

ప్రఖ్యాత కథకుడు కావటానికి మరో రహస్యంకూడా ఉంది. ప్రఖ్యాత కథకుడు కాదలచినవాడు, రాసే ఒక కథనుకూడా చాలా సార్లు రాయకూడదు. సంవత్సరానికి ఒకటీ, రెండు సంవత్సరాల కొకటీ చొప్పున కథలు రాసేవాళ్ళకు ఖ్యాతి వచ్చినంత త్వరగా, నెలకు నాలుగు కథలు రాసేవాడికి రాదు. సాక్ష్యం పెరుగుతున్న కొద్దీ న్యాయాధికారికి విసుగెత్తినట్టు ఈ కథా రచనలో యంత్ర పరిశ్రమ చూసి సంఘం విసుక్కుంటుంది. మిగిలిన ప్రసిద్ధ కవులల్లే ఒక్క కావ్యం రాయక అనేకం రాసి శ్రీనాథుడు[1] సంఘం దృష్టిలో అడుగున పడిపోయినాడు. కథకుల గతి అయినా అంతే.

కథా రచయితగా ప్రఖ్యాతి తెచ్చుకోవటంలో మూడో రహస్యం ఉంది. అదేమిటంటే కొద్దికాలంపాటు కథలు రాసి కలం ముడిచి పెట్టటం. ఇంకా రాస్తూ

1. శ్రీనాథుడు [సుమారు 1385–1475] : ప్రాచీన తెలుగు సాహిత్యంలో కావ్య ప్రబంధ మార్గానికి ఒరవడి పెట్టిన గొప్పకవి. ఆయన కృతులు : శృంగార నైషధం, హరవిలాసం, భీమఖండం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యం, పల్నాటి వీరచరిత్ర, క్రీడాభిరామం, హిందూమత విశ్వాసాలనూ, కర్మకాండలనూ, క్షేత్ర మహాత్మ్యాలనూ ఉద్వేగంతో వర్ణించిన కవి.

ప్రశ్న, కథకుణ్ణి గురించి ఏమనుకోవాలో సంఘానికి తెలీదు. అయిదో ఆరో కథలు రాసి కలం దాచేసినవాణ్ణి గురించి, లోకం సాత్వికాభిప్రాయం ప్రకటిస్తుంది. అతని లోపాలు సులభంగా క్షమిస్తుంది. అతన్ని ఏదో వంక చూసుకుని నిస్సంకోచంగా పైకి ఎత్తేస్తుంది.

రామ్మూర్తికి రహస్యాలు తెలుసు ననుకోవటానికి ఆధారం లేదు. మరో అయిదారు సంవత్సరాలలో అతను ప్రఖ్యాత కథకుడవుతాడని అతను అప్పట్లో ఏమాత్రమూ భావించలేదు. 'పరిణామం' అని పేరు పెట్టిన ఈ కథరాసి, అతను ఆరునెల్లు పైగా దగ్గిర ఉంచుకున్నాడు. అది అచ్చు పడకమునుపే దాన్ని ఇరవైమంది రచయితలూ, పదిహేను మంది తదితరులు విన్నారు. ఎన్నడూ రాయనివాడు ఒక కథ రాశాడంటే దానికి 'న్యూస్ వాల్యూ' ఉంది. అది ఒక ప్రత్యేక వార్తకింద వ్యాప్తమౌతుంది: 'పరిణామం'అనే అముద్రిత కథ ఒకటి రామ్మూర్తి దగ్గిర ఉన్నదనే వార్త కొంతదూరం ప్రయాణం చేసింది. దాన్ని గురించి పుకార్లుకూడా బయలుదేరినై. అతను దాన్ని పెంచి నవల రాస్తున్నాడని ఒక పుకారూ, దాన్ని ఎంత మంది పత్రికల వాళ్ళడిగినా ఇవ్వలేదనే మరో పుకారూ, విచ్చలవిడిగా ప్రజలలో వ్యాప్తమయినై. ఆఖరుకు దాన్ని ఎవరో పత్రికవారు అడిగి తెప్పించుకుని ప్రచురించారు. మామూలుగా ప్రచురితమైతే చదివి ఉండని అనేకమంది దాన్ని ఆసక్తితో చదివారు.

"పరిణామం" అనే కథ బాగాలేదనీ, అనుకున్నంత బాగాలేదనీ, కొత్తవాడు రాసినట్టే ఉందనీ, ఓమాదిరిగా ఉందనీ ఏదో ఉందనీ వచ్చిన అభిప్రాయాలు పుట్టలోపుట్టి మఖలో మాడిపోగా, 'బాగానే ఉంది' అనే అభిప్రాయం చిరస్థాయిగా నిలబడింది.

ఈ కథ ప్రచురణ అయిన తరువాత ఒక నెల గడవనిచ్చి రామ్మూర్తిని స్నేహితులు "మళ్ళీ ఏమన్నా రాస్తున్నావా ?" అని అడగసాగారు. అతను లేదంటూ వచ్చాడు. తొలిచూలుకూ మలుచూలుకూ ఎడమైతే, తొలిచూలు బిడ్డకు గారాబం హెచ్చినట్టు, రామ్మూర్తి రెండో కథరాయటం ఆలస్యమైనకొద్దీ అతని మొదటి రచనకు ప్రాముఖ్యం హెచ్చింది.

ఈ విధంగా ఆరునెలలు గడిచినై. రామ్మూర్తి మరో కథ రాస్తున్నాడని పుకారు పుట్టింది. రామ్మూర్తి స్నేహితులు ఈ రెండో కథకోసం ఎదురు చూస్తున్నట్టు నలుగురికీ కనిపించసాగారు. కాని ఈ రెండో కథ మరో నాలుగునెలల వరకూ బయటికి రానేలేదు. దీనిపేరు "ప్రాయశ్చిత్తం." "ప్రాయశ్చిత్తానికీ" "పరిణామానికీ" కొంతవరకు ఏకమేధోజనితమైనందుకు పోలికలున్నా పరిశీలనాపరులకు తేడాలు కనిపించక పోలేదు.

"ప్రాయశ్చిత్తం"లో నాయకుడు డాక్టరు. అతని దగ్గరికి ఒక రోగి వస్తాడు. అతని భార్య జారిణి. డాక్టరును—అన్యసతీ విముఖుణ్ణి—ఆవిడ వలలో వేసుకుంటుంది. కానీ ఇవ్వకుండా భర్తకు వైద్యం చేయించుకుంటుంది. తనదారిన తాను

పోతుంది. ఆవిడ పబ్బం గడుపుకు పోయిందని తెలుసుకోక, ఆమె ప్రేమచేత దహించుకుపోయినవాడై, మన డాక్టరు అహర్నిశలు కుంగి క్రుశించిపోతాడు. ప్రాక్టీసు చెయ్యలేకపోతాడు. ఒక రోగికి ఇంజెక్షనివ్వవలసి వస్తుంది. డాక్టరు చెయ్యి వొణుకుతుంది. రోగి ప్రాణాని కెంత కావాలి ? ఇంజక్షను సరిగా ఇవ్వని కారణాన రోగి చచ్చిపోతాడు. డాక్టరు లైసెన్సు పోతుంది. బికారి అయిపోతాడు. అతన్ని ఈ దారికి తెచ్చిన కులట డాక్టరుస్థితి తెలుసుకుని పశ్చాత్తాపపడి, తాను పతితురాలిననీ, ఇటువంటివారిని చూసి మోసపోవద్దనీ అతనికి జాబు వ్రాసి బావిలోదూకి ఆత్మహత్య చేసుకుంటుంది. డాక్టరు జ్ఞానోదయం కలిగినవాడై తిరిగి భార్యతో సుఖంగా సంసారం చేసుకుంటూ యథాప్రకారం వైద్యం చేయసాగుతాడు. అతని జీవితాన్ని బహుశా శ్రద్ధగా పరిశీలిస్తూ ఉండిన వైద్యాధికారులు అతనిలో కలిగిన 'పరిణామానికి' సంతసించి, అతని లైసెన్సు అతనికి తిరిగి ఇస్తారు. ఈ లైసెన్సును డాక్టరు గారి భార్య తన స్వకీయ కరకమలాలతో డాక్టరుకు అందిస్తుందనీ, వొణుకుతున్న చేతులతో, అశ్రుపూరిత నేత్రాలతో, గద్గద కంఠంతో అతను దాన్ని అందుకుంటాడనీ పాఠకులకు వేరే చెప్పనవసరం లేదు.

'పరిణామం' బాగుందన్న వాళ్ళు 'ప్రాయశ్చిత్తం' ఇంకా బాగుందన్నారు. జరిగిన సంవత్సర కాలంలోనూ రామ్మూర్తి శిల్పప్రతిమ బాగా హెచ్చినట్టు భావుకులు భావించారు. అతనికి కథా రచయితల పట్టీలో అనల్పమైన స్థానం ఏర్పడ్డట్టు సహృదయులు సవిశ్వాసంగా చెప్పారు.

రామ్మూర్తి రాసిన మూడో కథను గురించి వివరాలివ్వటానికి ఈ రచయితకు చెయ్యి రాకుండా ఉంది. ఈ ఘట్టాన్ని దాచిపెట్టడం, లేక మరుగుపరచటం, ఒక విధంగా న్యాయసమ్మతమైనదే. కాని ప్రసిద్ధ పురుషులు చేసే లోపాలలోకూడా మనబోటివాళ్ళు నేర్చుకోదగిన నీతి ఉంటుంది; ఈ ధైర్యంతోనే ఈ విషయం బహిర్గతం చెయ్యటమయింది. మూడోకథ రాయటంలో రామ్మూర్తి చాలా పొరపాటే చేశాడు. అది అతను రాయకుండా ఉంటే ఎంతో బాగుండేది. కాని చంద్రుడంతటి వాడికే కళంకం ఉంటుంది.

ఈ మూడో కథపేరు-పాపం శమించుగాక!—'జంటకోయిలలు' ఇందులో ఇద్దరే పాత్రలు. నాయికా నాయకులు. నాయకుడు కవి, గీతా లాలపిస్తాడు. నాయిక అతని భార్య; ముగ్ధ; అభమూ శుభమూ ఎరుగని అమాయకురాలు. ఆమెను కవి గగన వీధులన్నీ తిప్పుతాడు. ఆమెలో ఆవేశం వొస్తుంది. ఆమెకూడా తియ్యగా గీతా లాలపించటం మొదలుపెడుతుంది. అంతే కథ.

రెండో కథ వెలువడిన నాలుగునెల్ల కాలంలోనే ఇది వెలువడింది. నిశిత విమర్శకులు దీన్ని, 'కథకాదు, కథాచ్యుతి' అన్నారు. సానుభూతి రహితులు ఇందులో చాలా లోపాలు చూశారు. నాయికకూ రామ్మూర్తి భార్య అయిన కల్యాణికీ పోలికలు చూశారు. ఎంత కవికోకిల అయినా పరస్త్రీతో గానం చేయక, స్వస్త్రీ

సాంగత్యంలో గానం చెయ్యటం—మీదు మిక్కిలి ఆమెతో కంఠం కలిపి గానం చెయ్యటం-లోకవిరుద్ధంగా ఉండన్నారు. కవి అయినవాడిట్లా ఎన్నటికీ రాసి ఉండ దన్నారు. సహృదయము లీకథను గురించి నోళ్ళు విప్పలేదు: వారి సామాన్య సంభాషణలో రామ్మూర్తి రాసిన కథలు రెండే వినిపిస్తూండేవి.

రామ్మూర్తి తన తప్పు గ్రహించుకున్నాడు. అతను తిరిగి అటువంటి తప్పు చెయ్యలేదని చెప్పటానికి రచయిత గర్విస్తున్నాడు. అతనినాలుగో కథా, అయిదోకథా, ఆరో కథా కూడా అతని మొదటి రెండు కథలలాటివే. ఒక కథలో కాలేజీ లెక్చరలొ కతను తన దగ్గర చదువుకునే విద్యార్థిని వలలో పడిపోతాడు. మరో కథలో ఒక ధని కుడు ఆస్పత్రిలో ఉండి ఒక నర్సువలలో పడిపోతాడు. ఇంకో కథలో ఒక మునసబు గారు ఒక ప్లీడరు చెల్లెలు వలలో పడిపోతాడు. అన్ని కథలలోనూ నాయకులు బుద్ధి తెచ్చుకుని భార్యల దగ్గిరికి తిరిగివస్తారు. ఒక్క కాలేజీ లెక్చరరు మటుకు తన భార్యనే కోల్పోయి ఆమె ఫోటో ఎనార్జిమెంటుతో వానప్రస్థం ప్రారంభిస్తాడు. అతని పరివర్తనకు ఆహ్లాదించేటందుకు విద్యార్థులు ఉపకరిస్తారు. ఈ కథలన్నీ కూడా మొదటి రెండు కథలూ గడించినంత కీర్తి గడించినై. కథకుడుగా రామ్మూర్తి కీర్తి అస లుకు చేరే వడ్డీలాగా ప్రతి కథతోనూ హెచ్చిపోయింది.

రామ్మూర్తి ఏడోకథ రాయనే లేదు. ముఖ్యకారణం అతని ఆస్తి యావత్తూ అప్పులవాళ్ళ పాలయిపోయింది. అతనుమట్టుకు ఇల్లుతోనూ పెళ్ళాంతోనూ మిగి లాడు. అది వేరేకథ.

## 3

ఇంతవరకూ మనం రామ్మూర్తి గృహజీవితం జోలికి పోలేదు. అతనికి ఆర్థిక సమస్యలు లేనంతకాలమూ మనకా అవసరం లేకపోయినా, ఇప్పుడతను ఆస్తంతా పోగొట్టుకున్నాడు గనుక, ఇంత అన్యాయం కలగటానికి కారణమేమిటని విచారణచెయ్యటం అప్రస్తుతం కాదు.

రామ్మూర్తి ఆస్తి దాదాపు ఇరవై ఎకరాలుంది, పట్టాలప్రకారం. ఈ ఇరవైఎక రాలు ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళో ఉంది. ఆ భూమిని రామ్మూర్తి చూసిన పాపానపోయి ఎరగడు. రామ్మూర్తిదగ్గిర బంధు వొకాయన-వాళ్ళ స్వగ్రామం ఆ మారుమూల పల్లెటూరే-ఆ పొలం కవులు కివ్వటమూ, గింజలు కొలుపించు కోవటమూ దాన్ని విక్రయించటమూ, రామ్మూర్తి అవసరాన్నిబట్టి డబ్బిస్తూ వుండటమూ మొదలై నవి చేస్తూవుండేవాడు. ఆయన రైతుల్ని ఒత్తిడిచేసి బోలెడంతగడ్డీ, జనుమూ, పెసలూ, మినుములూ, మిరపకాయలూ లంచం గుంజుతున్నాడనీ, పంట కళ్ళాల్లో మార్కెటు ధరకు ఓ రూపాయ తక్కువచేసి తనే కొని, మంచి ధరకు విక్రయిస్తున్నాడనీ, మొత్తంమీద ఆయన యింటి ఖర్చంతా రామ్మూర్తి పొలంమీది రాబడితోనే గడిచిపోతు

న్నదిగానిఁ సొంత పొలంలోది ఒక్క గింజ ముట్టటం లేదనీ తనకు పాడిబ్రౌల దగ్గర్నించీ అంచాలుపెట్టే రయితులకే తక్కువ మక్తాకైనా కవులిస్తున్నాడనీ తన సొంత పొలం కవులు రామ్మూర్తి పొలంకన్న ఎకరానికి రెండుబస్తా లెందు కెక్కువుందో గమనించమనీ, కొందరు రామ్మూర్తి దగ్గిరికివచ్చి ఫిర్యాదుచేసి పోయినారు.

రామ్మూర్తి సహజంగా డబ్బుజ్ఞానం ఎక్కువ కలవాడు కాడు. కాని ఆ దిక్కుమాలిన పల్లెటూరినుంచి ఏటా ఎవరో ఎరగని రైతులు వచ్చి, "మీరు కవులు రాయించుకోండి, బాబూ. మీ ఇష్టంవొచ్చిన కవులిస్తాం! ఆయనతో వేగలేకుండా ఉన్నాం. ఎంత పెట్టినా ఇంకాతే అంటే పిల్లలుగలాళ్ళం చచ్చిపోమా?" అని లబ లబ లాడుతుంటే, కొంత ఆరాటం పుట్టినమాట నిజమే. ఆస్తి అంటూ ఉన్న తరవాత అది దోపిడి అవుతున్నదంటే ఎవరికైనా బాధగానే ఉంటుంది. అయితే, పాపం, రామ్మూర్తికి తన బంధువును నిలబెట్టి "ఏమిటి ఇట్లా చేస్తున్నావుట ?" అని అడిగే ధైర్యంలేదు. పొలంచూస్తున్నవా డంతో ఇంతో తినకుండా వొట్టి పుణ్యానికి చూస్తాడనటంకూడా ధర్మంకాదు. కాని ఎంత తింటున్నాడనేది తేల్చుకోవాలని రామ్మూర్తికి అభిలాష కలిగింది. ఇందుకోసం పనిపెట్టుకొని అక్కడికి వెళ్ళటానికి కాళ్ళాడ లేదు.

అదృష్టవశాత్తూ ఏదో కోర్టులో సాక్ష్యం ఉండి ఆ బంధువే చక్కా వచ్చాడు, మాటల సందర్భంలో రామ్మూర్తి. "ఏం మామయ్యా ! మన పొలానికింకా మక్తా ఇస్తామంటున్నారే"! అన్నాడు.

మామయ్య భోళాశంకరుడల్లే సహం పళ్ళూడిన నోటితో పొట్ట ఎగరేసు కుంటూ నవ్వి "మాలవాళ్ళు నీదగ్గిరి కొచ్చారటగా ? విన్నాలే ! వాళ్ళిస్తామనర్రూటా మరీ? ఇవ్వకపోతే కొరతవేస్తామా? వాడికేమన్నా వెనక ఉండేడిస్తేగద? కళ్ళాలు నూర్చి పదిబస్తాలు చూపించి 'ఇంతే రాలినయ్యి, బాబూ అంటే వాణ్ణేం చేస్తావురా? —అప్పటికీ నేను ఏకసాలు కవులే ఇస్తున్నా, పోనీ వచ్చే యేడన్నా మంచి రైతొస్తాడేమో అని, ఎబ్బే ? అసలు రైతువొత్తిడి లేందే? వొట్టి పాపిష్టి ఊరు! యీ బాధపళ్ళేక నేను సొంతాన సహం పొలం చేస్తున్నా." అని ప్రారంభించాడు.

"నీ పొలానికి మంచి మక్తా యిస్తున్నారుటగా ?"

"అఁహాడు ! నేనుకూడా వాళ్ళవెంటపడి పొలంలో పనిచేస్తుంటే ఆ మాత్రం మక్తా యిస్తున్నారు. అదైనా నీ పొలంతోపాటే....అసలు సంగతి నీకు తెలీదు. మన పొలానికి నీరెక్కదు. కాలవ్వేపు పల్లుడు. చుట్టుపక్కల పొలాలన్నీ తడిస్తేగాని మనది తడవదు. ఒక్క ఏడన్నా అదనులో నాటిన పాపాన పోయినారంటావా? వొట్టిది, అప్పటికీ గూబలు మెలేసి మంచి మక్తా వసూలు చేస్తున్నా. ఎన్ని చిక్కులు ! నువ్విక్కడ కూచుంటే నీకేం తెలుస్తై నాయనా! రెండేళ్ళకోసారి కాలవ పూడుతుంది. ఎకరానికి పావలా వేసుక్కొని మరమ్మతు చేస్తారు. రైతులచేతే కట్టిస్తున్నానుగాని నిన్ను దమ్మిడీ అడగలేదే? ఇంతెందుకురా? యెరువు కెప్పుడన్నా కానీ ఇచ్చాం?

ఇన్ని మాట లెందుకు? నువు రా ! వచ్చి సొంతాన చేసుకో. ఆయినమనిషి దగ్గిరున్న దారివేరూ. ఇంకోబస్తా ఎక్కువ రావచ్చు. నేను కాదన్ను. నువు బస్తీవాసాని కల వాటు పడితివి ! జిల్లలో ఎక్కి కూచోటం మీకు నామోషి ఐపోయె !"

రామ్మూర్తి మనస్సు కుదటపడ్డది. నోరూ కట్టుపడ్డది. కేవలమూ పొలం మీది వ్యవహారాల్లో తన కాసక్తి ఉన్నట్టు నటించటం కోసమని, "ఐతే, చూడూ, మనం ధాన్యం పంట కళ్ళాల్లో అమ్ముతున్నాంగదా. అది లాభమా ? మంచి దరలో అమ్ముకోవటం లాభమా?" అన్నాడు.

"వొరే, ధాన్యం నిలవచెయ్యట మనగానే బండి ఖర్చూ, కూలీ, బస్తాల బాడుగా, కొట్టు బాడుగా, తరుగులూ - ఒకటా ? ఇంతా కష్టపడితే లాభమే వొస్తుందో మొదలుకే తరుగవుతుందో ? దావ బలికున్నప్పుడొక ఏడిట్లాగే ధాన్యం నిలవచేస్తే దర కాస్తా పడిపోయింది."

ఇక రామ్మూర్తి అసలేమీ మాట్లాడలేదు. ఈ పొలంపని తనవంటి వాళ్ళకు కాదు. ఏదో ఏటా వెయ్యిరూపాయలదాకా వస్తున్నది. పైన వందా, రెండొందలూ, కావాలంటే మామయ్యే అప్పిప్పిస్తున్నాడు. ఎందుకొచ్చిన ఆరాటం తనకు ?

పొలంకు సంబంధించిన సమస్య లీవిధంగా పరిష్కారం కాగా, అతనికి అప్పు బాధ కించిత్తు ఉంటూవచ్చింది. ఈ అప్పు ఏడెనిమిదివేలకు మించదు. తనబోటి ఆస్తిపరుడు కంగారు పడవలసిందేమీ లేదు. (మధ్య తరగతి భూస్వాముల్లో అప్పులేనివాడెవడు ? ఎవరు బడితే వాళ్ళన్నట్టు, ఎంతచెట్టు కంతగాలీ !) కాని ఇది తీరే ఉపాయం లేకపోవటం, ఎప్పుడైనా ఒక్కసారి రామ్మూర్తిని కొద్దిగా బాధించేది.

ఈ ఏడెనిమిదివేల అప్పూ ఒక్కనాడు చేసిందికాదు. ఎన్నడో తన వివాహం అయినప్పుడు పదిహేను వొందల అప్పయింది. అదే వడ్డీకూడాలేదు, నూటికి నెలకు ఒక రూపాయి మాత్రమే. ఆ తరువాత బియ్యే చదువుకు మరో వెయ్యిరూపాయలు అప్పు చెయ్యవలసి వచ్చింది. ఈ అప్పంతా తన 'మామయ్య' ద్వారా వర్తకుల దగ్గిర చేసినదే. అప్పు తాలూకు వడ్డీ అయినా తీరుస్తూ రావటానికి వీలు చిక్కలేదు. పొలంమీద వచ్చేది ఇంచుమించు ఇంటి ఖర్చుకు సరిపొయ్యేది. ఆ పాత అప్పంతా కలిసి రామ్మూర్తి కథారచయిత అయేనాటికే ఏడెనిమిదివేల మధ్యకి దేకింది.

అంతకు పూర్వం రెండేళ్ల ముందునుంచీ రామ్మూర్తి నిత్య ఖర్చుకోసం ఏటా నాలుగయిదు వందలు ఆదనంగా అప్పు చెయ్యటం ప్రారంభించాడు. ఏమీ లేనివాళ్ళ కేదీ ఉండదు. నలుగురూ వస్తూ పోతూవుంటే ఇంటి ఖర్చుకేంలోటూ? అంతో ఇంతో పొలం అమ్మకుండా అప్పు తీరేటట్లు కనబడలేదు. అందుచేత ఏటా మరో నాలుగు వందలు, అయిదు వందలు అప్పయితే, దానికి రామ్మూర్తి సంకోచించదలచుకోలేదు. పొలం అమ్మటం విషయం మామయ్యని సలహా అడిగితే, "వొరే, చెమటోడ్చి పెద్దలు ఆర్జించిన భూమిపోతే వస్తుందిట్రా ? ఏదీ నీ పక్క

పొలం కొనుచూతాం ? ఎకరానికి అయిదువేలిస్తే మట్టుకా జంగమాయన అమ్ము తాడేమో? బస్తీల్లో కూచుంటే పొలం విలువ మీకేం తెలుస్తుందిరా ? అప్పున్నదంటే నిక్షేపంగా ఉద్యోగంచేసుకో, దానిమీద ఖర్చు గడుపుకో. పొలంమీద వచ్చేది విసురుపుచ్చుకు అప్పుక్రింద పారెయ్యి. అంతేగాని పొలం అమ్ముకుంటారుట్రా?" అని చెప్పాడు.

ఉద్యోగంచేసినా చెయ్యకపోయినా పొలం అమ్మి తీరాలి. పొలం మీదవచ్చేది వడ్డీకే చాలదు. దాంతో ఇంకా అప్పుతీర్చే దేమిటి ? పొలం అమ్మాలన్నా మామయ్య సహాయం కావాలి. మొదలు పొలం అమ్మొద్దంటూంటే ఆయన ఏం సహాయం చేస్తాడూ ? పొలానికింత దగ్గిరిగా ఉన్నవాడూ, కాస్త వ్యవహర్తా, ఆయన లేకుండా అమ్మటం ఎట్లా ? ఈ సమస్య తెగక రామ్మూర్తి అప్పుతీర్చటం విషయమూ, పొలం అమ్మటం విషయమూ కొంచెం అశ్రద్ధ చేశాడు.

మరో నాలుగేళ్ళు గడిచింది. 1930 పైనబడ్డది.[1] ఆర్థిక కాటకం మీదపడ్డది. డబ్బు మాయమయింది. ధరలు చచ్చినై అప్పుల వాళ్ళంతా ఏదోకాడికి పొలా లంటగట్టుకుంటున్నారు. పొలాలు కొనే నాధుడులేడు. అదివరలో తాను నోట్లు తిరగరాసినప్పుడల్లా తనకేదో అపచారం చేస్తున్న వాళ్ళల్లే, తనమానం ఎక్కడ చితుకుతుందో అన్నట్లు, ఎంతో వినయంతో ప్రవర్తించిన షావుకార్లు, బాకీకింద తన పొలాలు వెనుకటి ధరలకు మూడోవంతు ఖరీదుచేసి కట్టుకోవటానికి పెద్ద పేచీలు పెట్టసాగారు. తమకసలు పొలాలే వద్దన్నారు. రొక్కం పారబోయింఛ మన్నారు. ఆఖరుకు ఎకరం ఎనిమిది వందలుచేసి షావుకార్లు పొలం అంటగట్టు కున్నారు. ఎకరం అయిదువేల కమ్మని జంగం దేవర కూడా, ఎకరం ఎనిమి దొందలుచేసి రెండు కుంటలు బాకీకింద తన పొలంలో కలుపుకోవడానికి రాద్ధాంతం చేశాడు.

తీరా కొలవాస్తే పొలమంతా కలిసి హనీ- హానిగా పందొమ్మి దెకరాలున్నది! మామయ్య లంచాలుకొట్టి పక్కవాళ్ళని గట్టు జరపనిచ్చి వుండాలి.

సెంటు పొలం మిగలక పోయినా, రామ్మూర్తి మటుకు కానీ అప్పులేకుండా బయటపడ్డాడు. చేతికి రెండొందలు రొక్కం కూడా వచ్చింది.

ఈ పొలం పోయిన కొత్తలో రామ్మూర్తి ఇంత ఆపదా తనకే సంభవించి నట్టూ, ఇన్నాళ్ళూ తనను కనిపెట్టివున్న భగవంతుడికి అకస్మాత్తుగా తనమీద దయతప్పినట్టూ భావించాడు. కాని ఎన్నోవేల మందికి తనగతే పట్టిందని తెలిసి నప్పుడు బాధ కొంత ఉపశమించింది. ఈ ఆర్థిక ప్రళయం ఏకారణంవల్ల కలి

1. 1930 పైన బడ్డది. ఆర్థిక కాటకం మీద పడ్డది : 1923-1934 మధ్య తెలుగు ఆర్థిక జీవితాన్ని తలకిందులు చేసిన 'ఆర్థిక ప్రళయం' కుటుంబ రావు రచనల్లో ఈ సంవత్సరాల వాతావరణ చిత్రణ గమనార్హం.

గిరదో, దాని వెనక ఉన్న పైశాచిక ఆర్థిక సూత్రాలేమిటో రామ్మూర్తి ఏమీ ఎరగడు. తాను స్వతంత్ర జీవి ననుకున్నాడు. పదేళ్ళపాటు తన ఇష్టం వచ్చినట్టు జీవించానని నమ్మాడు. ఆ స్వాతంత్ర్యాన్ని ఇరవై ఎకరాల ఆస్తితో కొనుక్కున్న సంగతి కూడా అతనికి స్పష్టంగా తెలియలేదు. ఇకముందు తాను వెనకటి మాదిరిగా కళాసేవ చేసే అవకాశం ఉండదనీ, శాశ్వతంగా నాలుగు కాలాలపాటు నిలిచే సాహిత్యం రాయలేననీ విచారించాడేగాని, తనలో సహం ఈడున్న వాళ్ళు వచ్చి తనకు జీవిత సత్యాలు చెబుతారనీ, తానురాసిన ప్రఖ్యాత కథ లెవరికీ ఎందుకూ ఉపకరించవని అతనికి తెలీదు.

ముందు చూస్తే జీవితమంతా ఎడారిగా కనపడ్డది. ఉన్న ఇల్లు తప్ప అతనికే ఆధారమూ లేదు. ఇంతకాలమూ నిరసించిన ఉద్యోగం చెయ్యాలి. అదైనా ఎవరిస్తారు ? సొంతాన "ఏదన్నా" చేసుకుందామంటే "ఏదన్నా" చేసుకునే రోజులు కావు. మళ్ళీ ఆ రోజులు తిరిగి వచ్చే సూచనలైనా కనిపించ లేదు.

ఈ పరిస్థితులు చూసి రామ్మూర్తి కొద్దిగా చలించాడుగాని పూర్తిగా తొణకలేదు. అతని స్వతస్సిద్ధమైన స్తబ్ధత ఎంతైనా ఈ రోజుల్లో వినియోగపడ్డది.

చేతిలో మిగిలిన రెండువందలూ అయిపోయినై. ఇంటో ఉన్న వెండిసామాను చాలా భాగం అయిపోయింది. భార్య వొంటిమీద బంగారం కూడా దాదాపు అయిపోయింది. రామ్మూర్తి తొణక లేదు. సంవత్సరం గడిచింది. ఎప్పటికైనా ఏదో జరిగి తీరుతుందనీ, తను ఎల్లకాలమూ ఈ స్థితిలో ఉండదనీ అతనికి తెలుసును.

ఇంతలో ఏదో జరగనే జరిగింది. ఒకనాటి ఉదయం తొమ్మిది గంటలకు ఒక స్నేహితుడు వచ్చి, "పట్నంలో నా స్నేహితు డొకాయన పత్రిక పెడతాట్ట. నువ్వు దానికి సంపాదకుడుగా వెళతావా ?" అని అడిగాడు.

రామ్మూర్తి తొణకలేదు. ఏమీ తొందర పడలేదు.

"పత్రికలు పెడతామన్నంత మాత్రంచేత లాభంలేదు. ఎవరా పెట్టేది ? ఎంత డబ్బుతో పెడతారు ? ఏమిటి కథ ?" అన్నాడు. పొరపాటున కూడా అతను, "నాకేమిస్తారు ?" అని అడగలేదు.

## 4

**1930** నాటి ఆర్థిక కాటకంలోంచి అనేకం పుట్టినై. తెలుగు వాళ్ళ సంస్కార జీవితంలో కలిగిన నూతన సృష్టిలో చెప్పుకోదగినవి పత్రికలూ,[1] టాకీలూనూ.[2]

---

1. పత్రికలు · ఆర్థిక నాటకం రోజుల్లో అంటే 1929-34 మధ్య కొన్ని మంచి సాహిత్య పత్రికలు పుట్టాయి. అవి : పుష్పాంజలి మాసపత్రిక (1930), సుధ మాస పత్రిక (1930), కల్యాణి మాస పత్రిక (1931), జ్వాల మాస

ఒక పరిషత్తు తోడ్పాటు లేకుండా, ఒక ఉద్యమం నడవకుండా, దేశమంతటా రకరకాల పత్రికలు పుట్టి సాహిత్యాన్ని ప్రజల దగ్గిరికి తెచ్చినై. వాటిలో వెలువడిన సాహిత్యం ఏ తరగతి సాహిత్యమనేది ఎక్కువ ముఖ్యమైన విషయంకాదు. ప్రతిభా వంతులురాస్తే మంచి సాహిత్యం వస్తుంది. రచనచేసి పొట్టపోసుకునే అవకాశాలుంటే, ప్రతిభావంతులు సర్విస్ కమిషను పరీక్షలకు కూచోటమూ, గుమస్తాగిరీలూ మేష్టరు పనులూ చెయ్యటానికి బదులు సాహిత్య రచన చేస్తారు. పత్రికలు ఉత్తమ సాహిత్యం కోసం ఆందోళన చెయ్యలేదు. చేతికందిన కథలూ, వ్యాసాలూ ప్రచురించి జన సామాన్యంలో పఠితల్ని వేల సంఖ్యలో పెంచినై. సాహిత్యపిపాసా, సాహిత్యాభిలాషా కొత్తదారి తొక్కినై. ఒకప్పుడు తమకు సాహిత్య రచన గాని పఠనగానీ చేసే అర్హత లేదనుకున్న తరగతులలో నుంచి రచయితలూ, పఠితలూ బయల్దేరారు. పత్రికా నిర్వాహకులు కూడా కొత్తరకంవారు ముందుకొచ్చారు. మందులమ్ముకునే వాళ్లూ, నగలవర్తకులూ, పత్రికా నిర్వహణానికి పూనుకొన్నారు. వారికి సాహిత్యాభిలాష లేదు. వాళ్ళకు ముఖ్యంగా కావలసింది తమ వస్తువులకు ప్రచారం జరగటం, రెండోది పత్రికమీద లాభాలు తియ్యటం.

అయితే రామ్మూర్తిని మద్రాసు పిలిచిన పెద్దమనిషి ఈ తరగతికి చెందిన వాడు కాదు. పత్రిక పెట్టడానికి ఆయన్ని పురిగొల్పింది సాహిత్యాభిలాషే! ఆయన చాలా కాలంగా పట్నంలో ఉండి గవర్నమెంటు నౌకరీచేసి విరమించాడు. డబ్బు కేమీ లోటులేదు. జార్జిటవును సందుల్లో ఒక ప్రెస్ అమ్మకానికొస్తే చవుకగాకొని ఒక మాస పత్రిక నడపాలని ఆయనకి అభిలాష కలిగింది. దాన్ని నడపటానికి ఎవర్ని పెడితే బాగుంటుందని విచారించగా, ఎవరో రామ్మూర్తి పేరు సూచించారు. ఇక మరో ఆలోచన చెయ్యక తననూ రామ్మూర్తినీ ఎరిగున్న వాళ్లన్నట్టు తెలుసు కుని, వారి ద్వారా రామ్మూర్తికి కబురుచేయించాడు. ముందు రామ్మూర్తి ఒకడే

---

పత్రిక (1932), సరస్వతి వార పత్రిక (1933), ప్రబుద్ధాంధ్ర (పునః ప్రారంభం జనవరి 1934), ఆంధ్రభూమి మాస పత్రిక (1933), ఆంధ్ర భూమి మాసపత్రికలో కుటుంబరావు కథలు 1933-35 మధ్య 20 దాకా అచ్చు అయ్యాయి.

2. టాకీలు : తెలుగులో నిర్మింపబడిన మొట్ట మొదటి టాకీ భక్త ప్రహ్లాద. ఈ చిత్రం బొంబాయిలో 14-3-1931 ప్రదర్శితమైంది. ఆరోజే విజయవాడ మారుతీ టాకీస్‌లో కూడా ప్రదర్శించారు. కొల్హాపూర్‌లో తయారైన ఈ చిత్రా నికి దర్శకుడు స్వర్గీయ హెచ్. ఎం. రెడ్డి. 1932లో బదామీ దర్శకత్వంలో పాదుకా పట్టాభిషేకం, శకుంతల చిత్రాలు వచ్చాయి. 1933లో ఆరుచిత్రాలు, 1934లో 3 చిత్రాలు వచ్చినట్లు నమోదు (వివరాలకు చూడండి : చిత్ర దర్శిని, విజయచిత్ర ఫిలిం డైరెక్టరీ 1971).

పట్నం వచ్చాడు. అన్ని విషయాలూ మాట్లాడుకున్నారు. పరదయ్య పంతులుగారు రామ్మూర్తికి నామకః నెలకు వందజీతం ఇస్తానన్నాడు. పత్రికమీద లాభంవస్తే అందులో కూడా సగం భాగం ఇస్తానన్నాడు. ఒకప్పుడు రామ్మూర్తికి నూరు రూపాయలేమూలా చాలేవికాదు. కాని కాటకం కావటం మూలాన అదే చాలా ఎక్కువగా కనపడింది. అదీగాక అలిధుల తాకిడి జాస్తిగా ఉండదు గనుక పట్నంలో తన ఖర్చు చాలా తక్కువగా ఉంటుందని అత నూహించాడు.

పత్రికలో ఆదునిక కవుల పద్యాలూ, గేయాలూ, కథలూ, విమర్శక వ్యాసాలూ, కళా చర్చలూ, పుస్తక సమీక్షలూ మొదలైనవి ప్రచురించటానికి నిర్ణయించాడు రామ్మూర్తి. అడివివారూ[1] చక్కని ముఖచిత్రంవేసి ఇస్తామన్నారు. చింతా దీక్షితులూ, మునిమాణిక్యంవారూ, శ్రీనివాస శిరోమణీ,[2] నోరివారూ[3] తదితరులూ కథలు రాస్తామన్నారు. విశ్వనాథవారూ,[4] కొడాలివారూ,[5] కొముండూరివారూ[6] మొదలైనవారు పద్యాలు రాస్తామన్నారు. నండూరివారు[7] యెంకిపాట ఒకటి పంపారు. పత్రిక వెలువడటానికి అన్ని సన్నాహాలూ జరుగుతున్నాయి.

ప్రెస్సున్నచోటే పత్రికకు ఒక గది చాలా భాగం ఖాళీచేసి ఇచ్చారు. ఒక మూల చెస్సులూ, బైండుగాని పుస్తకాలకట్టలూ, చెక్కలూ, పాతబడిన టైపులపోగూ ఉన్నప్పటికీ గది "కలావాణి" ఆఫీసుగా మారిపోయింది. రామ్మూర్తికి ప్రింటింగు గొడవ ఏమీతెలీదు, కాని ఆ మాట అతను పైకి అనదలచుకోలేదు. ఎవరికీ తెలియకుండా కాలక్రమాన నేర్చుకోవచ్చును.

---

1. అడివివారు : అడివి బాపిరాజు (1895-1952) కవి, రచయిత, చిత్రకారుడు, శిల్పి, నటుడు, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. మీజాన పత్రికకు సంపాదకత్వం వహించారు. జాతీయోద్యమ కాలంనాటి కాల్పనికోద్వేగం ఆయన రచనల్లో ప్రస్ఫుటం అవుతుంది. ఆయన రచనలు: తొలకరి, గోధూళి, శశికళ, రాగమాలిక, తరంగిణి (కావ్యాలు,) నారాయణ రావు, హిమబిందు, తుపాను, గోనగన్నారెడ్డి, కోనంగి (నవలలు) కథలు కూడా రాశారు.
2. శ్రీనివాస శిరోమణి (1899-1968) : కథా రచయిత, వ్యాసరచయిత. రచనలు: పంచవటి (1936), శిరోమణి కథలు (1940), రష్యన్ కథలను కొన్నిటిని తెలుగులోకి అనువదించారు
3. నోరివారు : నోరి నరసింహశాస్త్రి (1900-1978). పండితుడు, కవి, రచయిత. రచించిన కావ్యాలు : గీతమాలిక, సంధ్యారాగము, నారాయణ భట్టు రుద్రమదేవి, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు. ధూర్జటి కవిద్వయం అనే ఆఖాస చారిత్రక నవలను రాశారు.
4. విశ్వనాధ : (1895-1976) విశ్వనాధ సత్యనారాయణ. విశ్వనాధగా

రోజూ ఒకరిద్దరు సాహిత్యపిపాసువులు రామ్మూర్తి దర్శనపరిచయ భాగ్యాలు పొంది, సాహిత్యచర్చచేసి, జేబులో పెట్టుకొచ్చిన వ్యాసాలు సమర్పించి వెళు తున్నారు. ఈ సాహిత్య చర్చలలో సామాన్యంగా ఆధునిక కవుల ప్రశంసే వస్తూండేది.

కాని ఒకనాడు రామ్మూర్తి దగ్గిర కొక కుర్రాడొచ్చాడు. అతనికి ఇరవైఏళ్ళ కంటె ఉండవు. ఏదో మాటమీద మాటొచ్చి అతను భావకవిత్వం దక్కదన్నాడు. రామ్మూర్తికి ఆశ్చర్యం వేసింది. భావకవుల్ని తిట్టే వాళ్ళంతా యాభైపయి చిల్లర వాళ్ళనీ, వాళ్ళ నోళ్ళకూడా క్రమంగా బలహీనం అయిపోతున్నయ్యనీ అనుకుంటూ వచ్చాడు రామ్మూర్తి. గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్టు, ఈ ఇరవైయేళ్ళ రాలుగాయి భావకవిత్వాన్ని విమర్శించటం రామ్మూర్తికి ఆశ్చర్యం వేసింది.

"మీరెట్లా చెప్పగలరామాట ?" అన్నాడు రామ్మూర్తి.

"భావకవి తన సొంత గొడవ చెప్పుకుంటాడు. దానికీ, ఆ చెప్పే విధానానికీ పఠిత యొక్క మనోధర్మంతో సంబంధంలేదు. కళ ప్రేక్షకుడి మనోధర్మం గుర్తించి,

---

ప్రసిద్ధులు. కవి, రచయిత, విమర్శకుడు. మొదటి దశలో అచ్చమైన భావకవి. ఆంధ్ర పౌరుషము (1919) గిరికుమారుని ప్రేమగీతాలు (1920-28), మాస్వామి (1923), కిన్నెరసాని పాటలు (1924), కోకిలమ్మ పెళ్ళి (1924), ఆంధ్ర ప్రశస్తి (1926-28), శృంగారవీధి (1933), తెలుగు ఋతువులు (1934), శశిదూతము (1935) మొదలైన కృతులలో కాల్పనికోద్యమ ప్రభావం కన్పిస్తుంది. రామాయణ కల్పవృక్షం ఆయన క్లాసిక్. చాలా నవలలు రాశారు. ఏకవీర, చెలియలికట్ట, వేయిపడగలు, తెఱచిరాజు, మాబాబు, వీరవల్లడు ఆయన రాసిన కొన్ని నవలలు. హిందూ వర్ణాశ్రమ ధర్మ పునురుద్ధరణకు రచనల ద్వారా ప్రయత్నించినవారు. తానే ఒక ఉద్యమమై, తన రచనలే ఉద్యమ ప్రజయై నవీన సంప్రదాయ వాదు లకు ఒక తలకిందులు తాత్వికతను సమకూర్చిన ప్రతిభావంతుడు.

5. కొడాలివారు : కొడాలి ఆంజనేయులు (1888-1982) కవి, జాతీయోద్యమ కారుడు, సాహితీ సమితి సభ్యుడు, రాజకీయ శాస్త్ర విషయ రచయిత. రచనలు : అజ్ఞాత సత్యాగ్రహి, నిరీక్షణము, సహకారోద్యమం, గ్రామస్థుల అర్థశాస్త్రం మొదలైనవి.

6. కొముందూరివారు : పూర్తి పేరు, వివరాలు అలభ్యం.

7. నండూరివారు : నండూరి వేంకటసుబ్బారావు (1895-1957) ఎంకిపాటలు (1925-1953) కవి భావకవితోద్యమ కాలంలో జానపదబాణీ పట్టుకున్న భావుకుడు, కాల్పనికుడు.

వాని ద్వారా వాడిలో ఒక స్పష్టమైన భావసంచలనం కలిగించాలి. 'పఠితలో ఈ రసం ఉత్పాదన కలిగిస్తాను' అని భావకవి ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పలేదు."

రసోత్పాదన కావ్యంలో జరుగుతుందా పఠితలో జరుగుతుందా అని చర్చించ టానికి రామ్మూర్తి ప్రయత్నించాడుగాని కుర్రాడు చర్చ సాగనివ్వలేదు. పఠితలో జరగటాన్నిబట్టే కావ్యంలో జరిగిందీ లేందీ తెలుస్తుందన్నాడు. పఠిత సహృదయుడు కాకపోతే అన్ని కావ్యాలూ నీరసాలే నన్నాడు రామ్మూర్తి

"రచయితకూ పఠితకూ ఏదైనా సామ్యం ఉంటేగదా సహృదయత అనేది కలిగేది" అన్నాడు కుర్రాడు; భావకవికి సహృదయుడు భావకవేనని కూడా తేల్చాడు.

"కవిత్వం రాయనివారు కూడా భావకవిత్వం చూసి ఎట్లా సంతోషిస్తు న్నారు ? నేను కవిత్వం రాయను, నాకెంతో యిష్టం భావకవిత్వమంటే!" అన్నాడు రామ్మూర్తి.

"నా అభిప్రాయంలో భావకవిత్వం చదివి ఆనందించే వాళ్ళు రెండు రకాలు. ఏ కొత్త వింత చూసి అయినా ఆనందించేవాళ్ళు ఒకరకం. భావకవిత్వంలో ఉండే ధ్వనిని సవిమర్శగా గ్రహించి మెచ్చుకొని ఆనందించేవాళ్ళు రెండో రకం. నిజానికి పనికొచ్చేవాళ్ళు రెండోరకం వాళ్ళే. కాని వీరు భావకవిత్వానికి మీదుగా ఉంటారు. దాన్ని పరామర్శిస్తారు. వీపుమీద తట్టుతారు, బేష్ అంటారు. కళ ప్రేక్షకుణ్ణి ఆవరించాలి. వివశుణ్ణిచేసి ఒక చోటి నుంచి ఎత్తి మరోచోట పెట్టాలి" అన్నాడు కుర్రాడు.

రామ్మూర్తి ఈ అభిప్రాయంతో ఏకీభవించలేదు. తనను భావకవిత్వం ఎక్కణ్ణుంచో ఎత్తి ఎక్కడో పెట్టింది. కాని ఈ విషయం చర్చించి ప్రయోజనం కనిపించలేదు. సాహిత్యం గురించీ కళ గురించీ ఆ కుర్రాడి అభిప్రాయాలేమిటో తెలుసుకోవాలనిపించింది రామ్మూర్తికి.

"నేటి కవులలో తెలుగుజాతియొక్క వాక్కున్నవాళ్ళు బహు కొద్దిమంది" అన్నాడు కుర్రాడు. "గురజాడ అప్పారావు దగ్గిర ఈ వాక్కు కనిపిస్తుంది. బసవ రాజు అప్పారావు[1] దగ్గిర కనిస్తుంది. నండూరి సుబ్బారావులో కూడా కనిపిస్తుంది" అన్నాడు కుర్రవాడు.

ఉన్న కథకుల్ని గురించి రామ్మూర్తి కుర్రవాడి అభిప్రాయం అడిగాడు.

---

1. బసవరాజు అప్పారావు : బసవరాజు వేంకట అప్పారావు (1894-1933) గురజాడ మార్గంలో గేయ కవితను నడిపించాలనుకున్న కాల్పనిక కవి, పత్రికా రచయిత. ఆయన రచనలు : బసవరాజు అప్పారావు గీతాలు, సెలయేటి గానము, ఆంధ్ర కవిత్వ చరిత్ర. ఆయన భార్య రాజ్యలక్ష్మమ్మ (కలంపేరు సౌదామిని) కూడా భావ కవయిత్రి.

"జ్ఞాపకం ఉంచుకోదగిన కథలు రాసేవారెవరూ లేరు. ఒక్క గుడిపాటి వెంకటచలం[1] కథలు మాత్రం చక్కని శిల్పంతో కూడుకుని ఉంటై. ఈ శిల్పం పైనుంచి దిగుమతిచేసినదైనా అతివేగంగా తెలుగువాళ్ళ సొత్తయిపోతున్నది. కాలక్రమాన దేశంలో మిగిలేది చలంగారు తెచ్చిన శిల్పమే.... ఆయన తెచ్చే కథావస్తువుకూడా దిగుమతి సరుకే. పాశ్చాత్య నాగరికతా వ్యామోహం తప్ప చలంగారి కథల్లో ఏమీ కనిపించదు. స్త్రీ పురుషులు స్వేచ్ఛగా విహరించాలనీ, సంఘంలో వున్న కట్టుబాట్లు యువకుల ఆనందాని కడ్డొస్తున్నాయనీ ఆయనకి విచారం. ఈ కట్టుబాట్లు ఎవరో కావాలని పెట్టినవైతే వాటిని తీసెయ్యటం సాధ్యమౌను. ఇవి ఎందుకొచ్చిందీ చలంగారికి తెలీదు. అందుచేత ఆయన వాటిని తన కథలద్వారా ఎప్పటికీ మార్చలేడు. చలంగారికి కావలసిన స్వేచ్ఛాయుతమైన సంఘం పాశ్చాత్యదేశాల్లో కాదు కదా, ఎక్కడా లేదు. వంటింటికీ వసారాకీ మధ్య గోడ కట్టుకుంటాం. స్నానాల గదయితే కిటికీలకి మరింత భద్రంగా తలుపులు పెట్టుకుంటాం. స్వేచ్ఛకావాలని ఎవరమూ వెళ్ళి బట్టబయలులో నివసించం."

"మీ కెటువంటి సాహిత్యం నచ్చుతుంది?" అని అడిగాడు రామ్మూర్తి నవ్వుతూ.

"నాకు నచ్చిన పాట 'మాకొద్దీ తెల్లదొరతనమూ,"[2] అన్నాడు కుర్రాడు.

---

1. గుడిపాటి వెంకటచలం (1894-1979): స్త్రీ పురుష ప్రేమను ఒక లౌకిక చర్య, సుఖ సౌందర్యాన్వేషణలో ఒక గమ్యంగా భావించిన రచయిత. 1921నుంచి రచనలు ప్రారంభించారు. శశిరేఖ, దైవమిచ్చినభార్య (1923) అమీనా (1924) మైదానం (1927) వివాహం (1928) అరుణ (1935) బ్రాహ్మణీకం (1937) జీవితాదర్శం (1949) మొదలైన నవలలూ, వందదాకా కథలూ, ఏడెనిమిది నాటకాలూ, యాభైదాకా నాటికలూ, అనేక వ్యాసాలు రాశారు. 1950 కి ఈశ్వరుణ్ణి ప్రశ్నించినవాడు, ఆ తర్వాత ఈశ్వరాన్వేషకుడయ్యాడు. స్త్రీ విమోచన కోసం కలం పట్టిన తీవ్ర భావుకుడుగా, తెలుగు వచన రచనకు వన్నె తెచ్చిన ఒక శైలీ నిర్మాతగా వచన సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. (మరికొన్ని వివరాలకు చూడండి. కుటుంబరావు సాహిత్యం, మూడవ సంపుటం, పుట 108, అయిదవ సంపుటం భావుకుల రచయిత, కొ.కు, పుటలు ix xxiv).
2. మాకొద్దీ తెల్లదొరతనం; గరిమెళ్ళ సత్యనారాయణ (1893–1952) రాసిన "మాకొద్దీ తెల్లదొరతనము - దేవ, మాకొద్దీ తెల్లదొరతనమా పల్లవితో 'మా ప్రాణాలకై పొంచి, మా మానాలు హరియించే' అనే అనుపల్లవితో 39 చరణాలున్న పెద్దపాట. "జనం గుండెను పట్టిన సర్కారువారి గుండెను కంపింప" చేసిన పాట. 1922 లో ఈ పాట ఉన్న స్వరాజ్య పదములు

"అది కవిత్వంకాదు. ప్రచారం," అన్నాడు రామ్మూర్తి.

"ఏ ప్రచారమూ చెయ్యలేకపోతే అది కవిత్వమేకాదు." అని జవాబిచ్చాడు కుర్రాడు.

"అదికాదు నా అభిప్రాయం. ప్రచారం అయిపోగానే పొయ్యేది కళకాదు. ప్రచారం అయిపోయినా నిలబడాలి."

"అవును, ప్రచారం అయిపోయినాక నిలబడని కవిత్వం ఎక్కువంటారా? అసలు ప్రచారమే చెయ్యని కవిత్వం ఎక్కువంటారా?"

రామ్మూర్తి చెప్పలేకపోయినాడు. కృష్ణశాస్త్రీ కృష్ణపక్షం కంటే మా కొక్కి తెల్లదొరతనం మంచి కవిత్వం అనటం ఎట్లా? కుర్రాడు మొండివాదన చేస్తున్నట్లు తోచింది రామ్మూర్తికి.

"కవితాశిల్పం మాటేమిటి?" అన్నాడు రామ్మూర్తి.

"అవును మీరు శిల్పం చూస్తున్నారు. కవియొక్క ప్రతిభనుగురించి ఆలోచిస్తున్నారు. కవిని నిర్వ్యాజంగా ఆరాధించటం సంఘానికొక పరమావధి అనుకుంటున్నారు; నేను సంఘం గురించి ఆలోచిస్తున్నాను. ప్రయోజనంకోసం వెదుకుతున్నాను. కవివల్ల సంఘానికి ప్రయోజనం ఉండాలంటున్నాను. కళారాధనలో నేను మీవెంట రాలేను; సంఘారాధనలో మీరు నావెంట రాలేరు. ఎవరిదారిన వాళ్ళం పోదాం.... అయితే నేను మీలాగా ఆత్మానందంతో తృప్తిపడి ఉండలేక కాదుసుమండీ — నేను ఆనందించినంత మాత్రంచేత లోకానికేం ఒరిగింవని!"

ఈ విసురువిసిరి కుర్రాడు వెళ్ళిపోయినాడు. అతనెవరో రామ్మూర్తికి తెలీదు. పేరు కూడా మరిచిపోయినాడు. కాని అతన్ని గురించి అడపాదడపా రామ్మూర్తికి జ్ఞాపకం వస్తూండేది. వాగ్వాదంలో తానే గెలవాలనే పంతం కలవాడుకాడు రామ్మూర్తి. అతని సాత్వికతత్వం దాని కొప్పుకోదు. ఆ కుర్రాడి అభిప్రాయాలు సరయినవి కావని అతనికి గట్టి నమ్మకం. అయితే రామ్మూర్తి లోపల ఒకటే అనుమానం— తను చూసేదంతా చూడటమేగాక ఆ కుర్రాడు మరేదో అధికంగా చూస్తున్నాడని....

పత్రికలో ప్రచురించటానికి వ్యాసాలు వస్తున్నకొద్దీ రామ్మూర్తికి మరో సమస్య పట్టుకుంది. అతనికి కొత్తరచనలు రుచించటం లేదు. కొత్తవాళ్ళవేకాదు, తనకు అభిమానపాత్రులైన పాతవాళ్ళవి కూడానూ! తనకు నచ్చే రచన లిక

---

పాటలు అనే పుస్తకం బ్రిటిష్ ప్రభుత్వ నిషేధానికి గురి అయింది. కవికి రాజద్రోహం నేరం క్రింద రెండేళ్ళ కఠిన శిక్ష పడింది. (వివరాలకు చూడండి. కె. వి. రమణారెడ్డి వ్యాసం గరిమెళ్ళ 'వాల్మీకి ధార' ఆధునిక యుగంలో కవిలోకం, ప్రథమ భాగం, మాక్సింగోర్కి ప్రచురణాలయం, నెల్లూరు, 1984, పుటలు 12–18)

రావనుకున్నాడు. ఆధునిక సాహిత్యంలో ఒక స్వర్ణయుగం అయిపోయినట్టుగా తోచింది రామ్మూర్తికి. కొత్తవాళ్ళు కూడా ఎగబడి రాస్తున్నారు. కాని అందులో ఏమీ పసలేదు. పైగా వాళ్ళుపొయ్యే కొన్ని పోకడలు చూస్తే రామ్మూర్తికి భయం వేసింది. భారతి పత్రికలో ఎవరో యతిప్రాసలు లేకుండా పద్యాలురాని కావాలని వాటిని వొదిలేసినట్టు రాశారు.[1] ప్రయోజనం ఏమిటి? ఆ కట్టుబాట్లు తెంచటంవల్ల కవిత్వం పెరిగిందా ?

నవీన సాహిత్యంలో స్వర్ణయుగం పోయిందా, లేక తనలో ఏదో మార్పు వచ్చిందా అనే సమస్య రామ్మూర్తిని బాధించింది. ఆర్థికంగా తాను దెబ్బతినటం ఒకటీ, తాను మద్రాసు వచ్చి సాహిత్య వాతావరణానికి దూరంకావటం ఒకటీ చూస్తే, ఈ మార్పు తనదేమో ననిపించింది. ఆ మాట అనుకుని తనను తానే నిందించుకుందా మనుకుంటే ఆధునిక సాహిత్యంలో అసంతృప్తి కనబరుస్తున్న వారింకా కనిపిస్తున్నారు. అందరూ ఒకే రకమయిన కారణాలు చెప్పకపోయినా ఒకేరకం అభిప్రాయా లిస్తున్నారు. భావకవిత్వంమీద వెక్కిరింపులూ, హేళన పద్యాలూ[2] ప్రచురణార్థం తనకు పంపినవారున్నారు.

ఆర్థిక సంక్షోభం ప్రజల మనస్తత్వాన్ని ఎట్లా మార్చిందీ రామ్మూర్తి తెలుసుకోలేదు. తనలో కలిగినమార్పే అతనర్థం చేసుకోలేదు. గుడ్డుపగిలి బయటికొచ్చిన పిల్ల తిరిగి గుడ్డులోకి వెళ్ళి తన చుట్టూత తుంపు అంటించుకోవా లనుకున్నట్టుగా ప్రవర్తించాడు. వెనక్కు తిరిగి చూసి నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పుల ఫలితమే 'కలావాణి' తొలి సంచిక. దాన్ని పత్రికలన్నీ అభినందించినై. అనేకమంది ఉత్తరాలు రాసి సంచిక కాపీలు తెప్పించుకున్నారు. కొందరు సంవత్సర చందాలుకూడా కట్టారు.

ట్రిప్లికేనురో ఒక చిన్న భాగం అద్దెకుపుచ్చుకుని రామ్మూర్తి తన భార్యను తీసుకొచ్చాడు. దాదాపు రెండునెల్లు అతను భార్యను వొదిలి ఉన్నప్పటికీ, ఎందు చేతనో రామ్మూర్తి ఆచే విచారించలేదు. ఆస్తిపోయినప్పటినుంచీ ఇద్దరిమధ్యా చిన్న ఎడం ఏర్పడ్డట్టయింది. ఆమె వొంటిమీది నగలన్నీ అమ్ముకుని తినవలసి వచ్చింది. ఏదో అపచారం చేసినట్టే భావించుకున్నాడు రామ్మూర్తి. కల్యాణి తన నగలు

---

1. భారతి పత్రికలో ఎవరో యతిప్రాసలు లేకుండా వాటిని వదిలేసినట్లు రాశారు. వివరాలు అలభ్యం.
2. భావకవిత్వంమీద వెక్కిరింపులూ, హేళన పద్యాలు రాసిన వాళ్ళు జలసూత్రం రుక్మిణి నాథశాస్త్రి, మాచిరాజు దేవీప్రసాద్ ఈ నవల కథా కాలం నాటికి జలసూత్రం పేరడీలు ప్రఖ్యాతిలో ఉండాలి. [చూడండి: జరుక్ శాస్త్రి పేరడీలు. సంకలనకర్త కె. వి. రమణారెడ్డి, నవోదయ, 1982, మాచిరాజు దేవీప్రసాద్ పేరడీలు, సంపాదకుడు : బూదరాజు, శ్రీశ్రీ ప్రచురణలు, హైదరాబాదు, 1986].

వొంటిమీది చర్మం వొలిచి ఇస్తున్నట్టుగా ఇవ్వటం రామ్మూర్తిని మరింత బాధించింది. కాని దుఃఖపడ్డందు కతను ఆమెను తప్పు పట్టలేదు. నిజానికామె తన ఆస్తి పోయినప్పుడుకూడా వెక్కి వెక్కి ఏడ్చింది. తను మళ్ళీ ఏదో రీతిగా ఆర్జనలోపడి అంతో ఇంతో వెనక వెయ్యటం మొదలుపెడితేగాని, తాను చేసిన అత్యాచారం పరిహారం కావటం ప్రారంభంకాదనీ, తమ యిద్దరి మధ్యా ఏర్పడిన ఎడం పూడదనీ రామ్మూర్తి అనుకున్నాడు. [స్వప్రయోజకత్వంవల్ల ఆ పోయిన ఇరవై ఎకరాల పొలమూ తిరిగి సంపాదించాలనే గొంతెమ్మకోరిక రామ్మూర్తినీ చాలాకాలం వేధించింది.]

ఆస్తంతా పోవటమూ, భార్యను ఐశ్వర్యంలో ఉంచలేకపోవటమూ తన తప్పేనని రామ్మూర్తి ఎందుకు భావించాడో ఊహించటం కష్టం. కల్యాణి మాట వినక రామ్మూర్తిచేసిన దుర్వ్యయం ఏమీలేదు. ఆమె ఆర్థిక విషయాల్లో అతనికెప్పుడూ ఎటువంటి సలహాకూడా ఇవ్వలేదు— ఇచ్చే తాహత ఆమెకు లేదుకూడానూ. 'నీమూలంగానే ఆస్తిపోయింది' అని అతన్నెవరైనా అని ఉంటే, అతను ఆమోదించి ఉండేవాడుకాదు కూడానూ. అయినా, ఆస్తి పోగొట్టుకొన్నవాడు కావటమే అతనికి చాలా ద్రోహంగా తోచింది. ఈ చింత లోపల ఉంచుకున్నవాడై రామ్మూర్తి భార్య పట్ల మరింత జావ అయిపోయినాడు. కాని ఆ విషయం పైకి కనబరచటం అతనికి చాతకాలేదు. పైగా భార్యవిషయంలో అతని ప్రవర్తన పూర్వంకంటె ఉల్లాసం తగ్గినదయింది.

ఆస్తిపోవటంలో తాత్కాలికంగా కల్యాణిలో వచ్చినమార్పు, పట్నం రాగానే పోయింది. స్థలం మార్పువల్ల ఆమె గతాన్ని సులభంగా మరిచిపోగలిగింది. కాని తన వొంటిమీది నగలు మాత్రం ఆమెకు మరుపు రాలేదు. నిజమైన దారిద్ర్యం—తిండీ, బట్టా లేకపోవటమూ; వీటికోసరం మరొకరికి చాకిరి చెయ్యవలసి రావడమూ-కల్యాణి ఎరగదు. అందుచేత ఆవిడకు దారిద్ర్య ఫలితాలనుచూసి భయపడే అవకాశం కలగ లేదు. కాని తన ఒంటిమీద నగలు లేకపోవటంచూసి నలుగురూ, 'వీళ్ళకేమీ లేదుకాబోలు' అనుకుంటారని ఆమె కెక్కడలేని దిగులూనూ.

పట్నం వచ్చినతరవాత రామ్మూర్తిలో మరోరకం మార్పుకూడా వచ్చింది. ఆస్తిపోక పూర్వం రామ్మూర్తికి తన ఆర్థికస్థితినిగురించి అసంతృప్తి ఎన్నడూ కలగ లేదు. వాళ్ళ స్వగ్రామంలో ఇంతకన్న ఆస్తిపరులు లేకకాదు. అతని దగ్గిరవాళ్ళలోనూ లక్షాధికార్లున్నారు. ఐతే ఆ తేడాలు జీవిత విధానంలో ద్యోతకం కాలేదు. తినే తిండిలోనూ, కట్టే బట్టలోనూ, నాటకాలకు కొనే టిక్కెట్లలోనూ, చదివే పుస్తకాల్లోను, రామ్మూర్తి సులభంగా వాళ్ళతో పోటీ చెయ్యటమేగాక, నూటికి తొంభైసార్లు వాళ్ళనుమించి వెళ్ళగలిగేవాడు. "ఆస్తి పోతే పోయింది. జరిగినన్నాళ్ళూ ధర్జాగా సాగించుకున్నాడు" అని అతన్ని గురించి అన్నవాళ్ళున్నారు.

పట్నం వచ్చినతరువాత అతనికీ సంతృప్తి దక్కలేదు. ఇక్కడ ఎవరితో పోటీ చేస్తాడు? ఇక్కడ అతని పరిచయస్తులలో రెండు మూడు లక్షలతో వ్యాపారం చేస్తున్న వాళ్ళున్నారు. కార్లున్న వాళ్ళున్నారు. బట్టల దుకాణంలోకి పోయి తన నెల జీతంపెట్టి భార్యలకు అవలీలగా ఒక చీరె కొనిపెట్టే వాళ్ళున్నారు. పెద్ద బంగాళాల్లో నివసిస్తున్న వాళ్ళున్నారు. ఈ పట్నంలో తన జీతం తెచ్చుకునేవాళ్ళు దమ్మిడీల దగ్గర్నుంచీ ఆదా చెయ్యటానికి ప్రయత్నిస్తారని అతను గ్రహించాడు. వాళ్ళని తను అనుకరించక పోయినప్పటికీ వాళ్ళ జాగ్రత్త కొంతైనా అతని చేతికి ఖర్చుచేసే టప్పుడు అడ్డుతగలక పోలేదు. చేసేదేమీలేక రామ్మూర్తి ఈ స్థితిని ఆమోదించాడు. రామ్మూర్తికి స్వగ్రామంలో వర్ణవ్యవస్థ కనిపించినంత స్పష్టంగా, వర్గవ్యవస్థ కనిపించేదికాదు. ఇక్కడ అది కనిపించసాగింది. కాని రామ్మూర్తికి విషయం ఇంత స్పష్టంగా తెలిసిరాలేదు.

వర్ణవ్యవస్థ నిశ్చేతనమైనది. వర్గవ్యవస్థ అటువంటిది కాదు. రెండేళ్ళ క్రితం ముప్పై రూపాయల ఉద్యోగం కోసం వచ్చి, ఇవాళ నెలకు అయిదువందలు సంపాదిస్తూ కార్లెక్కి గోల్డుఫ్లేకు టిన్నులుపట్టుకు తిరుగుతున్న వాళ్ళున్నారని రామ్మూర్తికి తెలుసు. మరో ఆర్నెల్లకు తన క్కూడా వాహనయోగం పడుతుందనీ, గోల్డుఫ్లేకు టిన్నులు[1] పట్టుకు తిరుగుతాడనీ రామ్మూర్తి కలలో కూడా అనుకోలేదు.

# 5

ఒక విధంగా దీనికంతకీ కారకుడు డా వెంకటేశ్వర్లు. చాలా చిత్రమైన వ్యక్తి వెంకటేశ్వర్లు. చూట్టానికి ఇరవై, ఇరవై రెండేళ్ళ వాడల్లే ఉండేవాడు. కాని ముప్పై నిండినై. పొట్టిగా, సన్నగా, గిడసగా ఉండేవాడు. పిల్లి గడ్డం, పల్చని మీసాలు, రెండూ గొరుక్కుంటే బ్రహ్మదేవుడి క్కూడా అతని వయస్సు తెలిసేదికాదు. మనిషి ఆకారానికి తగ్గట్టే సంభాషణా, బుద్ధులూనూ, ప్రపంచజ్ఞానం తెలీనివాడల్లేనూ, దుర్మార్గుల వాతపడ్డ వాడల్లేనూ మాట్లాడేవాడు. పద్యాలు రాసేవాడు, కథలు రాసేవాడు, బొమ్మలు గీసేవాడు. సంగీతం పాడగలనని చెప్పేవాడు; కొన్నాళ్ళు నాటకం కంపెనీలకు హార్మోనిస్టుగా ఉన్నట్టు చెప్పాడు. గడియారాలు రిపేరు చేసేవాడు. ఎంత కొత్త వాడితోనైనా ఆ బాల్య స్నేహం ఉన్నట్టు మాట్టాడేసేవాడు. ఎప్పుడైనా సాయంకాలంపూటవచ్చి కలావాణి ఆఫీసులో కూచుని బాతాఖాని కొడుతూండేవాడు.

మొదట్లో వెంకటేశ్వర్లును చూసి రామ్మూర్తి అనుమానించాడు. అంత పూసుకు తిరిగే వాళ్ళను చూస్తే రామ్మూర్తి కనుమానం. అదీకాక తనతో ఏంపనో రామ్మూర్తికి

1. గోల్డుఫ్లేకు టిన్నులు : 50 దశకం వరకూ కొన్ని మంచి సిగరెట్లు టిన్నుల్లో వచ్చేవి. గోల్డుఫ్లేకు సిగరెట్లు టిన్నులు ప్రస్తావన ఇది.

అర్థంకాలేదు. డబ్బుకోసం వస్తున్నాడేమో అనుకున్నాడు. అది కాదని తేలిపోయింది. అతనెక్కడో ఒక పత్రికలో పనిచేసుకుంటున్నాడు. ఓ యాభై తెచ్చుకుంటున్నాడు. సిగిరెట్లు తప్ప అతనికి చెప్పుకోదగ్గ ఖర్చేమీలేదు. ఆరు రూపాయలు గది అద్దె, పది రూపాయలు హోటలు ఖర్చు, మూడు రూపాయలు ట్రామ్ పాసూ-బస్, ఇంకే ఖర్చూలేదు. ఒక బ్లేడు కొంటే మూడు నెల్లొస్తుంది. మట్టిరంగు ఖద్దరు బట్టలు స్వయంగా ఉతుక్కుని కట్టుకునేవాడు. అవయినా రెండే జతలు.

వెంకటేశ్వర్లుకు తన ఉద్యోగం నచ్చలేదు. కాస్తయినా గౌరవం లేదు. ఏమాత్రం కోపం వచ్చినా ఇంట్లో నౌకరును చూసినట్టు చూస్తారు. నోటికొచ్చిన మాటల్లా అంటారు. వాళ్ళకి మనిషితో పనిలేకపోతే గౌరవంగా నోటీసిచ్చి పంపెయ్యరు. "ఎందుకయ్యా, నువు మా ఆఫీసులో ? నిన్నెందుకు పెట్టుకున్నట్టూ ?" అని వెధవ అత్తగారు కోడల్ని అనే మాటలన్నీ అంటారు.

"ఇటువంటి బైతులు పత్రికలు నడిపి కళోద్ధారకులూ, నాబోటి దరిద్రులకు అన్నదాతలూ అయినారు !" అన్నాడు వెంకటేశ్వర్లు.

"అంత ఇష్టంలేని నౌకరీ మానుకోరాదా ?" అన్నాడు రామ్మూర్తి. తన యజమానుల నీచ ప్రవర్తనచూసి అసహ్యపడే సంస్కారమే ఉంటే వెంకటేశ్వర్లా ఉద్యోగం ఎందుకు మానుకోడని రామ్మూర్తి సందేహం. వెంకటేశ్వర్లు తన దగ్గిరలేని సౌకుమార్యం ప్రకటిస్తున్నాడేమోనని అనుమానం.

"మానుకుని ఏంచెయ్యాలి? ముక్తి గడిచేదెట్లా? ఇప్పటికి అరడజను ఉద్యోగాలు చేశాను. మన సంస్కారానికి తగవని భ్రమపడి కొన్ని ఉద్యోగాలు నన్ను వెతుక్కుంటూ వస్తే తన్నేశాను కూడానూ. పొరపాటు చేశానేమోనని ఇప్పుడనుకుంటున్నాను. అవి చేసుకున్నా హాయిగా ఇంత వెనకేసుకునేవాణ్ణి. ఈ ఉద్యోగం చేస్తున్నానేగాని ఏముంది ? మనకు ముందునకుంజూడ వెనుకసున్న ! ఏ రోజు మావారు నన్ను వెళ్ళగొడితే ఆరోజు నేను వీధిలో నిలబడి కాఫీకి అర్ధణా ముష్టెత్తాలి." అన్నాడు వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్ల అభిప్రాయాలతో రామ్మూర్తి ఏకీభవించలేదు. అతని బద్ధకమే గాని గౌరవయుతంగా బతికే మార్గాలు ప్రపంచంలో బోలెడుండి ఉండాలి. ఉద్యోగాలలో మర్యాద లేకుండా పోవటానికి కారణం, మర్యాద మీద నిలబడకుండా ఉద్యోగాలు చెయ్యటానికి తయారయ్యేవాళ్ళే. ఒకప్పుడు తాను ప్రతి ఉద్యోగమూ కూలిపనే అనుకుని ఉండిన సంగతి రామ్మూర్తి మరిచాడు జీవితం - అందరి జీవితమూ- క్రమంగా ధనిక వర్గంయొక్క అధీనంలోకి వెళ్ళిపోతున్నదనిగాని డబ్బుకూ సంస్కారానికీ అవినాభావ సంబంధమేమీ లేదనిగాని రామ్మూర్తి గ్రహించలేదు. ఈ విషయాలు తాత్వికంగా కాకపోయినా అనుభవపూర్వకంగా వెంకటేశ్వర్లెరుగును. రామ్మూర్తి తన అనుభవాన్నిబట్టే అందరి అభిప్రాయాలనూ కొలవటం ఇంకా మానలేదు. అసహాయ స్థితిలో ఉన్న వెంకటేశ్వర్లును చూసి సానుభూతి

పడటానికి బదులు, రామ్మూర్తి కొంత తృణీకారభావంతో, అసమర్థుణ్ణి చూసినట్టు చూశాడు.

కాని ఈ అసమర్థుడైన వెంకటేశ్వర్లే రామ్మూర్తిని వర్గ సోపానాలలో ఒకటి రెండు మెట్లు పైకి తోశాడు. ఒకనాడు సాయంకాలం వెంకటేశ్వర్లు రామ్మూర్తి దగ్గరకు వచ్చి "అయ్యా, ఇవాళ ఈ ధన్యుడు మీకు కాఫీ పోయించబోతున్నాడు" అన్నాడు. అతను ఉద్యోగం వొదిలేసినట్టు చెప్పాడు. లేనిపోని పిచ్చి అభిప్రాయాలు పెట్టుకుని, చేస్తూన్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చినందుకు రామ్మూర్తికి వెంకటేశ్వర్లును చూసి జాలీ వేసింది. అందుకుగాను విచారించటానికి బదులు ఉబ్బి తబ్బిబ్బవుతున్నందుకు చిరాకూ వచ్చింది.

"అయ్యయ్యో, అంత తొందరఎందుకు పడ్డావ్? మళ్ళీ ఇంకోటి చూసుకొని మరీవొదిలెయ్యలేక పోయినావా?" అన్నాడు రామ్మూర్తి. వెంకటేశ్వర్లు బతకనేర్చిన వాడనీ, ఒకరి సిఫార్సు అవసరం లేకుండా అతను ఎంతోకాలం నుంచీ తన్ను తాను పోషించుకుంటున్నాడని రామ్మూర్తి మరిచాడు. తనమటుకు తాను ఈ ఉద్యోగం లేకపోతే మరుక్షణం ఏం చెయ్యాలో తెలీదు. తనస్థితే ఇట్లా ఉంటే ఇక వెంకటేశ్వర్లు స్థితి ఎంత హీనంగా ఉంటుందో అనుకున్నాడు.

"ఇంకో ఉద్యోగం చూశానే !" అన్నాడు వెంకటేశ్వర్లు. "నాటక కంపెనీ ఒకటి పెడుతున్నా".

"ఎవరది?" అన్నాడు రామ్మూర్తి ఆశ్చర్యంతో.

"ఇంకెవరు ? నేనే! డబ్బు మరో ఆయన పెడుతున్నాడు. వెయ్యి రూపాయలు పెట్టుబడి పెడితే ఆరునెల్లకల్లా పెట్టుబడి తిరిగి వస్తుందని నమ్మించా ? 'సరే' నన్నాడు ఇవాళె వెయ్యి రూపాయలూ బాంకులో మా ఇద్దరిపేరా జాయింటుగా వేయించా!.... అట్లా కాఫీ ఆలయానికి రండి, సంగతంతా చెబుతా, మీతో కూడ పని ఉంది మరి." అన్నాడు వెంకటేశ్వర్లు.

ఇద్దరూ చైనాబజారుకేసి వచ్చి ఒక కాఫీ హోటల్లో ప్రవేశించారు. రెండు కప్పులు కాఫీ తెప్పించాడు వెంకటేశ్వర్లు. సిగిరెట్టు పెట్టె తీసి బల్లమీద పెట్టాడు.

"ప్రస్తుతం గయోపాఖ్యానం[1] ప్రాక్టీసు చేస్తాం. ఎందుచేతనంటే నా దృష్టిలో ఇద్దరాడవాళ్ళున్నారు గాని, వాళ్ళు కాస్త నలిగితే తప్ప రంగు బయటికిరాదు. ముఖ్యంగా మావూరి వెంకటసుబ్బిమీద నా ఆశలన్నీ పెట్టుకున్నా. చక్కగా పాడుతుంది. కాని పెడకట్టెముండ. స్టేజీ ఎక్కి అది ఏం చేస్తుందో కూడా చెప్పలేం" అన్నాడు వెంకటేశ్వర్లు.

---

1. గయోపాఖ్యానం: పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865–1910) రాసిన ప్రఖ్యాత పౌరాణిక నాటకం.

"ఆడవాళ్ళు ఆడవేషాలు వెయ్యటంలో నాకు విశ్వాసం లేదు. నేను వెనక స్థానంతో[1] ఈ మాటే అన్నాను. రాఘవాచార్లు[2] గారు మహానుభావులు, వారికి విరుద్ధంగా చెప్పటానికి నేను తగనిమాట నిజమేగాని, ఏ ఆడది స్టేజి ఎక్కి మీ మాదిరిగా పాత్ర నిర్వహణం చేస్తుంది ? అని అడిగాను. స్థానం నవ్వి ఊరుకున్నాడు." అన్నాడు రామ్మూర్తి.

"బాబోయ్, మీరు అసలుకే ఎసరు పెట్టకండి. ఈ ఇద్దరాడంగులూ ఉంటే కొంత ఆర్థికంగా లాభిస్తుందని నా ఏడుపు ! అదీగాక రాఘవాచార్యులు గారి అభిప్రాయాన్ని కొట్టెయ్యటానికి వీల్లేదు. ఒక్కనాడు అకస్మాత్తుగా ఆడదాని స్టేజి ఎక్కిస్తే ఏంచేస్తుందా ? ఎంతమంది మగవాళ్ళలోనుంచి ఒక స్థానం వారొచ్చారూ? రాఘవాచార్లుగారి మాదిరిగా చెయ్యలేంగదా అని మిగిలిన వాళ్ళంతా మానుకుంటారా?"

"సరే నీ యిష్టం !" అన్నాడు రామ్మూర్తి.

"అట్లా నా ఖర్మానికి నన్ను వొదిలేస్తే కాదు. నేను మరో సంవత్సరానికైనా నా ట్రూపుతో పట్నంవచ్చి, ఇక్కడ ఒక నాటకం ఆడి, మా బాస్‌కు కాంప్లిమెంటరీ టిక్కెట్టు పంపుతానుగాని విడిచిపెడతానా ? అయితే మీరు నాకు చెయ్యవలసిన ఉపకారం ఏమిటంటే, ఒక చక్కని నాటకం రాసిపెట్టండి — చక్కని సాంఘిక నాటకం. నాకు పెద్ద బ్రహ్మాండమైన కథావస్తువు అక్కర్లేదు. అందరికీ తెలిసిన సామాన్య విషయమే తీసుకోండి. మామూలు సంభాషణలతో నాటకం నడపండి. మిగతాది నేను చూస్తాను. ఈ గయోపాఖ్యానం మూడునెల్లపైన ఆడనులెండి. ఈ లోపుగా ఆ వెయ్యీ వచ్చేస్తే డబ్బుపెట్టే వాడి బెదురు తీరుతుంది. ఆ తరవాత నష్టం రాకుండా మనం ఖర్చుక్రింద ఎంత లాగేసినా అతను కాదనడు. అందుచేత నాటక కర్తకి మంచి లాభమే గిట్టుబాటయ్యేట్టు చేతామని చూస్తున్నాను ... అన్నట్టు నాటకంలో పద్యాలు పెట్టకండి. నాకో కొత్త ఐడియా కలిగింది - పాట

---

1. స్థానం : చూడండి వెనుక వచ్చిన ప్రస్తావన.
2. రాఘవాచార్లు : తాడిపత్రి రాఘవాచార్యులు ; బళ్ళారి రాఘవ, అసలు పేరు బసప్ప (1880-1946). భారతదేశ అగ్రరంగస్థల నటుల్లో ఒకరు. తొలి టాకీల్లో నటించిన చలనచిత్ర నటుడు. శశికుమార్ భాదురి, రవీంద్రనాథ్ టాగూర్, బాలగంధర్వ, గుబ్బి వీరన్న మొదలైన ఆంధ్రేతర కళాకారుల ప్రశంసలు పొందిన రంగస్థల నటుడు. షేక్స్‌పియర్ నాటకాల్లో ముఖ్య పాత్రధారణచేసి ఆంగ్ల నటులనే ఆశ్చర్యపరిచిన కళాకారుడు. షేక్స్‌పియర్ క్లబ్, అమెచ్యూర్ డ్రమటిక్ అసోసియేషన్ వంటి సంస్థలు స్థాపించి నటనలో శిక్షణ ఇప్పించారు. వచన నాటక కర్తకూడా.

లతో కొట్టేదామని. పద్యాలు చదవమంటే అద్దంకి,[1] రామనాథశాస్త్రి,[2] స్థానం[3] వీళ్ళతో పోలిస్తే మానాసి వెధవ లెక్కడ నిలబడతారు ?.... నాటకం సంగతి మరచిపోరు కాదూ ?"

రామ్మూర్తి ప్రకృతిలో గమనించదగ్గ విషయం ఏమంటే అతను తనకు నాటకాలు రాయటంలో అనుభవం లేదని కాని, మరెవరిచేతనన్నా రాయించుకోమని కాని, వెంకటేశ్వర్లు పెట్టబోయే నాటకసమాజంలో తనకు విశ్వాసంలేదని కాని పైకి అనలేదు. అట్లాగే లెమ్మన్నాడు.

కాఫీతాగటం అయినాక సిగరెట్టొకటి తీసుకోమని వెంకటేశ్వర్లు ప్రేరేపించాడు. రామ్మూర్తి తన కభ్యాసం లేదన్నాడు.

"అదేమిటి మేష్టారూ ? నేను చెడ్డవాణ్ణినా ? నా కంపెనీకి విజయం కోసరం ఒక్కటి అంటించి పారేతురూ ! లేకపోతే దుశ్శకునంగా ఉంటుందీ ! కవులు సిగరెట్టు కాల్చకపోవట మేమిటండీ? అనుభవంలో అందరికన్నా ముందుండవలసిన వాళ్ళు కదా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

ఎప్పుడో ఎవరో అన్నమ్మక్కలు జ్ఞాపకంవచ్చి నవ్వుతూ, రామ్మూర్తి సిగరెట్టు తీసుకుని వెలిగించి పీల్చాడు. గొంతంతా మండింది. ఊపిరి సలపలేదు. దగ్గొచ్చింది, మొకంకంది జేవురించింది.

"ఛీ, ఛీ !" అన్నాడు రామ్మూర్తి.

"ఎందులో అయినా మజా ఒక్కసారిగా బోధపడదు మేష్టారూ ! నాటకం మటుకు ఇవాళనుంచే మొదలుపెట్టండేం ?" అంటూ వెంకటేశ్వర్లు దోవ పుచ్చుకున్నాడు.

కొంతదూరం వెళ్ళి చూసుకుంటే కొంచెం కాల్చిన సిగరెట్టింకా చేతిలోనే ఉంది. రామ్మూర్తి దాన్ని పారెయ్యనే లేదు. రోడ్డు మీద నిలబడి భయపడుతూ సన్నగా మళ్ళీ పీల్చి చూశాడు. అతని వెనకగా ఎవరో ఇద్దరు కుర్రాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళారు. తనని చూసే ననుకున్నాడు. కోపం వచ్చింది. మరింత గట్టిగా పీల్చాడు. నోరంతా అసహ్యం వేసింది.

---

1. అద్దంకి : శ్రీరామమూర్తి (1898 – ) సుప్రసిద్ధ రంగస్థల నటుడు, చలనచిత్ర నటుడు, 1935 లో వచ్చిన హరిశ్చంద్ర చిత్రంలో హరిశ్చంద్ర పాత్రధారి.
2. రామనాథశాస్త్రి ( ? - 1935) కపిలవాయి రామనాథశాస్త్రి రంగ స్థల నటుడు. చలన చిత్ర నటుడు. 1935 లో వచ్చిన శ్రీకృష్ణతులాభారం చిత్రంలో శ్రీకృష్ణుడుగా నటించారు. గొప్ప గాయకుడు. చాలా గ్రామఫోను రికార్డులు ఇచ్చారు.
3. స్థానం : చూడండి వెనక వచ్చిన ప్రస్తావన.

"ఇందులో ఏదో ఆనందం ఉండే ఉండాలి. లేకపోతే ఇన్ని లక్షల మంది ఎట్లా కాలుస్తారు ! మరొకరు కాలుస్తుంటే బాగున్నట్టే ఉంటుంది. చిత్రం" అనుకుంటూ రామ్మూర్తి ట్రిప్లికేను బస్సు పట్టుకున్నాడు.

బస్సు కండక్టరు రామ్మూర్తిని సిగిరెట్టు పారెయ్యమని హెచ్చరించాడు. రామ్మూర్తి బస్సులో కూచుని ఇంటికి వెళ్ళుతూ, "వాళ్ళుచూసి నవ్వింది నన్ను కాకపోవచ్చు." అనుకున్నాడు. ఆలోచించినకొద్దీ ఈ భావం బలపడింది.

ఇంటికి వెళ్ళగానే కల్యాణి దగ్గరికొచ్చి మొహానికి మొహం చేర్చుతూ, "ఏమిటీ వాసన" అని అడిగింది.

"ఎవరో అతను కాఫీ పోయించి సిగిరెట్టిచ్చి కాల్చమని బలవంతం చేశాడు."

"ఎందుకండీ పాడలవాటూ ? ఎన్నడూలేదూ !" అన్నది కల్యాణి.

"ఒక్క సిగిరెట్టుకే అలవాటవుతుందా? పైగా చాలారోతగా ఉంది. అవి ఎట్లా అలవాటు చేసుకుంటారో జనం?" అన్నాడు రామ్మూర్తి.

"ఎవరీ పాడుస్నేహితుడు?" అన్నది కల్యాణి.

"పాడుస్నేహితుడేం? మంచివాడే. నాటకకంపెనీ పెట్టాడు. నన్నోనాటకం కూడా రాయమన్నాడు. బాగా డబ్బుముట్టచెబుతా నన్నాడు."

"చివరికి నాటకాలవాళ్ళతోనా స్నేహం? ఇతనేమన్నా స్థానం మాదిరిగా గొప్ప నటుడా?"

"ఇతను హార్మొనిస్టనుకుంటా !"

"బాగుంది ! చాల్లెండి, కాకపోయినా, మీరు నాటకం రాయటమేమిటీ?"

"ఏం, బ్రహ్మవిద్యా? " అన్నాడు రామ్మూర్తి ఆశ్చర్యంతో, తన పరువంతా పోయినట్టుగా.

"మీకు చాతవుతుందీ? అన్నది కల్యాణి, తప్పుచేశానని కనుక్కుని.

"మా చక్కగా చాతవుతుంది. అసలు నాటకాలు రాయవలసింది నాబోటిగాళ్ళే. మరీ తుక్కు వెధవలంతా నాటకాలు రాసేసి తగలేస్తున్నారు."

కాని రామ్మూర్తి నాటకం రాయటానికి ఉపక్రమించనే లేదు. అసలు దాన్ని గురించి అతను ఆలోచించనుకూడా లేదు. ఆఖరుకు వెంకటేశ్వర్లు గొడవకూడా మరిచిపోయినాడు.

రెండునెల్లు గడిచింది. ఓ రోజు సాయంకాలం ఆంధ్రపత్రిక[1] కొని పేజీలు తిప్పుతూ ఉండగా ఒక నాటక ప్రదర్శనం మీద పరామర్శ పడింది. ఆ నాటకం

---

1. ఆంధ్రపత్రిక : కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు 1908 సెప్టెంబరు 9 ప్రారంభించిన వారపత్రిక. బొంబాయినుంచి వెలువడినది. 1914 నుంచి దినపత్రికగా మారి మద్రాసు నుంచి వెలువడింది. ఆంధ్రోద్యమ, జాతీయోద్యమాలకు తోడ్పడిన పత్రిక.

గయోపాఖ్యానమని తెలిసినాకూడా వెంకటేశ్వర్లు జ్ఞాపకం రాలేదు. అందులో సుభద్రపాత్ర ధరించిన సుభద్రాదేవి బ్లాకు పడింది. అదిచూసి రామ్మూర్తి, 'మేని షైనా బాగాలేదు' అనుకున్నాడు. బస్సులో ఎక్కి ఇంటికి వెళుతుండగా స్ఫురణకు వచ్చింది. ఈ కంపెనీ వెంకటేశ్వర్లుదే అయి ఉండాలని. నాటకం చాలా బాగుం దని రాశారు పత్రికలో. నిజంగానే బాగుందో, లేక వెంకటేశ్వర్లు అట్లా రాయిం చాడో?

మర్నాడు వెంకటేశ్వర్లు దగ్గిర్నించి కార్డు వచ్చింది.

'మేష్టారూ ! 25 తేదీకి పట్నం వస్తున్నాను. వెయ్యా వచ్చేసినై. మీ నాటకం పూర్తి అయిందా ? వెంకటేశ్వర్లు.'

రామ్మూర్తి ఉత్తరంకేసి నమ్మలేనివాడల్లే చూడసాగాడు.

# 6

ఇరవైఐదో తేదీన వెంకటేశ్వర్లు తన ఆఫీసులో ప్రత్యక్షమయ్యేనాటికి రామ్మూర్తి నాటక రచనలో ఎంతదాకా వచ్చాడంటే తన పాతకథల్లో రెండోదీ ఉత్తమమయినదీ అయిన 'ప్రాయశ్చిత్తం' నాటకరూపంలో దింపుదామనే నిర్ణయా నికి వచ్చాడు.

ఆ కథ ఉన్నదున్నట్టే తీసుకోవటమా, కొద్దిమార్పు చేయటమా అని సందేహం వచ్చింది. డాక్టరు చేతిలో రోగి చనిపోయినట్టూ, డాక్టరు అతని భార్యను పెళ్ళాడి నట్టూ చేస్తే బాగుంటుందేమో ననిపించింది. ఐతే డాక్టరు భార్య ఏంకానూ? ఆవిణ్ణి కూడా ఏ క్షయవ్యాధితోనో చంపేస్తే? ఎందుకు పాపం ! డాక్టరు రెండో పెళ్ళి చేసుకోటానికి ఆవిడ ఆమోదించినట్లు చేస్తే బాగుండదూ? ఈ సమస్యలన్నీ తాపీగా కూర్చుని ఆలోచిస్తేతప్ప తేలవు. అన్నట్టు ప్రాయశ్చిత్తమనే పేరుకూడా మార్చ వలసి ఉంటుంది-అంటే, ఈ మార్పులన్నీ నిజంగా చెయ్యదలిస్తే మాట !

ఈ సమస్య లేవీ తేలకమునుపే వెంకటేశ్వర్లు వచ్చి కూర్చున్నాడు.

"ఏం మేష్టారూ ? ఏదీ నాటకం? "

"ఇంకా రాయలే" దన్నాడు రామ్మూర్తి నవ్వుతూ.

"సిగిరెట్టుమీద ప్రమాణం చేయిస్తినే? ఇంత ద్రోహమా?"

"సిగిరెట్టుమీద ప్రమాణంచేసి తప్పటానికి నా అంతరాత్మ ఒప్పుకుంటుంది."

"మీకు సిగిరెట్టుమీద గురి కుదరకపోతే మధ్య నేను హతమారిపోతానే. ఇదుగో సిగరెట్టొకటి తగిలించండి. ఈ విషయం ఏమిటో ఇప్పుడే తేల్చుకుందాం."

ఇద్దరూ సిగిరెట్లు వెలిగించారు. రామ్మూర్తికిది రెండో సిగిరెట్టు కాదు. అతనిలో ఏదో వైపరీత్యం వుంది. ఆలోచించనంత కాలమూ అది అతన్ని ఆకర్షించ లేక పోయింది. కాని దాన్ని చూసి అసహ్యపడటం కలిగేసరికి అది ఆకర్షణ ఆయి

పోచుంది. ఈ రెండు సిగిరెట్లమధ్యా రామ్మూర్తి రమారమి రెండుపెట్టెల సిగిరెట్లు, రోజుకు ఒకటిమించకుండా కాల్చాడు.

"మీ నాటకానికి ఏకంగా ఓ అయిదువందలు పుచ్చుకుంటారా ? లేక నాటకానికి పది చొప్పున పుచ్చుకుంటారా ? అట్లానూ కాకపోతే నా లాభాల్లో రూపాయికి అణా భాగం పుచ్చుకుంటారా ? మూడో పద్ధతి మీ నాటకాలు ఆడినప్పుడు మటుకే. నాకు మీరు ఏడాదికి రెండు నాటకాలు రాసి ఇవ్వండి, పుచ్చుకుంటాను. పైన నావల్ల కాదేమోగాని; ఏదోటి చెప్పెయ్యండి" అని వెంకటేశ్వర్లు తొందర చేశాడు.

నాటకం పూర్తిచేసిగాని ఏదీ చర్చించనన్నాడు రామ్మూర్తి. కాని సంవత్సరానికి వెయ్యి రూపాయల ఆదాయం అతన్ని మహాబలవత్తరంగా ఆకర్షిస్తున్నది. మరోవంక వెంకటేశ్వర్లును నమ్మలేకుండా వున్నాడు. తీరా రాసిన తర్వాత అతనికి నచ్చకపోతే ? అందుకనే ముందుగా షరతులన్నీ పెట్టుకుని లాభంలేదు.

"ఏమిటి విశేషాలు ? ఎన్ని నాటకాలు పడినై ? డబ్బేవిధంగా వచ్చింది ?" అన్నాడు రామ్మూర్తి సరదాగా.

"నెలరోజులు రిహార్సల్సుతో సరిపోయింది. డజను నాటకాలాడాం. సొంతాన ఆడిన వాటికి నూరుపైన లాభం కనిపించలా. అందుకని నూరేసి రూపాయలకు కంట్రాక్టు పారేశా. ఖర్చులు వాళ్ళే పెట్టుకునేట్టు. ఎంత ఖర్చల్లెంది. అంతా కలిసి ఆరుగురం, కంట్రాక్టులు తీసుకున్నవాళ్ళు బాగా డబ్బుచేశారు. ఆడముండలంటే, ఏమన్నా చెప్పండి, ఆకర్షణే."

"బాగుంది" అన్నాడు రామ్మూర్తి.

"రేపు మెయిల్లో దిగుతారు జట్టు. 28 కి ఇక్కడ నాటకం పెట్టిస్తున్నా. లాభం రాకపోతే పీడాపాయిరి. ఇక్కడ మంచి పబ్లిసిటీ జరిగితే, తరవాత ఎంత లాభమన్నా వస్తుంది. కంట్రాక్టుకిచ్చినా ఆటకు నూరు టంగున రాలుతై.... మరేం లేదుగాని, మరీ ఒక్క నాటకమే అయిపోయింది మేష్టారూ ! నాలుగైదు నాటకాలుంటే చెడుగుడు ఆడిద్దును. దేశమంతటా చక్కగా పాడే కుర్రాళ్ళున్నారు. తీసుకొని ఊరికే మేపాలిసిందేగా ?" అన్నాడు వెంకటేశ్వర్లు.

అతని మాట ధోరణి దగ్గిర్నుంచి మారినట్టు రామ్మూర్తి కనిపెట్టాడు. పెద్ద పెద్ద నాట్య కళారాధకుల మాటల్లోవుండే వుదాత్తత వెంకటేశ్వర్లు ధోరణిలోలేదు. ఇదంతా డబ్బు లెక్కపెట్టుకోవటమూ, దేశాన్ని కొల్లగొట్టుకోవటమూగా కనపడ్డది. వీడికోసం నాటకం రాయటమంటేనే ఒక విముఖత్వం కలగసాగింది. కాని రాయటం మానరాదు. రాసి అంతగా అయితే ఏ స్థానం వారి చేతిలోనో రాఘవాచార్లుగారి చేతిలోనో పెట్టవచ్చు. పెద్ద పెద్ద నటకులు తన బోటి రచయితలమీద ఆధారపడరనీ, ముందు రాబోయే నాటకకర్తలకి పోషకులు వెంకటేశ్వర్లు కన్న కూడా హీనంగా వుంటారనీ రామ్మూర్తి తెలుసుకోలేదు.

వెంకటేశ్వర్లుకు టూకీగా ప్రాయశ్చిత్తంకథ చెప్పాడు రామ్మూర్తి. వెంకటేశ్వర్లు పొంగిపోయినాడు. రోగి పెళ్ళాం వేషానికి సుబ్బి పనికొస్తుందన్నాడు. వెంకటేశ్వర్లు సుబ్బిని కొంచెం సేపు మెచ్చుకున్నాడు. దానికి స్వతహాగా బుర్రలేకపోయినా అందిస్తే బాగా పట్టుకుంటుందన్నాడు. రిహార్సలులో ఒక్కసారి సరిగా చేసిందంటే ఏ వేళప్పుడడిగినా ప్లేటు దించేస్తుందన్నాడు. అది సుబ్బిలో మహత్తు. సుబ్బి అంటే సుభద్ర. ఆ వేషం వేసింది గనక అదే సార్థక నామం అయిపోయింది.

"రేపు మా బృందాన్ని మీ ఇంటికితెస్తా" అన్నాడు వెంకటేశ్వర్లు.

"కథలో కొన్ని మార్పులు చేద్దామనుకుంటున్నాను" అన్నాడు రామ్మూర్తి.

"ఏ కథలో ? ఓహో, ప్రాయశ్చిత్తంలోనా ? ఏం మార్పులూ ?"

రామ్మూర్తి చెప్పాడు. వెంకటేశ్వర్లు గోలెత్తాడు. ఏమీ మార్పులు వొద్దన్నాడు. డాక్టరు దగ్గిరికి రోగి పెళ్ళాన్ని మరోసారి తెప్పించి, అక్కడ ఒక దీర్ఘమైన స్పీచ్ చెప్పించి, ఆ డిస్పెన్సరీలోనే ఉన్న విషం ఏదో తిని చచ్చిపోయినట్టు పెట్టమన్నాడు. 'డాక్టరు విరుగు డివ్వడా' అన్నాడు రామ్మూర్తి. 'ఇంకా విరుగుడేమిటి, అది విరుచుకు పడి గుడ్లు తేలేస్తే'నన్నాడు వెంకటేశ్వర్లు. 'డాక్టరుమీద క్రిమినల్ చార్జివొస్తుందేమో' నన్నాడు రామ్మూర్తి. 'లేనిపోనివన్నీ తీసుకురాబోకు. ఎవడు చూడొచ్చా'డన్నాడు వెంకటేశ్వర్లు.

నాటకం ఉన్నదున్నట్టుగా రాయడానికి తీర్మానమయింది. అసలు పేరే ఎంతో బాగుందన్నాడు వెంకటేశ్వర్లు.

మర్నాడు ఆదివారం. మధ్యాహ్నం రెండుగంటలప్పుడు మందను వెంట పెట్టుకుని వెంకటేశ్వర్లు ట్రిప్లికేనులో రామ్మూర్తిగారింటికి వచ్చాడు.

వెంకటేశ్వర్లు వెంట ముగ్గురుమొగవాళ్లూ ఒక ఆడదీ వచ్చారు. మరో ఆడ మనిషి ఇద్దరు మొగవాళ్ళూ పట్నంచూడటానికి వెళ్ళారుట. వచ్చిన మొహాలలో ఒక్క మొహానా దీపారాధన కనిపించలేదు. వీళ్ళు వ్యక్తులుగా ఏనాటికైనా గొప్పనటులవుతారనేది చాలా అనుమానాస్పదంగా కనిపించింది. వీళ్లేం నాటకాలాడారో, వాటికి తబ్బెట్లా వచ్చిందో రామ్మూర్తి ఊహించుకోలేకపోయినాడు. దేశంలో ఉన్న ప్రఖ్యాత నటులతో వీళ్ళెట్లా పోటీ చేస్తారు? దొరక్క దొరక్క తనకీ బృందం దొరికిందేమి[illegible]

అందర్నీ రామ్మూర్తికి పరిచయంచేశాడు వెంకటేశ్వర్లు. అందరూ తనకేసి భయంగా చూశారు — హెడ్మాస్టరు ముందు పిల్లలల్లే.

రామ్మూర్తిని కూడా వాళ్ళకు పరిచయం చేశాడు వెంకటేశ్వర్లు.

"ఈయనే రామ్మూర్తిగారు. గొప్ప పత్రికా సంపాదకుడు. ఈయన మనల్ని గురించి రెండు ముక్కలు పత్రికల్లో రాశారంటే వేలకు వేలమంది చదువుతరు. దేశం మొత్తంమీద ఈయన ఎరగని కవిగాని నటకుడుగాని లేదన్నమాట."

వెంకటేశ్వర్లు తమతో అట్లా మాట్లాడుతుంటే వాళ్ళు అతని మీదపడి కొట్టలేదు. ప్రపంచంలో ఇంత మేకలుంటారని రామ్మూర్తి ఎప్పుడూ అనుకోలేదు. తన చిన్నతనంలో ఇటువంటి మేకల్ని అలగా జనంకింద చూసేవాళ్ళు. వాళ్ళకోసం వేరే భాష మాట్లాడేవాళ్ళు. ఆ అలగా జనం సంస్కారంలేని కూలి పని మాత్రమే చేసేవాళ్ళు. ఈనాడా తరగతి కళా ప్రదర్శనాలలోకి వచ్చిందా ? రామ్మూర్తి నమ్మలేకపోయినాడు.

ప్రపంచంలో జరుగుతున్న ఈ మార్పును గురించి రామ్మూర్తి ఆశ్చర్యపడటంతోనే సరిపోయింది. అందుచేత ఈ మార్పుయొక్క అంతరార్థం అతనికి అర్థమయ్యే అవకాశం లేకపోయింది.

అకస్మాత్తుగా చెవిలో కాకి అరిచినట్టయింది. ఉన్నట్టుండి ఆడకూతురుకాస్తా నోరు చేసుకుంది.

"మనకు నాటకం రాస్తావుందీరేనా ?"

రామ్మూర్తికి చెంపదెబ్బ తగిలినట్టయింది. అతను పత్రికలో చూసిన సుభద్రను గుర్తుపట్టలేదు. ఎంత సాత్వికుడైనా ఆ క్షణాన అతని కాగ్రహం వచ్చింది. "నీ మొహానికి నేను నాటకం రాస్తున్నానా ? ఎవరు చెప్పారు?" అని గట్టిగా అరుద్దామనుకున్నాడు.

భావిలోకి చూడటం అందరికీ అలవాటుంటుంది. అట్లాగే రామ్మూర్తి పనిలేని సమయాల్లో సంపాదక కుర్చీలో కూర్చుని, తన నాటకం ప్రదర్శన మవుతున్నట్టు పగటి కలలు కన్నాడు. స్టేజిమీద తన సంభాషణలు ఉచ్చరిస్తున్న వారు సాక్షాత్తూ మాధవపెద్ది,[1] స్థానం[2] కారుకాని, చూస్తుంటే కారనే భావం కలగలేదు. హాలంతా కిక్కిరిసి ఉంది. ప్రేక్షకులు నిశ్శబ్దంగా వింటున్నారు. స్టేజిమీద ప్రేక్షకులలోనూ సంస్కారం తాలూకు ఉన్నత తరంగాలు పౌర్ణమి నాటి సముద్రంలో వలె లేచిపోతూ ఉన్నై. ఆ పగటి కలలో తాను స్థానం అని భ్రమసింది ఈ మాలకాకా ?

సుబ్బి - లేక సుభద్ర - తనకేసి ఆప్యాయంగా చూసి నవ్వుతున్నది. అప్పుడే తను వాళ్ళజాతిలో చేరిపోయినాడు !

నాటకం రాయనని ఇప్పుడే చెప్పెయ్యి. ఆదినిష్ఠూరం మేలు.' అని తొందర చేస్తున్నది రామ్మూర్తి అంతరాత్మ.

"వీళ్ళను వొదలకు, పెద్దవాళ్ళు నిన్ను దగ్గిరికి రానిస్తారా ? శుష్కప్రియాలు చెబుతారు. వాళ్ళమీద వ్యామోహం వదులుకో. వీళ్ళు నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తారు. ఎక్కువ వాళ్ళ మధ్య అనామకుడుగా ఎంతకాలం వుంటావు ?

---

1. మాధవపెద్ది : మాధవపెద్ది వెంకట్రామయ్య. చూడండి ఇంతకు మునుపు ప్రస్తావన.
2. స్థానం : చూడండి వెనకవచ్చిన ప్రస్తావన.

నీకు దబ్బక్కర్లేదా ? ఆ ఇరవై ఎకరాలూ కొనే ఆశ వదులుకున్నావా ఏం ?" అని అతని బుద్ధి హెచ్చరించింది.

ఇటువంటి సంఘర్షణలో అంతరాత్మ గెలవటమనేది సామాన్యంగా వుండదు. రామ్మూర్తి నవ్వి "అవును నేను," అన్నాడు.

మనస్సు నెంత సమాధానపరుచు కుందామన్నా సుభద్ర తన నాటకానికి నాయికగా ఊహించుకోవటానికి సాధ్యం కాలేదు. మనిషి చాయన చాయగా వుంది. మొహం ఏమంత ఫర్వాలేదు. మనిషికూడా చలాకీగానే వుంది గానీ సంస్కారం ఎక్కడా లేదు. వొంటిమీద ఒక్క నగలేదు, చెవులక్కూడా ఏమీ లేవు. చేతులకి ఒకొక్కక్క బంగారపు గాజు— మాయ బంగారపు గాజు—ఉంది. మాసిన చీరె కట్టింది. చీరె కట్టులో కూడా ఏమీ ప్రత్యేకతలేదు. పక్కపాపట తీసివుంది. కాని పాపట కడ్డంగా వెంట్రుక లటూ ఇటూ వుండి, గోళ్ళతో దువ్వుకున్న జుట్టల్లే కనిపిస్తుంది. జుట్టుకు చమురుకూడా లేదు. పొట్టిమనిషి కాని నడుము సన్నగా వుండి కుదిరికగా వున్న విగ్రహం, పద్దెనిమిదేళ్ళకన్న వుండవు.

"ఏది ఎట్లావున్నా, గొంతయినా అంత అనాగరికంగా లేకపోతే బాగుణ్ణు!" అనుకున్నాడు రామ్మూర్తి.

అయితే ఏం ? ఈ సుభద్రనే ఎవరో విలేఖరి తెగ మెచ్చుకున్నాడు. ముందు ముందీమె చాలా పైకొస్తుందని కూడా రాశాడు. కళాభిరుచి ప్రజల్లోనేకాక విమర్శకుల్లోకూడా నశిస్తున్నదా? ... లేక దీనితో వాడికేమన్నా—

"ఎల్లుండి నాటకం. హాలు మాట్లాడేశాను. మీరు మీ భార్యాగారూ రావటమే గాక మీ స్నేహితుల్ని కూడా పట్టుకురండి. మా ట్రూపును గురించి నలుగురూ తెలిసినవాళ్ళు తమ అభిప్రాయా లిస్తే లోపాలు దిద్దుకోవటానికి వీలుపడుతుంది.... నాటకం రాయటం ప్రారంభించారా ?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఏదీ ? ఇంకా ఎక్కడా?" అని రామ్మూర్తి దిక్కులుచూస్తూ నీళ్ళ నమిలాడు.

కల్యాణి కాఫీలు తెచ్చి అందరికీ ఇచ్చింది. వెంకటేశ్వర్లు ఆజ్ఞ అయేవరకూ ఎవరూ చూడనైనాలేదు. ఈ తన అతిథులు కాఫీ తాగుతుంటే రామ్మూర్తికి మంచిరోజులు జ్ఞాపకం వచ్చినై. ఆర్థికంగా మంచిరోజులని కాదు. ఆర్థికంగానే చూస్తే ఈ రోజులే మంచివని రామ్మూర్తి ఏనాడో తేల్చుకున్నాడు. కాని తన యింటికి ఆ రోజుల్లో అతిథులుగా వచ్చిన వాళ్ళెక్కడ ; వీళ్ళెక్కడ ? ఆనాటి సంభాషణ లెక్కడ, ఈ సంభాషణ ఎక్కడ ? ఎట్లా వచ్చిందీ పతనం ? ఏమిటీ మార్పు— ?

అతిథుల్లో ఒకడు కాఫీ చొక్కామీద పోసుకున్నాడు. ఆ కంగారులో కప్పు సోది సహం చాపమీద వొంచేశాడు....

28 నాటి గయోపాఖ్యాన ప్రదర్శనానికి రామ్మూర్తి భార్యా సమేతంగా వెళ్ళాడు. అతనికి ముందువరుసలోనే రెండు సీట్లు ప్రత్యేకించారు. (ఇంత గౌరవం

వెనక అతనికే నాటకమిత్రులూ చేసి వుండలేదు.) తన వెంబడి ఒకరిద్దరు ప్రఖ్యాతులైన ప్లీడర్లూ, ఒక జడ్జీగారూ, ఒక సివిల్ సర్వీసు అధికారీ, ఒక డాక్టరుగారూ ఇతర ప్రసిద్ధులూ కూర్చుని వుండటం చూసి రామ్మూర్తి భయపడ్డాడు. పాత్రధారులు ఇవాళ ఇందరి సమక్షానా తన పరువు తీసేస్తారని అతనికి బెంగ పట్టుకుంది.

హాలు బాగా నిండలేదు. రెండువందలకుమించి డబ్బొచ్చివుండదు. సరిగా టైముకు గంట కొట్టారు. ప్రార్థన పాడారు. నాటకం అద్భుతంగా రక్తికట్టబోతున్నదని మొదట్లోనే రామ్మూర్తికి తేలిపోయింది. మీద కాఫీ హొటలకబోసుకున్న బ్రాహ్మడు కృష్ణపాత్ర ధరించి రంగం మీదికి రాగానే జనంలో విస్మయం కలిగింది. వేషం అమిత ఆకర్షవంతంగా ఉంది. వచనం అటే బాగా చెప్పకపోయినా పాటలు పేల్చిపాడేశాడు. వాడి గొంతు అద్భుతంగా పలుకుతుంది. బాలగంధర్వ[1]నూ, పెండార్కరు[2]నూ అవలీలగా దించి ఊరుకున్నాడు.

కాని సుభద్ర స్టేజిమీదికి వచ్చిన తరవాత చూడాలి ప్రేక్షకుల ఆనందాన్ని. సుభద్ర కాకికాదు అప్సరస, స్టేజిలైట్లలో ధగధగా మెరిసిపోయింది. సుభద్ర నటన నటనగా కనిపించలేదు, గారడీ అనిపించింది రామ్మూర్తికి. స్థానంలాటి వాడుకూడా నటిస్తుంటే అతను పడుతున్న శ్రమ ప్రేక్షకుడికి తెలుస్తుందేమోగాని, సుభద్ర నటనలో శ్రమ అనేది కనిపించలేదు. పాడటానికి గొంతెత్తితే కిన్నెర, ఎక్కువ గానచాతుర్యం లేకపోయినా వినేవాణ్ణి ఇట్టే మభ్యపెట్టే గొంతు.

తెర పడగానే వెనక ఇద్దరు ఇంగ్లీషులో అనుకుంటున్నారు.

---

1. బాలగంధర్వ (1888-1967) అసలు పేరు రాజహంస నారాయణ శ్రీపాద. ప్రఖ్యాత మరాఠీ రంగస్థల నటుడు. కుటుంబరావుకు ప్రియమైన గాయకుడు. 18 ి8లో ఒక అంతరంగిక గాన సభలో శ్రీపాద గానానికి ముగ్ధుడైన తిలక్ బాలగంధర్వ అనే బిరుదు ఇచ్చారు. సంగీతంలో పండిత భాస్కర బుల్ బాఖలే శిష్యుడు ప్రఖ్యాత మరాఠీ రచయితలు గోవింద భల్లాల్, దేవల్ కాక సాహేబ్ ఖడేల్కర్ శిక్షణలో తయారైన నటుడు కిర్లాస్కర్ నాటకమండలి (1905)లో చేరి శకుంతల వేషానికి ప్రసిద్ధిపొందారు. స్త్రీ పాత్రధారణలో స్థానంవలె ప్రసిద్ధుడు. బాల గంధర్వ నాటక మండలి (1919-1944) స్థాపకుడు. వి శాంతారాం తీసిన ధర్మాత్మ చిత్రంలో నటించాడు. 17 ఏండ్ల వయసుకు ముందే గ్రామఫోను రికార్డుల్లోకి ఆయన సంగీతం ఎక్కింది. ఆయన ఆహార్యానికి స్ఫూర్తి రవివర్మ చిత్రాలు. నాటి స్త్రీ అలంకరణకు ఒక నమూనా. సంప్రదాయ సంగీతానికి, రంగస్థల సంగీతానికి వారధి నిర్మించినవాడు.

2. పెండార్కరు : ప్రముఖ మరాఠీ నటుడు, గాయకుడు.

"ఆమె ఎట్లా ఉంది?"

"స్థానం ఇక రిటైరయిపోవచ్చు !"

అతిశయోక్తి, అయితేనేం? ఆ క్షణాన రామ్మూర్తికే అతిశయోక్తు లాడాలని పించింది.

నాటకం అయిపోగానే వెంకటేశ్వర్లు వచ్చి రామ్మూర్తినీ, కల్యాణినీ స్టేజిలోకి వచ్చి వేషాలు వేసినవాళ్ళకి కాస్త ప్రోత్సాహమూ, సలహా ఇమ్మని అడిగాడు.

"వాళ్ళకొక్కావలసిన ప్రోత్సాహమంతా ప్రేక్షకులే ఇచ్చారు. ఇక నేనేమిచ్చేది? సలహా ఇవ్వటానికిమటు కేముంది? నాటకం రైలు నడిచినట్టు నడిచింది. ఒక్కరైనా ఒక్కచోటకూడా తడువుకున్నట్టు లేదు. టీమ్‌వర్కు చాలా అద్భుతంగా ఉంది!" అన్నాడు రామ్మూర్తి.

"అది లేకపోతే ఒకోక్కణ్ణి చీల్చి ఎండెయ్యనా?"

'వెంకటేశ్వర్లును మించిన ప్రౌఢ్యూసరిప్పట్లో లేడు' అనుకున్నాడు రామ్మూర్తి స్వగతంగా.

రామ్మూర్తి వెళ్ళేటప్పటికి సుభద్ర వేషం విప్పేసుకుంటున్నది.

"యేఁవండీ, కూస్తైయినా నాటకం రగిలిగట్టిందా?" అన్నదామె.

రామ్మూర్తికి మబ్బు విచ్చినట్టయింది. మళ్ళీ కాకి ప్రత్యక్షం.

అయితే ఈ కాకికేసి ఎంతో తృష్ణతో, కళ్ళల్లో దండకాలు పెట్టుకుని అనేక మంది చూస్తూండటం రామ్మూర్తి గమనించాడు. కాకిపరిచయం చేసుకోటానికి సూట్లవాళ్ళూ, ఆఫీసరు తలపాగాలవాళ్ళూ, మీసాలకు రంగేసిన బట్టతలలవాళ్ళూ, వెండిపొన్ను చేతికర్రలవాళ్ళూ స్టేజిలోకి వచ్చారు.

"చెప్పలేం, కళ ఉన్నచోట ఇంకేమి లోపించినా—సంస్కారం లోపించినా-ఆరాధన జరుగుతుంది." అనుకున్నాడు రామ్మూర్తి.

సుభద్ర, కల్యాణి అభిప్రాయం అడిగింది. కల్యాణి చాలా బాగున్నదని చెప్పింది. రామ్మూర్తి బయల్దేరటానికి ఉద్యుక్తుడయినాడు.

"రాయపేట హైరోడ్డులో ఒక ఇల్లు తీసుకుంటున్నాం. మీరు రాసే నాటకం పూర్తి అయ్యేదాకా మేం మద్రాసు వదలం. ఇక్కడే నాటకం రిహార్సు చెయ్యాలి. ఇక్కడే మొదటి ఆట ఆడాలి మీ రెప్పుడన్నా వీలు చేసుకురండి," అన్నాడు వెంకటేశ్వర్లు.

"మేం మీ యింటి కొచ్చాంగదా, మీరు మా యింటికి రారాదంటండీ? రేపొస్తారా?" అన్నది సుభద్ర. రామ్మూర్తి సరేనని తల ఊపాడు.

# 7

శ్రీలీలానాటక సమాజంవారు మద్రాసులో ప్రదర్శించిన గయోపాఖ్యానం గురించి మిగతా పత్రికల్లో రెండేసి ముక్కలు రాశారు. కలావాణి పత్రిక అభిను

పేజీలలో రెండున్నర పేజీల ప్రశంస పడింది. కృష్ణపాత్రధారిదీ, సుభద్ర పాత్ర ధారిణిదీ, వెంకటేశ్వర్లుదీ ఫోటోలు పడినై : వ్యాసకర్త 'మూర్తి' అని సంతకం చేసేశాడు.

ఈ వ్యాసాన్ని చూసి నలుగురూ ఏమనుకున్నారో మనకి తెలీదు. కాని ఇది ఆంధ్రకళా చరిత్రలో ఒక ప్రముఖమైన డాక్యుమెంటు. ఈ 'మూర్తి' అనే పేరుగల రచయిత 'అలగాజనం' కింద పరిగణించవలసిన వ్యక్తులద్వారా ఆంధ్రనాట్య కళ ఒక మెట్టు పైకెక్కిందని ఒప్పుకున్నాడు. నటుల సంస్కారం గురించి ఒక్క ముక్క వ్యాసంలో లేదు. నాటకమైనా కొత్తదికాదు. ఈ వ్యాసకర్తకి ఆంధ్ర నాటక రంగంతోనూ, ప్రఖ్యాతాంధ్ర నటశిఖామణులతోనూ పరిచయం లేదను కోవటానికి వీలు లేదు; పరిచయం లేనట్టయితే విమర్శన వ్యాసం రాసి ఉండడు కలావాణి వంటి పత్రిక ప్రచురించీ ఉండదు. మేటి నటులంతా చెయ్యలేని పని లీలా నాటక సమాజంవారు ఏదో చేసి ఉండాలి. దాన్ని గురించిన వివరాలు వ్యాసంలో లేవు. 'టీమ్ వర్క్' అనేమాట మాత్రం ఒకటి రెండు చోట్ల కనిపిస్తున్నది. అంతే!

'మూర్తి'ని ఖండించటం మన అభిప్రాయం కాదు. లీలానాటక సమాజాన్ని మెచ్చుకోవటంలో మనం 'మూర్తి'తో ఏకీభవింతాం. ఈ నాటక సమాజాన్నీ ఇటువంటి ఇతర నాటక సమాజాల వాళ్ళనూ పొగడి ఆకాశాని కెత్తిన అసంఖ్యా కులలో 'మూర్తి' ఒకడు. అయితే ఈ 'మూర్తి' గాని తదితర విమర్శకులుగాని ఇటువంటి పరామర్శకు దిగినప్పుడు తమకు ముందుండిన కళాదృష్టిని గురించి తాత్విక విమర్శచెయ్యలేదు. అటువంటి విమర్శకు లీలానాటక సమాజంలాంటి సంస్థలూ, "సుభద్ర"లాటి నటకులూ అవకాశం ఇచ్చారు. కాని ఆ అవకాశాన్ని వినియోగించుకున్నవారు లేరు.

ఒకవంక సుభద్రలాటి స్టేజితారలు పుట్టి ప్రజాహృదయాన్ని దొంగిలిం చేస్తుంటే,మరోవంక ప్రసిద్ధికెక్కిన నటకులు స్టేజిమీదనుంచి, వేషాలైనా విప్పకుండా, ఆనందబ్రహ్మను గురించీ, నాట్యకళను గురించీ ఉపన్యాసాలు దంచేస్తూనే ఉన్నారు. ఈ రెండు పంథాలమధ్యా ఉన్న వైరుధ్యాన్ని విప్పి చెప్పినవాప లేకపోయినారు.

సాహిత్యంలో కూడా ఇదే జరిగింది. ఆధునిక కవులఖ్యాతి దిగంతాలకు వ్యాపిస్తున్న కొద్ది సంఘంలో వారి రచనల వ్యాప్తి తగ్గిపోతున్నది. సంస్కారు లనుకునే వాళ్ళ నోళ్ళలో నానే కవుల కవిత్వం వేరు, ప్రజలలో విస్తరిస్తున్న సాహిత్యం వేరు. సాహిత్య పత్రికల జాబితాలో కలావాణి అగ్రస్థానమే అలంక రిస్తూ వచ్చేది. కాని అందరూ చదువుతున్న సాహిత్యం ఖులాసా కథల పత్రికల ద్వారా వెలువడుతూ వచ్చింది. ఊరు పేరూ లేనివాళ్ళ కథలు ఆ పత్రికల్లో అచ్చుకావటమే గాక వాటికి రెండు మొదలు అయిదు రూపాయలవరకూ పారి తోషికాలు కూడా ముట్టుతూ ఉండేవి. కవిత్వం ఎవరూ చదవటం లేదు. మరి రెండు

మూడు సంవత్సరాల్లో శ్రీపాదవారి ప్రబుద్ధాంధ్ర[1] పద్యరహితంగా వెలువడ నున్నది. భావకవిత్వం మంచానపడింది. సానుభూతిపరులూ, విముఖులూ భావ కవిత్వం మంచి చెడ్డలు గురించి కొట్లాడుకోవటం కనిపించింది గాని భావకవిత్వాన్ని ఆరోగ్య పథానికి తిప్పగలిగిన భిషక్కులు లేకపోయినారు.

ఒక సంస్కారం నిర్మూలమైనప్పుడల్లా, దాని నిర్మూలానికి సహాయపడిన సాంఘిక శక్తులను సమన్వయపరిచి ఒక నూతన సంస్కారం వెలువడుతుంది. నిజమైన కళాభిజ్ఞు లీ నూతన సంస్కారం వెంబడి అభ్యుదయమార్గం తొక్కు తారు. కళాభిజ్ఞతలేని కార్యవాదులు సంస్కారం యొక్క మృతిని స్వీకరించి, తాత్కాలికంగా - అంటే, కొత్త సంస్కారం బలం చేకూర్చుకుని ప్రజలలో వ్యాప్తి చెందే వరకూ— స్వేచ్ఛావిహారం చేసే అరాచకమైన ఆ సంస్కారాన్ని ఆశ్రయించి పనిగడుపుకు పోతారు.

భావకవిత్వం శక్తి ఉడిగిపోతుండగానే శ్రీరంగం శ్రీనివాసరావు మహా ప్రస్థానం[2] ప్రారంభమయింది. మరో ప్రపంచ బీజం సాహిత్య పొలంలో పడింది. శ్రీ శ్రీ తన కష్టసుఖాల్లో కేవలమూ మునిగిపోలేదు. విశాల ప్రపంచాన్ని చూసి "నేను నీ కేమవుతా" నని ప్రశ్నించుకున్నాడు. శ్రీ శ్రీ చుట్టూతా కొత్త సంస్కా రమూ, కొత్త కవిత్వమూ పెరిగి రాసాగింది.

---

1. శ్రీపాదవారి ప్రబుద్ధాంధ్ర : సుప్రసిద్ధ రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి సంపాదకత్వంలో వచ్చిన మాసపత్రిక. 1920 లో పక్షపత్రిక. ఆంధ్ర గీర్వాణ భాషల్లో వచ్చేది. 1922 ఆగష్టులో మాస పత్రికగా ప్రారంభమై 1925 దాకా నడిచి ఆగిపోయింది. 1934 జనవరిలో పునః ప్రారంభమైంది. 1934 జనవరి సంచికలో "ఈసారి యీ పత్రికలో పద్యాలు ప్రకటించదలచుకోలేదు. ఇప్పుడు మనకు వచన వాఙ్మయం చాలా అవసరంగా ఉంది. జనసామాన్యంలో విద్య వ్యాపించాలన్నా, విజ్ఞానం వ్యాపించాలన్నా వచన వాఙ్మయమే ఆధారం. ప్రముఖులలోగూడా వచన వాఙ్మయం ఎన్నో అభివృద్ధులు కలిగిస్తుంది" అని సంపాదకీయం రాశారు. కుటుంబరావు రచనలు కొన్ని ప్రబుద్ధాంధ్రలో వచ్చాయి. (వివరాలకు చూడండి డా. వి. లక్ష్మణరెడ్డి, తెలుగు జర్నలిజం, అవతరణ-వికాసం, రచయిత, 1985, పుటలు 282, 283.)

2. శ్రీరంగం శ్రీనివాసరావు మహాప్రస్థానం : మహాప్రస్థానం కావ్య సంపుటి లోని గీతాలను చాలావరకు శ్రీశ్రీ 1933–1942 మధ్య రచించారు. మహాప్రస్థానం గీతం రచనాకాలం 1934 ఏప్రిల్ 12.

రామ్మూర్తి దగ్గిర ఎవరో "మరో ప్రపంచం"[1] చదివి వినిపించారు. అతనిలో ఏమీ చలించలేదు. అతని కాపాట వినిపించలేదు. కాని నశించిపోతున్న భావ కవితా సంస్కారాన్ని వొదిలి దొరికిన ఆశ్రయాన్ని అందుకునే ప్రయత్నంలోమట్టు కున్నాడతను.

ఎందుకంటే కలావాణి అమ్మటంలేదు. దానిమీద నెలనెలా నష్టం వస్తున్నది. ముసలాడు దీన్ని ఈ విధంగా ఎంతకాలం పోషిస్తాడు ? దీన్నే ఖలసా కథల పత్రికగా మారిస్తే రెండు మూడువేలు అమ్మవచ్చు. లాభాలు రావచ్చు. నలుగురూ చదివే సాహిత్యం-మంచిదో, చెడ్డదో-ఇందులో వెలువడవచ్చు. కాని అటువంటి మార్పు తెచ్చి తాను కలావాణి సంపాదకుడుగా తెచ్చుకున్న కాస్త కీర్తి పోజార విడవటం రామ్మూర్తికి నచ్చలేదు. "అరాచకమైన ఆ సంస్కారాన్ని" ఆశ్రయించటం రామ్మూర్తికి అభ్యంతరంలేదు. కాని అందుకుగాను తన ఖ్యాతి పోగొట్టుకోవటం ఇష్టంలేదు. "అరాచకమైన ఆ సంస్కారాన్ని" సాహిత్యరంగంలోనే ఆశ్రయించవలసిన అవ సరం ఏముంది? ఇతర రంగాలులేవా? ఉన్నాయని నిరూపించటానికే అతను గయోపాఖ్యాన విమర్శ స్వయంగా రాసి పత్రికలో ప్రచురించాడు.

'పురజనుల కోరికపై' వెంకటేశ్వర్లు ఆ నాటకం మళ్ళీ ఆడించాడు. ఈసారి డబ్బుకూడా చాలా బాగా వచ్చింది. రాయపేటలో నాటక సమాజంవాళ్ళ లాడ్జి కళ కళ లాడసాగింది. రకరకాలవాళ్ళు వచ్చి తమ పరిచయభాగ్యం సుభద్రకు కలగ జేసి వెళుతున్నారు. ఒక వారంరోజుల లోపుగా సుభద్రలో మార్పుకూడా కలిగింది. ఆడే స్వేచ్ఛగా మాట్లాడటం తగ్గించి మాట్లాడినంతసేపూ 'నిర్దుష్టంగా' శిష్టభాష మాట్లాడటానికి చాతగాని ప్రయత్నాలు ప్రారంభించింది.

సుభద్రమీద రామ్మూర్తికి మొదటి ఏవగింపు చాల తగ్గింది. కేవలమూ దుర్మార్గులయితేనూ, తెచ్చిపెట్టుకున్న దుర్లక్షణాలు కలవారయితేనూ పరిచయం పెరుగుతున్నకొద్దీ అసహ్యం పుట్టిస్తారుగాని, ఆ సంస్కారంగల మనిషిలో చూస్తున్నకొద్దీ మంచి లక్షణాలు కనిపించడమే కాక సంస్కారం లేకపోవటమే ఒక ఆకర్షణగా కూడా కనిపించటం జరుగుతుంది. సుభద్రవంటిది అసందర్భంగా మాట్లా డితే అది భోలాతనంగా కనిపించేది రామ్మూర్తికి. ఆమెలో నిష్కాలుష్యమూ, అమాయకత్వమూ, అంతులేని సహజత్వమూ, ముగ్ధత్వమూ చూడగలిగాడు. రామ్మూర్తి. ఆమెలో లోపించిన విద్యాగంధమూ, సంస్కారమూ, నాగరికతా సుల భంగా క్షమించటమేగాక వీటిల్లో తన ఆధిక్యత బలపరచుకోవటానికి రామ్మూర్తి ఉపయోగపరచుకున్నాడు.

అనేకసార్లు సుభద్ర రామ్మూర్తి వెంటపడి బీచికీ, సినిమాలకూ, వాళ్ళింటికీ

---

1. మరో ప్రపంచం : నవ ప్రపంచ నిర్మాణానికి ఆహ్వాన గీతిక మహాప్రస్థానం. ఆ గేయం తొలి పాదాలు ఇవి.

వచ్చింది. అతను రాస్తున్న నాటకం ఎప్పటికప్పుడు చదివి వినిపించుకునేది. సుభద్రను తాను ఎక్కడికి తీసుకెళ్ళినా భార్యదగ్గర దాచేవాడుకాడు. దాన్ని గురించి భార్యతోగాని మరొకరితోగాని మాట్లాడేటప్పుడు తాను సుభద్రకన్న చాలా ఉన్నతమైన తరగతికి చెందినవాడనే విషయమూ, తనకు దాదాపు సుభద్రయీడు కూతురే వుండవచ్చుననే విషయమూ స్ఫురింప జేయటానికి ప్రయత్నించేవాడు. ఈ ప్రయత్నాలు పూర్తిగా వ్యర్థమయ్యేవి కావు.

కాని ఒక మూల మనస్సులో రామ్మూర్తికి బాధ ఒకటి వుండేది. ఏ కారణం చేతనో, ఏ విధి ప్రోద్బలంవల్లనో సుభద్రకూ తనకూ లంకె పడుతుందని ముందు గానే భయపడి, అటువంటిది చాలా అసంగతమనీ, తన ఆదర్శాలకు ఎంత మాత్రమూ కుదిరే విషయం కాదనీ తనకు తాను తీవ్రంగా నచ్చచెప్పుకునేవాడు. ఒక్కొక్కసారి ఈ మనో వ్యాపకంతో గంటలకు గంటలు హరించుకుపొయ్యేవి. ఇంకో మూల అతని మనస్సులో మరో బాధకూడా వుండేది. సుభద్ర తన ప్రేమకోసం నిరీక్షిస్తున్నదనీ, తాను ఎంతకీ చలించకపోవటం చూసి లోపల ఆశ్చర్యపడుతున్న దనీ, తిట్టుకుంటున్నదనీ అనిపించేది. నీతి నియమాలూ, సంస్కారాదర్శాలూ లేని నవయవ్వనంలో వున్న తక్కువ జన్మగల పిల్లయొక్క మనస్తత్వం ఊహించుకోవ టానికి ప్రయత్నించి రామ్మూర్తి బెదిరిపోయినాడు.

ఒక్కొక్కసారి సుభద్రమీద- ముఖ్యంగ ఆమె దగ్గిరలేని సమయాల్లో-చెడ్డకోపం వచ్చేది. తనవంటి వాణ్ణి కామించటాని కా పశువు కే మధికారం వుంది? తా నెవడను కుంటున్నది?

అయితే ఈ కోపం రామ్మూర్తి మనస్సును మెత్తబరచటానికెంతో వుప యోగపడేది. ఆమెమాత్రం తనవంటి మనిషికాదా? తనకున్న క్షుధలు ఆమెకుండవా? తను ఒక విషయంలో గొప్పవాడైతే ఆమె మరో విషయంలో గొప్పది. (తను ఏ విషయంలో గొప్పవాడో రామ్మూర్తి తరిచి చూసుకోలేదు.) అదీకాక—ఇది ముఖ్య మైన విషయం—ఈ సుభద్రకి కార్లూ, సిల్కుసూట్లు, డబ్బూ, నగలూ అర్పించ టానికి సిద్ధంగా వున్న గౌరవనీయులెంతోమంది వున్నారు. (ఒకానొక వ్యాపార స్తుడి ప్రసిద్ధ పుత్రుడు సుభద్రకి ఒక ఉంగరం బహుమానం ఇచ్చినట్టున్నూ వెంక టేశ్వర్లూ ఉంగరం సుభద్ర వేలునుంచి లాక్కుని దాతకు తిరిగి ఇచ్చేస్తూ, "బహూ కరణలు బహిరంగంగా తప్ప పుచ్చుకోమండీ, కావలిస్తే ఈసారి సుభద్ర స్టేజి మీద వుండగా నలుగురి సమక్షానా ఇవ్వండి." అని అడిగినట్టున్నూ అప్పుడే నలు గురికీ తెలిసిపోయింది కూడానూ.)

రంకుతనమనేది-ముఖ్యంగా స్వేచ్ఛా జీవనం గల స్త్రీలలో రంకుతనం— పరిపాటిగా జరుగుతూ వున్నదే. దాన్ని గురించి సంఘం ఏమీ పట్టించుకోవటం లేదు. దానిమూలంగా సాంఘిక విప్లవాలూ, సంక్షోభాలూ జరగటంలేదు. ఆ పరి స్థితిలో రామ్మూర్తి, తాను సుభద్రతో రంకుతనం చెయ్యటమనేది ఒక బ్రహ్మాం

ఢమైన విషయంగా ఎందుకు పరిగణించాడో ఊహించలేం. కాని అతనా విధంగా భావించిన మాటమాత్రం యథార్థం. ప్రపంచ చరిత్ర యావత్తూ అడ్డంగా తిరగటమూ, సూర్యచంద్రులు గతులు తప్పటమూ మొదలైన ఉత్పాతాలు పుట్టే సంఘటన ఘటితం చెయ్యటానికెంత పస్తాయించవచ్చునో, రామ్మూర్తి సుభద్ర శరీరానికి అమ్ముడు పోవటానికి అంత పస్తాయించాడు. సుభద్రకు అతనిచ్చిన విలువకూ ఆమెతో శంకుతనం చెయ్యటానికి తను పడ్డ బాధకూ ఎక్కడా సమన్వయంలేదు.

ఈ విధంగా ఆరునెల్లు గడిచింది.

ఇప్పటికి మూడునెల్లనుంచీ సుభద్ర మనస్సు రామ్మూర్తికి స్పష్టంగానే తెలుసును. ఇప్పటి కయిదునెల్లనుంచీ రామ్మూర్తికీ సుభద్రకూ సంబంధం ఉందనీ పట్నంలో అందరూ—ఇటువంటివి అనుకోవటంలో ఆసక్తి కలవారందరూ —అను కుంటూనే ఉన్నారు. ఇప్పటికి పదిహేను రోజుల్నుంచీ రామ్మూర్తి ఇల్లు ఖాళీగానే ఉంది— వాళ్ళ నాన్నగారికి ఒంట్లో సుస్తీగా ఉందనీ, ఆయన ఈసారి మంచంలో నుంచి లేవకపోవచ్చుననీ తెలిసి, నాలుగోమాంసం గర్భిణీతోనే కల్యాణి పుట్టింటికి వెళ్ళింది. ('అయిదో మాసం రానిచ్చి రాకపోయినావుటే. నా తల్లీ?' అన్నది వాళ్ళమ్మ.)

రామ్మూర్తి రాస్తున్న నాటకం కిందటిరాత్రే పూర్తయింది.

"ఇవాళ సాయంకాలం అందరూ మా యింటికి రండి, చదివి వినిపిస్తాను" అన్నాడు రామ్మూర్తి.

"ఇవాళ సాయంకాలం నేను సినిమాకు పోవాలి." అన్నది సుభద్ర. వారం రోజుల కింద నెల్లూరులో నాటకం ఆడివచ్చిన తరవాత సుభద్ర సినిమా మొహం ఎరగదు.

రామ్మూర్తికి తప్పలేదు. సుభద్రను వెంటపెట్టుకుని సినిమాకు వెళ్ళాడు. సినిమా కాగానే పక్కనే హోటల్లో ఇద్దరూ భోంచేశారు.

"మీ యింటికిపోయి నాటకం చదువుదామా?" అన్నది సుభద్ర. కల్యాణి ఊళ్ళోలేదని సుభద్రకి తెలుసు.

రామ్మూర్తికి శ్వాస పీల్చటం చాతకాలేదు. వొణుకుతున్న గొంతుతో హీన స్వరంతో "పదః" అన్నాడు. చివరి విసర్గ బాధాయుతమైన నిట్టూర్పు.

టెక్నికల్‌గా సుభద్ర తప్పేమీలేదు. ఆమెకు సంస్కారం లేకపోవచ్చు. నైతిక దృష్టి కూడా లోపించవచ్చు. కాని ఈ విషయంలో ఆమె కర్తృత్వం ఏమీ లేదు. ఒకవేళ రామ్మూర్తి వంటి సత్పురుషుడానాటి రాత్రి కాలుజారి పెద్దపాటు పడ్డా డని ఎవరైనా అనుకునే పక్షంలో, ఆ పతనానికి హేతుభూతమైన బాహ్యా ఉప కరణలన్నీ అతనే తెచ్చుకున్నాడు. ఆమె అతని కిచ్చిన ప్రోత్సాహంకూడా ఏమీ లేదు—అతను తనమీద చెయ్యేసినప్పుడు, "ఏంటబ్బా !" అని మూలగటం తప్ప.

అధయినా ప్రోత్సాహంకింద భావించటానికి వీల్లేదనుకునే వాళ్ళున్నారు. అయితే రామ్మూర్తి వారితో ఏకీభవించడు.

తను పతనం పొందిన విషయం గురించే రామ్మూర్తి మనతో ఏ మాత్రమూ ఏకీభవించడు. అయిదారునెల్లు పస్తాయించి ఆఖరుకు ఈ పని కాస్తా చేసేసిన తరవాత ప్రపంచం తారుమారు కాకపోవటమూ, సూర్య చంద్రాదులు గతులు తప్పకపోవటమూ చూసి అతను చాలా సంతృప్తి చెందాడు. ఒక రాత్రివేళ అతను సుభద్రాసమేతుడై డాబా మీదికి వచ్చి చూసేసరికి నక్షత్రాలన్నీ రెట్టింపు కాంతితో వెలుగుతున్నట్టు కనిపించింది. వాయుదేవుడు కూడా సానుభూతితో వీచాడు.

అయితే అతనిలో కలిగిన మార్పేమిటంటే అతనికొక నూతనానుభవం కలిగింది. అదివరకే స్త్రీ శరీరం కూడా అతనికింత సన్నిహితం కాలేదు. పది పన్నెండు సంవత్సరాలుగా భార్యతో కాపరంచేస్తున్న వాడి విషయంలో ఈ మాట వింతగా తోచవచ్చు. కాని నిజం. రామ్మూర్తి తనకూ భార్యకూ మధ్య కొంత సంస్కారం- మర్యాద - ఎప్పుడు అడ్డం ఉండనిచ్చాడు. ఏ కించిత్తు నిగ్రహమూ మనిషిని జంతువుల నుంచి వేరుపరుస్తుందో, దాన్ని అతనుగాని కల్యాణిగాని ఎప్పుడూ జారవిడువలేదు. అందుచేత జంతువులన్నిటికీ పరిపాటిగా తెలిసిన కామసంతృప్తి రామ్మూర్తి కిప్పుడే తెలిసివచ్చింది. అందువల్ల కలిగిన ఆనందాన్ని రామ్మూర్తి, ఉన్నదున్నట్టు దేన్నీ అర్థంచేసుకునే అలవాటులేని కారణంచేత, తన సంస్కారం పరంగా చూసుకున్నాడు. ఈ సుభద్ర తన దగ్గిర ఏమీ దాచుకోలేదు. అంతా ఇచ్చేసింది ! కల్యాణి ఏదో దాస్తూనే వచ్చింది — లేక ఆమెకు అంతా ఇచ్చెయ్యటం చాతకాలేదో ? ఏమంటే, అదీ ఒక కళ— కాదు అదే నిజమైన ప్రేమ. నిజమైన ప్రేమ ఈ సుభద్రకు తెలిసినట్టుగా తన భార్యకు తెలియదు .... ఔను, ఎందుకు తెలియాలీ ? కల్యాణి లోకధర్మంగా తనశరీరాన్ని వప్పగించేసింది. ఈ సుభద్రకో? ఈమెకు లోకధర్మంలేదు. ఇది లోకధర్మానికి అతీతమైన ప్రణయం. ఇది స్వచ్ఛందమైన ప్రేమ. తనవల్ల ఈ సుభద్రకేం ప్రయోజనం ? ఏమీలేదు. తనకంటే ఎక్కువ ఆత్రపడినవాళ్ళని ఎంతమందిని కాదని తన దగ్గిరకి వచ్చింది ! దీనికేం కారణం చెబుతాం ? ఏమీలేదు. నిష్కల్మషమైన ప్రేమే ఇతర కళల మాదిరిగానే ప్రేమకూడా మన సంస్కారముతో ఏమీ ప్రసక్తిలేదు. సుభద్రకు నటించే నేర్పు ఎవరిచ్చారు ? ప్రేమ కూడా వాళ్ళే ఇచ్చారు.

ఈ విధంగా వెళ్ళింది రామ్మూర్తి భావన. అతని పరిభాష- మనిషి మనిషికి అంతా ఇచ్చేసుకోవటమూ, అవ్యాజంగా అజ్ఞాతంగా పుట్టుకొచ్చే ప్రేమా— అందరికీ అర్థంకావటం కష్టం. దానికి కూడా కొంత సంస్కారం, కొన్ని ఆచారాలూ తెలిసి ఉండాలి.

అదే రామ్మూర్తి ప్రవర్తనలో మనం గ్రహించదగిన అంశం. అతనికొక

అనుభవం కలిగినప్పుడు దానిలో ఉన్న ఆనందాన్ని దొరికినంత వరకు అనందించి తృప్తిపడటం అతనికి నిజమైన తృప్తిలేదు.

కిందటి రాత్రి సుభద్ర ఒంటరిగా రామ్మూర్తితో గడిపిందని మర్నాడు ఉద యానికి లాడ్జిలో అందరికీ తెలిసింది. సుభద్ర స్నేహితురాలు మర్నాడు సుభ ద్రను చూడగానే ప్రశ్నార్థకంగా తల ఆడించింది. సుభద్ర నవ్వుతూ కన్ను మలిపింది.

సుభద్ర రామ్మూర్తి స్నేహం గురించి గర్వించక పోలేదు. ఆమె 'పెద్ద మనుషుల్ని' బొత్తిగా ఎరగని మొహంకాదు. కాని రామ్మూర్తివంటి 'కష్టమైన' మనిషి ఆమెకు వెనక తగల్లేదు. అదీకాక రామ్మూర్తి సంస్కారాన్ని నిజంగా మెచ్చుకోగలిగిన మనిషి సుభద్ర. తనతో పని అయిపోగానే పెద్ద విజయం సాధిం చిన వాడిమొహం పెట్టలేదు రామ్మూర్తి. అతను తనను నిజంగా మర్యాదగా చూశాడు. మగజాతిమీద సుభద్రకు గౌరవం అంతో ఇంతో రామ్మూర్తిమూలంగా హెచ్చిందని చెప్పాలి.

ఎంతో కాలంగా నీటినిచూసి భయపడుతున్న వాడికి ఈత వచ్చినట్టయింది. లోకం ఏమీ మార్పుచెందలేదు సరికదా, తనపట్ల కూడా ఏమీ మారలేదు. అందరూ తనతో మామూలుగానే మాట్లాడారు. అందులో కొందరు తనను అయిదారు నెల్ల నుంచీ శంకిస్తున్నవారే గనక ఇవాళ అకస్మాత్తుగా మారే అవకాశంలేదు. ఒక్క వెంకటేశ్వర్లే, ఒకనాడేదో మాటల సందర్భంలో, రామ్మూర్తి సుభద్రను గురించి చాలా మెత్తగా మాట్లాడుతుంటే, 'ఆ' చచ్చుముండ, దాని దేమిట్లెండి?' అన్నాడు, దాన్ని పెద్దచెయ్యవద్దని సూచనగా.

రామ్మూర్తి మాదిరిగా ఎవరన్నా పరస్త్రీ-ముఖ్యంగా నీచస్త్రీ-సంపర్కం తెచ్చుకున్నప్పుడు, ఆ వ్యక్తి వ్యభిచారి అయిపోయి అడ్డమైన ఆడవాళ్ళతోటి సంప ర్కం పొందటానికి అర్హుడైనట్టుగా భావించటం లోకరివాజు. రామ్మూర్తి ఒక్క నాటికి కూడా అట్లా అయిపోలేదు. సుభద్ర అతనికి సన్నిహితురాలయిందేగాని, ప్రపంచంలో ఉన్న ఇతర స్త్రీ లందరూ అతనికి ఎప్పటి దూరంలోనే ఉన్నారు. రామ్మూర్తి వంటి వ్యక్తి పతనం కావటంలో కూడా ఉదాత్తత కోల్పోడు. అతను ఒకతె స్థానం తీసుకుపోయి మరొకతెకు ఇవ్వలేదు. అతని భార్య ఆక్రమించలేని స్థానంమీద సుభద్రకు పట్టంకట్టాడు.

మనంకూడా రామ్మూర్తి పరిభాషలో పడుతున్నాం. కాని ఈ పరిభాష కొన్ని కొన్ని విషయాలు అర్థంచేసుకొనటానికి బాగా ఉపకరిస్తుంది. మనం ఇప్పుడర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్న విషయం ఏమిటంటే, సుభద్రమూలంగా రామ్మూర్తి తన భార్యకు ఎడం అయిపోవటానికి ప్రయత్నించటం లేదని.

ఈ విషయం కూడా త్వరలోనే రుజువయింది. వాళ్ళ నాన్నగారికి కొంచెం నెమ్మదిగానే ఉందనీ, ఒకసారి పండగకు అక్కడే ఉండి వెళ్ళిపోవలసిందనీ కల్యాణి ఉత్తరం రాసింది. రామ్మూర్తి వెంటనే భార్యకోసం పద్దెనిమిది రూపాయల ఖరీదు గల బెంగుళూరు సిల్కుచీరె ఒకటి కొని బయలుదేరాడు. తన భర్తను చూసి కల్యాణి ఏమీ మార్పు కనిపెట్టలేదు. 'నీ భర్త మరొకతెను మరిగా'డని చెబితే ఆమె నమ్మి ఉండదు. నమ్మినా, అందువల్ల తనకేమి నష్టం జరిగిందంటే చెప్పగలిగిన స్థితిలో ఉండదు.

తనకు నష్టం కలిగిందని చెప్పలేకపోవటమేగాక, రామ్మూర్తి తన మీద మామూలుకన్న ఎక్కువ అపేక్షగా ఉన్నట్టుకూడా గుర్తించింది. దానికి కారణం లేకపోలేదు. రామ్మూర్తి అంతరాత్మ అకస్మాత్తుగా అతన్ని ఎదిరించి, 'ఈమె నీ అర్ధాంగి. ఆవిడకు తెలీకుండా నువ్వీ మధ్య చాలా ఆనందం అనుభవించావు. ఆమెకు అత్యాచారం చేశావు. నీ ఆనందం కొంత ఈ ఆవిడక్కూడ పంచు' అని శాసించింది.

# 8

పశ్చాత్తాపం[1] రిహార్సల్సు ప్రారంభమయినై. పాటలు రాయటమూ మట్లు పెట్టటమూ అయిపోయింది. గ్రామఫోను రికార్డుల ధర్మాన మట్టు పెట్టటం ఏమంత పనికాదు. అన్నిటికీ వెంకటేశ్వర్లుండనే ఉన్నాడు. పాపట్ల కాంతయ్యగారి[2] కీర్తన పుస్తకాలు ఎదటవేసుకుని పాటలు కూడా రాయగలవాడే వెంకటేశ్వర్లు. అతని కవిత్వం వృధాపోతుందా ?

కొన్నిరకాల క్రిములు కొన్నిరకాల శరీరజాడ్యాల ఆస్కారం చూసుకుని విజృంభించినట్టు. సంఘంలో వున్న కుసంస్కారాన్ని ఆశ్రయించి వెంకటేశ్వర్లు వంటి వాళ్ళు తమ తెలివితేట లుపయోగించుకుంటారు. సంగీతంలోనూ, కవిత్వంలోనూ అతనికున్న పాండిత్యం కళాదృష్టి కలవాడికి జుగుప్స కలిగిస్తుంది. కాని వెంకటేశ్వర్లును సంఘం బతకనిస్తుంది. పెరగనిస్తుంది. ప్రజాహితానికి కాకపోయినా ప్రజాస్వామ్యానికి వెంకటేశ్వర్లువంటి వాళ్ళు ఉత్తమ నిదర్శనాలు.

---

1. పశ్చాత్తాపం : ప్రాయశ్చిత్తమనే తన పాత కథను నాటకరూపంలో దించుదామని ముందు అధ్యాయంలో రామ్మూర్తి నిశ్చయించుకున్నాడు. అదిక్కడ పశ్చాత్తాపం అయింది.
2. పాపట్ల కాంతయ్యగారి కీర్తన పుస్తకాలు : బెజవాడ మైలవరం భారతీ నాటక సమాజంతో సంగీత దర్శకుడుగా పాపట్ల కాంతయ్య పని చేసేవారు. ఆయన కీర్తనల ప్రస్తావన.

రిహార్సల్సు చేయించటమంటే వెంకటేశ్వర్లు ఉద్దేశంలో పాటలు నలగగొట్టించటం. వాచకం విషయంలో గంటసేపు శ్రమపడితే, నటులు సంగీతం విషయంలో అయిదారు గంటలు శ్రమపడాలి. రక్తికట్టేవి పాటలు, ప్రేక్షకులు వన్సుమోరుకొట్టేవి పాటల కోసం.

రామ్మూర్తి ఊరికి వెళ్ళకపూర్వమే రిహార్సల్సు ప్రారంభమైనప్పటికీ, అతనికి తన సంభాషణ నటులనోట వినే అవకాశం కలగ లేదు. అతను తిరిగి వచ్చినాక ఈ సదవకాశం లభించేసరికి అతనికి మతి పోయినట్టయింది.

అంచరూ సంభాషణలను తగలేస్తున్నారు. అందరికన్నా రెండాకు లెక్కువ చదివినట్టు కనపడ్డది సుభద్ర. వీళ్ళ వాచకం గురించి ఇంతకాలమూ తను ఎట్లా గమనించకుండా ఉన్నదీ రామ్మూర్తికి అర్థం కాలేదు. ఒక్కరికీ వాచకం శుద్ధంగాలేదు. అందరికీ దిక్కుమాలినయాస, గ్రాంధికంలో సంభాషణలు దంచేసినవాళ్ళంతా చక్కని నోటిమాటలుగల వాడుకభాష నెందుకు తగలేస్తున్నట్టు ?

"ఏమిటీ ఘోరం ?" అన్నాడు రామ్మూర్తి.

"నేను మొదటనే చెప్పలా, మాష్టారూ ! ఈ భాష వాళ్ళకు తెలీదండీ ! వాళ్లేమిటి ? రేపు ఆడియన్సు కస అర్థంకాదు. నామాట నమ్మండి !" అన్నాడు వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్లుది తప్పని రుజువు చెయ్యటానికి రామ్మూర్తి రెండు మూడు వాక్యాలు గ్రాంధికంలోకి మార్చి, నటుల చేత అనిపించాడు. వెంటనే వాళ్ళవాచకం మార్పు కనిపించింది. చెవికి కటువుగా తోచటం పోయింది. వెంకటేశ్వర్లు ఎప్పుడైనా తప్పు చెబుతాడా ? వాడు అపరబ్రహ్మ. వాడి నోటవచ్చింది వేదవాక్కే.

రెండురోజులు కూర్చుని రామ్మూర్తి సంభాషణలన్నీ కృతకభాషలోకి మార్చేశాడు. నటులంతా నిట్టూర్చారు. రిహార్సల్సు సాగినై.

మరో నెలకల్లా నాటకం ప్రదర్శనోన్ముఖమయింది. రామ్మూర్తికి నాటకంతో గల సంబంధాన్ని పత్రికలు కొంతవరకు ప్రచారం చేసినై. మొదటి ప్రదర్శనం పట్నంలోనే జరిగింది. అనేకమంది పెద్ద లాహ్వానింప బడ్డారు. 'పశ్చాత్తాపం' మొదటి ప్రదర్శనంలోనే విజయవంతమయింది.

వెంకటేశ్వర్లు దేశ సంచారానికి ప్లానులు వేశాడు. రామ్మూర్తికిప్పుడు కారేర్పడింది. వెంకటేశ్వర్లిచ్చిన అయిదువందల రూపాయలతో అతను సెకండుహాండ్ ఆస్టినుకారు కొనుక్కున్నాడు. ఆ కారులో సుభద్రను వేసుకుని నాటకం ఆడుతున్న చోటికల్లా కారుమీదే రామ్మూర్తి ప్రయాణం అయిపోతుండేవాడు. ఎందుచేతనంటే మిగతా ట్రూపువెంట సుభద్ర వెళ్ళలేదు. మద్రాసులో లాడ్జి ఎత్తివేసినప్పటినుంచీ రామ్మూర్తి పనీ సుభద్ర పనీ బాగుంది. సుభద్రను కాస్త ముస్తాబుచేసి బహిరంగంగా వెంటతిప్పాడు రామ్మూర్తి. ఈ తిప్పటంలో లోకం తన కళాభిరుచిని మాత్రమే చూస్తున్నదని అతని విశ్వాసం. ఇప్పుడతనిదగ్గిర సిగిరెట్టు టిన్ను, విదవ

కుండా వుంటున్నది. అది ఒక్క రామ్మూర్తి సొత్తేకాదు. ఎవరూ చూడనప్పుడు సుభద్రకూడా సిగిరెట్లు నుసిచేస్తూ ఉండేది.

కలావాణి పత్రిక ఇంకా నడుస్తూనే ఉంది. రామ్మూర్తి ఇంకా దాన్ని చూస్తున్నాడు. అతని కిప్పటికీ జీతం ముట్టుతూనేవుంది. కాని ఇటీవల దాని ధోరణి మారింది. అందులో అన్నిరకాల వ్యాసాలూ పడుతూనేవున్నై. పత్రిక అమ్మకం కూడా కొద్దిగా పెరిగింది. వెనకటంతగా నష్టం రావటంలేదు. కాని పత్రిక ఒక్క నెల కూడా సమయానికి రావటంలేదు. ఒక సంచిక పదమూడు రోజులాలస్య మయింది.

మరోవంక రామ్మూర్తి ప్రఖ్యాత నాటకకర్త అయిపోతున్నాడు. అతని రచనమీద ఇప్పుడు అభిప్రాయాలిస్తున్నది పదేళ్ళక్రితం సాహిత్యంమీద అభిప్రాయా లిచ్చినవాళ్ళు కారు. ఇప్పుడభిప్రాయాలిచ్చే వారికి విమర్శనాసూత్రాలు లేవు. వీరు నాటకం చూస్తారు. ప్రదర్శనం వారికి నచ్చితే ఆ నాటకంతో సంబంధంగల వారం దరికీ ఇంతితకీర్తి పడేస్తారు. లేనిపక్షంలో అందర్నీ చెడతిడతారు.

రామ్మూర్తి రాసిన 'పశ్చాత్తాపం' అనే నాటకంలో ప్రతిభ ఏమీ లేదనీ, అతని కసలు నాటకం రాసే అర్హతే లేదనీ మనం అనుకోవటంలో ఇబ్బంది ఏమీ లేదు. ఈ సంగతి పత్రికాముఖంగా అన్నవాళ్ళు లేకపోలేదు. కాని వారి విమర్శలు నాటక ప్రదర్శనంయొక్క విజయానికి గాని, రామ్మూర్తిపేరు వ్యాప్తిచెందటానికి గాని అడ్డేమీ రాలేదు. అతను తన రెండో నాటకం కూడా రాయటం ప్రారంభించాడు.

ఈ స్థితిలోకూడా రామ్మూర్తి తన పాత సంస్కారాన్ని పూర్తిగా వొదులుకో లేకపోయినాడు. తన మొదటి నాటకాన్ని ప్రజలు ఆదరిస్తున్నారని తెలియగానే అతను నాటక రచనమీద వ్యాసాలు రాయటం మొదలు పెట్టాడు. నాటక రచన ఒక కళ అనీ, అది ఉత్తమ కళ కూడాననీ గట్టిగా నొక్కి వక్కాణించాడు. మనదేశంలో ఈ కళ ఇంతకాలమూ మృగ్యంగా వుండి ఇప్పుడిప్పుడే చిగుర్చుతున్న దన్నాడు. దిఙ్మాత్రంగా తాను నాటక రచనలో కెట్లా దిగింది చెప్పాడు. ఇక ముందు ముందు ఆంధ్ర దేశంలో ఏమిటి, భారతదేశంలో ఏమిటి, ప్రపంచంలో ఏమిటి, మిగతా కళలు వెనక పడిపోయి నాటక కళే మిగులుతుందని జోస్యం చెప్పాడు. ఏమంటే నాటకంలో అన్ని కళలూ వున్నై. కథ వున్నది. కవిత్వం ఉన్నది. పాత్రధారణలో చిత్రకళ వున్నది. పాటలలో గానకళ వున్నది. అభినయంలో నాట్యకళా వున్నది. నాటకరంగంమీద ప్రవేశపెట్టటానికి వీలులేని లలితకళ లేదు. వుండబోదు....ఈ ధోరణిలో! రామ్మూర్తి గొప్ప నాటకకర్త అనే విషయం ఈ వ్యాసాలు చదివినవారికీ రూఢి అయిపోయింది....

కాలక్రమాన కల్యాణికి ఆడపిల్ల కలిగింది. త్వరలోనే ఆమె పిల్లతోసహా పట్నం వచ్చేసింది. ఆమె రాగానే రామ్మూర్తి స్వేచ్ఛ కొంతభాగం కట్టుపడి పోయింది. ప్రస్తుతం కల్యాణి పిల్ల ప్రపంచంలో వున్నప్పటికీ, రామ్మూర్తిన్నికూడా

ఆ గూట్లోకే ఈడ్చుకుపోవాలని ప్రయత్నం చేసింది. తప్పించుకోవటం అతనికి సాధ్యం కాలేదు. సుభద్రతో అతనికి గంటలకు గంటలు గడిపే అవకాశం లేదు. ఆదివరకల్లా లేని బాధ ఇప్పుడు మరొకటి పట్టుకుందతనికి. అదేమిటంటే, తన పరిశ్రమవల్ల సుభద్ర ఇప్పుడు కొంతవరకు నలుగురి ఎదటికీ పోదగ్గ మనిషిగా తయారయింది. అందువల్ల ఆమెకోసం జనం ఎగబడుతున్నారు. ఎప్పుడో ఒకప్పుడు ఎవడో ఒకడు దాన్ని ఎగురేసుకుపోక తప్పదు. ఇప్పుడిప్పుడది ఎవరినీ లక్ష్యం చెయ్యకుండా, ఎప్పుడెవరే బహుమానాలిచ్చినా పుచ్చుకుంటున్నది. పౌడరు డబ్బీలూ, పేరెలూ, ఉంగరాలూ వొస్తున్నై. తనుకూడా చెప్పిచూశాడు. "ఇవాళ ఉంగరం ఇచ్చినవాడు రేపు నీ చెయ్యి అడగడా? ఎందుకు లేనిపోని మొహమాటాలు తెచ్చి పెట్టుకోవటం?"

సుభద్ర వినలేదు. తన కెవరో ఊరికే వస్తువులిస్తే అంత మాత్రానికే తను ఏటిదైపోయినట్టేనా అని అడిగింది. వాళ్ళ సంతోషం కొద్దీ ఇస్తుంటే తనూ సంతోషంతోనే పుచ్చుకుంటున్నానన్నది.

ఇప్పుడు సుభద్ర వేరే ఇల్లు తీసుకుని ఉంటున్నది. ఎవరుపడితే వాళ్ళు వచ్చిపోతూ వుంటారు. కాపలా కాయటానికి తనకు ఓపిక, అవకాశం లేదు. మామూలు ప్రకారం నాటకాలు పడ్డప్పుడు వెళ్ళి వేసివస్తున్నది.

సుభద్రను మద్రాసునుంచి పంపేసి ట్రూపువెంట వుండే ఏర్పాటు చేద్దామని చూశాడు రామ్మూర్తి. కాని సుభద్రకు కోపం వచ్చింది. "ఇప్పుడు మీ ఆవిడ వచ్చిందిగనక నాతో అక్కర తీరిందా ? నా కసలు ట్రూపూ అక్కర్లేదు, నాటకాలూ అక్కర్లేదు. హాయిగా ఏ సినిమా కంపెనీలో చేరినా రాజా అల్లే గడుస్తది!" అని బెదిరించింది.

"ఏ సినిమావాళ్ళన్నా రమ్మంటున్నారా?" అన్నాడు రామ్మూర్తి.

"పనికిరానెట్టా?" అన్నది సుభద్ర.

"పనికొస్తావులే. మాటవరస కడిగాను."

"మరిక నేం;....ముష్టి వొందరూపాయలకి ఊళ్ళూళ్ళూ ఎవరు తిరుగుతారయ్యా ఓ పట్టున పడుండకా ? మా అమ్మను పిలిపిస్తున్నా ! ఇక నేనీవూరు కదల్ను."

రామ్మూర్తి చేసేదేమీ కనిపించలేదు. అతని కసలు రోజులు బాగాలేవు. కలావాణి ఆపేద్దామని ముసలాయన అన్నాడు. దాన్నెవ్వరో నగల వర్తకుడు కొంటానన్నాడు. రామ్మూర్తి ఆ నగల వర్తకుడి దగ్గిరికి పరిగెత్తి తననే పత్రిక చూస్తూ వుండనిమ్మన్నాడు. అతను మొదట తనకు మరొకరున్నా రన్నాడు. ఆ తరువాత తాను యాభై మాత్రమే ఇవ్వగలనన్నాడు. అదైనా రెండునెల్లు చూసిగాని ఖాయం చెయ్యనన్నాడు. పౌరుషానికి రామ్మూర్తి మరొకర్ని చూసుకోమని కలతపడిన మనస్సుతో కారెక్కి సుభద్ర ఇంటికొచ్చాడు.

సుభద్ర ఎవరితోనో చాలా సరదాగా మాట్లాడుతున్నది. పిచ్చెత్తిన వాడల్లే రామ్మూర్తి లోపలికి వెళ్ళాడు. లోపల ఆకుపచ్చకోటూ; నల్లగీరల లాగూ వేసుకుని ఒక కుర్రాడున్నాడు. ఆ కుర్రాడు రామ్మూర్తిని చూస్తూనే బయటికి జారుకున్నాడు.

"వీడెవడు ?" అన్నాడు రామ్మూర్తి.

"ఎవరో జమీందారుగారి బంధువంట," అన్నది సుభద్ర.

"ఏ జమీందారు ?"

"ఏమో ఎవరికి తెలుసు ?"

"ఏం పనిమీదొచ్చాడు ?"

"ఈడా ? సినిమా సంగతి మాట్లాడ్డానికొచ్చాడు."

"ఏం సినిమా?"

"ఆ జమీందారు గారు సినిమా పెడతాడంటగా ?"

రామ్మూర్తికి ఒళ్ళు మండిపోయింది. సుభద్రమీద అతనికంత కోపం ఎన్నడూ రాలేదు. బాగా తిట్టేశాడు. కుక్కకుండే విశ్వాసం కూడా లేదన్నాడు. ఎక్కడో మురుగులో పొర్లాడే పందిని తెచ్చి తనూ వెంకటేశ్వర్లూ కలిసి పైకిలాగి ఒక మనిషిని చేసినందుకు ఇప్పుడు తను సొంతలాభం చూసుకోవటమేనా చేసేదని అడిగాడు.

సుభద్ర ఏడిచింది. ఈ పాడునాటకాలు తనకిక వొద్దన్నది. హాయిగా సినిమాలో చేరి పోతానన్నది.

"నీ సంగతి తప్ప ఇంకోరి సంగతి చూడలేవా?" అన్నాడు రామ్మూర్తి.

"మీకేంవయ్యా ? మీరంతా నా బోటి పందుల్ని పట్టుకొచ్చి మనుషుల్ని చేస్తారు. ఇంకెవరన్నా పందుల్ని చూడరాదా?" అన్నది సుభద్ర.

రామ్మూర్తి కళ్ళనీళ్ళ పర్యంతం అయినాడు. పత్రిక పోయింది. సుభద్ర మానేస్తే నాటక కంపెనీ కూడా పోయినట్టే.

"నేనిట్లాగే నాటకాలు రాస్తే వెంకటేశ్వర్లు డబ్బిస్తాడేమోగాని నువు లేని కంపెనీకి నేను రాయను." అన్నాడు రామ్మూర్తి.

సుభద్రకి జాలేసింది. ఇంత సంస్కారంగల రామ్మూర్తికి- పందుల్ని పంకిలంలో నుంచి పైకిలాగి మనుషుల్నిచేసే రామ్మూర్తికి- ఎన్నడూ ఎవరిమీద కలగనంత జాలి అతని మీద సుభద్రకి కలిగింది. మిగతా విషయాలు సుభద్రకి తెలీకపోవచ్చుగాని, రామ్మూర్తివంటి వాడికి డబ్బులేకపోవడమంటే ఏమిటో ఊహించు కునే శక్తి ఉంది.

రామ్మూర్తి తల రొమ్ము కానించుకొని, "నువ్వు కూడా సినిమా కంపెనీలోకి రావే! నువ్వు లేకుండా నేను పోనుగా; సరేనా ?" అన్నది. ఈ ముక్కతో రామ్మూర్తి ఆర్భాటం తగ్గినా ఆనందం ఇవ్వలేదు. తనకు ఆర్థిక దుస్థితి కలగటమూ, అది ఈ మనిషి ద్వారా పరిష్కారం కావటమూ అతని ఆత్మగౌరవానికి రుచించలేదు. కాని డబ్బును గురించి ఆలోచించే అవసరం కాస్త తప్పినట్టు కనబడగానే అతను సుభద్రను గురించి

ఆలోచించటం మొదలు పెట్టాడు. ఈ పద్ధతి బాగుంది. తను వెంట ఉంటే సుభద్రకు క్షేమం. లేకపోతే ఈ జమీందార్ల నెవడు నమ్మాడు ?

# 9

సుభద్ర అన్నమాటమీద నిలబడింది. కవిగా రామ్మూర్తిని తీసుకుంటే తప్ప తాను రానన్నది.

జమీందారుగారి ఏజెంటు నయానా భయానా చెప్పిచూశాడు. వ్యవహారం తెగలేదు. ఏ మాటా చెప్పకుండా శలవు పుచ్చుకున్నాడు. సుభద్ర బెదరలేదు.

మర్నాడు ఏజెంటు మళ్ళీ వచ్చాడు. ఇద్దర్నీ తీసుకోవటానికి జమీందారు ఒప్పుకున్నారు. రామ్మూర్తి రాగానే గట్టిగా వాటేసుకుని ఈ శుభవార్త చెప్పింది.

"ఇవాళ సాయంకాలం ఆరింటికి మనం కార్లో రాజాగారి బంగళాకు వెళ్ళి కాంట్రాక్టు మీద సంతకాలు చేద్దాం. ఏం?"

నెలకు అయిదు వందల జీతంమీద సుభద్రనూ, పిక్చరుకు వెయ్యి రూపాయల లెక్కన రామ్మూర్తినీ బుక్ చెయ్యటానికి రాజాగారు సంసిద్ధులైనారు.

రామ్మూర్తి సంతకంచేసి ఉండేవాడే, సుభద్ర అడ్డంపడి రామ్మూర్తికి నెల జీతం ఏర్పాటు చేస్తేగాని ఒప్పనన్నది. జమీందారు ఎదట ఎంత గౌరవ మర్యాదలు చూపాలో తెలీక సుభద్ర రామ్మూర్తికి మేలు చేసింది. లేకపోతే రాజాగారి ఉద్దేశం రామ్మూర్తిని ఒక నెలలో వదలగొట్టుకుందామని. దేవుడా అంటూ రామ్మూర్తికి నెలకు రెండు వందలయాభై చేసి కాంట్రాక్టు రాశాడు.

"నా కయిదొంద లేంటి ? ఆరికి అందులో సొగవేంటి ? న్యాయ ప్రకారం ఆయన కెయ్యియ్యొచ్చు !" అన్నది సుభద్ర మాటవరసకు.

ఈ కాస్త పనీ పూర్తి చేసుకుని, సుభద్రను ఇంటి దగ్గర దింపి రామ్మూర్తి ఇంటికి వచ్చాడో లేదో, రాజాగారి కారు వచ్చి సుభద్రను రాజాగారింట రాత్రికి భోజనానికి పిలుచుకు పోయింది. ఇంటి దగ్గర రామ్మూర్తిని చూడగానే కల్యాణి బావురుమన్నది.

అతను ఎవతెనో తగులుకున్నాడని ఆ మధ్యాన్నమే ఎవరో పని పెట్టుకొచ్చి కల్యాణితో చెప్పి వెళ్ళారు.

రామ్మూర్తి వచ్చి అబద్ధం ఆడేశాడు. అంతా ఉత్తదన్నాడు. ప్రమాణాలు కూడా చేశాడు. అసలా మనిషి వేషాలువేసే మనిషన్నాడు - వేషాలువేసే వాళ్ళతో ఎవరూ సంబంధాలు పెట్టుకోనట్టు.

కల్యాణి అనుమానాలన్నీ తీరిపోయినై. కన్నీళ్ళలోనుంచి నవ్వింది.

కాని మిగిలిన ప్రపంచం అనుమానాలు మరింత దృఢమైనై. అనామకుడుగా ఉన్న ఒక పత్రికా సంపాదకుడు ఎవరో చట్కాగీధాన్ని పట్టుకుని సినిమాల్లోకి వచ్చి

గొప్పవాడైనట్టు చెప్పుకోసాగారు. అతనికి 'పక్షీంద్రుడు' అనే నామకరణం గూడా చెయ్యటం జరిగింది.

తాను పైకొచ్చినట్టు రామ్మూర్తిమటుకూ భావించనేలేదు. ఆ సినిమా కంపెనీ లోకి రావటం అతని ప్రాణానికి అధఃపతనంగానే ఉంది. ఈ సినిమాలోకం ఒక మహాప్రపంచం. ఇందులో సంస్కారమనేది ఏమూలా కనిపించలేదు. ఇక్కడ ఎవరూ మాటవరసకన్నా ఒక కృష్ణశాస్త్రి పద్యంగాని, ఓ యెంకిపాటగాని స్మరించు కోరు. ఇక్కడి పెద్దల్లో ఒకరికీ ఒక కవి పేరుగాని, ఒక సంస్కారంగల నటుడి పరిచయం గాని లేదు. ఇందులో చాలా మందికి రాఘవాచారిని స్టేజిమీదచూసే అవకాశం కూడా కలగలేదు. రామ్మూర్తికి రాజకీయాల్లో ఆసక్తి తక్కువ అయితే తనకన్న కూడా రాజకీయాలు గురించి తక్కువ తెలిసినవాళ్ళు సినిమా ప్రపంచంలో ఉన్నట్టు కనిపెట్టాడు. "పిక్చర్" అనటం కూడా చాతకాక "ఫిక్చర్" అనే విద్వాంసులు, సినిమా కంపెనీలో తన సమాన ఫాయలో ఉండటమేగాక, తనకన్న ఎక్కువ జీతాలు కూడా గడించటం చూశాడు రామ్మూర్తి. "బాలు" అనే పేరుగల వాడొకడు— జమీందారుగారి భృత్యుడు — రామ్మూర్తిని చాలా నీచంగా తుస్కారించి చూడసాగాడు. రామ్మూర్తికి చెడ్డకోపం వచ్చింది. వెళ్ళి రాజాగారితో రిపోర్టు చేశాడు. "నీ పని నువ్వు చూసుకో," అని రాజాగారు అతనికి సలహా ఇచ్చాడు.

అక్కడే చిక్కొచ్చింది. అతనికి చేసేటందుకు పనేమీలేదు. కాని అతను ఏ సమయాన లాడ్జిలో లేకపోయినా బాలు నానామాటలూ అనేస్తాడు "ఉండినన్నేం చెయ్యమన్నావు?"అని అడిగితే "నన్నడక్కు రాజాగార్నడుగు," అంటాడు. ఆఖరుకు విసుగెత్తి రామ్మూర్తి రాజాగారి దగ్గిరకెళ్ళి "నాకేదన్నా పని ఇవ్వండి," అని అడిగితే సాయంకాలం అయిదింటికి మాట్లాడదామనీ, మర్నాడు పదింటికి మాట్లాడు దామనీ రాజాగారు వాయిదాలు వేస్తూ వచ్చాడు. సుభద్ర ప్రోద్బలంవల్ల తనకు జీతం ఇస్తున్నారేగాని తనతో కంపెనీకి ఏమీ పనిలేదు. "నువు మాకక్కర్లేదు." అని రోజుకు నాలుగుసార్లు కంపెనీవాళ్ళు అతనికి జ్ఞాపకం చేస్తునే ఉన్నారు. ఈ విధంగా ఒక సంవత్సరం గడవాలి-తన దిక్కుమాలిన కాంట్రాక్టు సంవత్సరం ఉంది. ఈ లోపుగా కాంట్రాక్టు చించేసి తను వెళ్ళిపోతానంటే మహారాజుగా వెళ్ళ మంటారు. ఒక్కోరోజు మరీ రోతపుట్టి అంతపనీ చేద్దామనిపించేది రాజుగారి దగ్గిర కెళ్ళి, "నేనెంత సంస్కారంగలవాణ్ణో తమకు ఊహించే శక్తి సామర్థ్యాలుకూడా లేవు. నా ప్రతిభ తమకేమైనా ఉపయోగపడుతుందేమోనని సుభద్ర కోరినమీదట తమ కాంట్రాక్టుమీద సంతకం చేశానుగాని, సుభద్రను తమ కంపెనీలోకి తీసు కోవటానికిది లంచంకాదు. ఆ మాట నిరూపించేటందు కిదుగో కాంట్రాక్టు చించేస్తున్నాను. నా కల్లా ఒకటే చింతగా ఉంది. తమకన్నా వెయ్యింతలుగా నా గొప్పతనం గ్రహించగల సుభద్ర మీ దబ్బుకు కట్టుపడి మీ సంస్కార రహితమైన హస్తాలలో పడిపోయిందని! శలవు. తమరుండండి నేను వెళ్ళొస్తాను.' అని ఎంతో వ్యంగ్యంగా,

రాజాగారి గుండె తూట్లు పడేటట్లు చెప్పేద్దామని అనేకసార్లు రిహార్సు చేసు తున్నాడుగాని, రామ్మూర్తికి సరైన అవకాశం దొరకలేదు. దొరికే సావకాశమూ కనిపించలేదు.

ఈ బాధతోపాటు సుభద్రచెయ్యి జారిపోయిందనే బాధ కూడా రామ్మూర్తిని బాధించింది. ఆమెను చక్కగా మేకప్‌చేసి స్టూడియోలో స్టిల్సుతీయించి పత్రికల మీద ముఖ చిత్రాలుగా వేయిస్తున్నారు. రైటప్స్ రాయిస్తున్నారు. ఆమెను గురించి జిజ్ఞాసువులు ప్రశ్నలు వేస్తుంటే, పత్రికాధిపతులు జుగుప్సాకరమైన సమాధానా లిస్తూ, ఆమెకూ రాజాగారికీ లంకె పెట్టేస్తున్నారు. ఇదంతా మరి రామ్మూర్తికి బాధగానే ఉంది.

అంతకంటె మహా బాధగా ఉంది ఆమెను అతను వారాలతరబడి కలుసు కోలేకపోవటం. ఆమె ఇల్లు మారినట్లు తెలిసింది. ఒక రోజు కార్లో వెళ్ళిచూస్తే ఇల్లు తాళం పెట్టి ఉంది. మరోసారి వెళ్ళిచూస్తే ఇంకెవరో ఉన్నారు. చివరకామె ఇల్లు తెలుసుకుని అతను ఒకనాడు వెళ్ళితే మేడ కిందిహాలులో ఒక వృద్ధాంగన కనిపించింది. 'సుభద్ర ఉండే ఇల్లు ఇదేనా ?' అని అడిగితే, "ఎవరు నువ్వు?" అన్నది. పేరువిని "ఏం కావా" లనడిగింది. "సుభద్రతో మాట్లాడా" లంటే "ఏం మాట్లాడా" అన్నది. సుభద్ర తనకు పరిచయస్తు రాలేనని చెప్పిన తరవాత ఆమె ఇంట్లోలేదనీ, ఎప్పుడొస్తుందో తెలీదనీ చెప్పింది. రామ్మూర్తి వచ్చినదోవ పట్టక తప్పింది కాదు. కాని అతను కారెక్కి ఇరవై గజాలు వెళ్ళాడోలేదో రాజాగారి కారు ఎదురు వచ్చింది. అతను కారులో ఎవరూ లేరనేది చూసి తన కారు వడితగ్గించి వెనక్కుతిరిగి చూశాడు. కారు సుభద్ర ఇంటి ముందాగింది. రామ్మూర్తి కొంత దూరంవెళ్ళి ఏదో ఆలోచనవచ్చి తన కారునుతిప్పి సుభద్ర ఇంటికేసి పట్టించాడు. అతను అంత దూరంలో ఉండగానే రాజాగారి కారు సుభద్ర ఇంటి ముందునుంచి బయల్దేరివస్తూ ఎదురయింది.

కారులో రాజాగారున్నారు....

తనకూ సుభద్రకూ తీరిపోయినట్టు స్పష్టమయింది. ఇటీవల కొద్ది కాలంనుంచీ అతను తనకూ సుభద్రకూ సంబంధమున్నదనే సంగతి వ్యాప్తం అయితే బాగుండు నని కోరుకుంటూ వచ్చాడు. తారలతో సంబంధం ఉందనే అపఖ్యాతి కీర్తికన్న గొప్పది. సుభద్ర తార కాబోతున్నట్లు రామ్మూర్తి ఊహించగలిగాడు. కాని ఈ సంఘటన జరిగినాక ఆ అపఖ్యాతి స్వయంగా తెచ్చుకోసాగాడు. అతనితో అయిదు నిమిషాలు మాట్లాడిన ప్రతివాడికీ సుభద్రతో అతని సంబంధం గురించి తెలిసి రాసాగింది. రామ్మూర్తి భావించినట్టే ఇది కీర్తికింద జమకాసాగింది. రామ్మూ ర్తిని ఇటీవల ఎన్నడూ చూడని గౌరవంతో చూడసాగారు ప్రజలు. ఒక చెంప రాజగారున్నా సుభద్ర ఇంకా రామ్మూర్తి మీదనే మోజుగా ఉన్నదనీ, వాళ్ళిద్దరికి సంబంధం చెడలేదని కొందరు పుకార్లు కూడా పుట్టించి వ్యాపింపజేశారు.

# 10

రాజాగారిదగ్గిర చేరిన మొదటి అయిదు వారాలు అనుభవించిన నరకం రామ్మూర్తి ఆస్తి పోయిన తరవాత కూడా అనుభవించలేదు. తన స్థితి తలచుకుంటే ఏడుపొచ్చేది. తన కభిమానపాత్రమైన సాహిత్య లోకమూ నాటకలోకమూ దూరమైనై. సుభద్ర ఎడమైపోయింది. తన పరువు పూర్తిగా పోయింది, చేసేపనీ లేదు.

"ఈ నరకకూపంలోనుంచి ఎట్లా పైకొస్తాను? ఏం పాపం చేసి నేనిందులో వొచ్చి పడ్డాను?" అని తనను తాను ఎన్నోసార్లు ప్రశ్నించుకున్నాడు. ఇదంతా దేవుడు చేసిన ద్రోహంగా కనిపించేది. సుభద్రకు కూడా ఈ ద్రోహంలో దేవుడితో సమాన భాగం ఉందని రామ్మూర్తి మనస్ఫూర్తిగా నమ్మాడు. సుభద్రవంటి అథమురాలిమీద తాను జాలిచూపి, సౌహార్దం ప్రకటించినందుకు సుభద్ర తనను ఈ నరకంలో తోసి అదృశ్యమైంది. కుక్క పెట్టేచేతినే కరుస్తుంది.

రామ్మూర్తిని రామ్మూర్తి నిష్పాక్షికంగా చూసుకోలేకపోతే, మనం చూడరాదని ఎక్కడా లేదు. అతను జీవితం చేసిన ఏ పరీక్షకూ తట్టుకోలేదు. అన్ని పరీక్షల్లోనూ సున్నామార్కులు తెచ్చుకున్నాడు. అతను అందరిలాగా కళలజోలికి రాకుండా ఊరుకోలేదు. వచ్చినవాడు వెంకటేశ్వర్లు మాదిరిగానో సుభద్రమాదిరిగానో ఒకవంక తన ఆత్మశక్తి మీదా మరోవంక ప్రజల అసంస్కారం మీదా ఆధారపడి జీవిత సమస్యను పరిష్కరించుకోలేదు — సంస్కారం ప్రకటించాడు. ఇతర్లు —వెంకటేశ్వర్లూ, సుభద్రావంటివాళ్ళు—సులభంగా చేసే పాడుపని రామ్మూర్తి వంటివాడు చెయ్యాలంటే ఎంతో మథనపడాలి. వేంకటేశ్వర్లు ప్రజల అమాయకత్వాన్నీ, అమాయకులైన నటుల శక్తిసామర్థ్యాలనీ కలిపి దోచుకున్నాడు. స్వార్థం సాధించాడు. సుభద్ర సినిమా ఛాన్సు దొరకగానే వెంకటేశ్వర్లును నిశ్చితంగా వొదిలేసి సినిమాలో చేరింది. రామ్మూర్తిని వొదిలేసి జమీందారును చేపట్టింది. వాళ్ళకి కళా సమస్యలు లేవు, జీవిత సమస్యలేగాని. వాళ్ళని సులభంగా క్షమించవచ్చు. వాళ్ళవల్ల కళలకి ఉంటే ఉపకారం ఉండవచ్చుగాని ద్రోహం మటుకు లేదు.

రామ్మూర్తి విషయం అట్లాకాదు. అతను తన జీవిత సమస్యని ఏనాడూ నేరుగా ఎదుర్కోలేదు. వాటిని తన కళాభిరుచితో ముడిపెడుతూ వచ్చాడు. అతను ఏ కళకూ కించిత్తు ఉపకారం చేసినవాడు కాలేదు. కళల విషయంలో తనకున్న సంస్కార భావాలమీద ఎన్నడూ నిలబడలేదు. పైగా వాటి పతనానికి తన సంస్కారాన్ని కూడా బలిచేసి తద్వారా తవ జీవిత సమస్య సాధించుకున్నాడు. మంచో చెడో తన సంస్కారాన్ని నమ్మి అతను దానికోసం ఆత్మత్యాగం చేసుకోలేదు. అటువంటి ఆత్మత్యాగంలో మానవత్వం ఉండవచ్చు ననేదికూడా రామ్మూర్తికి స్ఫురించలేదు.

రామ్మూర్తిని ఎవరుకూడా ప్రతిఘటించి ఈవిధంగా అడగలేదు : "భావ కవిత్వ సంస్కారం పతనమయిపోయిన తరువాత నువు ఆ సంస్కారాన్ని అండ చేసుకుని పత్రికపెట్టి నూరు రూపాయల జీతంకోసం ఎవరి చేతనో త్యాగం చేయించుకున్నావు ! నాట్యకళ ప్రజల దగ్గిరికి పోదామనే ప్రయత్నంలో ఆ సంస్కారం చేతిలో పడ్డప్పుడు, ఆ పరిస్థితులకి నీ సంస్కారాన్ని సరిపెట్టుకుని నువ్వా ఆ సంస్కారాన్ని ప్రశంసించావు; అయిదు వందల రూపాయల కాసించి నువ్వా సంస్కారానికి దోహదంకూడా చేశావు. ఆ దోహదం విఫలమయిపోతుందనే భయంతో కృతక భాషావాదాన్ని కూడా ఆమోదించావు ! ఒక అలగా స్త్రీని ఆధారం చేసుకుని నీ అవసరం గడుపుకునేందుకు సంస్కారి అయిన పాడు అడుగు పెట్టటానికి వీల్లేని సినిమా కంపెనీలో అడుగుపెట్టి బయటికి పొయ్యేదారి లేనట్టు నటిస్తున్నావు!....ఇప్పుడు చెప్పు, కవిత్వం గురించి నీ విశ్వాసా లేమిటి? నాట్య కళ గురించి నీ నమ్మకా లేమిటి ?.... చెప్పవేం ! ఎందుచేతా? ఇవాళ నువు చెప్పే విశ్వాసాలకు రేపు మళ్ళీ ఏమి విషమ పరీక్ష కలుగుతుందో? నీ సంస్కారాన్ని ఇంకా ఎన్ని గొందులు తిప్పవలసివస్తుందో? ఈ సంస్కారానికీ, ఈ కళలకీ స్వస్తిచెప్పి జీవితమే ఒక భౌతిక సమస్యగా తీసుకుంటావా ? పోనీ. అదీ చెయ్యలేవు. ఎందువల్లా? నీకొక మూల కళాభిమాని అనే ఖ్యాతికూడా మూఢ ప్రపంచం నుంచి వస్తున్నది గనక ! పదిమంది కవులతోనూ, నటులతోనూ పరిచయం ఉంటే చూసి నిన్ను ఒకప్పుడు కళాభిమానివనుకున్నది లోకం. ఎవరికీ అక్కర్లేనిపత్రిక నడిపి నువ్వు కూడా ఒక సంపాదకుడివి— ప్రఖ్యాత సంపాదకుడివి కూడానూ- అయినావు. ఏ కళా లేకపోయినా, ప్రజారంజకంగా ప్రదర్శించబడ్డ ఒక నాటకం రాసి నాటక కర్తవుగా కొంత ఖ్యాతి తెచ్చుకున్నావు. ఇప్పుడుకూడా ఇంత నరకంలో ఉండికూడా, ఒక స్క్రిప్టు రాయనిస్తే, స్క్రిప్టు రైటరుగా కొంత ఖ్యాతి తెచ్చుకుని తద్వారా ఇక్కణ్ణుంచి మరో ఆశ్రయానికి పాకి, అక్కడ నీ స్వార్థంతోబాటు కీర్తికూడా దక్కే అవకాశం దొరుకుతుందేమో అని నీ ఆశ:"

నిజంగానే ఎవరన్నా రామ్మూర్తి నీవిధంగా, ప్రశ్నించివుంటే రామ్మూర్తి ఇవ్వగల సమాధానం ఏమీలేదు. ఎందుకంటే అదంతా నిజమే ! కాని రామ్మూర్తిని మనం జరిగిన దానికి తప్పుపట్టి, అతను చేసిన పన్లతో మనకు పేచీలేదు. కాని అతను చెయ్యకపోయిన పని ఒకటుంది; ఏ రోజున అతను తాను త్యాగంచేస్తున్న సంస్కారాన్ని గురించి తాత్వికంగా ఆలోచించటానికి గట్టి ప్రయత్నంచేసినా, సంఘంలో కలిగే మార్పు తాలూకు తత్వం అతనికి బోధపడి ఉండును. కళలు ప్రజల అధీనంలోకి పోతూవుండటం అతను గమనించాడు. అది తప్పని నమ్మాడు. నమ్మినవాడు వాటికి ఎడంగానూ ఉండలేదు; ఈ మార్పు తప్పనిసరి అని తెలుసు కుని, ఈ మార్పులోనుంచి సాధ్యమైనంత ఉన్నతాదర్శం సాధించి, ప్రజలను ఆత్మి ధికమైన మేలు కళలద్వారా సాధించే ఉద్యమం నిర్మించటానికి ప్రయత్నం

చెయ్యనూ లేదు. తానేదైతే కళా పతనం అని నమ్మాడో దాన్నే ఆశ్రయించి స్వార్థం గడుపుకున్నాడు.

దీనికికూడా రామ్మూర్తిని మనం తప్పుపట్టలేం. అతనికి కళాసృష్టిచేసే ప్రతిభలేదు. సాంఘిక వ్యవస్థలోనూ కళలలోనూ కలిగే పరిణామాన్ని తాత్వికంగా అవగాహన చేసుకునే విజ్ఞానమూ అతనికి లేవు. ఈ రెండూలేని మధ్యతరగతి సంస్కారి ఏ విధంగా ప్రవర్తించాలో రామ్మూర్తి ఆ విధంగానే ప్రవర్తించాడు. అతని స్థితిలో అతనివంటివాడు మరొకడు మరో విధంగా ప్రవర్తించి ఉంటాడనుకో నవసరంలేదు.

జమీందారు సుభద్ర ఇంటోనుంచి రావటం చూసిననాటినుంచీ రామ్మూర్తి మనోవేదన క్రమంగా తగ్గసాగింది. తాను వొదిలేసిన ముండను పట్టుకుని జమీందారుగారు ఊరేగుతున్నాడని అందరితోటీ చెప్పుకొస్తున్నకొద్దీ తనకు జమీందారు చేసిన పరాభవానికి పరిహారం జరుగుతున్నట్టే భావించాడు రామ్మూర్తి.

అతను ఇంకో తెలివైన పనికూడా చేశాడు. మొదటి నెలాపదిహేను రోజులూ తానుపడ్డ బాధను గురించి ఈగకైనా తెలియనివ్వలేదు. "ఇవి నాకు చెడు రోజులు. ఇంతకంటె చెడు రోజులు వచ్చిపోలేదా? ఓపికపట్టి ఉంటే దేవుడు సన్నిందులోనుంచి బయట పడెయ్యకపోడు" అనుకున్నాడతను. తనను కనిపెట్టి ఉండటం భగవంతుడి విద్యుక్త ధర్మాలలో ఒకటని రామ్మూర్తికి దృఢవిశ్వాసం. లోకంలో ఉన్న అసంఖ్యాక అనాథప్రాణులందరికీ ఏమీ చేయలేని భగవంతుడికి తనను కనిపెట్టి ఉండే శక్తి ఎట్లావచ్చిందో తెలుసుకోవాలని రామ్మూర్తి ప్రయత్నించలేదు.

అయితే, వెనకటికి చెప్పిన కథలో మిడతంబొట్ల జోస్యంలాగా రామ్మూర్తి విశ్వాసం మరోసారి రుజువయింది. ఓనాటి ఉదయం రామబ్రహ్మంగారు[1] పిలుస్తున్నారని రామ్మూర్తికి కబురు వచ్చింది. తనకి కబురు పట్టుకొచ్చినవాణ్ణి కారులో ఎక్కించుకుని రామబ్రహ్మంగారి దగ్గిరికి పరిగెత్తాడు రామ్మూర్తి.

"ఏం బ్రదర్, మా స్నేహితుడొకాయన పిక్చరు తీస్తానంటున్నాడే. నువ్వేమో రాజాగారి దగ్గిర యిరుక్కుపోయినావాయెను. నాకు వేరే లక్షపనులున్నై ........ ఏమన్నా మావాడికి తోడుపడగలవా?" అని అడిగాడు రామబ్రహ్మం.

---

1. రామబ్రహ్మం : గూడవల్లి రామబ్రహ్మం (1798– ? ) ప్రజామిత్ర పత్రికా సంస్థాపకుడు. తొలితరం ప్రఖ్యాత నిర్మాత, దర్శకుడు. 1939 లో రైతుబిడ్డ చిత్రానికి దర్శకత్వం వహించారు. అది బ్రిటిష్ ప్రభుత్వ ఆగ్రహానికికూడా గురి అయిన చిత్రం. 1938 లో మాలపిల్ల, 1940 లో ఇల్లాలు, 1941 లో అపవాదు, 1942 లో పత్ని, 1943 లో పంతులమ్మ, 1945 లో మాయాలోకం చిత్రాలకు దర్శకత్వం వహించారు.

మరో వారం రోజుల్లోపల అంతా స్థిరమయింది. కథా సంభాషణలూ, పాటలూ, పద్యాలూ రాయటానికి కొత్త కంపెనీ వారికి మాటిచ్చి, ప్రజామిత్ర[1] కొక కథ కూడా ఇవ్వటానికి ఒప్పుకుని, రామ్మూర్తి ఒకనాటి సాయంకాలం నేరుగా ఆచారప్పన్ వీధినుంచి రాజాగారి బంగళాకి వెళ్ళి తన రాజీనామా ఇచ్చుకున్నాడు. రాజాగారు రామ్మూర్తి రాజీనామాను చాలా సుహృద్భావంతో స్వీకరించారు. ఆయన ఫిలిమ్ తీసే ప్రయత్నాలు ఏ మాత్రమూ సుముఖంగా లేవు. మనుషులందర్నీ పంపేస్తున్నారట. అటువంటి సందర్భంలో రామ్మూర్తికి మూడు నెల్లజీతం కూడా ఇచ్చి పంపటంలో రాజాగారు చాలా ఔదార్యం ప్రకటించారనే చెప్పాలి. ఆయన్ను గురించి అనేక అపోహలు పడ్డందుకు రామ్మూర్తి చాలా నొచ్చుకుంటూ సవినయంగా శలవు పుచ్చుకున్నాడు.

రామ్మూర్తి కొత్త కంపెనీకి కథ రాశాడు. కంపెనీ డైరెక్టర్లు కొందరు కథను ఆమోదించలేక పోయినారు. వారందరి సలహాల ప్రకారం కథరాస్తే నాయకుడు సుగుణవంతుడూ, దుర్మార్గుడూ, దాతా, లోభీ, ఏకపత్నీవ్రతుడూ, జారుడూ, దేశభక్తుడూ, ఖద్దరు సూటుధారీ, అవివేకీ, దైవభక్తి పరాయణుడూ కావలసి వచ్చింది. రామ్మూర్తి అన్నిటికీ సమ్మతించాడు. కథానాయిక మటుకు పతిశీల మహాసాధ్వి. ఆ విషయం డైరెక్టర్లూ, వారి బావమరుదులూ ఏకాభిప్రాయం ప్రకటించారు. ఆవిడకు చదువు సంధ్యలు లేవు. భర్త కొట్టినా, తిట్టినా పడి ఉంటుంది. భర్త తనతో సరిగా ఉంటే ఉద్యానవనాల్లో పూలుకోస్తు పాటలు పాడుతుంది. భర్తతో దాగుడు మూతలాడుతుంది. భర్త దుర్మార్గుడై పోగానే చింకి చీరెకట్టుకుని ఏడుస్తూ పాడుకుంటూ వీధుల వెంట బయల్దేరుతుంది. దుర్మార్గుడైపోయేముందే నాయకుడు దాతృత్వంలో విచ్చల విడిగా ఓలలాడుతూ, తనను వరింపబోయే వేశ్యకివ్వటానికి గాను ఇతరత్రా అప్పులు చేయటంవల్ల, తీరా అతను దుర్మార్గుడై పొయ్యే సమయానికి చక్కగా నాయికకు తినేటందుకు తిండీ, కట్టేటందుకు బట్టా లేకుండా పోయింది. ఆవిడకు కట్టేటందుకు బట్టలేకపోవటం ఒక రసవత్తర సన్నివేశంగా చిత్రించమని ఒక బావమరిది రామ్మూర్తిని స్వయంగా కోరాడు.

అన్ని పక్షాలవారూ కోరిన అంశాలన్నీ పెట్టి రామ్మూర్తి కథా, మాటలూ, యథోచితంగా తయారుచేసి స్క్రిప్టు పూర్తిచేసి తన డబ్బు పుచ్చుకుని బయట పడ్డాడు.

ఇప్పుడు రామ్మూర్తి సినిమామీద జోరుగా వ్యాసాలు రాయసాగాడు. "మన చిత్రాలు బాగుపడాలంటే," "టెంపో అంటే ఏమిటి ?" "దర్శకత్వంలో "త్వం"

---

1. ప్రజామిత్ర : గూడవల్లి రామబ్రహ్మం స్థాపించిన పత్రిక. రాజకీయ లోకంలోనూ, సాహిత్య రంగంలోనూ సంచలనాన్ని సృష్టించిన పత్రిక.

న్నా. సినిమా ఒక కళే", "సినిమా ఒక పరిశ్రమ" మొదలైన గంభీర వ్యాసాలు ఆయా పత్రికల్లో ప్రకటించాడు.

అన్ని గండాలుగడిచి "రామ్మూర్తి పిక్చరు" బయటి కొచ్చేసరికి నలుగురు విమర్శకులు దాన్ని "చాట్టి తుక్కు చిత్ర" మని దీవించారు. వారి దీవనల మహత్మ్యమో అన్నట్టు అది అన్ని సెంటర్లలోనూ అయిదారు రోజులు నడిచి నడిరోడ్డుమీద ఆగి ఊరుకుంది.

అయితే రామ్మూర్తి నెవరూ మళ్ళీ పిక్చర్లలో తీసుకోరనుకున్న వాళ్ళు చాలా పొరపాటు పడ్డారు. ఈ చిత్రం నడవలేదని తెలిసిన వారం రోజులకే మరెవరో వచ్చి రామ్మూర్తిని మరో చిత్రానికి స్క్రిప్టు రైటరుగానూ, కవిగానూ, అసిస్టెంటు డైరెక్టరుగానూ బుక్ చేశారు. కాని దురదృష్టవశాత్తూ ఆ చిత్రం బయటికి రాలేదు. దాని తాలూకు సంపూర్ణ హక్కులూ ఒక దశలో పన్నెండు వందల రూపాయల కమ్మి ప్రొడ్యూసర్లు తమవంతు అణా వాటా ఉంచుకోవటం జరిగింది.

ఈ పరిస్థితుల్లో యుద్ధం వచ్చింది.

# 11

యుద్ధ సంవత్సరాలు రామ్మూర్తికి చాలా అడావుడీగా గడిచినై. అప్పటి కతను బ్యాంకులో రెండు వేలకు పైగా నిలవ వేసి ఉంచాడు. అతని కిప్పుడు సినిమా ప్రపంచంలో కొత్త వ్యాపకం ఏర్పడింది. రాఫిలిం అందక ప్రొడ్యూసర్లు ఇరుకున పడసాగారు. కొడక్‌వారు ఫిలిం ఎంచి ఇస్తున్నారు. త్వరత్వరగా పిక్చర్లు పూర్తిచేసుకో దలచిన వారికి తగినంత ఫిలిం దొరకటం లేదు. రాఫిలిం తెచ్చే పడవలు మునిగినట్లు [1] కూడా పుకార్లు వచ్చినై. బొంబాయిలో ప్రొడ్యూసర్ల దగ్గిర పెద్ద పెద్ద స్టాకులున్నట్లు తెలిసి రామ్మూర్తి మరొకర్ని వెంటబెట్టుకుని బొంబాయి వెళ్ళాడు. ఆ మరొకరు పెట్టుబడి చేసేవారు. కొందరు గుజరాతీ ప్రొడ్యూసర్లు వీరికి ఫిలిం అమ్మారు. ఆ ఫిలిం తెచ్చి రామ్మూర్తి పట్నంలో ఒకరిద్దరు ప్రొడ్యూసర్లకు అంటగట్టాడు. మంచి లాభాలే వచ్చినై. రామ్మూర్తి అందులో సహం పుచ్చుకున్నాడు.

కాగితం కొని ఉంచితే మంచి లాభం వస్తుందని బొంబాయి వ్యాపారస్తులు రామ్మూర్తికి సలహా ఇచ్చారు. రామ్మూర్తి కాగితం కూడా ఓపిక ఉన్నంతవరకు తెచ్చి స్టాకుచేసి అట్టే పెట్టాడు. ఇది కాలక్రమాన లాభించింది.

కొందరి సహాయం తీసుకుని రామ్మూర్తి వార్‌ఫండు నాటకాలూ ఆవీ ఆడించే ఏర్పాట్లలో పాల్గొనసాగాడు. ఇందులో కూడా చాలా లాభం వచ్చింది.

1. రాఫిలిం తెచ్చే పడవలు మునిగినట్లు వచ్చిన పుకార్లకు ఆధారాలు అప్పటి పత్రికల్లో ఉండవచ్చు.

మద్రాసులో ఆంధ్ర మహాసభ రజతోత్సవమూ,[1] నాట్యకళాపరిషత్తు సమావేశమూ[2] నవ్యసాహిత్యపరిషత్సమావేశమూ[3] ఒకేసారి జరిగినై. ఈసమావేశాలు జరిగి నన్నాళ్ళూ రామ్మూర్తి మంచి పబ్లిసిటీ తెచ్చుకున్నాడు. అందరూ తనవాళ్ళే. నవ్య సాహిత్య పరిషత్సమావేశం చూడటం అతనికిదే మొదటిసారి. కాని అందరూ పాత స్నేహితులే. కవి సన్మానం జరుగుతూంటే రామ్మూర్తికి స్వయంగా సన్మానం జరిగి నంత సంతోషం కలిగింది. ఈ సందర్భంలో అతను శ్రీశ్రీ,[4] ఇంద్రగంటి,[5]

---

1. మద్రాసులో ఆంధ్ర మహాసభ రజతోత్సవం : ? 1936 లో.
2. నాట్యకళా పరిషత్తు సమావేశం : ? 1936 ఆంధ్రనాటక కళాపరిషత్తు సభల ప్రస్తావన కావచ్చు.
3. నవ్య సాహిత్య పరిషత్సమావేశం : ఈ సమావేశం 1936 – 40 మధ్య జరిగి ఉండాలి. 1933 మార్చి 10, 11, 12 తేదీల్లో బరంపురంలో అభినవాంధ్ర కవి పండిత సభగా మొదలైన సంస్థే నవ్య సాహిత్య పరి షత్తుగా 1935 లో గుంటూరులో రూపొందింది. నవ్య సాహిత్యం, ఆధు నిక భాష ప్రచారానికి, తోడ్పడిన సంస్థ ఇది.
4. శ్రీశ్రీ : శ్రీరంగం శ్రీనివాసరావు (1910-1983), ఆధునికాంధ్ర కవి త్వంలో అభ్యుదయ యుగవైతాళికుడు. ప్రగతిశీల సాహిత్యోద్యమాలకు ముందుచూపు. కొ.కు. మాటల్లో చెప్పాలంటే శ్రీశ్రీ "కవిత్వం అమరం. చిరంజీవి". "వ్యక్తికి బహువచనం శక్తి" గా గుర్తించిన మహాకవి. "ప్రజా వళికి అతని కవిత జీవనాడి" శ్రీశ్రీ కవి, కథకుడు, పాత్రికేయుడు, విమ ర్శకుడు, నాటకకర్త, సినిమా పాటలూ మాటల రచయిత. రచనలు: మహా ప్రస్థానం (తొలి ముద్రణ 1950), ఖడ్గ సృష్టి (1966), చరమ రాత్రి (1980), 1 + 1 = 1 మొదలైన రేడియో నాటికలు (1964), మరో ప్రస్థానం. 1970 షష్టిపూర్తి సందర్భంలో శ్రీశ్రీ సాహిత్యం ఆరు సంపుటాలుగా వచ్చింది. మహాప్రస్థానం ఫాసిమిల్ ఎడిషన్‌ను గూటాల కృష్ణమూర్తి 1982 లో వెలువరించారు.
5. ఇంద్రగంటి : ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (1911– ) కవి, విమ ర్శకుడు, కథా రచయిత. గోదావరి, తెలుగువీణ మొదలైన ఖండ కావ్యాలు రచించారు. గౌతమీ గాథలు రూపంలో ఆయన అనుభవ గాథలు ఇటీవల వెలువరించారు. ఆరు యుగాల ఆంధ్రకవిత ద్వారా ప్రాచీనాంధ్ర కవితా నిర్మాణ, సౌందర్యాలకూ వైచిత్రినీ వెల్లడించారు. సంప్రదాయాన్ని వద లకపోయినా, మార్పు నాహ్వానించే సంస్కరణాభిలాషి అయిన సాహిత్య వేత్త.

పిలకా[1] మొదలైన యువక రచయితల పరిచయం చేసుకున్నాడు. వీళ్ళంతా ఏం రాస్తున్నదీ రామ్మూర్తికి బొత్తిగా తెలీదు. కాని వీరంతా పెద్ద కవుల కంటె తక్కువ తరగతి వాళ్ళని మటుకు అతనికి నమ్మకంగా తెలుసును.

ఈ సభల నుంచి ఒకనాడు ట్రామెక్కి ఇంటికి తిరిగి వస్తుండగా తన పక్కన కూర్చున్న వాళ్ళు ఏదో చర్చించుకుంటూండటం విన్నాడు. అందులో ఒకడు అర్థం లేని పద్యాలు చదవటం విని రామ్మూర్తి నిర్ఘాంతపోయినాడు. "కాకికేమి తెలుసు సైకో ఎనాలిసిస్ ... ఆటవెలది ద్విపద కత్తగారు ....... ఐదు రెండు మూడు అముక్తమాల్యద," మరోడు లంకించుకున్నాడు. "చలంగారి పాపం, ప్రజామిత్ర కోపం, జరుక్‌నాధ జాంబక్, మిణీశాస్త్రి హంబక్."[2] మొదటివాడు తిరిగి అందుకున్నాడు. "చీకటిలో నా గదిలో, నా గదిలో, చీకటిలో, చీకటిలో, నా గదిలో, చీకటిలో...."[3]

"వీళ్ళకేమైనా మతిపోయిందా?" అనుకున్నాడు రామ్మూర్తి.

"నన్నడిగితే ఈ సైకిక్ ఆటోమాటిజం అనేది హంబగ్. మనస్సు తన్ను తాను పరీక్షించుకునే ప్రయత్నంలో తన్ను తాను మార్చుకుంటుందికూడా!"

"సర్రియలిజంలో మనస్సు తన్ను తాను పరీక్షించుకోవటం ఉండదు. మనస్సు ఇన్‌హిబిట్ అవుతుంది.... ప్రాయిడ్[4] ....పాలెల్వార్డు[5] ....పికాసో[6]...."

---

1. పిలకా : పిలకా గణపతి శాస్త్రి (1911 - 1983) కవి, రచయిత, పత్రికా రచయిత. రచనలు : విభ్రాంతా మరుకము, రత్నాపహారము, మణిదీపిక, మీనాంబిక, విశాల నేత్రాలు. ఆయన రచించిన ఆభాస చారిత్రక నవలలు, సంప్రదాయ రీతులనూ నవ్యరీతులను వాడుకున్న సాహిత్యకారుడు.
2. కాకికేమి తెలుసు.... శ్రీశ్రీ అధి వాస్తవిక గీతాలు.
3. చీకటిలో .... శ్రీశ్రీ గేయంలోని పాదాలు కేక గేయంనుంచి (26-6-39 రచన)
4. ఫ్రాయిడ్ సిగ్మండ్ (1856–1939) : మనో వైజ్ఞానిక శాస్త్ర సంస్థాపకుడు. వైద్యుడు, నరాల రోగ నిపుణుడు, మనస్తత్వ శాస్త్రవేత్త. మనుషుల మానసిక స్థితిగతులు, చర్యలు, వ్యక్తి అచేతన యొక్క బాహ్య వ్యక్తీకరణలు అనీ, అందులోనూ స్త్రీ పురుష సంబంధమైన అంటే లైంగిక ప్రేరణల సంబంధమైన వ్యక్తీకరణాలనీ సిద్ధాంతీకరించినవాడు. అచేతనలో అణచుకున్న కోరికలకు—ప్రధానంగా స్త్రీ పురుష సంబంధమైన కాంక్షలకు-కలలు ప్రతిరూపాలని భావించాడు. మానవచరిత్ర, నీతికళ, శాస్త్రం, మతం, రాజ్యం, న్యాయం, యుదం మొదలైన వాటికి మూలం ఈ అచేతనే అని ఫ్రాయిడ్ అభిప్రాయం. ఫ్రాయిడ్ తన మనో వెజానిక సిద్ధాంతాలలో ప్రతిపాదించిన ఈడిపస్ కాంపెక్స్ విశ్వజనీనం కాదన్నవారు అల్‌ఫ్రెడ్ అడ్లర్, కార్లగస్టావ్ యూంగ్

ఈ జరుగుతున్నది సాహిత్య చర్చగాని, కళాచర్చగాని అయి ఉంటుందని అతనికి ఏ మాత్రమూ అనుమానం పోలేదు.

"మనకు ప్రోలిటేరియన్ లిటరేచరు కావాలి. ఆర్టు ప్రజల దగ్గిరికి పోవాలి."

"ఆ మాట నాన్సెన్స్. ప్రోలిటేరియన్ ఆర్టనేది కాంట్రడిక్షన్ ఇన్ టర్మ్స్. తెల్లని చీకటి అన్నట్టు, ప్రోలిటేరియన్ ఆర్టు కావలిస్తే తోలు బొమ్మలు చూడు. నాడియా[1] పిక్చర్లు చూడు. ఏముంది వాటిల్లో? ప్రోలిటేరియట్‌ను ఆర్టుగా దగ్గిరిగా తీసుకురావాలి——"

"మనదేశంలో అసలు ప్రోలిటేరి యట్టెక్కడ ?"

"ప్రోలిటేరియన్ ఆర్టంటే పొరమా, కంటెంటా ? తోలుబొమ్మలే తీసుకుని ప్రజల కుపకరించే విషయాలు ఆర్టుతో కలిపి చెప్పవచ్చు...."

"అది ప్రాపగాండా ! కళ ఎప్పుడూ ఉన్నత శిఖరాల్లోనే ఉంటుంది. అది ఎప్పుడూ కొద్ది మందికే."

"ఆర్టు ఉన్నత శిఖరాల్లో ఏమీ ఉండదు. అది మనం ఏ గడ్డి తినమంటే ఆ గడ్డి తింటుంది. గోబెల్సు[2] ప్రాపగాండాలో కూడా ఆర్టున్నది. టాల్

---

ఆడ్లర్ మానసిక, సాంఘిక కారణాలకు ప్రాధాన్యమిస్తే, యూంగ్ జాతి అనుభవ పరంపరకు ప్రాధాన్యమిచ్చాడు. నవ్య ఫ్రాయిడ్ వాదులైన హార్నీ, కార్డినర్, అలెగ్జాండర్, ఎరిక్‌ఫ్రాం, ఫ్రాయిడ్ స్త్రీ పురుష ప్రేరణ సిద్ధాంతం విభేదించారు. వీరు సాంస్కృతిక మనస్తత్వవేత్తలు, మార్క్సిజానికీ ఫ్రాయిడి నిజానికీ సమన్వయం చేయాలని ప్రయత్నించినవారు. ఈ శతాబ్ది కళాసృజనపై, విమర్శపై ఫ్రాయిడ్ భావాలు చూపిన ప్రభావం గణనీయం. సామాజిక శాస్త్రాల్లో ఫ్రాయిడ్ ధోరణి ఆత్మాశ్రయం. ఫ్రాయిడ్ రచనలు : Totem & Taboo (1918), Contribution of the Theory of Sex (1910), Interpretation of Sex (1919), Ego and 1d (1927), Civilization and its Development (1930) Three.

5. పాలెల్వార్డు (Paul Eluard 1895–1952): ఫ్రెంచికవి. సర్రియలిస్టు బృందంలోనివాడు.
6. పికాసో, పాబ్లో (1881–1973): ప్రపంచ విఖ్యాత స్పానిష్ చిత్రకారుడు, ప్రయోగవాది.

1. నాడియా పిక్చర్లు : వాడియా స్టంటు పిచ్చర్లలోని నాయిక నాడియా.
2. గోబెల్సు ప్రాపగాండా : Joseph Paul Gobeles (1897-1945) నాజీల ప్రచార యంత్రాంగపు డైరెక్టరు. బమ్మిని తిమ్మిని తిమ్మిని బమ్మిని ఆబద్ధపు ప్రచారాలలో చేయగలిగిన కుతంత్రాన్ని తెల్పేమాట గోబెల్స్ ప్రచారం/ప్రాపగాండా.

స్టాయి[1] కథల్లోకూడా ప్రాపగాండా ఉంది. జనసామాన్యానికి ఉపకరించే ఆర్టును ప్రచారమనిబూర్జువా జీవి ఎప్పుడూ ఏడుస్తుంది. కాంట్ హెల్పిట్ !"

"జనసామాన్యానికి చదువురాదు."

"చదివించుకుంటార్లే."

కుర్రకారు వాళ్ళు ఇటువంటి చర్చలు చేస్తూ ఉండటం రామ్మూర్తికి ఆశ్చర్యమూ అసహ్యమూ కూడా కలిగింది. అతను సాహిత్యం జోలికి పోయి చాలా కాల మైనప్పటికీ తెలుగు సాహిత్యానికి సన్నిహితులలో తానుకూడా ఒకడనే విశ్వాసం అతనికి లేకపోలేదు. ఇటువంటి అభిప్రాయాలుగల కుర్రాళ్ళ ఆటలు సాగినిస్తే ఇక సాహిత్యం గతి అడగక్కర్లేదనుకున్నాడు రామ్మూర్తి.

"అసలు కళ అంటే ఏమిటి?" అన్నాడొక కుర్రాడు.

"ప్రేక్షకుడి మీదా పరితమీదా శాశ్వతమైన ప్రభావం కలిగించే శక్తి, శాశ్వతంగా ఉండాలి."

"నాన్సెన్స్ ! శాశ్వతంగా ఉండే కళావస్తువు లేదు. ఎప్పటికైనా ప్రతిదీ చావ్వలిసిందే."

"శాశ్వతమంటే నేనో నిర్వచనం చెబుతాను. దాని ప్రయోజనం అయిపోయి నాక కూడా నిలబడ్డ కళ శాశ్వతమే."

"శాశ్వతంగా నిలబడే పుస్తకాలు నూటికీ కోటికీ ఒకటి ఉండవు."

"అదే కళాయుతమైన సాహిత్యం."

"అయితే కళారహితమైన సాహిత్యం ఏదీ ? ప్రయోజనం సాధించి నిలబడని సాహిత్యమా ?"

---

1. టాల్‌స్టాయి (1828–1910) సుప్రసిద్ధ రష్యన్ నవలాకారుడు, చింతనాశీలి. ఉపదేశకుడు. 1861–1904 దశలోని పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమ పరిణామాలనూ, వినాశనాన్నీ రచనల్లో చిత్రించినవాడు. యుద్ధమూ-శాంతి, అనాకెరినినా, కోసక్కులు ఆయన ప్రసిద్ధ రచనలు. లెనిన్ మాటల్లో "రష్యారో బూర్జువా విప్లవం సమీపిస్తూ వుండిన కాలంలో కోట్లాది రష్యన్ రైతులలో ఉద్భవించిన భావాలకూ, అనుభూతులకూ వక్తగా తొవ్‌స్తోవ్ గొప్పవాడు. తొవ్‌స్తోవ్ అపూర్వుడు. యెందుకంటే మొత్తంగా చూస్తే ఆయన భావాల వెరసి మొత్తం మన విప్లవపు నిర్దిష్ట లక్షణాలను రైతు బూర్జువా విప్లవంగా వ్యక్తంచేయడం తటస్థిస్తున్నది. ఈ దృష్ట్యా తొవ్‌స్తోవ్ భావాలలోని వైరుధ్యాలు నిజంగా మన విప్లవంలో రైతాంగం విరుద్ధ పరిస్థితులలో తమ చారిత్రక పాత్రను నిర్వహించవలసి వచ్చిందో ఆ విరుద్ధ పరిస్థితుల దర్పణమే" (వి.ఇ. లెనిన్, సాహిత్యంమీద వ్యాసాలు, పుట 14)

"ఓ, తప్పకుండా."

"అయితే ఉద్దేశించిన పనికూడా నెరవేర్చలేని సాహిత్యం ఏం సాహిత్యం?"

"వొట్టి చెత్త."

"అయితే ప్రయోజనం సాధించే సాహిత్యం చెత్తకాదుగా ?"

"ఏమో, అది కళమాత్రం కాదు."

"కళను గురించి ఎందుకట్రా ఈ ఆకదంపుడూ? ఒక పద్యంలో కళ ఉందా లేదా అనేదాని విషయం ఏ ఇద్దరూ ఏకీభవించలేరు. శిల్పం ఉందా లేదా, ప్రయోజనం ఉందా అనే విషయంలో బుద్ధిమంతులంతా ఏకీభవించవచ్చు. అంచేత ఆ రెంటిని గురించీ మాట్లాడండి. కళ అనేది పాత పుస్తకాల విషయంలో తప్ప మాట్లాడకండి. ప్రతి బొట్టిగాయా కళను గురించి మాట్లాడేవాడే ! గడిచిన వెయ్యి సంవత్సరాల్లోనూ నిలబడ్డ పుస్తకాలు వందలేవుగాని, కలంపట్టి ప్రతివాడూ కళ రాస్తాట్ట. కళే రాయాలని ప్రచారంచేస్తాట్ట ! ఈ పుస్తకాలన్నీ శాశ్వతంగా నిలబడతాైట ! పనికొచ్చే పుస్తకాలు సమర్థతతో రాయండి. చాలు ! ఇవాళ నిలబడ్డ పుస్తకాలన్నీ ఒకప్పుడు పనికొచ్చిన పుస్తకాలే ! కళ కళ అని వంకపెట్టి ఎందుకూ పనికిరాని పుస్తకాలు రాస్తారా?"

"అదేమిటోయ్, శాశ్వతంగా- క్షమించాలి, ప్రయోజనం అయిపోయినాక కూడా- నిలబడ్డ పుస్తకాలు తీసుకుని వాటిల్లో ఉన్న కళాంశా లేమిటో తెలుసుకోవటం తప్పా ?"

"నే చెబుతా పట్టు ఆ అంశాలేమిటో; సమగ్రమైన ప్రపంచజ్ఞానం, పరిశుద్ధమైన అంతఃకరణా, సంఘానికి అభ్యుదయం చేకూర్చాలనే దృఢ సంకల్పమూ, మనస్తత్వం గురించిన విశాల పరిజ్ఞానమూ, మానవ మనస్సును కదిలించే అపార ప్రజ్ఞా; వీటివెంట సంప్రదాయసిద్ధంగా వస్తున్న శిల్పంలో ప్రావీణ్యత సంపాదించటమూనూ, కావలిస్తే వీటికోసం ప్రచారం చెయ్యి. కళ కళ అని అయోమయంగా లబలబలాడే లాభమేమిటి ?"

ఈ విధంగా చర్చరేగిపోతున్నది. రామ్మూర్తి ఈ "పెద్దమాటలు" మాట్లాడే వాళ్ళకేసి, తప్పనిసరి అన్నట్టు ఒక్కసారి తిరిగిచూశాడు. అంతా అర్భకులు. గొప్ప కవుల చెంత నిలబెట్టిన మొహం ఒక్కటికూడా కనిపించలేదు. వాళ్ళగొడవ వినటం మానేసి తన దగ్గిర ఉన్న కాగితం వెంటనే అమ్మటమా లేక మరికొంచెం ధర వచ్చేవరకూ ఉంచటమా అనే సమస్యను గురించి ఆలోచించసాగాడు ....

ఆ తరవాత కొద్ది రోజుల్లోనే మద్రాసు ఖాళీ కాసాగింది.[1] జపాను వాళ్ళు ఎప్పటికైనా వచ్చితీరుతారనీ, ఏ రోజున వచ్చినా రావచ్చుననీ, వచ్చి సముద్రంలో ఓడని పెట్టుకున్నారనీ రకరకాల వార్తలు పట్నమంతటా వ్యాపించినై. మద్రాసు

1. మద్రాసు ఖాళీ కాసాగింది : రెండవ ప్రపంచ యుద్ధ సమయం ప్రస్తావన.

పౌరులు జపాను విముఖత్వం ప్రకటించటాని కన్నట్టు తండోప తండాలుగా పట్నం ఖాళీచేసి పోసాగారు. రామ్మూర్తి తన ప్రతినిధిగా భార్యను పుట్టింటికి పంపేశాడు. ఆవిడ మళ్ళీ కడుపుతో ఉన్నది.

మళ్ళీ రామ్మూర్తి జీవితం వ్యాపారంలో పడిపోయింది. నానాటికీ లాభసాటి వ్యాపారాని కవకాశాలు హెచ్చుతున్నై. అతని కారు రెండు వేలకు అమ్ముడు పోయింది.

యుద్ధ ప్రయత్నం ధర్మమా అంటూ ప్రజల సంపాదనలు పోతున్నై. యుద్ధ కారణంగా దిగుమతులు కట్టయి పోయినై. డబ్బు అతివృష్టి అయిపోయింది. ప్రతి వస్తువుధరా తాచుపాము కాటులాగా నానాటికీ హెచ్చిపోతున్నది.

"యుద్ధం అయేవరకూ ధరలు హెచ్చుతునే ఉంటై. యుద్ధం ఇప్పుడప్పుడే కాదు. మేం ఎంత ధరపెట్టి అయినా సరే బంగారం కొనేస్తున్నాం." అని బొంబాయిలో మార్వాడి స్నేహితుడొకడు రామ్మూర్తికి సలహా ఇచ్చాడు. అతని సలహా మీదనే రామ్మూర్తి మందులు కూడా విరివిగా కొని దాచాడు. లోహసామగ్రి కూడా విచ్చలవిడిగా కొని అమ్మసాగాడు రామ్మూర్తి.

అతని సంపద ఎంత హెచ్చిపోతున్నా అతను బాంకులో కానీ ఉంచలేదు. అంతా వస్తువుల మీదనే ఉండనిచ్చాడు. అతని కాలం యావత్తూ బొంబాయి మద్రాసుల మధ్య తిరగటంతోటే సరిపోతున్నది.

రామ్మూర్తి ఇన్ని రకాల మనుష్యులతో తిరిగినా బొంబాయి వ్యాపారస్తుల సంపర్కంవల్ల అతనికి కలిగిన ఆనందం మరెవరి ద్వారా కూడా అతనికి లభించలేదు. చమన్‌లాల్, మణిన్‌లాల్, ధూప్‌చంద్, దీప్‌చంద్, బాబట్‌లాల్, బోపట్‌లాల్ వగైరా వ్యాపారస్థుల్నీ, వాళ్ళు చేసే కళ్ళుతిరిగే వ్యాపారాన్నీ తలుచుకుంటే రామ్మూర్తి కొక విధమైన పారవశ్యం కలిగేది. డబ్బుచేత గుడ్లు పెట్టించేవాళ్ళే నిజంగా సార్థక జన్ములు. అసమర్థులంతా కళల్ని గురించీ, సాహిత్యం గురించీ కాలం వృధాచేస్తుంటే ఈ మహానుభావులు లోకాన్ని కుమ్మరి సారె మీదపెట్టి గిరగిరా తిప్పేస్తున్నారు. అయిదువందలూ వెయ్యీ చూసి అది కూడా డబ్బే అనుకున్న రోజులు తలుచుకొని రామ్మూర్తి సిగ్గుపడ్డాడు. బొంబాయిలో గడ్డి వ్యాపారంచేసి లక్షలు గడించేవాళ్లూ, పాల వ్యాపారంచేసి కోట్లు గడించేవాళ్ళూ ఉన్నారు.

బెంగాల్లో కరువొచ్చింది. ప్రజలు వేల సంఖ్యలో చస్తున్నారు. రాయలసీమలో కరువొచ్చింది. ఒరిస్సాలో కరువొచ్చింది. మలబారులో కరువొచ్చింది.[1]

---

1. బెంగాలులో కరువొచ్చింది....మలబారులో....1943–1944 మధ్య భారత దేశంలోని చాలా ప్రాంతాల్లో పంటలు దెబ్బతిన్నాయి. బెంగాలులో కరువు, రాయలసీమలో, ఒరిస్సాలో, మలబారులో, బీహారులో కరువు, నాలుగు

దేశద్రోహులు, దొంగ వ్యాపార్లు, దొంగ వ్యాపార్లని అల్లరి చేస్తున్నారు. ఆ మధ్య జరిగిన స్వాతంత్ర్యోద్యమాన్ని అడ్డగించింది వళ్ళే.

"అసలు దేశంలో ఉన్న ధాన్యమంతా ఎగుమతి చేశారు. దొంగ వ్యాపారం చెయ్యటానికి ధాన్యం ఎక్కడుంది?" అని రామ్మూర్తి కనిపించిన వాళ్ళందర్నీ అడిగాడు. రామ్మూర్తితో ఏకీభవించిన వారున్నారు.

కంట్రోలులూ అవీ తీవ్రం కాసాగినై. ఈ దిక్కుమాలిన దేశంలో ఈ వెధవ యుద్ధం మూలంగా స్వేచ్ఛగా వ్యాపారం చేసుకునే ఆస్కారం కూడా పోయింది. చాటుచాటుగా రామ్మూర్తి కాగితమూ, మందులూ, గుడ్డా ఆయినకాడికి హొదిలించుకో సాగాడు.

యుద్ధం అయిపోయేసరికి రామ్మూర్తి పాతికవేలు డబ్బు చేసుకున్నాడుగాని అవాయప్పన్ను కానీ యిచ్చిన పాపాన పోలేదు. డబ్బంతా దగ్గిరే ఉంచుకున్నాడు.

అదివరకెన్నడూ రాజకీయాలలో ఆసక్తి ప్రకటించని రామ్మూర్తి యుద్ధం అయిపొయ్యేనాటికి రాజకీయాలను గురించి శ్రద్ధ కనబరచసాగాడు. గడిచిన జాతీయ స్వాతంత్ర్యోద్యమాలన్నీ ఇప్పు డతనికి సువర్ణాక్షరాలతో లిఖించదగిన చరిత్రగా కనపడసాగింది. దేశీయ నాయకులూ, ఆంధ్రనాయకులూ కూడా అతని కళ్ళకి ఉన్నతంగా కనపడసాగారు. ఈ విషయం తనకు పూర్వం ఎందుకు తెలిసి రాలేదో అతనికి అర్థం కాలేదు. దానికి ఒకటే కారణం కనపడింది.—ఆ ఉద్యమాలు ఏదో రూపంలో సఫలత పొందుతున్నాయనీ, దేశాన్ని దాస్యంలో ఉంచిన బ్రిటిషు వారి కెక్కడో తగులుతున్నాయనీ అతని కప్పట్లో నమ్మకం లేకపోయింది. ఉద్యమాలు నడపటమూ, ప్రతిజ్ఞలు చెయ్యటమూ, జైళ్ళకు పోవటమూ, ఉపన్యాసాలివ్వ

---

మిలియన్ల టన్నుల ధాన్యం కొరత ఏర్పడిన కరువు పరిస్థితుల్లో ఒక మిలియన్ టన్నులను బ్రిటన్ ఎగుమతి చేసింది. ధాన్యం ధర పెరిగింది. దొంగ వ్యాపారం హెచ్చింది. ఐదు లక్షలమంది కరువువాత పడ్డారు. ఘోరంగా దెబ్బతింది. వ్యవసాయ కార్మికులే (ఈ సంపుటిలోని కరువు రోజులు కథను చదవండి) పస్తులు, పోషకాహార లోపంవల్ల కలరా, మలేరియావంటి అంటు వ్యాధులు వ్యాపించాయి. బెంగాలు ఆగ్నేయ ప్రాంతంలోని తమ్లుక్ కాంటాయ్ డైమండ్ హార్బరు, ఢక్కా, ఫరీద్ పూర్, తిప్పెర, నౌఖాలీ జిల్లాలు చాలా దెబ్బతిన్నాయి. 6 లక్షల కౌలు దార్లు 1943 భూమి పోగొట్టుకున్నారు. పశు సంపదలో 20% ఒక్క ఏడాదిలోనే నాశనమైంది. వివరాలకు చదవండి : Sumit Sarkar, Modern India, Macmillan, 1983 పు 406.

టమూ, తీర్మానాలు చెయ్యటమూ, పదవులు స్వీకరించటమూ, వొదిలెయ్యటమూ, రాయబారాలు నడపటమూ—ఇదంతా కేవలమూ ఒక నాటకమని అతని పూర్వ సంస్కారానికి కనిపించింది. కాని 1942 ఆగస్టులో అకస్మాత్తుగా రామ్మూర్తికి కనువిప్పయింది. కాంగ్రెసులో ఎంత ప్రజలశక్తి ఉంటేనేగాని ప్రభుత్వం ఉమ్మడిగా అంతమందినీ అరెష్టు చేసి ఉండదు ...యుద్ధకాలంలో[1] రామ్మూర్తి సంపాదించిన కొత్త స్నేహితుల్లో కాంగ్రెసుపై విశ్వాసం- కాంగ్రెసులో పరిపూర్ణమైన నమ్మకం- లేనివాడు లేడు.

అయితే రామ్మూర్తిలో కలిగిన ఈ రాజకీయ చైతన్యం ఒక్కసారిగా అతనికి రాజకీయ విజ్ఞానాన్ని కలిగించలేదు. కాంగ్రెసును విమర్శించే వారి కతను సమాధానాలు చెప్పలేకపొయ్యేవాడు. అటువంటి విమర్శలకు ఇవ్వదగిన సమాధానాలున్నప్పుడుకూడా అతని కవి తెలిసేవి కావు. మరెవరన్నా ఆ సమాధానా లిస్తున్నప్పుడు రామ్మూర్తి, తనకుకూడా ఆపాటి రాజకీయ పరిజ్ఞానం లేకపోయినందుకు, చాలా చింతించేవాడు.

ఎవరుపడితే వాళ్ళు, రైళ్ళలోనూ, ట్రాముల్లోనూ, పార్కుల్లోనూ, బీచిలోనూ, ఇళ్ళలోనూ కూడా రాజకీయాలు మాట్లాడుకోవటం ఒక విధంగా అతనికి రుచించేదికాదు. ఈ చర్చలవల్ల అతని రాజకీయ పరిజ్ఞానం పెంపొందకపోగా, అతని రాజకీయ విశ్వాసాలు బలహీనమవుతూ ఉండేవి... ఒకనాడతను ఒక అతి విచిత్రమైన సంభాషణ వినటం తటస్థించింది. ఇద్దరు ప్రఖ్యాత కాంగ్రెసు వాదులు గాంధీనీ[2] జవహర్లాలు[3]నూకూడా తీవ్రంగా విమర్శించటం విన్నాడు.

మరో సందర్భంలో ఒక కమ్యూనిస్టూ ఒక రాయిస్టూ[4] చర్చించుకుంటుండగా విన్నాడు.

---

1. రెండవ ప్రపంచ యుద్ధకాలం (1939-1945)
2. గాంధీ (1869-1948): భారత జాతీయ విముక్తి ఉద్యమ నాయకుడైన మహాత్మాగాంధీ ఆయన భావజాలంలోని రెండు అంశాలు : అహింస, ధర్మ కర్తృత్వ సిద్ధాంతం, గాంధీ దృక్పథ అవగాహన ఆయన రచనలతో పాటు చూడండి. 1. Hiren Mukherji, Gandhiji – A Study, Peoples Publishing House, New Delhi, June, 1979(Third-ed); 2.E. M. S. Namboodripad, The Mahatma and the Ism, Peoples Publishing House, Jan. 1958.
3. జవహర్లాల్ : జవహర్‌లాల్ నెహూ్ర (1889-1964).
4. రాయిస్టు: ఎమ్. ఎన్. రాయి అనుయాయులు.

"మీ కమ్యూనిస్టులు సరిస్తేగాని రాజకీయాలు బాగుపడవు. ఇంటర్నేషనల్[1] తీసిపారెయ్యటంలో స్టాలిన్ చాలా మంచిపని చేశాడు. ఇక మీ రాజకీయాలకు స్టాలిన్ బాధ్యుడు కాడు. మీ కిప్పు డెవరు దిక్కు ? యుద్ధం ప్రారంభం కాగానే, ఖచ్చితంగా 'ఇది ఫాసిస్టు[2] వ్యతిరేక యుద్ధం. ఇంతటితో సామ్రాజ్యవాదం నడుము విరుగుతుంది. ఇందులో మనం పాల్గొనవచ్చు'నని రాయి[3] ఘంటాపథంగా చెప్పి నప్పుడు మీ రెక్కడున్నారు ? మీ బ్రిటిషు కామ్రేడును నమ్ముకుని యుద్ధ వ్యతిరేక ప్రచారం చేశారు.[4] హిట్లరు రష్యామీద బడ్డ ఆరునెల్లదాక[5] మీకేం జరుగుతున్నదీ తెలీదు." అన్నాడు రాయిస్టు.

"మేం ఆలస్యంగా మేలుకున్నామేమో ? అండర్ గ్రౌండులో[6] ఉన్నాం. కాని మాకంటే ముందు మేలుకుని మీరేం చేశారు. ప్రభుత్వం డబ్బుతో యుద్ధ ప్రయత్నం సాగించారే గాని, శ్రామికులను కూడగట్టటానికి తగిన ప్రయత్నం

---

1. ఇంటర్నేషనల్ తీసిపారేయటంలో : కార్మికవర్గ సోషలిస్టు పార్టీల ఫెడరేషన్లపై. మొదట్లో ఇంటర్నేషనల్ అని పిలిచేవాళ్ళు, అంతర్జాతీయ కార్మిక సంస్థగా మొదటి ఇంటర్నేషనల్ కార్ల్‌మార్క్స్ చేయూతతో లండన్‌లో 1864 లో స్థాపితమైంది. రెండో ఇంటర్నేషనల్ పారిస్‌లో 1889 లో, మూడో ఇంటర్నేషనల్ 1919 లో మాస్కోలో స్థాపిత మయ్యాయి. 1943 మే లో రష్యన్ నాయకత్వం ఇంటర్నేషనల్‌ను రద్దు చేసింది.
2. "ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం .... ఇందులో మనం పాల్గొనవచ్చు" నని రాయి : ఎం. ఎన్. రాయ్ అనుయాయుల దృష్టి ఇది.
3. 1939 యుద్ధం ఆరంభం కాగానే అది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం కాబట్టి జర్మనీకి వ్యతిరేకంగా బ్రిటన్‌ను బలపరచాలని కాంగ్రెసు సంస్థను చేజిక్కించుకొని యుద్ధకృషికి తోడ్పడాలని ఎం. ఎన్. రాయ్ వాదించి రాంఘర్ సమావేశంలో ఆజాద్‌తో అధ్యక్షపదవికి పోటీ చేసి ఓడిపోయారు.
4. బ్రిటిష్ కామ్రేడును నమ్ముకొని యుద్ధ వ్యతిరేక ప్రచారం : బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి రజనీ పామీదత్ ప్రస్తావన ఇక్కడ.
5. హిట్లరు రష్యామీద బడ్డ ఆరు నెల్ల దాకా : 1941 జూన్‌లో సోవియట్‌పై హిట్లర్ దాడి చేశాడు. 1941 ఆగస్టులో జరుగనున్న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశానికి ముందుగా కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని బ్రిటిష్ ప్రభుత్వం తొలగించింది.
6. అండర్ గ్రౌండులో .... 1940–1942 మధ్య కమ్యూనిస్టులు రహస్య జీవితం గడిపారు.

ఏంచేశారు ? అసలు మీకు కబుర్లు చెప్పటానికి తప్ప, పనిచెయ్యటానికి ఓపిక ఎక్కడుంది ?" అని కమ్యూనిస్టు చెప్పాడు.

వాళ్ళ చర్చ రామ్మూర్తి సాంతం వినలేదు. అతనికి అసహ్యం వేసింది. వీళ్ళంతా రాజకీయాలు మాట్లాడట మేమిటనిపించింది. ఒకప్పుడతనికి లీలానాటక సమాజం ట్రూపును చూచి ఇటువంటి భావమే కలిగిందిగాని దాన్ని త్వరలో మార్చు కునే అవకాశంకూడా అతనికి దొరికింది. రాజకీయాల విషయంలో అటువంటి అవకాశం దొరకటానికి సదుపాయములేదు. అందుచేత అతను రాజకీయ సిద్ధాం తాల జోలికి పోనేలేదు. రాజకీయాలు తనకు సరిపడవని రామ్మూర్తి త్వరలోనే తెలుసుకున్నాడు.

కాని అంత సులభంగా రాజకీయాలతో అతనికి రుణం తీరిపోలేదు. అభ్యుదయ రచయితల సంఘం[1]వారి సమావేశం అతనికి జతపడింది. దాని విషయం ఆరాతీయగా అదంతా కమ్యూనిస్టుల ప్రత్యేక ఉద్యమమని ఎవరో అన్నారు. అయినా అతను సభలకు వెళ్ళాడు. ఈ ఉద్యమంలో తనకు పరిచితులైన పూర్వ కవులు కొందరున్నట్టు తెలిసి ఆశ్చర్యపడ్డాడు. వీళ్ళంతా కమ్యూనిస్టుల వలలో ఎట్లా చిక్కారో అతని కర్థంకాలేదు. అభ్యుదయ రచయితలు జరిపిన వైజ్ఞానిక ప్రదర్శనాలు చూశాడు. 'ముందడుగు'[2] నాటకం చూశాడు. అన్నీ ఆకర్షవంతం గానే ఉన్నై గాని అందులో ఉదాత్తత కనిపించలేదు. ఉదాత్తమైన కళ మనిషిని కదిలించరాదని రామ్మూర్తి కనిపించింది. ఆ విశ్వాసంలో అతనికి విశ్వాసం కుది రింది. ఒకనాడు కృష్ణశాస్త్రి చేసిన కావ్యపఠనం తన నెంత సంక్షోభపెట్టి తనని కళాప్రపంచంలో పడేసిందో అతనికా క్షణాన జ్ఞాపకం రాలేదు. అది జ్ఞాపకం

---

1. అభ్యుదయ రచయితల సమావేశం : తెనాలిలో అభ్యుదయ రచయితల సంఘం మహాసభలు 1943 లో జరిగాయి. రెండవ మహాసభ 1944 చివరలో విజయవాడలో జరిగింది. మూడవ మహాసభ 1945 డిసెంబరు 31, 1946 జనవరి 1 న రాజమండ్రిలో జరిగింది. ఇది మొదటి మహా సభల సమావేశం ప్రస్తావన కావచ్చు. రెండవ మహాసభల సందర్భమైతే ఆంధ్ర ప్రజానాట్యమండలి (కృష్ణాదళం) దుర్గ కళామందిరము 1944 అక్టోబరు 3 వేసినట్లు దాఖలా.

2. ముందడుగు : వాసిరెడ్డి (1914–1957) సుంకర (1909) రాసిన నాటకం. గొప్ప సంచలనాన్ని సృష్టించింది. మద్రాసు అడ్వైజరీ ప్రభుత్వం నిషేధించింది కూడా. (?-1946) వీరిరువురు రాసిన మరొక నాటకం మా భూమి (1947) ప్రభుత్వ నిషేధానికి గురి అయింది.

తెచ్చుకోవాలని అతను ప్రయత్నించ లేదు కూడానూ .... ఈ కళాప్రదర్శనాలు తన జీవితాన్ని ఎక్కడా స్పృశించినట్టు రామ్మూర్తికి తోచలేదు. శిల్పంలోకూడా ఆటే సంస్కారంలేదు. అయితే ప్రేక్షకులు వీటిని ఆప్యాయంగా స్వీకరించటం అతనికి వింతగా కనపడింది.... ప్రదర్శనాల్లో పాల్గొన్న వారంతా కమ్యూనిస్టులేనని తెలిసినతరవాత అతను వాటినిగురించి ఆలోచించటం మానేసి నిశ్చింతగా ఇంటికి వెళ్ళిపోయినాడు.

# 12

ఇటీవల రామ్మూర్తికి పట్నంమీద విరక్తి పుట్టింది.

"సంఘానికి ఎన్నో విధాల సేవ చెయ్యాలని ప్రయత్నం చేశాను. ఇక విసుగెత్తింది," అన్నాడతను భార్యతో. కల్యాణికూడా దానికి సమ్మతించింది తన భర్త సంఘసేవ చెయ్యటం కోసం తన జీవితమంతా ధారపోశాడని ఆమె నమ్మింది.

"పత్రికలనీ, సినిమాలనీ, నాటకాలనీ, వ్యాపారమనీ, అబ్బ-ఏం తిరిగారు! రెండు రోజులు వరసగా మీరింటో ఉన్నట్టేలేదు. దేముడి దయవల్ల ఇంత తినేటందుకుంది గనక ఇహ ఫర్వాలేదు. మనం ఈపాడు పట్నం వొదిలేసి ఇంటికిపోయి ఇంత ఆస్తి సంపాదించుకుని హాయిగా పడి ఉందాం పట్టండి !" అన్నది కల్యాణి.

కాని రామ్మూర్తి జీవితసమస్య అంత సులభంగా తీరేదికాదు. అన్నివైపులా అతనికి సమస్యలే. రేపు పిల్ల పెళ్ళిచెయ్యాలి, కొడుక్కు చదువు చెప్పించాలి. పదిపన్నెండెకరాలు పెట్టుకొని దానిమీద వచ్చేదాంతో సరిపుచ్చుకుంటూ హాయిగా కాలుమీద కాలేసుకోవటమనేది అసంభవం. వ్యాపారంచేసి విపరీతమైన లాభాలు తీసినవాడికి పొలంమీద పెట్టుబడి చెయ్యటమంటే చెరుకుతిని బెండు నమిలినట్టుగా ఉంది. పోనీ ఏదన్నా వర్తకం చేద్దామంటే సామాన్యపు వర్తకంసరళి అతనికి తెలీదు. ఏ పరిశ్రమలో నన్నా షేర్లు కొందామంటే అలవాటులేక భయం. అదీకాక పట్నంలో ఉన్న ధనికులందరి మధ్యా తిరుగుతూ, బొంబాయిలో ఉన్న సేట్లతో సహవాసం చేసేవాడు. ఇవన్నీ వొదిలించుకుని ఎక్కడో తన స్వగ్రామంలో అనామకులమధ్య ఉండటం ఎట్లా?

ఎక్కడచూసినా యూనియనులూ, సమ్మెలూను. పొగాకు పనివాళ్ళూ, ప్రెస్సులవాళ్ళూ, బళ్ళవాళ్లూ, రైల్వేవాళ్ళూ, ట్రాములవాళ్లూ, ఫాక్టరీవాళ్లూ, పాకీవాళ్ళు-ఒకళ్ళేమిటి ? అందరూ సమ్మెలు చెయ్యటమే.

జీవితం ఇంత దుర్భరం ఎందుకయింది? 1930 వరకూ తను ఆప్యాయంగా అనుభవించిన శాంతి ఏమైపోయింది? ఆ రోజుల్లో నాలుగయిదెకరాలు కూడాలేని

తనతోటి వాళ్ళనుభవించిన సుఖం ఇంత డబ్బున్నా తనకెందుకు దూరమయింది? ఏదో ఒకటిచేసి తన పొట్ట పోసుకోవటానికి ఇప్పటికీ రామ్మూర్తి కభ్యంతరం లేదు - పనిచెయ్యటమే కూలి అనుకున్న రోజులు విడిచేసి అతను చాలా దూరం వచ్చేశాడు. కాని అతని బాధ ఏమిటంటే, ఏంచేసినా తనకు అపాయమే కలుగు తుందనే భయం అతన్ని వెంటాడుతున్నది.

ఎంతో కష్టపడి నాలుగురాళ్ళు సంపాదించుకున్నాడు. దొంగవ్యాపారం చేసినవాళ్ళని ఒక వంక 'దేశద్రోహులూ' మరోవంక మహానాయకులూ కూడా తిడుతుంటే ఆ తిట్లన్నీ భరించి దిగమింగాడు. తాను చేసిన దొంగ వ్యాపారం వల్ల ఎవరి కొంపా కూలలేదనీ, ఇతరులను దోచిన వాళ్ళనే తానూ దోచానని సమర్థిం చుకున్నాడు. కాని ఈ డబ్బుతో ఏం చెయ్యాలో తెలీటంలేదు. ఎటుచూసినా కంట్రోళ్ళూ, ఆర్డినెన్సులూనూ. యుద్ధం హడావుడికూడా తగ్గిపోవటంతో రామ్మూర్తికి కొంత పిరికితనం పట్టుకున్నది. ఇంతకాలమూ దేవు డనుకూలించాడు. ఇప్పుడతనిక కొంచెం. తగాలి.

రామ్మూర్తి ఈ సందిగ్ధావస్థలో ఎంతోకాలం ఉండలేడు. త్వరలోనే తన డబ్బుతో ఏదో పెట్టుబడి చేస్తాడు. తన లాభాలకడ్డంగా ఉన్న శక్తులతో పోట్లాడ తాడు. తన స్థితిలోనే ఉన్న శక్తులతో చేతులు కలుపుతాడు. అతనికి కావలసిన శాంతి ఇకరాదు.

కొద్దిరోజులక్రితం అతనిదగ్గిరకొక కుర్రాడొచ్చాడు, పాతికేళ్ళుంటై.

"మీ కలావాణి పాత సంచికలుంటే ఒకసారి చూడనిస్తారా?" అన్నాడు కుర్రాడు. అప్పు డతనేదో కథ ఒకటి రాశాట్ట, దాన్ని కాపీ చేసుకోవటానికి వచ్చాడు.

రామ్మూర్తి అతన్ని కూచోబెట్టి ప్రసంగంలో దింపాడు. ఆ కుర్రాడు మాటల కోసం తడువుకుంటున్నట్టే మాట్లాడుతూ రామ్మూర్తి ఎత్తిన ప్రతివిషయమూ మాట్లాడాడు. కవిత్వమూ, పత్రికా సాహిత్యమూ, కళలూ, రాజకీయాలూ, ఆర్థిక సమస్యలూ, ప్రజాజీవితంలో ఆందోళనా, అశాంతీ మొదలైనవా టన్నిటిని గురించీ రామ్మూర్తితో మాట్లాడాడు.

"మీ రెంతైనా చెప్పండి. జీవితం గురించి మనకి కొన్ని మూలసూత్రాలు తెలిస్తేగాని మనకి పై విషయా లంతుబట్టవు. విశ్వమానవాత్మ ఏకత్వసిద్ధికోసరమే పాటుబడుతున్నది. కాని దాన్ని పడకుండా చెయ్యడానికి నిరోధక శక్తులు చాలా ఉన్నై. సోషలిస్టులే వర్గకలహం ప్రారంభిస్తున్నారని కొందరంటారు. అంతా వుత్తదీ! వర్గవిభజనా, ఒకవర్గాన్ని మరోవర్గం అణగదొక్కటమూ ఏనాడో ప్రారంభ మయింది. అణగదొక్కబడకుండా చూచుకోవటానికి కిందివర్గం ప్రయత్నాలు సాగించగానే అప్పుడే వర్గవిభజన ప్రారంభమైనట్టు మాట్లాడతారు. 'ఐక్యతా

నినాదం ఫాసిస్టునినాదం' అంటూ ఆమధ్యని పత్రికల్లో రాశాడు. సామ్యవాదం సూచించే ఐక్యతనూ, వర్గరాహిత్యాన్నీ అర్థంచేసుకున్న వాడికి, ఐక్యత ఎప్పుడు పోట్లాడి సాధించాలో, ఎప్పుడు సౌమ్యంగా సాధించాలో బోధపడుతుంది– సంఘంలో అశాంతికి ఒకే ఒక కారణం, దోపిడీ. అదే లేనినాడు ఏ ప్రచారమూ అశాంతిని వ్యాప్తి చెయ్యలేదు. దోపిడీ తరగతుల వారీగా జరుగుతున్నది. జీవిత సూత్రాన్ని చేతులోకి పట్టుకుని కదలించలేక దానికి చిక్కిపోయినవాడు ఈ పరిస్థితి నేమీ చెయ్యలేడు. కిందివాణ్ణి దోస్తాడు. పైవాడిచేత దోపిడీ చెయించుకుంటాడు. వాడేకళలు సృష్టించినా, ఏ రాజకీయాల్లో పాల్గొన్నా, ఏ ఆర్థిక సమస్యల్ని గురించి మాట్లాడినా ప్రపంచానికి పిసరంతైనా ఉపయోగంలేదు. జీవితసూత్రాన్ని చేతబట్టినవాడు దాన్ని మరింత చిక్కుపరుస్తాడో, చిక్కు విడదీస్తాడో అదివాడి ఆదర్శాలనుబట్టి ఉంటుంది. వాడు మంచికి పనిచేస్తే వాడివల్ల లోకానికి ఉపకారం ఉంది. చెడుకు పనిచేస్తే అపకారం ఉంది. వాడి సాంఘిక చైతన్యం గురించీ, వాడి రాజకీయాలను గురించీ, వాడు సృష్టించే కళల్ని గురించీ, ఉదాసీనంగా ఉండటం బుద్ధిమంతుడి లక్షణం కాదు.."

ఆ మర్నాడు యుద్ధంగురించీ, భారతదేశపు పెట్టుబడిదార్లు చేసిన యుద్ధ సహాయం గురించీ, దాని మూలంగా ఏర్పడిన రూపాయి కాగితాల అతివృష్టి గురించీ, దాన్ని ఆధారం చేసుకుని దొంగ వ్యాపారస్తులు చేసిన సాంఘిక ద్రోహం గురించీ చెప్పాడు. రష్యాను గురించి కూడా చెప్పాడు. రామ్మూర్తికి కొన్ని పుస్తకాల జాబితా ఇచ్చి, "ఈ పుస్తకాలు తెప్పించుకుని చదవండి. వాటిలో ఉన్నది కేవలమూ వేదవాక్యమని నమ్మి లేనిపోని ఆవేశాలు కూడా తెచ్చుకోనవసరం లేదు. అందులో సత్యమేదో, అసమగ్రంగా ఉన్న సత్యమేదో, క్రమంగా మీకే బోధపడుతుంది. ఈనాటి ప్రపంచాన్ని గురించి తెలుసుకోవటం సులభంకాదు. దానికి తగ్గట్టే అసత్యప్రచారం చాలా జరుగుతున్నది. 'పురుషులందు పుణ్య పురుషులు వేరయా'[1] అన్నట్టు చప్పునచూడగానే సత్యమూ అసత్యమూ పైకి ఓలాగే కనిపిస్తాయి. ఓ పిసరు అసత్యమే బాగున్నట్టు కూడా కనిపిస్తుంది. అంచేత జీవితం గురించి కొంతకాలం ఊహించటం మానండి" అని సలహా ఇచ్చాడు.

రామ్మూర్తి ప్రస్తుతం ఈ గ్రంథాలను చదవటంలో నిమగ్నుడై ఉన్నాడు. ఇవన్నీ చదివి అతనికి ప్రపంచం గురించి నిజం తెలిసినకొద్దీ అతని అశాంతి హెచ్చుతుందిగాని తగ్గదు. కాని ఆ అశాంతిలోనుంచి ఏదైనా పైకి రావచ్చు. జీవిత సూత్రం అతనిచేతికి చిక్కాలేగాని అతడు దాన్ని కదిలించటానికి ఏ ప్రయత్నం చేసినా చెయ్యవచ్చు. నానాటికి ప్రపంచంలోనూ, నాటక ప్రపంచంలోనూ అతను సంపాదించుకున్న పేరు సంఘాని కెప్పటికైనా నిజంగా ఉపకరించవచ్చు.

---

1. వేమన పద్యం ఉప్పు కప్పురంబు....లో మూడో పాదం.

## కృతజ్ఞత

ఇందులోని కథాంశాలు పఠితలు ముందుగా గ్రహించగలిగితే అధిక ప్రయోజనం ఉంటుందనే నమ్మకంతో వీటిని వాహినీవారి "స్వర్గసీమ"లో నుంచి సేకరించాను. ఇందుకుగాను నాకు దయతో తమ అనుమతినిచ్చిన వాహినీ వారికీ, "స్వర్గసీమ" కథాకర్తలైన శ్రీ చక్రపాణిగారికి కృతజ్ఞుణ్ణి.

— కొడవటిగంటి కుటుంబరావు.

# జీవితం

## మొదటి భాగం : పౌరాణికం

అనగా అనగా ఒక రాక్షసుడు. ఆ రాక్షసుడి పేరు దక్షిణామూర్తి. అందరూ ఆ రాక్షసుణ్ణి చూచి హడలిపొయ్యే వాళ్ళు. ఎందుకంటే ఈ దక్షిణామూర్తి రాక్షసుడు. దేవుడు లేడనేవాడు. ఆయన పెళ్ళాం ఆయనకు జబ్బు చేసినపుడు వెంకటేశ్వరస్వామికి మొక్కగట్టిన పసుపు గుడ్డ మూటతీసి అవతల పారేశాడు. జంధ్యం తీసేసి ఇంటి కప్పుమీద పారేశాడు. ఇంట్లో పూజలూ పునస్కారాలూ వీలులేదన్నాడు.

రాక్షసుడి పెళ్ళాం దేవుడంటే భక్తి, మొగుడంటే భయమూ కలది. ఆవిడ రాక్షసికాదు. ఆవిడ పేరు కృష్ణవేణమ్మ. వాళ్ళకు ఒక కొడుకుండేవాడు. వాడొక్కడికే తండ్రి అంటే భయం. రాక్షసుడికి వాడంటే ఇష్టం. ఎప్పుడన్నా పెళ్ళామంటేకూడా ఇష్టంగానే ఉండేవాడు. పెళ్ళామంటే ఇష్టమైనప్పుడు దేవుణ్ణి నమ్ముకోవద్దని బోధించేవాడు.

"పిచ్చిదానా, దేనికికూడా దేవుణ్ని నమ్ముకోకు. మనకు మంచి చేసినా, చెడుచేసినా మనిషే చెయ్యాలి లేదూ, మనకు మనమే ఆలోచించుకోవాలి" అనే వాడు రాక్షసుడు.

"అదేమిటండీ ? మనుష్య యత్నమూ, దైవయత్నమూ, అంటూ లేవూ ? దేవుడు కనిపెట్టి ఉండకుండానే మనం బతుకుతున్నామా ?" అనేది మహా పతివ్రత కృష్ణవేణమ్మ.

"మనని కనిపెట్టి ఉన్నవాడు దేవుడే అయితే మనని గోతిలోకి తోస్తున్నవాడూ వాడే అని ఒప్పుకో!" అనేవాడు రాక్షసుడు.

"అది మన ఖర్మ."

"అయితే అంతా మన ఖర్మే అనుకోరాదూ?"

సాంబయ్య అనే మహర్షి ఉండేవాడు. ప్లీడరు గుమస్తా చేసి ప్లీడరుగారు సంపాదించి నంతా సంపాదించాడని ప్రతీతి. పరమ భక్తాగ్రేసరుడు. ప్రతి శనివారం వాళ్ళింట్లో భజనలు జరిగేవి. నెలనెలా సత్యనారాయణ వ్రతం చేసేవాడు. ఏటా తిరుపతికి వెళ్ళేవాడు. ఇంట్లో ఏ అక్కర జరిగినా దానధర్మాలు చేసేవాడు. ప్రతి ఉదయమూ సాయంకాలమూ గంటసేపు దేవతార్చన చేసేవాడు. దేవుడాయనను

ప్రత్యేకంగా కనిపెట్టి ఉంటాడని అందరూ అనుకునేవారు. భగవంతుడు భక్తజన సులభుడుగదా. అందుకే ఆయన పట్టింది బంగారమయ్యేది. ఇబ్బందిలో ఉన్నవారిని సాంబయ్య ఆదుకునేవాడు వేరే ఏం ఆదుకోవాలి? సమయానికి డబ్బు సర్దుబాటు చేసి నోటు రాయించుకునేవాడు. చిన్న మొత్తాలు తీసుకొనేవాళ్ళు అశ్రద్ధ చేస్తారని పెద్ద వడ్డీ తగిలించేవాడు. ఆయన దగ్గిర అయిదు వందలు అప్పు తీసుకుని పన్నెండేళ్ళ తరవాత రెండెకరాలు రాసియిచ్చిన ఒక పుణ్యాత్ముడు, "ఇంకొకడికి ఇంకొకడికి ఈ ఆస్తి పోతే బాధపడి ఉండేవాణ్ణే గాని సాంబయ్యగారు గనుక" — అన్నాట్ట. సజ్జనుడు సజ్జనుడే.

సాంబయ్య మహర్షి రాక్షసుడికి సాక్షాత్తు పెత్తల్లి కొడుకు. నాలుగైదేళ్ళ పెద్ద వాడు కూడాను. ఆయనకూడా దక్షిణామూర్తి రాక్షసుడికి హితంచెప్పి చూశాడు. "నా మాట వినరా ! మనిషికి అంత మిడిసిపాటు కూడదు. ఈశ్వరుడి యందు విశ్వాసం ఉంచితే బాగుపడతావు గాని చెడవు. నమ్మిచెడినవారు లేరు." అన్నా డాయన.

"నమ్మి ఏం చెయ్యమంటావు? నీలాగ భజనలూ పూజలూ చెయ్యమంటావా?"

"చెయ్యి ! 'నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని'[1] అన్నారు. నువ్వు ఈశ్వరుణ్ణి ఉపేక్షిస్తే వాడూ నిన్ను ఉపేక్షిస్తాడు!"

"అటువంటి ఈశ్వరుడు నాకు అక్కర్లేదు."

"ఇట్లా అన్నవాళ్ళు బాగుపడరు."

"నీ భగవంతుడున్నది నన్ను పరీక్ష చెయ్యటానికేనల్లే ఉందే ! వాడు నిజంగా సర్వ సమర్థుడైతే నాచేత ఈ మాటలు అనిపిస్తున్నాడని తృప్తిపడి ఊరు కోరాదూ?"

"నువ్వు దేవుణ్ణి తలుచుకుంటే నాకేం లాభం చెప్పు. నీమంచి కోరే చెబుతున్నానని ఆమాత్రం గ్రహించలేవు?" అన్నాడు సాంబయ్య మహర్షి.

"అయితే నీకు నిజంగా భగవంతుడిలో నమ్మకం ఉందా?"

"ఎంతమాట అడిగావురా?"

"నేను కావాలనే అడిగాను. ఎందుచేతనంటే నీకు భగవంతుడిలో ఏమి నమ్మకం లేదని నాకు తెలుసు. నువ్వు చేసే అనేక పనులు నిజంగా భగవంతుడు చూస్తున్నాడనుకుంటే చెయ్యలేవు. మీ ప్లీడరు దగ్గరికివచ్చే పార్టీలతో అబద్ధాలు చెప్పి డబ్బు గుంజటమూ, ఆస్తులు తాకట్టు పెట్టుకుని వడ్డీలు గుంజి బీదముండా కొడుకులను నాశనము చెయ్యటమూ, నీ సొంత తమ్ముడే తిండికి కటకట పడినప్పుడు చూస్తూ ఊరుకోవడమూ, ఇటువంటివి సంఘం అనుమతించింది గనక చేస్తున్నావు

1. నోరునొవ్వంగ : పోతన ఆంధ్ర మహాభాగవతం ప్రథమస్కంధంలోని చేతులారంగ శివుని పూజింపడేని అనే పద్యంలోని రెండవ పాదం.

గాని దేవుడు అనుమతించటంవల్ల చెయ్యడంలేదు. నీకు నమ్మకం ఉన్నదల్లా ఇప్పుడున్న సమాజంరో[1]. అందులో నీకు అనుకూలంగాని మార్పులు ఏం జరిగినా నువ్వు నాలిక పీకేసు కుంటావు ముమ్మాటికి నిజం!" అన్నాడు రాక్షసుడు తమో గుణావేశపరవశుడై.

సాంబయ్య మహర్షి జాలిగా ఒక్క చిరునవ్వు నవ్వి, "వస్తా!" అంటూ వెళ్ళి పోయాడు.

## 2

దానవుడు దక్షిణామూర్తి దేవుణ్ని నమ్మలేదు సరేకదా, సంఘాన్నికూడా నమ్మలేదు. ఆయన పరమ నాస్తికుడు. కులాలేమిటనేవాడు. అంటరాని వాళ్ళేమి టనేవాడు. "ఇంకొకణ్ణి అంటరానివాడుగా చూసేవాడే అంటరానివాడు" అనే వాడు. ఎవరింటోనైనా భోంచేసేవాడు. నానా కులాలవాళ్ళనూ తెచ్చి తన పంక్తిని కూచోబెట్టుకుని పరమ పతివ్రత అయిన తన భార్యచేత వడ్డన చేయించేవాడు. అందరూ చాటుగా "కులభ్రష్టుడు" అనేవారు.

ఈ రాక్షసుడు సంఘం కూడదన్న ప్రతిపనీ చేసేవాడు. వితంతువులకు మళ్ళీ పెళ్ళి చెయ్యాలనేవాడు. అనటమేకాదు ఎన్నో పెళ్ళిళ్ళు చేయించేవాడు. స్వాములవార్లంటే మండిపడేవాడు. అదేదో ఊళ్ళో స్వాములవారు ఆడవాళ్ళంద రినీ తన చుట్టూ కూచోబెట్టుకుని అకస్మాత్తుగా బట్టలు విప్పదీసి "నేను కృష్ణుణ్ణి, మీరంతా గోపికలూ" అన్నప్పుడు ఈ రాక్షసుడు పనిపెట్టుకుని ఆ వూరు వెళ్ళి వివరాలన్నీ కనుక్కుని వచ్చాడు. ఆ స్వాములవారు ఇంకెక్కడెక్కడ ఏయే పనులు చేసిందీ చిర్తా వేసి ప్రచారం చేశాడు.

"పెద్దలతో కూడిన పని! మన బోటివాళ్ళం నోరు పారేసుకోవటం మంచిది కాదు. మనకు వర్తించే నియమాలు పెద్దలకు వర్తించవు. రాములవారు ఎందరినో చంపాడు. వాలిని చాటుగా కూడా చంపాడు. తపస్సు చేస్తున్న శంబుకుణ్ణి తల నరికివచ్చాడు. అవతార పురుషుడు గనుక ఆయనకు చెల్లి పోయింది. మనం అటు వంటి పనులు చేస్తే చెల్లుతుందా ?" అని ఎవరో పుణ్యపురుషుడు నచ్చచెప్పబోయాడు.

దానవుడు దక్షిణమూర్తి కళ్లూ, గొంతూ పెద్దచేసి, "అటువంటి దౌర్భాగ్యు లను అవతార పురుషులనుకోబట్టే మన దేశంలోనే బానిసలంగా బతుకుతున్నాం! అన్నట్టు నేను కూడా ఒక మహాపురుషుణ్ణీ, అవతార పురుషుణ్ణీ కానని నీకెట్లా తెలుసూ?" అని అడిగాడు.

---

1. కావ్య భాషారూపం, సమాజంలో కొ.కు. శైలిలో సరైన రూపం.

మనిషికి అంత అహంకారం కూడదు. అది తప్పకుండా నెత్తి అణుస్తుంది.

ఈ రాక్షసుడికి తండ్రి పదిహేనెకరాల సుక్షేత్రమైన మాగాణీభూమి ఇచ్చి పోయాడు. బియ్యేదాకా చదువు చెప్పించాడు. ఉన్న ఊళ్ళోనే బడిపంతులు ఉద్యోగం కూడా కుదిరింది. కాని స్కూలు కమిటీ సభ్యులను నానా మాటలూ అన్నాడు. అసలు స్కూలు సెక్రెటరీ కొడుక్కి పరీక్షలో సున్నా పెట్టాడు. బతక నేర్చిన వాడు చేసేపనేనా ? నెలనెలా అరవై అయిదు రూపాయలు తెచ్చిపెట్టే ఆ ఉద్యోగం కాస్తా ఊడింది.

"నేను చచ్చినా ఉద్యోగం చెయ్యను. తినటానికింత ఉన్నది. నా అంత రాత్మను అమ్ముకోవలసినకర్మ నాకేమిటి?" అన్నాడు రాక్షసుడు. పెద్దమ్మ నెత్తిన ఎక్కి అట్లా అనిపిస్తుంటే పాపం ఏంచేస్తాడు ?

ఉద్యోగం ఊడిన రెండోరోజు మూడోరోజు నడి వీధిలో స్కూలు సెక్ర టరీని పట్టుకొని "ఈ కాస్త పదవికే ఇంతమిడిసి పడుతున్నావే, ఇంకా పెద్ద హోదా దొరికితే మనుషులను బతకనిస్తావా ? నేనింత ఉన్న వాణ్ణిగనక సరి పోయింది. ఇదే బీదవాడైతే ముష్టెత్తుకోవలసిందేగా? నేను ఈ స్కూల్లోనే చదువు కుంటుండగా ఇంకో సెక్రెటరీ ఉండేవాడు. ఆయన కొడుకు నాతో కలసి చదివాడు. వాడికి ఇంగ్లీషులో ఒక్క మార్కు తక్కువైనా పైక్లాసులోకి ప్రొమోట్ చేశాడు. ఆయన పరుగెత్తుకుంటూ వచ్చి హెడ్మాస్టరుగారితో పోట్లాడి తన కొడుకుని కింది క్లాసులో డిటెయిన్ చేయించాడు. ఆయన చెప్పుకోదగిన మనిషి! ఆయనతో నిన్ను పోల్చాలనిపిస్తున్నది!" అన్నాడు.

ఆ సెక్రటరీగారు పరమసాధువు. ఒక్క మాటకూడా జవాబు చెప్పకుండా తనదారిన తాను వెళ్ళాడు.

కాని చేసిన పాపం కట్టికుడపకుండా ఉంటుందా?ఆ వేసవి శలవులు కాగానే రాక్షసుడి కొడుకు ప్రకాశాన్ని స్కూల్లో చేర్చవలసి వచ్చింది. స్కూలు మేస్టరు వాణ్ణి పరీక్షచేసి నాలుగో క్లాసు స్టాండర్డు లేదన్నాడు. తరువాత ఆ మేస్టరు పని పెట్టుకుని రాక్షసుడి ఇంటికివెళ్ళి చాలా సేపు ఏదో మాట్లాడి వెళ్ళాడన్నారు.

తరువాత ప్రకాశంకోసం ప్రయివేటు మేస్టరును పెట్టారు. ఇంకొకరి పిల్లలకు సున్నాలు పెడితే ఊరికేపోతుందా ?

దక్షిణామూర్తిని ఒకాయన హిరణ్యకశిపుడితో పోల్చాడు. ఆయన భార్య లీలావతి అయితే కావచ్చుగాని కొడుకుమాత్రం ప్రహ్లాదుడుకాడు. వాడు ఒక పిల్లరాక్షసుడు. తన తండ్రి అంతవాడు లేడని వాడికి నమ్మకం. తండ్రి నోటివెంట వచ్చే ప్రతిమాట వాడి తలలో శాశ్వతంగా పాతుకు పోయేది. వాడి ఈడుకు వాడు కూడా తండ్రిలాగే మాట్లాడేవాడు.

"గాంధీ అస్పృశ్యత తప్పంటే[1] పేపర్లో వేస్తారే. నాన్న కులాలు తప్పంటే ఎందుకు ఒప్పుకోరూ ?" అని ఆ బొట్టికాయ అడిగేవాడు.

"నాన్నలాగా గాంధీ దేవుడు లేడంటున్నాడేమిటీ ?" అనేది తల్లి.

"దేముడున్నాడంటే ఏముంది ? లేడంటే ఏముంది ?" అన్నాడు జూనియరు రాక్షసుడు.

"రెండూ ఒకటేనా ఏమిటీ ?" అన్నది తల్లి.

"లార్డుక్లయివు[2] తీసుకో. ఆయన దేవుడున్నాడా లేదా అని ఆలోచించలేదు. బ్రిటిషు వాళ్ళకి ఇండియాను సంపాదించిపెట్టి చరిత్రలో గొప్పవాడైనాడు. దానికేమంటావు ?" అన్నాడు ప్రకాశం.

"దేవుడిలో భక్తి వుండబట్టే గొప్పవాడైనాడేమో ?" అన్నది తల్లి.

"అయితే నాన్నకన్న క్లయివే మంచివాడంటావా ఏమిటీ ?"అన్నాడు ప్రకాశం నిర్ఘాంతపోయి.

# 3

ఒకనాడు రాక్షసుడి ఇంటికి ఒక గొప్పవాడు వచ్చాడు. ఆయన పేరు సి. వి. మూర్తి. ఢిల్లీలో ఏదో పెద్ద హోదాలో ఉండి నెలకు వెయ్యి రూపాయలు జీతం తీస్తున్నాడు. దానవుడు దక్షిణామూర్తికి చుట్టంకాదు. చిన్నప్పటి స్నేహితుడుట. ఆయనను చూడటానికి ఊళ్ళో ఉన్న డిప్టీ కలెక్టరూ, మునసబూ, సర్కిల్ ఇనస్పెక్టరూ రాక్షసుడి ఇంటికి వచ్చారు.

ఈ సంగతి తెలిసి రాక్షసుడి ఆప్తబంధువులూ, తదితరులూ, సాంబయ్యమహర్షి వంటి వాళ్ళు చాలా మంది వచ్చారు. గొప్పవాళ్ళను చూడబోవటం సముచితమే గదా. నావిష్ణుః పృథివీ పతిః అని పెద్దలు ఊరికే అన్నారా?

మిగిలిన విషయాలు అట్లావుంచి ఆ మూర్తి అనే ఆయన రావటం మూలంగా దక్షిణామూర్తి ఎటువంటి రాక్షసుడో అందరికీ తేట తెల్లమయింది. ఎందుకంటే ఈ మూర్తిగారు కూడా ఆచారమూ అదీ లేని మనిషే. దేవుడంటే నమ్మకం లేని వాడే, ఆయన ఎవరో బెంగాలీ ఆవిణ్ణి చేసుకున్నాట్ట. పేరు సలీము అనో ఏదో అన్నారు. ఈ బెంగాలీ బ్రాహ్మల పేర్లు చాలా విచిత్రంగా ఉంటై. మద్యమాంసాలు

---

1. గాంధీ అస్పృస్యత : అస్పృస్యతను గాంధీ జీవితాంతం నైతిక దృష్టితో వ్యతిరేకించారు.
2. లార్డుక్లయివు : Robert Clive (1725-74) బ్రిటిష్ సైన్యాధికారి. భారతదేశంలో ఫ్రెంచి సామ్రాజ్యవాదాన్ని అణగదొక్కి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని పాదుకొల్పినవాడు.

అలవాటైన వాడనికూడా చెప్పుకున్నారు. అయితే కావచ్చు కూడా. కాని ఆయన మాట ఎంత నిదానం ! ఎంత నిబ్బరం ! ఎంత నిండు ! భగవద్గీతలో భగవాన్లు సాత్విక లక్షణాలు వర్ణించాడే, ముమ్మూర్తులా ఈయనే !

ఇంకొకవింత ఏమిటంటే ఈ మూర్తితో[1] ప్రభుత్వోద్యోగం ఇప్పిస్తానంటే ఈ రాక్షసుడు వద్దనేశాట్ట. పైపెచ్చు "నేను ప్రభుత్వోద్యోగం అంటూ చేస్తే దేశం స్వతంత్రమైననాడే !" అని కూడ అన్నాట్ట ! ఎంత అహంకారం, ఎంత అతిశయం!

ఈ మూర్తీ, దక్షిణామూర్తీకాక వాళ్ళక్లాసులో ఇంకో మూర్తి ఉండేవాట్ట. తెలుగు మేష్టరు వాళ్ళకి మూర్తి త్రయమనికూడా పేరుపెట్టాట్ట. వీళ్ళిద్దరు "ఏంరా" అంటే "ఏంరా" అనుకుంటారు. దిగ్గజంలాటి ఆటువంటి మిత్రుణ్ణి పెట్టుకుని ఇంకొకడైతే చూస్తూ ఊరుకుంటాడా ?

ఆ మూర్తిగారు వెళ్ళిపొయ్యాక సాంబయ్య మహర్షి ఆయననుగురించి తన అభిప్రాయం స్పష్టంగా చెప్పాడు: "ఆయన క్రిందటి జన్మలో గొప్ప తపస్వి. ఏమి సందేహంలేదు. మనిషి వర్చస్సు ఎటువంటిది ! ఆయన దేవుడు లేడంటే అందులో అంతరార్థం గ్రహించారా ? సత్తుకూ అసత్తుకూ అతీతంగా వెళ్ళిపోయింది ఆయన దృష్టి. నన్నడిగితే పరాకాష్ట అందుకున్న సాంఖ్యయోగి అంటాను. అటువంటివాణ్ణి కర్మ బాధించదు. వాళ్ళు కర్మకు అతీతులైన జ్ఞానయోగులు".

సాంబయ్య మహర్షి ఇటువంటిమాట అందర్నిగురించీ అంటాడా !

"మనవాడు మదాంధుడై ఆ పెద్దమనిషి ఉద్యోగం ఇప్పిస్తానంటే వద్దన్నాడు. తన సాటివాడు తనకు ఉద్యోగం ఇప్పించడమా అని అహంభావం! అటువంటి అహంభావం ఆ పెద్దమనిషి కింకా ఎంత ఉండవచ్చు ! కాని ఆయనకులేదే ! ఉంటే వీడి ఇంటికివచ్చి ఒక పూటల్లా ఉంటాడా ? లేకపోయినా వీడు భగవంతుడికే ఎసరు పెట్టినప్పుడు మనుషులొక లెక్కా-జమా!" అనికూడా సాంబయ్య మహర్షి అన్నాడు.

పాపం సాంబయ్యగారు ఈ రాక్షసుడి బాగుగురించే ఎప్పుడూ ఆలోచించేవాడు. ఈ రాక్షసత్వం పోగొట్టటానికి వీలయినంత మానవయత్నం చేశాడు. అటువంటప్పుడు ఆయన భార్య, ఆరుగురు పిల్లలతల్లి, అకాల మరణం చెందడంవల్ల ఆయన ద్వితీయానికి ఆలోచన చేస్తూంటే ఈయన అడ్డపడి నానామాటలూ అనటం ఏమైనా బాగుందీ ?

దానవుడు దక్షిణామూర్తి ఒకమాట అని ఒకమాట అనకుండా విడిచిపెట్టాడా? "నీ పెళ్ళాం బూడిద ఇంకా చల్లారలేదు. అప్పుడే ఈ యీడున రెండో పెళ్ళిసంగతి ఆలోచిస్తున్నావు. నువ్వు మనిషివా, పశువ్వా?" అని అడిగాడు.

సాంబయ్య మహర్షి ఎంతో సాత్వికంగా, "ఒరే, నేనిప్పుడు ఇంద్రియ సుఖాలు కోరి పెళ్ళాడుతాన్రటా ? అపత్నీకుడుగా స్వద్వ్రతాలన్నీ ఎట్లా చేసేది ?

---

1. ఈ మూర్తితో అని కాదు ఈ మూర్తి అని ఉండాలి.

భగవంతుడు ఎంత ఆయువిస్తే అంతా సత్కార్మలకే అంకితం చేశానుగద. విధు రుడు అగ్నిహోత్రం చెయ్యటానికి కూడా లేదే!" అన్నాడు.

"ఈ బొల్లిమాటలు కట్టిపెట్టు. కావలిస్తే సంసారసుఖం కోసమే పెళ్ళి చేసుకో ఎవడు వద్దన్నాడు. నీకు ఈడైనదాన్ని చేసుకో. వితంతువును చేసుకో వలిస్తే నేనే ఏర్పాటుచేస్తా. అంతేగాని ఏ ముక్కుపచ్చలారని పిల్లగొంతు కోస్తా నంటే నేను ఊరుకోను" అన్నాడు రాక్షసుడు.

వితంతువును పెళ్లాడి ఎవరైనా వ్రతాలు చేస్తాహా ?

"ఊరుకోక ఏం చేద్దామని నీ ఉద్దేశం ?" అని మహర్షి అడిగాడు.

"ఏం చేస్తానో నాకే తెలియదు" అన్నాడు రాక్షసుడు. తామసం !

మత్తగజం దారిన పోతుంటే ఎన్నోకుక్కలు మొరుగుతై, కాని అది వాటికి లక్ష్యం పెడుతుందా ? సాంబయ్య మహర్షి సంబంధం ఆలోచించి నిశ్చయించాడు కూడా. పదకొండేళ్ళ పిల్ల. దబ్బపండు ఛాయ. బొమ్మలాగుంటుంది. వాళ్ళనాన్న పురోహితుడు అయితే ఏం ? ఆ పిల్ల ఏ జన్మలోనో ఇటువంటి భర్త కావాలని తపస్సుచేసింది. ఈ జన్మలో ఆ తపస్సు ఫలించింది. లేకపోతే ఇటువంటి మహర్షి భార్య కాగలదా ఏమిటి ? పైగా ఎంత ఆస్తి ?

కాని రాక్షసుడు ఊరుకోలేదు. ఆ పురోహితుడి దగ్గిరికి వెళ్ళి, "నీకేం పొయ్యే కాలం ? మీ అమ్మాయిని నాలుగింతలు వయసువాడికిస్తున్నావు ?" అని అడిగాట్ట.

"అయ్యో, నాకు శుష్కప్రియాలు చెప్పకండి. నేను కట్నంపోసి అల్లుణ్ని కొనలేను. ఎవరన్నా నా పిల్లను ఊరికే చేసుకుంటామన్నా పెళ్ళిఖర్చులు పెట్టుకో లేను. ఏనాడు నా కూతురు చిన్న మెత్తుబంగారము పెట్టుకొని ఎరుగదు. ఈ పెళ్ళి అయి అది బంగారు పిచ్చుక అయితే చూసి సంతోషించాలని ఉన్నది" అన్నాట్ట పురోహితుడు.

"నువ్వు పెళ్ళికి ఇష్టపడ్డావా ?" అని పిల్లని అడిగితే బావురు మన్నదిట.

ఈ దుర్మార్గుడు తాను చెడటమేకాకుండా యితరులను కూడ పాపకూపం లోకి తోసే రకం. "మీ పిల్లకు నేను సంబంధం చూస్తాను. నీకు పెళ్ళి ఖర్చుకూడా లేకుండా చేస్తాను." అని పురోహితుడికి నచ్చచెప్పి ఆ సంబంధం కాస్తా పడగొట్టాడు.

ఆ ఏడే ఆ పిల్లకు పెళ్ళయింది. ఎవడో ఇరవై ఏళ్ళ కుర్రవాడు చేసు కున్నాడు. పెళ్ళి ఖర్చుకు ఒక్కవందే అయిందనీ ఆ వందా ఈ రాక్షసుడే ఇచ్చు కున్నాడని చెప్పుకున్నారు.

కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నట్టుగా సాంబయ్య మహర్షి పాలఘాటునుంచి ఒక పిల్లను కొనితెచ్చుకొని వైభవంగా పెళ్ళిచేసుకున్నాడు. ఈ పెళ్ళి జరిగిన సందర్భంలో పామరులైనవాళ్ళు రకరకాలుగా చెప్పుకున్నారు. పాలఘాటు పిల్లల్ని అయిదారుగురికికూడా అమ్ముతారట ! వాళ్ళు భర్తతో ఒకటి రెండు నెలలుండి సొమ్ముతో సహా పారిపోయి వస్తారట ! ఇవన్నీ గిట్టనివాళ్ళు చెప్పేకబుర్లు.

సాంబయ్య మహర్షి భార్య ఎక్కడికీ పారిపోలేదు. అయితే ఆవిడ శీలాన్నిగురించి ఏవేవో పుకార్లున్నాయి. కాకపోయినా ఇదుగో పులి అంటే అదుగో తోక అంటారు.

# 4

దక్షిణామూర్తి రాక్షసుడు అచ్చగా దుష్టుడే అనుకున్నాం. అవివేకి కూడాను. తాను సంపాదించలేక తండ్రి ఇచ్చిన ఆస్తిమీద బతకటం అటుంచి, పాత్రాపాత్ర విచక్షణ లేకుండా విధవలను పెళ్ళాడినవాళ్ళనూ, చదువుకుంటూన్న వాళ్ళనూ, పూర్వజన్మ పాపంచేత దారిద్ర్యం అనుభవిస్తూన్న వాళ్ళనూ ఎడాపెడా, ముందూ వెనకా చూడకుండా దానధర్మాలుచేసి కొంత అప్పుకూడా సంపాదించాడు.

డబ్బు కరువు[1] ఏర్పడేసరికి అయ్య బండారం బయట పడింది. అప్పులు తీర్చటానికి ఆస్తిలో పది పన్నెండెకరాల దాకా క్షవరమైపోయింది. దేవుడు బాగా నెత్తి అణిచాడు. దక్షిణామూర్తి పొలం అమ్మిన సంవత్సరమే సాంబయ్య మహర్షి ఇరవై ఎకరాలు బాకీలక్రింద కట్టుకున్నాడు. దేవుడు ఎవరిని కనిపెట్టి ఉండేదీ తెలిసే పోయింది.

ఇది జరిగేనాటికి జూనియరు రాక్షసుడు ప్రకాశం పద్నాలుగేళ్ళవాడు ఫిఫ్తు ఫారం చదువుతున్నాడు.[2] తమ పరిస్థితి చితికిపోయిందని వాడికి అర్థమైనట్టుంది. వాడు తండ్రితో చదువు మానేస్తానన్నాడు. కాని చింతచచ్చినా పులుసు చావదుగా? రాక్షసుడు కొడుకును చదువు మానవద్దని తాను కాఫీహోటలు పెట్టాడు!

పరువు మర్యాదలు గలవాడు చేసేపనేనా? ఆ మనిషి తన జీవితాన్ని ఒక్కసారి కలయజూసుకుని ఉంటాడా అని! ఒక్క ఉద్యోగమేచేశాడు. దాన్ని కాస్తా అహంకారంకొద్ది కాలదన్నాడు. తరువాత తండ్రి ఇచ్చిపోయినది తింటూ అడ్డమైన పాపిష్టి సంఘ సంస్కరణలూ మీద వేసుకుతిరిగి అప్పుల పాలైనాడు. కొండంత స్నేహితుడు మంచి ఉద్యోగం ఇప్పిస్తానంటే ప్రగల్భాలు పలికాడు. ఇన్ని చేసినవాడు చివరకు కాఫీహోటలు పెట్టుకోనా? ఆ రాజసమూ, అహంకారమూ, దర్పమూ, నిర్లక్ష్యమూ ఏమైనట్టు?

ఆ హోటలు రెండేళ్ళపాటు బాగానే డబ్బు సంపాదించి పెట్టింది. సొంత ఇల్లు ముందుభాగం పెంచి పైె అంతస్తుకూడా వేశాడు. కొడుకును కాలేజీ చదువుకు పంపాడు. కాని నీరు ఎప్పుడూ పల్లానికే పారుతుంది. ఇంతలో కాంగ్రెసు, సోష

1. ఆర్థిక కాటకం (1929-34) ప్రస్తావన.

2. ప్రకాశం వయస్సు ఆర్థిక కాటకం రోజులనాటికి పద్నాలుగేళ్ళు అయితే ప్రకాశం 1915-26ల మధ్య పుట్టి ఉండాలి.

లిస్టులూ, కమ్యూనిస్టులూ హోటలును పట్టుకున్నారు. ఈ రాక్షసుడి వాసన ఆ రాక్షసులకు నచ్చింది.

త్వరలోనే అచ్చ కమ్యూనిస్టుల హోటలయింది. దానికి మిగిలినవాళ్ళు వెళ్ళటం తగ్గించారు. కమ్యూనిస్టులకు వేరే పని ఏముంది? ఎక్కడ సమ్మెలు రెచ్చగొడుదామా అనే వాళ్ళ ఆలోచన. ముందు కార్మిక సంఘాలు పెట్టించడం తరవాత సమ్మెలు చేయించటం ! లేకపోతే వాళ్ళను గురించి ప్రపంచానికి తెలిసేది ఎటా ?

సరే ఇంకేం కార్మిక బాంధవుడు దక్షిణామూర్తి ఉండనే ఉన్నాడాయె. ఊళ్ళో ఏ బాపతు కార్మికులు సమ్మె చేసినా సరే సమ్మె సాగినన్నాళ్ళూ కార్మికులకు పొద్దున సాయంకాలమూ టిఫిను ఖాతాలో పెట్టేది దక్షిణామూర్తి హోటల్లో ! సమ్మె నెగ్గినాక ఇస్తే సొమ్ము ఇవ్వొచ్చు, లేకపోతే అదీ అక్కర్లేదు.

అట్లా హోటలు ఎంతకాలం నడుస్తుందే ? యుద్ధం వచ్చిన ఏడే[1] అది మూలపడింది.

హోటలు మూసేసిన రోజున ఆ మహా ఇల్లాలు కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచింది. కాని ఆ రాక్షసుడికి చీమకుట్టినట్టయినా లేదు. పైపెచ్చు భార్యను గట్టిగా మందలించి "వెంట తెచ్చామా ? కట్టుక పోతామా" అన్నాట్ట. లక్ష్మి వెళ్ళిపోలేక కన్నీరు కారుస్తుంటే అనవలసిన మాట అదేనా ? ధనమూలమిదం జగత్తన్నారు శంకరాస్వాములారుకూడా.[2] డబ్బుగల వాళ్ళని మరింత ఆదరంగా పలకరిస్తారు. ఆ రాక్షసుడికి తెలిసినపాటి వేదాంతం ఆయనకు తెలీకనేనా ? బ్రహ్మజిజ్ఞాసను గురించి ఆయన సత్రంలో రెండు గంటలు ఉపన్యాసం ఇస్తే ఒక్కడికి అర్థమయింది? ఆఖరుకు చండికేశ్వరీ శాస్త్రుల్లుగారు కూడా బట్టతల తడుముకుంటూ "అబ్బో ! చాలా లోతైన విషయాలు!" అన్నారుగదా.

ఏమైనా దక్షిణామూర్తి రాక్షసుణ్ణి చూసి జాలిపడటమనేది అంత సమంజసం కాదు. ఎందుకంటే హోటలు మూలంగా ఆయనకు నష్టమేమీరాలేదనీ, చాలా లాభం కూడా వచ్చిందనీ, ఇల్లు పెంచటం మాట అట్లావుంచి, హోటలు మీద తాను పెట్టుబడి చేసినదానికి మూడింతలు ధరకు అమ్మేశాడనీ అన్నారు.

అంత లాభసాటిగా ఉన్న హోటలును అమ్మకపోతే ఏమని ! వెనకటికెవడో బంగారు గుడ్లు పెట్టే బాతునుకోశాట్ట అనే సామెతగా ఉంది. భగవంతుడు నెత్తి ఆడిస్తేనే అటువంటి బుద్ధులు పుట్టేది.

ఆ దుర్బుద్ధి హోటలు మూసెయ్యటంతో ఆగలేదు. హోటలు మూసిన ఆరునెల్లకు నిక్షేపవంటి ఇల్లు అమ్మకానికి పెట్టాడు. తండ్రి కట్టింది. ఆ రోజుల్లో

---

1. రెండవ ప్రపంచ యుద్ధం మొదలైంది 1939.
2. ధనమూలమిదం జగత్ : జగత్తుకు ధనమే ప్రధానం అని అర్థం. ఇది ఒక లౌకికన్యాయం.

ఆయన ఆస్థలం గజం తొమ్మిది కాన్లు చేసి కొన్నాడు. అటువంటి నిక్షేపమైన ఇంటిని గజం నాలుగు రూపాయల లెక్కన స్థలానికి ఖరీదుకట్టి ఇంటికి నాలుగు వేలు ధర కట్టి, అమ్మేశాడు !

అబ్బ ! ఆ ఇల్లాలు శోకం తలుచుకుంటే దమయింతీ, చంద్రమతులు జ్ఞాపకం వచ్చారన్న మాట.

జూనియరు రాక్షసుడు ఉండనే ఉన్నాడు. వాడికి అమ్మటమేమిటో, కొనడమేమిటో కూడా తెలియదు ! దస్తావేజులమీద తండ్రితో పాటు తానూ సంతకాలు చేశాడు.[1]

ఇల్లూ, పొలమూ ఒక్కనాడే రిజిస్టరయినై. చేతికి పదకొండువేలు వచ్చినట్టుంది. .. నష్టదరిద్రుడు ఇంకో పదేళ్ళాగితే రెట్టింపు ధర వచ్చి ఉండేది .... ఆ డబ్బుతో సహా పెళ్ళాన్నీ కొడుకునూ వెంటబెట్టుకుని రాక్షసుడు దక్షిణామూర్తి పట్నం వెళ్ళిపోయాడు. ఆస్తికి, ఇంటికీ, ఊరికీ కూడా భ్రష్టుడైనాడు. మా ఊరికి పెద్ద పీడవిరగడై పోయింది. దేవుడు లేడనీ వదరినందుకు ఆ రాక్షసుడి జీవితం అజ్ఞాతవాసమై పోయింది. ఇప్పుడెక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తలుచుకునే వాడు కూడా లేడు.

## రెండవ భాగం : జానపదం

అనగనగా ఒకరాజు. ఆయనపేరు దక్షిణామూర్తి. మంచి ఆజానుబాహువు. వందమందిలో కొట్టవచ్చినట్టు కనిపించే ఆకారం. మాట్లాడితే మేఘం గర్జించినట్టుండేది. ఏ రకం భయమూ ఎరగడు. ప్రేమించినా, ద్వేషించినా పెద్ద మోతాదులోనే ఉండేది.

ఆ రాజుకొక కొడుకు. పేరు ప్రకాశం. రాజకుమారుడు ప్రకాశానికి రాణి కృష్ణవేణమ్మ అంటే ఎంతో ప్రేమ. అయితే వాడికి నిజమైన సూదంటురాయి రాజు దక్షిణామూర్తి.

తనతల్లి సొంతాన ఆలోచించే శక్తిలేకుండా సృష్టి చేయబడిందనీ, ఇంకెవరో పెట్టిన ఆలోచనలు తప్ప ఆవిడ తలలో కొత్తగా పుట్టిన ఆలోచనలేవీ లేవనీ, కనీసం నూరేళ్ళ వయస్సన్నా లేని ఆలోచనలు ఆవిడ మెదడులో ఎవరన్నా నాటినా అవి వేళ్ళు తన్నలేవని ఏదో ఒక దశలో రాజకుమారుడు ప్రకాశానికి అర్థమయింది.

ఈ జీవితమంతా ఒక నాటకమనీ, ఇందులో నవరసాలూ ఉన్నాయనీ, ఈ జగ

1. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చిన ఏడో, ఆ తర్వాత ఏడాదో ఆస్తి అమ్మకం జరిగి ఉంటుంది. అప్పటికి ప్రకాశం మేజరు కూడా అయ్యాడు.

న్నాటకం తన ఆనందంకోసమే ప్రత్యేకంగా ఏర్పాటయిందనీ రాజకుమారుడు ప్రకాశం ఎంతో పసితనంనుంచీ కూడా భావించాడు. ఇంత తిరుగుడైన భావన పెద్ద వాళ్ళకితప్ప కలగదని ఎవరైనా అనుకోవచ్చు. అది పొరపాటు. ప్రకాశానికి ఈ సంగతి పుట్టిన మరుక్షణంనుంచీ తెలుసు.

వాడికి అపారమైన జ్ఞాపకశక్తి ఉన్నది. తన రెండోయేట జరిగిన రెండు సంఘటనలు వాడు జ్ఞాపకం పెట్టుకున్నాడు. అందులో ఒకటి పెళ్ళి, రెండోది ఒక సినిమా. ఆ పెళ్ళిగురించి వాడికి జ్ఞాపకం ఉన్నది, ఒకే ఒక దృశ్యం. ఒక పందిట్లో జనం భోంచేస్తున్నారు. భోంచేసే వాళ్ళ మధ్య అక్కడక్కడా మొక్క లున్నై. "అమ్మా, మనం ఒకసారి ఒక పెద్ద పాకాలోకి వెళ్ళాం. ఆ పాకాలో చాలా మంది అన్నం తిన్నారు. దాన్లోనే చెట్లుకూడా ఉన్నై." అని వాడు తల్లితో అనేక సార్లు అన్నమీద ఆవిడ చాలాసేపు ఆలోచించి అది వాడి రెండో ఏట జరిగిన ఒక పెళ్ళి దృశ్యమని తెలుసుకుని నిర్ఘాంతపోయింది. ఆయేడే వాణ్ణి తండ్రి ఫాల్కే తీసిన శ్రీరామజననం[1] సినిమాకు ఎత్తుకుని తీసుకుపోయినాడు. అందులో సముద్రం నుంచి ఆదిశేషుడిమీద పడుకున్న మహావిష్ణువు పైకి రావటం దృశ్యం వాడు జ్ఞాపకం పెట్టుకున్నాడు.

తాను జ్ఞాపకం ఉంచుకున్న ప్రతి దృశ్యమూ, ప్రతి సంఘటనా వాడికి విశిష్టంగానే తోచేది. ఇతరులు తమ అనుభవాలు చెప్పినప్పుడు వాడికవి ఎందు చేతనో అవాస్తవంగానూ, అముఖ్యంగానూ తోచేవి. తత్కాలానికి తనకు భయమో, దుఃఖమో, బాధో, అవమానమో కలిగించిన సంఘటనలు కూడా వాడికి తలుచు కున్నప్పు డానందాన్ని చేకూర్చేవి. సృష్టిలో వాడికి అరలు కనిపించలేదు. ప్రతి సన్నివేశానికీ, ప్రతి సంఘటనకూ సమానమైన స్థానం వుంది. వాడి అనుభవంలోకి వస్తేచాలు.

వాడు తమ ఇంటికి వచ్చే ముష్టివాళ్ళనూ, బంధువులనూ, వీధిలో కనిపించే వాళ్ళనూ, బళ్ళలోకూచోని నాటకాల కరపత్రాలు దారిపొయ్యే వాళ్ళ కిస్తూ బాండు మేళంతో సహా వెళ్ళే వాళ్ళనూ, తాగిన వాళ్ళనూ, పిచ్చివాళ్ళనూ, ప్రతి సాయం కాలమూ ఖైదులనుంచి బయటికివచ్చే ఖైదీలనూ, మీటింగుల్లో ఉపన్యాసాలిచ్చే వాళ్ళనూ, పేరంటాళ్ళనూ, ఆసుపత్రిలో రోగులనూ, సమానాసక్తితో చూసేవాడు. వాళ్ళను చూసినప్పుడు కలిగే ప్రతి మనోవికారాన్ని పూర్తిగా ఆస్వాదించేవాడు.

సంగీతం ఒకటీ, ఆడవాళ్ళూ వాణ్ణి ప్రబలంగా ఆకర్షించేవాళ్ళు. చిన్న తనంలో వాడు తల్లిని అస్తమానం పాడమని చంపేవాడు. ఆవిడకి పాడటం చేత

---

1. ఫాల్కే తీసిన శ్రీరామజననం : భారతదేశంలో తయారైన మొట్టమొదటి చలనచిత్రం రాజా హరిశ్చంద్ర (1913) నిర్మాత, దర్శకుడు దాదాఫాల్కే ఆయన తీసిన శ్రీరామజననం.

కాదు. పాటలు రావు. ఐనా వాడి బాధపడలేక వచ్చిన పాటలే తప్పుతప్పుగా పాడేది. కొన్ని కొత్తపాటలుకూడా నేర్చుకొన్నది. "ఈ సంగతిముందే తెలిస్తే నేను చిన్నతనంలోనే సంగీతం నేర్చుకునేదాన్నిగదరా!" అన్నదావిడ అనేకసార్లు. ఆవిడ తనకు బాగా కనపడిన మాటలను మళ్ళీమళ్ళీ అని ఆనందించేది—అవి తన మాటలైనాసరే, ఇతరుల మాటలైనాసరే.

ఒకసారి ఒక పేరంటంలో ఒక ఇరవై ఏళ్ళ అమ్మాయి పాటలుపాడింది. చక్కని గొంతు. బాగా పాడుతుంది. అందుచేత ఆ అమ్మాయిచేత చాలా పాటలు పాడించారు. ప్రకాశం నిర్మోహమాటంగా ఆ అమ్మాయి ప్రక్కన వెళ్ళికూచొని తల్లి బయలుదేరేటప్పుడు రమ్మంటే రాలేదు. ఆ అమ్మాయి వాడికోసం వాడుకోరిన పాటపాడి "మీ ఇంటికి వచ్చి పాడతాగా!" అని వాగ్దానం చేసినాక వాడు తల్లివెంట ఇంటికి వచ్చేశాడు. కాని వాడా అమ్మాయి పాటను ఆ రాత్రి నిద్రపోయేదాకా ఒక్క క్షణంపాటు గూడా మరిచిపోలేదు.

చిన్నపిల్లకు రుచిలోగాని, అభిరుచిలోగాని వ్యత్యాసాలు తెలియవు; పట్టవు కూడా. చెరుకుగడ లేకపోతే జొన్నదంటు నమిలి ఆనందిస్తారు. పాటలోనుంచి ప్రకాశం ఆనందాన్ని పొందగలిగేవాడు. ఏ పాటలో ఎంత ఆనందించటానికుంటే అంతేచాలు. ఎంతపిచ్చిపాటలో కూడా ఎంతో కొంత మాదుర్యం వాడికి కనిపించేది.

ఆడవాళ్ళ విషయంలో కూడా అంతే, ఆడతనంలో వాణ్ణి ఆకర్షించేది ఏదో ఉండేది. ఆ దిక్కుమాలిన ఆకర్షణ వాడికి ప్రతి ఆడదానిలోనూ అంతో ఇంతో కనిపించేది. ఇది కూడా వాడికి పుటకనుంచి ఉన్నదే.

మిగిలిన కుర్రవాళ్ళందరికీ కలిగే కష్టాలూ, బాధలూ, సమస్యలూ, వాడికీ ఉండేవే. ఎప్పుడన్నా ప్రయివేటు మేస్టరు కొట్టేవాడు. పరిగెత్తుతూ పడితే ఎదురు దెబ్బలు తగిలేవి. అప్పు డప్పుడూ జ్వరం వచ్చేది. కడుపునొప్పి, చెవిపోటూ వచ్చేవి. కాని వాటిని గురించి బాధపడాలనీ మనసును క్షోభ పెట్టుకోవాలనీ వాడికి తెలియదు.

కొంతకాలం వాళ్ళింటిసందులోనే ఒక నాటకాల కంపెనీ వాళ్ళు గది తీసు కున్నారు. అక్కడ దాదాపు ప్రతిరోజూ సంగీత సాధన జరిగేది. తొక్కుడు హార్మో నియం ముందు కూచుని, కాళ్ళతో తిత్తులు తొక్కుతూ రెండు చేతులతోనూ వాయించే మనిషి ప్రకాశానికి చాలా అందంగా కనిపించేవాడు. ముఖ్యంగా ఆ మనిషి వేళ్ళను పరిచి, చేతి ఉంగరాలు మెరిసేటట్టుగా బంమని భలే శ్రావ్యమైన చప్పుడు చేసినప్పుడు ప్రకాశం చిత్తుగా పరవశుడై పోయేవాడు.

ప్రకాశాన్ని తండి ప్రతినాటకానికి తీసుకుపోయేవాడు. ఆంధ్రదేశంలోవుండే గొప్ప నటులందరినీ ప్రకాశం పదేళ్ళ దాటేలోపుగా స్టేజీమీద చూశాడు. వారిలో కొందరిని అనేకసార్లు చూశాడుకూడా.

స్కూలు కమిటీ తారుమారై కొత్త సెక్రటరీరాగానే ప్రకాశాన్ని సెకండు ఫారంలో వేయించాడు తండ్రి. ఆ తరవాత చదువు నిర్విఘ్నంగా సాగిపోయింది.

మిగిలిన అనుభవాలలాగే తాను చదువుకున్న విషయాలు కూడా వాడికి విశిష్టంగా ఉన్నట్టు కనిపించేవి. అందుచేత వాడా విషయాలను ఎంతో ఆసక్తితో తన మన సులో దాచిపెట్టుకునేవాడు. వాడికి క్లాసులో మంచి మార్కులు వచ్చేవి. "వీడు చదవకుండానే మార్కులు తెచ్చుకుంటాడ్రా" అని వాడి తరగతి పిల్లలు ఆశ్చర్య పడేవారు.

## 2

తల్లితండ్రుల మధ్య ఉన్నంత కాలమూ ప్రకాశం ఆపే జిజ్ఞాస ఎరగడు. కాని కాలేజీలోకి వెళ్ళాక తనను గురించీ తానెరిగిన మనుషులను గురించీ ఆలోచించి అంచనాలు కట్టటం అలవాటు చేసుకున్నాడు.

వాడు హెచ్చుగా తన తండ్రిని గురించి ఆలోచించేవాడు. తండ్రిని గురించి ఆలోచించినప్పుడల్లా వాడికి కోడి రామ్మూర్తి,[1] గామా పహిల్వాన్,[2] యూజిన్ శాండో[3] వంటి వ్యక్తులు స్ఫురించేవారు. ఆ మనిషిలో ఏదో భారీతనం ఉన్నట్టుండేది.

ఒకప్పుడు ప్రకాశం తన తండ్రిలో ఉన్న అవ్యక్తమైన భారీతనాన్ని తలుచు కుని అంతటితో తృప్తిపడేవాడు. కాని ఇప్పుడాతని బుర్రలో రకరకాల ప్రశ్నలూ, అనుమానాలు తల ఎత్తాయి.

ఈ భారీతనం ఆయనకు ఏ విధంగా ఉపకరించింది ? మామూలు కట్టు దాట్లపైన తిరగబడ్డాడు. అన్ని కులాల వాళ్ళతోనూ పంక్తి భోజనాలు చేశాడు. వితంతువులకు పెళ్ళిళ్ళు చేయించాడు. అనేక రకాల ఆచారాలను తిట్టటం మినహా యిస్తే, ఆయన కార్యరూపంలో సాధించినది ఇంతకంటే మరేమీలేదు.

ప్రకాశానికి ఇదేమంత గొప్ప జీవిత లక్ష్యంగా కనపడలేదు. కులాలను పాటించేవాళ్ళు మూఢులు గాని, మనుషులంతా మనుషులేనని గుర్తించటంలో విశేషం ఏముంది ? వితంతువులకు పెళ్ళిళ్ళు వద్దనేవాళ్ళు పశువులు, చేయించే వాళ్ళు ధీరులనుకోనవసరం లేదు. వితంతువులకే కాదు, వితంతువులు కాని వాళ్ళు కూడా ఇష్టంలేని మొగుళ్ళకు విడాకులిచ్చి, నలుగురు పిల్లల తల్లులై ఉండి కూడా ఇంకో భర్తను చేసుకోవచ్చు. అందులో అసహజమేమీలేదు.

---

1. కోడి రామ్మూర్తి (1885–1939) అంతర్జాతీయ ఖ్యాతి పొందిన గొప్ప వస్తాదు. ఒకేసారి 3 1/2 టన్నుల బరువును భరించగల బలశాలి.
2. గామా పహిల్వాన్ : అంతర్జాతీయ ఖ్యాతి పొందిన వస్తాదు.
3. యూజిన్ శాండో ( ) జర్మన్ వస్తాదు. 1907 లో భారత దేశానికి వచ్చి కోడి రామమూర్తితో తలపడలేక వెనుదిరిగిపోయాడు.

తన తండ్రికింద తయారైన తనకు సహజంగా తోచే ఈ విషయాలు తన తండ్రి శక్తి ధారపోసి అలవరచుకొనాలిసి వచ్చిందని ప్రకాశానికి తట్టలేదు. అంతకంటె కూడా ముఖ్యమేమంటే – వితంతువులు వివాహం చేసుకోవచ్చునని చెప్పుకోటానికీ, ఒక ప్రత్యేక వితంతువుకు పెళ్ళి చేయించటానికి ఉండేతేడా వాడికి కొంచెం కూడా అర్థంకాలేదు.

పోనీ తన తండ్రి జీవితంనుంచి ఏమి సంపాదించాడు? ఆయనకు సంగీతంలోగాని, సాహిత్యంలోగాని ప్రత్యేకమైన అభిరుచి ఉన్నట్టు ప్రకాశం ఎప్పుడూ గమనించలేదు. పుస్తకాలు ఎప్పుడైనా చదివేవాడు. ఒకే ఒకసారి పాటకచ్చేరికి వెళ్ళినట్టు ప్రకాశం ఎరుగును. కాని అది తృష్ణకాదు. కళలను గురించి ఆయన ఎన్నడూ వెర్రెత్తిపోలేదు, కలవరించలేదు. వాటిలో రోజుల తరబడి మునిగి తేలలేదు. ఆయన దగ్గిర ఉన్న వాటిలో వీరేశలింగంగారి సంపుటాలూ,[1] బాపిరాజు[2] గారి బొమ్మలు గల యెంకిపాటలు, రసపుత్ర విజయం,[3] విమలాదేవి [4] నవలలూ మొదలైనవి కొద్దిగా ఉండేవి.

ఆయన ఏ స్త్రీనిగాని ప్రేమించాడా? ఈ సంగతి తెలుసుకోవాలని ప్రకాశానికి చాలా ఉబలాటంగా ఉండేది. అది తెలియనంతవరకూ తనకు తన తండ్రిని గురించి ఏమీ తెలియదనే వాడికి అనిపించింది. తన తల్లికి తండ్రికీ మధ్య ఉన్న పారస్పర్యంలో నిజమైన ప్రేమ ఉన్నట్టు తోచలేదు. ఇద్దరూ కీచులాడుకునే వాళ్ళు, సరిపెట్టుకొనేవాళ్ళు. కొండలు ఎక్కి దిగినట్టు. ఈ కొండలు ఒకటిదాటితే మరొకటి వచ్చేవి. కొన్ని సమయాల్లో వారిద్దరూ గానుగెద్దుల్లాగా గుండ్రంగా తిరుగుతూ

---

1. వీరేశలింగం సంపుటాలు : కందుకూరి వీరేశలింగం పంతులు రచనల సంపుటాలు.
2. బాపిరాజుగారి బొమ్మలుగల యెంకిపాటలు : 1925 లో వెలువడిన యెంకిపాటలు పుస్తకంలో గల అడివి బాపిరాజు బొమ్మలు ప్రస్తావన.
3. రసపుత్ర విజయం : కాశీనాధుని నాగేశ్వరరావు ప్రకాశకులుగా ప్రచురించిన ఆంధ్ర వాఙ్మయ సూచిక (1929) లో రసపుత్ర విజయం పేరులో రెండు ఆరోపాలున్నాయి. ఇచ్ఛాపురపు యజ్ఞ నారాయణ, డి. సీతారామారావు వ్రాసినవి. రెండూ నాటకాలుగా పేర్కొనబడ్డాయి. పద్యవచన సంయుక్తమైన రచనలుగా పేర్కొనబడ్డాయి. ఈ సందర్భంలో రసపుత్ర విజయం నవలగా కొ.కు పేర్కొన్నారు. ఆ పేరులో నవల ఏదైనా వచ్చిందేమో.
4. విమలాదేవి : భోగరాజు నారాయణమూర్తి రాసిన ఆభాస చారిత్రక నవల 19.0 లో విజ్ఞాన చంద్రిక గ్రంథమాల బహుమతి పొందింది. రాజపుత్రుడైన రాజసింహుడు, అతని భార్య విమలాదేవి ఔరంగజేబును ఎదుర్కొనవడంలో కనపరచిన సాహసేతివృత్తం ఈ నవలలో.

ఎక్కినకొండే మళ్ళీ ఎక్కి దిగుతున్నారా అని కూడా అనిపించేది.

తన తరవాత మళ్ళీ పిల్లలు లేకపోవటం తన తల్లిని బాధించింది గాని తండ్రినేమీ బాధించలేదు. ఆయన తనతో స్నేహంగా ఉండేవాడు. "నువ్వింకా చిన్నాడివి నీకీ విషయం అనవసరం !" అన్నట్టుగా ఆయన తనతో ఎప్పుడూ మాట్లాడ లేదు.

తనను గురించి ఆయన ఏవో కలలు కని ఉండాలి. ఏమిటా కలలు ? వాటి స్వరూపం ప్రకాశానికి తెలియదు.

ఇటువంటి ప్రశ్నలు ప్రకాశం బుర్రలో అప్పుడప్పుడూ కదిలేవి. వాటిని గురించి ఆలోచించటానికి వాడికి సమగ్రమైన జీవితం ఉండనే ఉన్నది. ఒకవంక చదువూ, రెండోవంక కళాతృష్ణలూ; వీటన్నిటికీ వెనకగా ప్రేమకోసం తహతహ, వాడి మనసుకు అస్తమానం పని కల్పించేవి. ఒక్కొక్కసారి ఈ తృష్ణలు ఒక దానిలో ఒకటి కలిసిపోయి ఏది ఏవో తెలిసేదికాదు. అవి ప్రకాశానికి రసమయస్థితి.

ఈ రసమయ స్థితులు ఎప్పుడు ఏ కారణంగా ఏర్పడేది వాడికే తెలిసేదికాదు. ఒక్కొక్క రోజు షికారుకువెళ్ళి హాస్టలుకు తిరిగివచ్చేసరికి ఏవో సంగీతం విన్నంత సంతృప్తికరంగానూ, ఉల్లాసంగానూ ఉండేది.

ఒకసారి వాడు తన స్నేహితుడి ఇంటికివెళ్ళి వాళ్ళ గ్రామఫోనుమీద కొన్ని బాలగంధర్వ[1] రికార్డులు పాతవి విన్నాడు. అందులో వాడి మనస్సుకు ఏదో అయి పోయి నట్టయింది. ఒక దానిపైన దేశ్‌కార్[2] అని రెండోదానిపైన సారంగ్[3] అని రాసి ఉంది. ఆ రెండు పాటలనూ అయిదారుసార్లు విని దిగులుగా తిరిగివచ్చాడు. ఎవరో ప్రియురాలిని విడిచివస్తే వాడికి అటువంటి దిగులు కలిగేదేమో ?

ఒక్కప్పుడు ఉత్సాహాన్ని రేకెత్తించే సంగీతం మరొక్కప్పుడు గుబులు పుట్టించడం దేనికో వాడికి చచ్చినా అర్థంకాలేదు.

ఇంకొక చిక్కేమిటంటే వాడు తన కళానందాన్ని ఎవరితోనైనా పంచకోలే నప్పుడు చాలా బాధపడేవాడు. థింకర్స్ లైబ్రరీవాళ్ళు వేసిన అనటోల్ ఫ్రాన్స్[4] పుస్తకం "పెంగ్విన్ ఐలండ్" చదివినప్పుడు వాడి ఉత్సాహాన్ని పంచుకునేటందుకు ఎవరూలేక చాలా బాధ కలిగింది.

అందుకే వాడు తనలాటి అభిరుచులుగల స్నేహితుల కోసం ఆత్రంగా వెతి కాడు. జీవితంలో అటువంటి స్నేహితులకన్న ప్రధానావసరం మరొకటి లేదని వాడికి ఏనాడో తోచింది.

---

1, 2, 3. బాలగంధర్వ రికార్డులు : ప్రముఖ మరాఠీ గాయకుడు బాలగంధర్వ రికార్డు పాటలు.

4. అనటోల్ ఫ్రాన్స్ (France, Anatole, 1844-1924) ఫ్రెంచి రచయిత.

అప్పుడప్పుడూ వాడు తన అభిరుచులు హద్దుమీరి పోతున్నట్టు భావించి సిగ్గుపడేవాడు. తన ఉత్సాహోద్రేకంతో మిగిలినవాళ్ళకు జిడ్డుపట్టిస్తున్నా ననుకునే వాడు. అటువంటప్పుడు వాడు వారం పదిరోజులపాటు పుస్తకాలలో మునిగిపోయి పాఠాలతో క్రూరంగా కుస్తీ పట్టేవాడు. తెలిసినవే మళ్ళీమళ్ళీ చదవటం శ్రమదండగ అని తెలుసు. అయినా తననుంచి తాను పారిపోవలసివస్తే క్లాసు పుస్తకాలు తప్ప గత్యంతరంలేదు.

# 3

ప్రకాశం చదివే కాలేజీలో ఎనిమిది మంది ఆడపిల్లలు చదువుతూండేవారు. ఎనిమిది మందీ కోతులే అయినప్పటికీ వాళ్ళు మగపిల్లలను ఆకర్షించి తీరేవాళ్ళే. అందులో అందరికన్నా తక్కువ వికారంగా ఉన్నపిల్ల రంభకింద చలామణి అయి ఉండేది. సెక్స్‌కూ, సౌందర్య పిపాసకూ అది రాజీ పద్ధతి.

అయితే ఈ ఎనిమిది మందిలో ఇద్దరు నిజంగా అందగత్తెలే. ఇంకో ఇద్దరు ఫరవాలేదు. వాళ్ళను గురించి తోటి విద్యార్థులు చెప్పుకునే మాటలు ప్రకాశానికి వెకిలిగా ఉండేవి. పైకి ఎక్కువగా మాట్లాడే వాళ్ళది నోటిదూల. అసలు ఆడపిల్లలను గురించి మాట్లాడని వాళ్ళలో; వాళ్ళను గురించి అస్తమానం ఆలోచించే వాళ్ళుండవచ్చునని ప్రకాశానికి తట్టింది. ఉదాహరణ తనే.

కొద్దిమంది విద్యార్థులకు ఆడపిల్లలతో మాట్లాడే ధైర్యమో, చనువో, అవకాశమో ఉండేది. కాని ప్రకాశం వాళ్ళను చూసి మిగతా వాళ్ళలాగా అసూయపడే వాడు కాడు. వాడి ఉద్దేశంలో ఆడపిల్లలమధ్యా, మగపిల్లలమధ్యా ఈ కనపడని గోడలుండటమూ, ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడటం సగం రంకుగా పరిగణించటమూ మొదలైనవి అర్థం లేనివి.

ప్రేమను గురించి కథలు రాస్తారు. కవిత్వం రాస్తారు. కాని ఈ కనపడని గోడలుండగా స్త్రీ పురుషులు ఒకరి నొకరు ప్రేమించుకుని పెళ్ళాడేదెట్లా ? ఈ సమస్యను గురించి ఎవరూ ఆలోచించలేదని ప్రకాశానికి దృఢమైన నమ్మకం కుదిరింది. ఈ విషయమై ఒక వ్యాసం రాద్దామని అనుకున్నాడు. రాశాడు. చించేశాడు. తృప్తికలగలేదు. అదివరకు కాలేజీ మాగజీన్‌కు రెండు వ్యాసాలు రాశాడు గాని, అందులో తనను సంక్షోభించజేసిన భావాలేమీ లేవు. వాటిని చదివిన మిత్రులు వాడికి రాసే ధోరణి ఉన్నదని ఒప్పుకున్నారు. ఆ ప్రశంస రాతి నేలపైన పడిన చిత్తనంలాగా అయిపోయింది. ఎందుకంటే అప్పటికి రాతగాడు కావాలనే ఆలోచన వాడికి ఏ కోశానలేదు. ఇదేవిధంగా వాడు కూనిరాగాలు తీస్తుంటే విన్న మిత్రులు "నువు హాయిగా గొంతెత్తి ఎందుకు పాడవురా ?" అని కోప్పడ్డారు. ఆ విత్తనం కూడా రాతి భూమి పైనే పడిపోయింది.

అసలు విషయమేమంటే వాడు తన జీవితాన్ని కళలు ఆస్వాదించటానికి అంకితం చేశాడుగాని సృష్టించటానికి కాదు. కళాసృష్టి కళాస్వాదనలాటి రసమయ వ్యాపకం కాదని వాడికి "ఇన్‌స్టింక్ట్" చెప్పింది. తేనెకోసం తహతహలాడేవాళ్ళంతా తేనెటీగల జీవితాలను చూసి ఆహ్లాదం చెందాలని ఎక్కడుంది ?

కాని ప్రకాశం ఈ భావంతో కుస్తీ పట్టాడు. సహారా ఎడారి ఇసుకపర్రల్లో కూచుని సముద్రం కావాలన్నవాడికి, స్త్రీ పురుషుల మధ్య విరిపోను సంబంధాలు కూడా లేకుండా గోడలు అడ్డున్న జీవితంలో ప్రేమ కావాలన్న వాడికీ, తేడా ఏమిటి ? ఒట్టి అరణ్యరోదనం. ఈ అరణ్యరోదనాన్ని తాను సంగీతం మీదికి ఎక్కించలేడా ?

వ్యాసాన్ని రెండు మూడు రకాలుగా ప్రారంభించి చూశాడు. కొంతదూరం వచ్చాక తాను రాయదలచినదిగాక ఇంకేదో వస్తున్నట్టు అనిపించేది. చిన్నతనంలో సొంతంగా ఏదన్నా బొమ్మ వేద్దామనుకుంటే ఇట్లాగే జరిగేది.

అకస్మాత్తుగా వాడికొక గొప్ప ఆలోచన తట్టింది. దీన్ని గురించి వ్యాసం కాదు రాయవలసింది- కథ ! వ్యాసం ఉపన్యాసంలాగా ఉంటుంది. కథే రైటు ! రాసిన కాగితాలు చించేసి కథ రాయటానికి చేసిన మొదటి ప్రయత్నం. కథానాయకుడు తానే. కథానాయిక కాలేజీలో చదివేవాళ్ళలో రాధా, రజనీ కలగాపులగం అయినారు.

కథ రాస్తున్నంతసేపు ప్రకాశానికి ఇంకో ప్రపంచంలో ఉన్నట్టనిపించింది. కథ ఎంతకూ అయిపోవడం లేదనీ, చదివేవాళ్ళు విసుక్కుంటారని అనిపించింది. కథ ట్రాజెడీగా ముగిసింది. నాయికా నాయకులిద్దరూ అత్యంత విషాదకరమైన చావు చస్తేతప్ప ప్రకాశం మనసులో ఉన్న ఆవేదనికి తగిన శాంతి కలుగదు. స్త్రీ పురుషుల మధ్య ఉండే గోడలకు రెండు ప్రాణాలు బలి అన్నమాట !

కథ పూర్తి అయినాక ప్రకాశానికి కలిగినది సంకోచముకాదు. సంతోషము కాదు - బరువు దిగిపోయినంత "రిలీఫ్." "ఇంత యాతనపడి మనుషులెందుకు రాస్తారు- సుఖంగా ఉండలేక ? నూటికి తొంభైతొమ్మిది మంది రాయకపోయినా సాహిత్యానికేమీ కొరత రాదుకదా !" అనుకున్నాడు. ఒక్క బరువు మనుషులు చెమటోడ్చి పనిచేసే వాళ్ళను గురించి, "సుఖంగా ఉండలేక వీళ్ళెందుకిట్లా శ్రమ చేస్తారు?" అనుకోవచ్చు. నూటికి తొంభైతొమ్మిది మంది ఎందుకు రాస్తారో ప్రకాశం ఆత్మ విమర్శన చేసుకుంటే తెలిసిపోయేది. వాడికేదో చెప్పాలని ఉంది. అది ఎవరూ చెప్పలేదనిపించింది. కథ రాసేశాడు. అంతే !

రాసేసినాక ఆ కథను ఏం చెయ్యాలో వాడికి తెలియలేదు. దాన్ని వాడు తిరిగి చదువుకుంటే రకరకాల అనుమానాలు కలిగినై. అది గొప్ప కథ అవునో కాదో అన్న అనుమానం వాడికి కలగనేలేదు గాని, అది మరీ చచ్చుకథా, లేక ఒక మాదిరి కథ కిందికి వస్తుందా అన్నది మాత్రం నిర్ణయించుకోలేక పోయినాడు. ఎవరి

కన్నా చదవటానికి ఇవ్వటం వాడికి కొంచెంకూడ ఇష్టం లేకపోయింది. అది నిజంగా చచ్చుకథ అయితే తన మిత్రులు తనను గురించి చాలా హీనంగా భావిస్తారు. ఒక మాదిరి కథ అయితే తనను ప్రోత్సహించటానికి చాలా మంచికథ అనేస్తారు.

దాని బతుకు తేల్చటానికి ఒకటే మార్గం కనిపించింది. దాన్ని మర్నాడు ఒక సుప్రసిద్ధ సాహిత్య మాస పత్రికకు పంపించాడు. తక్కువ పత్రికలైతే చచ్చు కథలను కూడా కక్కుర్తిపడి వేసుకుంటై. ఈ పత్రికలో చచ్చు రచనలకు తావుండదు. ఆ పత్రికలో పడకపోతే పోనీ, ఇది చావాలిసే ఉంటే అబిమన్యుడి చావు చావనీ !

ఇంకొకటికూడా ఉంది. ఈ కథ తక్కువ పత్రికలో ఒకవేళ పడినా తన పేరు అచ్చులో చూసుకునేటందుకు పంపాడని అందరూ అనగలరు. గొప్ప పత్రికలో పడితే కథ మంచిదనే ముద్ర ఉండనే ఉంటుంది.

ప్రకాశం కథను పోస్టుచేసిన పది పన్నెండు రోజులకు పత్రికవాళ్ళు కార్డు రాశారు. "తాము పంపిన అమూల్యమైన కథ అందింది. దానిని కాలక్రమాన ప్రకటించగలమని మనవి."

రెండు నిమిషాలపాటు ప్రకాశం తన వ్యాసం [1] "అమూల్యమైన"దని పత్రిక వాళ్ళు మెచ్చుకున్నట్టే ఆనందించి పారవశ్యం చెందాడు. కాని అది అచ్చువేసిన కార్డు. అందరికీ అటువంటి కార్డే పంపిస్తారు. అందులో కథ పేరు, సంపాదకుడి సంతకమూ మాత్రమే చేతిరాతలో ఉన్నై.

పైమాసం సంచికలోనే ప్రకాశం కథ అచ్చుపడింది.

## 4

ప్రకాశం కథ పత్రికలో పడిన సంగతి కాలేజీలో తెలియదగిన వాళ్ళందరికీ తెలిసింది. దాదాపు అందరూ దాన్ని ఒక "ఫీట్"గా పరిగణించారు. కాలేజీ చరిత్రలో ఇద్దరో, ముగ్గురో అటువంటి ఫీట్ చేశారు. పత్రిక చేతికి అందితే చదువుదామనే ఉద్దేశంలోనే ఉన్నారు.

కొందరు మిత్రులు ఆ కథను గురించి చర్చించారు. అది స్వంతం ఎందుకు కాగూడదు? ఒకరు చచ్చిపోతే రెండోవాళ్ళు మంచానపడి చావడం వాస్తవ జీవితంలో జరుగుతుందా ?

సానుభూతితో ఇటువంటి ప్రశ్నలు అడిగిన ఆప్తమిత్రులతో ప్రకాశం తన ఉద్దేశం వివరించి చెప్పాడు. ఆ చెప్పటంలో పరస్పర విరుద్ధమైన వాదంకూడా చేశాడు. ప్రేమించటం "సింబాలిజం" మాత్రమేనని ఒకసారి అన్నాడు. ప్రేమ

---

1. ముందు పేరాలోనే ప్రకాశం కథను పత్రికవాళ్ళు అమూల్యమైనదని రాశారు. ఈ పేరాలో కథ వ్యాసమైంది. రచయిత పొరపాటు ఇది.

వచ్చింది- ప్రేమికులు కారు. సంఘం ప్రేమను చంపేస్తుంది. అసలు ప్రేమికులు కావటం ప్రధానం కాదని ఇంకొకసారి అన్నాడు. వాళ్ళ ప్రేమకు జీవితంలో స్థానం లేకపోవటం ప్రధానం.

"నువ్వు ప్రేమకోసం లెజిటిమేట్‌గా వెతికేచోట్లు సంఘంలో లేవు. మన దిక్కుమాలిన దేశంలో కన్యల పాతివ్రత్యం హెచ్చుగా ఉన్నది. నీవు ఇంకొకడి భార్యతోనైనా మాట్లాడవచ్చుగాని, పెళ్ళికానిదాన్ని పలకరించటం అపచారం" అన్నాడు ప్రకాశం ఉద్రేకంతో.

"పెళ్ళికి ప్రేమకూ సంబంధమేమిటి ? ఎవడుకూడా తన పెళ్ళాన్ని ప్రేమించలేడు" అన్నాడొక మిత్రుడు.

"ప్రేమించి పెళ్ళాడే అవకాశం లేనంతకాలమూ నువ్వు చెప్పినది నిజమే. వితంతువులకు పెళ్ళి నిషేధించి, పాపం వితంతువులు కావటంచేత వాళ్ళ పెళ్ళి చేసుకోలేకుండా ఉన్నారు ! అన్నట్లున్నది నీవు చెప్పేది" అన్నాడు ప్రకాశం.

ప్రేమించి పెళ్ళాడటంకన్న పెళ్ళాడి ప్రేమించటమే ఎక్కువంటారే?" అన్నాడు మరొక మిత్రుడు.

"అది తపస్సు, యోగసాధన. ప్రేమకాదు. పెళ్ళాడి ప్రేమించడమంటే ఈ విశాల ప్రపంచంలో ఎవరినైనా ప్రేమించ గలగట మన్నమాట. అది ప్రేమ కాదు. మనం స్వరాజ్యం కావాలనటం దేనికి ? సామ్రాజ్యవాదులకింద ఉండే స్వేచ్ఛానందం కోసం యోగాభ్యాసం చెయ్యవచ్చుగా?" అన్నాడు ప్రకాశం.

"అసలు ప్రేమ అనేది ఒక భ్రమ ; తాను వలచినది రంభ అంటారే. అసలు సామెత అదికాదు. దొరికినది రంభ,దొరకని మనిషి ఎంత అందగత్తె అయినా, దాన్ని ఎంతగా ప్రేమించానని నువ్వు అనుకున్నా అంతా ఒకటే !" అన్నాడొక విద్యార్థి. ఇతను ఒక్కడే అక్కడ చేరిన బృందంలో స్త్రీ సుఖం ఎరిగిన వాడు. మిగిలిన అందరూ బ్రహ్మచారులే.

ప్రకాశం ఈ నాస్తికత్వాన్ని సహించలేక పోయినాడు.

"ఇటువంటి నిరాశా వాదానికి కూడా కారణం ప్రేమించిన మనిషిని పెళ్ళాడ లేక పోవటమే. సెక్సుకూ, ప్రేమకూ మధ్య అగాధం ఏర్పడటంవల్ల ప్రేమ అబద్ధమనీ, సెక్సు నిజమనీ నువ్వనుకుంటున్నావు" అన్నాడు వాడు.

"ప్రేమ అనేది ఎక్కడాలేదని నువేగదా ఒప్పుకుంటున్నావు ?" అన్నాడు అనుభవజ్ఞుడు.

"దాన్ని నిజం చెయ్యటానికి మనం ఏమైనా చేస్తే కదా !"

అక్కడితో ఆ వాదన ముగిసింది. మళ్ళీ ప్రకాశం కథను గురించి ఒక రిద్దరు ఎత్తారు.

"ఈ వెధవ కథను గురించి రాద్ధాంతం చేయకండి. ఇది మొదటి కథ. ఇందులో నా భావాలన్నీ స్పష్టం చేశానా అని నాకు అనుమానంగా కూడా ఉన్నది.

దేవుడు మేలుచేస్తే ఇంకాకథలు రాసి చూపిస్తాను.ఈ సమస్యను గురించి నా బుర్రలో ఉన్నదంతా బయటికి వచ్చేదాకా నాకు నిద్రపట్టదు!" అన్నాడు ప్రకాశం.

ఆ మాట అన్నమీదట వాడికి ఒక ఎత్తుపీట మీదినుంచి కిందికి దిగినట్టు తృప్తి కలిగింది.

ప్రకాశం ఆ కథను మరిచిపోయి ముందుకు చూదామని అనుకున్నాడే గాని అది అంత సులువుగా వాణ్ణి వదలలేదు. ఒకనాడు వాడి హాస్టలుకు ఒక ఉత్తరం వచ్చింది. కవరుపైన తన చిరునామా రాసిన దస్తూరి కొత్తగా ఉంది. "ఆడవాళ్ళ దస్తూరి లాగుందే;"అని వాడి గదిలో ఉంటున్న రెండోవాడు అన్నాడు కూడానూ. అది ఒక "ఫాన్ లెటర్."

"శ్రీ ప్రకాశరావుగారికి, మీరు వ్రాసిన కథ చదివాను. ఎంతో బాగుంది. నవ్వకండి, ఆ కథ చదివి చాలా సేపు ఏడిచాను."

అంతే ఉంది ఉత్తరం. రాసిన వాళ్ళ సంతకం లేదు. ఆ ఉత్తరంలో ఉన్న రెండు ముక్కలూ జీర్ణించుకోవటానికి ప్రకాశానికి చాలా సేపు పట్టింది. వాడి మెదడూ, కళ్ళూ కూడా సమ్మెచేసినట్టయింది. ఆ ఉత్తరాన్ని అరడజను సార్లయినా చదివి ఉంటాడు. నాడి పరుగెత్తుతున్నది. ఊపిరి కూడా సరిగారావటంలేదు. ఈతరాకుండా లోతునీళ్ళలో పడ్డవాడల్లె అయిపోయి రెండు మూడు నిమిషాలదాకా తెప్పరిల్లుకో లేకపోయినాడు. అదృష్టవశాత్తూ ప్రకాశం రూమ్‌మేట్ వేరేపనిలో నిమగ్నుడై ప్రకాశం పొందే వింత వికారాలను గమనించలేదు.

మొదటి షాక్ దిగిపోయినాక ప్రకాశానికి ప్రశ్నలు పుట్టుకొచ్చినై. ఈ ఉత్తరాన్ని ఏం చెయ్యాలి? అదేదో హత్యా సాక్ష్యంలాటిదిగా బరువుగా, జేబులో పెట్టుకుంటే, జేబును కాల్చేదిలాగా తోచింది వాడి ప్రాణానికి. దాన్ని అందరికీ చూపాలని వాడికి క్షణంపాటుకూడా తోచకపోవడం వాడి మనస్తత్వంయొక్క వింతలక్షణ మనుకోవాలి. ఈ ఉత్తరం ఇంకొక ప్రాణి కంటపడితే అది అందరికీ తెలిసి నలుగురూ అనే మాటలూ, జరిగే పబ్లిసిటీలో సహస్రాంశం కూడా వాడు భరించలేడు. ఉత్తరం చించి పారేద్దామన్నా ముక్కలు ఏరి అంటించి చదువుతారేమో నన్న భయం కలిగింది.

తన రూమ్‌మేట్ తాలూకు నిప్పుపెట్టిని చప్పుడు కాకుండా తీసికొని పాయిఖానాదొడ్డిలోకి వెళ్ళి తనకు వచ్చిన కవరునూ, ఉత్తరాన్ని తగలబెట్టి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచి ప్రకాశం తిరిగి వచ్చాడు.

కాని ఆ రోజల్లా ఆ ఉత్తరంలో ఉన్న వాక్యాలు జ్ఞాపకం వస్తూనే ఉన్నై. రెండో ప్రశ్న ఒకవేపునుంచి వాణ్ణి కొరుక్కుతింటూనే ఉన్నది- ఆ ఉత్తరం రాసింది ఎవరు ? మగవాడై యుండవచ్చు వాదనకు వస్తే. కాని అది రాసినది ఆడదేనని వాడికి రూఢిగా తెలుసు. అసలు ఆ భాషే ఆడభాష. మగవాడెవడూ అట్లా రాయడు. రాసినా సంతకం పెట్టడానికి వెనకాడడు. అసలు దస్తూరే ఆడదస్తూరి !

అయితే అది రాసిన ఆడది ఎవరు ? తన కాలేజీలో వాళ్ళలో ఎవరో ఒక రయి ఉండటానికి సగం అవకాశం ఉన్నా తన మొహం ఎరగని మనిషి అయితే ఆ కథ చదివి ఉత్తరం రాయాలనుకోదు. ఆ కథ అంత గొప్పది కాదని అప్పటికే ప్రకాశం నిర్ణయించుకున్నాడు; ఆ మాటకు వస్తే అంతకన్న మంచి కథలు రాయ టానికి కూడా నిశ్చయించుకున్నాడు.

ఆ ఉత్తరం రాసింది కాలేజీ అమ్మాయే, సందేహం లేదు. అది రాసినది మగవాడు కాదని వాడికి ఎట్లా తెలుసునో ఇదివరకా అట్లాగే తెలుసును. రాధ అయి ఉంటే ఎంత బాగుండును ! కథలో కథానాయికను భావనచేస్తున్నంతసేపూ రాధ మొహమే వాడి ఎదుట ఉంటూ వచ్చింది– చివరలో తప్ప. కథ చివరకు వస్తుండగా ఏ కారణం చేతనో రాధ కాస్తా రజనిగా మారిపోయింది ... పోనీ ఉత్తరం రాసినది రజని అయి ఉండకూడదూ ?

అంత అదృష్టమా ? వాళ్ళిద్దరూ ఇంచుమించు దేవతా స్త్రీలనీ, మట్టి మను షులు చేసే ఇటువంటి పనులు చెయ్యరనీ వాడి నమ్మకం. బహుశా అంత బాగుండని నలుగురమ్మాయిలలో ఎవరో ఒకరు రాసి ఉంటారు.

ఈ అనుమానం ఆలోచించిన కొద్దీ రూఢి అయింది. దానితో బాటు వాడి నిషాకాస్తా దిగిపోయింది.

కాని అంతలోనే మరొక ఆలోచన వచ్చింది. కాలేజీ అమ్మాయిలందరి దస్తూరి ఏదో విధంగా చూడగలిగితే తనకా ఉత్తరం రాసిందెవరో తెలిసిపోతుంది. అన్నట్టు వాళ్ళ తెలుగు దస్తూరీ కావాలి.

అయితే ఇది అనుకున్న దానికంటె చాలా కష్టంగా పరిణమించింది. ఈ లోపుగా వాడు ఎనిమిది మందినీ శ్రద్ధగా గమనించే వచ్చాడు, ఎవరన్నా తనకేసి కొత్తరకంగా చూస్తారేమోనని. అయితే ఈ ప్రయత్నం ఫలించలేదు. రాధ ఎప్పుడూ ఎవరికేసి చూడదు. తన ప్రక్కన ఎవరన్నా నడుస్తుంటే వాళ్ళకేసి చూస్తుంది. ఒంటరిగా వచ్చేటప్పుడు తల ఎత్తదు. రజని ఎవరికేసి అయినా చూస్తుంది. కాని ఆ అమ్మాయి చూపు ఎక్కడో ఉన్నట్టుంటుంది. అటువంటిది ప్రకాశం కేసి చూసే అవకాశం కూడా కనిపించలేదు.

వాళ్ళిద్దరి తరవాతా మగపిల్లలను హెచ్చుగా ఆకర్షించే ఇద్దరు పిల్లలూ ఒక నాడు ప్రకాశానికి ఎదురుపడ్డారు. తలవని తలంపుగా వాళ్ళు ఆగి, "మీరే కదాండీ కథ రాసిందీ ? చాలా బాగుంది, అటువంటి కథలు మన కాలేజీ మేగజీన్‌లో రాయ కూడదూ" అన్నారు, కూడబలుక్కున్న వాళ్ళల్లే.

పట్టిగ్గా తనతో ఈ మాట అనగలవాళ్ళు సంతకం లేకుండా ఉత్తరం రాస్తారా ?

వాళ్ళకు సమాధానంగా ప్రకాశం ఏదో గొణుగుతూ ప్రయత్నిస్తానన్నాడు. వాళ్ళు అన్నమాటతో వాడికి ఇంకొక ఆలోచన తట్టింది. వీలుచేసుకుని ఎడిట్లరు

దగ్గిరకువెళ్ళి, "ఈసారి మన పత్రికకు ఏమేమి కంట్రిబ్యూషన్లు వచ్చినయ్యో చూడ వచ్చా?" అని అడిగాడు.

"రెండు రోజుల్లోపుగా నాకు కదరాసి ఇచ్చేట్టయితే చూపిస్తాను" అన్నాడు ఎడిటరు.

ముగ్గురు ఆడపిల్లలే కంట్రిబ్యూషన్లు ఇచ్చారు. అందులో రెండు ఇంగ్లీషువి. మూడోది రాధ రాసినదే. కానీ దస్తూరీ అదే అనిపించలేదు ప్రకాశానికి. కాక పోయినా వాడు తనకు వచ్చిన ఉత్తరం దస్తూరీ పూర్తిగా మరచిపోయినాడు. ఆడ వాళ్ళందరి దస్తూరీ ఒకటేలా గుంటుందని విసుక్కున్నాడు.

ఇంతదాకా వచ్చినాక వాడికి, "ఈ ఉత్తరం గురించి అనవసరంగా టూమచ్ చేస్తున్నాను" అనిపించింది.

## 5

ప్రకాశం కాలేజీ పత్రికకు తన రెండోకథ రాశాడు. తాను తన మిత్రులతో తన మొదటి కథను గురించి మాట్లాడేటప్పుడు "కన్యల పాతివ్రత్యం"అని అనేవాడు. ఇదే ఈసారి వాడి కథావస్తువు. కథానాయకుడు ఒక విద్యార్థి. కాలేజీ దినంనాడు విద్యార్థులు ఒక నాటకం వేస్తారు. ఆ నాటకంలో కదానాయకుడు ఒక వేషంవేసి అందరికన్నా గొప్పగా నటిస్తాడు. అదృష్టవశాత్తూ ఆ విద్యార్థి చాలా అందమైన వాడూ, స్పోర్ట్సులో ఆరితేరినవాడూ, చదువులో ఫస్టూను. అందుచేత కాలేజీ విద్యార్థి నులలో గొప్ప అందగత్తె అతన్ని మొదటినుంచీ ప్రేమిస్తూనే వస్తున్నది. కాని మిగిలిన వాళ్ళకు వెరిచి ఆ విషయాన్ని రహస్యంగా ఉంచుతూ వచ్చింది. నాటకం అయిన మర్నాడు ఆమె తన ప్రియుడికి ఒక ప్రేమలేఖ రాస్తుంది. దుర దృష్టవశాత్తూ ఆ ప్రేమలేఖ మరొకరి చేతిలో పడుతుంది. అది ఆ పిల్లతండ్రిదాకా పోయింది. ఆయన పెద్ద సీను చేస్తాడు. తన కూతురు మంచిదేనని, కథానాయకుడే ఆమెను మభ్యపెట్టి ఉంటాడనీ ఆరోపిస్తాడు. ఆ ఆరోపణ విని కథానాయకుడు ఒక చిన్న చిరునవ్వునవ్వి, "మీ జానకిని నేను ఆదివరకే ప్రేమించి ఉండకపోవటం నాదే తప్పు. కాని నేను మిమ్మల్ని ఒకటి అడుగుతాను. ఇవాళ కాకపోతే రేపైనా ఆమెను ఎవరో ప్రేమించాలన్నదే మీ ఆశయమైతే ఆ ప్రేమించేవాణ్ని నేనే ఎందుకు కాగూడదు ? నాకర్థం కావటంలేదు. మీ అమ్మాయి అప్పుడే ఒకరికి ఇల్లాలయి పోయినట్టూ, నేనామెకు పరపురుషుణ్ణి అయినట్టూ ఎందుకు ప్రవర్తిస్తున్నారో తెలియ కుండా ఉన్నది. లేక మీరు మీ అమ్మాయిని ప్రేమించనివాడుగా చూసికట్టబెడదా మనుకుంటున్నారా?" అని అడుగుతాడు. జానకి తండ్రి ఈ ప్రశ్నకు సమాధానం తెలియక సిగ్గుతో తలవంచుకున్నాక కథ అయిపోయింది.

కథచూసి ఎడిటరు చాలా ఆదర్శప్రాయంగా ఉందన్నాడు. కాని చివరకు నాయికా నాయకులకు పెళ్ళి అయిపోయినట్టు కూడా రాసేస్తే బాగుంటుందిగదా అన్నాడు. అది శిల్పం కాదన్నాడు ప్రకాశం అంతో ఇంతో గంభీరంగానే.

తన మొదటి కథకన్న ఈ రెండోకథ తనకు ఎక్కువ నచ్చినట్టు ప్రకాశం తన స్నేహితుల దగ్గిర ఒప్పుకున్నాడు. వాళ్ళలో కొందరు, "ఇది నిజంగా ఆ పత్రిక లోనే పడితే బాగుండేది. మన కాలేజీ పత్రిక కెందుకు పంపుతావు?" అన్నాడు.

ఈ కథను గురించి కూడా తనకు ఉత్తరం వస్తే బాగుండునని ఉన్నది ప్రకాశానికి. కనీసం ఆ రాసినది కాలేజీ విద్యార్థిని అని అయినా తేలిపోతుంది. కాని ఉత్తరం రాలేదు. పత్రిక బయటికివచ్చి నాలుగు రోజులైనప్పటికి ఉత్తరం లేకపోయే సరికి నిరుత్సాహ పడిపోయాడు. ఉత్తరం రావటానికి ఇంకా వ్యవధి ఉన్నదని తన మనసును సమాధాన పరచుకున్నాడు. వారం గడిచిపోయింది, కాని ఉత్తరం రానేలేదు.

ఆనాడు ఆదివారం ప్రకాశం స్నేహితుడి ఇంటికి బయలుదేరాడు — గ్రామ ఫోనుగల స్నేహితుడే. వాళ్ళింటికి వెళ్ళటానికి నిజానికి గుడిమీదుగా వెళ్ళక్కర్లేదు. కాని ఆ వీధిలో రజని ఉంటుంది. ఆమె కనబడితే కనపడవచ్చునన్న దురాశతో అటుగా వెళ్ళాడు. సాధారణంగా పదిసార్ల కొకసారి కనిపిస్తుంది.

ఈసారి రజని కనిపించటమేగాక, ఎక్కడినుంచో ఇంటికి వస్తున్న మనిషి ప్రకాశాన్ని చూసి గేటుదగ్గర ఆగింది. అర్థం లేకుండా ప్రకాశం గుండెల్లో రైళ్ళు పరిగెత్తినై. దగ్గిరికి వస్తున్నంతసేపూ ఆమె తనకేసే చూస్తూ నిలబడి ఉండటంవల్ల ప్రకాశం ఆగక తప్పలేదు. వాడు ఏదో అనవలసిన బాధ్యత గుర్తించి, "ఇదేకదూ మీయిల్లూ ?" అన్నాడు.

"అవును. మీరు కనిపిస్తే ఒకమాట అడగాలనుకున్నాను" అన్నది రజని.

ప్రకాశం గుండెల్లో రైళ్ళు మరింత వేగంగా పరిగెత్తినై. "ఏమిటది?" అన్నాడు.

"మన మాగజీనులో ఈసారి మీరు రాసినకథ నాకంతగా నచ్చలేదు" అన్నది రజని.

దానికి ఏమనాలో ప్రకాశానికి తోచలేదు. నోరుజారినవాడు లాగా, "ఏంచేస్తాం? దాని ఖర్మ!" అన్నాడు. ఆమాట వాడికే ఆశ్చర్యాన్ని కలి గించింది.

కాని రజని నవ్వి, 'ఏమో అనుకున్నాను. మీలో చాలా గడుసుతనం ఉందే?' అన్నది.

తాను మర్మంగా మాట్లాడినట్టు అప్పుడుగాని ప్రకాశం గ్రహించలేదు. అంత బాగా మాట్లాడి నందుకు వాడు గర్వంతో ఉబ్బిపోయాడు.

"ఇంకొకరైతే తాను రాసిన కథను వెనకవేసుకొచ్చి నాతో పోట్లాడి ఉండును. అవునంటారా, కాదంటారా?' అన్నది రజని.

"పోట్లాడి నచ్చనికథ నచ్చేట్టు చెయ్యగలమని నాకు తెలీదే?'' అన్నాడు. ప్రకాశం "బాలెన్సు"కు వస్తూ.

'అది నిజమే ననుకోండి. కాని ఈ రెండో కథ నాకు నచ్చక పోవటానికి ప్రత్యేకమైన కారణం ఉంది. ఒకే ఒక్క కారణం. అది చెప్పటం నా ధర్మం, తెలుసుకొనుట[1] మీ ధర్మం. ఏమంటారు?" అన్నది రజని.

"చెబితే సంతోషిస్తాను. అసలు కథ మొత్తం బాగాలేదేమో ననుకున్నాను" అన్నాడు ప్రకాశం.

'కథ బాగుంది. ఇంకా చెప్పాలంటే చాలా బాగుంది. కాని ఒక్కటే అందులో నాకు పట్టించ్చింది. లేకపోతే ఈసారి కూడా మీకు ఉత్తరం రాసి వుండేదాన్ని.' అని రజని ఏదో జ్ఞాపకం వచ్చినదానల్లే, "ఆ ఉత్తరం రాసింది నేనని మీకు ఒక వేళ తెలీదేమో! నేను సంతకం పెట్టటానికి వణికిపోయానంటే నమ్మండి. పోస్టు చెయ్యగూడదని కూడా అనుకున్నాను. కాని పోస్టు చేసిందాకా నా అంతరాత్మ నన్ను చాలా బాధించింది. నా కాలేజ్‌మేట్ రాసిన కథ అంత గొప్ప పత్రికలో పడించే అని నేనెంతో గర్వపడ్డాను సుమండీ!" అన్నది రజని.

ప్రకాశానికి ఊపిరి సలపనట్టయింది. రజని కనీసం మూడు నాలుగు విషయాలు మాట్లాడుతున్నది కాని ఏ ఒక్కటీ చివరంటా చెప్పదు.

'నాకు సరిగా అర్థం కాలేదు .... మీ ఉత్తరం అందింది. కాని దాని మీద సంతకం పెడితే ఏం నష్టం జరిగి ఉండేదీ?' అన్నాడు వాడు.

"లోకం ఎటువంటిదో మీకు మాత్రం తెలీదా ? ఫలాని లేడీ స్టూడెంటు ఫలాని స్టూడెంటుకు ఉత్తరం రాసిందని తెలియగానే చిలవలూ పలవలూ అల్లి నానా రకాలుగా చెప్పుకుంటారు. అవునంటారా, కాదంటారా?" అన్నది రజని సీరియస్‌గా.

"కావచ్చు. ఆ ఉత్తరం ఎవరో లేడీ స్టూడెంటు రాసినట్టు ఊహించానుగాని, ఎవరు రాశారో ఆరాతీయటానికి నేను ప్రయత్నించలేదు. ఉత్తరం చదివెయ్యగానే చించిపారేశాను. లోకాన్ని గురించి మీకున్న అభిప్రాయమే నాకూ వుంది !"

'ఆ ఉత్తరాన్ని ఏ ఒక్కరికీ చూపలేదా?' అన్నది రజని నమ్మలేని దానిలాగా.

"ఏ ఒక్కరికీ చూపలేదు. ఎందుకు చూపటం?"అన్నాడు ప్రకాశం, అందులో వింత ఏమున్నదన్నట్టుగా.

రజని కళ్ళలో మెప్పుకనిపించింది. 'అయామ్ రియల్లీ ఎమేజ్డ్ ! మీది ఇంత గంభీరమైన స్వభావమని నేను కలలో కూడా ఊహించలేదు. మామూలుగా ఎవరైనా నా ఉత్తరాన్ని అందరికీ చూపించేస్తారనీ, పదిమందీ డిటెక్టివులలాగా దాన్ని

1. కావ్యభాషా రూపం తెలిసికొననటం అని ఉండాలి.

పట్టుకొని నా దస్తూరి పోల్చేస్తారనీ భయపడి చచ్చాను. మిమ్మల్ని అందరిలాటి మనిషి అనుకున్నందుకు క్షమించాలి.' అన్నది రజని.

ఆమెకు కూడా తన నీరస జీవితంలో ఇదొక రసమయ ఘట్టమే మరి.

"అందుకేనా ఈసారి ఉత్తరం రాయలేదు?" అన్నాడు ప్రకాశం.

రజని మొహంలో మార్పు కలిగింది. ఆమె గంభీరంగా "లేదు, లేదు. నేనిందాకేచెప్పానే ఈ కథను గురించి నాకొక చిన్న అభ్యంతరమున్నదని" అన్నది.

"అదేమిటో తెలుసుకోవాలని ఉన్నది." అన్నాడు ప్రకాశం.

"మీ జానకి ఆ తిలక్ నటనచూసి మెచ్చుకొని ప్రేమ లేఖ రాసిందన్నారే, ఎవరినన్నా మెచ్చుకున్నప్పుడల్లా రాసే ఉత్తరాలు ప్రేమలేఖలు అవుతాయా? నేను మీకు రాసిన ఉత్తరం ప్రేమలేఖ అనుకున్నారేమోనని నాకు చాలా బాధ కలిగింది సుమండీ! అందుకే ఈసారి రాయలేదు. ఉన్నసంగతి దాచకుండా చెప్పేశాను."

ప్రకాశం తన ఔదార్యం ఉట్టిపడేటట్టు నవ్వాడు.

"మీ అభ్యంతరానికి సమాధానాలు చెప్పగలను. నంబర్ వన్. మీలేఖ ప్రేమలేఖ అనుకోలేదు. అనుకున్నట్టయితే దాన్ని చించి పారేసేటంత అర్భకుణ్ని కాను. నన్ను ప్రేమించిన మనిషి ఎవరో తెలుసుకోటానికి ప్రయత్నించకుండా అసలే ఉండను. నంబర్ టూ. మా జానకి అన్నారే, ఆ అమ్మాయి అచ్చంగా తిలక్ నటనను మెచ్చుకోవడంతో తృప్తిపడలేదు. ఆమె మామూలు చదువుకున్న స్త్రీలలో వెయ్యింట ఒకరుకూడా చెయ్యని పనిచేసింది. తాను ప్రేమించిన మనిషికి తన ప్రేమను తెలియజేసింది. నా కథకు ఆయువు పట్టు ఆమె ప్రేమలేఖ రాయటమే. ప్రతి చదువుకున్న ఆడదీ తాను ప్రేమించి ఆ ప్రేమను వ్యక్తంచేసిననాడు లవ్‌మారేజెస్ విధిగా జరుగుతై. అంతదాకా మనకు చేత పెళ్ళిళ్ళే!" అని ప్రకాశం ఉపన్యాసం దంచేశాడు.

రజని ఈ ప్రవాహంలో బిత్తరపోయిన దానిలా అయిపోయి కొంచెం సేపు ఆలోచించి "చదువుకున్న మగవాళ్ళు లవ్‌లెటర్స్ రాస్తారే, వాటినిచూస్తే మండు కొస్తుంది. అటువంటి ఉత్తరం రాసినవాణ్ని పరువున్న ఆడపిల్ల ఎన్నటికీ పెళ్ళాడదంటాను!" అన్నది.

ప్రకాశం తాపీగా, "నేను మాట్లాడుతున్నది నిజమైన ప్రేమలేఖలను గురించి. వేదురెత్తిన వెధవలు రాసే వెకిలి ఉత్తరాలను గురించి కాదు. నా మట్టుకు నేను ఒక్క లేడీ స్టూడెంటు కూడా అటువంటి ఉత్తరం రాస్తుందనుకోను. అందుకే నేను నా కథలో మగవాడివైపు ఉండిన ప్రేమ భావాన్ని ఎక్కడా బయట పెట్టలేదు. నా ఉద్దేశంలో ప్రేమ సమస్య స్త్రీ పురుష లిద్దరదీ అయినా దానివల్ల పురుషుడికన్న స్త్రీ ఎక్కువలాభం పొందుతుంది. ఎందుకంటారా ? ఈనాటి సంఘంలో మొగ్గు మగవాడివేపు ఉన్నది. ఆర్థికసమస్య చూడండి; కట్నాలసమస్య

చూడండి- పెళ్ళిని ఏ కోణంనుంచి అయినా చూడండి; సాంప్రదాయపు పెళ్ళిళ్ళ ద్వారా కంటె ప్రేమపెళ్ళిళ్ళద్వారా భార్యల స్టేటస్ పెరుగుతుంది. నన్నడిగితే ప్రేమించి పెళ్ళాడే అవకాశాలిచ్చినా నూరింట తొంభైతొమ్మిదిమంది ప్రేమ పెళ్ళిళ్ళ కంటె కట్నాల పెళ్ళిళ్లే కోరుకుంటారు!" అన్నాడు.

ఈ మాటలు అంటూ ఉండగా ప్రకాశం అంతరాత్మ ఇంకోకథకు పిండి దొరికిందని ఉర్రలూగుతున్నది.

"ఎంతబాగా చెప్పారండి. మీతో ఇన్ని విషయాలు మాట్లాడ వచ్చునని నేను ఎన్నడూ అనుకోలేదు. నేను మీ కథ విషయమైనా అభ్యంతరాన్ని పూర్తిగా, అన్‌కండిషనల్‌గా విత్ డ్రా చేసుకుంటున్నాను. ఇంతసేపూ వీధిలోనే నిలబడి ఉన్నాం. అయిదు నిమిషాలు లోపలికి రాగూడదూ? మీకు తొందరపని లేకపోతే సుమండీ! ఏదో పాపం పనిమీద పోతుంటే, మీటైమంతా వేస్టుచేశాననుకుంటాను. ఎక్కువ సేపు కూచోవద్దు. కాస్త కాఫీతాగి వెళ్ళండి!" అంటూ రజని లోపలికి దారితీసింది.

# 6

ఇది ప్రకాశం జీవితంలో అనుకోని రొమాన్స్. మామూలు తెలుగు విద్యార్థుల ప్రాణానికి చాలా గొప్ప రొమాన్సన వచ్చుకూడా.

రజని ప్రకాశాన్ని పబ్లిక్‌గా తన తండ్రికీ, తల్లికీ పరిచయం చేసింది. ఆమె అన్నలిద్దరు ఉద్యోగాలు చేసుకుంటున్నారు. వాళ్ళువచ్చినప్పుడు వాళ్ళనుకూడా పరిచయం చేసింది. కాలేజిలో కూడా అతను ఎదురైతే ఏదో ఒకముక్క మాట్లాడకుండా వెళ్ళేదికాదు. అతని పరిచయాన్ని ఆమె గర్వకారణంగా భావించిందనటానికి ఏమీ సందేహంలేదు.

ఇద్దరూ ఒకరి కొకరు చదువుకునేటందుకు పుస్తకాలిచ్చుకునేవారు. అతను వాళ్ళింటికి తరచు, ప్రత్యేకించి శలవు రోజుల్లో, వెళుతుండేవాడు. ఆతనికి సంగీతంలో అభిరుచి ఉన్నదని తెలిసి, ఆతనికిష్టమైన పాటలన్నీ తానుకూడా విని రజని అతని అభిరుచిని ప్రశంసించింది. ప్రకాశం కోరికపై ప్రకాశం మిత్రుడు తన గ్రామఫోనుతోనూ, రికార్డులతోనూ, రజని ఇంటికి అనేక పర్యాయాలు వచ్చి రికార్డులు పెట్టి వినిపించాడు.

రజనికి తన మూడోకథను ప్రకాశం అచ్చుకు పంపకముందే చూపాడు. అతను నిజం దాచలేదు. "మనం ఆ రోజు అనుకున్న విషయాలే ఈ కథలో పెట్టాను. రాసేవాడి భావాలు ఎంత స్పష్టంగా ఉన్నా ఇంకొకరితో చర్చించటంచేత పదునెక్కుతై. అనాడు నేను ఆడదానికి ప్రేమ ఎట్లా ఎక్కువ లాభిస్తుందో చెప్పి మిమ్మల్ని బోర్ చెయ్యకపోతే ఈ కథ రాసేవాణ్ణికానేమో!" అన్నాడు ప్రకాశం.

"బోర్ చెయ్యట మేమిటండీ? ఇంకానయం, ఊరుకోండి!" అన్నది రజని.

రజని తనకు ఇంత సన్నిహితురాలై, మామూలుగా భార్యలు భర్తలతో మాట్లాడదగిన ధోరణిలో మాట్లాడుతుంటే ప్రకాశానికి, "ఇదంతా ఎట్లా సాధ్యమయింది?" అని ఆశ్చర్యం కలిగేది.

రాధ రజనికంటె కాస్త అందమైన మనిషి అనిపించవచ్చుగాక. మొదటి నుంచీ తనకు రజనిలోనే ఎక్కువ ఆకర్షణ కనిపించినట్లు ఇప్పుడు ప్రకాశం రూఢి చేసుకున్నాడు. రాధ రజని మాట్లాడేదానిలో సహస్రాంశం తనతో మాట్లాడినట్లు కూడా వాడు ఊహించలేక పోయినాడు.

రజని ప్రకాశం దగ్గర చనువుతీసుకోవటమేగాక అతనికి చనువిచ్చిందికూడా. రజని తండ్రీ, తల్లీ తమ కుమార్తెలో ఎంతో విశ్వాసం గలవారు గనుకనే ఇది సాధ్యమయింది.

ఆ చనువును ప్రకాశం పొరపాటునుకూడా దుర్వినియోగ పరచలేదు. వాడు తన కదల ప్రస్తావనవస్తే తప్ప ప్రేమను గురించి మాట్లాడేవాడుకాదు. అదైనా పెళ్ళితో ముడిపడితే తప్ప కేవలం ప్రణయపరంగా ఎన్నడూలేదు.

వాళ్ళిదరిమధ్యా ఒకరి నొకరు అర్థం చేసుకునే శక్తి చాలా ఉండేది. ఒకసారి రజని, "మీరిన్ని కదలు రాస్తున్నారే. మీరు ప్రేమించే పెళ్లాడతానని చెప్పగలరా?" అన్నది-చలోక్తిగానే.

"నేను మగవాణ్ణి. నాది నిజంగా ఒకసమస్యకాదు. మగవాడిదృష్టిలో ప్రేమ అనేది ప్రణయ కవిత్వం రాయటం మొదలుపుని ఒక్కరాత్రికి ప్రేమను కొనుక్కోవ టందాకా స్పెక్ట్రింలాగా పరుచుకుని ఉన్నది. ఆడదానికి అట్లాకాదు-ప్రేమంటే తనకిష్టమైనవాడి ఇంటి పేరు పెట్టుకోవటం, తనకిష్టమైనవాడి జీవితంలో భాగం పంచుకోవటం, వాడికి పిల్లల్ని కనటం. నేనే ఆడదాన్నయితే నాకిష్టంలేని మొగుడి ఇంటిపేరు దగ్గిరే తిరగబడతాను. అందుచేత నేనీ కథలు రాసినందుకు నీవంటి చదువుకున్న మనిషి, తాను ప్రేమించిన వాణ్ణి తప్ప పెళ్లాడనని వ్రతం పడితే ఎక్కువ ఫలంపాటు." అన్నాడు ప్రకాశం.

నిజా కి ఈమాటల్లో వాడికి కోపంవచ్చిం దనుకునేటందుకు వీలులేదు. కాని కోపం వచ్చిందని రజని తెలుసుకున్నది. అంతేకాదు వాడి కోపానికి కారణ మేమిటో కూడా తెలుసుకున్నది.

రజని ప్రకాశాన్ని తనకు సాధ్యమయినంతవరకు ప్రేమించింది. అంతకు పూర్వం ఆమెకు అంతగా ఎవరిపైనా ప్రేమ ఏర్పడి ఉండలేదు. దాన్ని ఆమె దాచ టానికి ప్రయత్నించనుకూడాలేదు. ఆ సంగతి ప్రకాశానికి తెలుసుననికూడా ఆమె ఎరుగును. కాని రజని ప్రకాశాన్ని పెళ్ళాడలేదు. అది అసంభవం. జరిగేపనికాదు. ప్రకాశం తండ్రి హోటలు నడుపుతున్నాడని రజని తల్లిదండ్రు లెరుగుదురు. రజని తండ్రి ఆస్తిపరుడు. తనపెళ్ళికిగాను పదివేలు ఏనాడో బ్యాంకులో వేసి ఉంచాడు.

ఆయన తనకు చాలా పెద్ద సంబంధం తెస్తాడు. ఆయన తీసుకురాగలిగిన సంబంధాలతో పోలిస్తే ప్రకాశం ఎక్కడా చాలడు.

"నేను నిన్ను పెళ్ళాడలేను!" అని అతనితో అనటానికి నోరురాకే రజని అతని పెళ్ళి ఇంకెవరితోనో జరిగేటట్టుగా మాట్లాడింది. ఆ ఉద్దేశం ప్రకాశం అర్థం చేసుకున్నాడు. కోపంవచ్చింది. దాన్ని అణుచుకున్నాడుగాని, రజనికి అర్థం కాకుండాచేయలేక పోయినాడు.

ఇద్దరూ ఉచ్చులోపడిన పక్షులల్లే బాధపడ్డారు.

ప్రకాశం రజనితో ప్రేమనుగురించి ఇంత చర్చించాడు గాని, "ఈనాటి సంఘంలో ప్రేమించటమంటే విప్లవం చెయ్యటం" అని చెప్పలేదు. వాడికి తెలిసి ఉంటే చెప్పేవాడే, కాని వాడికీ తెలియదు.

ఈ సంభాషణ జరిగిన తరువాత వాడు ఎక్కువసేపు కూచోలేదు. తన గదికి తిరిగి వచ్చాడు. ఆ రాత్రి తిండి సయించలేదు. పరీక్షలు మూడు నెలల్లో ఉన్నా పుస్తకం తెరవలేదు. అర్ధరాత్రి దాటినా నిద్రపట్టలేదు.

రజనినిగురించి ఎన్నికలలు కన్నాడు! ఎన్ని సార్లు ఆమెను ఆలింగనం చేసుకున్నాడు! ఎన్ని వేలసార్లు ముద్దు పెట్టుకున్నాడు! ఈ కలల ఫలితంగా ఎంత రక్తపీడన అనుభవించాడు! రక్తం చల్లబడింది? కలలు విరిగి తనమీదనే పడుతున్నై. రజనిని తలుచుకుంటుంటే పట్టరాని ఆగ్రహం వచ్చింది. "పిరికిపంద ! కవర్డు ! స్వార్థపరురాలు ! నేను చెప్పిందంతా తనబుర్ర కెక్కినట్టు నటించి ద్రోహం చేసింది! స్కౌండ్రల్" అని తిట్టుకుంటూ పళ్లు కొరుక్కున్నాడు. కాని మరుక్షణం పశ్చాత్తాపం వచ్చింది.

తానే స్వార్ధపరుడు! తనను రజని ఎందుకని ప్రేమించాలి? ఏంచూసి? ఆమె తనతో, "నిన్ను నేను ప్రేమిస్తున్నాను !" అని ఎన్నడూ అనలేదు. "నన్ను ప్రేమిస్తున్నావా ?" అని అడగనూ లేదు. ఆమె తనను ప్రేమించిందే అనుకున్నా తనను పెళ్ళాడదగినంతగా ప్రేమించకపోయి ఉండవచ్చు. తప్పేం? తన ఉపన్యాసాలన్నీ ఆమోదించినంత మాత్రం చేత వాటిని ఆచరించి ఉండాలని ఎక్కడుందీ? తాను యేసుక్రీస్తా[1] మహాత్మాగాంధీయా? వాళ్ళయినా తమ శిష్యులకు అటువంటి పరీక్షలు పెట్టలేదే !

"డామిట్! రజని నా తుచ్ఛపు జీవితానికి ఈపాటి అనుభవం ప్రసాదించింది. నేనెందుకు కృతజ్ఞుణ్ణిగా ఉండలేను! నాతో స్వేచ్ఛగా స్నేహం చేసినందుకు విద్యార్థులు ఆమె వెనుక కారుకూతలు కూశారు? ఆమె మీద పద్యాలు కట్టారు! అన్నీ సహించింది! ఇంకా ఆమె ఏంచెయ్యలేదని నేను కుళ్ళుతున్నాను? నావాళ్ళో వాలితే

1. యేసుక్రీస్తు (సుమారు క్రీ.పూ. 400-క్రీ.శ. 30) : క్రీస్తు బోధనలు క్రైస్తవ మత ఆవిర్భావానికి కారణం.

దనా? ఆమెనుంచి నేను పొందదగిన సౌఖ్యమేదీ నాకు కాకుండా చేసిందనా? ఛీ ఛీ! ఎట్లా దిగజారిపోయాను !. ..

కాని నన్ను అంతవరకూ ప్రేమించిన మనిషి ఆ ప్రేమను బూడిదపాలు ఎట్లా చేస్తుంది? ఎట్లా చెయ్యగలదు ? ఎందుకు ? ..."

ఈ ప్రశ్నల దగ్గిరే చాలా సేపు గిలగిలా కొట్టుకొని ఆ రాత్రి ఏ రెండు గంటలకో నిద్రపోయినాడు ప్రకాశం.

పరీక్షలు ఇంకో వారంరోజులున్నాయనగా రజని ఉత్తరం రాసింది.

"నామీద ఎందుకు కోపంవచ్చింది? మీరు మా ఇంటికేసి రావటం ఎందుకు మానారు? నేనేమైనా తప్పుచేసి ఉంటే మన్నించండి! మీరు నాకు మళ్ళీ కనిపించకుండా పరీక్షలై వెళ్ళిపోతే నేను చాలా బాధపడతాను. మీ రజని"

దానికి ప్రకాశం జవాబు రాశాడు.

"రజనీ, నాకు కోపం గలిగినమాట నిజమేగాని అది నీమీదగాదు, నామీదే. నేను మీ ఇంటికేసి రావటం ఎందుకు మానానో తెలిస్తే మళ్ళీ నన్ను చూడాలని కోరవు. నేను నిన్ను ప్రేమించాను. అదివరకు ప్రేమనుగురించి రాశాను, మాట్లాడాను తప్ప, ప్రేమించట మేమిటో నాకు నువ్వే నేర్పావు. ఈ సంగతి తెసినాకకూడా నన్ను రమ్మన్నట్లయితే వస్తాను. ఇదివరకు నిన్ను ఎంతమంది ప్రేమించారో నాకు తెలియదు. కాని నేను ప్రేమించినంతగా ఇదివరకుగాని, ఇకముందుగాని ఎవరైనా ప్రేమించే పక్షంలో వాణ్ణి నీవు కళ్ళుమూసుకుని పెళ్ళాడవచ్చు. ఈ సంగతి నేను రుజువు చెయ్యలేనుగాని, అటువంటి ప్రేమ ఆధారంతో ఐహిక కష్టాలు ఎన్నయినా ఎదుర్కొనవచ్చునని నా నమ్మకం. జీవితంలో దురదృష్టవశాత్తూ ఇంకెవ్వరి ప్రేమా సంపాదించలేకపోయినపక్షంలో నన్నూ, నా ప్రేమనూ తలుచుకుని తృప్తి పడగలవని ఆశిస్తున్నాను. శలవు !"

ఈ ఉత్తరం పోస్టులోవేసి ప్రకాశం ఒంటరిగా కూచుని చాలా సేపు ఏడ్చాడు. అంతకు పూర్వం వాడెన్నడూ శరీరబాధ లేకుండా ఏడ్చి ఎరగడు.

## మూడవ భాగం : సాంఘికం

పరీక్షలు అయిపోయినై. ఎట్లా రాశాడో ప్రకాశానికే తెలియదు. అతనికి తెలిసినదల్లా తనకు ఒకజీవితం ముగిసి ఇంకొకటి ఆరంభం కాబోతున్నదని. తన జీవిత విమానం మబ్బుల్లో నుంచి దిగి నేలపై వాలబోతున్నది. ఇక తన జీవితంలో వేగం ఉండదు. స్వేచ్ఛావాయువు ఉండదు. ఇంద్రధనుస్సులుండవు. ఉదయాస్తమయ కాంతులుండవు. ఉద్యోగమూ, పెళ్ళీ, సంసార లంపటమూ, డబ్బు సంపాదించటమూ, డబ్బులేక ఇబ్బందులు పడటమూ, పై అధికార్ల పాదఘట్టనలూ-ఇవన్నీ తాను చవిచూడాలి.

ఇంటికి తిరిగి వచ్చినాక ప్రకాశానికి రోజులు గడవటం లేదు. కాలుకాలిన పిల్లి లాగా తిరిగాడు. హైస్కూలులో తనతో కలిసి చదువుకున్నవాళ్ళలో కొందరు ఇతర కాలేజీలకు వెళ్ళారు. కొందరు చదువుచాలించి ఉద్యోగాలు చేస్తున్నారు కూడా. ఒకడి చదువింకా పూర్తికాలేదు. అతను డాక్టరీ చదువుతున్నాడు. ఇంకా ఇద్దరు లా కాలేజికి వెళ్లే ఉద్దేశంలో ఉన్నారు, పరీక్షల్లో పాసైతే.

పాసయినా, తప్పినా ప్రకాశానికి కార్యక్రమంలేదు- స్నేహితులతో తిరగ టము, పార్కుకు పోవటమూ, అక్కడ నలుగురు మాట్లాడే రాజకీయాలు విన టమూ, విసుగుచెందటమూను. ఇంకో కథ రాద్దామనుకున్నాడు కానీ, ఎందుకో రాయటమంటేనే అసహ్యం పుట్టింది. రేడియోలో మంచి సంగీతం వస్తే వినటం ఒకటే తృప్తికరంగా ఉన్నది.

ఒక రోజు పట్టుదలగా కథ రాద్దామని కూచున్నాడు. కథాంశం అదివరకే ఆలోచించి ఉంచాడు. అతను రజనితో మాట్లాడుతున్నప్పుడా అంశం తట్టింది- కాని దాన్ని అతనిప్పుడు పూర్తిగా మరచిపోయినాడు. ఎంత తల పగుల గొట్టుకున్నా అది జ్ఞాపకం రానేలేదు.

"వాకపోయినా నేనుకూడా కథలు రాయటమేమిటి? పైపెచ్చు ప్రేమను గురించి ! ఏ ఆడదీ నన్ను మైలు దూరంలోకి రానివ్వదు. ఆఖరుకు ముద్దు ఎట్లా ఉంటుందో కూడా నాకు తెలియదు" అనుకుని ప్రకాశం కాగితాలూ, కలమూ అవతల పెట్టేశాడు.

కాలేజీలో ఉండగా లేని సమస్య ప్రకాశానికిప్పుడు కొత్తగా ఒకటి ఏర్పడింది. అది డబ్బు సమస్య. కాలేజీలో ఉన్నన్నాళ్ళూ తనదగ్గిర ఎక్కువ మొత్తం లేక పోయినా అవసరానికి ఉంటుండేది. లేకపోతే ఎవరో మిత్రులు చేబదులిచ్చేవాళ్లు. తండ్రి దగ్గరనుంచి పైకం రాగానే తిరిగి ఇస్తుండేవాడు.

అతను ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి అయిదు రూపాయలదాకా దగ్గిర ఉన్నై. కాఫీహోటలు కిందా, సినిమాలకిందా, సిగరెట్లకిందా—ఈ అలవాటు పరీక్షలకు ముందే అలవాటు చేసుకున్నాడు. అంటే రజనికి గుడ్‌బై ఉత్తరం రాసిన అనంతరం —ఆ డబ్బు కాస్తా అయిపోయింది.

"అమ్మా, నీ దగ్గిర డబ్బేమన్నా ఉందా ?" అని ప్రకాశం తల్లిని అడిగాడు. "లేదు, నాయనా! మీ నాన్నను అడిగిచూడు !" అన్నది ఆవిడ. "ఆ పత్రికవాళ్లు పదిరూపాయలు పంపిస్తారు — ఎప్పుడు పంపిస్తారో తెలియకుగాని !" అని గొణి గాడు.

అన్నట్టు ఆ పత్రికవాళ్ళకు తన అడ్రసులో మార్పు రాయాలి. దానితో బాటు తనకు రావలసిన సొమ్ముకూడా జ్ఞాపకం చేస్తూ, "నేను రాసి మీ పత్రిక ఫలాని సంచికలో అచ్చువేసిన ఫలాని కథకు పారితోషికం ఫలాని చిరునామాకు పంప ప్రార్థన. ఇకనుంచీ ఇదే నా అడ్రసు," అని కార్డు రాశాడు.

తండ్రిదగ్గిర డబ్బున్నట్టు లేదు. ఆయన డబ్బుకు ఇబ్బంది పడుతున్నట్టుగా కూడా కనబడింది. అందుచేత ప్రకాశం తండ్రితో ఆ విషయం ఎత్తలేదు. స్నేహితు లను అడగటానికి అతనికి మనస్కరించలేదు; వాళ్లూ తన పరిస్థితిలోనే ఉంటారు.

అకస్మాత్తుగా సాంబయ్య పెదనాన్న జ్ఞాపకం వచ్చాడు. ఆయన దగ్గిర డబ్బుమూలుగుతున్నది. అయిదురూపాయలు చేబదులు తీసుకుంటే మళ్ళీ పత్రిక వాళ్ళు పంపినప్పుడివ్వవచ్చు. తన సిగరెట్టు, కాఫీ ఖర్చులకైనా కథలురాసి సంపా దించుకోవడం భావ్యంగా ఉంటుంది. తరవాత ఉద్యోగ ప్రయత్నం ఉండనే ఉన్నది.

ప్రకాశం సాంబయ్యగారి ఇంటికి వెళ్ళాడు. దురదృష్టవశాత్తూ సాంబయ్య ఇంట్లోలేడు. ఊళ్ళో కూడా లేడు. పాలఘాటుపిల్ల చూడామణి ఉన్నది. ఇంటినిండా సాంబయ్య తండ్రివేపు బంధువులున్నారు.

తనను చూడగానే చూడామణి కళ్ళు మెరవటం గమనించి, "ఈ మనిషి మావాళ్ళలో ఎంతబాగా అతుక్కుపోయిందో!" అనుకున్నాడు. ఆమె అతన్ని చాలా కుశల ప్రశ్నలు వేసింది. పరీక్ష విషయం అడిగింది. "పెళ్ళి అనుకుంటు న్నారా" అన్నది.

"అయినా నువు పాపం మీ పెదనాన్నను చూడాలని వచ్చి ఉంటావు. ఇన్నాళ్లూ రాక ఆయన ఊళ్లోలేని సమయం చూసి వచ్చావా? భలేవాడివి!" అన్నది.

సాంబయ్య ఊళ్లోలేడని తెలుసుకున్నప్పుడు ప్రకాశం డబ్బుమీద ఆశ వదులు కున్నాడు గాని, చూడామణి మాటల ధోరణి చూస్తే ఊరుకోబుద్ధిపుట్టలేదు. "అవస రంగా అయిదు రూపాయలు కావాలి. పెదనాన్న ఇస్తాడేమో అనుకున్నాను. ఆయన కాస్తా ఊళ్లోలేడు." అన్నాడు ప్రకాశం.

"ఈ భాగ్యానికి పెదనాన్న దేనికిగాని, మళ్ళీ త్వరగా ఇచ్చేట్టయితే నేనే సర్దు తాను. మీ పెదనాన్న సంగతి తెలుసుగా ? ప్రతి దమ్మిడీకి లెక్క చెప్పాలి !" అన్నది చూడామణి.

ఈ విషయం ప్రకాశానికి తెలియదు, చెప్పినాక నమ్మబుద్ధి కూడా పుట్టలేదు. అయినా తల ఆడించాడు, తన పని ప్రస్తుతానికి గడుస్తున్నందుకు సంతోషిస్తూ.

"డబ్బు మేడమీది గదిలో ఉంది. పైకి వెళదామా ?" అన్నది చూడామణి.

చూడామణి వెనకనే ప్రకాశం మెట్లెక్కుతూ ఉండగా అతనికి ఆమెనుగురించి కామంతో కూడిన ఆలోచన వచ్చింది. ఆమె అనాకారికాదు, ఇంచుమించు తన యీడుదే—ఒక్క సంవత్సరం పెద్దదేమో !

మెట్ల మలుపులో, "అబ్బ" అంటూ చూడామణి వెనక్కువాలి, ప్రకాశం మెడ మీదుగా చెయివేసి కాలు జారినట్టుగా బాధా మొహం పెట్టింది. ప్రకాశం ఆమె నడుము చుట్టూ చేతులు వేసి వణకుతున్న గొంతుతో, "ఏమిటది?" అన్నాడు.

చూడామణి అంతలోనే నవ్వి, "చాల్లే!" అని చిన్న గొంతుతో అని తన నడుముచుట్టూ ఉన్న అతని చేతులు వదిలించుకునే మిషలో తన రొమ్ముని అతని

బొమ్మకు గట్టిగా అదిమింది. ప్రకాశం ఉక్కిరిబిక్కిరి అయినాడు. అతని చేతులు ఆమెను తడుముతున్నై.

"ఎవరైనా వస్తారు , పాపిష్టికొంప!" అంటూ చూడామణి అతని చేతులు తన మీది నుంచి తీసేసి మెల్లెక్క సాగింది.

గదిలో ఆమె బీరువాతెరిచి అయిదు చిల్లరనోట్లు తీసి ఒకటికి రెండుసార్లు లెక్కించి అతనికిస్తూ, "ఎందుకో!....సరే గాని నాకేమిస్తావు" అన్నది.

"ఏం కావాలంటే అది ఇస్తాను!" అన్నాడు ప్రకాశం తడబడుతూ, మధ్య గుటకలు వేస్తూ.

"ఊరుకో ఎవరన్నా వస్తారు....చూ డూ, రాత్రి పది తరువాత ఇంటివెనక ఉన్న కామాక్షమ్మగారి ఇంటికిరా. అవతలి వీధిలోనుంచిరా, యేం? అప్పుడు నీఅంతు కనుక్కుంటాను!" అన్నది చూడామణి రహస్యంగా.

ప్రకాశం ఆమెను స్పృశిస్తూ చచ్చిపోవటానికి తయారుగా ఉన్నాడుగాని ఆమె వంటిని తాకకుండా ఎడంగా వెళ్ళటానికి సిద్ధంగా లేడు. అతని కోరిక ఉన్నత స్థాయిని చేరుకున్నది. చివరకు చూడామణి అతన్ని మందలించవలసివచ్చింది.

తాను సాంబయ్యగారి ఇంటినుంచి వచ్చేసినాక తిరిగి ఆ రాత్రి కామాక్షమ్మ గారింట్లో చూడామణిని కలుసుకునే వరకూ మధ్య గడచిన పదమూడున్నర గంటలూ ఎట్లా జరిగినదీ, ఆ సమయంలో ఏమేమి సంభవించినదీ ప్రకాశానికి అంత స్పష్టంగా తెలియదు.

చూడామణికి కామాక్షమ్మ పెద్ద అండగా ఉంటుంది. ఆవిడ పేదరాలు. ఆవిడకు ఒక్కడే కొడుకు. దేశాలమీద తిరుగుతుంటాడు. ఏటా రెండు మూడు పుట్ల గింజలువచ్చే పొలం ఉన్నది. పొలంచేసే రైతులు ఆ గింజలు అమ్మి డబ్బు తెచ్చి ఇస్తారు. సొంత ఇల్లు ఉన్నది. అందులో ఒంటరిగా ఉంటుంది. కామాక్షమ్మగారి దొడ్డీ, సాంబయ్యగారి దొడ్డీ అనుకుని ఉంటై. వాటిమధ్య ఉన్న ఇటుకలగోడ ఒక ప్రక్క పడిపోయింది. అందులోనుంచి చూడామణి వస్తూపోతూ ఉంటుంది. కామాక్షమ్మ అస్తమానం పురాణాలు చదువుతుంది, వేదాంతం మాట్లాడుతుంది. అందు చేత చూడామణి ఆవిడతో చనువుగా ఉండటానికి సాంబయ్య అభ్యంతరం చెప్పడు.

అయితే చూడామణి తన ప్రియులను కలుసుకోవటానికి కామాక్షమ్మగారి ఇంటిని ఉపయోగిస్తూ ఉంటుంది. కామాక్షమ్మ నిజమైన వేదాంతి అయివుండాలి; ఆవిడ ఎన్నడూ అభ్యంతరం చెప్పదు, హర్షించదు. ఎవరైనా ఎరగని వ్యక్తులు అవతలవాకిలి తలుపుతట్టి, "చూడామణి వచ్చిందండీ?" అంటె వచ్చిందనో రాలేదనో చెబుతుంది. వాళ్ల పేర్లుకూడా అడగదు.

చూడామణితో ఎవరైనా "మాట్లాడే" టప్పుడు ఆవిడ ఇంటిముందు అవరణ లోకి వెళ్ళిపోతుంది. "మాట్లాడటానికి" వచ్చినవాళ్ళు రూపాయో రెండో చేతిలో పెడితే మొహాన ఆనందంగాని, ఆశ్చర్యంగాని లేకుండా పుచ్చుకుంటుంది.

# 2

చూడామణి ధర్మాన ప్రకాశం కూసం విడిచి మగవాడైనాడు. అతనిలో కలిగిన దైహికమైన మార్పు చాలా కొంచెమే అయినా మానసికంగానూ, ఆధ్యాత్మికం గానూ కలిగిన మార్పు వర్ణనాతీతం.

చూడామణి చాలా వెకిలి మనిషి. ఆ మనిషికి సున్నిత భావాలేవీలేవు. ప్రతి అంగుళమూ స్వార్థంతో నిండివున్నది. ఆమె నిఘంటువులో తీసుకోవటమే తప్ప ఇవ్వటమంటూలేదు. తనకోసం ఆమె ఒక్క చిన్నమెత్తయినా త్యాగం చెయ్యదని ప్రకాశం ఎరుగును. ఆమెనుచూస్తే అతనికి చాలా ద్వేషం ఉన్నది. తెల్లవారుజామున లేచి వెళ్ళిపోతూ తన అయిదురూపాయల బాకీ జ్ఞాపకం చెయ్యటమే గాక కామాక్షమ్మకు ఒకరూపాయి ఇవ్వమని సిఫార్సుకూడా చేసింది. తెల్లవార్లూ తనను సుఖపెట్టినందుకు డబ్బు అడిగినా అతను ఆశ్చర్యపడి ఉండేవాడు కాడు.

కాని ప్రకాశం చూడామణిని విడిచిపెట్టలేడు. మర్నాడు రాత్రికిమల్లా వస్తా నన్నది. భూమ్యాకాశాలు ఏకమైనా తనురాకుండా ఉండనని ప్రకాశం ఎరుగును. ఎందుకంటే ఈ చూడామణి తనకు కావాలి. ఆమెవల్ల తనకు దొరికే సుఖానికి ప్రత్యామ్నాయంలేదు.

రంకు మొగళ్ళను కలుసుకొనటంలో ఈ చూడామణి బాగా ఆరితేరిందని ప్రకాశం సులువుగానే ఊహించాడు. కాని అది అతన్ని మాత్రము బాధించలేదు. చూడామణిని తలచుకుంటే ఒక్కందుకు అతనికి నవ్వొచ్చింది. దాదాపు నిన్న మొన్నటిదాక ఒక ఆడదానిమీద శుష్కప్రేమ కురిపించాడు. ఇప్పుడు శుష్కకామం అనుభవిస్తున్నాడు. ఈ రెంటికీ లంగరు అందేదారి లేదు.

తాను నైతికంగా తప్పుపని చేస్తున్నట్లు అతనికి కొంచెం కూడా తోచలేదు. ఈ చూడామణి తనను చెడగొట్టినదాకా తనకు ఆడదాని మొకమే తెలియదు. చూడామణి ఏనాడో నీతికి స్వస్తిచెప్పింది. కన్యల పాతివ్రత్యం గురించి ఒకప్పుడు తను అన్న మాటలు బ్రహ్మచారిపత్నీవ్రతానికి మాత్రం ఎందుకు వర్తించవూ? తన ప్రవర్తనవల్ల ఏ స్త్రీకి అన్యాయం జరగటం లేదు.

ప్రకాశం వరసగా మూడు రాత్రులు చూడామణిని కామాక్షమ్మగారింట్లో కలుసుకున్నాడు. "మళ్ళీ కొంతకాలంపాటు మనం కలసుకొనటానికి వంకదొరకదు." అన్నది చూడామణి అతనితో.

"సరే;" అన్నాడు ప్రకాశం. ఆమెదగ్గర తీసుకున్న అయిదురూపాయలలో మూడు కామాక్షమ్మకిచ్చాడు, మిగిలిన రెండూ తనకింద ఖర్చుచేసుకున్నాడు.

తపోభంగం కలిగించి వెళ్లిపోయిన అప్సరసలాగా చూడామణి తనకు అంద కుండా పోయినందుకు ప్రకాశానికి చాలా కోపం వచ్చింది, కాని ఎవరిమీద కోప్పడు తాడు? చూడామణిపైన తనకు ఎటువంటి హక్కు లేదు. ఇంటినిండా మనుష్యులున్న

కొంపలో ఆమె అందరికళ్లూ కప్పి తనను మూడు రాత్రులు వరసగా కలుసుకున్న వంటే అది అందరూ చేయగల ఫీట్ కాదు. నాలుగోరోజూ, అయిదోరోజూకూడా తనవద్దకు రాలేదని అలగటంలో అర్థమేమిటి ?

రజని విషయంలోకూడా ఇట్లాగే తాను కోపం తెచ్చుకున్నాడు. స్త్రీల విషయంలో తనకు దక్కినదానితో ఎందుకు తృప్తిపడలేదు ? తన చిత్తవృత్తిలో ఏదో పెద్ద వంకర ఉండి ఉండాలనుకున్నాడు ప్రకాశం. కాని ఆ వంకర సరిదిద్దడం ఎట్లాగో అతనికి తెలియలేదు.

పత్రికవాళ్ల ధర్మమా అంటూ పత్రికవాళ్ల దగ్గిరనుంచి పది రూపాయిల మని యార్డరు వచ్చింది. అది తీసుకొని సాంబయ్యగారింటికి వెళ్లాడు ప్రకాశం. సాంబయ్య గారు ఎవరితోనో మాట్లాడుతూ హాల్లో కూచుని ఉన్నాడు.

"ఏంరా. ఎక్కడా కనిపించడంలేదే? పరీక్షలు తెలిసినయ్యా ?" అన్నాడు.

"ఇంకాలేదు. ఒకసారి వస్తే నువు ఊళ్లో లేవు" అన్నాడు ప్రకాశం. లోపలికి వెళ్లిపోతూ.

"ఇదిగో! ఏంకావాలీ?" అన్నాడు సాంబయ్య-చాలా అనుమానం మనిషి. ప్రకాశం వినిపించుకోనట్టు నటించి వంటింటిదాకా వెళ్లాడు. వంటింట్లో ఎవరో వితంతువు ప్రకాశాన్ని గుర్తించి, "ఏంకావాలి, నాయనా, ప్రకాశం ? సాంబుడు సావిట్లో లేడూ ?" అన్నది.

"కాసిని మంచినీళ్లు కావాలండీ!" అన్నాడు ప్రకాశం.

ప్రకాశం నీళ్ళు తాగి మిగిలినవి పారబోసేవాడల్లే దొడ్లోకి వెళ్ళి, గ్లాసును బయట అరుగుపై ఉంచి కామాక్షమ్మగారి ఇంటికేసి గబగబా బయలుదేరేడు. చూడామణి అక్కడే ఉండాలి.

గోడలో సందు సులువుగానే దొరికింది. కామాక్షమ్మగారి ఇంట్లో ఎవరు ఉన్నట్టులేదు. దొడ్డివాకిలీ, కిటికీలూ మూసి ఉన్నై. ఇంటిచుట్టూ తిరిగివస్తూ, తానూ, చూడామణీ ఉపయోగించుకున్న గదివాకిలి పక్కగా ఆగి ఆలకించాడు.

సందేహంలేదు, లోపల ఎవరో ఉన్నారు. "ఇకనేను పోవాలి. ఏం?" అని చూడామణి అనటం స్పష్టంగా వినిపించింది. ఆమె రహస్యంగా మాట్లాడలేదు.

"మళ్ళీ ఎప్పుడు ?" అది మగగొంతు. తెలిసిన గొంతు కాదు.

"వీలుంటే రేపు తొమ్మిదీ, పదీ మధ్య!" అది చూడామణి గొంతే.

ప్రకాశం అక్కడ ఆగలేదు. గబగబా కామాక్షమ్మగారి తలవాకిలికేసివెళ్ళి వీధిలోకి నడిచాడు. వీధి మొగదల అయిదు నిమిషాలున్నాక కామాక్షమ్మగారింటి నుంచి ఒక వింతవ్యక్తి బయటికి వచ్చాడు. నలభై ఏళ్ళ వయసుంటుంది. కారు నలుపు మనిషి. చూడటానికి పచ్చిరౌడీ వాలకంగా కనిపించాడు.

ప్రకాశం నేరుగా ఇంటికివెళ్ళి కాగితాలు కలమూ తీసుకుని కథ ప్రారంభించాడు. ఇది బోధించే కథకాదు. ప్రచారం చేసే కథకాదు. ఇందులో ఒక వ్యక్తి

(సాంబయ్య లాటివాడు) తన మొదటి భార్యతో రకరకాల బాధలు పడతాడు; అయితే ఆమె చాలా నీతిపరురాలు. తరవాత ఆ భార్య పోతుంది. మళ్ళీ పెళ్లాడి రెండో భార్యతో చాలా సుఖంగా జీవిస్తాడు; కాని ఈ రెండోభార్యకు యాభైమంది మిండగాళ్ళు—కొందరు నలభైదాటినవాళ్ళు, కొందరు వాళ్ళకొడుకుల ఈడువాళ్ళు. నలభై ఏళ్ళవాణ్ణీ, ఇరవైఏళ్ళవాణ్ణీకూడా ప్రకాశం వర్ణించాడు. ఒకవర్ణన ఆ రౌడీలాటి వాడిది, రెండో వర్ణన తనది.

ఈ కథను ప్రకాశం ఒక వారపత్రికకు పంపాడు. ఇక తాను ఒక్కపత్రికనే నమ్ముకుంటే లాభం లేదనిపించింది. వీలయినన్ని కథలు రాసి వీలయినన్ని పత్రికలకు పంపుతే పైఖర్చన్నా వస్తుంది.

అది పంపిన మర్నాడే ప్రకాశం ఇంకో కథ రాయటానికి పూనుకున్నాడు. కాని ఇప్పుడు అతనికి తాను రాసే కథలపైన మునుపుండినంత గౌరవంలేదు. ఆమాటకు వస్తే తనపై తనకే అంతగా గౌరవం లేదు.

కాని తనలో కలిగిన ఈ మార్పుకు ప్రకాశం పశ్చాత్తాపపడలేదు. తాను పతనమైనట్టు చింతించలేదు. పూర్వం తాను అచ్చగా గాలిమేడలలోనే విహరించినట్టూ, ఇప్పుడు స్వస్వరూపజ్ఞానం కలుగుతున్నట్టూ అతనికి తోచింది. తన అసలు స్వభావం పూర్తిగా అర్థమైనాక దాన్ని బాగు చేసుకోవటం గురించి ఆలోచించుకోవచ్చు నన్నుకున్నాడు.

తనకారుకు చెందిన యువకులందరికీ ఇటువంటి అనుభవాలే కలుగుతాయా అని అతనికి అనుమానం కలిగింది. ఒకప్పుడైతే మరొకడి అనుభవంతో తనకు నిమిత్తం లేదనుకునేవాడే. కాని ఇప్పుడు ఇంకొకరి అనుభవాలు తెలుసుకోవాలన్న కోరిక ఏర్పడింది.

జీవితానికి తాను ప్రేక్షకుడన్న భావం సన్నగిల్లు తున్నది. విధి తనను స్టేజీ మీదికి తోస్తున్నది. తాను తన పాత్ర నిర్వహించాలి, తప్పేదిలేదు.

# 3

"ఏమండి, మనవాడికి పిల్లనిస్తామని తెగపోరుతున్నారు! మంచి సంబంధం చూసి మూడు ముళ్ళూ వేయించరాదా?" అన్నది కృష్ణవేణమ్మ భర్తతో.

"ఉండవే! నీదొకగోలా! అసలే వ్యాపారమంతా అయోమయంగా ఉంటేనూ!" అన్నాడు దక్షిణామూర్తి.

"కట్నం కూడా ఇస్తారు!" అన్నది కృష్ణవేణమ్మ.

"కట్నమా? నేను కొడుక్కు కట్నం పుచ్చుకుంటానా? ఏమిటనుకుంటున్నావు?" అని దక్షిణామూర్తి కస్సుమన్నాడు.

"మీకిష్టం లేకపోతే వాడికిష్టం ఉండరాదా ఏం? ఇందులో తప్పేముందీ ?" అన్నది కృష్ణవేణమ్మ-తప్పేమీ లేదనటం తన భర్త సహించలేడని ఎరిగి ఉండి కూడా.

తండ్రి తిట్టటమూ, తల్లి దెప్పి సాధించటమూ, తండ్రి చీదరించుకోవటమూ, తల్లి ఏడవటమూ ప్రకాశం సినిమా చూచినట్లు చూశాడు. వాళ్ళిద్దరికీ మధ్య మానసిక బంధమూలేదు ! ఎంత ఘోరం ! అనుకున్నాడతను.

తనకూ రజనీకి పెళ్ళి అయి ఉంటే తమ దాంపత్యం ఇట్లాగే ఉండేదా ? అది సంభవంగా కనిపించలేదు. తనకూ రజనికీ ఒకరి భావాలు ఒకరు మాటల అవసరం లేకుండా అర్థం చేసుకునే శక్తి అంతో ఇంతో ఉండేది. అందులో సహస్రాంశం తన తల్లిదండ్రుల మధ్య లేదు. అయితే ఏమయిందీ ? తన తల్లిదండ్రులు భార్యభర్తలు కాగలిగారు, తానూ రజనీ కాలేక పోయినారు.

తాను చచ్చినా పెళ్ళాడగూడదని ప్రకాశం తీర్మానించుకున్నాడు. బెర్నార్డ్ షా వంటి మేధావులు కూడా పెళ్లి లాటరీ అన్న తీర్మానానికి వచ్చారు. అటువంటప్పుడు తాను తన సుఖంకోసం లాటరీ వెయ్యకపోతేనేం? చూడామణివంటి డొక్కులు బోలె డంతమంది! మానసికంగా ప్రేమించటానికి ఒక రజని చాలదా ?

ఇప్పుడు తలచుకుంటే రజని దేవత అనిపించటంలేదు. తన శృంఖలాలను ఆమోదించిన సాధారణపు మనిషిలాగే కనిపిస్తున్నది. మనిషిగాకూడా రజని అతన్ని ఇంకా ఆకర్షిస్తూనే ఉన్నది. ఆమెను తలచుకుంటే ఆనందం కలుగుతూనే ఉన్నది.

అతను ఆమెను గురించి తలచుకున్న మర్నాడే రజని నుంచి ఉత్తరం వచ్చింది. తాను తలచుకున్న సమయానికి ఆమె ఆ ఉత్తరం రాస్తూ ఉండి ఉంటుందా అనికూడా అతను ఆశ్చర్యపడ్డాడు.

"డియర్ మిస్టర్ ప్రకాశం, ఈ ఉదయం ఎందుకో మిమ్మల్ని గురించి చాలా సేపు మాట్లాడుకున్నాం. మీరు పరీక్షలకు ముందు రాసిన ఉత్తరాన్ని దాచి ఉంచుకొన్నాను. ఎప్పుడైనా తీసి చదువుకుంటాను. ఎంతో బాధగా ఉంటుంది. సంతోషంగా కూడా ఉంటుంది. జీవితం భయంకరమైనది. అది నాకు అర్థంకాదు. చదువు నాకెందుకూ పనికిరాలేదేమో ననిపిస్తుంది. మా ఇంటికి కూర్లమ్మవచ్చే వాళ్ళకు జీవితం నాకన్నా బాగా అర్థమయిందా అనిపిస్తుంది.

మీరు కథలు రాయటం మానేశారా ? మానెయ్యకండి; వాటిని చూస్తుంటే స్టూడెంటులైఫ్ జ్ఞాపకం వస్తూంటుంది. తప్పినా, పాసైనా నేనిక చదవను. మావాళ్ళు సంబంధాలు చూస్తున్నారు. పెళ్ళి అన్నమాట వినిపించినప్పుడల్లా మీరు పదేపదే చెప్పిన సిద్ధాంతాలు జ్ఞాపకం వస్తాయి. వాటిని ఎవరైనా ఆచరణలో పెట్టగలరా అని ఎన్నోసార్లు అనుకున్నాను. నా అనుమానాన్ని నేనుగా మీతో చెప్పలేక మరొక విధంగా అడిగి మీకు కోపం తెప్పించాను. వెళ్ళేలోపల ఒక్కసారి కనిపించాలని ప్రార్థించినా ప్రార్థన మన్నించారుకారు. పోనివ్వండి.

మీరు క్షేమంగాను, ఆరోగ్యంగానూ ఉన్నారనుకుంటాను. మా అమ్మా, నాన్నా మిమ్మల్ని అడిగామని చెప్పమన్నారు. మేమంతా క్షేమం—రజని."

ప్రకాశం ఈ ఉత్తరానికి వెంటనే సమాధానం రాయలేదు. రాద్దామన్నా ఎట్లా రాయాలో అతనికి వెంటనే తట్టలేదు. ఆ రాత్రి అందరూ నిద్రపోయాక ఒంటరిగా కూచోని ఈ విధంగా రాశాడు.

"డియర్ రజనీ, నీ ఉత్తరం అందింది. నేను ప్రేమను గురించి పేలిన ప్రేలాపనలన్నీ ఇంకా నీకు జ్ఞాపకం ఉండటం ఆశ్చర్యంగా ఉన్నది. నిజానికి నాకు ప్రేమను గురించి ఏం తెలుసు? జీవితం వెనక గణిత సూత్రాల్లాటివి ఉంటే ఉండ వచ్చు. కాని అవి మనకు తెలియవు. మనం ఏవో సూత్రాలు సృష్టించుకుని వాటి ప్రకారం జీవితం నడుస్తుందని ఆశించి మోసపోతాం. నేనూ అటువంటి మోసం లోనే పడిపోయి ఉండవచ్చు.

నేను కదలు రాయటం మానలేదు. పైపెచ్చు జాస్తిగా రాస్తున్నాను. కూటికీ గుడ్డకూ కాకపోయినా కదలు రాయటం వ్యాపకంగా పెట్టుకోదలిచాను. ఇప్పుడు నేను రాసే కథలు వెనుకటి వాటిలాగా లేకపోతే ఆశ్చర్యపడవద్దు.

నీకు సంబంధం స్థిరమయే పక్షంలో ఒక్క సలహా ఇవ్వవచ్చునా ? పొర పాటున కూడా కథలు రాసేవాణ్ని పెళ్ళాడవద్దు. ఎందుచేతనంటే వాడు జీవితాన్ని వంచించటానికి ప్రయత్నిస్తాడు. తన అనుభవాలను రచనకు ముడివస్తువుగా ఉప యోగించుకుంటాడు. అటువంటి వాణ్ణి భరించటం ఎంత కష్టమో నేను ఊహించ గలను. జర్నలిస్టుల ఎదట రాజకీయ వేత్తలు మనసిచ్చి మాట్లాడరట. కథకుడు జర్నలిస్టుకన్న వెయ్యి రెట్లు విషపుపురుగు. వాడు జీవితం వేసిన ప్రతికాటుకూ అంతకు అంతగా జీవితంపైన పగ తీర్చుకుంటాడు.

నేను కులాసాగానే ఉన్నాను. మీ అమ్మగారికీ, నాన్నగారికీ నా నమస్కా రాలు చెప్పు. ఉంటాను- ప్రకాశం."

ఈ ఉత్తరం రాసినప్పుడు తన కథలు రాసే పద్ధతిని గురించి ప్రకాశానికి కొంచెంకూడా సదభిప్రాయంలేదు. వరసగా రెండుకథలలో చూడామణిని హేయంగా చిత్రించి ఉన్నాడు. ఆ విధంగా అతనికసి కొంత తీరిందేతప్ప, గొప్ప పని చేసినట్టు అతని అంతరాత్మ తృప్తిపడలేదు. నిజానికి తనది అరణ్యరోదనం. చూడామణికి పత్రికలు చదివే అలవాట్లు లేవు. అందులోను తెలుగు పత్రికలు చదివే అలవాటు బొత్తిగాలేదు.

అయితే ప్రకాశం రాసిన ఉత్తరం చూసి రజని చాలా భయపడింది. తనను ఏ కథలోకో ఎక్కించేశాడనుకున్నది. అతనికి తనపై కోపం వచ్చింది కూడాను.

# 4

దక్షిణామూర్తి హోటలు మూశాడు, ఇల్లు అమ్మాడు. సరిగా ఈ సమయం లోనే ప్రకాశానికి పట్నంవెళ్ళే అవకాశం దొరికినది. అతని స్నేహితుడు సోమయాజులు పట్నం బయలుదేరుతూ, "నువుకూడా రాగూడదా? సినిమా తియ్యటం చూడవచ్చు. మా బాబాయి వేషం వేస్తున్నాడు. తిండీ, బస ఏర్పాట్లు మహాసుఖంగా ఉన్నైట!" అన్నాడు.

"డబ్బు కావద్దూ" అన్నాడు ప్రకాశం.

"రైలు చార్జీలకుంటే చాలునోయ్. అక్కడ మనకు ఖర్చే ఉండదు!"అన్నాడు సోమయాజులు.

"పది రూపాయలు చాలా?"

"కో కొల్ల !"

ప్రకాశం తండ్రితో చెప్పాడు. తండ్రి అతనికి పాతిక రూపాయలిచ్చి, "పట్నం పోనే పోతున్నావు. అక్కడ ఏదన్నా ఉద్యోగం దొరుకుతుందేమో చూడు. డబ్బుకావలిస్తే రాయి. ఎప్పుడు నీకు అక్కడ ఇబ్బందిగా తోస్తే అప్పుడే తిరిగిరా!"

రైల్లో ఉన్నంతసేపూ సోమయాజులు వసపిట్టలాగా సినిమాలనుగురించి మాట్లాడాడు. ప్రకాశం ఇంజనుతో పోటీపడ్డట్టుగా సిగరెట్లు కాల్చాడు. అతనిబుర్రకు విశ్రాంతి దొరికినట్లు కనబడింది. తన కథలు అచ్చువేసిన రెండు పత్రికల ఆఫీసులకూ వెళదామని అతను నిశ్చయించుకున్నాడు. సినిమా ప్రపంచానికి సంబంధించినంతవరకు అతనికి ఒకటే కోరిక — ఎక్కడైనా కాంచనమాల కనిపిస్తే ఒకసారి చూడాలని.

వాగివాగి సోమయాజులు ఖాళీ సీటుపైన వెల్లికిలా పడుకుని నిద్రపోయినాడు. ప్రకాశం కిటికీ పక్కనే కూచుని బయటికి చీకట్లోకిచూస్తూ చూడామణిని గురించి ఆలోచించాడు. తాను చూడామణికి ఆ అయిదు రూపాయలూ తిరిగి ఇవ్వనే లేదు. వాళ్ళింటికి వెళ్ళనేలేదు. తనకు మరేవిధంగానూ లభించనిసుఖం చూడామణికి లభిస్తుంటే, తనకు ఎందుకు చేదయింది ? ఆ సుఖాన్ని ఇతరులకు కూడా ఇస్తున్నదని తనకు అసూయా ?

సంఘనీతి యావత్తూ అసూయపైె ఆధారపడి ఉన్నదని ప్రకాశం ఏనాడో తెలుసుకున్నాడు. ఒకడి సొమ్ము మనం ఎందుకు హరించరాదంటే, వాడి లాభం దెబ్బ తింటుందిగనక ! ఒకడి దగ్గిర డబ్బు మురుగుతున్నాసరే, దానితో ప్రాణం కాపాడుకునేవాడు కూడా ఆ డబ్బును తీసుకోరాదు. ఇంకొకడి భార్యనుచూసి నువు ఎందుకు నవ్వరాదంటే, దాని మొగుడికి అసూయ వస్తుందిగనక !

కాని అవినీతికూడా అసూయపైనే ఆధారపడడం ప్రకాశానికి ఆశ్చర్యం కలిగింది. లేకపోతే తాను చూడామణిని బహిష్కరించటంలో అర్థమేమిటి ?

అర్థం ఉన్నది. ప్రకాశానికి తెలుసుకూడాయూ. ప్రేమో, ప్రేమలాటిదో లేకుండా సుఖం అనుభవించటం–జంతువులను అనుసరించటం—తనను చాలా వంగదీసింది. ప్రేమపట్ల కలిగిన నైరాశ్యం కారణంగా మూడు రోజులు చూడామణిని సహిం చాడు; నీటిలో మునిగిపోయేవాడు గడ్డిపోచను పట్టుకున్నట్టు తాను చూడామణిని పట్టుకున్నాడు. కాని అందుచేతను పెరగలేదు. పైపెచ్చు దిగజారాడు. ఆ దిగ జారుడు తాను రాసిన కథలలో బయటపడింది. రజనికి రాసిన ఉత్తరంలో కూడా బయటపడింది. తనకు పెళ్ళిమీదా, ఒకవిధంగా జీవితంమీదా రోత కలిగింది.

ఈ ఊబిలోనుంచి తాను పైకిరావాలి. తన జీవితం విస్తరించాలి. తను సంఘంలో పడాలి. తన మనస్సు దాన్ని అదే తినే ధోరణి మూరాలి.

ఇందుకు తగిన అవకాశం వెంటనే దొరికింది. ఏదో స్టేషనులో — ఇది పాసెంజరు. ప్రతి స్టేషనులోనూ ఆగుతుంది–ఇద్దరు మనుషులు చేతిసంచు లతో ఎక్కారు. వాళ్ళు "యుద్ధం గురించి" మాట్లాడుకుంటున్నారు.

"నువు లక్షచెప్పుగాక, ఇది ఇంపిరియలిస్టుల మధ్య యుద్ధమే, కెయిజరు చెయ్యలేకపోయిన పనిని హిట్లరు చెయ్యబూనుకున్నాడు యుద్ధంలో ఎవరు గెలి చినా ప్రపంచానికి ఒకటే. దాన్ని ఎట్లా పునర్విభజించాలో వాళ్ళూవాళ్ళూ తేల్చు కుంటారు. కాంగ్రెసు సరి అయిన నిర్ణయమే చేసింది." అన్నాడు ఒకడు.

"ఇది ఫాసిజం[1] తో కూడినపని. హిట్లరు ముసోలినీ[2]లు ఇంపీరియలిజ

1. ఫాసిజం : మొదటి ప్రపంచ యుద్ధానంతరం యూరప్‌లో సంభవించిన ఆర్థిక సంక్షోభం నుంచి పుట్టిన వికృత జాతీయవాద ధోరణి పచ్చి కమ్యూనిస్టు వ్యతి రేకవిధానం. ఉదారవాదం, ప్రజాస్వామ్యం శత్రువు. ఏకైక రాజకీయ పార్టీ జనాకర్షణగల ఏకైక నాయకుడు, నియంతృత్వం, అధికారం కోసం టెర్ర రిజం, యుద్ధోన్మాదం, పారామిలిటరీ స్వభావం, వాగాడంబర ప్రచారం, న్యాయానికి పట్టుబడని శత్రునిర్మూలనం, ఉగ్రమైన వంశ వివక్ష, జాత్య హంకారం, దురాక్రమణ తత్వం-ఇవి ఫాసిజం ప్రధాన లక్షణాలు. ముసో లినీ ఆధిపత్యంలో సాగిన ఫాసిస్టు ఉద్యమం 1922-1945 మధ్య ముసో లినీ అధికారంలోకి రావడానికి తోడ్పడింది. జర్మనీలో అధికారానికి వచ్చిన నాజిజం, స్పెయిన్‌లో ఫ్రాంకు అధికారానికి రావటానికి కారణమైన ఫాలాంగ్ (Falange), రుమేనియాలో ఐరన్‌గార్డ్ – ఇవి ఫాసిజం భిన్న ముఖాలు. రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం ఘోరపరాజయం పొందింది.

2. హిట్లర్ ముసోలినీలు : జర్మనీ నాజీ నియంత అడాల్ఫ్ హిట్లరు (1889-1945), ఇటలీ ఫాసిస్టు నియంత బెనిటో ముసోలినీ (1883–1945).

ము[1]నే మించిన బానిస సంస్కృతి తెచ్చి పెట్టటానికి పూనుకున్నారు. ఇంపీరియలిస్టులు ఈ ఫాసిజమునకు బలి అవుతారంటావా, లేక ప్రపంచ ప్రజలతో చేతులు కలిపి ఏదో ఒక విధంగా ఫాసిజమును అంతమొందిస్తారంటావా ?" అన్నాడు రెండోవాడు.

వాళ్ళు పత్రికల భాషలు మాట్లాడుతున్నట్టు ప్రకాశం చెవులకుతోచింది. అర్థమవుతున్నా వినటానికి విచిత్రంగా ఉన్నది.

"ఈ ఫాసిజమును పాలుపోసి పెంచిందెవరు? ఆ సంగతి చెప్పు. ఇదంతా నాటకం. ఎవరెరుగరు ?" అన్నాడు మొదటివాడు.

"ఇంపీరియలిస్టులు మాత్రం పొరపాటు పడరనుకున్నావా? అవతల రష్యా లేకపోతే వాళ్ళు హిట్లరును బలపరచి ఉండరు.[2] హిట్లరును ఖండిస్తూ చర్చిల్[3] ఏనాడో ఘాటైన వ్యాసం రాశాడు. చర్చిల్ ఇంపీరియలిస్టు కాకనేనా ? నువ్వన్నట్లు ఇదంతా నాటకమే అయితే హిట్లరు సూటిగా రష్యామీదికి వెళ్ళి ఉండేవాడు. వాడు బ్రిటన్, ఫ్రాన్సు, వగైరా దేశాలన్నిటినీ భోంచేసినదాకా రష్యాజోలికిపోడు చూస్తూ వుండు!"

ఈ మనిషి ఎవరో తెలుసుకోవటానికి ప్రయత్నించనందుకు ప్రకాశం మరి నాలుగైదేళ్ళ అనంతరం చాలా నొచ్చుకున్నాడు. ఎందుకంటే ఆ రోజుల్లో అంతర్జాతీయ రాజకీయాలను అంతవరకు అర్థంచేసుకున్నవాడు ప్రకాశానికి తగల్లేదు.

ప్రకాశానికి రాజకీయ సంబంధమైన ఉత్సాహం అట్టేలేదు. దక్షిణామూర్తి హోటలు కమ్యూనిస్టు హోటలనిపించుకున్నప్పటికీ, ఆయనకూడా రాజకీయాలను అంతగా పట్టించుకోలేదు. కాకపోతే కొందరిలాగా ఆయనకు రాజకీయ తత్వాలంటే భయమూ, అదురు లేవు. ఆయన మనుషులను మనుషులుగానే అంచనా కట్టేవాడు. ప్రకాశంకూడా ఇంచుమించు అంతే.

ప్రకాశం క్లాసులోనే ఒక విద్యార్థి ఉండేవాడు. అతనికి నిస్త్రాణ అని పేరు పెట్టారు. అతను ఫాసిజంనుగురించి తలచుకుంటేనే కంపించి పోయేవాడు. "ఏమిటోయ్ ఈ హిట్లరూ ముసోలినీ ? వాళ్ళు మనుషులను ఎక్కువ తక్కువ తరగతులుగా విభజిస్తారట ! తక్కువజాతి మనుషులకు ఎటువంటి రాజకీయ హక్కులూ

---

1. ఇంపీరియలిజం : రాజ్య విస్తరణ, దురాక్రమణ లక్ష్యాలతో ఒక రాజ్యాన్ని స్వాధీనపరుచుకొని పాలిత ప్రాంతంమీద చేసే ఆర్థిక దోపిడి. బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణవాదులు 1890 లో ఈ మాటను ఇంగ్లండులో అమలులోకి తెచ్చారు – జోసఫ్ చాంబర్లేన్ నాయకత్వంలో.

2. రష్యాలేకపోతే....రెండవ ప్రపంచ యుద్ధ పరిణామాల ప్రస్తావన.

3. హిట్లరును ఖండిస్తూ చర్చిల్....రెండవ ప్రపంచ యుద్ధ పరిణామాల ప్రస్తావన.

ఉండవుట ! వాళ్ళ పరిపాలనా విధానాన్ని విమర్శించినవాళ్ళని కాన్సెంట్రేషన్ కాంపు[1]ల్లో పెడతారట!" అనేవాడు తలుచుకుంటేనే దడపుడుతున్నట్లుగా.

ఇతని మాటలు వినీవినీ ఒక విద్యార్థి, "అంటే హిట్లరు పరిపాలనలో ప్రపంచం మన దేశంలాగే ఉంటుందన్నమాట ! అనేక వేలయేళ్ళుగా మనం ఫాసిజం అమలు చేస్తూన్నాం. కుల వ్యవస్థ లేని ఇంగ్లండులోనో, అమెరికానోలో పుట్టిన వాడివైతే నీవు భయపడినా అందం, చందం. మన సమాజంలో జాతిభేదాలున్నాయి. రాజకీయ హక్కులు లేవు. ప్రపంచంలోకల్లా తక్కువరాబడీ, ఎక్కువమంది సంఖ్యా, తక్కువ అక్షరాస్యతా, తక్కువ ఆస్పత్రులూ, ఆక్కువ బుద్ధీ ఉన్నాయి, నువ్వేమీ విచారించకు!" అన్నాడు.

కాని నిస్త్రాణగాడికి ఏమీ తృప్తికలుగలేదు. అటువంటి వాళ్ళు మన దేశంలో అధిక సంఖ్యలో ఉన్నారు. తాము నీళ్ళలోపడి ఒక వంక చస్తూ, మరొకళ్ళు ఏడుస్తున్నారే అని దిగులుపడేవాళ్ళు ! వీళ్లే యుద్ధానంతర కాలంలో రష్యాలో ప్రజలకు స్వేచ్ఛ లేదని వాపోయినారు. తూర్పుయూరపు దేశాలను[2] రష్యా పొట్టనపెట్టుకుంటున్నదని దిగులు పడ్డారు.

## 5

సోమయాజులూ, ప్రకాశమూ త్యాగరాయనగరు బస్సు పట్టుకుని పానగల్ పార్కు ప్రాంతాలదిగి, ఉస్మాన్‌రోడ్డు అడిగి తెలుసుకుని పైకి క్రిందకీ రెండుసార్లు తిరిగినాక సినిమా కంపెనీవాళ్ళ లాడ్జి దొరికింది. లాడ్జిలో ఎవరూలేరు. దాదాపు అందరూ షూటింగుకు వెళ్ళారుట. ప్రకాశం ఆ లాడ్జిలో పరుపుచుట్ట పెట్టుకోవడానికి కూడా బిడియ పడ్డాడుగాని సోమయాజులు చొరవగా అక్కడ ఉన్న తెలుగాయనతో అనేక విషయాలు మాట్లాడి, దొడ్డి ఎక్కడో, స్నానం ఎక్కడ చెయ్యాలో, పక్కచుట్టలు ఎక్కడ పెట్టుకోవాలో, టిఫిను, భోజనం వగైరా ఏర్పాట్లు ఏమిటో వివరంగా తెలుసుకున్నాడు.

---

1. కాన్సెంట్రేషన్ కాంపులు: రెండవ ప్రపంచ యుద్ధకాలంలో నాజీలు సృష్టించిన కొత్త తరహా "దుంపనాశనం శిబిరాలు", "మృత్యు శిబిరాలు" (ఉదాహరణకు ఆష్‌విట్జ్, ట్రెబిలింకా). దాదాపు 2000 శిబిరాల్లో యూదులను, రాజకీయ ప్రత్యర్థులని భావించిన వాళ్ళనూ లక్షలాది మందిని నాజీలు జర్మనీలోనూ, ఆక్రమిత యూరప్‌లోనూ పథకం ప్రకారం పొట్టన బెట్టుకున్నారు. నాజీ కాన్సెంట్రేషన్ కాంపుల్లో 80 లక్షల మంది మరణించినట్లు అంచనా. అందులో 50, 60 లక్షల మంది యూదులు.

2. తూర్పు యూరపు దేశాలను రష్యా : పోలెండ్, జెకొస్లవేకియాల ఉదంతం. రెండవ ప్రపంచయుద్ధ పరిణామాల ప్రస్తావన.

ఆ తెలుగాయన ఈ ప్రశ్నలకు ఆశ్చర్యపడకుండా అన్నింటికీ సమాధానాలు చెప్పాడు. "కాస్త టిఫిను తిని, స్నానాలు చేసుకుని మేం కూడా స్టూడియోకు పోతాం మరి !" అన్నాడు సోమయాజులు.

తెలుగాయన, "కామయ్యా, ఓ కామయ్యా! మనవాళ్లకు ఫలహారం పెట్టూ ....వెళ్ళండి అల్లం వేసిన పెసరట్టూ, అల్లప్పచ్చడీ, ఉప్మా చేశాడు కామయ్య! అల్లప్పచ్చడి మహాబాగా కుదిరింది!" అంటూ వాళ్ళను భోజనాలుచేసే చోటికి పంపాడు

కామయ్య వంటవాడల్లెవుంది. ఇంత కుంకుం బొట్టుపెట్టుకుని భూత వైద్యుడల్లె ఉన్నాడు. "కూచోండి, కూచోండి ! ఇదేనా రావటం? ఎవరో వస్తున్నారని ఇవాళ ప్రొద్దునకూడా దత్తాత్రేయులుగారన్నారు" అంటూ అరిటి ఆకుల్లో ఆటే వేడిగా లేని పెసరట్లు రెండేసీ, అరసోలెడు ఉప్మాపట్టుకొచ్చి వాళ్లముందు పెట్టాడు. ఉప్మా నెయ్యి ఓడుతున్నది. మంచి నెయ్యి, ఘుమాయిస్తున్నది.

"సినిమా కంపెనీ అంటే ఈ లెక్కన తింటారు గాబోలు! అందుకే ప్రతివాళ్ళూ సినిమాల్లో చేరాలని ఏడ్చి చస్తారు !" అనుకున్నాడు ప్రకాశం. కాని అతనికి డబ్బు ఖర్చుచేసి సినిమా తీయిస్తున్న వాళ్ళను చూస్తే జాలివేసింది. ఎంత సినిమా కంపెనీ అయితే మాత్రం తేర సత్రమల్లె నడుపుకుంటారా ?

కామయ్య మధ్యమధ్య కబుర్లు చెబుతూ, "ఇంకో పెసరట్టు వడ్డించనా? కొంచెం ఉప్మా ? మీకు పచ్చడి చాల్లేదల్లె ఉంది. ఒక్క క్షణం...."అంటూ పచ్చడి తెచ్చివేశాడు.

"ఏర్పాట్లు బాగానే ఉన్నయ్యే ?" అన్నాడు సోమయాజులు.

"మెల్లిగా అంటారేమిటి? ఈ లాడ్జి పెట్టినాక చింతకాయి, టొరగాయీ, ఆవకాయీ, కంద పచ్చడీ పెట్టాం. ఆవకాయి అద్భుతంగా కుదిరింది. మూడు వందల కాయ వేశాం—బానల్లో. ఏదీ పిక్చరయిపోయే లోపలే ఆవకాయి చెల్లేట్టున్నది. కంద పచ్చడీ మిగలదు. సర్వేశ్వరరావుగారు ఎన్ని ఉన్నా కంద పచ్చడి వేస్తేగాని భోం చెయ్యడు ...."

కాఫీ తాగి ఇద్దరూ ఒకరి తరువాత ఒకరు స్నానాలు చేసారు. ఒక చెంప ఎండలు ముదురుతున్నా కావలసినవాళ్ళకు స్నానాల గదిలో కాగులో వేడినీళ్ళు ఉన్నయి ! సోమయాజులు వేడినీళ్లే పోసుకున్నానని చెప్పాడు. "మనవైపు అంత ఎండలో ఈ పట్నంలో హాయిగా చల్లగా ఉందోయ్!" అన్నాడు పైపెచ్చు.

సోమయాజులు మొదట కనపడిన తెలుగాయనను స్టూడియోకు ఏ బస్సెక్కి వెళ్ళాలని అడిగాడు.

"ఎందుకూ? ఇంకో అరగంట ఆగారంటే భోజనాలు పట్టుకుపోవటానికి వాన్ వస్తుంది" అన్నాడాయన.

"ఇంకేం!" అన్నాడు సోమయాజులు.

ఇక్కడి ఏర్పాట్లు పైవాళ్ళక్కూడా ఇంత సులువుగా ఉండటంలో ఏదో పొరపాటున్నదనిపించింది ప్రకాశానికి. తానూ, సోమయాజులూ చేసినపని ఎవడైనా

చేయవచ్చు. "మీరు ఎవరు?" అని అడిగే నాథుడు లేడు. సోమయాజులు లాడ్జిలో ఒకరిద్దరి పేర్లు ఎవరైనా సంపాదించవచ్చు.

వాన్ వచ్చేదాకా ప్రకాశానికి కాస్త నడుము వాల్చాలనిపించింది. తన ప్రక్క చుట్టవిప్పి పడుకున్నాడు. తెల్లవార్లూ రైల్లో నిద్రలేని కారణంచేత వెంటనే నిద్రపట్టింది. అతనికి నిద్ర మెళకువ వచ్చేసరికి మూడుదాటింది.

"ఇంతసేపూ నిద్రే? నేను స్టూడియోకు వెళ్ళనూ వెళ్ళాను, రానూ వచ్చాను. ముందు భోజనానికి లేవండి!" అన్నాడు కామయ్య, మొహం కడుక్కొని నిద్రమత్తు వదిలించుకోవటానికి పోతున్న ప్రకాశాన్ని చూసి.

"ఇక భోజనం రాత్రికే. సోమయాజులేడీ!" అని ప్రకాశం అడిగాడు.

"ఆయనగారు స్టూడియోకు వెళ్ళాడుగా. మిమ్మల్ని లేపితే మీరు లేవలేదు. లేవగానె అక్కడికి పంపించమన్నారు. సాయంకాలం ఆరుదాకా షూటింగు జరుగుతుంది. స్టూడియోకు వెళ్ళటం కూడా చాలా సులువేలెండి. కాస్త పార్కుదాకా నడిచి, ట్రిప్లికేను బస్సు పట్టుకున్నారంటే...."కామయ్య, వివరాలన్నీ చెప్పాడు. ప్రకాశం అన్నీ విన్నట్టు నటించాడుగాని అతను స్టూడియోకు వెళ్ళదలచలేదు. పత్రికల ఆఫీసులు చూడ నిశ్చయించాడు.

అతను సబ్బుతో మొహం కడుక్కొని, తలదువ్వుకుని, పంచాదోవతీ కట్టుకుని బస్‌స్టాప్ దగ్గరికివెళ్ళి, అక్కడ జార్జిటవునుకు వెళ్ళేబస్సులను గురించి వాకబుచేశాడు. "పారీస్‌కార్నర్"కు వెళ్ళే ఏ బస్సయినా పట్టుకోమన్నారు. ఒక పావు గంటలో బస్సు చిక్కింది. బస్సులో ఎక్కికూచుని తాను దిగవలసిన బస్సుస్టాపు గురించి వాకబుచేశాడు. బస్సు కండక్టరు తెలుగు మాట్లాడి, ఎక్కడదిగాలో తాను చెబుతానని మాట ఇచ్చాడు.

పత్రికల ఆఫీసులు మామూలు ఆఫీసులల్లెనే ఉంటయ్యనీ పత్రికలలో పని చేసేవాళ్ళు గుమాస్తాలల్లెనే పనిచేస్తారనీ ప్రకాశానికి తెలీదు. వాళ్ళని చూస్తే అతనికి ఒక విధమైన నీరసం వచ్చేసింది. కళలు సృష్టించేవాళ్ళు గుమాస్తాలమల్లె పని చెయ్యట మేమిటనుకున్నాడు.

అతను ఎడిటరుగారెవరో కనుక్కొని తన పేరు చెప్పుకున్నాడు. అతన్ని చూసి ఎడిటరు సంతోషం మొహమేపెట్టేడు. కాని అదంతా "మర్యాద" అనీ, తనకన్న గొప్పరచయితలే ఎడిటరుగారికి ఎదురుగా కూచున్నారనీ ప్రకాశం అర్థం చేసుకోగలిగాడు.

"ఎప్పుడు రావటం ? ఏం పనిమీద వచ్చారు?" అన్నాడు ఎడిటరుగారు.

"వేరే పని ఏమీలేదు. ఎరిగినవాళ్ళు సినిమా తీస్తుంటే ఒక స్నేహితుడి వెంటపడి వచ్చేశాను. ఇవాళ పదింటికి దిగాను, పట్నం రావటం ఇదే మొదటిసారి," అన్నాడు ప్రకాశం.

"మీ కథ ఒకటి మా దగ్గరే ఉన్నది. మీకు జ్ఞాపకం ఉండే ఉంటుంది. కిందటి మాసమే వేద్దామంటే పడలేదు. బహుశా వచ్చేసంచికలో పడవచ్చు" అన్నాడు ఎడిటరు. అసలు విషయమేమంటే ఆయన ఆ కథను వెయ్యవద్దనే అనుకున్నాడు. ఆయనకది అంతగా నచ్చలేదు. ప్రకాశాన్ని చూసినాక ఎందుకో వేద్దాం లెమ్మనిపించింది. మహామహా రచయితలే అప్పుడప్పుడూ మట్టివాసన కొట్టే రచనలు చేస్తారు. వాటిని వాళ్ళ పేరునుబట్టి వెయ్యవలసి ఉంటుంది.

ప్రకాశం తన కథలను గురించి మాట్లాడకపోవటం ఎడిటరు గమనించి తృప్తి పడ్డాడు.

"ఇక్కడున్న వారిలో రచనలు చేసేవాళ్ళెవరైనా ఉన్నారా?"అని ప్రకాశం తన చుట్టూ చూశాడు.

"అడుగో మా లక్ష్మీకాంతంగారు సారథి అనే మారుపేరుతో రాస్తూంటాడు. అనేక విషయాలను గురించి రాయగల ప్రతిభావంతుడు!" అంటూ ఎడిటరుగారు ప్రకాశాన్ని లక్ష్మీకాంతానికి పరిచయం చేశాడు.

లక్ష్మీకాంతంకూడా చిన్నవాడే. బహుశా ముప్పైలోపువాడు. ఆయన ఆప్యాయంగా, "మీరా ప్రకాశరావుగారు ? నమ్మశక్యం కాకుండా ఉందే. మీకు కనీసం నా యీడైనా ఉంటుందనుకున్నా. మీ హాస్టలు ఎగ్రసు సంగతి విని వార్డెనేమో నని కూడా అనుకున్నా. స్టూడెంటుగా ఉంటూనే కథారచన ప్రారంభించారన్న మాట. చాలా సంతోషం. కథల ఇతివృత్తాల సంగతి ఎట్లా ఉన్నా, రచన మెచూర్‌గా ఉన్నట్లు తోచింది," అన్నాడు.

లక్ష్మీకాంతం నోరుతెరిచిన క్షణంనుంచీ ప్రకాశానికి ఆయనపైన మంచి అభిప్రాయం ఏర్పడింది. "ఈమనిషి నిజాయితీ గలవాడు. ఇచ్చకాలు మాట్లాడడు. తీవ్ర విమర్శలకు దిగడు. ఎంతవరకు నచ్చితే అంతవరకే మెచ్చుకుంటాడు" అనుకున్నాడు ప్రకాశం.

"అప్పుడే నాలుగుంపావయిందే ఒక్కపావుగంట టైమిచ్చారంటే చేతిలో పని పూర్తి చేస్తాను. తరువాత అట్లా బీచికి పోదాం మీకు తొందరపని ఏమీ లేదుగా ?" అన్నాడు లక్ష్మీకాంతం.

"తొందరపనిగాదు. తాపీపనికూడా లేదు!" అన్నాడు ప్రకాశం శ్లేష్మ గమనించకుండా.

లక్ష్మీకాంతం పెద్దగా నవ్వి, "నిర్మాణ కార్యక్రమం ఏమీ లేదంటారు?" అంటూ తన పనిలో ప్రవేశించాడు.

## 6

లక్ష్మీకాంతం ప్రకాశాన్ని పోర్టు బీచికి తీసుకువెళ్ళాడు. ప్రకాశం నిజమైన సముద్రాన్ని చూడటం అదే మొదటిసారి అని లక్ష్మీకాంతం ఊహించలేదు. ఒకవంక

సముద్రాన్నీ, ఇంకోవంక లక్ష్మీకాంతం చెప్పే విషయాలనూ కూడా జీర్ణించుకోవటం ప్రకాశానికి సాధ్యంకాలేదు. లక్ష్మీకాంతం తాను పదేళ్ళక్రితం పట్నం ఎట్లావచ్చిందీ చెబుతున్నాడు. ఆ మాటలేవీ ప్రకాశం బుర్రకు సరిగా పట్టలేదు.

లక్ష్మీకాంతం అకస్మాత్తుగా సినిమాల విషయం ఎత్తాడు.

"నిజంగా ఈ సినిమాకళ చాలా గొప్పకళే. ఆ సంగతి సినిమా ప్రొడ్యూసర్లుకూడా గుర్తించటంలేదని నా అనుమానం. అది చిన్న కళలకూ తల్లిగా కనిపిస్తుంది. దాని ముందు ఏ పుస్తకం, ఏ నాటక ప్రదర్శనం ఆగుతుంది చెప్పండి? బోధనకు్కూడా అది మంచి మీడియమే! మనం అక్షరాభ్యాసం ప్రారంభించి కనీసం పదిహేనేళ్ళు చదివితేగాని పట్టుంగట్టుకోలేం గద! అంతచదువూ సినిమాల ద్వారా ఏడేళ్ళలో వస్తుందని నా సిద్ధాంతం ఈ చదువుల క్రిందనే మనకున్న కాస్త అయుర్దాయమూ వృధా అయిపోతున్నది గదండీ! వృత్తి విద్యలు కూడా సినిమా సహాయంతో అతి సులువుగా నేర్పవచ్చు. కార్టూన్ పిక్చర్లు, స్లోమోషన్, ఫ్లాష్‌బ్లాక్ మొదలైన టెక్నిక్‌లతో, క్లోజప్ సహాయంతో విద్యార్థి సమస్తమూ నేర్చుకోవచ్చు. సినిమాలో ఇది సాధ్యం, ఇది అసాధ్యం అనేదిలేదు. ఇంకోసంగతి చూశారోలేదో, చదువుకింద బోలెడంత ఖర్చవుతున్నది- విద్యార్థులకూ అవుతున్నది, ప్రభుత్వమూ ఖర్చుచేస్తున్నదనుకోండి, ఇంత ఖర్చయినా విద్యా విధానం సరిగా ఉందా? ఎంత మాత్రం లేదు. స్కూలుకు ఇద్దరు కూడా సమర్థులైనా టీచర్లులేరు. అసమర్థపు టీచర్లూ, అసమర్థులు వ్రాసిన పుస్తకాలూ కలిసినప్పుడు చదువెలా ఉంటుందో చూసుకోండి, అన్ని క్లాసులకూ పనికివచ్చే సినిమాలు తయారు అయినాయంటే ఎంతపెద్ద కాలేజీ అయినా అయిదుగురు మనుషుల స్టాఫ్‌తో నడుస్తుంది! దీన్ని గురించి చాలా వివరంగా నోట్సు తయారుచేసి ఉంచానులెండి. రాద్దామంటే పడకుండా ఉంది. విద్యావిధానాన్ని ఒక్క దెబ్బన రివొల్యూషనైజ్ చెయ్యవచ్చు!" అన్నాడు లక్ష్మీకాంతం.

ప్రపంచంయొక్క అభ్యుదయం గురించి ఈ విధంగా ఎన్ని లక్షలమంది ఆలోచిస్తున్నారో! వాళ్లలో కొన్నివేలమంది ఆలోచనలు అమలు జరిగినా ప్రపంచం బాగుపడిపోను. లక్ష్మీకాంతం కలలుకంటున్నాడనీ అచ్చంగా సినిమా చిత్రాలతో విద్యార్థులు చదువుకోవటం సాధ్యంకాదనీ వాళ్ళను ప్రశ్నించటానికీ, పరీక్షించటానికీ, వెనుకబడితే ముందుకు లాగటానికి ఉపాధ్యాయులు ఉండాలని ప్రకాశం అనుకున్నాడు. అయినా లక్ష్మీకాంతం మోస్తరుగా కలలు గనటంమీద అతనికి గౌరవం తగ్గలేదు. ప్రపంచాన్ని ముందుకు తీసుకుపోయే ఆలోచన తనకు కూడా ఒకటి తట్టినట్లయితే, దానితోపాటు ఏళ్ళతరబడి కుస్తీపట్టాలనిపించింది.

"ఎప్పుడన్నా సినిమాలు చూడటంతప్ప నాకింకేమీ వాటిని గురించి తెలీదు." అన్నాడు ప్రకాశం.

దీపాలు వెలిగినాక బీచి చాలా అందంగా ఉన్నది. లైట్‌హౌస్ జంటదీపాలు తిరగటం కూడా ప్రకాశం చూశాడు. ఇంకా బ్లాకౌట్ అమలులోకి రాలేదు.

ఎనిమిది కాగానే లక్ష్మీకాంతం బయలుదేరుదామని సూచించాడు.

"నేను త్యాగరాయనగరు బస్సు పట్టుకోవాలి కదూ?" అన్నాడు ప్రకాశం, లక్ష్మీకాంతం తనను బస్సులో ఎక్కించి వెడతాడన్న ఆశతో.

"ఈపూట మా ఇంట్లో భోంచెయ్యండి. ఒకవేళ బస్సు అందకపోతే రాత్రి పదకొండు దాటినాకకూడా రైళ్ళుంటై. మా యింటికి బస్సూ, రైలూ ఒకటే దూరం" అన్నాడు లక్ష్మీకాంతం.

"చెప్పకుండా పెట్టకుండ మనిషినితెస్తే మీ వాళ్ళకు ఇబ్బందికాదా"అన్నాడు ప్రకాశం మొగమాటపడుతూ. అతను పొద్దునతిన్న టిఫినే. ఆకలి దహించేస్తున్నది.

"ఏం ఫరవాలేదు. స్టవ్‌మీద ఇంత అన్నం వండితే పచ్చళ్ళూ, చారునీళ్లూ ఉండనే ఉంటై. పండుమిరప కాయలతో పెట్టిన అసలైన గుంటూరు గోగుపచ్చడి తినిపిస్తా, రండి!" అన్నాడు లక్ష్మీకాంతం.

లక్ష్మీకాంతం ఉంటున్న మేడ మీది భాగం ఏమంత పెద్దదికాదు. కాని సౌకర్యంగా ఉన్నది. ముందు భాగంలో ఒక చిన్న వరండా, దానిప్రక్కన ఒకచిన్న గదీ ఉన్నవి. ఈ రెండింటి వెడల్పునా ఒక పెద్ద గది ఉన్నది. దాని వెనక మళ్ళా ఒక పెద్ద వరండా దానిలో ఒక ప్రక్క వంటయిల్లు, రెండో ప్రక్కగా స్నానాల గదీ, ఫ్లషౌటూ ఉన్నై. ముందు వరండాలోకి హాయిగా సముద్రపుగాలి వీస్తున్నది. అందులో ఒక పడకకుర్చీవేసి కూచోబెట్టి ప్రకాశంతో ఇప్పుడే వస్తాననిచెప్పి లక్ష్మీకాంతం లోపలికి వెళ్ళాడు.

ఆయన వెళ్ళగానే ప్రకాశం కుర్చీలోనుంచి లేచి వరండా చివరకువచ్చి కనిపించిన మేర మద్రాసు నగరపు దీపాలనుచూసి సంతోషించాడు. పట్నం వాతావరణం విశాలంగా ఉన్నట్టు కనబడింది. "స్థల ప్రభావముంటుంది. ఇక్కడ ఉపాధి కల్పించుకుని జీవించే మనిషికి వచ్చే ఆలోచనలూ, వీళ్ళ దృక్పథమూ వేరు" అనుకున్నాడు ప్రకాశం. తనక్కూడా ఈ పట్నంలో చిన్న ఉద్యోగం దొరికితే ఎంత బాగుండును ! ఉన్న ఊరని అభిమానపడటమే గాని అక్కడ చేసేటందుకు ఉద్యోగాలు ఎక్కడున్నై !

అయిదు నిమిషాల్లో తిరిగివచ్చి లక్ష్మీకాంతం అతన్ని లోపలికి తీసుకుపోయి తన భార్యకూ, పిల్లలకూ పరిచయం చేశాడు. పెద్ద పిల్లలిద్దరూ మగపిల్లలు. బహుశా తొమ్మిదీ, ఏడు ఏళ్ళుండవచ్చు. రెండో వాడికి పళ్ళు ఊడి ఉన్నై. మూడో పిల్ల ఆడపిల్ల మూడేళ్ళది. దాన్ని చూస్తే ప్రకాశానికి ముచ్చటవేసింది. బొద్దుగా బొమ్మలాగుంది. దానికేసిచూస్తే చాలు నవ్వుతుంది. నవ్వితే రెండు బుగ్గలూ సొట్టలు పడతై.

తరువాత లక్ష్మీకాంతం కూడా ఒక పేముకుర్చీ తెచ్చి వేసుకొని వరండాలో కూచుని, ప్రకాశాన్ని పడకకుర్చీలో కూచోమన్నాడు. పడకకుర్చీలో కూచోవటం ప్రకాశానికి ప్రాణాంతక మనిపించింది. ముసలివాళ్ళు తప్ప పడకకుర్చీలో కూచో గూడదని అతని నమ్మకం. లక్ష్మీకాంతాన్ని అతి కష్టంమీద పడకకుర్చీమీదికి మార్చి ప్రకాశం పేముకుర్చీలో కూచున్నాడు.

"మరేంలేదుగాని మాఇంట్లో నల్లుల బాధ జాస్తి. పట్నంలో ఎక్కడచూసినా నల్లులే!" అన్నాడు లక్ష్మీకాంతం.

ప్రకాశం నవ్వి "నన్ను నల్లులు కుట్టవులెండి," అన్నాడు.

లక్ష్మీకాంతం ప్రకాశం గురించి చాలా వివరాలు అడిగాడు. చదువు అయి పోయిందని తెలిసి భవిష్యత్తు మాటేమిటన్నాడు.

"ఈ పట్నంలో ఎక్కడన్నా ఉద్యోగం దొరికితే చెయ్యాలనిపిస్తున్నది. మన ప్రాంతాల కంటే ఇక్కడ జీవితం చాలా మెరుగేమో అనిపిస్తున్నది." అన్నాడు ప్రకాశం.

"చాలావరకు అది నిజమేననుకోండి, ఇక్కడి చిక్కులు ఇక్కడా ఉన్నై. అయినా ఉద్యోగం దొరికే అవకాశాలు ఇక్కడే ఎక్కువ. కానివ్వండి. మీరింకా యిక్కడ కొన్నాళ్ళుంటున్నారుగా? ఏదైనా ఛాన్సుంటే చూద్దాం !" అన్నాడు లక్ష్మీ కాంతం. అది వాగ్దానం కాదు దాన్ని ఆయన మరో అయిదు నిమిషాల్లో మరిచి పోడని కూడా ప్రకాశం అనుకోలేదు.

## 7

వాళ్ళు భోజనాలకు లేచేటప్పటికి తొమ్మిది దాటింది. విస్తట్లో రెండురకాల కూరలూ, ఒక పులుసు, పచ్చడీ,కందిపచ్చడీ, ఆవకాయీ వడ్డించింది లక్ష్మీకాంతం గారి భార్య. అందుకే వంట ఆలస్యమయింది!

"ఇదంతా ఏమిటండీ?" అన్నాడు ప్రకాశం.

"మనం వద్దంటేమాత్రం ఆడవాళ్ళు ఊరుకుంటారా? ఈ కాలపువాళ్ళయితే తమను నలుగురూ మెచ్చుకోవటానికి పలచని చీరెలూ, లిప్‌స్టిక్కూ అవే వేసు కుంటారు. మా ఆవిడ పాతకాలపుది గనుక వంటలో చాతుర్యం చూపించాలని చూసింది. ఫరవాలేదులెండి, అన్నీ తేలికగా అరిగే పదార్థాలే." అన్నాడు లక్ష్మీకాంతం.

"ఆమె ఏదో అన్నారు!" అన్నాడు ప్రకాశం.

"మరేమీ అనలేదులెండి, నన్నుకూడా కొత్తకాలపు దాన్ని చెయ్యరాదా? అన్నాను" అన్నది లక్ష్మీకాంతం భార్య.

"ఒకళ్ళు చేసేదేమిటి ? ఎవరిమటుకు వాళ్ళు అయిపోవటమే ! నువు నిజంగా అవుతానంటే నేను ఆపగలనా ఏమిటి?" అన్నాడు లక్ష్మీకాంతం.

తన తల్లి దండ్రులమధ్య ఈపాటి సమానత్వం సంభాషణలు ఏనాడులేదు. ఇద్దరిలో ఎవరి తప్పో ప్రకాశం ఊహించలేక పోయినాడు. ఇద్దరూ ఎన్నడూ ఒక స్థాయిలో మాట్లాడి ఎరుగరు. వాళ్ళలో ఏ ఒకరు చలోక్తిగా సంభాషణ ప్రారంభించినా, రెండోవాళ్ళు కట్టెవిరిచి పొయిలో పెట్టినట్లు జవాబిచ్చి సంభాషణను ఘర్షణక్రింద మార్చేవారు. బహుశా తప్పు ఇద్దరిదీ అయి వుంటుంది. ఇద్దరూ మాట్లాడుకునేటప్పుడు ముఖ్యంగా దగ్గిర మనుషులు మాట్లాడుకునేటప్పుడు మాటల్లో వున్నదానికన్నా ఎంతో ఎక్కువ అర్థం చేసుకోవచ్చు. అచ్చగా మాటల్లో ఉన్నదే అర్థం చేసుకుంటే అది నాటకం కావచ్చు గాని జీవితం మటుకు కాదు.

తనూ రజనీ మనుషులు మాట్లాడుకోదగినట్టు మాట్లాడుకున్నారని ప్రకాశం గట్టిగా నమ్మాడు. తాము మాట్లాడుకునేటప్పుడు ఇద్దరి మనసులూ చక్కగా ఒక ఒకదాని కొకటి ట్యూన్ అయి వుండేవి కావూ? అది రజనికి స్వల్పవిషయంగా కన పడి ఉంటుందా? తనకూ రజనికీ మధ్య అడ్డువచ్చినది ఏమిటి?

అది వర్గ వ్యత్యాసమని తెలుసుకోవటానికి ప్రకాశానికి మరొక అయిదారు సంవత్సరాలు పట్టింది.

భోజనాలు అయిపోవస్తుండగా పెద్దపిల్లవాడు వచ్చి "నాన్నా నీకోసం కిష్టారావుగా రొచ్చారు !" అన్నాడు.

"కూచోమనకపోయినావా? " అన్నాడు లక్ష్మీకాంతం.

"కూచున్నారు"

ఇద్దరూలేచి చేతులుకడుక్కుని వరండాలోకి వచ్చేసరికి ఒక పెద్దమనిషి కనిపించాడు. ఆయన కొంచెం బొద్దుగా ఉన్నాడు. తల ముందునుంచి బట్టతల అవుతున్నది. వయసు నలభైలోపల వుంటుంది. కృష్ణారావు ఆయనే అయివుండాలి.

"ఏం లక్ష్మీకాంతంగారూ, ఇంతపొద్దుపోయి భోంచేస్తున్నారు? వీరెవరు, బంధువులా?" అన్నాడు కృష్ణారావు.

"బంధువులే ఒక విధంగా ! కలంపట్టిన ప్రతివాళ్ళూ మనకు బంధువులే అనుకోండి! .... మీరు బెంగుళూరు, మైసూర్లనుంచి ఎప్పుడొచ్చారేం?" అన్నాడు లక్ష్మీకాంతం ప్రక్కగదిలోనుంచి ఒక స్టూలు తెచ్చి కూచుని, ప్రకాశానికి పడక కుర్చీ చూపిస్తూ.

"ఇవాళ తెల్లవారుజామున చేరుకున్నాం. సత్యనారాయణ మా ప్రాణాలు కొరికే శాడంటే నమ్మండి" అన్నాడు కృష్ణారావు.

"మంచి షాట్లేమైనా తీశారా ?" అన్నాడు లక్ష్మీకాంతం.

"మంచో చెడో నన్నడగకండి. మూడువేల అడుగులు షూట్ చేశాం. మనకు కావలసింది వెయ్యి అడుగులు. ఇదేమిటి సత్యం అంటే స్టాన్‌షాట్స్[1] అమ్మేద్దాం,

---

1. స్టాన్‌షాట్స్ : సినిమా పరిభాష.

అంటాడు!" సత్యంమీద తనకున్న ఆ కాస్త-కోపమూ తీరిపోయినవాడల్లే, కృష్ణా రావు అంతలోనే మెత్తబడి, "కొన్ని బ్రహ్మాండమైన షాట్స్ తీశాంలెండి!" అన్నాడు మందహాసం చేస్తూ.

"ఇక సెట్స్‌మీదికి వెళతారన్నమాట ?" అన్నాడు లక్ష్మీకాంతం.

"ఏదీ? మా కవిగారు మొహం తప్పిస్తున్నాడు. పదిపాటలు రాశాడు-నేకాదన్నా. అయిదు వందలు తెమ్మంటాడు అర్జంటుగా ! ఈ ట్రిప్పు వెళ్ళిరానియ్యవయ్యా మిగి లితే అట్లాగే ఇస్తానూ అని చెప్పా. మిగిలి చావలా ! ఒక వెయ్యిరూపాయలు డ్రాఫ్టు పంపించమని మా అన్నయ్యకు రాశాం. అందులో కొంత స్టూడియోకిచ్చి ఒకనెల రోజుల షూటింగు జరిపితే పిక్చరు పదిరీళ్ళు అయిపోతుందని సత్యం అంటు న్నాడు. మెల్లిగా ఏ డిస్ట్రిబ్యూటర్లనన్నా పట్టుకుని ఆ మిగిలింది పూర్తి చేసుకోవచ్చునని నా యేడుపు !"

"సరే, ఇంకేం ? పని జరగటం ప్రధానం !"

"ఏంపనీ ? నా శ్రార్ధం పని ! డయిలాగులేవీ ? గురుడు భీష్మించెనుగా !"

"ఇంకెవరినన్నా పెట్టుకుందామనా?"

"పెట్టుకోక ఏం చేస్తాం ! ఇప్పుడాయనగారింటినించే వస్తున్నా. ఎన్ని మాట లన్నా చెబుతాడుగాని, నేవస్తానూ, రాస్తానూ అనడే ! అసలు కడుపునిండిన బేరం లెస్తురూ!"

లక్ష్మీకాంతం కొంచెం ఆలోచించి, "అయిదువందలు కాకపోతే రెండువంద లైనా ఇచ్చెయ్యగూడదూ ? బండినడవాలిగా ?" అన్నాడు.

"ఇదుగో, లక్ష్మీకాంతంగారూ, బుద్ధి గడ్డితిని ఇందులోకి దిగాననుకో. ఇప్పటికి అయిదువేలు క్షవరమయింది. నాతో మొదట సత్యం చెప్పింది అయిదు వేలతో పిక్చరంతా అయేపోతుందనిగా ? ఏదీ పిక్చరూ ? అయిందా? సౌండు ఫిలుము దొరికిచావటంలా ! పాజిటివ్ మీద రికార్డుచేసి చూస్తున్నారు. నేనెక్కడ తేలు తానో, ఎప్పుడు బయటపడతానో ఆ పరమాత్ముడికి తెలియాలిసిందే!" అన్నాడు కృష్ణారావు.

"ఇదేదో శకునంలాగుంది. వీరెవరో తెలుసా ? ఈయన ఎదురుగా లేకపోతే కాస్త హెచ్చుగా చెబుతాను. ఈయన కథలు అద్భుతంగా రాస్తారు. ముఖ్యంగా పాత్రల మనస్తత్వం కాచి వడబోసే శక్తి ఉన్నది. కుర్రవాడు. ఉత్సాహి. కావలిస్తే మాట్లాడుకుని ఆయనచేత డయిలాగ్స్ రాయించుకోవచ్చు ననుకుంటాను. నాకు నెల రోజులు టైమిచ్చినా ఇంతకంటె మంచి మనిషిని సూచించలేను !" అన్నాడు లక్ష్మీ కాంతం.

కృష్ణారావు ప్రకాశంకేసి ఎడారి ప్రయాణీకుడు నీటి మడుగును చూసినట్టు చూశాడు.

కృష్ణారావు వెళ్ళేటప్పటికి పదకొండు దాటింది.

"ఈ రాత్రికి మీకు బీచిగాలి ప్రాప్తం ఉంది. హాయిగా ఈ వరండాలో పడుకోండి." అన్నాడు లక్ష్మీకాంతం. ఆయన తమ ఇద్దరికీ మంచాలు వేయించాడు. వరండా దీపం ఆర్పేసినాక; బహుళ దశమి వెన్నెల బయటపడింది.

లక్ష్మీకాంతం కృష్ణారావును గురించీ, సత్యనారాయణ గురించీ, వాళ్ళు తీస్తున్న ఫిలిమును గురించీ చెప్పవలసిన వివరాలన్నీ చెప్పాడు.

సత్యనారాయణ సినిమాలకు ఎడిటరుగా పనిచేసి సొంతాన సినిమా తీయాలని నిశ్చయించి ఈ కృష్ణారావును పట్టుకున్నాడు. కృష్ణారావు ఒక విచిత్రమైన మనిషి. పట్నంలో ఉండి నోటు పుస్తకాల దగ్గిర్నుంచి అప్పడాలదాకా అనేకరకాల సరుకులు అమ్మాడు. కొన్నాళ్ళు ఆయుర్వేద ఔషధాలు అమ్మాడు. ఉప్పాడ చీరెలూ, గుంటూరు వెన్నా అమ్మాడు. ఏదో ఒకటి అమ్మటమో కొనటమో చెయ్యకపోతే ఆ మనిషికి నిద్దర పట్టదు.

సత్యనారాయణ కృష్ణారావుతో మర్మం లేకుండా తాను తీయదలచుకున్న పిక్చరును గురించి నిజం చెప్పేశాడు. అది డొక్కు పిక్చరు. కొత్త ఆర్టిస్టులను అతి చౌకగా పట్టుకొచ్చి, అతి శీఘ్రంగా పిక్చరు తీసేసి, ఎవరైనా డిస్ట్రిబ్యూటరు పదివేలో, పదిహేనువేలో ఇస్తే అందులో ఒక అయిదువేలన్నా లాభం మిగిల్చి దానితో ఇంకొక డొక్కు పిక్చరు తీయటం. పిక్చరు పౌరాణికం.

వీళ్ళ దగ్గిర్నుంచి మీకు డబ్బుగా ఏమంతరాదు. వాళ్ళతోబాటు ఉండి మీ ఖర్చులు గడుపుకొండి. రెండు మూడునెలల్లో వీళ్ళు పిక్చరు బయటపడేస్తారు. అంతకాలమూ మీరు చేతిచమురు ఖర్చుకాకుండా పట్నంలో ఉండవచ్చు. ఈలోపుగా మంచి ఉద్యోగంకోసం ప్రయత్నం కూడా చేయవచ్చు. అందుచేత వీళ్ళకు డయిలాగ్స్ రాయటానికి ఒప్పుకోమనే నా సలహా !" అన్నాడు లక్ష్మీకాంతం.

"వాళ్ళకు నేనుకావలిస్తే మాటగదా !" అన్నాడు ప్రకాశం.

"కళ్ళకద్దుకు తీసుకుంటారు ! నేను మిమ్మల్ని గురించి చెప్పానేగాని వాళ్ళకు మీరురాసే డయిలాగ్స్ బాగున్నదీ లేనిదీ పట్టుతుంచనుతున్నారేమిటి ? ఏవో డయిలాగ్స్ ఉండటమే వాళ్ళకు కావలిసింది. కాని మీరు బాగా రాశారంటే ఇంకో సినిమావాళ్ళు మీకు ఛాన్సివ్వవచ్చు. అందుచేత మీపని మీరు బాగానే చెయ్యండి. మీకు వాళ్ళు అభ్యంతరం చెప్పబోరు. వాళ్ళసంగతి నేనెరగనా ! వాళ్ళకు హీరోయిన్ వేస్తున్న మనిషి ఎక్స్ట్రాకన్న కనాకష్టం. హీరో ఫరవాలేదు- ఇంత ఒడ్డూ పొడుగూ అయినా వున్నాడు !"

ప్రకాశం అర్ధరాత్రి దాటి చాలాసేపు మేలుకున్నాడు. లక్ష్మీకాంతం ఉన్న విషయం స్పష్టంగానే చెప్పినప్పటికీ తనకు ఇంత సులువుగా, ఎవరో అమర్చినట్టుగా ఈ సినిమా ఛాన్సు దొరకటం తలచుకున్నకొద్దీ ఆశ్చర్యకరంగా కనబడింది. బుర్రలో రకరకాల ఆలోచనలు ఒకదాన్ని ఒకటి తరుముతూ కాట్ ఆడుతుండడం వల్ల నిద్రపట్టలేదు.

నిద్రా మెళకువా కాని స్థితిలో రాత్రి వెళ్ళబుచ్చి తూర్పు తెల్లవారే వేళకు ప్రకాశం మంచంమీదలేచి కూచున్నాడు. అతనికి నిద్రమత్తుగాని, నీరసంగాని అనిపించలేదు. తన ఇంటిని వదిలిపెట్టి చాలా ఏళ్ళయినట్టుగా అతనికి తోచింది. నిన్న కొన్ని గంటలు గడిపిన సినిమాకంపెనీవాళ్ళ లాడ్జికూడా కాలగర్భంలో ఎక్కడో దిగబడిపోయినట్టుగా ఉన్నది.... తాను ఏమైపోయినదీ తెలియక సోమయాజులు కంగారుపడి ఉంటాడేమో!.... పన్నెండు గంటల వ్యవధానంలో ఒక సినిమా లాడ్జిలో అడుగుపెట్టి ఇంకొక సినిమా కంపెనీలో ఉద్యోగం సంపాదించినంతపని చేశాడు తాను. ఇదే కథలో పెడితే ఎవరూ నమ్మరు. వాస్తవ జీవితం బుద్ధిమంతుడైన పెద్దమనిషిలాగుండదు; జూదగాళ్ళనూ, తాగుబోతులనూ, వెర్రి ముండా కొడుకులను జ్ఞాపకం చేస్తుంది.... ఇది తనకు ఇప్పుడు కొత్తగా తట్టిన ఆలోచనకాదు – చూడామణి అనంతరం రాసిన కథలో ఈ ముక్క రాసేశాడు ... చిత్రం చూడామణికన్న రజని తనకిప్పుడు ఎక్కువగా తోస్తుంది. చూడామణి డొక్కుముండ.... డొక్కు పిక్చరుకు డయిలాగ్స్ రాయాలి.... జీతం ఇవ్వరు.... తిండి పెడతారు.... సిగిరెట్టు ఖర్చయినా ఇస్తారా?... ఏమయినా ఈ సినిమా ఛాన్సుగురించి ఆలోచించటం అనవసరం... డొక్కుఛాన్సు!....

మొహాలు కడుక్కోగానే ప్రకాశానికి కాఫీ ఇచ్చారు. అతను ఎలెక్ట్రిక్ రైలుమీద త్యాగరాయనగరు వెళతానన్నాడు. లక్ష్మీకాంతం స్టేషనుదగ్గిర దిగబెడతానని బయలుదేరాడు. ప్రకాశం ఆయన భార్యవద్ద సెలవు పుచ్చుకున్నాడు.

ఇద్దరూ అయిదు నిమిషాలలో చీచి స్టేషనుకు వచ్చారు. లక్ష్మీకాంతం స్వయంగా మాంబళం టిక్కెట్టుకొని ప్రకాశానికి ఇస్తూ, "మీకు దారిలో ఎగ్మూరు స్టేషను తగులుతుంది. అది సౌతిండియన్ రైల్వే టెర్మినస్. దాని తరవాత చట్పట్, కోడంబాకం, ఆ తరవాత మాంబళం. అక్కడ దిగిపోయి, ఎడంచేతివైపు స్టేషను బయటికి వచ్చారంటే ఒక రోడ్డు కనిపిస్తుంది. అది నేరుగా ఉస్మాన్‌రోడ్డుకు చేర్చుతుంది," అని చెప్పాడు. ఏరోజు తోచకపోయినా వాళ్ళ ఆఫీసుకు రమ్మన్నాడు. సినిమా కంపెనీ సంగతి బహుశా ఒకవారంలో తేలవచ్చునన్నాడు.

## 8

రోజులు గడిచిపోతున్నై. ప్రకాశం సినిమా కంపెనీవాళ్ళ లాడ్జిలోవుండి ప్రతిపూటా ఒకటిన్నర మనుషుల ఫలహారమూ, భోజనమూ చేస్తున్నాడు. షూటింగు చూస్తున్నాడు. లాడ్జిలో అందరూ అతన్ని ఆప్తుడల్లేనే చూస్తున్నారు. లాడ్జి దివాణపు సత్రమే.

వీళ్ళు తీస్తున్న సినిమా ఏమంత బాగుంటుందని అతనికి తోచలేదు. షూటింగు చూస్తుంటే అట్లాగే ఉంటుందని సోమయాజు లన్నాడు. ఎడిటింగులోగాని జీవం

రాదట. కృత్రిమమైన సంభాషణలూ, వికారమైన నటనా ఎడిటింగుద్వారా ఎట్లా సహజంగా మారిపోయేదీ ప్రకాశానికి అర్థంకాలేదు.

కాని అతనికి షూటింగు జరిగే పద్ధతులు అవగాహన అవుతున్నై. కాని ఎవరి పనితనంలో వారు ఎంత నిపుణులో తెలుసుకునేటందుకు చాలిన అనుభవం మటుకు కలగలేదు. ఒక్కొక్కసారి ఏమీ తెలియని పిల్లలు పెద్దవాళ్ళను "పేరడీ" చేస్తున్నట్టుగా కనిపించేది. ఒక్కొక్కసారి "ఇటువంటి సినిమా తియ్యటానికికూడా ఎంత ప్రావీణ్యంగలవాళ్ళు కావాలో!" అనిపించేది.

నిజానికి ఈ సినిమా తీస్తున్నవాళ్ళలో బొత్తిగా ఏమీ తెలియనివాళ్ళూ వున్నారు. తమ పనిలో మంచి సమర్థులైనవాళ్లూ వున్నారు. రికార్డిస్టు చాలా సమర్థుదని అనేకమంది అనగా ప్రకాశం విన్నాడు. ప్రకాశం అతనితో స్నేహంచేశాడు కూడా. అతను ప్రకాశాన్ని సౌండ్‌ట్రక్కులోనికి పిలిచి కూచోబెట్టి కబుర్లు చెప్పేవాడు. సెట్‌మీద రిహార్సల్ జరిగేటప్పుడు ఇద్దరూ జాతాకానీ కొట్టేవాళ్ళు కూడా.

"ఈ పిక్చర్ గురించి మీరెమనుకుంటున్నారు?" అని ప్రకాశం ఒకసారి అడిగాడు.

"చాలా ఏవరేజ్ పిక్చర్, డైరెక్టరు కొత్తవాడు. అతనికి ఏమీ తెలీదు. తెలీకపోతే ఇటువంటి ఛాన్సు దొరికినప్పుడు నేర్చుకోవచ్చు, కాని అతనికి నేర్చుకునే శక్తికూడా లేదు."

"సంభాషణలు అంత చెత్తగా ఉన్నయ్యేమిటి?" అన్నాడు ప్రకాశం. తనకు అంతకన్నబాగా సంభాషణలు రాసేశక్తి ఉన్నదని రుజువుకావాలి అతనికి. బహుశా ఇది తనకు రాబోతున్న సినిమాఛాన్సు మూలంగా అయి ఉంటుంది.

"సినిమాల్లో సంభాషణలు ఇట్లాగే అఘోరిస్తయి!" అన్నాడు రికార్డిస్టు.

ప్రకాశం అప్పుడప్పుడూ జార్జిటవునుకు వెళ్ళి, వెళ్లినప్పుడల్లా లక్ష్మీకాంతాన్ని చూసి వస్తున్నాడు. వారపత్రికలో కథ అచ్చైనది. దాన్ని లక్ష్మీకాంతం చదివి, "మీరు వ్యంగ్యహాస్యం రాస్తారని నాకు తెలీదే?" అన్నాడు.

ప్రకాశం అర్థంకాని మొహంపెట్టాడు. తాను చూడామణిమీద రాసిన కథలో వ్యంగ్యమూ, హాస్యమూ ఉన్నట్టు ఈ క్షణందాకా అతనికి తెలీదు. బస్సులో లాడ్జికి తిరిగివస్తూ చేతిలో ఉన్న పత్రికవిప్పి తన కథ చదువుకున్నాడు. చూడామణిమీద తనకు ఆనాడు "రాడీ"ని చూసినప్పుడు కలిగిన కోపావేశమూ, సాంబయ్యమీద కలిగిన అసహ్యమూ, మళ్ళీ కలిగినై, అంతేకాని ఎక్కడా నవ్వు రాలేదు.

లాడ్జిలో సోమయాజులు పత్రిక తీసుకుని పేజీలు తిప్పుతూ, "అరె, ఇందులో నీ కథ ఉన్నట్టుందే, చెప్పవేమోయ్?" అంటూ కథచదివి గట్టిగా నవ్వాడు. అంతటితో వదలక సోమయాజులు ఒకచిన్న ముఠాను పోగుచేసి వాళ్ళకు ఆ కథ అంతా చదివి వినిపించాడు. అందరూ నవ్వారు. అందులో చదివే వాళ్ళకు హాస్యం కనిపించిందని ప్రకాశానికి నమ్మకం కలిగింది.

"నాలో ఏదో లోపం వున్నది. కథకుడు ఉద్దేశించని భావాలు కథచదివిన వాళ్ళకు కలగరాదు. ఇదే నటుడైతే ఏమయేది? నేను ఆగ్రహం అభినయిస్తుంటే ప్రేక్షకులంతా నవ్వటం....! ఘోరం!" అనుకున్నాడు ప్రకాశం.

మొత్తంమీద ఈ కథమూలంగా లాడ్జిలో ప్రకాశం మీద నలుగురికి గౌరవం పెరిగింది. మరొక వారానికి మాస పత్రికలో మరొక కథకూడా రావటంతో ప్రకాశం ఘరానా మనిషి అయినాడు. దీనికితోడు ప్రకాశాన్ని ఎవరో కంపెనీ వాళ్ళు కవిగా పెట్టుకో బోతున్నారని కూడా సోమయాజులు టాంటాం వేశాడు.

ఒక ఆదివారం ఉదయం లక్ష్మీకాంతం లాడ్జికి వచ్చాడు. "ఊరికేనే చూద్దామని వచ్చాను!" అన్నాడాయన ప్రకాశంతో, అయితే ఆయనకు ఈ లాడ్జిలో ఒకరిద్దరు స్నేహితులున్నట్టు ప్రకాశానికి ఇప్పుడే తెలిసింది. ఆయన ఒక పెద్దమనిషిని, "ఏంరా, రాఘవయ్యా" అని పలకరించాడు.

కామయ్య ఆయనను ఇడ్డెన్లలోముంచి లేవనెత్తటానికి ప్రయత్నించాడు.

లక్ష్మీకాంతం ప్రకాశాన్ని ఒక ప్రక్కకు తీసుకుపోయి, "కృష్ణారావు నిన్ననే డబ్బుతీసుకువచ్చాడు. మీరు పని ప్రారంభించవచ్చు. వాళ్ళు అద్దెకుతీసుకున్న గది ఇక్కడే హిందీ ప్రచారసభకు దగ్గరలోనే ఉంది. ఒకసారి షికారుగా నడిచివద్దాం!" అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు.

"మీకు ప్రస్తుతం ఇక్కడే సౌకర్యంగా ఉన్నదనుకుంటా. సత్యంవాళ్ళు కారియరులో భోజనం తెప్పించి, నలుగురు తింటున్నారు. అందుచేత మీరు ఈ బ్రాహ్మణ కంపెనీ లాడ్జిలోనే వీలయినంత కాలం ఉండండి. వాళ్ళు పిక్చరు అయిపోయేలోగా మీరు డయిలాగ్స్ రాసి వాళ్ళ మొహాన పారేస్తే తరువాత సంగతి చూసుకుందాం. మీకు నెలజీతం కాకుండా మొత్తం ముట్టచెబితే బాగుంటుందని నేను కృష్ణారావుతో చెప్పాను. చూద్దామన్నాడు" అన్నాడు లక్ష్మీకాంతం దారిలో.

ప్రకాశం తన విషయం వదిలేసి, "ఇప్పుడు నేనున్నది బ్రాహ్మణ కంపెనీయా ఏమిటి?" అని అడిగాడు.

"కాదా మరి? అందులో బ్రాహ్మణేతరుడున్నాడేమో చూడండి!" అన్నాడు లక్ష్మీకాంతం.

ప్రకాశానికి ఆశ్చర్యం వేసింది. అట్లా ఒక కులంమీద ఆధారపడి కళలు సృష్టించటం సాధ్యమా? సాధ్యం కాకనే గదా కూచిపూడి బాగోతాలూ,[1] యీనాటి

---

1. కూచిపూడి భాగవతులు, సురభివాళ్ళ నాటకాలు: తెలుగు బ్రాహ్మణులు కూచిపూడి భాగవతులు. మరాఠీవారు సురభివాళ్లు. కులం, కుటుంబం తొలి రోజుల్లో కళలను శాసించాయి – వృత్తి కళాకారులకూ, కుల కళాకారులకు తేడాలేని రోజుల్లో.

భాగోతాలూ, సురభివాళ్ల నాటకాలూ ఎక్కిరాక పోయింది? ఈ పిక్చరును అచ్చగా బ్రాహ్మలే చూస్తే వాళ్ల గతి ఏమవుతుంది?

సత్యం వాళ్ల కంపెనీ ఉండే ఇల్లు అరమైలు దూరంలో ఉన్నది. ఇంటి ముందు భాగంలో ముళ్ళతీగ కంచె ఉన్నది. దానిమీద రోజా రంగుగుత్తుల పూల తీగె పాకుతున్నది. ప్రస్తుతం పూలు లేవు. "ఆదర్శకళా పిలిమ్స్" అని బోర్డొకటి ఇంటిగోడకు పెట్టి ఉన్నది.

ఆదర్శకళా యజమానులు లోపల ఉన్నారు.

లక్ష్మీకాంతం ప్రకాశాన్ని సత్యానికి పరిచయం చేశాడు. సత్యం ప్రకాశాన్ని చూస్తూనే, "వీడికి బిస్కట్లు పెట్టి పని చేయించుకోవచ్చు! చౌకబేరం!" అనుకున్న సంగతి ప్రకాశానికి తెలిస్తే ఏంచేసి ఉండేవాడు?

ప్రకాశానికి తోచినదల్లా సత్యం మొహం తెలివైనదని, దొంగమొహమనీనూ.

లక్ష్మీకాంతం లౌక్యంగా ప్రకాశానికి డయిలాగ్స్ రాయటానికి ఏమిచ్చేదీ ముందుగా అనుకుంటే బాగుంటుందన్నాడు.

"మేం పొట్టతిప్పలుకోసం పిక్చరు తీస్తున్నాం. ఇందులో మేము ఏమీ లాభం ఆశించటం లేదు కనక ఏమిస్తామని చెప్పగలం? కావలిస్తే నావంతు వచ్చే లాభంలో సగం ఇస్తా!" అన్నాడు సత్యం పెద్దపోజు పెట్టి.

"అటువంటప్పుడు పొట్టగడవని వాళ్లచేతనే రాయించుకుంటే బాగుంటుందేమో!" అన్నాడు లక్ష్మీకాంతం చాలా ఘాటుగా.

కృష్ణారావు కమ్ముకుని, "అదేంమాట లేవయ్యా? అందరూ ఇచ్చినట్టు మనం ఇవ్వలేమని లక్ష్మీకాంతం గారికి మాత్రం తెలియదూ?.... ఆ మాట కూడా మీరే అనెయ్యండి కాంతంగారూ! మీకన్న మాకు కావలసిన వాళ్ళెవరున్నారు?"అన్నాడు.

"డయిలాగ్సు రాసినందుకు మూడు వందలివ్వటం ఉచితంగా ఉంటుందని నాకు తోస్తున్నది. ఇతరులు వెయ్యీ రెండువేలూ పుచ్చుకుంటున్నారు. వాళ్ళతో మనకు సాపత్యం వద్దు. మూడు వందలకంటె మీరు ఎక్కువ ఇవ్వలేరు, నాకు తెలుసు. అంతకంటే తక్కువ తీసుకోమని నేను ప్రకాశంగారికి చెప్పలేను, అది మీకు తెలుసు!" అన్నాడు లక్ష్మీకాంతం.

సత్యం బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లాడలేదు.

కృష్ణారావు బుర్ర గోక్కుంటూ, "ఉంటే ఇవ్వటానికేం? మహారాజుగా ఇవ్వవచ్చు!" అన్నాడు.

"అంతా ఇప్పుడివ్వమనటంలేదే, ఇప్పుడు ఎడ్వాన్సుగా ఒక వంద ఇవ్వండి మీ పని అయినాక మిగతాది ఇవ్వండి. ప్రస్తుతం ఆయనకు సినిమా లాడ్జిలో సదుపాయంగానే ఉన్నది. అది ఎప్పుడు మూసేస్తే అప్పుడు పెట్టే బేడా తీసుకుని ఇక్కడికి వచ్చేస్తారు. ఆ తరువాత మీతోపాటు భోజనంపెట్టి, ఆయన ఖర్చులు

చూడండి. మీపని అయినాక డబ్బిచ్చి పంపెయ్యండి. ప్రస్తుతానికి ఆయన తిండి ఖర్చు కూడా మీకు లేదు." అన్నాడు కాంతం.

సత్యమూ, కృష్ణారావు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని అవతలి గదిలోకి వెళ్ళారు.

'ఇది కుదిరే బేరంకాదు. తుమ్మితే ఊడేముక్కులాగుంది. ఇక్కడి పరిస్థితి చూస్తే చచ్చుల్లిపాయలబేరం. అక్కడ ఆ లాడ్జిలో ప్రతి మూడు నాలుగు రోజులకూ మూడేసివందలు ఖర్చయిపోతున్నది- అచ్చగా లాడ్జి ఖర్చులు. వీళ్ళు వందలపేరు చెబితేనే మూర్ఛపడే లాగున్నారు' అనుకున్నాడు. అతను డబ్బుకు ఎన్నడూ ప్రాముఖ్యం ఇచ్చి ఎరగడు. అందుచేత అతనికి చిన్నచిన్న డబ్బు మొత్తాలలో మెదడును ఇరకబెట్టుకునే వాళ్లనుచూస్తే ఆపే సానుభూతి ఉండేదికాదు.

అవతలికి వెళ్ళిన ఇద్దరూ తిరిగివచ్చారు. కృష్ణారావు లక్ష్మీకాంతంకు మూడు నోట్లు ఇస్తూ, "పాతిక రూపాయలు!" అన్నాడు.

అకస్మాత్తుగా ప్రకాశం మాట్లాడాడు. "నాకు మీ డబ్బు అవసరంలేదు. సరదాకు రాస్తాను, రాయించుకోండి!" అన్నాడు.

కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు.

"నేనైనా ఆ మాటే అనేవాణ్ని!" అన్నాడు లక్ష్మీకాంతం.

మేస్టరుచేత చెంపదెబ్బ తిన్న మొహం పెట్టాడు కృష్ణారావు.

"కాకపోయినా, సినిమాలో డయలాగ్సు ముఖ్యం కావనుకున్నాక వాటిని ఎవడు రాసినా రాయవచ్చు. వాటికోసం డబ్బిచ్చుకోవటం దండుగ! అన్నాడు ప్రకాశం. ఒక్క క్షణం పాటు తను జానపద జీవితంలో ఉన్నట్టనిపించింది.

మళ్ళీ ఎవరూ మాట్లాడలేదు.

"అయితే మాకు సెలవిప్పిస్తారా?" అన్నాడు లక్ష్మీకాంతం.

"వారెప్పుడు వచ్చి పని ప్రారంభిస్తారూ?" అన్నాడు కృష్ణారావు.

లక్ష్మీకాంతం నవ్వాడు. "మిమ్మల్నే రాసుకోమంటున్నారుగా!"అన్నాడాయన.

"రండి చెబుతా!" అంటూ కృష్ణారావు బయటికి దారితీశాడు.

వాకిలిదాకా వెళ్ళినాక లక్ష్మీకాంతం వెనక్కి తిరిగి కొంచెం వెటకారంగానే, "సెలవండీ, సత్యంగారూ!" అన్నాడు. ప్రకాశం వెనక్కు తిరిగికూడా చూడలేదు. ఎప్పుడు బయట పడదామా అన్నవాడల్లే గబగబా గేటుదాకా వెళ్ళి, మిగిలినవాళ్ళ కోసం ఆగాడు. కాని కృష్ణారావు లక్ష్మీకాంతమూ ఏదోరహస్యంగా మాట్లాడుకుంటూ వస్తుండటం గమనించి అతను వాళ్ళకు నాలుగైదు అంగలు ముందు నడిచాడు.

సినిమాలో మాదిరిగా వాళ్లు, ముందు ప్రకాశమూ వెనకగా మిగిలిన ఇద్దరూ, పేవ్‌మెంటుమీద ఒక ఫర్లాంగు నడిచాక, "ప్రకాశంగారూ కొంచం ఆగండి"అన్నాడు లక్ష్మీకాంతం. ప్రకాశం ఆగాడు.

"కృష్ణారావుగారేమంటారంటే, ముందుగా యాభై ఇస్తాను. మిగిలినది డిస్ట్రిబ్యూటరు కుదరగానే ఇస్తానంటారు." అన్నాడు లక్ష్మీకాంతం. కృష్ణారావు మూకాభినయం చేశాడు.

లక్ష్మీకాంతం మాటల్లో ఒప్పుకోమనే ధ్వని వినిపించింది.

"సరే కానివ్వండి." అన్నాడు ప్రకాశం.

కృష్ణారావు అయిదు పదిరూపాయి నోట్లు తీసి ఒక చిన్న నిట్టూర్పుతోసహా ప్రకాశానికి సమర్పించాడు.

"ఎల్లుండి దశమి. పొద్దున వర్జంగాని, రాహుకాలంగాని లేదు. ఎల్లుండి మొదలుపెట్టి సత్యమూ మీరూ కూచుని రాయండి. జులై ఒకటిన షూటింగు ప్రారంభించుతాం." అన్నాడు కృష్ణారావు. ప్రకాశం తల ఊపి, "దీనికి రసీదో ?" అన్నాడు. జేబు తట్టుకుంటూ "దాందేం ఇబ్బంది లేదులే !" అన్నాడు కృష్ణారావు.

# 9

ఆ రోజు స్టూడియోకు వెళ్ళినప్పుడు ప్రకాశం రికార్డిస్టుతో తనకు దొరికిన "డొక్కు" ఉద్యోగం గురించి, "సినిమాలకు ఎట్లా రాయాలో తెలుసుకోవాలంటే పుస్తకాలున్నాయా ?" అని అడిగాడు.

"ఫిల్మ్ రైటింగ్ అని కొత్తగా ఒక పుస్తకం వచ్చింది. కాని దానివల్ల మన కేమి ఉపయోగంలేదు. అంత శాస్త్రోక్తంగా స్క్రిప్టు రాస్తే షూట్ చెయ్యగల డైరెక్టరు ఒక్కడూ లేడు మనకు," అన్నాడు రికార్డిస్టు.

"మరి మనవాళ్ళు ఏం చేస్తున్నారు?"

"వీళ్ళేం చేస్తున్నారో అందరూ అదే చేస్తున్నారు. నాటకంలోలాగా సంభాషణలు రాయటమూ దాన్ని తెచ్చి కామెరామన్ మొహాన పెట్టటమూనూ! షాట్ డివిజన్ చేస్తారు! షాట్ ఎందుకు మార్చాలో వాళ్ళకు తెలీదు. మన డైరెక్టరు మిడ్ క్లోజ్ నుంచి మళ్ళీ మిడ్ క్లోజ్‌కే కట్ చేస్తాడు- ఒకే ఆర్టిస్టును ఫ్రేమ్‌లో ఉంచి ! ఒకళ్ళను అనక్కరలేదు. అంతా అట్లాగే ఉంది. పైనుంచి కిందికి. ఎడిటరు సౌండ్ ట్రాక్ ఎక్కడ అయిపోతే అక్కడ కట్‌చేస్తాడు. టాకీ గనక మొదలయినది లగాయితు పిక్చరు అయిపోయినదాకా గంటమోగినట్టు మోగాలని. పాత్రలు ఒకరి మాటలు ఒకరు ఆలకించి అర్థం చేసుకోవటమంటూ ఉండదు. ఒకళ్ళ తరవాత ఒకరు పోర్షను వప్పగించటమే! మొదటిపాట రికార్డు చేసిన రోజున రషెస్ విని మన ప్రొడ్యూసరు, 'పన్నెండు వాద్యాలు పెట్టాంగదా! మోతేలేదేం?' అని అడిగాడు! ఏముంది? మనం ఈ వృత్తిలో ఉండి దీన్ని విమర్శించరాదు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందంటారే—"

రికార్డిస్టు చెప్పే విషయాలు ప్రకాశానికి ముక్కూ మొహమూ తెలియలేదు. అయినా అతని ధోరణి అర్థమయింది. తెలుగు చిత్రాల నిర్మాణం తోలుబొమ్మలాటల ధోరణిలో ఉన్నది. కనీసం సమర్థులైన టెక్నీషియనులు తమ నేర్పరితనాన్ని వినియోగిస్తున్నామని గర్వించే స్థితిలోలేరు.

ఇంకొకసారి రికార్డిస్టు స్టూడియో కామెరామాన్ గురించి చెప్పాడు.

"పాపం, అతనికి లైటింగు తెలీదు. అతని అసిస్టెంటు చాలా రెట్లు మెరుగు అసిస్టెంటే సెట్ లైటింగంతా చేస్తాడు. మొదట్లో తన అధికారం చూపించటానికి అని ఒక లైటును ఫ్లడ్ చెయ్యాలన్నాడు. తరవాత ఎడమ ప్రక్కకు 'పాన్' చెయ్య మన్నాడు, తరవాత కిందికి 'టిల్ట్'[1] చెయ్యమన్నాడు. తరవాత కుడిపక్కకు 'పాన్'[2] చెయ్యమన్నాడు. తరవాత పైకి 'టిల్ట్' చెయ్యమన్నాడు. చిట్టచివరకు లైట్‌ను ఫోకస్ చేసి 'ఫిక్స్'[3] చేయమన్నాడు.!"

"అంటే? " అన్నాడు ప్రకాశం అమాయకంగా.

"అర్థంకాలా ? లైటును ఇన్ని మార్పులూచేసి యథాస్థితికే తెచ్చాడు. అసి స్టెంటు ఈ ఆగడమంతా చూసి ఒకరోజున సత్యాగ్రహం చేశాడు. సెట్‌ను అడ్డ దిడ్డంగా లైట్ చేసి పెట్టి మాస్తూ కూచున్నాడు. కామెరామాన్ వచ్చి సెట్టుకేసి చూసి, 'ఆల్ లైట్స్ ఆన్', అన్నాడు. లైట్లు వెలగగానే కామెరామాన్ మొహం ఆరిపోయిందన్నమాట. 'కీలైట్స్ మీకే వదిలేశాను', అన్నాడు అసిస్టెంటు. అది మొదలు కామెరామాన్ తోక ఝాడించాడు. ఈ సినిమా పరిశ్రమ ఒక పెద్ద ఫార్సు లెండి—ఇంకో ఫార్స్ చెప్పనా ? ఒక డైరెక్టరుగారు అంతా తెలిసినట్టు కామెరా అమర్చినాక వచ్చి వ్యూ ఫైండర్‌లోనుంచి చూసి 'బలే' అంటూ ఉండేవాడు. ఒక రోజు కామెరామాన్ బ్లాక్ సరిగా అమర్చకుండానే, 'డైరెక్టర్‌జీ, బ్లాక్ ఓకే చేస్తారా? అని అడిగాడు. డైరెక్టరు వ్యూ ఫైండర్‌లో ఆర్టిస్టులను చూసి 'ఓకే' అన్నాడు. కాని దొంగముండాకొడుకు లాంగ్ ఫోకస్ లెన్స్ వేసి ఆర్టిస్టుల తల కాయలు రాకుండా ఆ షాట్ తీశాడు. వాడు బెంగాలీవాడు. భలే గడుసు మనిషి. ఒక డైరెక్టరును మాటిమాటికీ 'కామెరా ఎక్కడ పెట్టను ?' అని అడిగేవాడు. పాపం డైరెక్టరుకు మాత్రం ఏం తెలుసూ? .... ఈ బిజినెస్‌కు ప్రస్తుతం కావలసింది, మంచి టెక్నీషియనులు కూడా కాదు—గట్టి ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూనూ!" అన్నాడు రికార్డిస్టు.

ఈ విషయాలు తెలుసుకోవటంచేత తనకు ఏం లభిస్తుందో ప్రకాశం ఎరగడు గాని వీటిని తన బుర్రలో ఒక మూలపెట్టి ఉంచాడు.

---

1. టిల్ట్ సినిమా పరిభాష : Vertical గా కెమరాను తిప్పడం.
2. పాన్ – సినిమా పరిభాష : Horizontal గా కెమరాను తిప్పుతూ పోవడం.
3. ఫిక్స్ - సినిమా పరిభాష : Fixed Focus.

"పనికి రానివ్వండి, పనికిరాక పోనివ్వండి, నేను ఫిలిం రైటింగ్ పుస్తకం చదువుతాను. అదెక్కడ దొరుకుతుంది?" అని ప్రకాశం అడిగాడు.

"డబ్బు ఖర్చుచేసి కొనవద్దు. నేను ఒక ఫ్రెండ్‌దగ్గిర తెచ్చి ఇస్తాను," అన్నాడు రికార్డిస్టు.

"ఎప్పుడివ్వగలరు?" అన్నాడు ప్రకాశం ఆదుర్దాగా.

"ఇవాళ రాత్రి మనవాళ్ళు ప్రొజెక్షన్ ఏర్పాటు చేస్తున్నట్లున్నారు. ఏడు రీల్సు రెడీగా ఉన్నట్టుంది. వీలయితే రాత్రికి తీసుకొస్తా. చెప్పానుగా? తొందరేమీ లేదు. అది చదివి ఏమన్నా నేర్చుకున్నా దాన్ని మన ప్రొడ్యూసర్ల ముందు పెట్ట వద్దు."

రాత్రి పదింటికి ప్రొజెక్షను ప్రారంభమయింది. రికార్డిస్టు అతని ధర్మమా అంటూ పుస్తకం తెచ్చాడు. చాలా లావుపాటి పుస్తకం.

పిక్చరు చూస్తుంటే ప్రకాశానికి వాంతి అవుతుందనిపించింది. ఇది డబ్బు కుమ్మరించి తీస్తున్న పిక్చరు. ఇదే ఇంత భయంకరంగా ఉంటే, సత్యం డొక్కు పిక్చరు తీస్తానని చెప్పి తీసేది ఇంకెట్లా ఉంటుందో అని ప్రకాశం ఆరాటపడ్డాడు. అనేకచోట్ల అతనికి నవ్వు ఆగలేదు. పైగా సోమయాజులు పక్కనే కూచుని మధ్య మధ్య చెవిలో రహస్యంగా వెధవ మాటలు— 'అదేమిటోయ్ వాడు బుడబుక్కల వాడల్లే ఉన్నాడూ?' 'ఈ అబ్బికి పోర్షను సరిగారాదా ?' ఈ ధోరణిలో—మాట్లాడి ప్రకాశాన్ని చాలా బాధపెట్టాడు.

కాని అసలు ఆశ్చర్యకరమైన సంగతి ప్రొజెక్షను పూర్తి అయినాక గమ నించాడు ప్రకాశం.

లైట్లు వెలగగానే సూదంటురాయిని సూదులు చేరుకున్నట్టుగా అందరూ ప్రొడ్యూసరు చుట్టూ మూగారు.

"ఈపాటి క్వాలిటీ వచ్చిందని నేననుకోలేదు." అన్నాడు డైరెక్టరు.

ప్రొడ్యూసరు గర్వంగా చిరునవ్వునవ్వి, "మిగిలిన పిక్చరు కూడా ఇంతకంటె తగ్గకుండా చూడాలి మరి!" అన్నాడు.

"వెనకటికన్న మన ఆర్టిస్టులు ఇంకామంచి పారంలోకి వచ్చారు. నా టేకింగు పద్ధతులు టెక్నీషియనులకూ, ఆర్టిస్టులకూ కూడా ఇప్పుడు బాగా అలవాటు కాలా?" అన్నాడు డైరెక్టరు.

ఎవరో చూడు మన్నట్టుగా ప్రకాశం తల ఎత్తి సూటిగా రికార్డిస్టు కళ్ళలోకి చూశాడు. రికార్డిస్టు తల ఎగరేసి కన్ను మలిపాడు. ప్రకాశం చిరునవ్వు నవ్వాడు.

ఆర్టిస్టులు ఒకరినొకరు అభినందించు కొనసాగారు.

"రాఘవయ్యా ! తోట సీనులో నువ్వు బెస్టురా!"

"నువ్వు క్లోజప్‌లో మమ్ములందర్నీ చంపేశావు లెస్తూ ! వెయ్యి రూపాయల క్లోజప్ కాదూ?"

ఏమీ అసూయ లేదు. ఒకరి దృష్టిలో ఒకరు ఎకాడమీ ఎవార్డు ఆర్టిస్టులే![1] వాళ్ళలో చాలామంది స్టేజిమొహం తప్ప సినిమా మొహం ఎరగరని ప్రకాశం ఎరుగును. "వీళ్లు పాపం, మంచి సినిమాలుకూడా చూడకుండా సినిమాల్లో నటించటానికి వచ్చారల్లే ఉంది" అనుకున్నాడు ప్రకాశం.

పిక్చరులో ముగ్గురు ఆడవాళ్ళు నటిస్తున్నారు. అందులో ఇద్దరు ప్రొజెక్షను చూడవచ్చారు. వాళ్ళు లాడ్జిలో ఉండరు. వాళ్ళు కుటుంబాలతో ఎవరి లాడ్జిలో వారుంటారు. వాళ్ళ లాడ్జి ఖర్చులన్ని ప్రొడ్యూసరువే. వాళ్ళ నటన కూడా అంతంత మాత్రంగానే ఉన్నది. కాని వాళ్ళను ప్రశంసించాలని ఎవరికీ తట్టినట్టు లేదు.

ఆడవాళ్ళు బయలుదేరి పోతూ డైరెక్టరుకూ, ప్రొడ్యూసరుకూ దణ్ణాలు పెట్టి, వెళ్ళి వస్తామన్నారు.

"బాగా చేశారమ్మా! వెళ్ళిరండి రేపు షూటింగ్ లేదనుకుంటాను. ఎల్లుండి కొత్త సెట్టుమీద షూటింగుచేద్దాం. అందులో మీ సీనులే జాస్తి."

అందరూ లాడ్జికి వచ్చేసరికింకా పన్నెండు కాలేదు. ప్రకాశం చేతిలోవున్న పుస్తకాన్ని ఒకరి నుంచి ఒకరు అందుకుని పుస్తకం పేరుచూసి, పేజీలు తిప్పి, "ఇదేమిట్రా? ఇదా స్క్రిప్టూ? ఇట్లా రాస్తారూ!" అని ఒకరినొకరు అడుగుతున్నారు.

"ఇదంతా తెల్లవాళ్ళ పద్ధతి," అన్నాడు ప్రకాశం.

"అట్లా చెప్పు! అందుకే వాళ్ళ పిక్చరు చూస్తే మనుషులు అటువెళ్ళా ఇటువెళ్ళా! ఉన్నట్టుండి పాష్, పీష్ అని ఏదో అనటం, అది మనకు వినిపించే లోపల వాళ్ళు వెళ్ళిపోవడం—ఏకంగా వెళ్ళిపోవటమే: ఇంగ్లీషు పిక్చర్లో కారెక్టర్లు నిలబడి కాస్సేపు నాలుగు మాట్లాడుకోగా చూశాం?" అన్నాడొకడు.

"అయితే ఏం లే! మన పిక్చర్లలో లేని సొంపు ఒకటి వాటిల్లో ఉంటుంది," అన్నాడింకొకడు భావగర్భితంగా.

అందరూ నవ్వారు. ఒకడు అమాయికంగా, "ఏమిటి బాబాయ్ అదీ?" అన్నాడు.

"నా చేత చెప్పించాలా ఏమిటి?"

"ఆయన చెప్పేది ముద్దులేరా!"

"మన పిక్చర్లో కూడా ఉంటే బాగానే ఉండును."

"అదంతా తీసిపెట్టు. నాకు తెలీకడుగుతాను, నువు రత్తమ్మను ముద్దుపెట్టుకోమంటే పెట్టుకుంటావా?"

"హరి హరి!"

---

1. ఎకాడెమీ అవార్డు ఆర్టిస్టులు: నవలా కాలంనాడు ఏ అకాడెమీలు అవార్డుల నిచ్చేవో తెలియదు.

"ఇంకేం ? ఆ ఇంగ్లీషు అమ్మాయిలూ, వాళ్ళ కథా కమామీషూ, అదంతా వేరు!''

పాశ్చాత్య చిత్రాలలో ఈమేటి నటీ నటులకు ఏదో ఒక మంచితనం కనిపించి నందుకు ప్రకాశం సంతోషించాడు— అవునుమరి!

అతనికి నిద్రరావడం లేదు. ఈ పుస్తకం చదువుదామని ప్రాణంపీకుతుంది. కాని అందరూ పడుకుని నిద్రపోయి లైట్లు ఆర్పేస్తారేమో అనుకున్నాడు. కాని అదృష్టవశాత్తూ ఎవరో ఒకరు,"రేపు షూటింగు లేదుగదర్రా? చతుర్ముఖ పారాయణి[1] కెవరు వస్తారు ?" అన్నారు.

క్షణంలో టీమ్ ఏర్పాటయింది. నిద్రపొయ్యే వాళ్ళకు ఇబ్బంది లేకుండా వరండాల్లో కుదేళ్ళాట ఏర్పాటు చేశారు. పక్కచుట్టా, పుస్తకమూ తీసుకుని ప్రకాశం అక్కడికి చేరి, పడుకుని చదవనారంభించాడు.

# 10

సత్యంతో కలిసి పనిచేయటం ప్రకాశానికి ఒక అపూర్వమైన అనుభవం. అటువంటి అనుభవాలు జీవితానికి ఒకటి చాలు!

రోజూ లాడ్జిలో టిఫిన్ తిని ఎనిమిదింటికల్లా సత్యందగ్గిరకి వెళ్ళేవాడు ప్రకాశం. సత్యం పదిదాకా అ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పేవాడు. తరవాత ఒకనోటుబుక్కుతీసి అందులో నుంచి తాను రాసుకున్న నోట్సు— దాన్ని సత్యం స్క్రిప్టు అనేవాడు - చదివేవాడు. ఆ తరవాత ప్రకాశం డయిలాగ్సు రాయటానికి ఉపక్రమించేవాడు. కాని ప్రతి డయలాగూ సత్యమే చెప్పేవాడు.

ఆతను చెప్పిన డయలాగు తప్ప, తాను రాయటానికి లేదని ప్రకాశానికి త్వరలోనే అర్థమయింది. అంతకంటె మంచి దనిపించిన డయిలాగు తాను చెబితే అది పొడుగయిందనో, షూట్ చెయ్యటానికి వీల్లేదనో, రికార్డు చెయ్యటానికి వీల్లేదనో – ఏదో ఒక సాకు చెప్పి తాను చెప్పినట్టే రాయించేవాడు సత్యం.

ఇట్లా రెండు మూడు రోజులు జరిగినాక ప్రకాశం లక్ష్మీకాంతాన్ని చూడబోయి జరిగినదంతా చెప్పి, "వాళ్ళిచ్చిన యాభై నాదగ్గిరే ఉన్నై, తిరిగి ఇచ్చేసి గుడ్‌బై చెబుదామా అని ఉన్నది. మీ సలహా ఏమిటి ?" అన్నాడు.

"ఆ డబ్బు వాళ్ళకి ఎన్నటికీ తిరిగి ఇవ్వవద్దు. మిమ్మల్ని వాళ్లు ఉపయోగించుకోకపోతే అది మీ తప్పుకాదు. ఇది ఒక ఉద్యోగమనుకోకండి. సత్యానికి స్టెనోగ్రాఫరు పని చేస్తున్నాననుకోండి. మీకు వచ్చిన నష్టంలేదు. నా విచార మల్లా ఇటువంటి ఉద్యోగం చూపానేమో అని !" అన్నాడు లక్ష్మీకాంతం.

---

1. చతుర్ముఖ పారాయణం : పేకాట; పారాయణి అనే మాటలేదు. అన్న ఆ ఎవరో తెలీక ఆ మాట అని ఉండవచ్చు.

ఆయన తన విషయంలో చూపినశ్రద్ధా, తీసుకున్న శ్రమా సాధారణంగా ఆప్తులు కూడా చూపరు. ఆయనకు తన కృతజ్ఞత ఎట్లా చూపాలోకూడా అతనికి తెలియలేదు.

"బాగుంది! మధ్య, మీరేం చెయ్యగలరు ? నేను వాళ్ళమాట చెబుతున్నాను. వాళ్ళ సొమ్ము ఊరికే తింటున్నాననేది నన్ను క్షణక్షణమూ బాధిస్తున్నది," అన్నాడు ప్రకాశం. తాను వాళ్ళింట్లో భోజనంచేసిననాడు ఈ లక్ష్మీకాంతం సినిమాలను గురించి తనకుగల కలలు చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. సినిమాల వాస్తవం చూడబోతే ఇట్లా ఉన్నది !

వారం రోజులు జరిగినాక ప్రకాశం తన ఉద్యోగాన్ని భరించలేక పోయినాడు. అతను యాభై రూపాయలూ తీసుకుని ఆదర్శకళా వాళ్ళ ఆఫీసుకుపోయి యాభై రూపాయలూ కృష్ణారావుకు స్వయంగా ఇచ్చి, "నేను ఉద్యోగం మానుకొంటున్నాను !" అన్నాడు.

"అదేమిటీ ?" అన్నాడు కృష్ణారావు ఆశ్చర్యంతో.

"నేను ఇంటికి వెళ్ళిపోవలసి వచ్చింది" ప్రకాశం బొంకాడు.

మళ్ళీ జానపదం జయించింది. ప్రకాశం తృప్తిపడ్డాడు కాని ఆ తృప్తివెనక అతి సూక్ష్మమైన నిట్టూర్పు — విచారంతో కూడుకున్నది—లేకపోలేదు.

అతను ఇంటికి—లాడ్జికి—తిరిగివస్తూ పశ్చాత్తాపం లాటిది అనుభవించాడు. తాను వదులుకున్న చాన్సువంటి దానికోసం కూడా ఎగిరి గంతేసేవాళ్ళు తెలుగు దేశంలో ఎందరో ఉన్నారు. బాగో, ఓగో ఈ పని కష్టంకాదు. యాభై రూపాయలు చేతికివచ్చినై. ఒక పిక్చరుకు డైలాగ్సు రాసినట్టు రికార్డు ఉండేది. ఈ సినిమా ప్రపంచంలో జొరబడటంకంటె, నిలిచి ఉండటం సులువని చాలామంది అన్నారు. ఇదంతా ఆలోచించుకుంటే తాను చేసినది అంత తెలివైనపనికాదేమో ననిపించింది.

ఈ నిర్ణయానికి వచ్చినాక ప్రకాశం తనమీద తానే తిరగబడ్డాడు. ప్రపంచంలో దబ్బేనా ? ఆత్మాభిమానమంటూ లేదా ? ఇటువంటి సినిమా చాన్సుకు అంటి పెట్టుకునేకంటే తిండికిమాడి చస్తేనేం ? ప్రాణంపోయినా ఆత్మవికాసంలేని ఉద్యోగం చెయ్యరాదు. ప్రతి పరువైన మనిషి తాను ఉత్సాహంతో చెయ్యగలపనే చెయ్యాలి ! అందరూ అట్లా చేస్తే ప్రపంచం ఇంకొంచెం బాగా నడిచే అవకాశం ఉన్నది. నూటికి తొంభైతొమ్మిదిమంది తాముచేసే పనులు, "ఎందుకొచ్చిందిరా దేవుడా ?" అంటూ, పనిలోవుండే ఆనందం కోసంకాక, అందువల్ల వచ్చే రాబడికోసమే చెయ్యబట్టే—

జానపదం ఆ విధంగా వాదించింది !

ఇది కాకపోతే దాని బాటులాటి సినిమాలు వస్తయ్యని తనను తాను నమ్మించుకోవటానికో, లేక తాను ఇంకా సినిమారంగంలో ఉన్నాననే నమ్మకంతోనోగాని ప్రకాశం "ఫిల్మ్ రైటింగ్" పుస్తకాన్ని దీక్షగా చదివాడు. అందులో ఉండే విషయాలను అతని బుర్ర ఆసక్తితో గ్రహించింది.

ప్రకాశం పట్నంచేరిన రెండోనెల మధ్యలో అతనికి ఇంకొక ఉద్యోగం దొరికింది. ఒక వ్యాపారస్తుడు ఒక వారపత్రిక పెట్టాడు. ఆరునెలలనుంచి నడుస్తున్నది. అంతదాకా దాన్ని చూస్తూ వచ్చిన పెద్దమనిషి అకస్మాత్తుగా మానుకున్నాడని తెలిసింది. ఆ పత్రికను చూస్తూండటానికి ఒక మనిషి కావాలట. నెలకు నలభై ఇస్తారట. పత్రికాధిపతి—ఆయనే పేరుకు ఎడిటరుకూడా—కారులో ప్రకాశాన్ని వెతుక్కుంటూ లాడ్జికి వచ్చాడు.

మీరు ఖాళీగా ఉన్నారని లక్ష్మీకాంతంగారు చెప్పారు. మన పత్రికకు సర్క్యులేషన్ ఇంకా బాగాలేదు. నష్టంమీదే నడుపుతున్నాను. నేను నా వీక్లీని కొత్త పద్ధతిలో నడపాలని చూస్తున్నాను. అందుచేతనూ, ప్రస్తుతం ఎక్కువ ఇచ్చుకోలేను గనుకనూ, కొత్త మనిషయితేనే సౌకర్యంగా ఉంటుంది. నాలుగు నెలలపాటు నేను దగ్గర ఉండి మీచేత పత్రికను నడిపించానంటే ఆ తరువాత నేను బిజినెస్‌మీద వెళ్ళినా మీరే నడపగలుగుతారు తెలిసింది గాదండీ? ఈ లోపల పత్రిక సర్క్యులేషన్ కూడా పెరుగుతుంది—నా అంచనా ప్రకారం ఇరవైవేలు రావాలి— అప్పుడు మీ శ్రమకు తగినట్టుగానే జీతం కూడా ఉంటుంది. ఒక్క జీతమేనా? ఫలాని పత్రిక ఎడిటరంటే ఎంత ఖ్యాతి! కల్కి కృష్ణమూర్తి[1] చూడండి. అతనికున్న కీర్తి డెయిలీల ఎడిటర్లక్కూడా లేదు. కాని ముందు మనం ఆవును మేపితేగదా అది తరవాత మనకు పాలిచ్చేది?" అని పత్రికాధిపతి ఉన్న విషయాన్ని విడమర్చి చెప్పాడు.

"ఎప్పటి నుంచి రమ్మన్నారు?" అన్నాడు ప్రకాశం.

"ఇప్పుడు నాతో వచ్చెయ్యండి!"

ప్రకాశం కారులో ఎక్కాడు. కారు గోవిందప్ప నాయకన్ వీధిలో ఒక మేడ పక్కన ఆగింది. కడపరాళ్ళు పరిచిన ఇరుకుమెట్లు ఎక్కి పైకి వెళ్ళితే అక్కడే పత్రికాధిపతి ఉండే ఇల్లూ, ఇంటిముందు ఓపెన్ వరండాలో ఒక కుర్చీ, బల్లా, ఒక భాగంలో కంపోజింగు సెక్షనూ ఉన్నై.

పత్రికాధిపతి ఎద్దులను తోలుతు ఉన్న వాడల్లే ప్రకాశాన్ని తొందరచేస్తూ, "ఆ కుర్చీలో కూచోండి ఒకఎడిటోరియల్ రాయండి. ఇదిగో కిందటివారం పత్రిక; దాని ప్రకారం ప్రతి పత్రిక ఉంటుంది. మొదటి పేజిలో ఎడిటోరియల్. ఈ వారం యుద్ధం గురించి వ్రాయండి. ఆ ప్రక్కనే హిందూ[2] ఫైలున్నది. వాటిలో న్యూస్ చూసి రాయండి. మన పాలిసీ యుద్ధ ప్రయత్నాన్ని ఖండించటంకాదు, బలపరచటమే. అయితే జాతీయ దృష్టి మాత్రం వదిలిపెట్టం. ఒక పేజీకి సరిపడా 'నవ్వ

---

1. కల్కి కృష్ణమూర్తి (1809- ) ఆర్. కృష్ణమూర్తి మారు పేరు. ప్రఖ్యాత తమిళ పాత్రికేయుడు, కథానికా రచయిత.

2. హిందు : ఆంగ్ల దినపత్రిక.

పువ్వులు' రాయండి. అక్కడ ఇలస్ట్రేటెడ్ వీక్లీ[1] ఫైలున్నది. మనవాడు పెరుమాళ్ళు కథల ప్రూఫులు తెచ్చిఇస్తాడు. ప్రూఫులు దిద్ది పేజీలు పెట్టించాలి. చివర పేజీ వారఫలాలు. మిగిలినదంతా అయినాక వారఫలాలు రాసెయ్యండి," అన్నాడు.

"వారఫలాలా? నన్ను రాయమన్నారా" అన్నాడు ప్రకాశం ఆశ్చర్యంతో.

"ఎవరు రాసినా ఒకటే. ఇదిగో ఈ ఇంగ్లీషు వీక్లీలోనివి తర్జుమాచెయ్యడమే కాపీరైటు చిక్కుంటుంది. అందుచేత కొన్ని మార్పులు చెయ్యాలి. ఏముందీ? చాలా సులువుగా చెయ్యవచ్చు!"

ఇంకేం చెయ్యాలి!" అన్నాడు ప్రకాశం.

"సినిమా పేజీ ఉంది ఫిల్మిండియా చూసి హిందీ పిక్చర్లు రాయవచ్చు. తెలుగు పిక్చర్ల వార్తలు మీకు తెలిసే ఉంటై." పత్రికాధిపతి కాళ్ళకు చెప్పులు తగిలించుకుని గబాగబా మెట్లుదిగి వెళ్ళిపోయినాడు. తరవాత కారు స్టార్టయి వెళ్ళిపోయిన చప్పుడు వినిపించింది.

ప్రకాశం ఆ బల్లముందు కూచుని పత్రిక సంగతి ఆలోచించటానికి మారుగా ఆత్మ పరీక్ష చేసుకున్నాడు.

"నాలో ఏదన్నా లోపం ఉందా! ఎవరైనా చెయ్యదగని పనులే నా కెందు కిస్తారు? చెయ్యటానికి గర్వపడే పనులేవీ నాకు దొరకవా ? నా వయసు నాకు అడ్డొస్తున్నదా? కథలు రాయటానికి అడ్డురాని వయసు ఉద్యోగాని కెందుకు అడ్డొస్తున్నదీ! నాలుగు మంచికథలు రాసుకుంటే ఇంత కీర్తి అయినా వస్తుందే. ఈ దిక్కుమాలిన ఉద్యోగాలు ఎన్నిచేస్తే మాత్రం ఏం లాభం?.... అదేమీకాదు. నాకు దొరికిన ఇద్దరూ డబ్బుకోసం తప్ప, మరే ఆశయమూ లేకుండా పనిచేస్తున్న వాళ్ళు. వాళ్ళకు ఉన్నతాశయాలుంటే నాకు గౌరవప్రదమైన పని ఇచ్చేవాళ్ళే....జగత్ప్రసిద్ధి సంపాదించిన వాళ్ళలో నాకంటే హీనంగా జీవితం ప్రారంభించిన వాళ్ళున్నారు. ఏమైనా ఈ ఉద్యోగం మానను. కనీసం లక్ష్మీకాంతంగారి మాటన్నా నిలబెట్టాలి. ఆయన నాకంటె ప్రపంచానుభవం గలవాడు."

అతను హిందూ ఫైలు చదువుతుండగా పెరుమాళ్ళు కథల ప్రూఫులు తెచ్చాడు. వాటిని చదవటంలో ప్రకాశం తప్పులు చూడటం మాటే మరిచాడు. రెండును రెండూ చెత్త కథలే. తానైతే వెయ్యడా కథలు. కాని అధిపతి ఏరుకున్న కథలు. వాటినిపక్కనపెట్టి సంపాదకీయం రాయటం మొదలు పెట్టాడు ప్రకాశం.

పెరుమాళ్ళు వచ్చి, "ముందు కథలు చూడండి. పేజీలు పెట్టాలి!" అన్నాడు.

"చూశాను పెట్టు."

"తప్పులే లేవా?" అన్నాడు పెరుమాళ్ళు ఆశ్చర్యంగా.

---

1. ఇలస్ట్రేటెడ్ వీక్లీ: ఆంగ్ల సచిత్ర వారపత్రిక.

"ఆ మాట మరచి పోయినాను." అంటూ ప్రకాశం కథల గాలీలు మళ్ళీ తీసుకున్నాడు. అతనికి ప్రూఫులు చూడటం చాతకాదు. తప్పులు ఎట్లా దిద్దాలో తెలియదు. తప్పులు పడిన అక్షరాలు కొట్టేసి వాటికి పైగా సరి అయిన అక్షరాలు రాశాడు. అవి కనిపించటంలేదు. పక్కనేనిలబడి చూస్తున్న పెరుమాళ్ళు మార్జిన్‌లో సరి అయిన అక్షరాలు రాయమన్నాడు. లోపించిన అక్షరాలుండవలసిన చోట ఎట్లా గుర్తు పెట్టాలో చూపించాడు. చాలా తప్పులు తప్పించుకు పోయినై.

ఇది వెట్టిచాకిరీ అని ప్రకాశానికి మొదటి రోజే తెలిసిపోయింది. న్యాయంగా నాలుగు రకాల మనుషులు చెయ్యాలిసిన పని ఒకడిచేత చేయిస్తున్నారు. వారం వారం మూడు పీచర్లూ, నాలుగు ఫీచర్లూ రాయాలి, ప్రూఫులు చూడాలి. వచ్చే కథలూ, వ్యాసాలూ చదవాలి. ఉత్తరాలు చూచి సమాధానాలు రాయాలి. వీటితో పోనివ్వక రెండో రోజున ఎడ్వర్టయిజ్మెంటు బ్లాకొకటి తీసుకురావటానికి ప్రకాశాన్నే పంపారు.

ప్రకాశం రాసిన ఎడిటోరియల్లో పత్రికాధిపతి చాలా మార్పులు చేశాడు. నవ్వు పువ్వుల్లో కొన్ని అచ్చుకాక మునుపే రాలిపోయినై. వారఫలాలు కూడా కొన్ని మార్పులు పొందినై. తన యజమాని మనసు ఎట్లా పని చేస్తున్నదో తెలుసుకోవటానికి ప్రకాశం ప్రయత్నించాడు. అది అంత సులువుగా అర్థమయ్యే మనసు కాదు.

పత్రిక బయట పడింది. దాన్ని చూసి ప్రకాశం గర్వపడలేదు.

తాను తింటున్న ఉప్పుకు గాను– నెలాఖరుకు తినపోయే దాని కింద-అయాచితంగా ఒక ఉపకారం చేద్దామనుకున్నాడు. తన పత్రికకు ఒక కథ రాశాడు. దాన్ని పెరుమాళ్ళకిచ్చి కంపోజు చెయ్యమన్నాడు. ఆ సాయంకాలం పత్రికాధిపతి దానిని అతనికిచ్చేస్తూ "మన పత్రికలో ఇటువంటి కథలు వెయ్యం. సెక్సుకు సంబంధించిన కథలు ఆడవాళ్ళు చదవరు. ఆడవాళ్ళు చదవని పత్రిక అధోగతి పాలే. ఆనందవికటన్ చూడండి, ప్రతి తమిళ స్త్రీకూడా చదువుతుంది!" అన్నాడు.

"నాకు తెలీదు, పోనివ్వండి!" అన్నాడు ప్రకాశం. దాన్ని మర్నాడు ఇంకొక వారపత్రికకు పంపాడు.

అది వెంటనే పత్రికలో అచ్చయింది.

"నేను వద్దన్న కథను మన రైవల్ పత్రికకు పంపినట్టున్నారే?" అన్నాడు యజమాని.

"అవును, అది మనకి రాదన్నారు గదా?"

"మీరు ఒక పత్రికలో పనిచేస్తూ ఇంకొక పత్రికకు రాయటం జర్నలిస్టిక్ ఎటికేట్ కాదు. చిన్నతనం గనుక మీకు తెలీదు, ఇంక ఎప్పుడూ అలా చేయకండి?" అన్నాడు యజమాని.

ఈ నలభై రూపాయల జీతానికి తాను తోచినప్పుడు కథలు రాసుకునే

హక్కును కూడా పోగొట్టుకున్నాడన్నమాట ! ఇటువంటి వెధవముండ ఉద్యోగం చెయ్యకపోతేనేం?

జానపదం పైకి తన్నుకుస్తున్నది !

ప్రకాశం హామ్లెట్ పడిన అవస్థలో[1] పడ్డాడు. తటపటాయించి నిరుద్యోగి అయిపోయి, లక్ష్మీకాంతాన్ని చిక్కులు పెట్టటమూ—ఇక ఆయన ఎన్నడూ ఎవరినీ ఏ ఉద్యోగానికి శిఫార్సు చెయ్యడు-లేక ఈ కుమ్మరామును ఈ షరతుల మీదనే భరించడమా ?

"తొందర పడటం మంచిదికాదు. ఒకవేళ ఈ ఉద్యోగాన్ని కాలతన్నినా, మూడోది కూడా ఇటువంటిదే వచ్చిందంటే, ఇక దాన్ని తన్నేసే నైతికశక్తి నాలో మిగలదు. ఆ శక్తి పూర్తిగా ఖర్చుకాకముందే ఓర్పు అలవరుచుకుందాం. ఏమంత కష్టంకాదు. 'నేనెవర్ననీ? కోన్‌కిస్కా హైగాణ్ణి ! మహా మహా వాళ్ళే మట్టికొట్టుకుపోయినారు!' అని మళ్ళీ మళ్ళీ అనుకుంటే సరి!" అనుకున్నాడు ప్రకాశం.

మూడోవారంలో ఏదో పిక్చరు ప్రివ్యూ జరిగింది. ఈ వార పత్రికకు కూడా ఆహ్వానం వచ్చింది. యజమాని ఆ రోజే ఊరికి పోతూ, "సాయంత్రం పిక్చరు చూచి రేపు ఉదయమే రివ్యూ నైస్‌గా రాసేసి కంపోజు చెయ్యటానికి ఇచ్చెయ్యండి; నేను బహుశా ఎల్లుండికి డిస్పాచ్‌కి అందుకుంటాను ?" అన్నాడు.

పిక్చరు సుమారుగా ఉన్నది. ప్రకాశం దాన్లో ఉన్న లోపాలన్నిటినీ నైస్‌గా చెక్కేశాడు. యజమాని రాకముందే ఇస్యూ తయారయింది.

డిస్పాచి అయిన మర్నాడు యజమాని వచ్చాడు. "ఏం రివ్యూ అలా రాశారు!" అన్నాడు ప్రకాశంతో.

"తప్పుగా రాశానా ?" అన్నాడు ప్రకాశం.

"అదెవడిక్కావాలండీ ? అలా రాయటమే తప్పు. ఆ రివ్యూమూలంగా నాకు ఆ పిక్చరు ఇన్సర్షన్లు రెండు పోయాయి, ఎనభై రూపాయలు నష్టం. ఇక నుంచీ మీరు పత్రిక చూడనక్కర్లేదు, నేనే చూచుకుంటాను!" అన్నాడు యజమాని.

"నా జీతం."

"నెలాఖరుకువచ్చి తీసుకువెళ్ళండి."

"థ్యాంక్స్ !" అంటూ ప్రకాశం విజయ గర్వంతో బయటికి నడిచాడు. తొందరపడి తాను ఉద్యోగాన్ని వదులుకోకపోవటం మేలయింది. ఈ తలకిందుల ప్రపంచంలో రిజైన్ చేయడంకన్న డిస్మిస్ చేయించుకోవడం ఎక్కువైన సంగతి !

---

1. హామ్లెట్ పడిన అవస్థలు : షేక్స్పియర్ విషాదాంత నాటకం హామ్లెట్‌లోని విషాద నాయకుడు హామ్లెట్. గురజాడ కన్యాశుల్కం నాటకంలో గిరీశం అన్న ధోరణిలోనే (కన్యాశుల్కం, తృతీయాంకం, మూడవస్థలం) ఈ పాత్ర-

"నా తప్పేమీలేదు. నేనీ ప్రపంచానికి బాధ్యుణ్ణికాను !" అనుకున్నాడు ప్రకాశం.

# 11

ప్రకాశానికి పట్నం జీవితంపైన రోతపుట్టింది. ఇక్కడ అదృష్టవంతులకే అవకాశాలు.

పేరుంటేగానీ చెయ్యటానికి మంచిపని దొరకదు. మంచిపనిచేసి చూపిస్తేనే గాని పేరు దొరకదు. అందులోనే ఉన్నది అదృష్టం. చిన్నతనంలో పత్రికలమ్మి, హోటళ్ళలో ప్లేట్లుకడిగి గొప్పవాళ్ళయిన వాళ్ళుండవచ్చుగాక. వాళ్ళకు గొప్పతనం పత్రికలమ్మటం చేత, ప్లేట్లు కడగటం వల్లా రాలేదు—అదృష్టవశాత్తూ సరి అయిన అవకాశం సరి అయిన సమయానికి దొరికి, వాళ్ళను పైకి తోసింది. స్వతహాగా గొప్పతనమన్నది వాళ్ళలో ఉండవచ్చుగాక — అది తనలో లేదని ఏమిటి ? సత్యంకన్నా, ఈ పత్రికాధిపతికన్నా తనకు వయసూ, లోకానుభవమూ తక్కువ ఉండవచ్చుగాక. వాళ్ళు ఇంకెందులోనూ తనకు మించినవాళ్ళు కారని ప్రకాశానికి అనిపించింది.

ప్రకాశం సోమయాజులతో, "ఇంటికి పోతానోయ్ !" అనిపూశాడు—ఇవాళ కాకపోతే రేపు అని స్ఫురించేట్టుగా.

"నీ ఉద్యోగమో ? అదేదో పత్రిక ఎడిట్ చేస్తుంటివిగా ?"అన్నాడు సోమయాజులు.

తను పత్రిక ఎడిట్ చేస్తున్నట్టు ఇతరులు అనుకుంటున్నారంటేనే ఏదో జుగుప్స కలిగింది ప్రకాశానికి.

"మానేశాను—అంటే వాళ్ళే నన్ను వెళ్ళకొట్టారు !" అన్నాడు ప్రకాశం.

"ఎప్పుడూ ?"

"ఇవాళే !"

"హోరివాళ్ళ దుంపతెగా ! ఏం ?" అన్నాడు సోమయాజులు సానుభూతితో.

కాని ఆ క్షణంలో సోమయాజులు సానుభూతికి ప్రకాశంలోనుంచి కృతజ్ఞత పొర్లిరాలేదు. అతను విషయం మార్చేశాడు. ఈ విషయం లక్ష్మీకాంతానికి చెప్ప వలసిన బాధ్యత ఒకటుంది. కాని ఎందుకో వెంటనేవెళ్ళి చెప్పబుద్ధి కాలేదు. వెంటనే చెప్పాలనుంటే అప్పుడే అతను వాళ్ళ ఆఫీసుకుపోయి ఉండవచ్చు. "నా ఉద్యోగం పోయిందండి!" అని తాను అనగానే, తన బరువు మరొకసారి ఆయనమీద పడ్డట్టు ఆయనకు తోచవచ్చు; తాను ఇటువంటివాణ్ని సిఫార్సు చేసినందుకు ఆయన నొచ్చుకోవచ్చు. అందులో తన తప్పు కొంతలేకపోలేదని లక్ష్మీకాంతం భావించవచ్చునేమో అన్న సంగతి ఆకస్మాత్తుగా తట్టేసరికి ప్రకాశం గుండె చిన్న గంతు వేసింది!

"నా మాటవిను! మనం పట్నంనుంచి వెళ్ళనేవద్దు! ఇక్కడే ఉన్నామంటే ఏదో ఒకటి దొరుకుతుంది. నేను చాలా ఆలోచనలు చేస్తున్నానులే!" అన్నాడు సోమయాజులు.

ప్రకాశానికి కథలు రాయాలని మళ్ళీ వెర్రి ఆవేశం వచ్చింది. ఇప్పుడు అతని తలలోని పాత్రలూ, సన్నివేశాలు తోసుకువస్తున్నై. వాటిని చిత్రించటానికి పూచుంటే చిత్ర విచిత్రమైన విధానాలు వాటంతట అవే పుట్టుకొస్తున్నై. తన రచన నమ్మకంగా అభివృద్ధి అవుతున్నట్టు ప్రకాశానికి తోచింది. వారం రోజులలోపున మూడు కథలురాసి మూడు పత్రికలకు పంపించేశాడు....

తండ్రి ఉత్తరం రాశాడు. "నువ్వు పట్నంలో ఏదన్నా చిన్న ఉద్యోగం సంపాదించి స్థిరపడేట్టుంటే అమ్మా, నేను కూడా వచ్చేస్తాం. ఇక్కడ నాకేమీ బాగా లేదు. యాభై ఏళ్ళకే నా జీవితమంతా ఖాళీ అయిపోయినట్టుగా ఉంది."

"నేను సరిగా ప్రయత్నించటం లేదు. ఎంతసేపూ ఒక లక్ష్మీకాంతాన్నే నమ్ముకున్నాను. సరిగా ప్రయత్నిస్తే ఎందుకు దొరకదు!" అనుకుని ప్రకాశం రోజూ పత్రికలో "వాంటెడ్ కాలమ్" చూడసాగాడు. అతనికి ఆ కాలమ్‌కన్న "మాట్రిమోనియల్ కాలమ్" చదవడానికి సరదాగా ఉండేది. తాను బ్రహ్మచారి గనక చూసేందుకు సహజమైన హక్కున్నది. తనకు పనికొచ్చేటట్టు కనిపించేవి రోజుకు ఒకటీ, రెండు సంబంధాలు కనిపిస్తై. వాటిని గురించి సూక్ష్మంగా కలలుకనవచ్చు. కాని తాను అభ్యర్థిగా పెళ్ళిసంబంధం కోసం రాయాలని ప్రకాశానికి ఎన్నడూ తట్టలేదు. ఉద్యోగాలకు రాయాలన్నా తగినది ఒక్కటీ కనబడేదికాదు.

ఉద్యోగం పోయిన పదిరోజులకు ప్రకాశం లక్ష్మీకాంతాన్ని చూడబోయినాడు.

"మీ ఉద్యోగం కాస్తా పోయిందటగా ? ఆయన కనబడి చెప్పాడు. పోతే పోయింది లెండి. చేసినరోజులకు జీతమైనా ఇచ్చాడా?" అన్నాడు లక్ష్మీకాంతం.

"లేదు ఫస్టు తరవాత చూస్తానన్నాడు. నా ఎడ్రసిచ్చి వచ్చాను. ఇంకాచూస్తున్నట్టున్నాడు. ఆయన డబ్బు చేసుకునే పద్ధతుల్లో నాబోటివాళ్ళకు ఎగనామం పెట్టటం ఒక పద్ధతి కామాలు. సేల్స్‌మీద వచ్చినది ఇంతా, ప్రకటనలమీద వచ్చినది ఇంతా, పనిచేసిన వాళ్ళకు ఎగనామం పెట్టినది ఇంతా; వెరశి అంతా!" అన్నాడు ప్రకాశం.

"అన్నట్టు మీకేదో ఉత్తరం వచ్చినది. రీడైరెక్టు చేస్తే అందుతుందో లేదో, వచ్చినప్పుడిద్దామని జేబులో పెట్టుకు తిరుగుతున్నాను. ఎవరో కొత్తవాడల్లే ఉంది. పత్రిక కేరాపున రాశాడు" అంటూ లక్ష్మీకాంతం జుబ్బా జేబులోనుంచి నలిగిపోయిన ఉత్తరమొకటి తీశాడు.

ప్రకాశం దస్తూరీ పోల్చుకోలేక పోయినాడు. ఎరిగినవాడు రాసిన ఉత్తరం కాదు. కవరుచించి చదువుకున్నాడు. అతని కథలను ప్రశంసిస్తూ ఎవరో వెంక

ట్రామయ్య అనే ఆయన రాసిన ఉత్తరం. "....చలం[1] తరవాత సంఘాన్ని ఘాటుగా విమర్శిస్తూ రాసిన కధకులు చాలా తక్కువ. ఈ లోటు మీరు తీరుస్తున్నారని నాకు తోస్తున్నది. మీరు రాసిన" ఈ ధోరణిలో ఉన్నది ఉత్తరం. ఈ ఉత్తరం చూసి ప్రకాశం ఆటే ఆనందించలేదు. ఉత్తరం సాంతం చదవనుకూడాలేదు. తొందరేముంది ? తరవాత చదవొచ్చు.

"ఏదో ఫానులెటర్," అంటూ ప్రకాశం జేబులో పెట్టుకోబోతుంటే "చెప్పరేం? ఏం?" అంటూ లక్ష్మీకాంతం ఉత్తరం తీసుకుని సాంతం చదివాడు.

"అయితే ఇంకో కొత్తపత్రిక వస్తున్నదన్నమాట." అన్నాడాయన.

"కొత్త పత్రికేమిటి?" అన్నాడు ప్రకాశం.

"ఈ ఉత్తరంలో ఉందే. చూడలేదా? ఆయన పట్నం వచ్చి త్వరలో ఒక కొత్త పత్రిక పెడతాట్ట. దానికి మీరు తరచు కథలు రాయాలిట."

"అయితే నే ననుకున్నంత ఫాన్ లెటర్ కాదన్నమాట!" అన్నాడు ప్రకాశం.

"కాకేం? మనిషి దోరణి చూస్తే ఏవో ఆదర్శాలున్న వాడల్లేనే కనబడ తాడు!" అన్నాడు లక్ష్మీకాంతం.

ప్రకాశం లాడ్జికి తిరిగివస్తూ ఉత్తరాన్ని శ్రద్ధగా చదువుకున్నాడు. ఈయన నిజంగా ఇంకో వారంలో పట్నం వచ్చి పత్రిక పెట్టే ప్రయత్నం చేసేటట్టయితే తాను అందులో ఒక చిన్న ఉద్యోగం ఎందుకు సంపాదించగూడదూ? తనమీద ఆ మనిషికి అంతో ఇంతో గురివున్నట్టు కనిపిస్తుందికూడానూ. ఆయన మనుషు లందర్నీ ఏర్పాటు చేసుకోకముందే చిన్న బీజంనాటి ఉంచటం మంచిది. మర్నాడు ప్రకాశం వెంకటరమణయ్యకు ఈ విధంగా రాశాడు: "శ్రీయుతులు టి. వెంకట రమణయ్యగారికి, నమస్కారాలు. మీ ఉత్తరం అందింది. నా సాహిత్య కృషిని గురించి మీరు ప్రకటించిన సదభిప్రాయాలకు చాలా కృతజ్ఞుణ్ని. నేను ప్రస్తుతం ఉద్యోగ ప్రయత్నం చేస్తూ పట్నంలోనే ఉంటున్నాను. గనక మీరిక్కడికి వచ్చి నపుడు మిమ్మల్ని తప్పక కలుసుకుంటాను. నావల్ల మీ పత్రికకు ఎలాటి సహాయం కావలసివచ్చినా చెయ్యటానికి సిద్ధంగా ఉంటాను. మీరు పట్నం వచ్చేటప్పుడు ఇందులో యిచ్చిన ఎడ్రసుకు ఒక కార్డు ముక్క రాయండి. శలవు."

ఈ ఉత్తరం పోస్టులో పడేస్తూ ప్రకాశం, "నా రచనా సామర్థ్యం ఏదన్నా ఉంటే ఈ ఉత్తరంతో బైటపడాలి!" అనుకున్నాడు.

వెంకట రమణయ్య దగ్గిరనుంచి ఈసారి పెద్ద ఉత్తరం వచ్చింది. అందులో ఆయన తాను పెట్టదలచిన పత్రికయొక్క ఆశయాలను గురించి పేజీలకు పేజీలు రాశాడు. చిట్టచివరలో ప్రకాశానికి పనికివచ్చే ముక్కలున్నై: "మీకు నిజంగా మంచి ఉద్యోగం లభించే పక్షంలో అడ్డు రావటం నాకిష్టం లేదు. కాని ఒక మాదిరి

1. చలం : ఇంతకు ముందు వచ్చిన సందర్భంలో చూడండి.

ఉద్యోగమయితే చెయ్యవద్దని నా ప్రార్థన. పత్రికకు మీబోటి వాళ్ళ సహాయం వుంటే నాకు చాలా ఆనందంగా వుంటుంది. మీకు సుఖంగా జరిగిపోయేటట్లు చూడగల ననుకుంటాను." అని ఆయన రాశాడు.

"అబ్బీ, ఇదిరా అవకాశం—చాతయితే దీనితో పైకిరా !" అని ప్రకాశం తనలో తాను అనుకున్నాడు.

అతనికి ఒక్కందుకు ఆశ్చర్యం వేసింది! తెలుగు దేశంలో సాహిత్యం సృష్టించటం వృత్తిగా పెట్టుకుని బతక గలిగినవాళ్ళు దాదాపు లేరు - ఈ కాలం అటువంటిది. తాను సంపాదించుకున్న నాలుగు రూపాయలూ కథలు రాసి సంపాదించుకున్నవే. చేసిన అణాకానీ ఉద్యోగాలు ఒక్క చిల్లిగవ్వ గూడా ఇవ్వలేదు. ఒక మనిషిగా అయితేనేం, గ్రాడ్యుయేటుగా అయితేనేం తనకు ఏమీ మాన మర్యాదలు ఏర్పడలేదు. కాని కథకుడుగా పరపతి ఏర్పడింది. ఆ కథల ధర్మమా అంటూ తనకు ఒక చెప్పుకోగలిగిన ఉద్యోగం కూడా దొరికేటట్టున్నది.

# 12

పదిహేను రోజులుగా రాత్రివేళ దొంగతనంగా కురుస్తూ వచ్చిన వానలు వ్యూహం మార్చి విడవని ముసురుగా పరిణమించినై. అయితే ప్రకాశానికి నగరం రొచ్చుగా తోచలేదు. ప్రతి వర్షాకాలము మడమలలోతు బురదలో తిరగటం అలవాటైన అతని ప్రాణానికి పట్నం కడిగి కళాయి చేసిన అద్దంలా కనపడింది. అతను నానుడు వానలోపడి వెంకటరమణయ్యను చూడబోయినాడు. ఆయన మాడర్న్ హోటల్లో దిగాడని తెలిసింది.

అది ప్రకాశానికి హైక్లాస్ హోటలల్లే కనబడింది. బాగా డబ్బున్నవాళ్ళు తప్ప అక్కడ దిగలేరనుకున్నాడు. వెంకటరమణయ్య పదోనంబరు గదిలో వుంటున్నాడు. గదిలో ఒకే మనిషి ఉండబట్టి ప్రకాశం తన కళ్ళను నమ్మాడుగాని లేకపోతే పొరపాటుపడి రెండో మనిషి ఎవరున్నా ఆయనే వెంకటరమణయ్య అనుకొని వుండును. ఏ కారణం చేతనో - దస్తావేజులు రాయదగిన దస్తూరినిబట్టి కావచ్చు — వెంకటరమణయ్య నడికారు మనిషి అని, ఆయనకు అధమం నలభై ఏళ్ళు వుంటయ్యనీ, పాతకాలపు మనిషి అనీ (అభిప్రాయాలలో కాదు, ఆకృతిలో) ప్రకాశం ఊహించాడు. ఈ ఊహ పూర్తిగా తప్పయింది. వెంకటరమణయ్య— పేరుకూడా వయస్సునే సూచిస్తున్నది ! -ముప్పైఏళ్ళ లోపువాడు. అంతటితో పోనివ్వక ఆయన అందంగా కూడా వున్నాడు. దాదాపు ఆడవాళ్ళకు సరిపోయేటంత అందం వున్నది వెంకటరమణయ్య దగ్గర.

అతనుకూడా ప్రకాశాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు.

"మీరా ప్రకాశంగారు ? మీరింకా చాలా ఒడ్డూ, పొడుగూ వుంటారనుకు న్నానే ! కూచోండి, కూచోండి!" అన్నాడు వెంకటరమణయ్య సరదాగా. ఉత్త రాలలో పూర్తిగా మరొక మనిషి అయిపోయే రకం మనిషి ఆయన. ఒక ఏడాది పాటు ఆయనతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపినప్పటికీ ప్రకాశం ఆయన ముఖాముఖీ ఎట్లా మాట్లాడతాడో ఊహించగలిగేవాడు కాడు.

ఆయన ప్రకాశం కథలను గురించి ఒక్కముక్కకూడా మాట్లాడలేదు. తన విషయాలన్నీ అప్పుడికి చెప్పుకున్నట్లు చెప్పుకున్నాడు. ఆయన వంద ఎకరాల ఆస్తికి పెంపుడు వెళ్ళాట్ట. కట్టుకుపోయినంత డబ్బున్నది. చాలామంది ఎరిగున్న వాళ్ళు వ్యాపారం చెయ్యమన్నారు. ఉన్న డబ్బును పెంచమన్నారు.

"వ్యాపారంచేసి డబ్బు పెంచవచ్చు. కాని వ్యాపారం దివాలాతీస్తే మనం చెడిపోవటం నిజమూ, ఇతరులు బాగుపడటం అబద్ధమూ అవుతుంది. ఒకవేళ వ్యాపారం జయప్రదమై డబ్బు రెట్టింపయినా అందువల్ల మనంగాని ఇతరులుగాని పెరిగేదిలేదు. డబ్బు పోయేటప్పుడు ఇంకొకరి జేబుల్లోకి పోతుంది. వచ్చేటప్పుడు ఇంకొకరి జేబుల్లోనుంచి వస్తుంది. అంతేగాని మనం డబ్బును సృష్టించేది లేదు," అన్నాడు వెంకటరమణయ్య.

"ఏదన్నా పరిశ్రమలు నడిపితే సంపద సృష్టి అవుతుంది గద?" అన్నాడు ప్రకాశం.

"నిజమే. మనం సాగించే పరిశ్రమ ఏమున్నదీ? భారీపరిశ్రమలు మనకు అందవుగదా. ఏ సినిమా పరిశ్రమవంటిదైనా అయితే ఫరవాలేదు. కాని నాకు సినిమా పరిశ్రమ ఇంకా అర్భకపు స్థితిలోనే వున్నదనిపిస్తున్నది. మన సంస్కృతి పైన దాని ప్రభావం పడటానికి ఇంకో పావుశతాబ్దమైనా పట్టుతుంది." అన్నాడు వెంకటరమణయ్య.

ఇదంతా బాగా ఆలోచించే ఆయన పత్రిక పెట్టటానికి నిర్ణయించాడు. భారీగా పెట్టుబడి అవసరం లేకుండానే సంస్కృతికి ఎంతో సేవ చెయ్యవచ్చు.

"పత్రిక జయప్రదమైతే నాకు లాభాలుకూడా అవసరం లేదు. అంతో ఇంతో నష్టం వచ్చినా లక్ష్యపెట్టను. మనకు మంచి సాహితీపరులున్నారు. కళాకారులున్నారు, పరిశోధకులున్నారు. వీరందరి కృషినీ పత్రికద్వారా ప్రచారంచేస్తే అంతకంటె కావలసిందేమిటి?" అన్నాడు వెంకటరమణయ్య.

ప్రకాశం తన ఉద్యోగ ప్రయత్నాలను గురించి చెప్పాడు.

"ఛీ, ఛీ ! అటువంటి ఉద్యోగాలు చెయ్యవలసిన ఖర్మేమిటి ? మనం పత్రిక నడుపుదాం. దీపావళి ఇంకా మూడునెలలు చిల్లరే ఉన్నది. మొట్టమొదటి సంచిక, దీపావళికి తెద్దామని ఉన్నది. రెండువందల పేజీల సంచిక, స్పెషల్ ఆర్ట్‌ప్లేట్స్‌తో తీసుకువద్దాం. ఇవాళో రేపో ఆఫీసు తీసుకుందాం. ఇవాళ ప్రెస్సు మాట్లాడతాను. డిక్లరేషన్ తీసుకోగానే లెటర్‌హెడ్‌లు అవీ అచ్చు

చేయిద్దాం. వ్యాసాలు పంపవలసిందనీ, బొమ్మలు పంపవలసిందనీ రాయవలసిన వాళ్ళకు రాద్దాం. ముఖ్యమైన వాళ్ళందరిపేర్లూ సంపాదించండి." అన్నాడు వెంకటరమణయ్య.

ఆయన ఖర్చులకు వాడుకోమని ఇచ్చిన పదిరూపాయల నోటు తీసుకుని ప్రకాశం ట్రాముమీద బయలుదేరి లక్ష్మీకాంతం దగ్గరికి వెళ్ళాడు. విషయమంతా తెలుసుకుని లక్ష్మీకాంతం సంతోషించాడు. ఆయన ప్రకాశాన్ని అభినందించి, "ఏదైనా ఇంతేనండీ. దాని ఘడియ రావాలి. మనం తొందరపడి లాభంలేదు. బాగుంది ! ఇకమీరు గట్టెక్కినట్టే. ఆయన లాభం అక్కర్లేదంటే ఏంలెండి ? పత్రిక లాభసాటిగా నడిస్తేనే జయప్రదమైనట్లు నేనొక్కటే చెబుతున్నా, చూడండీ, తగినంత పెట్టుబడి ఉంటే ఎప్పటికైనా జయించవచ్చు. గడ్డుకాలం దాటటానికీ, చేసినతప్పులు సరిదిద్దుకోవటానికీ డబ్బు చాలకపోతేనే చాలామంది వ్యాపారం దెబ్బతినేది," అన్నాడు.

అనేకమంది రచయితల ఎడ్రసులూ, కళాకారుల ఎడ్రసులూ ఆయనే ఇచ్చాడు. వాటిని ఒక కాగితంమీద రాసుకుని తరవాత ఒక పాకెట్ నోట్ బుక్‌లోకి ఎక్కించాడు ప్రకాశం. ఆ నోట్ బుక్కులోనే రెండోవైపునుంచి తన ఎక్కౌంటు కూడా రాశాడు.

ఇప్పుడు ప్రకాశం జీవితంలోకి చైతన్యం వచ్చింది. రోజూ వెంకట రమణయ్యను కలుసుకుంటున్నాడు. ఇద్దరూ కలిసి టాక్సీలలో ఊరంతా తిరుగు తున్నారు. డిక్లరేషన్ పడేశారు. ప్రెస్‌కు సమీపంలోనే ఆఫీస్‌కూడా కుదిరింది. కావలిస్తే ప్రకాశం అందులో కాపరంకూడా ఉండవచ్చు. ముందున్న పెద్దగదీ, వరండా పత్రికకుచాలు. వాటివెనుక కట్టుకుపోయినంత ఇల్లున్నది. గదిలో అమర్చ టానికి ఒక అరడజను కుర్చీలూ, రెండు టేబిల్సూ, రెండు అలమార్లు, ఇతర స్టేషనరీ కొన్నారు. వెంకటరమణయ్య ప్రకాశానికి పార్కరుకలం ఒకటి కొనిపెట్టాడు.

మళ్ళీ జీవితం జానపదం మేకప్ వేసుకున్నట్టు తోచింది ప్రకాశానికి. అయితే దాని పరిమళాన్ని సేవిస్తూ కూచునేటందుకు అతనికి తీరికలేదు. ఆ పరిమళాన్ని తన మెదడులో భాగాలకు పంపేసి అతను పనికి ఉపక్రమించాడు.

ఈ పనిలో ఒక భాగంగా అతను పత్రికకు ఒక కథ రాశాడు—లోగడ రాసిన కథలన్నిటికన్న పెద్దది. అన్ని పనులలోకీ ఇదే తేలిక అయినది. కొన్ని వ్యాసాలు చేరినై. చేరిన వాటిలో కొన్ని బాగాలేవు. అడిగి తెప్పించుకున్న వ్యాసాలు బాగా లేకపోతే ఏం చెయ్యాలో ప్రకాశానికి తెలియలేదు. వెంకటరమణయ్యకూ తెలియలేదు. చుట్టపు చూపుగా వచ్చిన లక్ష్మీకాంతాన్ని అడిగితే, "మరీ గొప్పవాడివైతే తడువు కోకుండా వెయ్యండి - ఎంత బాగా లేకపోయిననూ. ఒక మాదిరి వాడి వ్యాసం ఒక మాదిరిగా ఉంటే చివరకు నెట్టేయండి. అసహ్యంగా ఉంటే వెయ్యటం మానెయ్యండి. వెయ్యలేదేమని అడిగితే స్థలా భావమని బొంకండి. ఆయన విసుగెత్తి నా వ్యాసం

నాకు పంపమని రాస్తే మర్యాదగా పంపెయ్యండి," అని సలహా ఇచ్చాడు. ఆయన రోజూ జరిగేదే చెబుతున్నాడని తెలియక వెంకటరమణయ్య విరగబడి నవ్వాడు.

కనీసం మూడు నాలుగు ఆర్ట్ ప్లేట్లు వేద్దామనుకుంటే ఒక బొమ్మే వచ్చింది. వ్యాసాల్లో మంచి చెడ్డలుంటై గాని, బొమ్మల్లో అన్నీ మంచివేనని వెంకటరమణయ్యగారి దృఢ విశ్వాసం. తెల్లవాళ్ళకి నల్లవాళ్ళల్లో తేడాలు తెలియనట్టుగా పట్నవాసులకు ఒక జాతి జంతువులన్నీ ఒకటిగానే ఉన్నట్టు.... మొత్తానికి ఆర్టిస్టులు సహకరించలేదు. పైపెచ్చు వాళ్ల అవకాశం ఉపయోగించుకుని తనను ఆర్టు సముద్రంలో ముంచటానికి ప్రయత్నించినట్టు ప్రకాశానికి అనుమానం వేసింది. ఒక బొమ్మ వెయ్యటమంటే మాటలు కాదని, ఎన్నో ఏళ్ల ఆర్టిస్టుచేసిన తపస్సూ, ఎన్నో వందల ఏళ్ళుగా సజీవంగా ఉన్న ఆర్టు సంప్రదాయము, ఎన్నో రోజులు ఆర్టిస్టు కుంచెలతోనూ, రంగులతోనూ పట్టే కుస్తీ - ఇవి మేళవిస్తేనేగాని ఒక "వర్క్‌ఫార్టు"[1] సృష్టికాదనీ, వాళ్ళు తనకు హెచ్చరిక చేస్తున్నట్లు తోచింది. "ఇదే నిజమైతే ఆర్టుకు మోక్షం ఉందా!" అనుకున్నాడు ప్రకాశం. ఎందుకంటె కథకుడుగా తను తపస్సు చెయ్యలేదు. కథారచనకు చెప్పుకోదగినంత సంప్రదాయంలేదు. తాను కలం కాగితాలతో ఎన్నడూ కుస్తీపట్టలేదు. నలుగురూ చదివే నాటుకథలు రాసేస్తున్నాడు. కథా సాహిత్యానికి మంచి భవిష్యత్తున్నట్లు సులువుగా తెలిసిపోతూనే ఉంది.

ఇంకొక్క పెయింటింగు సంపాదించేసరికి తలప్రాణం తోకకువచ్చినంత పని అయింది ప్రకాశానికి. రెండు బొమ్మలనూ మౌంటురోడ్డులో మంచి బ్లాకుమేకర్స్‌కు ఇచ్చారు. సినిమాలకు పబ్లిసిటీవర్కు చేసే ఒక ఆర్టిస్టు కథలకు నాలుగైదు బొమ్మలూ, వ్యాసాలన్నింటికీ హెడ్ డ్రాయింగ్‌లూవేసి ఇచ్చాడు. అతని ధర్మమా అంటూ అతను ఎవరినీ ఆర్టుసముద్రంలో ముంచ ప్రయత్నించలేదు. అయితే అతను కమర్షియల్ ఆర్టిస్టు. అందుచేత మనుషులను మనుషులల్లే వేశాడు.

పద్యాలు కూడా చాలావరకు వచ్చినై. (వీటిలో చాలాభాగం దినపత్రికలో ప్రకటన చూసిన కవులు పంపినవి.)

"పద్యాలు రాయటం కూడా గొప్పకళ. వాటిలో ఎక్కువ తక్కువలు ఎంచటం అంత మంచిది కాదేమో!" అన్నాడు ప్రకాశం సరదాగా.

"అదెల్లా కుదురుతుంది? మీకు మంచి పద్యాలేవో, చెడ్డ పద్యాలేవో తెలీదా?" అన్నాడు వెంకటరమణయ్య.

"గణాలూ, యతిప్రాసలూ చెపితే తెలుస్తుంది. మిగతా విషయాలు తెలీవు. శ్రీ శ్రీ పద్యాలు[2] చదివి చెడిపోయినవాణ్ణి," అన్నాడు ప్రకాశం.

---

1. Work of art.
2. శ్రీశ్రీ పద్యాలు - మహాప్రస్థానం గీతాలు.

"ఒకపని చేద్దాం. చెరొక సగం పద్యాలూ తీసి చదువుకుని ఎవరికి బాగున్నవి వాళ్ళు సెలెక్టు చేసుకుందాం," అన్నాడు వెంకటరమణయ్య.

ఆ విధంగా వాళ్ళు రాజీపడటంవల్ల అయిదారు ఖండకావ్యాలు సెలెక్టు కావటం జరిగింది.

"మనం ఎడ్వర్టయిజ్మెంట్లు గురించి ఏమీ ఆలోచించలేదు" అన్నాడు ప్రకాశం. అంతకు వాళ్ళిద్దరూ కూచుని దీపావళి సంచికకు అయ్యే ఖర్చూ, దానిపై వచ్చే రాబడీ లెక్కపెట్టి నాలుగు వందలు చేతిది తగులుతుందని అంచనా కట్టారు. వాళ్ళు వేస్తున్నది వెయ్యి కాపీలే. ఏజెంట్లు ఇంకా ఏర్పడలేదు. చాలామంది తొలి సంచిక చూసిగాని ఆర్డర్లివ్వమన్నారు.

"నేను ఎడ్వర్టయిజింగ్ కంపెనీలకూ, బిజినెస్ కంపెనీలకు వెళ్ళి వస్తాను. సినిమా ప్రకటనలు కూడా ఉంటే బాగుంటుంది కాదూ ?" అన్నాడు వెంకటరమణయ్య.

"మనం సినిమా ఫీచరేమీ పెట్టలేదే !"

"మీకేమైనా తోస్తే రాయవచ్చు" అన్నాడు వెంకటరమణయ్య.

"కాంచనమాలనూ, కన్నాంబనూ, ఇంకా ఇతర స్టార్లను కలుసుకుని రానా ? సినిమా భవిష్యత్తు గురించి వాళ్ళేం చెబితే అది అచ్చేద్దాం" అని ప్రకాశం సూచించాడు.

"బాగుంది ఐడియా ?" అన్నాడు వెంకటరమణయ్య.

# 13

"శారద" తొలి ప్రత్యేక సంచిక బాగానే చెల్లుబడి అయింది. దానిపైన పెట్టిన డబ్బంతా రాకపోయినా కూడా అది విజయవంతమయిందనే అనాలి. కాని ఆ విజయాన్ని వెంకటరణమయ్య ఘోర పరాజయంగా మార్చుకున్నాడు. పెద్ద పొరబాటుచేసి, కాపీలు వెళ్ళిన అయిదోరోజునే కొద్ది మంది ఏజెంట్లు మళ్ళీ పాతిక కాపీలు కావాలనీ, ఇరవై కాపీలు కావాలనీ రాయటంచేత ప్రెస్సులో మరొక వెయ్యి కాపీలకు ఆర్డరిచ్చాడు. ప్రెస్సుకు ఊపిరి సలపలేదు. కాపీలు దీపావళి అయిన మర్నాడుగాని బైండుకాలేదు. అనుకున్న ప్రకారం అందరు ఏజెంట్లూ రిసీట్ ఆర్డరివ్వలేదు. లోగడ ఆర్డర్లిచ్చిన ఏజెంట్లు సకాలంలో రాలేదని తెప్పించుకున్న కాపీలన్నీ తిప్పి పంపారు.

ఆఫీసునిండా చేరిన కాపీలకట్టలు చూస్తే ప్రకాశానికి కడుపు తరుక్కుపోయింది. "చిత్తుకాగితాలకింద అమ్మేద్దాం !" అన్నాడు వెంకటరమణయ్య. కాని ఆయనకు కూడా లోపల బాధగానే వున్నదని ఊహించాడు.

ఈ నష్టం ఇంతలో పోలేదు. పత్రిక డిసెంబరు సంచిక ఆలస్యమైంది. కారణాంతరాలచేత ఆలస్యం జరిగిపోయిందనీ, ఇకనుంచీ పత్రికను ఒకటో తేదీ లోపుగానే అందిస్తామనీ "మనవి" చేసుకున్నారు పత్రికవారు.

డిసెంబరు సంచిక అమ్మకం ప్రోత్సాహకరంగా లేదు. ఏజెంట్లు - అంతా కలిసి ఇరవైమంది - రెండు కారణాలు చెప్పారు. ఒకటి, పత్రిక సకాలంలో రాలేదు; రెండు, ఇది సాదా సంచిక కావటంవల్ల కొనేవాళ్ళను ఆకర్షించలేకుండా వున్నది. అట్టమీదబొమ్మ ఆకర్షవంతంగా వుండాలి....

"ఏజెంట్లు చెప్పేమాటలు పట్టించుకోవద్దు. మనకు కావలసింది సేల్స్‌కాదు. పత్రికలో సంస్కృతి ప్రతిబింబించాలి. ఆ ఆదర్శాన్ని మరిచిపోతే మనం అధోగతి పాలవుతాం. పెద్దవాళ్ళు పత్రికను బాగుందనాలి. రెండువందలకాపీలే అమ్మినా నాకు విచారంలేదు" అని వెంకటరమణయ్య పాలసీ స్టేట్మెంటు చేశాడు.

ప్రకాశం ఆత్మపరీక్ష చేసుకుని, "అంతా సంస్కృతి నిండేటట్టుగా పత్రికలు నడపడానికి నేను అర్హుణ్ణేనా ?" అని తననుతాను ప్రశ్నించుకున్నాడు. సంస్కృతి బాధ్యత వెంకటరమణయ్యకు వదిలివెయ్యటం మంచిదనిపించింది.

జనవరి సంచికనుంచీ పత్రిక ఆయిదువందలు అమ్మనారంభించింది. దాన్ని గురించి ఎరిగున్నవాళ్ళు మాట్లాడటం మానేశారు. నెలకు నూరు రూపాయల జీతం తీసుకుని పనిచేసే ప్రకాశం మనసే దానిమీద లగ్నం కావటంలేదు. యుద్ధం ప్రజల రక్తంలోకి ఇంకుతున్నది. కొత్త కొత్త సమస్యలు ఏర్పడుతున్నై.

జనవరిలో ప్రకాశం ఇంటికి వెళ్ళాడు. అతను తల్లిదండ్రులను వెంటబెట్టుకుని తిరిగి వచ్చాడు. దక్షిణామూర్తి స్వగ్రామానికి వీడ్కోలు చెప్పేశాడు. ప్రకాశం ఊరికివెళ్ళి తిరిగి వచ్చే సందులో సినిమావాళ్ళు లాడ్జి మూసేశారు. పిక్చరు పూర్తి అయి ఎవరిదారిని వారు వెళ్ళిపోయినారు.

అందుచేత ఒకనాడు రామకృష్ణ లంచ్‌హోమ్‌లో సోమయాజులు కనిపించే సరికి ప్రకాశం ఆశ్చర్యపడి, "నీవు యింటికి పోలేదా ?" అని అడిగాడు.

"ఇంటిదగ్గరేముందోయ్, బూడిదా? నెల్లూరు రెడ్లు కొందరు డిస్ట్రిబ్యూటింగు కంపెనీ పెట్టారు. అందులో చిన్న ఉద్యోగం సంపాదించాను."

"నువు ఏంచేస్తావేమిటి ?"

"ఏం చెయ్యమంటే అది చేస్తాను."

అటువంటివాడికి ఎవరైనా ఉద్యోగం ఇవ్వవచ్చు ననుకున్నాడు ప్రకాశం.

సోమయాజులు ప్రకాశాన్ని వాళ్ళకంపెనీకి తీసుకువెళ్ళాడు. ప్రకాశం సుందర్రెడ్డిని చూశాడు. అదీ ఇదీ మాట్లాడటంలో సుందర్రెడ్డి సినిమా ఖర్చులు పెరిగి పోవటం గురించి చెబుతూ, "డిస్ట్రిబ్యూషను లక్షలతో కూడిన వ్యాపారంగా తయారవుతున్నది. నేను ఈ పోటీలో ప్రవేశించదలచలేదు. ప్రస్తుతం చిన్న పిక్చరు

నాలుగు తీసుకుని చూస్తాను. డబ్బంతా ఒక పిక్చరుమీద పెట్టి, దేవుడా నీదే భారం అనేకన్న నాలుగురాళ్ళు విసిరితే ఏ ఒకటి తగిలినా చాలు!" అన్నాడు.

ఆయన సినిమా వ్యాపారాన్ని జూదంలాగా చూడటం ప్రకాశానికి ఆశ్చర్యం కలిగించలేదు. వాళ్ళ అంచనాల ప్రకారం జరిగితే ఈ పాటికి పిక్చరు రిలీజై ఉండాలి. కాని అది రిలీజు కాలేదు.

"నన్ను డయిలాగ్స్ రాయటానికి ఆదర్శ కళావాళ్ళు ఒకప్పుడు పిలిచారు. వాళ్ళు పదివేలతో పిక్చరు తీస్తామన్నారు." అన్నాడు ప్రకాశం.

"వాళ్ళు నా దగ్గిరకీ వచ్చారు. ఆ కృష్ణారావు అమాయకుడు, సత్యం పచ్చి దొంగ. కృష్ణారావు తెచ్చేది అయిపోయినాక అతనికి ఉద్వాసన చెప్పి సత్యం ఇంకొకణ్ని పట్టుకునే ఉద్దేశంలో ఉన్నాడు. అది తీసే పిక్చరు కాదులే. కృష్ణారావుతో చెప్పా—ఇంకో డైరెక్టరును తెచ్చుకుంటే చూస్తానన్నా," అన్నాడు సుందర్రెడ్డి.

ప్రకాశానికి సినిమా ప్రపంచంమీదకి గాలి మళ్ళింది. అతనికి ఆఫీసుకు తిరిగి వెళ్ళబుద్ధి పుట్టలేదు. పత్రిక రానురాను దేవుడి పటమల్లే తయారవుతున్నది. అందులో కళకు స్థానం లేదు. దాని పవిత్రత యావత్తూ పూజించే ఆరాధనవల్లా, ధూపదీపాలు సోకటంవల్లా ఏర్పడుతున్నది. "కవిత్రయంవారు ప్రయోగించిన విభక్తి ప్రత్యయాలలో వ్యత్యాసాలు," అన్న ఒక వ్యాసం వచ్చింది. వచ్చినది వచ్చినట్లుగానే ప్రకాశం కంపోజింగు కిచ్చేవాడు. ఎనిమిది పేజీలు నిండేవ్యాసం....ఆడవాళ్ళ ఫీచరు పెడితే బాగుంటుందన్నాడు వెంకటరమణయ్య....పత్రిక ఏ దిక్కుగా పోతున్నదీ ప్రకాశానికి తెలియదు. గాని, అది ఎక్కటం లేదనీ, దిగుతున్నదనీ అతనికి రూఢిగా తెలుసు. వెంకటరమణయ్య తనలో ఉత్సాహం తగ్గినట్టు అనుకుంటున్నాడని తెలిసికూడా అతను ఏమీ చెయ్యలేకపోతున్నాడు. ప్రకాశానికి లేని ఉత్సాహం కనబరిచే శక్తి లేదు.

డిస్ట్రిబ్యూషను ఆఫీసునుంచి సోమయాజులు స్టూడియోకు కారులో పోతున్నాడు. సుందర్రెడ్డి ఏదో పిక్చరు తీసుకునే ఉద్దేశంతో అయినంతవరకు పిక్చరు చూడాలన్నాడు. ప్రొజెక్షను ఎప్పుడు వీలయేదీ తెలుసుకురావాలి.

"నీమాటేమిటి ? నీకేమన్నా పని ఉందా?" అని సోమయాజులు అడిగాడు.

"ఏమీపనిలేదు. నీతోపాటు తిరుగుతాను పదా !" అన్నాడు ప్రకాశం.

ఇద్దరూ కారులో స్టూడియోకు వెళ్ళారు. ఇది కీల్పాక్‌లో ఉన్నది. ఆదివరకు ప్రకాశం చూసిన స్టూడియోకన్న బాగుంది. ఆరుబయట చెట్లమధ్య ఏదో పిక్చరు షూటింగు జరుగుతున్నది. ఇద్దరూ అంత దూరంగా నిలబడి కాస్సేపు చూశారు.

"ఎవరో ఆ అమ్మాయి? ఎక్కడో చూచినట్టుందే?" అన్నాడు ప్రకాశం.

"కమల. మన పిక్చర్లో చిన్నవేషం వేసిందిగా. అన్నట్లు నువు మనిషిని చూడలేదు. మనం వచ్చేటప్పటికి దానిపని పూర్తి అయిపోయింది. నువు రషెస్ చూసివుం

టాపు. మంచి ఆర్టిస్టు, మనవాళ్ళకు ఉపయోగించుకోవటం చాతకాలేదు....ఇంకా మనకేసి చూడలేదు." అన్నాడు సోమయాజులు. అతని మాట వినిపించినట్టుగా కమల సోమయాజులకేసి చూసి నవ్వి చెయ్యి పైకెత్తి వేళ్ళు ఆడించింది.

ప్రకాశం సోమయాజులను చూసి మనస్ఫూర్తిగా అసూయపడ్డాడు.

కమల డైరెక్టరుతో ఏదోచెప్పి సోమయాజులున్న చోటికి పరిగెత్తుకుంటూ వచ్చింది. సినిమాలోచూస్తే అందరిలాగే ఉన్న ఈ కమల తనను దూరంనుంచే ఇంత ఎందుకు ఆకర్షిస్తున్నదీ ప్రకాశానికి అర్థంకాలేదు. ఈ ఆకర్షణ అతనిలో స్పష్టంగా కోరికలనేమీ రేకెత్తించలేదు. అది ఏ విధంగా వ్యక్తమయిందంటే ఆమెను తాను చాలా ఏళ్ళుగా ఎరుగుదునన్న భావం ప్రకాశంలో రేకెత్తించింది. దగ్గిరికి వస్తూనే ఆమె సోమయాజులతోబాటు తననుకూడా పలకరిస్తే ప్రకాశం ఆశ్చర్యపడి ఉండేవాడు కాడు.

అందమైన మొహం, చాలా అందమైన కళ్ళు, కుదిరిక అయిన శరీరం, సన్నని నడుము ఈ కమల నిజంగా మంచి ఆర్టిస్టయితే తారగా పైకి వెళ్ళిపోతుంది. సినిమాలలో భవిష్యత్తు లేకపోతే ఏ జమీందారో చేరదీస్తాడు. ఎట్లాగైనా ఈమె జాతకంలో తనబోటివాడికి స్థానం లేదనుకున్నాడు.

ప్రేమ అనిర్వచనీయం గనకనూ, దానిని కొన్ని కొన్ని చిహ్నాలనుబట్టి మాత్రమే తెలుసుకోదగును కనకనూ, ఒక మనిషి జీవితంలో స్థానం దొరికితే అది తన మహాద్భాగ్యం అని ఇంకొకమనిషి అని భావించటం రెండో మనిషిలో ప్రేమ మొలకెత్తిందనటానికి చిహ్నం గనకనూ, ఆ క్షణంలో ప్రకాశం మనసులో కమల మీద ప్రేమ అంకురించిందని మనం అనుకోవచ్చు. ఈ అంకురం పురుట్లోనే సంధి గొట్టి పోవచ్చు; అది కొంత ఎత్తు పెరిగాక ఎవరో ఒకరు పుణ్యంకట్టుకుని దాన్ని పీకివెయ్యవచ్చు; లేదా ఏ పెనుగాలో విసిరి దాన్ని పెళ్ళున విరిచి పారెయ్యవచ్చు, అంతా పరిస్థితులనుబట్టి ఉంటుంది.

"ఆచారి రాలేదా ?" అన్నాడు సోమయాజులు కమలతో.

"సరే, నేను బయలుదేరేటప్పటికి నిద్రలేవలా, తెల్లవార్లూ చీట్లాడారు. ఈపాటికి రావలిసిందే. వస్తాడులే," అన్నది కమల. ఆమె మాట్లాడినంతసేపూ మధ్య మధ్య ప్రకాశంకేసి చూస్తూనే ఉన్నది. అతను తెలియకపోవటం ఆమెను బాధిస్తున్నది. కమలది చైతన్యవంతమైన మనః ప్రవృత్తి, ఆమెకు ప్రతీదీ కావాలి. తనకు రెండు గజాలదూరంలోకి వచ్చిన ప్రతి మనిషినీ పరిచయమూ చేసుకుంటుంది. ఒకసారి చూసిన ప్రతి మనిషినీ జ్ఞాపకం ఉంచుకుంటుంది.

ఈ సంగతి ప్రకాశానికి తెలియదు. అతను అప్పటిదాకా కమలవంటి మనిషిని చూచి ఉండలేదు. చీటికీ మాటికీ ఆమె తనకేసి చూడటంలో ఏదో అర్థం ఉన్నదనుకున్నాడు.

"ఏమండీ, మన పిక్చరెప్పుడు రిలీజవుతుందీ ?" "ఎప్పుడు రిలీజైతే ఏంలే ? దిక్కుమాలిన పిక్చరు ! కెమెరామాన్ వట్టిచవట. నాకు క్లోజప్పిచ్చాడుగా ఆ దరిద్రుడు, ఈ పిక్చర్లో నా క్లోజప్పులు ముద్దొస్తున్నై !" అన్నది కమల.

"జాగ్రత్త. ఎవరైనా ముద్దు పెట్టేసుకోగలరు ?" అన్నాడు సోమయాజులు.

"క్లోజప్పుల్ని ముద్దు పెట్టుకుంటారా ? పెట్టుకోనీ !" అన్నది కమల.

ప్రకాశం మొహం జేవురించటం కమల చూచి ఉండాలి.

"ఈయనెవరో చెప్పరేం ?" అన్నది సోమయాజులతో.

"ఇతను ప్రకాశం. మన సినిమా లాడ్జిలో దాదాపు రెండు నెల్లున్నాడు. నీవు అటుకేసి వస్తేగా ? ప్రస్తుతం శారద పత్రికకు ఎడిటరుగా ఉన్నాడు. కథలు రాస్తాడు"

కమల కెవ్వున కేకవేసింది. అది సంతోషమని ప్రకాశానికి తరువాత అర్థమయింది. ఆమె అతనికేసి తిరిగి, మీరు మా అన్నని ఎరగరండీ? మీ క్లాస్‌మేట్, రాఘవాచారి !" అన్నది.

రాఘవాచారి ప్రకాశం మనస్సులోకి "స్లోఫేడిన్" అయినాడు. అతను ఇంటర్‌లో ప్రకాశానికి క్లాస్‌మేట్. బియ్యేలో లేడు. బియ్యే చదవనేలేదో, ఇంకో కాలేజీకి వెళ్ళాడో ప్రకాశం ఎరగడు. ఆ రెండేళ్ళ కాలంలో ఒక్కసారి కూడా తాను రాఘవాచారితో మాట్లాడినట్టు ప్రకాశానికి జ్ఞాపకం లేదు.

"అవు నవును. ఇప్పుడతను ఏం చేస్తున్నాడు ?" అని ప్రకాశం కమలను అడిగాడు.

"ఏమీ చెయ్యటంలేదు. పెద్దలు ఆర్జించినది పెట్టుకు తింటున్నాడు. ప్రస్తుతం నాకు గార్డియను పనిచేస్తున్నాడు. నన్ను రమ్మంటున్నారు ! వెళ్ళాలి.... సోమయాజులుగారూ, ఆచారి వస్తాడో రాడో, మీరు కొంచెంసేపు వుంటారుగా ఈ షాట్ కాగానే నేను కూడా వచ్చేస్తాను, మీకు వాహనం ఉందా ?"

"ఏయ్, కొమ్లా?" అని బెంగాలీ కామెరామన్ కేక పెట్టాడు.

కమల పరిగెత్తింది. "ఏం మనిషి?" అనుకున్నాడు ప్రకాశం. లోకానుభవం ఉండి, కమలను బాగా ఎరిగిన వాళ్ళకు కమలలో అంత గొప్ప ఆకర్షణ ఏమీకనబడదు. కాని ప్రస్తుతం ప్రకాశానికి ఈ రెండూలేవు.

మొదటిసంగతి అతను కమలను మేకప్‌మీద చూశాడు. కమల మొహం అందంగానే ఉన్నప్పటికీ మేకప్‌తో చాలా మారిపోయే జాతికి చెందిన మొహం. అదీ కాక అతనికీ కమలకూ మనస్తత్వాలలో ఒక పెద్ద తేడా ఉన్నది. కమల మనస్సుకు వైశాల్యం ఉందిగాని, అందులో ఎక్కడాలోతులు లేవు. ఏవిషయం గురించీ నాలుగు మాటలకు మించి మాట్లాడలేదు, వినలేదు. ఈ సంగతులు ప్రకాశం ఇంకా ఎరగడు.

"నీవు షూటింగు చూస్తూండవోయ్. నేను పైకివెళ్ళి ప్రొజెక్షన్ అరేంజి చేస్తాను." అన్నాడు సోమయాజులు.

ప్రకాశం షూటింగు దగ్గరికివెళ్ళాడు కమల బాగా నటించిందీ, లేనిదీ, ప్రకాశం నిర్ణయించలేక పోయినాడు గాని ఆమె కామెరాముందు చాలా చలాకీగా ఉండటం గమనించాడు. మొత్తం మూడుషాట్లు తీశారు. అన్నింటిలోనూ కమల ఉన్నది. కమల ఎంత ఉత్సాహంగా ఉన్నదో మిగతా టెక్నీషియనులూ అంత ఉత్సాహంగానే ఉన్నారు.

మూడోషాట్ జరుగుతుండగా సోమయాజులు తిరిగి వచ్చాడు "ఎంతలో ఉంది? ఆచారి రాలేదురా?" అని ప్రకాశాన్ని అడిగాడు.

షాట్ అయిపోగావే కమల అందరికీ "టాటా" చెప్పివచ్చి, "మేకప్ తీసుకోవటానికి మూడు నిమిషాలు టైమిస్తారా?"అని అడిగింది. ఆమాట సోమయాజులును అడగకుండా తనను అడిగినందుకు ప్రకాశం త్రిల్ అయిపోయినాడు.

ఆమె పది నిమిషాలకు మేకప్ పోయీపోకుండా తిరిగి వచ్చినప్పుడు ప్రకాశం గుర్తుపట్టలేదు. కాని అతను హతాశుడై పోలేదు. తనలో మొలకెత్తిన భావానికి విధేయత ప్రకటించాడు.

# 14

"ఏరా ఆచారిని చూడకుండా వెళ్ళిపోవటమేటి ? కావలిస్తే సోమయాజులు గారిని వెళ్ళమనండి - ఆయన కెప్పుడూ అర్జంటుపనే ! మీరుండిపొండి."అని కమల ప్రకాశాన్ని కారులోనుంచి దింపి లోపలికి తీసుకుపోయింది. వాళ్ళు గెంపరెడ్డి వీధి సందులో ఒక ఇంట్లో ఉంటున్నారు. ఇంటి ముందు భాగంలో ఉన్న కొద్ది ఖాళీలోనూ పందిరివేసి దానిమీదికి రంగూనుమల్లి పాకించి ఉన్నది.

జానెడుబెత్తెడు వరండాలో ఉన్న కుర్చీ ప్రకాశానికి చూపించి"అన్నయ్యా!" అని కేకపెడుతూ కమల లోపలికి పోయింది.

మరి కాస్సేపటికి ఊడిపోతున్న లుంగీ సరిగా చుట్టుకుంటూ నిద్రకళ్ళతో రాఘవాచారి బయటికివచ్చి, "ఓహో!బహుకాల దర్శనం!" అన్నాడు మత్తుగా.

"ఇదేనా లేవటం? పదకొండున్నర దాటింది?" అన్నాడు ప్రకాశం. రాఘవాచారిని చూస్తే ఆతనిలో ఆప్యాయత పొంగిరాలేదు. మనిషి మారిపోయినాడు. శరీరం స్థూలమయింది. చెంపల పుస్తీలువచ్చినై, హిట్లరు మీసంవెలసింది.

"ఇప్పుడే వస్తాను. బ్రదర్, తెల్లవార్లూ నిద్రలేదు. విశేషాలు మాట్లాడుకుందాం" అంటూ ఆచారి లోపలికి తూలుతూ వెళ్ళాడు.

ఎందుకో ప్రకాశానికి లేచివెళ్ళిపో బుద్ధి అయింది. ఈ రాఘవాచారికీ తనకూ ఉన్న పాత సంబంధం తప్ప కమలతో పరిచయం చేసుకునేటందుకు మరొకమార్గం లేకపోతే - ఉండే అవకాశం లేదు - కమలను ఇక్కడే వదిలెయ్యటం మంచిదనిపించింది. కాని వెళ్ళిపోతే తనను వెర్రివాడను కుంటారు.

ఒక నలభై ఏళ్ళావిడ అకస్మాత్తుగా లోపలినుంచి తొంగిచూచి అంతలోనే మాయమయింది. కమలతల్లి అయిఉండాలి లేదా రాఘవాచారి అత్తగారై ఉండవచ్చు.

"హమ్మయ్య!" అంటూ కమల తిరిగివచ్చి వరండాలో ఉన్న రెండోకుర్చీలో దబాల్న కూలబడింది. ఇప్పుడామె మొహానమేకప్ ఏమీలేదు. మొహం కడుక్కున్నట్లు, పౌడరూ వేసుకున్నది. బొట్టూ, కాటుకా పెట్టుకున్నది. చెవులకు జుంకీలు తగిలించుకున్నది. డ్రెస్సంతా మార్చేసింది. మేకప్ కడిగేసుకుని కారులోవచ్చినప్పటి కన్న చాలా అందంగా ఉన్నది. అయితే ఇప్పటికి కూడా మేకప్‌మీద చూసిన కమల మరొక మనిషి అన్న భావం ప్రకాశం మనస్సులో ఉండనే ఉన్నది.

"మీరు ఎడిట్‌చేసే పత్రిక పేరేమిటన్నారు?" అన్నదామె.

"శారద."

"అందులో సినిమావార్తలు వెయ్యరా! నేనెప్పుడూ చూసినట్టు లేదే?

"మొట్టమొదటి సంచికలో— దీపావళికి కొన్ని ఇంటర్‌వ్యూలు వేశాను అంతే, మళ్ళా ఏమీ వెయ్యలేదు."

"ఒహో అదా? దానిపేరు దీపావళి అని ఎందుకో నా మనస్సులో పడి పోయింది. ఆ సంచిక మా ఇంట్లో ఉండాలి కూడాను."

ప్రకాశం ఆపేలోపల కమల లోపలికి పరిగెత్తింది. ఆమె సంచిక పేజీలు తిప్పుతూ దీపావళి ప్రత్యేక సంచికతో తిరిగి వస్తుంటే. "నాకు చూపించక్కర్లేదు. నేనేదాన్ని తయారు చేశాను!'' అన్నాడు ప్రకాశం.

కమల ఆ మాటకు విరగబడి నవ్వింది. తలుచుకు తలుచుకుని మరీ నవ్వింది. అది అమాయకత్వమో నటనో తెలియక ప్రకాశం కంగారు పడుతున్న సమయంలో "ఏమిటి జోకు?" అంటూ రాఘవాచారి వచ్చాడు.

"అది కాదన్నయ్యా! ఈయన ఎడిట్‌చేసే పత్రిక దీపావళి సంచిక మనింట్లో వున్నట్టు జ్ఞాపకంవచ్చి తీసుకొస్తుంటే, నాకు చూపించనక్కర్లేదు! దాన్ని నేనేగదా ఎడిట్‌చేశానూ అన్నారు!" అంటూ కమల మళ్ళానవ్వింది.

రాఘవాచారికూడా నవ్వి, "బాగా అన్నాడు లేకపోతే నీ ఉద్దేశమేమిటి? సరే గాని, నాకూ ప్రకాశానికీ వేగిరం-ఇక్కడున్నట్టు- రెండు కాపీలుపట్టుకురా ! మంచి తల్లివిగాదూ!" అన్నాడు.

"నీకు సేవచేస్తే మంచితల్లి, లేకపోతే చెడ్డతల్లినూ! నువ్వెప్పుడూ ఇంతే!" అంటూ కమల లోపలికి వెళ్ళింది.

ఆ పిల్ల గడప దాటిందో లేదో రాఘవాచారి కోతలు ఆరంభించాడు.

"కమలమ్మ సినిమాల్లోకి రావటం భలేచిత్రమైనకథ. ఎప్పుడన్నా తాపీగా చెప్పాలి. ఫిఫ్తుఫారం చదువుతున్నది. ఇంకో నెల్లాళ్ళకు పరీక్షలనగా వచ్చి కూచు న్నారు. ఈ నెలా ఆగండి బాబూ అంటే విన్నారుకారు. ఈ పట్నంలో అమ్మా

తనూ ఎలా ఉంటారూ! చేస్తూ, చేస్తూన్న, ఉద్యోగం మానుకుని నేనూ బయలు దేరాను. ఏం చెయ్యటం ! వాళ్ళుమనకు డబ్బా అదీ బాగానే ఇచ్చారనుకో. కాని మనం డబ్బుకోసం వచ్చామా? నేను చెబుతూంటానే-మనం లక్షాధికారులం కాబోయేది లేదు. భిక్షాధికారులం కాకుండా భగవంతుడు కనిపెట్టే ఉన్నాడు. ఒకపూట పర మాన్నం చేసుకున్నా, ఇంకోపూట పచ్చడి మెతుకులైనా తినేస్తాంగాని పస్తుపడు కోము! మనలాటివాళ్ళ బతుకులకు నిజమైన ఆధారమేమిటంటే పరువు. ఎంత దూరం కొట్టు కొచ్చినా, ఈ కీర్తిగడించినా పరువుతోనే తప్ప మనం డబ్బుతోనూ హోదాతోనూ కీర్తికొనబోం. చేతిలో ఏదైనా ఒక కళ ఉన్నప్పటికీ అదికూడా పరువుచేతనే రాణించాలి. నిజం చెప్పాలంటే కమలమ్మ వేసిన మొదటి వేషం నాకు కొంచెం కూడా నచ్చలేదు. అయితే నేం? వాళ్ళు చాలా మర్యాదస్తులు. కమ లమ్మ ఇవాళ కాకపోతే రేపు స్టారవుతుంది. కాని మంచి పేరు తెచ్చుకోవటం ముఖ్యం. వాళ్ళు మనకిచ్చిన డబ్బు ఏనాడో అయిపోయింది. కాని వాళ్ళు మనకు చూపిన మర్యాద కలకాలం ఉంటుంది...."

రాఘవాచారి తనతో ఇదంతా ఎందుకు చెబుతున్నాడో ప్రకాశానికి ముందు అర్థం కాలేదు. అయినా సమయోజితంగా, 'అవునవును' అంటూ వచ్చాడు. తాను సినిమాల వాళ్ళంటే తక్కువగా చూసే రకమేమో అనుకుని అతను చెబుతూండ వచ్చునని తరువాత ప్రకాశానికి తట్టింది.

ఆ అపోహ పోగొట్టటానికై అతను తాను పూటన్నరపాటు చేసిన సినిమా ఉద్యోగం గురించి చెప్పాడు.

"నువు కథలు రాస్తున్నావా? నాకు తెలీదే?" అన్నాడు రాఘవాచారి.

"బియ్యే చదివే రోజుల్లోనే ప్రారంభించాను. మనం పెద్దపొడిచేస్తామని కాదు. సంభాషణలు రాయటానికి ఒక మనిషిని పెట్టుకోవటమేమిటి? వాడికి ఏం రాయాలో చెప్పడమేమిటి? రెంటిలో ఏదో ఒకటి తెలివి తక్కువపని అయి ఉండాలిగా!" అన్నాడు ప్రకాశం.

కమల కాఫీ తెచ్చింది. కాఫీ దివ్యంగావుంది. కాఫీ తాగేసి "చాలా సంతోషం తలవని తలంపుగా మనం కలుసుకున్నాం. నేనికవెళ్ళాలి. ఇవాళ ఇంతవరకూఆఫీసు మొహం చూడలేదు. పొద్దున్నే బయలుదేరాను. నాకు వీలైనప్పుడు వస్తాను. మీరు కూడా ఖాళీ వున్నప్పుడు మా ఆఫీసుకు రావాలి. తోచకపోతే కబుర్లయినా చెప్పుకో వచ్చు." అన్నాడు ప్రకాశం.

"మీ పత్రిక సంచికలన్నీ కావాలండీ, చదువుకుందామంటే ఏమీలేదు."అన్నది కమల.

"పీటిని! మీ ఇంటికి ఏదోవిధంగా చేరుస్తాను." అని ప్రకాశం వాగ్దానం చేసాడు.

# 15

కమలలో తనకు కనిపించిన ఆకర్షణను సరిగా అంచనా కట్టటానికి ప్రకాశం ప్రయత్నించాడు. ఒక యువకుడికి అందమైన ఆడపిల్లపైన మనసు పోవటానికి అతిసహజమైన కారణం కామవాంఛ. అయితే కామదేవత సాకారకాదు, నిరాకార. అవ్యక్తంగాను ప్రకాశం మనసులో అనుక్షణమూ స్త్రీ వాంఛ ఉంటూనే ఉన్నది. రోజూకనిపించే ఆడవారిలో ఒక వంతు అతన్ని ఈ ద్వారా ఆకర్షిస్తూనే ఉన్నారు. కమల తనలో రేకెత్తించిన కామవాంఛ కన్న ఉన్నతమైనదేనని ప్రకాశం రూఢి చేసుకున్నాడు. కమలను జ్ఞాపకం తెచ్చుకుంటేనే ఒక తృప్తి ఉన్నది. మాట్లాడితే మాట్లాడినంతవరకే తృప్తి. కమలకూడా తనజీవితంలోకి ఏదో అవ్యక్తమైన సౌరభాన్ని తెచ్చింది.

ఇది ప్రేమ అనిపించుకుంటుందా ? ఈ ప్రశ్నకు సరి అయిన సమాధానం దొరకలేదు. ప్రేమను గురించి ప్రకాశం భావాలు వెనక ఉండినంత ఆదర్శ ప్రాయంగాలేవు. జీవితంలో ప్రేమవుంటే ఇంకేమీ అవసరంలేదనీ, అదే సమస్త జీవిత సమస్యలనూ పరిష్కరిస్తుందనీ, అది జీవితానికి ప్రాబ్లమ్ నంబర్ వన్ అని అతను అనుకోవటంలేదు. కాని ప్రేమ ఇప్పటికీ అతని దృష్టిలో జీవితావసరాలలో ఒకటి.

"నువు కమలతో జీవితాంతంవరకూ తృప్తిగా జీవిస్తావా ?" అని అడిగితే "జీవిస్తాను." అని అతను సమాధానం చెప్పటానికి సిద్ధంగా ఉన్నాడు. ప్రేమను కొలవటానికి ఆ ప్రశ్నా, ఆ సమాధానమూ సరిపోతాయా ? అదేతెలియలేదు. కొంతమంది భర్తలైనా తమ భార్యలతో అంతో ఇంతో తృప్తిగా జీవిస్తున్నారు. వారందరి జీవితాలలోనూ ప్రేమ ఉన్నదని అతనికి నమ్మకం కలగలేదు.

అతను ఇంకొకటికూడా చేశాడు. కమలను రజనితో పోల్చిచూశాడు. వెంటనే కమల ఓడిపోయింది. రజని తన మనసును అర్థంచేసుకో గలిగింది. ఆమె మనసు లోతైనది. అటువంటి మనిషి ఎవరినైనా ప్రేమిస్తే, ఆ ప్రేమకోసం ఎంతో త్యాగం చెయ్యగలదు—అని కనీసం ప్రకాశం దృఢనమ్మకం. అటువంటి నమ్మకం కమలను గురించి అతనికి కలగలేదు. కమలకు జీవితంలో అన్నిరకాల ఆనందాలూ కావాలి. ఏ పరిస్థితితోనూ ఆత్మార్పణ చేసుకోదు !

అందులో తప్పేమిటి ? వాస్తవ జీవితంలో ప్రేమ అట్లాగే ఉండాలి. తనను తాను ప్రేమించు కోవటంద్వారానే ఇతరులను ప్రేమించగలగాలి. ప్రేమ ఒక తపస్సులాగా ఎందుకుండాలి ? అది ఒక విందులాటిది ఎందుకు కాకూడదూ? అసలు ప్రేమకు దిక్కుమాలిన పరిక్షలేమిటీ ? ఒక్క ప్రేమకేకాదు—మనిషికి ఏ విషమ పరీక్షలు ఉండరాదు. జీవితంలో ఏదో వంకర ఉంటేనే విషమ పరీక్షలు ఏర్పడుతై. "నీకు

నాకు జోడుఅయితే మల్లెపూల తెప్పగట్టి తెప్పమీద తేలిపోదాం" అన్నది ప్రేమయొక్క సహజ వైఖరి.

ఈదృష్టితో చూస్తే కమలను తాను ప్రేమిస్తున్నట్టూ, తన ప్రేమకు ఆమె పాత్రురాలైనట్టూ ప్రకాశానికి నమ్మకం కుదిరింది....

అతను దాదాపు రోజూ సాయంకాలంవేళ కమల వాళ్ళ ఇంటికి వెళ్ళి వస్తున్నాడు. రాఘవాచారిని చూసి అసహ్యపడకుండా ఉండటం కష్టపడి అభ్యసించాడు. అతనంటే తనకు ఎందుకు సరిపడటంలేదో కూడా ప్రకాశానికి అర్థం కాలేదు. తాను ఇచ్చిన సంచికలలో తన కథలను గురించి కమల ఏమీ మాట్లాడలేదు. రాఘవాచారే అతని రచనను మెచ్చుకున్నాడు. తామిద్దరూ ఒకప్పుడు కలిసి చదువుకున్నందుకు అతనే గర్వపడ్డాడు!

అయినా రాఘవాచారి ఇంట్లో లేకుండా మాట్లాడటానికి కమలా, ఆమె తల్లీ ఉంటే ప్రకాశానికి మరింత సంతోషంగా ఉండేది. మరేలేదు, రాఘవాచారి ఉంటే మాట్లాడే ఆస్కారంలేదు; చెప్పిందే చెబుతూ గంటల తరబడి మాట్లాడేవాడు. తల్లి అట్లా కాదు. సాధారణంగా నోరు విప్పేదికాదు. మధ్య మధ్య ఇంటిపనులు చేసుకొనటానికి లోపలికిపోతూ వస్తూ ఉండేది.

కమలను తనకేసి తిప్పుకొనటానికి ప్రకాశం నిశ్చయించుకున్నాడు. ఆమెతో అవకాశం దొరికినప్పుడు ఏం మాట్లాడాలో ముందుగా రిహార్స్ చేసుకున్నాడు. (రజనితో ఇట్లా మాట్లాడాలని ఎన్నడూ రిహార్సు చేయటానికి ప్రయత్నించి కూడా ఎరగడు!)

మొదటిసారి రంగూను మల్లిపందిరికింద ఇద్దరూ ఒంటరిగా కూచునే అవకాశం దొరకగానే ప్రకాశం సంభాషణలో చిన్న నాగాపడనిచ్చి, "నే నేమవుతున్నానో నాకే అర్థంకావటంలేదు" అన్నాడు.

"ఏం?" అన్నది కమల.

ప్రకాశం ఆమెకేసి భావగర్భితంగా చూశాడు. కమల అర్థంచేసుకున్నట్టు కనబడినా, "ఏం జరిగిందేమిటి? మీ ఉద్యోగమా!" అన్నది.

ప్రకాశం తనకు చాతనయినంత దీనంగా నవ్వి, "నా ఉద్యోగానికేం తెగులూ? రావలసిందేదో నాకే వచ్చింది." అన్నాడు.

"అదేమిటో చెప్పక చంపేస్తున్నారు?" అన్నది కమల.

"నేను ఎవర్ని గురించి ఈ విధంగా అహోరాత్రాలు ఆలోచిస్తాననుకోలేదు!" రాత్రింబగళ్ళు అనేకన్న అహోరాత్రాలు అంటేనే బాగుంటుందనిపించింది.

"ఎవరిని గురించైనా ఆలోచిస్తున్నారా?" అన్నది కమల అయోమయంగా.

"ఇంకెవర్ని గురించో ఆలోచిస్తే నీతో ఎందుకు అనటం?" ఏదో తట్టినవాడల్లే అయిపోయి, "చూడు, కమలా! నువ్వింక చిన్నదానివి, అయినా పెద్దదానివి అవుతున్నావు. ఎవరన్నా నిన్ను గురించి ఆ స్తమానం కలలుకంటుంటే నేను తెలుసుకునే

పొక్కన్నది. తెలుసుకోవటము కాదు. అది కలకాలం జ్ఞాపకం ఉంచుకోదగిన సంగతి కూడాను.... ఎందుకంటే ఎదురుగా ఉన్నంతసేపు నీకన్నా ప్రపంచములో ఇంకో ఆడదే లేదని పోజుపెట్టే వాళ్ళుంటారు. నీకేసి ఆకలిగా చూసే వాళ్ళుంటారు, నిన్ను ప్రేమించామని చెప్పుకునే వాళ్ళుంటారు. కాని నువు ఎదట లేనప్పుడుకూడా నిన్ను మరిచిపోయేశక్తిలేక ఇంకేపని చెయ్యటానికీ మనస్సుపోక బాధపడేవాళ్ళు బహు తక్కువమంది ఉంటారు. వాళ్ళందరూ నాలాగే ఆ సంగతి నీతో చెబుతారను కుంటాను. వాళ్ళ కన్ఫెషన్లు విని నువు నిజంగా గర్వపడవచ్చు. ఇది నిజజీవితంలో మొదటి విజయమేమో! నా జీవితానికి మాత్రం ఇటువంటి అనుభవం ఎన్నడూ కలగలేదు" అన్నాడు.

అతని ప్రసంగం ఇంచుమించు రిహార్సు చేసుకున్నట్టే నడిచింది. ఆఖరున చెప్పిన అబద్ధం తప్ప మిగిలినదంతా చిత్తశుద్ధిగా చెప్పినదేనని ప్రకాశం నమ్మాడు.

కమల అతని మాటలకు అడ్డురాలేదు. ఒక్క క్షణంపాటు ఆమె కళ్ళలో అమాయకత్వం మాయమై లోతైన చూపుకూడా వచ్చింది. కాని చివరకు ఆమె "మీరేం చెబుతున్నారో నాకు కొంచెం కూడా అర్థం కాలేదు" అన్నది.

ప్రకాశం మరొకసారి విషాదంగా నవ్వి నిట్టూర్చి, "అదృష్టవంతురాలివి! మానసిక బాధలుండనివాళ్ళకే అవి అర్థం కావు! మానసిక బాధలులేకపోవటం అదృష్టం కాదా మరి!" అన్నాడు.

"ఎవరూ బాధపడగూడదు. నేను బాధపడను. ఇంకొకరు బాధపడుతుంటే నాకిష్టం ఉండదు" అన్నది కమల.

"నేనూ అటువంటి ఉద్దేశంగలవాణ్ణే. ఎంతో తప్పనిసరి అయితేతప్ప నేను బాధపడను" అన్నాడు ప్రకాశం. సంభాషణ అతను రిహార్సు చేసిన బాటలో నడవటం మానేసింది. అసలు విషయంపోయి బాధ మిగిలేలాగుంది. చౌకబారు నాటకకర్తలు ఒక్కమాటను ఆధారం చేసుకుని ఆరేడు డయిలాగ్సు రాయిస్తారు. ఆ నాటకాల డయిలాగ్‌లాగా తయారయేటట్టు కనిపించింది ఈ సంభాషణ.

అదృష్టవశాత్తూ కమల తల్లి లోపలినుంచి వచ్చి అంతదూరాన కూచుంది. తరువాత కమల ఆరోజు ఉదయం జరిగిన షూటింగు వివరాలు వర్ణించి చాలాసేపు చెప్పింది. చివరకామె, "నాకు ఆకలి వేస్తున్నదమ్మా! ఏమండీ మీరుకూడా భోంచేస్తారా!" అన్నది.

"లేదు మా అమ్మ ఊరుకోదు!" అంటూ ప్రకాశం లేచాడు.

కమల అతన్ని వాకిలిదాకా సాగనంపుతూ, "మళ్ళీ ఎప్పుడు వస్తున్నారు?" అని అడిగింది.

"నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడూ!" అన్నాడు ప్రకాశం.

"అబ్బో! అంతా నామాట ప్రకారం నడుచుకునేట్టు! నాకు తోడుగా

భోంచెయ్యమంటే చేశారుకాబోలు. ఈ మోసాలు నాదగ్గిర పారవండీ !" అన్నది కమల.

సందు కాళీగా ఉండటం చూసి గడపలో నిలబడి ఉన్న కమల బుగ్గలు నిమిరి "వస్తా !" అన్నాడు ప్రకాశం.

"అందుకే నాక్కోపం ఎచ్చేది ! రేపు తప్పకుండా రండి !" అన్నది కమల ఇంకొక్క అడుగు బయటికివేసి, వెళ్ళిపోతున్న ప్రకాశాన్ని చూస్తూ.

మర్నాడు అతను వచ్చినప్పుడు కమల ఎప్పటిలాగే ప్రవర్తించింది. ప్రకాశానికి ఆ ప్రవర్తన అసహజంగా కనిపించింది. న్యూటన్‌గతి సూత్రాలు[1] మనుషులకు కూడా వర్తించి తీరాలని అతని నమ్మకం. అతను తన ప్రేమను కమలపైన పంపకం చేసిన తరువాత ఆమె తనకు దగ్గిరగానన్నా రావాలి, దూరమన్నా పోవాలి; వెనక ఉండిన దూరంలో ఎట్లా ఉంటుంది. దూరంపోయిన మనిషి పూర్వమంత దూరంలోనే ఉన్నట్టు నటించటం సాధ్యంకాదు. కాని దగ్గిరికివచ్చిన మనిషి రానట్టు నటించటం తేలిక.

కమల తన ప్రేమను స్వీకరించిందని ప్రకాశం రూఢి చేసుకున్నాడు.

తన ప్రేమను మరొక్క అడుగు ముందుకు వేయించే అవకాశం ఒక వారానికిగాని అతనికి దొరకలేదు. ఆరోజు అతను చీకటిపడే వేళకు వచ్చాడు. (మరీ ఆరింటికే చీకటిపడే శీతాకాలపు రోజులు) బయటి తలుపు దగ్గరగావేసి ఉంది తోసుకుని లోపలికి వెళితే ఎవరూలేరు.

ప్రకాశం హతాశుడై వెళ్ళిపోదా మనుకుంటూండగా కమల గొంతు వినిపించింది. "వస్తానక్కా, ఎవరో వచ్చారు!"

ఇంకో అరనిమిషంలో కమల వచ్చింది. ఆమె ఇంట్లో పనికి వెళ్ళుతుంటే ప్రకాశం కూడా వెంటవెళ్ళాడు. కమల స్విచ్ వెయ్యబోతుండగా ఆమె చెయ్యిపట్టుకుని, "లైటువెయ్యకు!" అంటూ బలవంతాన ఆమెను తనకేసి తిప్పుకొని దగ్గరికి లాగుకోవటానికి యత్నించాడు.

"అలా చేస్తే నాక్కోపంవస్తుంది సుమండీ!" అంటూ కమల అతిసులువుగా అతనిచేతులు దులిపేసి స్విచ్ వేసింది. నిజానికి ప్రకాశం చేతుల్లోగాని శరీరంలో గాని అరఔన్సు శక్తి లేదు.

కమలను గురించి పొరపడ్డాననుకోవటం ఒక వంకా, ఆమెమీద తను పేర్చుకున్న ప్రేమ ఏం కావాలన్న సమస్య ఇంకొకవంకా అతని శరీర శక్తిని హరించేశాయి.

---

1. న్యూటన్ గతి సూత్రాలు : ఇంగ్లీషు గణిత శాస్త్రజ్ఞుడు సర్ ఐజాక్ న్యూటన్ (1643-1727) ప్రతిపాదించిన గతి సూత్రాలు.

"నేనంటే నీకు కొంచెంకూడా ఇష్టంలేదన్నమాట!" అన్నాడతను తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుగా.

"అన్యాయం! అలా అనకండి!" అన్నది కమల.

ప్రకాశం గుండె రైల్లాగా నడుస్తున్నది. కమలలో కొంచెంకూడా సంచలనం లేదు. విచిత్రం!

"నేను వెళ్ళిపోతాను, అన్నాడు ప్రకాశం.

"అదేమిటి? అమ్మ ఇప్పుడేవస్తుంది. అన్నయ్యకూడా రావచ్చు. ఇప్పుడేగద వచ్చారు?" అన్నది కమల.

కమల ప్రవర్తనకు ఒకటే అర్థం ఉండాలి; ఆమెకు ప్రపంచజ్ఞానంలేదు. శరీరంలో వచ్చిన పరిపాకం మనసులో రాలేదు. అటువంటి మనిషిని తాను ప్రేమించడమేమిటి? దారుణం!

ఇద్దరూ వరండాలో చాలాసేపు కూచున్నారు. ప్రకాశం దాదాపు ఏమీ మాట్లాడలేదు. వసపోసిన పిట్టలాగా కమల ఏమేమిటో చెప్పుకు పోతున్నది. తన కింకో సినిమా ఛాన్సు వస్తున్నదట. ఆ సినిమా కంపెనీ గురించీ, డైరెక్టరు గురించీ ఎంతో ఉత్సాహంగా మాట్లాడింది. రాఘవాచారిలాగే కమలకూడా విడవకుండా మాట్లాడగలదని ప్రకాశం ఇప్పుడే కనిపెట్టాడు.

కాస్సేపటికి కమల తల్లి వచ్చింది. దాదాపు ఆమె వెనకనే రాఘవాచారికూడా వచ్చాడు.

రాఘవాచారి చెప్పే సొద ఒక గంటసేపు విని ప్రకాశం శలవు పుచ్చుకుని ఇంటికి వెళ్ళాడు.

# 16

పత్రికాఫీసులో ఏవో కనపడని మార్పులు జరుగుతున్నై. పైకికనపడే మార్పు నారాయణ అనే మేనేజరు ఏర్పడటం మాత్రమే. నారాయణ ఏవో లెక్కలు చూస్తున్నాడు. లెక్కలు వేస్తున్నాడు. వెంకటరమణయ్యతో గంటల తరబడి ఏమిటో చర్చిస్తున్నాడు. అదంతా ప్రకాశం పట్టించుకోలేదు. అతని జీతం నూటయాభై అని తెలిసినప్పుడుకూడా అతనికి క్షణికంగా ఆశ్చర్యం కలిగింది. గాని అది అతన్ని ఎంతోసేపు వేధించలేదు. తనకన్న అతను పత్రికకు ఎక్కువ ముఖ్యం. ఎందుకు కాకూడదు ? నిజానికి పత్రిక విషయంలో ఇప్పుడు తను తీసుకునే శ్రద్ధకు నెలకు ఇరవైరూపాయల జీతమిచ్చినా తప్పులేదు.

ఒకరోజు నారాయణ వచ్చి ప్రకాశం బల్లకు ఎదురుగా కూచుని, "ఇది మన పత్రికలో అచ్చువేస్తున్నాం" అంటూ ఒక కాగితం చేతికిచ్చాడు.

అది ఒక పజిలు. పజిలు గెలిచిన వాళ్ళకు వెయ్యిరూపాయలు బహుమానం. ఇందులో మొదటి బహుమానం 750 రూపాయలు. అది కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి. ఒక తప్పుకు 200 రూపాయలు. రెండు తప్పులవాళ్ళకు 50 రూపాయలు. ఒకరు కంటె ఎక్కువమంది ఏ బహుమానానికైనా అర్హులు కావటం జరిగితే ఆ బహుమతి మొత్తం అందరికి సమంగా పంచబడుతుంది. ప్రవేశ రుసుము నాలుగేసి అణాలు. మొదటి కూపను పత్రికలోదిగా ఉండాలి. మిగిలిన కూపన్లు చేత్తో తాసినవి కావచ్చు. ఎన్ని కూపన్లు పంపినా కూపనుకు 4 అణాలు పంపాలి.

ప్రకాశం నిర్ఘాంతపోయినాడు. "ఇది వెంకటరమణయ్యగారితో చెప్పారా ?" అని నారాయణను అడిగాడు.

"మీకు తెలీదు గామాలు. నెలరోజులనుంచీ మేం దీని విషయమే చర్చిస్తున్నాం!" అన్నాడు నారాయణ.

పజిలుతో పత్రిక అమ్మకం పెరగసాగింది. గడువులోపల పాఠకులు కూపన్లతోపాటు అయిదువందల రూపాయలు పంపారు. పంపినవారి సంఖ్య అయిదు వందలకు కొంచెం పైగా ఉంది.

"వెయ్యిరూపాయల బహుమానం ఎట్లా ఇస్తాం ?" అన్నాడు ప్రకాశం. కలిగిన నష్టానికి నిజంగానే దిగులుపడుతూ.

"తరువాత తరువాత నష్టం పూడుతుంది. నేను ఈపాటికూడా వస్తుందనుకోలేదు."

నారాయణ చేసిన యుక్తి తరవాతగాని ప్రకాశానికి అర్థంకాలేదు. పజిల్ సొల్యూషన్లు పంపిన అతను ఒక ఫ్రీ కూపను పంపిస్తూ, మీకు రెండు తప్పులు వచ్చాయి. అందుచేత రెండు తప్పులవారి బహుమానం మొత్తం పంచగా మీ వంతు నాలుగణాలు వచ్చింది. దానికి బదులు రెండవ పజిలుకు ఫ్రీ కూపను ఒకటి పంపుతున్నాం. ఈసారి అయినా మీరు ఆల్‌కరెక్టు సొల్యూషన్ పంపించ గలరని ఆశిస్తున్నాం" అంటూ ఒక సర్క్యులర్ పంపాడు.

ఎంత సులువైన పద్ధతి ! కరెక్టు సొల్యూషను ఏమిటని ఎవడూ అడగడు. మిగిలిన వాళ్ళకు బహుమానాలు ఎంతెంత వచ్చిందీ ఎవడికీ పట్టదు. రుచిమరిగి అది వరకు నాలుగు సొల్యూషన్లు పంపినవారు ఈ సారి ఎనిమిది సొల్యూషన్లు పంపుతారు! . .వెంకటరమణయ్య ఇక్కడికి దిగజారాడన్నమాట.

ప్రకాశం తన తండ్రితో "నాన్నా ! నాకీ ఉద్యోగం బాగాలేదు. ఇంకేదైనా చూడనా?" అన్నాడు.

దక్షిణామూర్తి విషయమంతా తెలుసుకుని "వాళ్ళు ఎట్లా ఏడిస్తే మనకేం పోయింది ? ఇంకో ఉద్యోగం కోసం కావలిస్తే చూస్తూవుండు. అది వచ్చినాక దీన్ని వదిలెయ్యొచ్చు" అన్నాడు.

ఒకరోజు రాఘవాచారి ఆఫీసుకు వచ్చాడు.

"ఏమిటిది బ్రదర్ ! నీవు రెండు నెల్లయినా మా యింటికేసి రావటం మానే శావు ? మామీద కోపం వచ్చిందా ?" అన్నాడు.

"లేదు. మాఆఫీసులో పని అంతా గొడవలోపడింది." అని ప్రకాశం బొంకాడు.

"ఒకవేళ కమలమ్మ ఏదైనా అవక తవకపని చేసిందేమో అనుకున్నాను!" అన్నాడు రాఘవాచారి.

ప్రకాశం ఈ అన్యాయాన్ని భరించలేక "అవక తవక జరిగింది నావల్ల. కమల బొత్తిగా లోకజ్ఞానం లేనిదని తెలియక నేను నా ప్రేమను వెళ్ళబోసుకున్నాను. పాపం కమల ఏతప్పూ చెయ్యలేదు. నాకే రావటానికి మొహం చెల్లలేదు" అన్నాడు.

రాఘవాచారి ఏదో అనబోయినవాడల్లా నోరు తెరచి మళ్ళా మూసుకున్నాడు.

ప్రకాశానికి ఆత్మ సమర్థన అవసరమని తోచింది. "నాకు లవ్ మేరేజీలో నమ్మకం ఉన్నది. కమల నన్ను లవ్‌చేస్తే పెళ్ళాడే ఉద్దేశంతోనే నామనసు బయట పెట్టాను. నాలో దురుద్దేశం ఏమీలేదు—మనస్ఫూర్తిగా చెబుతున్నాను !" అన్నా డతను.

రాఘవాచారి కొద్దిగా నవ్వి "నీకు దురుద్దేశం ఉందని నేను అనుకోవటంలేదు. కమలమ్మకూడా అనుకున్నదనుకోను. నిన్ను గురించి ఎప్పటిలాగే మాట్లాడుతుంది. నన్ను బాధిస్తుంది. నువు కమలమ్మను లవ్ చెయ్యటం కాదు. కమలమ్మ ఈ సంగతి నాకెందుకు చెప్పలేదని. ఇవాళ కాకపోతే రేపైనా పెళ్ళి చేసు కోవలసిన మనిషేనా ? నీ కంటె మంచి మొగుడెక్కడ దొరుకుతాడు ? నిన్ను పెళ్ళాడినా సినిమాల్లో వేషాలు వెయ్యడానికి అభ్యంతరం చెప్పవు. ఇంకొకడు వచ్చి సినిమాల్లో వేషాలు వెయ్యరాదంటే చేసేదేమైనా ఉందా ? కమలమ్మకు ప్రపంచజ్ఞానం లేనిమాట కొంతవరకు నిజం కావచ్చు. కాని ఇన్నాళ్ళబట్టీ ఎరిగినవాడిని, నువు తనను పెళ్ళాడే ఉద్దేశంతో ఉన్నావంటే ఆపాటి అర్థం చేసుకోలేని బొట్టికాయా ? ఉండు, నేనీరాత్రి ఈ విషయం తేల్చేస్తాను. నువు కమలను పెళ్ళాడతానంటే నేను ఎంతో సంతోషిస్తాను సుమా!" అన్నాడు.

తనమీద రాఘవాచారికి అంత ఘనమైన అభిప్రాయం ఉందని తెలిసి తాను అతన్ని చూసి అసహ్యించు కున్నందుకు ప్రకాశం చాలా పశ్చాత్తాప పడ్డాడు.

"మనం ఒక టీమ్‌గా కలిసి ఒక పిక్చరు తీయాలనికూడా నాకు ఆలోచన ఉన్నది. మీ ఫ్రెండు సోమయాజులు లేడూ ? అతను చూచాయగా ఒక కొత్త ప్రొడ్యూసరు రాబోతున్నట్టూ, అతనికి తాను డిస్ట్రిబ్యూషన్ ఏర్పాటు చేసేట్టూ చెప్పాడు. ఇప్పడున్న పరిస్థితిలో కమలమ్మకు ఎవరూ హీరోయిన్ ఛాన్సివ్వరు. నటనా విషయం పేచీలేదు—మరీ చిన్నపిల్ల అని. పాతికేళ్ళు దాటితేగాని సినిమా లలో పదహారేళ్ళ బాల కుమార్తె వేషానికి పనికిరాదు. నీకు తెలుసుగా ? చెయ్యి తిరిగిన రాతగాడివి నువు, కమలమ్మకు పనికివచ్చే కథ అల్లుతావు. అందరమూ కలిసి మంచి పిక్చరు తీద్దామని నేను కలలు కంటున్నాను" అన్నాడు రాఘవాచారి.

ఈ మాటలేమీ ప్రకాశాన్ని ఉత్తేజపరచలేదు. కమలను గురించి అతనికి బాగా తెలుసునా అన్న సందేహం కూడా ప్రకాశానికి కలిగింది.

రాఘవాచారి లేస్తూ "ఏమైనా రేపు సాయంకాలం రావాలి. కమల పుట్టినరోజు. మరీ ఆలస్యంగారాక నాలుగింటికల్లా వచ్చెయ్యి. నువు వచ్చేలోపుగా కమల సంగతంతా కనుక్కొని ఉంచుతానులే!" అన్నాడు.

రాఘవాచారివల్ల అయేదేమీలేదు. ఒకవేళ అతను తనను మొగుడుగా గట్టిగా రికమెండ్‌చేస్తే కమల తనను పెళ్ళాడడానికి ఒప్పుకుంటుందేమో! కాని ప్రకాశానికి కావలసింది అదికాదు. కమల తనను ప్రేమించకపోతే ఆమెను కట్నంతో సహా ఇచ్చినా తనకు అక్కర్లేదు. ఆ సంగతి రాఘవాచారికి తెలియజెప్పటం ఎట్లాగో ప్రకాశం ఊహించలేక పోయినాడు.

అయినా మర్నాడు మూడున్నరకే బయలుదేరి అతను దారిలో ఒక సెంటు బుడ్డీ కొనుక్కొని ఎగ్మూరుకు వెళ్ళాడు.

ఇంకా ఎవరూ రాలేదు. కమల అలంకరించుకుని ఉన్నది. రాఘవాచారి డ్రెస్ చేసుకుంటున్నాడు.

కమల అతనిచ్చిన సెంటుబుడ్డీ ఎంతో ఆనందంతో తీసుకుని మామూలు ధోరణిలోనే ఉత్సాహంగా మాట్లాడింది. ఆమె రోజూ వచ్చే మనిషితో మాట్లాడినట్టే మాట్లాడింది. దాదాపు ఏడువారాలపాటు కనిపించనివాడితో మాట్లాడినట్టు మాట్లాడలేదు. ఇంతకాలం ఎందుకు రాలేదని అడగలేదు; తనకు ఆగ్రహం వచ్చినట్టు ప్రవర్తించలేదు. ప్రకాశానికే ఆగ్రహం వచ్చిందేమో తెలుసుకోవటానికి ప్రయత్నించనూ లేదు.

న్యూటన్ గతినియమాలు మళ్ళీ గతులు తప్పినై!

రాఘవాచారి డ్రెస్ చేసుకుని మొహంనిండా పౌడరు కొట్టుకుని ఇవతలికి వచ్చాడు. అతను తనతో ఏదో చాలా మాట్లాడతాడనుకున్నాడు ప్రకాశం. కాని రాఘవాచారి నిన్నటి విషయం ఒక్క ముక్కకూడా మాట్లాడలేదు. తన సమస్యను అతను పరిష్కరించలేదని ముందు పూర్తిగా తెలిసినవాడై ఉండికూడా ప్రకాశం అతని మౌనంచూసి హతాశుడై పోయినాడు. ఆశలు అవ్యక్తంలో మొలుస్తై; వాటికి బుద్ధితో ఏమీ ప్రమేయం లేదు.

ప్రకాశం కేవలం నిరాశచెంది ఊరుకోలేదు. రాఘవాచారిపైన అదివరకుండిన దురభిప్రాయాన్ని మనస్సులో పునః ప్రతిష్ఠకూడా చేసుకున్నాడు. రాఘవాచారి వట్టి కోతలరాయుడు. వదరుబోతు. అతను కమలతో మాట్లాడటానికి భయపడి అయినా ఉండాలి. మాట్లాడి ఆమెను పెళ్ళికి ఒప్పించలేక ఆ విషయం విడిచిపెట్టి ఊరుకుని అయినా ఉండాలి. ఏమైనా తనతో ఒక్కముక్క అంటే ఏం? మాట్లాడే అవకాశం లేకపోయిందన్న సాకుకుకూడా అవకాశంలేదు. ఇద్దరూ దాదాపు ఇరవైనిమిషాలపాటు హాలులో ఏకాంతంగా కూర్చున్నారు.

ఆ తరవాతే అతిథులు వచ్చింది. అంతా పది పదిహేనుమంది ఉన్నారు.

ఒక్కరూ కమలకు ఏమీ తీసుకురాలేదు. వస్తారనుకున్నవాళ్లు ఇద్దరు ముగ్గురు రానట్టు ప్రకాశం గ్రహించాడు.

వచ్చినవారిలో ఒకాయన కమల నటించబోయే పిక్చరుకు డైరెక్టరని ప్రకాశంతో చెప్పారు. ఆయన ప్రకాశంకేసి, "నువ్వెవరు !" అన్నట్టుగా చూశాడు. అందులో తప్పేమీలేదు. ప్రకాశం తప్ప మిగతా అతిదులందరూ సినిమావాళ్ళే. ప్రకాశం అక్కడ ఉండటానికి అతనికిగల అర్హత కమల అన్నకు పూర్వాశ్రమంలో సహాధ్యాయి కావటమే.

అందరికీ స్వీటూ, హాటూ, కాఫీ ఇచ్చారు. హోటలు సరుకు.

అసలే ప్రకాశానికి ప్రపంచమంతా తనను వెలివేసినట్టుగా ఉన్నది. మనిషికి కష్టాలు రావటం ఊహించుకోవచ్చు. వాటినిగురించి విన్న వాళ్ళు జాలిపడనూవచ్చు. ప్రకాశానికి కష్టాలు రాలేదు—అతనికి ఎటుచూచినా అంధకారమే కనిపిస్తున్నది. అది ఒక విధమైన బాధ. దాన్ని చూసి ఎవరూ జాలిపడరు. దాన్ని ఎవరితోనూ పంచుకునేటందుకు లేదు.

అందరికన్న ముందుగా ప్రకాశం శెలవు పుచ్చుకున్నాడు. అతను బస్సులో కూర్చుని తననుతాను పరిశోధించుకున్నాడు. తనకు ఉదాత్తమైన ఉద్యోగం దొరకదు. తాను చేసిన ఒక్క మంచిపనీ జీవితం గురించి తనకు తోచిన కథలు రాయటం. ఏనాటికైనా తన విమోచనం అందులోనే ఉన్నది. జీవిత ఫలాలలో తాను కోరినది ప్రేమ. అది తనకు లభించదు. ఇక తానై ఒక స్త్రీని ప్రేమించటానికి ప్రయత్నించేది లేదు. ఎవతెకూడా ప్రేమించి తనను వెతుక్కుంటూ వచ్చేదిలేదు.

# 17

ప్రతిక సర్క్యులేషను ఇంకొంచెం పెరిగింది. రెండో పజిలులో మరో అయిదువందలు లాభం వచ్చింది. మళ్ళీ అందరికీ ఫ్రీ కూపన్లు వెళ్ళినై. అదివరకు వెళ్ళినవారిలో కొందరికి రెండేసీ, మరికొందరికి మూడేసీ, ఒకరిద్దరికి - మంచి ఎడ్రసులు గలవారికి - నాలుగేసి కూడా వెళ్ళినై. ఎవరి అదృష్టం ఎంతో నిర్ణయించ టానికి భగవత్స్వరూపుడైన నారాయణ ఉండనే ఉన్నాడు.

ఒకనాడు తలవని తలంపుగా కృష్ణారావూ, లక్ష్మీకాంతమూ రాత్రి ఎనిమిదిన్నర ప్రాంతాన వచ్చారు. సత్యాన్ని వదిలించుకున్నారుట. పిక్చరుకు సంభాషణలు రాస్తే రెండువేలిస్తామనీ, డిస్ట్రిబ్యూటరుతో అన్ని ఏర్పాట్లు చేశామనీ కృష్ణారావు అన్నాడు.

తడుముకోకుండా ప్రకాశం సంభాషణలు రాయటానికి ఒప్పుకున్నాడు.

మర్నాడు అతను సోమయాజులును కలుసుకుని కృష్ణారావు చెప్పిన సంగతి నిజమేనని తెలుసుకున్నాడు.

"చూడు, సోమయాజులూ, ఒక్క సహాయం చేసిపెట్టగలవా? కమలని ఈ పిక్చర్లో బుక్ చెయ్యటానికి వీలవుతుందేమో చూస్తావా?" అన్నాడు ప్రకాశం.

"రెడ్డిగారితో అదివరకే చెప్పాను. ఆయన సరేనన్నాడు కాని కమల ఇంకొక పిక్చరులో బుక్కయిందటగా? అయినా వెళ్ళి మాట్లాడుదామనుకుంటున్నాను. నువ్వు కూడా వస్తావా?" అన్నాడు సోమయాజులు.

"నేను రాను నాకు పని జాస్తిగా ఉంది." అన్నాడు ప్రకాశం.

ప్రకాశం రోజూ సాయంకాలంపూట వెళ్ళి కూచుని కొత్త డైరెక్టరుతోసహా స్క్రిప్టు మార్చి రాస్తూ ఏ సీనుకాసీను సంభాషణలు రాస్తున్నాడు. ఈ పని ప్రకాశానికి రుచించటానికి ఒక కారణమేమంటే అతను చాలా విషయాలు తెలుసుకోవటానికి ఇది మంచి అవకాశం అయింది. ప్రకాశానికి ఏదైనా స్పష్టం కాకపోతే, డైరెక్టరు ఓపికగా తెలియజెప్పేవాడు.

రెండు వారాలలో పని పూర్తి అయింది.

"కొన్ని సీక్వెన్సులు నాకే అనుమానంగా ఉన్నై. కాని స్క్రిప్టును దిద్దుతూ కూర్చుని లాభంలేదు. షూటింగు ప్రారంభించాలి. సెట్టుమీద మార్పులేమైనా చెయ్యవలసివస్తే నువు కూడా ఉండటం అవసరం. షూటింగుకు హాజరయే అవకాశం ఉంటుందా?" అన్నాడు డైరెక్టరు.

"చూస్తాను" అన్నాడు ప్రకాశం. అతను వెంకటరమణయ్యను ఆరునెలలు శలవు అడిగాడు. ఆయనతో పిక్చరు సంగతి చెప్పాడుకూడా. వెంకటరమణయ్య సరేనన్నాడు.

మర్నాడు నారాయణ ప్రకాశానికి డబ్బిచ్చేస్తూ, "మీ ఉద్యోగం ముగిసింది, సాధ్యమైనంత త్వరలో ఇంకొక ఇల్లు చూచుకోండి. తొందర ఏమీలేదు!" అన్నాడు.

దక్షిణామూర్తి ఈ మాట వినగానే మండిపడ్డాడు. ఆ మర్నాటినుంచీ ఆయన నలుగురినీ వాకబుచేసి త్యాగరాయనగరులో గజం రెండున్నర ఖరీదుచేసే ఇళ్ళస్థలం మూడు గ్రౌండ్లు కొనేసి, తిరిగి వానలు వచ్చేలోపుగా వెయ్యి చదరపు అడుగుల వైశాల్యంగల డాబా వేసేశాడు. దాంతో ఆయన ఇల్లు అమ్మి తెచ్చుకున్న డబ్బంతా అయిపోయింది.

ప్రకాశం షూటింగుకు వెళ్ళివస్తున్నాడు. ఈ పిక్చరుకు కమల బుక్ కాలేదు. ఆమెను కొత్తగా బుక్ చేసిన డైరెక్టరు ఒప్పుకోలేదట. ఆమె ఆ పిక్చరులో నటించలేదు. కమల ఆ డైరెక్టరు రెండవ భార్యగా ఉంటున్నదని ప్రకాశానికి తెలియవచ్చింది. కమల తల్లి తాను అనుకున్నంత ధర్మదేవత కాదనీ ఆవిడ తన కొడుకునూ, కూతుర్నీ కూడా తాను గీసిన గిరిలో ఉంచుతూ వచ్చిందనీ, తాను కమలతో ఎప్పుడెప్పుడేమన్నదీ కమల తల్లికి చెబుతూ వచ్చిందనీ, కమల ప్రకాశం ప్రేమను స్వీకరించ నవసరం లేదనీ ఆవిడే నిర్ణయించిందనీ ప్రకాశానికి నమ్మకంగా తెలియ

వచ్చింది. బహుశా ఆవిడ అనుమతితోనే కమల తనకు మూడింతలు వయసువాడికి రెండో భార్యకూడా అయి ఉంటుందని అతను అనుకున్నాడు.

ఒకనాడు దక్షిణామూర్తి తన కొడుకుతో "ఏంరా, మనింటికి అప్పుడప్పుడు వచ్చే సీతారామయ్య తనకూతుర్ని నీకిచ్చి చేస్తామంటున్నాడు. ఏం చెప్పమన్నావ్!" అని అడిగాడు.

"చెప్పేందు కేముంది? నువ్వు, అమ్మా ఒప్పుకుంటే చేసుకుంటాను" అన్నాడు ప్రకాశం.

"అయితే వెళ్ళి పిల్లను చూస్తావా ఏమిటి? రెండు వీధుల అవతలేగా?" అన్నాడు దక్షిణామూర్తి.

"నువ్వూ, అమ్మా చూడండి. చాలు!" అన్నాడు ప్రకాశం.

"ఆ అమ్మాయైనా నిన్ను చూడాలిగాదుట్రా?"

"చూడాలంటే మనింటికి రమ్మను!"

చివరకు అదే జరిగింది. శకుంతల ఒకనాడు ఉదయం లోపలికివచ్చేసి దక్షిణామూర్తితో "నన్ను గుర్తించలేదండీ? నేను సీతారామయ్యగారి అమ్మాయిని!" అన్నది.

ప్రకాశం బనీనుతోనే గదిలోకి తొంగిచూశాడు. అతన్ని చూడగానే శకుంతలకు నవ్వాగలేదు.

"ఏమిటి జోక్?'' అన్నాడు ప్రకాశం సీరియస్‌గా.

"ఈ 1941 లో పెద్దవాళ్ళు చూసిన పిల్లను పెళ్ళాడే వాళ్ళుకూడా ఉన్నారా అని నవ్వుతున్నా."

"వారివ్వం అన్నారు, మేం చేసుకోం అన్నాం అని సాయిబుఅన్నాట్ట. అక్కర్లేదనటానికి ఏ ఒకరైనా చాలుగదా!" అన్నాడు ప్రకాశం.

శకుంతలను ప్రకాశం తల్లిదండ్రులు చాలా సేపు మాట్లాడించారు. చివరకామె అందరికీ ఒకే నమస్కారం గుండ్రంగాతిప్పి వెళ్ళిపోతుంటే ప్రకాశం "ఇంతకూ కావాలా అక్కర్లేదా" అని అడిగాడు.

శకుంతల ఆగి వెనక్కు తిరిగి ప్రకాశంకేసి కాస్సేపుచూసి "నేను కూడా మా పెద్ద వాళ్ళు ఏం చెబితే అది చెయ్యదలిచాను!" అంటూ నవ్వి తలఎగరేసి వెళ్ళిపోయింది.

ఇద్దరికీ పై మాసంలో పెళ్ళి అయింది. అది ప్రకాశం ఆశించిన ప్రేమ పెళ్లికాదు. కాని అతను అసంతృప్తి పడలేదు. తన భార్య ఎప్పుడన్నా "అట్లా ఉన్నారేమిటి? వంట్లో బాగా లేదా? ఈ పూట చాలా ఉత్సాహంగా ఉన్నారే ? ఏమిటి కథ !"అని తనను గురించి విచారిస్తుంటే ప్రకాశానికి జీవితం బాగానే ఉంటున్నట్లు తోచేది. తానూ భార్యా కీచులాడుకున్నప్పుడు మాత్రం "ఈ పెళ్ళిళ్ళ తీరే ఇంత!" అనుకునేవాడు.

తీసే సినిమా అయిపోగానే ప్రకాశం నిరుద్యోగి అయినాడు. అతన్ని సినిమాల కంపెనీ లేవీ పిలవలేదు. ఆ పరిస్థితిలో అతని మామగారే అతనికి ఒక దినపత్రికలో సబ్ ఎడిటర్ ఉద్యోగం ఇప్పించి ఆదుకున్నాడు.

ప్రకాశం బుద్ధిగా యుద్ధవార్తలు తర్జుమా చెయ్యసాగాడు .... ఏమైతేనేం? నెలతిరిగే సరికి నూరు రూపాయలు చేతపడతై....

ప్రచురణ : నవంబరు 1961, ఏలూరు ప్రజాప్రచురణలు.

# గడ్డు రోజులు

"ఏమోయ్ సత్యం! ఊరికేనే వున్నావుగదా, కాస్త మాకు ప్రూఫులు చూసి పెట్టరాదూ?" అన్నాడు నారాయణశాస్త్రి.

నారాయణశాస్త్రి తనకు ఉద్యోగం ఇస్తున్నాడని సత్యం వెంటనే గ్రహించలేదు.

"ఏం ప్రూఫులు?" అన్నాడు సత్యం.

"నీకు చెప్పలేదూ? భాగవతం ఒక్కొక్క స్కందమే ఒక్కొక్క చిన్న పుస్తకంగా అచ్చు వేయిస్తున్నా. మన సీతా ప్రెస్‌లోనే. నెలకో పాతికదాకా ఇచ్చుకుంటాను." అన్నాడు నారాయణశాస్త్రి.

సత్యంలో ఏదో మీట నొక్కినట్టయింది. అది ఆనందమో, ఆందోళనో అతనికే తెలీదు. ఒక స్థితిలో రెంటికీ తేడా ఉండదు. సత్యం ఆ స్థితిలో ఉన్నాడు.

నెలకు పాతిక తనకు మంచి సంపాదనే, చాలా మాసాలుగా తానూ, తన భార్యా నెలకు పది పదిహేను రూపాయలపైనే బతుకుతున్నారు. అది ఎట్లా వస్తున్నదీ అతనికే తెలీదు. తిండి లేకుండా పడుకున్న పూట మాత్రం తన జీవితం అడుగంటినట్టు స్పష్టంగా తెలిసేది. మళ్ళీ ఒక రూపాయి ఎక్కడన్నా పుట్టించేసరికి అడుగు కనిపించకుండా పోయి అంతా మామూలుగానే ఉన్నట్టుండేది.

అందుచేత నెలకు పాతిక పెద్ద సంపాదన. అడుగు తగలకుండా జీవించవచ్చు.

ఇది నిజంగా సంతోషించదగిన విషయమే. అయితే సత్యానికి కల్తీలేని ఆనందం కలగలేదు. తనకు ప్రూఫ్‌రీడరు ఉద్యోగమేమిటి? "నువు ప్రూఫ్‌రీడరు ఉద్యోగం చేస్తావు!" అని ఒక పావుగంటక్రితం ఎవరన్నా జోస్యం చెబితే సత్యం అవమానపడి ఉండేవాడు. నిరుద్యోగులకు అన్నం లేనప్పుడు తిన్న తిండిగాని, చివరకు పస్తులుగాని సత్యం వ్యక్తిత్వాన్ని భంగపరచలేదు; అటువంటిది ఈ ఉద్యోగం భంగపరిచింది.

ప్రూఫ్‌రీడింగులో అవమానం ఉందనికాదు, నారాయణశాస్త్రి హైస్కూలు క్లాసుల్లో తన సహాధ్యాయి; దూరపు బంధువుకూడా అవుతాడు. అతను భాగవతం అచ్చువేసే పక్షంలో ప్రూఫులు చూసి పెట్టటానికి సత్యానికి అభ్యంతరమేమిటి? తాను చేస్తున్నపని ఏమిటి గనక? ఒకసారి భాగవతమంతా చదివినట్టన్నా అవుతుంది.

"జీతంకూడా దేనికిలే? ప్రూఫులు అట్లాగే చూసిపెడతాను!" అందామను కున్నాడు సత్యం. ఆ మాట అంటే అతని అభిమానం దక్కి ఆనందం కలిగేది.

కాని అతని అంతరాత్మ కెవ్వన అరిచి, "ఆ మాట అనకు. నాశనమై పోతావు!" అని హెచ్చరించింది. అతనినోట ఆ ఒక్కమాటా రాలేదు. అసలు ఏ మాటా రాలేదు. "ఊఁ" అని మూలిగి, 'అట్లాగేలే!.... దానికేం భాగ్యం!' అన్నట్టు తల ఆడించాడు.

"అటువంటి పుస్తకం వేసేటప్పుడు అచ్చు తప్పులు వస్తే అసహ్యంగా ఉంటుంది.... ప్రస్తుతం ప్రెస్సువాళ్ళు పండరి భజనకీర్తనలు వేస్తున్నారు. రెండు మూడురోజుల్లో ఆఖరుఫారం అచ్చవుతుందిట. వెంటనే మనపని ప్రారంభిస్తా మన్నారు...." అని నారాయణశాస్త్రి చెప్పుకుపోతున్నాడు.

"ఊరికేనే ప్రూఫులు చూస్తానని ఎందుకు అనలేదు! ఇప్పుడైనా మించి పోయిందేమిటి? అనేస్తే?....ఒకవేళ నారాయణశాస్త్రి తనకు ఏదో ముట్టజెప్పటాని కీ సాకు పెట్టాడేమో! డబ్బు తీసుకొనటం అవమానంగా ఉండవచ్చు అతనికి!...." అని సత్యం తనలోతాను వితర్కించుకుంటూ నారాయణశాస్త్రి చెబుతున్నది వినలేదు. అతను ఏదో చెప్పి, "ఏం?" అనేసరికి సత్యం దొరికిపోయిన దొంగల్లే ....

"ఏమిటీ?"

"ఎల్లుండి పొద్దున ఎనిమిదింటికి ప్రెస్సుకు రమ్మంటాను," అన్నాడు నారాయణశాస్త్రి.

"సరే, సరే," అన్నాడు సత్యం.

పోతూ పోతూ నారాయణశాస్త్రి, "అవసరానికేమన్నా కావలిస్తే చెప్పు." అన్నాడు.

"అవసరం ఎప్పుడూ ఉండేదేగా!"

"అయితే ఈ అయిదు రూపాయలూ ఉంచు చెబుతా," అంటూ నారాయణ శాస్త్రి సత్యానికి డబ్బిచ్చాడు.

సత్యం డబ్బు తీసుకుని జేబులో పెట్టుకుంటూ, "బయానా!" అనుకున్నాడు.

అతనికి అభిమానం తగ్గటానికి మారుగా హెచ్చుతున్నది. సత్యం, బి. ఏ. ప్రూఫ్‌రీడర్! ఎకనమిక్స్ పట్టభద్రుడు పోతనామాత్యుడి ప్రూఫ్‌రీడర్!

పోతన పేరు తలచుకోగానే సత్యం కీర్తి చాలాభాగం దిగిపోయింది. తాను గింజుకోవలసిన అవసరం నిజంగా ఏమీలేదు. తనకు శకటరేఫలూ, అరసున్నాలూ తెలియవు. భాగవతం ప్రూఫులు చూసే అర్హత తనకు నిజంగా ఎక్కడుంది? అప్పుడప్పుడూ తాను పత్రికల్లో రాసే వ్యాసాలు చూసి తానుకూడా ఒక రచయిత అని అందరూ అనుకోవటమేగాని, తనకు తెలుగు ఏంవచ్చు? అందులో పాండిత్యం ఎక్కడ ఏడిచింది? ఏ శేషాచార్లు లాటివాడో చెయ్యవలసిన పని.

శేషాచార్లు పదచదివాడు - సంస్కృతంలోనూ, తర్కంలోనూ జ్యోతిషం లోనూ - నిధితెలుగులో కవిత్వం రాస్తాడు. కొంతకాలం బెజవాడ ప్రెస్సుల్లో ప్రూఫు రీడరుగా పనిచేసి ప్రస్తుతం ఖాళీగానే ఉంటున్నాడు. ఏదో తినటానికింత ఉన్నది.

* * *

అయిదు రూపాయలు పట్టుకుని సత్యం నేరుగా పెద్దబజారుకు వెళ్ళి బట్టల కొట్లో జానక్కి ఒక అహమ్మదాబాదు మిల్లుచీరె కొన్నాడు. రూపాయి పదణాలు. తెండుంబావలా పెట్టి ఒక పావుబస్తా బియ్యం పట్టించుకుని ఇంటికి వచ్చాడు. అయిదు రూపాయల్లో నాలుగు అయేపోయినై. కాని నెలపొడుగూతా అన్నానికి ఢోకా ఉండదు. జానక్కి చిరుగులులేని చేరె రెండోది ఏర్పడ్డట్టయింది.

జానకి బియ్యం మూట చూసి సంతోషించింది గాని చీరె చూసి లబలబ లాడింది. ఇంతలో తనకు రెండో చీరె లేకపోతే నేం ? తాను వెళ్ళబోయే పేరంటా లేమున్నై ? రూపాయి పదణాలు ! నిక్షేపంగా ఎన్నాళ్ళయినా పై ఖర్చుకు సరిపో యేదిగద! చాకలిదానికి పెరుగు మనిషికీ పాతబాకీ తీరనేలేదు....

తన భార్య తనకు అట్టడుగు చూపటం సత్యానికి రుచించలేదు. అన్నీ తీరుతై - కాస్త ఓపిక పట్టాలి-అంతే అని అర్థం వచ్చేటట్టు అభినయించాడు.

జానకి పైకి అనకపోయినా తన భర్త భవిష్యత్తులో దృఢమైన నమ్మకంగల మనిషి. ఆర్థిక కాటకం[1] దెబ్బ తియ్యటంవల్ల తాత్కాలికంగా అతని జీవితం నివురుకప్పినా ఎప్పటికైనా అతను ప్రజ్వలించి తీరుతాడని ఆమె విశ్వాసం. ఆ రోజు కోసం ఆమె ప్రతిరోజూ ఎదురు చూసేది. ఒక్కొక్కరోజు నిద్రలేస్తూనే, "ఇవాళ - ఇవాళే ఏదో ఒకటి జరగకూడదా ?" అనుకునేది.

అయితే ఆదృఢ విశ్వాసం ఎంతోసేపు నిలబడేదికాదు. "ఇవాళ కాకపోతే, కనీసం వచ్చేనెల—పై సంవత్సరం-" అనుకునేది.

భర్తకు మంచి భవితవ్యం ఉన్నదనుకోవటంలో జానకి మనస్తత్వం కొంత వెల్లడి అయింది. అదే ఇంకొకరకం అడదైతే సత్యానికి భవిష్యత్తు లేదని నిర్ధారణ చేసుకుని ఉండేది.

ఎందుకంటే, సత్యం దుర్భరమైన దారిద్ర్యంలోకూడా కొన్ని ఉద్యోగాలకు ప్రయత్నించ నిరాకరించాడు. ఎంతోమంది చెప్పినా వినలేదు. అతను అట్లా నిరాక రించడానికి ప్రధాన కారణం ఆ చేయవలసిన ప్రయత్నాలు-కొందరు కొందర్ని ఆశ్ర యించటమూ, వాళ్ళమీద లేని గౌరవాభిమానాలు ప్రదర్శించటమూ—అతనికి కొంచెం గూడా రుచించక పోవటమే. ఇంత ఆత్మాభిమానాన్ని చంపుకుని తనకన్నా హీనులైన వాళ్ళను ఆశ్రయించినా ఆ ఉద్యోగాలు అవుతాయన్న నమ్మకం ఏమీలేదు. అటువంటి పరిస్థితుల్లో సత్యం కడుపు నిండిన వాడిలాగా ప్రవర్తించిన మాట నిజమే.

---

1. 1929-34 ఆర్థిక మాంద్యం ప్రస్తావన

ఇది చూసి జానకి భర్తను విమర్శించకపోగా, అతను ఏదో ధైర్యం లేక పోతే ఉద్యోగం విషయమై ఇంత నిర్లక్ష్యంగా ఉండడని రూఢి చేసుకున్నది. ఒక్క- మా విషయంలోనే కాదు, ఏ విషయమైనా సరే సత్యం గట్టిగా మాట్లాడితే చాలు, ఆమె అతని మాటలలో పూర్తి విశ్వాసం ఉంచేది. అందుచేతనే ఎప్పుడన్నా సత్యం తన భవిష్యత్తు గురించిగాని, డబ్బు పుట్టించే శక్తి గురించిగాని కొంచెం అనుమానంగా మాట్లాడితే ఆమెకు నీటిలోపడి ఉక్కిరి బిక్కిరి అయిపోయినట్టుండేది.

జానకి ప్రపంచం అమిత చిన్నది. దాదాపు దాన్నంతా సత్యమే ఆక్రమిం చాడు. ఈ సంగతి సత్యం ఇంచుమించు స్పష్టంగానే ఎరుగును. అందుకని అతను ఆమెను లోలోపల చాలా ప్రేమించేవాడు. కాని ఏ ఆడదీ మొగుడే లోకంగా ఉండరాదని అతనికి తెలుసు. తన భార్య ప్రపంచాన్ని విశాలం చెయ్యటానికి పత్రి కలూ, పుస్తకాలూ అరువు తెచ్చి చదవమనేవాడు. కాని జానకి చదివేదికాదు.

పాపం జానకికి ఏమంత చదువురాదు. తెలుగు కొద్దిగా వచ్చు. ఇంగ్లీషు అక్ష రాలు తెలుసు, అంతే. తన భర్త మామూలువాళ్ళకంటె తెలివిగలవాడని తెలుసు కునేటందుకు ఇతరులు అనే మాటలు తప్ప ఆమెకు మరొక కొలబద్ద ఏమీలేదు.

పెళ్ళినాటికి జానకి పదేళ్ళు నిండినపిల్ల. వాళ్ళ పెళ్ళిజరిగి ఆరేళ్ళయింది. పెళ్ళి అయిదురోజులలోనే ఒకరిద్దరు జానకి తండ్రిని అభినందిస్తూ, "అటువంటి అల్లుడు అందరికీ దొరకడు. అల్లుడి పోకడలు పెళ్ళి కొడుకులో ఏమీ లేవు." అన్నారు.

ఆ మాట జానకి తల్లిదండ్రులే ఎన్నోసార్లు అనుకున్నారు. సత్యం ఏనాడు పెట్టుచెయ్యలేదు; అల్లుళ్ళు అలిగే అలక లేవీ అలగలేదు; మామగారినుంచి ఏదో ఒకటి గుంజాలన్న తాపత్రయం అతనిలో ఏ కోశానా ఉన్నట్టు కనపడలేదు. మామూ లుగా ఇంటికివచ్చినప్పుడు బట్టలు పెట్టినా, "ఎందుకివి ? దబ్బుదండుగ !....నాకీ లాంఛనాలంటే చాలా చిరాకు !" అనేవాడు.

కాపరానికి రాకముందే జానకికి తనభర్త ఒకచిన్న దేవుడన్న అభి ప్రాయం మనసులో పాతుకుపోయింది. ఆమె కాపరానికి వచ్చిన ఏడే-రెండేళ్ళ క్రితం-సత్యంవాళ్ళ ఆస్తి కాస్తా హరించిపోయింది.

"ఒక్కొక్క పిల్ల మెట్టిన వేళావిశేషం !" అన్నారు సత్యంవేపు బంధువు లంతా. కొందరు సత్యంతోనే అన్నారు.

"నాకు ఆర్థికశాస్త్రం నేర్పకండి. ఇది అంతర్జాతీయ నాటకం. డిప్రెషన్. ఆర్థికచక్రం క్రిందూ, మీదూ అవుతుంది. జానకే అమెరికాలో బాంకులన్నీ దివాలా తీయించిందంటారా ? లోకోత్తరమైన మనిషిని చేసుకున్నానన్నమాట !" అన్నాడు సత్యం.

జానకి తన భర్తవైఖరి చూసి నిర్ఘాంతపోయింది. తాను కాపరానికి రావటా నికి సత్యం వాళ్ళ ఆస్తి పోవటానికి ఏదో సంబంధం ఉన్నదని ఆమెకూడా మన

స్ఫూర్తిగా నమ్మి ఉన్నది. అందుకామె తనను తాను నిందించుకోకపోయినా, ఇతరులు నిందిస్తే పడటానికి పూర్తిగా సంసిద్ధురాలయింది.

కాని సత్యం జానకిపైన ఈగ వాలనివ్వలేదు. అతను తనలోగల ప్రేమించే శక్తిని తన భార్యకే అంకితం చేశాడు-దాని ప్రమాణం ఎంత అన్న సమస్య అనవసరం. అతని మానసిక జీవితంలో ప్రేమకు పెద్ద స్థానం లేదు. కాని అతని ప్రాణానికి ఆడదంటే జానకే. ఆమెకంటె అందమైన స్త్రీలుకూడా అతన్ని ఆకర్షించలేక పోయినారు.

అయినా సత్యం తనకు పెళ్ళికాకుండా ఉంటే ఇంతకంటె బాగుండేదని అప్పుడప్పుడూ అనుకునేవాడు. కొన్నిరకాల బాధలు ఒంటరిగా భరించటం సులభం. తన కష్టాలు జానకి కూడా పంచుకుంటున్నదన్న సంగతి అతనికి ఏనాడూ ఆనందం ఇవ్వలేదు. జానకే తనతో సమానమైన లోకజ్ఞానమూ, శక్తి సామర్థ్యాలూ కలదైతే ఆమె తన కష్టాలు పంచుకుంటున్నదన్న తృప్తి అతనికి కలిగి ఉండేదేమో ? ఆనందం పంచుకోవడానికి ఎవరైనా ఫరవాలేదు. కాని కష్టాలు పంచుకోవడానికి సమర్థులు తప్పక కావాలి. తన దారిద్ర్యం మూలాన ఇంకో ప్రాణికూడా బాధపడుతున్న విచారమే సత్యానికి మిగిలేది. ఒక్కొక్కసారి జానకి ఉన్నదేదో తనకుపెట్టి తాను డొక్క మాడ్చుకునేది. ఒకసారి నెయ్యి కొంచెంగా ఉంటే అది సత్యానికి వేసేసి జానకి కారం మెతుకులు మింగింది. ఈ సంగతి సత్యం గమనించి చాలా ఆందోళన చెందాడు. "ఉన్న నెయ్యంతా నాకే ఎందుకు వేసేశావు?" అని జానకిని గద్దించాడు.

చాలామంది భర్తలు జానకిలాచేస్తే సంతోషించేవారేమో, కాని సత్యం ఇటువంటి పాతివ్రత్యం కొంచెంకూడా సహించలేకపోయేవాడు. ఈ పాతివ్రత్యాన్ని చూసి హర్షించేవాళ్ళు అతనికి మనుషులు కారనికూడా అనిపించేది.

అటువంటప్పుడు అతనికి జానకి బరువులాగా తోచేది. దారిద్ర్యబాధకు తోడు ఈ బరువు!....

తనకు భార్యమీద కలిగే సానుభూతి చిరాకుగా బయటపడినప్పుడల్లా సత్యం తాను అస్వాభావికంగా ప్రవర్తించటం అతనికి సాధ్యమయేది కాదు.

"నిజంగా నాతో సమానత్వం కోరే మనిషి అయితే ఇటువంటి పాతివ్రత్యం అవలంబించదు!" అనుకునేవాడు సత్యం. ఇటువంటి పాతివ్రత్యం సహించలేకనే నలుడు దమయంతిని నట్టడవిలో విడిచి వెళ్ళాడేమో ననికూడా అతను అనుకునేవాడు.... జానకి తనతో పోటీపడి దారిద్ర్యాన్ని తనకన్న హెచ్చుగా అనుభవించాలని చూసేకన్న తాను కూడా నెలకొక నాలుగు రూపాయలు సంపాదించే శక్తి సామర్థ్యాలు ప్రదర్శించినట్టయితే సత్యం ఇంకా సంతోషించి ఉండేవాడు.

ఈ విధంగా సత్యం ఆదర్శపత్నికి ఉండవలసిన— ఈకాలంలో ఉండవలసిన-

రెండు గుణాలు— భర్తతో సమత్వమూ, ఆర్థిక భారం వహించే శక్తి. 1934 లోనే గ్రహించటం గమనించదగిన విషయం.

అతనైనా ఈ విషయం ఎంత సూటిగా గ్రహించాడో చెప్పటం కష్టం. కాని అతను ఆ రోజుల్లో ఒక కథ రాసి ఒక "ఖులాసా"కథల పత్రికకు పంపాడు. అందులో భర్తకు తన భార్యలో పతివ్రత లక్షణాలుండాలని భ్రాంతి. డిప్రెషన్‌లో చిక్కుకుని ఉన్న సమయంలో భార్య భర్తయొక్క దారిద్ర్యాన్ని బరువులాగా మొయ్యటానికి బదులు సమానస్థాయాలల్లే పంచుకోవటమే గాక ఒక సాహిత్య పత్రికకు కథ ఒకటి రాసి పదిరూపాయల మనియార్డరు తెప్పించుకుంటుంది....

ఈ కథ వేసుకున్న పత్రిక సత్యానికి మూడు రూపాయలు పంపింది .... ఇంకానయం!....

* * *

భాగవతం అచ్చు అనుకున్నంత త్వరగా ప్రారంభం కాలేదు. అనుకోకుండా ప్రెస్సుకు పంచాంగం వర్కు వచ్చిపడింది. అది ప్రెస్సుకు కామధేనువు.

"వాంటింగ్స్ కోసం రాశాం. అవి రాగానే మీ వర్కు విధిగా ప్రారంభిస్తాం." అన్నాడు ప్రెస్సు యజమాని నారాయణశాస్త్రితో. పంచాంగానికీ, బుక్‌వర్కుకూ ఏమీ సంబంధం లేదని ఆయన స్పష్టం చేశాడు.

సత్యంమటుకు అనుకున్ననాటినుంచీ రోజూ ఉదయంపూట అయినా ప్రెస్సుకు పోయి వస్తున్నాడు. నారాయణశాస్త్రి వస్తే వచ్చేవాడు, లేకపోతే లేదు.

పంచాంగం ప్రూఫులు చూడటానికి శేషాచార్లును పెట్టారు.

"శాస్త్రిగారు మీకు అయినవా రనుకుంటా, మిమ్మల్ని భాగవతం చూడటానికి పెట్టారేం? ముందు నన్నడిగారు. నెలకు ముప్ఫై ఇయ్యమన్నా. లేకపోతే కాంట్రాక్టుగా మాట్లాడుకోమన్నా. వారికి కుదరలా, పోనివ్వండి. ఈ పంచాంగం చూసినందుకు నూరిస్తున్నారు. గట్టిగా నెల రోజుల పని ఉండదు. అర్బకపు ప్రెస్సయిపోయిందిగాని, వారం రోజుల్లో లాగేసేపని ........" అన్నాడు ఆచార్లు మాటల సందర్భంలో.

సత్యం ఆశ్చర్యపోయినాడు. శాస్త్రి తనకు సహాయం చెయ్యటానికని ఈపని ఇవ్వ లేదన్నమాట! అయిదు రూపాయలకు లోపించి తనను ఆశ్రయించాడు. శాస్త్రి అయిదు రూపాయలకు లోపించవలసిందికాదు. ఈ పనికి ఆచార్లు సరి అయిన మనిషి. ఆ మాట తన నోటనే అంటే బతకనేర్చనివా డంటారు!

కాకపోయినా, శాస్త్రికి లేని దుగ్ధ తన కెందుకు?

అనుకున్న దానికి పది పన్నెండు రోజులు ఆలస్యంగా భాగవతం కంపోజింగు ప్రారంభమయింది.

సత్యానికి ప్రూఫులు చూడటం ఏమీరాదు. అతను మొదట గ్యాలీ ప్రూఫులు చదువుతుంటే గ్యాలీకి రెండు మూడు తప్పులపైనా కనబడలేదు. నిజానికి కంపో

జీటరు సమర్థుడు. కాని సత్యం పూర్తిగా చూసిన గ్యాలీలు ఆచార్లు చూస్తానని తీసుకుని గ్యాలీకి ఇరవై తప్పుల దాకా చూపించాడు.

"న" లకూ, "స" లకూ వ్యత్యాసం గమనించలేదు సత్యం. ఒకటి రెండు అరసున్నాలను సున్నాలుగా చదివాడు. ఒకచోట 'ఒ' ఉండటానికి బదులు 'ఋ' పడింది. ఇంకో చోట 'జ' పడింది. ఎన్నోచోట్ల 'డు' లూ, 'దు' లూ తారుమారయాయి.

అరసున్నాలూ, బండిరాలూ తప్ప సత్యం దేన్నిగురించీ ఆట్టే శ్రద్ధ వహించలేదు.

కరక్షన్ గుర్తులు పెట్టడం కూడా సత్యం నేర్చుకున్నాడు!

ఆచార్లుకు తన కృతజ్ఞత ఎట్లా తెలపాలో సత్యానికి తెలియలేదు. "రూపాయి అణా పైసల్లోకి రాని బాకీలు తీర్చటం ఎంత కష్టం!" అనుకున్నాడతను.

తెలివితేటలుంటే ఏ పని అయినా నేరవ్వొచ్చు. సత్యం త్వరలోనే ప్రూఫ్ రీడింగ్ పని నేర్చుకున్నాడు. ప్రూఫ్ చూసేవాడు చదివి ఆనందించే పనిపెట్టుకోరాదు.

ప్రథమ స్కంధం ఒక్కొక్క ఫారమే అచ్చవుతున్నది. ఆచార్లు సహాయం చేస్తూనే ఉన్నాడు.

ఆర్థిక శాస్త్రంలో ఒక నియమం వున్నది. తక్కువ విలువగల నాణెం, ఎక్కువ విలువగల దాన్ని చలామణీలోనుంచి బయటికి నెట్టేస్తుంది. ఇంచుమించు అదే సూత్రంప్రకారం ఆచార్లుకు బదులు తానువచ్చాడు. కాని మనుషులకూ, నాణేలకూ కొంతతేడా ఉన్న కారణంచేత తాను ఈ పాతిక రూపాయల జీతం నిలబెట్టుకోగలిగేటందుకు ఆచార్లు తోడ్పడుతున్నాడు.

అప్పటికీ మూడో ఫారం అచ్చయే సమయాన ఆచార్లు దగ్గరలేడు. ఆ ఫారంలో నాలుగైదు అక్షరాలు అరిగిపోయినవి దొర్లినై.

నారాయణశాస్త్రి విసుక్కున్నాడు. సత్యాన్ని అతనేమీ నేరుగా అనకపోయినా, అతని చిరాకు తనమీదే నని సత్యంఎరుగు గనక అతనికి బాధ తప్పలేదు.

ఇంతలో పంచాంగం పని అయిపోయింది. ఆచార్లు రావడం మానేశాడు. అయిదోఫారం నుంచి తప్పులు దొర్లాయి.

"ప్రూఫులు కాస్త చూడాలి సత్యం!" అన్నాడు నారాయణశాస్త్రి.

ప్రతి ప్రూఫూ అయిదేసిసార్లు చూడటానికైనా సత్యానికి అభ్యంతరంలేదు. కాని ఉన్న ప్రతి తప్పును పట్టుకునే నేర్పు అతనికి లేదు. అది అతనివల్ల అయే పనికాదు. ఆచార్లుకు సాధ్యమౌనేమో ! అయితే శాస్త్రి అయిదు రూపాయలకు లోపించాడు.

సత్యం ప్రెస్సుకేకాక నారాయణశాస్త్రి ఇంటికికూడా పోవలసి వస్తుండేది. శాస్త్రి భార్య అప్పుడప్పుడూ సత్యానికి మర్యాదగా బజారు పనులు చెప్పేది. సత్యా

నికి మండిపోయేది. ఒకసారి తప్పించుకున్నా ఒకసారి చేసేవాడు — తొందరపనే నని తోస్తే.

నెల పూర్తి అయింది. కాని నారాయణశాస్త్రి జీతం ఇవ్వలేదు. బహుశా కంపోజింగు ప్రారంభమైన నాటినుంచే నెల ఆరంభ మవుతుందేమో ననుకున్నాడు సత్యం. నెలరోజులక్రితం ఇచ్చిన అయిదు రూపాయలనోటే— డబ్బు అవసరమా అనికూడా శాస్త్రి అడగలేదు! "మొదట కడుగొప్ప" అన్న పద్యం జ్ఞాపకం వచ్చింది సత్యానికి.

ఆ అయిదు రూపాయలతోనే తనకు జరిగిపోతున్న దనుకున్నాడా శాస్త్రి? మధ్యలో ఒక మూడు రూపాయలు మనియార్డరున్నమాట నిజమే కాని ఆ సంగతి శాస్త్రి కేం తెలుసు?

"డబ్బు అవసరంగా ఉందోయ్ శాస్త్రి!" అన్నాడు సత్యం.

"డబ్బా?....ఎంత కావాలేమిటి?" అన్నాడు శాస్త్రి. ఇచ్చేది నెలజీతం కాదని తేలిపోయింది.

"ఏదో, పదో పదిహేనో కావాలిమరి." అన్నాడు సత్యం.

పర్సులో నుంచి పదిలంగా పదిరూపాయల నోటు తీసి ఇస్తూ శాస్త్రి "నెలాఖరుకు లెక్కచూసుకుందాం." అన్నాడు.

"అది ఎప్పటికో!" అన్నాడు సత్యం.

"అతని ప్రూఫ్‌రీడరు ఉద్యోగం అయిపోవటానికి ఈ ప్రశ్న పనిచేసినంతగా అతను ప్రూపుల్లో వదిలేసిన తప్పులుకూడా పనిచేయలేదు.

"మాటవరసకు నెల అన్నానుగాని ప్రథమస్కంధం ఇంకొక ఫారమేగా మిగిలివున్నది. అది పూర్తికాగానే లెక్కతేల్చేస్తాను. ద్వితీయ స్కంధము ఎట్లాగూ ఇప్పుడుపడేటట్టు లేదులే!" అన్నాడు శాస్త్రి.

ఆఖరుఫారం అచ్చయిన మూడో రోజున కాబోలు శాస్త్రి మిగిలిన పదిరూపాయలూ సత్యానికిచ్చి అతని ప్రూఫ్‌రీడరు పని పూర్తి అయినట్టుగా సూచించాడు.

"శేషాచార్లును నువు పెట్టుకుని ఉండవలసింది. ఇంకో అయిదు హెచ్చుగా ఖర్చయినా పుస్తకం ఇంకా బాగా వచ్చేది." అన్నాడు సత్యం సెలవు పుచ్చుకుంటూ.

## 2

సత్యానికి జీవితం అవాస్తవంగా, ఒక కలలాగా ఉన్నది. అతను ఈమధ్య రోజూ కలలు కంటున్నాడు. వాటిల్లో ఏవో మహత్తరమైన విషయాలు జరగబోయే టట్టుగా అనిపిస్తుంది. కాని క్రియకు ఏమీ జరగదు. జీవితంకూడా అదే ధోరణిలో వుంది.

జీవిత ప్రవాహం చాలావరకు తీసిపోయి ఎక్కడబడితే అక్కడ మడుగులు ఏర్పడినా వీటిమధ్యగా ఎక్కడో ఒకచిన్నపాయ ప్రవహిస్తూనే ఉన్నది. అయితే సత్యానికి అది అందటంలేదు. దానివెంట చిన్నచిన్న పడవలలో ముందుకు పోతున్న వాళ్ళు లేకపోలేదు.

ఆంజనేయులు అటువంటి వాళ్ళలో ఒకడు. అతనుకూడా చిన్నతనంనుంచీ సత్యంతో కలిసి చదువుకున్నవాడే. సత్యంతోపాటు కాలేజీలో ఇంటరు కూడా చదివాడు. ఇంటరు రిజల్ట్సు పేపరులో సత్యం చూసుకున్నప్పుడు ఆంజనేయులు కూడా పక్కనే ఉన్నాడు.

తరువాత కార్యక్రమం గురించి మాట్లాడుకునేటప్పుడు ఆంజనేయులు చదువు చాలిస్తున్నానని చెప్పేశాడు.

"ఎందుకురా ఈ అర్థంలేని చదువు? బియ్యేలు లాబరేటరీ ఆటెండర్లుగా దరఖాస్తులు పెడుతున్నారుట. వాళ్లకిందా వీళ్ళకిందా వెట్టిచాకిరీ చేసి తెచ్చుకునే పాతిక రూపాయలు మనకు మనమే సంపాదించుకోవచ్చు .... నేను ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్ పెట్టుకోబోతున్నాను." అంటూ ఆంజనేయులు జేబులోనుంచి ఒక కరపత్రం తీసి సత్యానికి చూపాడు.

ఇంటరు పరీక్షలు అయినప్పటినుంచీ ఆంజనేయులు ఇది పెట్టే ప్రయత్నంలోనే ఉన్నాట్ట. తన సహాధ్యాయి ట్యుటోరియల్ స్కూలు నడపబోతున్నాడంటే సత్యం మనసులో పెద్ద కదలిక ఏమీ గాలేదుగాని, కరపత్రం అడుగున, "ఎల్. ఎన్. ఆర్. ఆంజనేయులు, ప్రిన్సిపాల్," అని చూడగానే ఆంజనేయులు దక్షత సత్యానికి కళ్ళకు కట్టినట్టయింది.

సత్యం కొత్తగా చూస్తున్నట్టుగా ఆంజనేయులుకేసి చూశాడు. అతని కళ్ళలో విజయ గర్వం ఉన్నది. అతను ఎంతో ప్రయాసతో నృత్యం చెయ్యాలన్న కోతికను అణుచుకుంటున్నట్టు కనిపించాడు.

"బాగుందిరా, బ్రదర్! జయ్యించుకురా!" అన్నాడు సత్యం.

"నీవంటి ఫ్రెండ్స్ ఆశీర్వదిస్తే తప్పక జయిస్తాను." అన్నాడు ఆంజనేయులు.

ఈ సంభాషణలో సత్యానికి మిగిలినదల్లా ఏమంటే ఒక "ప్రిన్సిపల్" హోదాగల వాణ్ణి తాను "ఏరా?" అన్నానన్న సంతృప్తి.

తరవాత కొద్దిరోజులకు ఆంజనేయులు కనిపిస్తే, "మీ కాలేజి ఎట్లా సాగుతున్నదిరా?" అని సత్యం అడిగాడు.

"చూస్తూవుందరా, వచ్చేయేడు కాలేజీ చేస్తానోలేదో!" అంటూ ఆంజనేయులు తన స్కూల్లులో పన్నెండుమంది స్టూడెంట్సు ఉన్నారనీ, అందులో ఇద్దరు స్కూలుఫైనలు తప్పిన వాళ్ళనీ బియ్యే పాసయిన తన బావమరది తనకు అసిస్టెంటుగా ఉన్నాడనీ చెప్పాడు.

సత్యం ఆంజనేయులును చూసి అసూయపడలేదు. ఆంజనేయులు ఒక చిన్న తెప్పను ఆశ్రయించి జీవిత ప్రవాహంలో ప్రవేశించినమాట నిజమే గాని అతని గమ్యం ఉదాత్తమైనదిగా కనిపించలేదు.

జీవితం అవాస్తవికంగా ఉన్న తరుణంలో శాశ్వతపంథాలు నిర్మించుకోరాదు. ప్రస్తుతం తాను చైతన్యరాహిత్యం అనుభవించుతూన్నప్పటికీ ఆంజనేయులువంటి వాళ్ళ లక్ష్యం కంటె తనది చాలా పెద్దదని అతను తెలుసుకున్నాడు.

అయితే వచ్చిన చిక్కల్లా ఏమిటంటే, ఆ లక్ష్యం ఏదో సత్యానికి తెలియదు. అది ఎప్పుడో, ఎట్లాగో తనంతట తానే సాక్షాత్కరిస్తుందని మూఢవిశ్వాసం అలవర్చుకుని, ఇతరులు జీవిత సమస్యా పరిష్కారానికి అనుసరించే మార్గాలుచూసి, "నేతి నేతి," అనుకుంటున్నాను. తన బుద్ధి స్తంభించిపోయిందనీ, మిగిలినవాళ్ళు జీవితంతో ఏదోవిధంగా సమరం సాగిస్తున్నారనీ సత్యానికి తట్టలేదు. ఎప్పుడన్నా ఆమాట స్ఫురించినా, "ఏది చెయ్యటానికైనా డబ్బుండాలి గద !" అనుకునే వాడతను.

నిజమే, ఉద్యోగం చెయ్యటానికి తప్ప మరి వ్యాపారం చెయ్యాలన్నా డబ్బుండాలి. అదే తనదగ్గిర నిండుకున్నది. అందరూ ఎడారి ప్రయాణమే చేస్తున్నారు. కొందరు అన్ని సౌకర్యాలతోను ప్రయాణిస్తున్నారు. కొందరు ఎక్కువ సౌకర్యాలు వెంటలేకపోయినా ప్రతి "ఒయాసిస్" లోనూ సుఖాలు సంపాదించుకుంటూ ప్రయాణిస్తున్నారు. తానుమాత్రం తనవెంట గుక్కెడు నీరుగాని, పట్టెడు అన్నంగాని లేకుండా కాళ్ళీడ్చుకుంటూ జీవయాత్ర సాగిస్తున్నాడు. ఎండవేడి యావత్తూ తనపాలే, ఎక్కడ చూసినా ఇసుక దిబ్బలు తప్ప ఇంకొకటి కంటపడదు. అందరికీ తగిలే ఒయాసిస్ లల్లో ఒక్కటీ తనకు తగలదు.

ఈ అసమర్థపు ప్రయాణంలో సత్యం నీరసించి నిర్వీర్యుడు కాకుండా నిలుపుతున్న అంశాలు రెండే రెండు : ఒకటి అతని స్వాతిశయం, రెండవది జానకి. ఆమె కవచంలాంటిది — బరువే అయినా, ఒకవిధమైన రక్షకూడానూ.

ఒకనాడు హోటల్లో సత్యం కాఫీ తాగుతుండగా ఆంజనేయులు వచ్చి అందరినీ కలియజూసి సత్యం కనిపించగానే సమీపానికి వచ్చి, ఎదురుగా కూర్చుని "ఏమిటి కోసమేతున్నావు !" అన్నాడు.

కాని తాను ఇడ్లీతిని కాఫీ తాగినదాకా ఆంజనేయులు తనపని చెప్పలేదు. బయటికి వచ్చేటప్పుడు సత్యం బిల్లు అణాకానీ కూడా తానే ఇచ్చేసి, "అబ్బాయ్, మా స్కూల్లో నువ్వుకూడా మేస్టరుగా పనిచేస్తావా ? ఇద్దరు మాస్టర్లతో పని జరగటంలేదు. ఖాళీగానే వున్నావుగా ? అభ్యంతరం లేకపోతే చెప్పు. ఫస్టు నుంచీ రావచ్చు. ప్రస్తుతానికి ముప్పైకంటె ఇచ్చుకోలేను," అన్నాడు ఆంజనేయులు.

"ఈ పంతులుపని నాకు చాతనవుతుందా?" అన్నాడు సత్యం.

ఆంజనేయులు సత్యంకేసి చెయ్యిచాపి పెద్దనవ్వు నవ్వాడు.

"సరే చూద్దాం" అన్నాడు సత్యం.

తరవాత ఆలోచించుకుంటే సత్యానికి ఈ కొత్త ఉద్యోగంకూడా అవాస్తవికంగానే కనబడింది. చేసేపనిలో కొంచెమైనా ఆసక్తిలేకుండా అచ్చగా డబ్బు కోసమే ఏపనిగాని సంస్కారంగలవాడు ఎట్లా చేస్తాడు. చదువుకున్నవాళ్ళుకూడా అటువంటి పనులుచేస్తే మామూలు కూలిజనానికి వీళ్ళకి తేడా ఏమిటి ? ఆంజనేయులు విద్యావ్యాప్తికి కంకణం కట్టుకున్నవాడు కాడు. నలభైమంది పిల్లలుగల క్లాసుల్లో చదివి పరీక్షల్లో ప్యాసుకాలేని శుంఠలను ప్యాసుచేయించటమూ స్కూలు కంటె రెండు మూడింతలు జీతం వసూలు చెయ్యటమూ ఆంజనేయులు వృత్తి.

ఇంటరు పాసయిన ఆంజనేయులుకింద బియ్యే పాసయిన తాను రెండో అసిస్టెంటు. మొదటి అసిస్టెంటు ఛాన్సు దావమరిది కొట్టేశాడు. తనసాటివాడు ఆంజనేయులు తనకు ఉద్యోగం ఇవ్వగలగటం ఆశ్చర్యం. కావలిస్తే తాను అహంకరించి చెయ్యననవచ్చు. కాని ఆంజనేయులు ఒక్క ఘడియలో తనవంటి వాళ్ళను అయిదుగురిని సంపాదించగలడు.

"ఆంజనేయులు ఎంత సంపాదిస్తున్నట్టు ? ఏ అరవయ్యో, డెబ్బయ్యో, గిట్టుతున్నట్టు ఎప్పుడో చెప్పినట్టు జ్ఞాపకం. ఏ పరిస్థితిలో అయినా తాను సంపాదించుకునేదాన్లో సగంకన్న ఎక్కువ మరొకడికి ఇవ్వడు. ఎందుకివ్వాలి ?" అనుకున్నాడు సత్యం.

ఆ రాత్రి అతను చెప్పేదాకా జానకికి ఈ కొత్త ఉద్యోగం సంగతి తెలియదు. అప్పుడుకూడా అతను ఏమీ ఉత్సాహంగా చెప్పలేదు. ఇదివరకు ప్రూఫ్‌రీడరు ఉద్యోగంకూడా అంతే- ఆపూట హోటల్లో తిన్న ఫలహారం వివరాలు చెప్పినట్టుగా

జానకి లోపల చాలా ఆనందించింది, కాని పైకిమాత్రం, "పోనివ్వండి ఏదో ఒకటి-ఈ గడ్డురోజుల్లో !" అన్నది. కాని అతను దగ్గిరికి తీసుకున్నప్పుడామె భయపడిన పిల్లతల్లిని కరుచుకున్నట్టుగా గట్టిగా కరుచుకున్నది.

ఈ ఉద్యోగమైనా కొంతకాలం దక్కాలని జానకి ఎంతమందో దేవుళ్ళకు మొక్కుకున్నదో పాపం.

ఆంజనేయులు ఇల్లు వాళ్ళ తాతలనాడు కట్టించిన పెంకుటిల్లు. ఆ ఇంటికి ఉండే ముఖ్య ఆవరణ ఏమిటంటే ఇంటిచుట్టూ విశాలమైనదొడ్డి. దొడ్లో ఒక బాదం చెట్టూ, వేపచెట్టూ, జామ చెట్టూ మాత్రం ఉన్నై. ఇంటి వాయవ్యదిశగా వేపచెట్టున్నది. దానికింద ఆంజనేయులు ఒక రెండు నిట్టాళ్ళ పాక గట్టిది వేయించాడు. అందులో స్కూలు నడిచేది. చదువుకునేవాళ్ళు బెంచీలమీద కూచునేవాళ్ళు. మేస్టర్లకు కుర్చీలుండేవి. ఒక్క ప్రిన్సిపల్‌కు మాత్రమే బల్లవుండేది. స్కూలుకు సంబం

ధించిన వస్తువులూ, పుస్తకాలూ ఉంచుకోటానికి ఒక బీరువా వుండేది. లెక్కలు చెప్పటానికి ఒక నల్లబల్ల మాత్రం వుండేది.

విద్యార్థులు ముప్పైమందికిపైగా వున్నారు. కొందరు ఉదయం వస్తారు. కొందరు సాయంకాలం వస్తారు. సత్యం చెప్పవలసింది చిన్న క్లాసులవాళ్ళకు.

పని తేలికపని. తాను కుర్రాళ్ళను సులువుగా ఆకర్షించగలనని తెలుసుకుని సత్యం ఆశ్చర్యపడ్డాడు. మిగిలిన ఇద్దరు మేస్టర్లతోకన్నా వాళ్ళు అతని దగ్గిర ఎక్కువ చనువుగా వుండేవాళ్ళు. వాళ్ళలో ఒకడు సత్యం ఇల్లు కనుక్కుని, తమ దొడ్లో కాసిన బీరకాయలూ, బెండకాయలూ, వంకాయలూ తెచ్చి ఇచ్చేవాడు. వాడే ఒకసారి ఒక సొరకాయా, మరొకసారి ఒక పెద్ద గుమ్మడికాయా తెచ్చి ఇచ్చాడు.

ఆంజనేయులు సత్యాన్ని చాలా బాగా చూసేవాడు. తనకింది నౌకరల్లే ఏనాడూ ప్రవర్తించేవాడు కాడు. అయితే అతని బావమరిది- ఆంజనేయులు చెల్లెలినే అతనికిచ్చారు- వట్టి "బడ్డు." అతని పేరు కాంతారావు. ఆంజనేయులు ఇంటి పడమటి భాగంలో వుంటున్నాడు. అతను లెక్కల గ్రాడ్యుయేటు. కొంచెం సైన్సు కూడా చదివాడు. స్కూలు ఫైనలు తప్పిన వాళ్ళకు కోచింగ్ ఇచ్చేవాడు. మనిషి ఎప్పుడూ బిగుసుకుపోయి ఉండేవాడు. సత్యాన్ని చూసిన క్షణం నుంచీ అతనిమీద విరోధం కట్టిన వాడిలాగా ప్రవర్తించేవాడు.

అతన్ని గురించి సత్యం పట్టించుకోలేదు. అననుకూలంగా వుండే స్నేహితులను కష్టపడి పోషించే అలవాటు అతనికి ఏనాడూలేదు. చదువుకునే రోజుల్లో కూడా అతనికి చాలా కొద్ది మంది స్నేహితులుండేవారు. కాని అందరూ హృదయమిచ్చేవాళ్ళే. అడ్డమైనవాళ్లతోనూ అన్యోన్యం సాధించగలవాళ్ళను సత్యం ఒక విధంగా మెచ్చుకునేవాడే గాని, వారిని అనుకరించాలని ఎన్నడూ ప్రయత్నించలేదు.

కాంతారావుకు సత్యమంటే విముఖత్వం ఉన్నందుకు సత్యంమీద కాంతారావు భార్యకు చాలా సుముఖత వున్నట్టు కనపడింది. ఆమె అతనికేసి ఎప్పుడు చూసినా మొహమంతా కళ్ళు చేసుకు మరీ చూసేది.

"వెకిలిమనిషి!" అనుకున్నాడు సత్యం.

ఆంజనేయులు భార్య సత్యంతో ఇంకా ఎక్కువ కలుపుగోలుగా ఉండేది. కాని ఆమెలో ఈ వెకిలితనం లేదు. ఆంజనేయులు చెల్లెలు మాత్రం, "నేనీయనను ఇంతప్పుడు ఎరుగుదును !" అని ఏన్నోసార్లు అన్నది. నిజానికి సత్యం రెండు మూడుసార్లు ఆంజనేయుల్లు ఇంటికి వెళ్ళాడు. అప్పుడు అతని చెల్లెలు తననుచూస్తే చూసిందేమో; అతనికి మాత్రం ఆమెను చూసిన జ్ఞాపకం కొంచెంకూడాలేదు. అదీగాక సత్యం దాదాపు రోజూవెళ్ళే స్నేహితుల ఇళ్ళలో వాళ్ళను గమనించి నంతగా ఎప్పుడో ఒకసారివెళ్లే ఇళ్ళలో వాళ్ళను గమనించేవాడు కాడు. ఆంజనేయులుకూ సత్యానికీ ఉండే స్నేహం స్కూలు ఆవరణ దాటలేదు.

కాని ఇప్పుడు సత్యం వాళ్ళయింటి వాళ్ళలో ఒకడుగా అయినాడు. వాళ్ళింటో ఏ అక్కర జరిగినా సత్యమూ, జానకీ భోజనానికి వచ్చేవాళ్ళు. సత్యం ఇంటో అక్కరలు జరిగేవిలేవు.

ఒకసారి సత్యం మాటల సందర్భంలో జానకి బయట వున్నట్లు చెప్పాడు, ఎవరు చెయ్యి కాల్చుకుంటున్నారన్న ప్రశ్న వచ్చి. "మా పక్కభాగంలో అవ్వగారు నాలుగు మెతుకులు ఉడకేసి పెడుతున్నది, పాపం" అన్నాడు.

"ఆ ముసలావిడకు అనవసరశ్రమ దేనికి? ఈ మూణ్ణాళ్ళూ మా ఇంటో తినండి."అన్నది ఆంజనేయులు భార్య. సత్యం తప్పించుకోవటానికి మర్యాదగా సాధ్యమైనంతవరకు ప్రయత్నించాడు.

ఆ రాత్రి అతను భోజనంచేసి ఇంటికి బయలుదేరుతుంటే, అతనికన్న ముందుగా విస్తళ్ళు వీధిలో పారెయ్యటానికి వచ్చిన కాంతారావు భార్య గుమ్మం దగ్గిర నిలబడి రహస్యంగా, "ఇంద!"అని ఒక కిల్లీ చేతిలో పెట్టి, "పాపం, ఎక్కడ పడుకున్నా ఒకటేగామూలు ఈ రాత్రికి!" అన్నది.

సత్యం రసికుడయితే ఏదో ఒకటి అని ఉండేవాడే. సత్యం ఆమె చెయ్యి అయినా గిల్లకుండా, ఏమీ విననివాడల్లే గడప దిగి వీధిన పడ్డాడు. అతను అంత దూరం వెళ్ళాక తలవాకిలి తలుపు గడియవేసిన చప్పుడు వినిపించింది.

ఇది జరిగింది సత్యం ఈ స్కూలులో ప్రవేశించిన ఒకటి రెండు నెలలకు. ఆ తరువాత జానకి ధర్మమా అంటూ ఆమె బయట ఉండలేదు. కాపరానికి వచ్చి మూడేళ్ళు దాటాక ఆమె గర్భవతి అయింది. అప్పటికి ఆమెకు పద్దెనిమిదో ఏడు నడుస్తున్నది.[1]

* * *

హైస్కూలు విద్యార్థుల కిచ్చే పరీక్షా పత్రాలు తెచ్చి తన విద్యార్థులకు పరీక్ష పెట్టడం ఆంజనేయులకు అలవాటు. సత్యంకింద చదివి వేసవి నెలవుల అనంతరం హైస్కూలులో నాలుగో ఫారంలో చేరబోయే పిల్లలు మూడోఫారం పరీక్ష కాగితాలు రాశారు.

జానకి పుట్టింటికివెళ్ళి వారమయింది. సత్యం హోటల్లో భోజనం చేస్తున్నాడు. ఇల్లు బిక్కు బిక్కు మంటున్నది. ఎప్పుడో ఒకసారి "తమాషా"కు ఒక కథరాసి పంపిస్తే అది అచ్చయింది. ఒంటరిగా ఇంట్లో తోచక కథలు రాయటానికి ప్రయత్నిస్తున్నాడు కాని అది అతనికి సులువుగా కనపడలేదు.

విద్యార్థులు వెళ్ళిపోయాక పాకలో ఒక్కడూ కూచుని సత్యం పేపర్లు దిద్ద నారంభించాడు. సరిగా దిద్దితే ఇంచుమించు అందరూ తప్పుతారు. వేసవి రెండు

1. పెళ్ళినాటికి జానకి వయస్సు పది, 15వ ఏట కాపరానికి వచ్చి ఉంటుంది. 1936వ సంవత్సరం అయి ఉండాలి.

నెలలూ రుద్దితే తప్ప వాళ్ళలో చాలామంది స్టాండర్డు అందుకోలేరు. కోర్సు కూడా పూర్తిగా కాలేదు.

సత్యం చీకటిపడుతున్న సంగతి కూడా గమనించలేదు.

"ఏమిటీ చీకట్లో చిందులాట? దీపం కావాలా?"

అంజనేయులు చెల్లెలు-అప్పుడే పాకలోకి వచ్చి అతన్ని సమీపించింది.

"అవును చీకటిపడింది, ఎట్లా చదువుతున్నానో నాకే తెలియటం లేదు," అంటూ సత్యం పేపర్లన్నీ కట్టకట్టేసి బీరువా ఉన్న మూలకు వెళ్ళి తలుపు తెరిచాడు. అక్కడ మరీ అంధకారంగా ఉన్నది.

ఆమె, తెరిచిన తలుపుముందుకు వచ్చి అతన్ని ఆనుకుని నిలబడింది. ఇది తన మగతనానికి పరీక్ష అనుకున్నాడు సత్యం.

"ఎవరూ వస్తారని భయంలేదా ?" అన్నాడతను.

"ఎవరూ రారు. వాళ్ళిద్దరూ బయటికి వెళ్ళారు. మా వదినె పిల్లకు తలంటి పోస్తున్నది."

"అయితే ఇది ఎప్పట్నుంచి ?"

"ఏదీ ?"

"ఏమిటీ ఆనుకుని నిలబడటం ?"

"ఆనుకునేటందుకు ఇద్దరు కావాలిగా ?"

"ఓహో !"

ఎవరో తోసినట్టుగా సత్యం శృంగారం చేశాడు.

కాంతారావు భార్య తన వెంగలితనం దాచటానికి ప్రయత్నించలేదు. సత్యానికి తనమీద వ్యామోహం లేదనికూడా ఆమె తెలుసుకోలేదు.

"నీ మొగుడో ? అతనంటే ఇష్టంలేదా ?"

"వట్టి జిడ్డుగాడు !"

"నేను ?"

"నీ కన్నీ తెలుసు."

"ఓహో"

"అయిదేళ్ళయింది కాపరానికి వచ్చి. పిల్లాపీచూలేదు."

సత్యం కొద్దిగా జాలిపడ్డాడు.

సత్యం తనని ముద్దుపెట్టుకునే ప్రయత్నం చెయ్యడని ఆమె అతన్ని ఇంచుమించు బలాత్కారంగా ముద్దుపెట్టుకున్నది. అతనిలో మార్పు గమనించి ఆమె "మా భాగంలోకి పోదాం," అన్నది.

సత్యం అభ్యంతరం చెప్పలేదు.

తరవాత పావుగంటకు అతను తలవాకిలి తలుపు తెరుచుకుని వెళ్ళిపోతుం

డగా, తూర్పువైపు ఆవరణలో తన కూతురి జుట్టు ఆరబెట్టుతున్న ఆంజనేయులు భార్య చూసింది. కాని ఆమె ఏమీ శంకించలేదు.

కాంతారావు భార్య దయ్యమై ఉంటే సత్యాన్ని ఆవహించి మారణ హోమం చేసినదాకా విడిచిపెట్టి ఉండకపోను. కాని మనిషి కావటంచేత సత్యాన్ని పట్టించు కోవటానికి వెర్రి వేషాలు ఎన్నో వేసింది. ఒక రాత్రివేళ స్కూలు పాకలో అతన్ని కలుసుకునేటందుకు ఏర్పాట్లు చేసింది., కాంతారావు ఊరికి వెళ్ళిన రోజున మిట్టమ ధ్యాన్నం వేళ అతన్ని తమ భాగంలోకి రప్పించుకున్నది. ఆమె మోహావేశం తిన్నకొద్దీ పెరిగే ఆకలిలాగా ఐపోయింది.

సత్యానికి మొదట్లో ఆమె పైన లీలగా ఏర్పడిన కోరికా, జాలీ పూర్తిగా పోయినై. ఆమెపైన అతనికి అసహ్యంకూడా ఏర్పడింది. ఈ మనిషి మూలంగా అతనికి జానకిపైన ప్రేమ హెచ్చసాగింది.

ద్వేషం కామ సంతృప్తికి అడ్డం రాదు. ఎన్నో లక్షల దాంపత్యాలు ఈ సత్యాన్ని రుజువు చేస్తున్నై. సత్యం అతి హేయమైన పరిస్థితులలో, ఇష్టంలేని ఆ మనిషినుంచి దాదాపు మూడు వారాలు కామ సంతృప్తి పొందాడు. ఈ లోపల రెండుమూడుసార్లు వారి గుట్టు బయట పడ్డంతపని జరిగి, కేవలం దైవికంగా ఆపద తప్పింది.

"రామాన్న కూడా నా జీవితం లాగే ఉంది." అనుకున్నాడు సత్యం నిర్వి చారంగా.

ఇంతలో కాంతారావు భార్య జిగినీనాను కాస్తాపోయింది. పోయినసంగతి కనుక్కున్నవాడు కాంతారావని చెప్పాలి. అతను నిద్ర లేస్తూనే తన పక్కన పడుకున్న భార్య మెడలో జిగినీనాను లేకపోవటం గమనించి, తీసి ఎక్కడో దాచిం దనుకున్నాడు. లేపి అడిగితే ఆమె కంగారుపడి మెడ తడువుకున్నది. పోయిన నగ కోసం వెతికారు. ఇంట్లో ఎక్కడా దొరకలేదు.

అది ఎక్కడ పడిపోయి ఉంటుందో పోగొట్టుకున్న మనిషికి ఒక్కర్తికే తెలుసు. ఆమె ఏదో మిషమీద పాకలోకి వెళ్ళింది. గడచినరాత్రి ఆమె, సత్యమూ ఆ పాకలో ఒక అరగంటసేపు గడిపారు. వాళ్ళు చేర్చివేసిన రెండు బల్లలూ ఇంకా చేర్చే ఉన్నై. వాటిని చూడగానే ఆమెకు నవ్వు కూడా వచ్చింది.... కాని జిగినీనాను జాడలేదు !

ఆమె తన పోయిన నగ గురించి ఆలోచించలేదు. అది దొరుకుతుందని ఆమెకు నమ్మకమే. గడిచిన రాత్రి తాను చేసిన సాహసం గురించి ఆమె గర్వంతో ఆలోచించుకున్నది. "బడ్డు"ను లోపల ఉంచి తాను పాకలోకి వచ్చింది. తలవాకిలి తలుపు పదిగంటల రాత్రివేళ గట్టిగా వినిపించేలాగ గడియవేసి నిశ్శబ్దంగా మళ్ళీ తీసింది. రాత్రి పన్నెండు గంటలవేళ సత్యం వచ్చి కిటికీ రెక్కమీద రెండుసార్లు

గిరీ సంజ్ఞ చేశాడు. తాను చల్లగా లేచి బయటికి వచ్చింది—మధ్యలో తనభర్త లేచి తలుపు తీయటానికి ప్రయత్నించి ఉంటే వాకిలి బయట గొళ్ళెం పెట్టి ఉండటం తెలుసుకునేవాడే. కాని ఆ మొద్దు లేవనేలేదు— వెళ్ళిపోయేటప్పుడు సత్యం తల వాకిలి తలుపు గడియపడేటట్టుగా వేసి మరీ వెళ్ళాడు. అందుకే దొంగ ఇంటి ఆవరణలోకి వచ్చిన జాడలేమీ లేవు.

నగ ఎక్కడికీ పోలేదు. సత్యం రాత్రి వెళ్ళిపోతూ, కలిపివేసిన బల్లల పక్కగా పడిపోయిన జిగినీనాను మీద కాలు వేశాడు. అది కొక్కెంఊడి జారి పడిపోయి ఉండాలి. అప్పటికే కాంతారావు పెళ్ళాం లోపలికి వెళ్ళిపోయి తలుపు బిగించింది. పిలిచి ఇవ్వటం ప్రమాదకరం. ఏమీ పాలుపోక అతను బీరువాలోని ఒక అరలో కాగితాల కట్టకింద దోపేశాడు.

ఇంతలో పెద్ద రాద్ధాంతం జరుగుతుందని అతను ఊహించలేదు. నగ పోయిన సంగతి కాంతారావుకన్న ముందుగా అతని భార్య తెలుసుకుని ఉంటే ఆమె ఏదో ఒక బొంకు బొంకి దొంగతనం అన్నమాట రాకుండా చూసుకుని, వీలుచేసుకుని సత్యంద్వారా నిజం తెలుసుకుని ఉండేది. ఆ అవకాశం కాస్తా పోయింది.

"ఆ సత్యమే దొంగతనం చేసి ఉంటాడు. వాడిది దొంగమొహం!" అన్నాడు కాంతారావు.

"ఛీ, ఛీ ! వాడి ఇంటావంటా అటువంటి గుణాలు లేవు." అన్నాడు ఆంజనేయులు.

ఎనిమిదిన్నర ప్రాంతాల సత్యం వచ్చాడు. నగ దొంగతనం గురించి వింటూనే అతను కలవరపడటం చూసి ఆంజనేయులు ఆశ్చర్యపడ్డాడు.

"చిత్రంగా ఉందే," అన్నాడు సత్యం.

"తీసుకున్న వాళ్ళెవరైనా మర్యాదగా ఇచ్చెయ్యటం మంచిది!" అన్నాడు కాంతారావు గోడకేసి కోపంగా చూస్తూ.

"నన్నేనా అంటున్నావు?" అని అడగాలనిపించింది. కాని సత్యం అలాటి అర్థంలేని పనిమాటుకు చెయ్యలేదు.

"ఆ నగ నువే తీశావా?" అని ఎవరూ సూటిగా సత్యాన్ని అడగనూలేదు. సత్యం తాను తీయలేదని చెప్పనూలేదు. కాని నిజంగా తానే తీసి ఉంటే ఆమాట ఒప్పుకునేటందుకు సత్యానికి బోలెడంత అవకాశం మాత్రం దొరికింది. దాన్ని ఆత్మన్ను ఉపయోగించుకోని కారణంచేత తాను నగ తీయలేదని చెప్పకనే చెప్పిన వాడైనాడు సత్యం.

అతని బుర్ర తీవ్రంగా ఆలోచిస్తున్నది. ఆ బీరువాలో ఉన్న వస్తువు మరొకరి కళ్ళ పడకముందే అసలు మనిషికి చేరే ఉపాయం ఏమిటి ? "బీరువాలో ఏమన్నా ఉందేమోచూద్దాం!" అంటూ తాను వెతికినట్టు అభినయించి దాన్ని చివరకు

బయటికి తీయవచ్చు. కాని అందువల్ల తాను దొంగ అన్నది రుజావవుతుంది గాని మరేమీ కాదు. "ఈ పాకలో పడివుంది, తీసి దాచాను." అంటే, "దాయటం దేనికి? మాకే ఎందుకివ్వలేకపోయావు?" అని అడిగితీరుతారు. నిన్న సాయంకాలం తాను పాకవిడిచి వెళ్ళేసరికి బావమరుదు లిద్దరూ అక్కడే ఉన్నారు. ఏం చెయ్యటానికీ లేదు. కోతిపుండు బ్రహ్మరాక్షసి అయింది మొత్తానికి!

సత్యం కాంతారావు భార్యను మనసులో తిట్టుకున్నాడు. కాని తిట్లతో సమస్యలు పరిష్కార మవుతాయా?—

కర్మగాలి ఆ జిగినీనాను బీరువాలో కాంతారావుకే దొరికింది.

"నేను మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాను. ఇది ఆ ముచ్చుమొహం వాడు, సత్యంపనే! చూడు, ఈ నోటుపుస్తకాల కట్టకింద ఎంత తెలివిగా దాచాడో. మనం నగకు తిలోదకా లిచ్చేసినాక పట్టుకుపోయి తెగనమ్మేవాడు. ఇల్లు సోదా చేసినా తన దొంగతనం బయట పడకుండా పథకం వేశాడు. పాపిష్టి ముండా కొడుకు!"

కాంతారావు అక్కస్సంతా వెళ్ళగక్కాడు. అదృష్టవశాత్తూ నగదొరికే సమయానికి సత్యం అక్కడ లేడు.

"మన నగ మనకు దొరికింది. అంతటితో పోనీ!" అన్నాడు ఆంజనేయులు. అతని గుండె సీసంగుండులాగుంది. సత్యం దొంగతనంలో కాంతారావుకు కుదిరినంత నమ్మకమూ అతనికి కుదిరింది. అయితే కాంతారావు విజయగర్వంతో విర్రవీగాడు; ఆంజనేయులు అవమానంతో అణుచుకుపోయినాడు.

అవకాశం చిక్కగానే కాంతారావు సత్యాన్ని నిలవేసి, "నువు నగ దొంగిలించావా, లేదా?" అని అడిగాడు. తనకు నగ ఎక్కడ దొరికినదీ చెప్పి అది ఎవరి పని అయి ఉంటుందో సత్యాన్నే చెప్పమన్నాడు.

"ఆ బీరువాకు తాళంలేదు, ఎవరైనా దాన్ని అందులో పెట్టవచ్చు. నేనే దొంగతనం చేస్తే ఇక్కడ దాచటం దేనికి, మా ఇంట్లో దాచుకోలేనా ? అన్నాడు సత్యం.

"మీ ఇల్లు సోదా చేయవచ్చుగా?" అన్నాడు కాంతారావు.

"అది దొంగబుద్ధికి తట్టే ఆలోచన! నగ సంగతి తెలియని వాణ్ణి ఇల్లు సోదా దాకా నే నెక్కడ ఆలోచిస్తాను?" అన్నాడు సత్యం చాలా దురుసుగా.

అతను అంత గట్టిగా మాట్లాడటంతో ఆంజనేయులు గుండె బరువు చాలా తగ్గింది.... కాని సత్యానికి ఉద్వాసన చెప్పక తప్పిందికాదు.

ఆ ఉద్యోగం పోవటంతో సత్యానికి కాంతారావు పెళ్ళాం పీడ విరగడైపోయింది. కాని ఆమె మాత్రం ఎవరూ లేనప్పుడు పళ్ళుపటపటా కొరుక్కున్నది; తన మొగుణ్ణి కసితీరా తిట్టుకున్నది.

# 3

జానకికి పురుడు వచ్చింది; మగపిల్లవాడు. ఉత్తరం అందగానే సత్యం బయల్దేరి, అత్తగారి ఊరువెళ్ళాడు. అది పల్లెటూరు. వాళ్ళ ఆర్థిక పరిస్థితి కూడా అంతంతమాత్రంగానే ఉంది.

బస్తీలో ఉండి ఉండి పల్లెటూళ్ళలోకి అడుగు పెట్టగానే సత్యానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అలిసిపోయిన అతని శరీరాన్ని ప్రకృతిమాత హాయిగా నిమిరి నట్టున్నది. "ఈ పల్లెటూరి జీవితంలో ఆబద్ధం లేదు; తెల్లవారి లేచింది మొదలు రాత్రి పడుకునేదాకా భౌతికావసరాలకోసం జీవిస్తారు. ఇటువంటిచోట పెద్దగా బతికినా ఆటే కష్టం ఉండదు. నేనీ పల్లెటూళ్లో కాపురం పెడితే బాగుండును." అనుకున్నాడు సత్యం.

అతను పురిటిగదిలోకి వెళ్ళి బాలింతరాలినీ, పసిగుడ్డునూ చూశాడు.

జానకి బొమ్మలాగుంది. దేవకన్యలాగుంది; ఎవరూ లేకుండా చూసి సత్యం జానకిని ఆత్రంగా ముద్దుపెట్టుకున్నాడు. జానకి అతని చెంప నిమిరింది. తరవాత గర్వంగా చిరునవ్వు నవ్వి, పొత్తిళ్ళలో గుడ్డును చూపించి, "ఎట్లా ఉన్నాడు?" అన్నది.

"చిన్న కోతిపిల్లల్లే ఉన్నాడు." అన్నాడు సత్యం తన కొడుకును ముట్టుకోవటానికి భయపడుతూ.

ఒక జీవితం తన కళ్ళ ఎదట ఆరంభమవుతున్నది. తన జీవితంలో తాను స్మరించలేని దశలన్నీ వాడిలో చూసుకోవాలి.

"సులువుగానే కన్నావుటగా ?"

"మావాళ్ళు ఆవకాయ పెడుతున్నారు. తరిగిన ముక్కలు తుడిచి చాటలో వేస్తుండగా నెప్పులు వచ్చినై. అంతే, తరవాత నాలుగు గంటలకు కనేశాను."

"సరేగాని ఇంత అందంగా ఎందుకున్నావ్ ?"

జానకి మళ్ళీ నవ్వింది.....

వచ్చినరోజు సత్యం ఊరంతా తిరిగాడు. అందరూ పలకరించారు. "సీతారామయ్యగారి అల్లుడుగారా?" "జానకమ్మ పెనిమిటివా, నాయనా !" ఆడా మగా కూడానూ.

ఎండలింకా తగ్గలేదు. కాని గ్రామం బస్తీకంటె చల్లగానే ఉన్నది.

మర్నాటికల్లా పల్లెటూరి ఆకర్షణ ఒకవంతు తీసిపోయింది సత్యానికి. అప్పుడే తాను వచ్చి ఒక యుగం అయినట్టున్నది. ఒక్క జానకే ఎన్నిసార్లు చూసినా ఆశ్చర్యం కలిగించేటంత అందంగా ఉన్నది.

పదకొండోరోజు బారసాల జరిగింది. సత్యం తన కొడుక్కు తనతండ్రి గోపాలంగారి పేరే పెట్టుకున్నాడు. బారసాలకు అతనివైపు వాళ్ళెవరూ రాలేదు.

బారసాల అయిన మర్నాడే తొలకరించింది. గ్రామం యావత్తూ బురదమయం అయింది.

సత్యం జానకితో, "ఇక నేనీ ఊళ్ళో ఉండను. నువ్వు ఎప్పుడొస్తావు. నేను మళ్ళీ ఏదన్నా పని చూసుకోవాలిగద. ఇకనుంచీ ముగ్గురం !" అన్నాడు.

"అప్పుడే వెళ్ళకండి. మీరు వచ్చినాక కాస్త సందడిగా ఉంది!" అన్నది జానకి.

సత్యం సరే నన్నాడు. ఒక మనిషి ఇంకొకమనిషికి నిజంగా సుఖం కలిగించటం చాలా అరుదైన విషయమనీ, అది అనుకున్నంత సులువు కాదనీ, ఆ పనిచేసే అవకాశాలను విడిచి పుచ్చేవాడు మనిషే కాడనీ చాలాకాలంగా సత్యం నమ్మకం. అయితే ఇది ఆచరణలో పెట్టటానికి చాలా ప్రతిబంధకాలున్నాయి. కొందరి సుఖం ఎంత స్వార్థంతోకూడి ఉంటుందంటే అవతలివాళ్ళు నానా అగచాట్లూ పడే పరిస్థితుల్లో తప్ప వాళ్ళకు సుఖం కలగదు.

జానకి చాలా అల్పసంతోషి. కాపరానికి వచ్చిన కొత్తలో మొగుడు తనకేసి చూసి నవ్వితే చాలు పారవశ్యం చెందేది. అయితే జానకిలో ఇలాటి లోపంకూడా ఒకటి ఉండేది—మొగుడు కాస్త పరధ్యానంగా ఉన్నా, కాస్త మొహం చిట్లించినా చిలవలూ పలవలూ అల్లుకుని బాధ పడేది.

ఈ సంగతి అర్థంకాగానే సత్యానికి కోపం వచ్చింది, "దీన్ని సుఖపెట్టటానికి గాను కాస్త కుడీ ఎడంగా పోతే పోగలనేమో గాని కత్తిమీద సాము ఎక్కడ చెయ్యను ?" అనుకున్నాడతను.

జీవితంలో ఆదర్శాలు అమరవని అతను భార్యకు చెప్పటానికి ప్రయత్నించాడు. "అనేక సందర్భాలలో మనం ఒకరిని నొప్పించుకోవలసి వస్తుంది. అచ్చగా నన్ను సుఖపెట్టటానికి నువు ప్రతిపనీ చెయ్యదలిస్తే ఏపనీ చేయలేవు. నిన్ను సంతోషపెట్టటమే నా జీవితాశయంగా పెట్టుకుంటే నేను ఇంకెందుకూ పనికిరాను. నువ్వే జీవితంగా నేనూ బతకలేను. నేను తప్ప ఇంకో జీవితం లేకుండా నువ్వూ బతకలేవు. అది అసంభవం. ఆఖరుకు పుస్తకాల్లోకూడా మనుషులు అట్లా బతకరు. నేను చిరాకు పడ్డప్పుడల్లా నువు గుడ్లలో నీళ్ళు కుక్కుకోరాదు. నా చిరాకుకు సవాలక్ష కారణాలుంటై. ఆ సంగతి గ్రహించకపోతే నువు మరొక కారణం కల్పిస్తావు. సాధ్యమైనంతవరకు నన్ను వదిలేసి ఊరుకో. నేను నిన్ను బంధించి ఉంచటానికి ప్రయత్నిస్తున్నానేమో చూడు !" ఈ ధోరణిలో ఎన్నో పర్యాయాలు చెప్పిచూశాడు.

ఇదంతా వింటున్నకొద్దీ జానకికి తనమీద అతనికి తగినంత ప్రేమలేదని మాత్రమే రూఢి అయింది. తన మొగుడే జీవితం అనిపించటంవల్ల, "నువు కాక నాకు చాలా జీవితం ఉన్నది." అని అతను అనటం అతనికి తనమీద తగినంత అభిమానం లేకపోవటమేనని ఆమెకు రూఢిగా తోచిపోయింది. "నేను నీకు ఇవ్వటా

నికి సిద్ధంగా ఉన్న స్వేచ్ఛలో నువు పదోవంతుకూడా వినియోగించుకోవటంలేదు- అది న్యాయంగా నా తప్పుకాదు. సాధ్యమైనంతవరకు నీతో సమానంగా ఏ ఆనంద మైన పంచుకోవటానికి నేను సిద్ధంగానే ఉన్నాను. కాని నేను పంచుకోవటంలేదని ఏ ఆనందాన్నీ నువు విడిచిపెట్టనవసరంలేదు." అని అతను అంటే ఆమెకు భయం వేసేది. తనమీద అతనికి తగినంత ప్రేమ లేక, "నా బతుకు నన్ను బతకనీ. నీ బతుకు నువు బతుకు." అని వ్యంగ్యంగా చెబుతున్నాడనుకునేది జానకి.

అన్నిటికన్న ఆమెను మరీ కంగారు పెట్టినది అతని ఆగ్రహావేశం. ఒకనాడు కొంపలో నెయ్యి లేదు. కూరలు లేవు. జానకి తన భర్త కిష్టమైన కారపుపచ్చళ్ళు చేసింది. అతను పచ్చడి కలుపుకుని నెయ్యి అడిగితే, ఇంట్లో నెయ్యిలేదని తెలిసి "ఈ కారపు పచ్చళ్ళు చెయ్యకపోతే ఏదో పప్పిడి చెయ్యరాదూ ?" అని సత్యం ఎగిరిపడ్డాడు.

"ఇంట్లో నెయ్యిలేకపోతే నేనేం చేసేది !" అని జానకి వెక్కి వెక్కి ఏడిచింది.

"ఇంట్లో నెయ్యిలేనందుక నిన్ను తప్పుపట్టానా ? నువ్వు కాస్త నీ బుద్ధి ఉప యోగిస్తే ఈ కారం ముద్ద దిగమింగే బాధ నాకు తప్పేదిగదా !" అన్నాడు సత్యం.

"మీ కిష్టమని ఆ పచ్చడి చేశాను !"

భర్త తనమీద అరవటంతో ఆమెకు ఉన్నమతి కూడా పోయిందని అతను అర్థం చేసుకుని అంత చిరాకులోనూ గట్టిగా నవ్వాడు.

జానకి చాలా విషయాల్లో అజ్ఞానంగా ప్రవర్తించేది. ఆ అజ్ఞానంవల్ల ఏ ఇబ్బందీ లేనప్పుడు సత్యం నవ్వేసేవాడు; పెళ్ళాన్ని ముద్దుచేసేవాడుకూడా. కాని ఆ అజ్ఞానంవల్ల తన "భారం" ఏ మాత్రం పెరిగినా అతనికి ఓపికపోయి కేకలు పెట్టేవాడు.

అతను కేకలు పెట్టటంలో కొంతైనా అర్థం వుందని తనకు తట్టాక జానకి పశ్చాత్తాపపడేది. కాని ఒక్కొక్కసారి తాను భర్తమీది ప్రేమకొద్దీ చేసే పనులు చేసి అతనికి కోపం తెప్పించినప్పుడామె నిష్కారణంగా తన్నులుతిన్న పసిపిల్లలాగా అయిపోయి, ప్రపంచంలో ధర్మమే అడుగంటినట్టుగా బాధపడేది. సత్యానికి ఉన్న నెయ్యంతా వడ్డించేసి తాను నెయ్యి లేకుండా తిని తిట్లుతిన్న రోజునా, చేసిన కూరంతా అతనికే వేసిన రోజునా అతనికి కోపం తెప్పించి ఆ విధంగా బాధ పడింది. పక్క భాగంలో ఆడవాళ్ళ వెంట సినిమాకు వెళ్ళమని సత్యం అంటే, తనకు చూడాలని ఉన్న సినిమాలకుకూడా, అతను వెంటరాలేదని మానేసినప్పుడు కూడా, అతను చిరాకుపడ్డాడు; జానకి నివ్వెరపోయింది.

జానకి మంచి ప్రవర్తన అనుకున్నది సత్యం సంస్కారానికి విషంలాంటిది. ఆ సంగతి జానకికి అర్థమయ్యేటట్టు చెయ్యటం ఎట్లాగో సత్యానికి తెలియలేదు. అతను చేసిన ప్రతి ప్రయత్నమూ బెడిసికొట్టింది.

అయితే వాళ్ళ దాంపత్యాన్ని కవచంలాగా కాపాడిన ఒక్క అంశమేమంటే వారిద్దరికీ ఒకరిలో ఒకరికిగల పూర్తి విశ్వాసం. జానకి అవసరమైతే తనకోసం ప్రాణం ఇచ్చేస్తుందని సత్యానికి తెలుసు. అటువంటి విశ్వాసమే జానకికీ కూడా ఉన్నది. ఒకర ప్రవర్తన మరొకరికి అయోమయంగానూ, అపసవ్యంగానూ ఉన్నప్పుడు కూడా వాళ్ళు ఒకరికొకరు దురుద్దేశాలూ, నీచోద్దేశాలూ ఆపాదించుకోలేరు. అందుచేత వాళ్ళ దాంపత్య జీవితం ఎన్నిసార్లు కెలకబారినా, క్షణంలో తేరుకుని నిర్మలంగా తయారయేది ....

భార్య కోరిక మన్నించి సత్యం మరికొన్ని రోజులు ఉండిపోయాడు. వానలు బాగా పట్టుకున్నై. గ్రామమంతా ఊదిలాగా అయింది.

"కుమ్మరి వాళ్ళకు పండగ ! ఎక్కడ చూసినా వాళ్ళకు పనికొచ్చే మట్టే. నేనే కుమ్మరినైతే ఏడాదికి సరిపడే కుండలూ, చట్లూ, జానలూ ఇప్పుడే చేసేస్తాను" అన్నాడు సత్యం.

ఆ హాస్యానికి జానకి ఒక్కతే నవ్వింది.

"జానకీ, ఇక నే నీ ఊళ్లో ఒక్కరోజుండలేను, వెళతాను. ఇక్కడి వాళ్ళతో ఎంత మాట్లాడినా చెయ్యటాని కేమీ తట్టటంలేదు." అన్నాడు సత్యం.

జానకి భర్తను దిగులు కళ్ళతో చూసింది. అభ్యంతరం చెప్పలేదు.

"అక్కడ చేసేటందు కేమీ లేకపోతే నాలుగు రోజులుండి మళ్ళీ రండి. ఏకంగా అందరమూ కలిసే వెళ్ళవచ్చు," అన్న దామె.

* * *

అతను ఇంటికి తిరిగివస్తూనే ఒక కొత్తవృత్తి సంపాదించాడు. అది జర్నలిజం.

లోగడ అతను చేసిన ఉద్యోగాల మాదిరిగానే ఇది కూడా కేవలం దైవికంగా సత్యం ప్రయత్నంగాని ప్రయోజకత్వంగాని ఏమీ లేకుండా, తారసిల్లింది.

ఊరికి తిరిగివచ్చిన మర్నాడు ఉదయమే సత్యం కనకయ్య హోటలుకు వెళ్ళాడు. గల్లా పెట్టెదగ్గిర కూచున్న కనకయ్య సత్యాన్ని చూస్తూనే, "ఎక్కడా కని పించటంలేదే?" అన్నాడు.

"అత్తవారింటికి వెళ్ళి నెల రోజులు అక్కడే ఉన్నా. అబ్బాయి పుట్టాడులే!" అన్నాడు సత్యం.

"అట్లాగా? నిన్న ఎందుకో శ్రీరాములు మీకోసం అడిగాడండీ!" అన్నాడు కనకయ్య.

"శ్రీరాములా? ఏ శ్రీరాములు?" అన్నాడు సత్యం ఆశ్చర్యంతో.

"పోస్టాఫీసువీధిలో లేడూ? పత్రికల ఏజెంటు శ్రీరాములండీ! మీకుమాత్రం తెలీదూ?"

సత్యానికి తెలిసింది. కాని ఆ శ్రీరాములుకు తనతో ఏం పనో అర్థం కాలేదు. కనకయ్య కూడా చెప్పలేకపోయినాడు. సత్యం సహజమైన అహంకారంతో

శ్రీరాములును తన మనసులోనుంచి నెట్టి అవతల పారేశాడు. తనకు శ్రీరాములుతో పనిలేదు; అతని కుంటే అతన్నే వెతుక్కుంటూ రానీ!

అహంకారం ఏపాటి పరీక్షకూ నిలవదు. నిలిచేటట్టయితే అది చెడ్డదని నలుగురూ అనుకోవలసిన అవసరమే లేదు. శ్రీరాములుతో తనకు పనే ఉండ దనుకోవటంలో సత్యం పూర్తిగా పొరబడ్డాడు. అతను కాఫీతాగి కిల్లీకొట్టు దగ్గిర బీడా కట్టించి, సిగిరెట్టు వెలిగిస్తూండగా శ్రీరాములే అతన్ని పలకరించాడు.

"మీకోసం అందరినీ అడిగి అడిగీ నోరు నెప్పెత్తిందనుకోండీ ! ఒక్కసారి మా దుకాణం దాకా వస్తారూ ? చిన్న సలహా కావాలి." అన్నాడు శ్రీరాములు.

శ్రీరాములుది కిరాణాకొట్టు. అందులోనే ఒక భాగంలో పత్రికల ఏజెన్సీ కూడా. దిన వార పక్ష మాస పత్రికలు ఏడెనిమిది దాకా అమ్మేవాడు. అతనికింద ఉండే ఇద్దరు కుర్రాళ్ళూ గట్టివాళ్ళు. ఒకడు రైలు స్టేషనూ, బస్సులూ చూసుకునే వాడు; రెండోవాడు పెద్దబజారూ, పేటలూ తిరిగేవాడు. కొట్లోకూడా అంతో ఇంతో అమ్మకా లుండేవి!

"పత్రిక పెట్టాల నుందండీ. లెక్కలు వేశాను. నలభై ఎనిమిది పేజీల పత్రిక వేస్తే మనకు అణాకు గిట్టుతుంది. బేడకు అమ్మవచ్చు. అయిదారు వందల కాపీలు నేనే ఊళ్ళో అమ్మించగలనని ధైర్యం ఉంది. బెజవాడలోనూ గుంటూరులోనూ అమ్మటానికి ఎరిగిన వాళ్ళున్నారు. పత్రికలు అమ్మేవాళ్ళే వేయీ, పదిహేనువందల కాపీలకు ఢోకా ఉండదు. మరి పత్రిక చూడటానికి ఎవరన్నా కావాలి. నేను మిమ్మల్ని ఎరగననుకోండీ. ఇద్దరు ముగ్గురి నడిగితే మీ పేరు చెప్పారు. నేను ఆటే ఇచ్చుకోలేను. ఇరవై రూపాయ లిద్దా మనుకుంటున్నాను. గట్టిగా వారం రోజుల పని ఉండదు చూడండీ," అన్నాడు శ్రీరాములు.

"నాకు మాత్రం పత్రికల గొడవ ఏం తెలుసుగనుక ?" అన్నాడు సత్యం నిష్కపటంగా. శ్రీరాములు నవ్వాడు. సత్యానికి పత్రిక నడపటం పెద్దగా తెలుసునని అతను అనుకోలేదు. అనుకుంటే ఇరవై ఇస్తాననేవాడు కాడు. అతనికి సహజమైన తెలివితేటలు బాగానే ఉన్నై. తాను అమ్మే పత్రికలన్నీ చదివి, ఏది ఎందుకు బాగా అమ్ముతున్నదీ, దేనిలో ఏమి లోపం ఉండటంవల్ల అమ్మలేక పోతున్నదీ గ్రహించటానికి ప్రయత్నించాడు. సంవత్సరం పైచిలుకుగా అతని పరిశోధన సాగింది. పత్రిక అమ్మే కీలకం తనకు తెలుసుననే నిశ్చయానికి వచ్చినాకనే అతను పత్రిక పెట్ట నిశ్చయించాడు. కాని దాన్ని కనిపెట్టి ఉండటానికి, తాను కనుక్కోలేని పొరపాట్లను సరిచెయ్యటానికి ఒక చదువుకున్నవా డుండటం అవసరమని అతనికి తోచింది.

"అదేమిటి, పంతులుగారూ ? మీరు బాగా చదువు సంస్కారాలు గలవారు. పత్రికలకు రాస్తారుకూడానూ-మీకథ నేను చదవలేదనుకున్నారా ? దాన్ని మనమేగా అమ్ముతున్నదీ ?" అన్నాడు శ్రీరాములు.

సత్యం ఈ పని చెయ్యటానికి ఒప్పుకున్నాడు. తాను ఏది చెయ్యవలసివచ్చినా కొత్త ఆరంభంగానే ఉన్నది. అతను వెంటనే ఒక ఎరిగున్న ప్లీడరు గారింటికి వెళ్ళి ఆయన దగ్గిర పడి ఉన్న కట్టలలోనుంచి పాత ఇంగ్లీషుపత్రికలు పట్టుకొచ్చి ఒక వారంరోజులపాటు మహా శ్రద్ధగా చదివాడు.

తెలుగుపత్రిక నడపడానికి ఇంగ్లీషుపత్రికల పఠన పరిచయాలు ఎందుకూ పనికిరావని అతనికి తెలియలేదు. తట్టనుకూడాలేదు.

ఈ లోపుగా శ్రీరాములు "సుశీల" అనే పత్రికకు డిక్లరేషను పడేశాడు. తానే ప్రొప్రయిటరూ, పబ్లిషరూ, ఎడిటరూనూ. దిన పత్రికలో ఒక ప్రకటనకూడా వేయించాడు. అదికాక సత్యం కొంతమంది కథకులకు ఉత్తరాలు రాశాడు. కొన్ని కథలు వచ్చిచేరినైకూడా.

శ్రీరాములు చల్లగా సత్యాన్ని తరిఫీదుచేస్తూ వచ్చాడు. "అమ్మాయి–అబ్బాయీ కథలైతే జనం చదువుతారు పంతులుగారూ! బూతుకథలు లాభం లేదండీ-ఆడవాళ్ళ పత్రిక పొయిలో పెట్టేస్తారు....బాంబేటాకీసు వాళ్ళ పిక్చర్ల కథలు చూడండీ, అటువంటివి చాలా బాగా నచ్చుతై."

శ్రీరాములుకు ఇతివృత్తంలో ఉండే నమ్మకం శిల్పంలోలేదు. నిజానికి అదే మిటో అతనికి తెలీదుకూడా.

తన సంస్కారానికీ, శ్రీరాములు విశ్వాసాలకూ పొంతన కుదరదని సత్యం మొదలాడే తెలుసుకున్నాడు. కాని తన ఉద్దేశాలను నెగ్గించాలని అతనికి తట్టలేదు. శ్రీరాములు పత్రిక, అతని ఇష్టప్రకారమే నడుపుకోనీ; తనదేం పోయింది ?

పత్రికలో శేషాచార్లు మాసఫలాలు రాయబోతున్నాడని తెలిసినప్పుడు మాత్రం అతనికి చిరాకెత్తింది.

"ఈ దిక్కుమాలిన జ్యోతిషంకూడా ఎందుకు?" అన్నాడతను శ్రీరాములతో.

"అట్లా అనుకుంటున్నారా? అచ్చగా వాటికోసమే పత్రిక కొనేవాళ్ళుంటారు తెలుసాండి? అందులో మనం కల్లబొల్లి జోస్యం చెప్పేదిలేదు. ఆచార్లుగారు శాస్త్ర ప్రకారం రాస్తారు. ఎంత ఉపయోగం!"

పత్రికకు ప్రకటనలుకూడా వచ్చినై. ఊళ్ళో ఉన్న సినీమాలవాళ్ళు తమ సినీ మాల ప్రకటనలు వేసినందుకు శ్రీరాములూ, పత్రికతో సంబంధం ఉన వాళ్ళూ సినిమాలు ఊరికే చూడవచ్చు.

విడుదల అయిన సినిమాలను గురించి మూడుముక్కలు రాసేపని సత్యానికి పడింది.

కృత్యాద్యవస్థలన్నీ గడిచి "సుశీల" తొలిసంచిక బయటపడ్డాక సత్యం దాన్ని చూసి గర్వపడలేదు. అతని తృప్తి అల్లా ఆ పత్రికతో తనకు దాస్యసంబంధం తప్ప మరేమీలేదనే.

సత్యంలో ఇదొక విపరీత లక్షణమే అనాలి. అతను ఏ ఒకపనిగాని దక్షతతో సాధించగల డన్నది రుజావు కాలేదు. అయినా అతను ఇతరులు చేసే పనులకు కూడా కొన్ని ప్రమాణాలు నిర్ణయించుకున్నాడు. ఆ ప్రమాణాలకు తగ్గినవాటిని అతను తృణీకారభావంతో చూసేవాడు. నిర్దయగా విమర్శించేవాడు. వాటితో తనకు ఎటువంటి సంబంధం ఉన్నా, వాటిని చూచి తాను సిగ్గుపడేవాడు. పనులు చెయ్యటంలో గల సాధకబాధకాలూ, ప్రతిబంధకాలూ, వాస్తవ వ్యక్తులలో ఉండే ప్రజ్ఞా పరిమితీ అతను గణనలోకి తీసుకునేవాడుకాడు. "ఒక మూడుడు చెయ్యగల పని ఇంకొక మూడుడు చెయ్యగలడు" అనే ఇంగ్లీషు సామెతను మనసులో పెట్టుకుని అతను తన విమర్శలను సమర్థించుకునేవాడు.

"సుశీల" గురించి చర్చ వచ్చినప్పుడు సత్యం, "ఎవరుగాని ఈ పత్రికను ఎందుకుకొనాలి ?" అని అడిగాడు.

"కొంటూరు చూస్తూండండి," అని ఒక రన్నారు.

"కొంటారా, లేదా అని కాదు. ఎందుకుకొనాలని !"

"ఎందుకు కొనరా దని!"

"అవతల దీని బాబుల్లాంటి పత్రికలున్నై గనక."

"లోకంలో గొప్పవాళ్ళున్నారుగదా అని కొద్దివాళ్ళు ఉరిపోసుకు చస్తారా ? విపులాచ పృధ్వీ ! అన్ని రకాల వాళ్ళూ తమ శక్త్యానుసారం బతుకుతారు; అట్లాగే అన్ని పత్రికలూనూ. రేపు ఇంతకంటెకూడా అల్పమైన పత్రిక వచ్చి అదీ బతకవచ్చు."

"మనుషులు పుట్టినంత సహజమైన విషయం కాదు పత్రికలు పుట్టుకురావటం. పత్రిక పెట్టితే ఏదో ఒక పరమార్థం ఉండాలి. ఇంకే పత్రికా సాధించలేని దేదో ఒకటి సాధించాలి—కనీసం సాధించేటందుకు కృషి ఉండాలి."

శ్రీరాములు ఈ చర్చ యావత్తూ ఓపికగా వింటున్నాడు. అతను ఎంతో ఓర్పుగా, "పంతులుగారూ, నాలుగు డబ్బులు చేసుకుందా మని తప్ప ఈ పత్రిక ఇంకెందుకూ పెట్టలేదు. ఏనాడు నష్టంవస్తే ఆనాడు పత్రికను మూసెయ్యటం కూడా ఖాయమే—ఉన్నమాట అంటే తప్పేం. మీకు పత్రిక ఎందుకు బాగాలేదో నాకు తెలుసుకోవాలనుంది !" అన్నాడు.

సత్యం నిర్ఘాంతపోయి, "ఎందుకుట ?" అన్నాడు.

"మరేం లేదు. మీరు వేద్దామనుకున్న కథలు రెండూ వేస్తే మీకిదో గొప్ప పత్రిక అనిపించేదే !" అన్నాడు శ్రీరాములు సౌమ్యంగా, నవ్వుతూనే.

అతను మొహం కందలు ఊడబెరుక్కొని తనతో పోట్లాడినా సత్యం అంత బాధపడి ఉండడు. శ్రీరాములు అన్నమాట ఎంతమాత్రమూ నిజం కాదనికూడా అనటానికి వల్లకాలేదు సత్యానికి. ఆ ఆరోపణ అంత నీచంగా ఉన్నది !

"శ్రీరాములుగారూ, పత్రికను గురించి నా అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పినందుకు మీరు బాధపడవద్దు. నా పత్రిక కాదుగదా అన్న ఉద్దేశంతో నేనామాట అనలేదు; నా పత్రికే ననుకుని అన్నాను. ఎన్నో చచ్చు పత్రికలు వస్తున్నై : పోతున్నై. వాటిని గురించి నేను పట్టించుకుంటున్నానా?" అన్నాడు సత్యం.

"ఈ పత్రిక మీకు నాలుగు డబ్బు లివ్వటంవల్ల అలుసయిందేమోలెండి ! తప్పేం?" అన్నాడు శ్రీరాములు.

"అది, నేను ఒప్పను?" అన్నాడు సత్యం. ఆమాట అతనికి శూలంలాగా తగిలింది. "నేను తీసుకున్న నాలుగు డబ్బులకుగాను కనీసం ఎనిమిది డబ్బుల పని చేసి పెట్టానని నేను మనస్ఫూర్తిగా అనుకుంటున్నాను. జరిగిన సంగతి మరిచిపోయి నట్టున్నారు. నాకు మీ పత్రిక పేర ఏదన్నా ముట్టజెప్పమని నేనై మిమ్మల్ని ఆశ్రయించలేదు. మీరు నన్నడిగినప్పుడు నాకు పత్రిక నడపటం చాతకాదని కూడా చెప్పాను. ఆ జిజ్ఞాస నాలో ఉండే చూపవలసినదానికి రెట్టింపు ఆసక్తి చూపి, పడవలసిన దానికి రెట్టింపు శ్రమపడ్డాను. అంతేగాని నన్ను ఉద్ధరించానని మీరూ అనుకోవద్దు. మిమ్మల్ని ఉద్ధరించానని నేనూ అనుకోను!"

పారా పలుగూ తీసుకుని పెద్ద గొయ్యి తవ్వినవాడల్లే సత్యం ఈ మాట అంటానికి సీరసించి డీలాపడిపోయినాడు. ఇది తెగతెంపులేనని అతనికి తెలుసును.

శ్రీరాములు ఇచ్చే ఇరవైలో పది అదివరకే ఖర్చుచేశాడు. మిగిలిన పదీ తీసుకుని అతను ఇంటికి వెళ్ళాడు.

మర్నాడే జానకీ పిల్లవాడూ దిగారు.

"సుశీల" పత్రిక శ్రీరాము లనుకున్నంత బాగా అమ్మిందోలేదోగాని, మొత్తం మీద బాగానే అమ్మింది. ఆ పత్రిక తాలూకు రెండోసంచిక చూడటానికి ఒక యువ కవి ఏర్పాటైనాడు. ఆ యువకవి తన స్థానంమీద చాలారోజులుగా కన్ను వేశాడనీ, తనమీద శ్రీరాములుకు చాలాచాలా చెప్పాడనీ, శ్రీరాములు లక్ష్యపెట్టలేదనీ తర వాత సత్యానికి తెలిసింది.

చిత్రమేమిటంటే సత్యానికి శ్రీరాములుపైన ఏమీ కోపం రాలేదు. ఆ యువ కవిమీదా రాలేదు. తనను బయటికి తోసిన సంఘర్షణ వ్యక్తులకు సంబంధించినది కాదు; ఆశయాలకూ, ఆదర్శాలకూ సంబంధించినది. శ్రీరాములు మొదటినుంచీ చివరదాకా తనను ఎంతో మర్యాదగా చూశాడు. ఆ యువకవి కడుపుకక్కుర్తికొద్దీ తనపైన దుష్ప్రచారం చేశాడేమోగాని, అతనికి తనమీద నిజంగా ద్వేషం ఉన్నదని సత్యం ఒక్కనాటికి అనుకోలేదు.

ఈ "సుశీల" పత్రిక సంఘటనతో తను ఏ మాత్రమో పెరిగినట్టు సత్యానికి తోచింది. అలా తోచటానికి ఆధారమేమిటో సత్యం ఊహించలేకపోయినాడు; శ్రీరాములు తనకులేని అహంకారాన్ని అంటగట్టటం అయి ఉంటుందేమో నని అతనికి

అనుమానం కలిగింది. అయితే ఆ రెంటికీ సంబంధం ఏమిటో అతనికి బోధ పడలేదు.

## 4

సత్యం డబ్బు ఇబ్బంది చాలా పడుతున్నాడు. చంటిపిల్లవాడితో ఖర్చు పెరిగింది. పెళ్ళాం బరువుకు తోడు పిల్లవాడి బరువు. అప్పుడప్పుడూ రూపాయీ, అర్ధా సహాయం చేసేవాళ్ళు ఒక రిద్దరున్నారు. అది అప్పుకాదు, ధర్మమే. రెండు మూడు రూపాయలకు మించకుండా అప్పిచ్చేవాళ్ళు కూడా ఇద్దరు ముగ్గురున్నారు. అది అప్పు తీర్చాలి. బాకీ చెల్లబెట్టుతుంటే మళ్ళీ ఇస్తారు. వాళ్ళకి చెల్లవేసే డబ్బు చేతిలోకి వచ్చినా ఆ తరవాత మళ్ళీ అప్పు చెయ్యవలసి వచ్చే పక్షంలో ఆ బాకీ తీర్చినా ఒకటే. ఆ రెండు మూడు పద్దులూ బిరడాకొట్టినట్టు అయిపోయినై. మొత్తం పదిరూపాయల బాకీ ఉంటుంది. ఎన్నో నెలలుగా అది చెల్లలేదు. పోతే ధర్మం ఇచ్చే వాళ్ళున్నారు. ఎన్నిసార్లని వాళ్ళను అడగటం ? వాళ్ళ స్థితిలోనే తానుంటే ఎన్నాళ్ళని యిస్తూ పోగలడు? తన బరువు వాళ్ళు ఎంతకాలం మోస్తారు?

తేలిక తేలికగా కథలు రాయటమూ, చూసిన సినిమాలమీద విమర్శలు రాయటమూ సత్యం క్రమంగా అలవాటు చేసుకున్నాడు. వాటిని ఏవో పత్రికలు అచ్చువేసేవి. ప్రతిఫలం ఉండేదికాదు.

ఒకసారి ఏదో పత్రికలో ఒక కథ చదివాడు. దారిద్ర్యం గురించి రంపపు కోతలాటి కథ. అది చదువుతుంటే అతనికి రాసినవాడిపైన మండిపోయింది. ఎందుకు మండిపోయినదీ స్పష్టంగా తెలియలేదు.

జానకి ఆ కథ అక్కడక్కడా నాలుగు ముక్కలు చదివి "ఒక చెంప అనుభ విస్తూనే ఉంటిమిగద. పత్రికల్లో కూడా ఈ దరిద్రం కథలు దేనికి?" అన్నది.

అందుకే తనకూ ఆ కథ నచ్చలేదేమో ననుకున్నాడు సత్యం మొదట. కాని అసలు కారణం ఎవరితోనో సాహిత్య ప్రయోజనం గురించి వితర్కించేటప్పుడు దానంతట అదే సత్యానికి తట్టింది.

"ఈ సాహిత్యమంతా దేనికి ? ఈ కళలన్నీ దేనికి ? ఇంత వినోదం ఇవ్వటం తప్ప వీటికి ఏమీ ప్రయోజనంలేదు. జీవితాన్ని కాస్సేపు మరిపింపజేయ టానికే కళలు" అన్నా డొక విమర్శకుడు.

"వాస్తవ జీవితాన్ని గురించి సాహిత్యం లేదా?" అన్నాడు సత్యం తెలుసు కుందామని.

"లేవు," అన్నాడు విమర్శకుడు.

"వెల్స్[1], షా[2]"-అన్నాడు సత్యం.

"ఒక్క షా నాటకం కూడా ఎక్కడా జరగదు. వెల్స్ నవలలూ అంతే. జీవితానికి విలక్షణంగా ఉన్నందుకే వాటిని చదువుతాం. మంచి సాహిత్యమంతా అంతే !"

"వాటిలో జీవితసమస్యలు లేవా ?"

"సమస్యలుంటే ఉండుగాక, వాటిని గురించి నీ ఇష్టం వచ్చినట్టు రాసుకో. జీవితం దారి జీవితందే. నువు కావలిస్తే బ్రిటిషువాళ్ళను మనం తరిమేసినట్టు రాసుకో; సంతోషించు ! వాళ్లు మాత్రం ఇక్కడే ఉంటారు. వెల్సూ, షా చెబుతావేమిటి ? భారతం తీసుకో, రామాయణం తీసుకో, వాటిలో మనం చదివే నీతులూ ధర్మాలూ వేరు; మన చట్టం వేరు. నువు రాముడల్లే అడ్డమైనవాళ్ళనూ చంపి లోకానికి మేలు చేస్తున్నానంటే చట్టం ఒప్పుతుందా ? ఉరి తీసేస్తుంది. కాని రామాయణం గొప్ప సాహిత్యం కాదంటావా ?"

ఈ వాదం ముందు సత్యం ఉక్కిరి బిక్కిరి అయినాడు. సాహిత్యానికి ప్రయోజనం ఉండాలన్నమాట అతను శంకించలేదు. చివరకు తాను రాసిన కథలలో కూడా ఏదో కొంత ప్రయోజనం ఉన్నది కాని అతను, "నేను దారిద్ర్యం గురించి ఎందుకు రాయను ? ఏవో ఇతర సమస్యలు తీసుకుంటానేం ? నన్ను నిజంగా బాధిస్తున్నది దరిద్రమేగద?" అని ప్రశ్నించుకున్నాడు. దారిద్ర్యం తనను అస్తమానం వేధించకుండా తన మనసును వీలయినంతవరకు ఎట్లా అన్యాయత్తం చెయ్యటానికి తాను ఇతర వ్యాపకాలు సృష్టించుకుంటున్నదీ అతనికి అర్థమయింది. రాస్తున్నాడు, చదువుతున్నాడు, సినిమాలు చూస్తున్నాడు. నలుగురు చేరినప్పుడల్లా అడ్డమైన విషయాలను గురించీ చర్చిస్తున్నాడు. ఈ దారిద్ర్య సమస్యే ఏ కథలోనో పెడితే పాఠకుడు తప్పించుకోలేడు. చచ్చినటు యమయాతన అనుభవించవలసిందే.

[జీవితంకంటెకూడా కళ శక్తివంతమైనది; సందేహం ఏమీలేదు. తాను తన దారిద్ర్యాన్ని మరిచిపోలేనప్పుడల్లా ఒక రూపాయి సంపాదించాలన్న ప్రేరణకు గురి అవుతూనే ఉన్నాడు; ఏదో ఒక ఖులాసా కథ రాసి పత్రికకు పంపి ఎవరన్నా మూడు రూపాయలు పంపుతారేమోనని ఆశగా ఎదురుచూస్తూనే ఉన్నాడు.

1. వెల్స్ : వెల్స్, హెర్బర్ట్ జార్జి (1866–1946) బ్రిటిష్ నవలా రచయిత, వైజ్ఞానిక కల్పనా రచయిత, చరిత్రకారుడు. రచనలు : The Time Machine (1895), The War of the World (1898) మొదలైనవి. Short History of the World (1922)
2. షా : షా, జార్జిబెర్నార్డ్ (1856- 1950) ప్రపంచ విఖ్యాత నాటక రచయిత ఫెబియన్ సోషలిస్టు. ఆయన రాసిన కొన్ని ప్రసిద్ధ నాటకాలు Arms and the Man, Mrs. Warren's Profession Ceasor and Cleopatra Major Barbara Pigmation.

కళలద్వారా సమాజాన్ని నిజంగానే రెచ్చగొట్టవచ్చు. అట్లా రెచ్చగొట్టిన వాళ్ళు కూడా ఉన్నారు—డికెన్స్! మనదేశంలోకూడా ఉండే ఉంటారు— అవును. వీరేశలింగం! తన ఇంటరులో రాజశేఖరచరిత్ర చదివి తాను ఎంత మారినదీ, కొన్ని కొన్ని ఆచార విశ్వాసాలను ద్వేషించటం ఎట్లా నేర్చుకున్నదీ అతను మరచి పోలేదు. తరవాత తరవాత షా, వెల్స్, గాల్స్‌వర్దీ[1] మొదలైనవాళ్ళ పుస్తకాలుకూడా అతని మనసుకు ఒక స్వరూపం ఇచ్చినై. వచ్చిన చిక్కల్లా ఏమంటే ఈ విధంగా అలవరచుకున్న తన సంస్కృతికి జీవితానికీ మధ్య ఒక అఖాతం ఉన్నది. ఏ సంస్కారమూ లేనివాళ్ళ జీవితంతో సంఘర్షణ పడుతున్నట్టుగా తను పడలేకుండా ఉన్నాడు.... ఆ శ్రీరాములే తాను చదివిన పుస్తకాలు చదివి తల కెక్కించుకుంటే గూపాయి, అర్థా ముప్పైత్తవలిసే వచ్చును.]

తన రచనల్లో మనుషుల మనస్సులను సంస్కరించే లక్షణాలు ఉండితీరాలన్న భావం సత్యానికి తెలియకుండానే అతని మనస్సులో పడిపోయింది.

* * *

వెంకటేశ్వర్లూ, సీతాపతీ, రామ్మూర్తీ క్రాస్‌వర్డ్ పిచ్చివాళ్ళు. ప్రతి క్రాస్‌వర్డ్ పజిలుకూ "దక్షిణ" ఇచ్చుకుంటూండేవాళ్ళు. సాధారణంగా ముగ్గురూ జాయింటుగా పంపేవాళ్లు. ఒకసారి రామ్మూర్తి ఊళ్ళోలేడు. భాగస్వామిగా సత్యాన్ని ఉండ మన్నాడు. తన జేబులో ఉన్న అర్ధ రూపాయి కాస్తా ఇచ్చేసుకున్నాడు సత్యం. ఒక కూపన్ చేతికి వచ్చినట్టు నింపాడు. ఆ మూడు కూపన్లలో ఒకదానికి రెండు తప్పులతో ప్రైజు వచ్చింది. అది సీతాపతి కూపను. అయినా తలా ఒక నాలుగు రూపాయలూ వచ్చినై.

వాళ్ళకు బహుమానం రావటం అదే మొదటిసారి. అపాటి తెచ్చిన ఖ్యాతి సత్యానికి దక్కింది.

మనకు మూఢ విశ్వాసాలు ఉండవచ్చు, ఉండకపోవచ్చు. కాని జీవితంలో మనిషి ప్రయత్నాల ఫలితాలపైన మనిషికి పూర్తి అధికారం లేనంతవరకూ అదృష్ట మంటూ ఉంటుంది. దాని ప్రభావం కూడా మనిషిపైన ఉంటుంది.

ఎడారి ప్రదేశం నీటిని ఎంత ఆత్రంగా స్వీకరిస్తుందో సత్యం డబ్బును అంత ఆత్రంగా స్వీకరించేవాడు. అణాడబ్బులైనా తన చేతిలో పడ్డప్పుడల్లా అతనికి ఎంతో ఆనందం కలిగేది. అయితే తాను శ్రమపడి సంపాదించిన డబ్బుకంటే "అదృష్టంగా" వచ్చిన డబ్బు అతనికి ఎక్కువ ఆనందం కలిగించేది. దారిలో ఒకసారి దొరికిన పావలాకాసు అతనికి కలిగించిన ఆనందం పదిరూపాయల నోట్లుకూడా కలిగించలేదు. ఆ ఆనందం బహుశా డబ్బును చూసి అయి ఉండదు. అదృష్టం అనుకూలంగా ఉండటాన్నిబట్టి అయి ఉంటుంది.

---

1. గాల్స్‌వర్దీ [1867 - 1933] బ్రిటిష్ నవలాకారుడు, నాటక రచయిత.

సత్యం ధనికులను చూసి ఎన్నడూ అసూయపడలేదుగాని "అదృష్ట దేవత ముద్దు బిడ్డలను" చూసి అసూయపడేవాడు. తాను చాలవరకు దురదృష్టవంతుడు కావడమే దానికి కారణం అయి ఉండవచ్చు.

సత్యానికి మూఢ విశ్వాసాలున్నాయనటానికి లేదు. అతను ఎన్నడూ జూదం జోలికి వెళ్ళేవాడుకాడు. జూదర్ల మనసు ఎట్లా పనిచేసేదీ అతనికి అర్థమయేది కూడా కాదు. ఈ క్రాస్‌వర్డ్ పజిల్‌లో కూడా మిగిలినవాళ్ళ మొహమాటంకొద్దీ చేరవలసి వచ్చింది.

కాని ఆ నాలుగు రూపాయలూ అతనికి చాలా ఆనందమిచ్చాయి. ఆ రోజల్లా అతని మనసు కుప్పిగంతులు వేస్తూనే ఉన్నది. ఈ మనస్థితిలో అతనికి ఆకస్మికంగా ఎవరో ప్రేరేపించినట్టుగా, నాటకం రాయాలనే అభిప్రాయం వచ్చింది.

నిజానికి అతనికి నాటకాలు సన్నిహితమైనవే. అతని పినతండ్రి స్టేజి నటుడు, ఎప్పుడూ బెజవాడలోనే ఉండేవాడు. యడవల్లి[1], ఉప్పులూరి[2], పారుపల్లి, అద్దంకి[3], కపిలవాయీ[4] మొదలైన నటులందరినీ ఎరుగును. టాకీలు వచ్చినాక[5], "ఒక్కసారి తెర ఎక్కి అవతారం చాలించాలని ఉందిరా!" అనేవాడు. పాపం, ఆ అవకాశం ఆయనకు దక్కలేదు.

సత్యం ఆయనవెంట కొన్ని డజన్ల నాటకాలు చూసి ఉంటాడు. అయినా అతనికి నాటక రచనపైన బుద్ధి మళ్ళకపోవటానికి కారణం ఉన్నది. "నాటకాలు రాయవలసింది ఇట్లాకాదు." అని అతను గట్టిగా తెల్సుకున్నాడు. సరిఅయిన నాటకాలు రాస్తే వాటిని ప్రయోగించే అవకాశం కన్ను పొడుచుకున్నా కనబడలేదు సత్యానికి. "స్థానం"[6], గోవిందరాజులు[7], ఆంజీ[8] మొదలైన జట్టు "కన్యాశుల్కం"

---

1. యడవల్లి : చూడండి అరుణోదయంలోని ప్రస్తావన.
2. ఉప్పులూరి : ఉప్పులూరి సంజీవరావు (1889-1957). చూడండి అరుణోదయంలోని ప్రస్తావన.
3. పారుపల్లి, అద్దంకి : ఈ నటుల ప్రస్తావన అరుణోదయంలో.
4. కపిలవాయి : చూడండి అరుణోదయంలో, రామనాధశాస్త్రి.
5. టాకీలు వచ్చినాక : 1931 తర్వాత.
6. స్థానం : అరుణోదయంలో చూడండి.
7. గోవిందరాజులు : డా॥ గోవిందరాజుల వెంకట సుబ్బారావు (?1895-1959). ప్రఖ్యాత రంగస్థల నటుడు, చలనచిత్ర నటుడు. కన్యాశుల్కం నాటకంలో గిరీశం పాత్రతోపాటు ఇతర పాత్రలను పోషించేవాడు. ప్రతాపరుద్రీయంలో యుగంధర పాత్రధారి. 1938లో గూడవల్లి రామబ్రహ్మం నిర్మించిన 'మాలపిల్ల'లో ప్రధానపాత్ర — సుందరరామశాస్త్రి పాత్ర ధరించారు. కాంచనమాల నాయిక. షావుకారు, బాలనాగమ్మ, గుణసుందరికథ,

ఆడుతున్నమాట నిజమేగాని "కన్యాశుల్కం" వంటి నాటకం ఎవరివల్ల అవుతుంది; స్థానంవంటి నటులు అన్నప్పుడల్లా ఎక్కడ దొరుకుతారు? అందుచేత సరి అయిన నాటకాలు భవిష్యత్తుకే విడిచిపెట్టాడు సత్యం.

అటువంటివాడికి అకస్మికంగానూ, అకారణంగానూ నాటకం రాయాలని బుద్ధిపుట్టింది. నాటకానికి కావలసిన "ప్లాట్" దానంతట అదే అతని బుర్రలో మొలకెత్తి చూస్తుండగానే దోసపాదులాగా అన్నివైపులా పాకి, విస్తరించి, చిలవలూ పలవలూ వెయ్యసాగింది. సత్యం దాన్ని గమనిస్తూ ఊరుకున్నాడు.

నాటకం రాస్తున్నంత సేపూ సత్యం తన పాత్రల మధ్యనే ఉన్నాడు.ఎంత చచ్చు నాటకం రాయడానికైనా ఆ నాటకం నడిచే వాతావరణంలో నాటకకర్త జీవించాలి. సత్యం అట్లాగే జీవించాడు. రెండు గంటలో, మూడుగంటలో. రాతలో వెళ్ళబుచ్చి కాగితాలు పక్కన పెట్టగానే అతనికి తన పరిసరాలు విచిత్రంగా కనపడేవి. తాను రాసిన సంభాషణలు చెవిలో మోగుతుండేవి. సత్యం తన చెవికి వినపడని సంభాషణ ఒక్కటికూడా రాయలేదు. అందుచేత అవన్నీ చాలా స్వాభావికంగా ఉన్నయ్యని కూడా అతను భ్రమపడ్డాడు.

ఇటువంటి భ్రమే అతను పాత్రలను గురించీ, సన్నివేశాలను గురించీ మొత్తం నాటకం గురించికూడా పడ్డాడు. అవేవీ అతను అనుకున్నంత గొప్పగా లేవు. అయితే ఈ భ్రమ ఒక విధంగా లాభించింది. ఆ భ్రమ లేకపోతే అతను ఆ నాటకం పూర్తిచేసి ఉండేవాడు కాడు.

నాటక రచనచేసే మనస్తత్వంలో ఏదో ఉంది. కథలు రాసేవాడు ఒక మాదిరి కథ రాద్దామని నిర్ణయించుకుని రచన సాగించవచ్చు. కాని నాటకకర్త మహత్తరమైన నాటకం రాయటానికి కంకణం కట్టుకునే రచన సాగిస్తాడు. తరువాత ఆ నాటకం సుమారైన నాటకంగా పరిణమించినా, బొత్తిగా చచ్చునాటకమై పోయినా, నాటక రచయిత ప్రయత్న లోపం మటుకు అందుకు కారణం కాదు.

నాటకం పూర్తికావటానికి పదిరోజులు పట్టింది. సత్యం దాన్ని చదివిచూశాడు.. చాలా చోట్ల మార్పులు చేశాడు. తన బుర్రలోనుంచి వెలువడే సమయంలో ఉండిన వేడి రాసిన నాటకంలో లేకపోవటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. కొన్నిరంగాలు పూర్తిగా తిరగరాశాడు. చెయ్యదలిచిన మార్పులన్నీ చేసినాక అతను నాటకాన్ని కాపీచేసి మరొక్కసారి చదువుకున్నాడు.

ఒకే నాటకం చదివినవాణ్ని ఆ నాటకం ఆకర్షిస్తుంది. కాని అది మంచి నాటకమో, చెడ్డ నాటకమో వాడు చచ్చినా చెప్పలేడు. తన నాటకం గురించి సత్యం

---

పల్నాటి యుద్ధం, కన్యాశుల్కం మొదలైన చిత్రాల్లో నటించారు.
ఓ. అంజీః మాష్టరు అంజి(?) ప్రసిద్ధనటుడు, స్థానం మొదలైన వారితోపాటు. రామవిలాస సభ సభ్యుడు.

అటువంటి దుస్థితిలో పడ్డాడు. జానకికి చదివి వినిపిస్తే,"అన్ని నాటకాలల్లేనే ఉన్నది!" అన్నది. కాని అందులో బాగోగులను గురించి ప్రస్తావించలేదు. ఆమెకు అవి తెలియవు.

ఒకనాడు ఊళ్ళోవాళ్ళే ఇద్దరు మిత్రులు వచ్చారు. అదీ ఇదీ మాట్లాడుతుంటే ఒక స్నేహితుడు, "ఈ నెల 'సుశీల' పత్రిక రాలేదు. బబ్బున్నట్టున్నది."అన్నాడు.

"ఇన్నాళ్లూ వస్తున్నదా ఏమిటి ? నేను మొదటి సంచిక మాత్రం చూశా" అన్నాడు రెండోవాడు.

"ఆ కవి తగులుకుని పత్రిక బొత్తిగా ఖరాబుచేసేశాడు" అన్నాడు మొదటివాడు.

"మొదటి సంచిక బాగానే ఉంది. నాలుగురోజులపాటు నడుస్తుందనుకున్నా," అన్నాడు.

ఇందులో సత్యం హర్షించటానికి ఏమీ ఉండవలసిన అవసరం లేదు. కాని అతను కొద్దిగా హర్షించాడు.

"సుశీల" నిలిచిపోవటానికి అసలు కారణం సత్యానికి తెలియకపోలేదు. శ్రీరాములు అమ్మే ఇతర పత్రికలన్నీ ఈ సొంత పత్రిక కారణంగా దెబ్బతిన్నై. ఏజెంటుకు సొంత పత్రిక ఉందని తెలియగానే మాసపత్రికవాళ్లు ఏజెన్సీ లాగేసి ఇంకొకరికిచ్చారు. అనుకున్నట్టుగా ప్రకటనలుకూడా రాలేదు.

"నేనొక నాటకం రాశాను. వింటారా ఏమిటి ? మీ అభిప్రాయం చెబితే చించెయ్యటమో అవసరమైతే బాగుచెయ్యటమో చేస్తాను. మీ నిజమైన అభిప్రాయం చెప్పాలి." అన్నాడు సత్యం.

ఒకడు వెంటనే జిడ్డు పట్టించుకోబొయ్యేవాడి మొహం పెట్టాడు. రెండోవాడు మాత్రం కొంచెం ఉత్సాహం చూపాడు. గబగబా చదివినా నాటకం గంటుముప్పావు పట్టింది.

"ఫస్టుగా ఉంది! ఓల్డ్ బాయిస్‌డేకు ఆడదాం. చెయ్యీదాటి పోనీమాఠ. గయోపాఖ్యానమూ[1] ప్రసన్న యాదవమూ[2] చూసిచూసి తలపట్టిపోతున్నది." అన్నాడు ఉత్సాహవంతుడు.

"కాస్త వెరైటీగా ఉంటుంది." అన్నాడు రెండోవాడు.

వాళ్ళు వెళ్ళినాక సత్యం మామూలు స్థితిలోనే ఉన్నాడు. ఆ నాటకాన్ని చూస్తున్నకొద్దీ అతనికి వైరాగ్యం కలగసాగింది. దానిని అలమారులో పారేశాడు.

ఈ రాతపని తనవల్ల అయేదికాదు. కొమ్ములు తిరిగిన రాతగాళ్ళే రచనలపై ఆధారపడి బతకటం లేదు. తనకు ఇది జీవనోపాధిగా పనికిరాదు. తనకు కథలు

---

1. గయోపాఖ్యానం : చూడండి అరుణోదయంలోని ప్రస్తావన.
2. ప్రసన్నయాదవం : చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు (1867-1946) నాటకం, 1914లో ముద్రణ.

రాసేశక్తి ఉందని ఏనాడు అనిపించలేదు. నాటకం అట్లా అనిపించలేదు. నాటకరచన ఎంతో ఉత్సాహంగా సాగింది. కాని అదీ అంతంత మాత్రమే అయింది- ఒకవేళ ఇది పొడిచేసే నాటకమే అనుకున్నా, పొడిపించుకునేవాడెవడు?

* * *

"సత్యం!"

"ఎవరూ?"అంటూ సత్యం బయటికివచ్చి వామనరావును చూసి ఆశ్చర్యపడి, "ఇదేమిటోయ్ ? ఎక్కణ్నుంచి ఊడిపడ్డావ్?" అన్నాడు.

"దాని కంతా చాలా కథ ఉందిలే. ఈ ఊళ్ళో నువ్వుతప్ప నాకెవరూ తెలీదు. నాకు తోడు వస్తావా ఏమిటి? చిన్న పని ఉంది." అన్నాడు వామనరావు.

"ఎక్కడికి?"

"థియేటరు ఒకటి కావాలి. నాటకం ఆడాలి"

"నాటకా లాడుతున్నావా?" అన్నాడు సత్యం విస్మయంతో.

"ఏదో ఒకటి చెయ్యకపోతే ఎట్లా బతికేది ?"

"నువు వేషం వేస్తున్నావా?"

"ఇంకా అంతదాకా రాలేదులే. కిందటేడల్లే నాటకాలు కాంట్రాక్టు చేశా. అదృష్టంవల నాలుగు డబ్బులు మిగిలినై. ఈ యేడు ఒక చిన్న నాటకం తయారు చేశాం. ఏం? అప్పుడే ఎనిమిది ఆటలు ఆడాం. పెద్దగా లాభాలు రాకపోయినా ఏదో ఖర్చులు గిట్టుబాటు అవుతున్నై. చూసినవాళ్ళు కొద్దిమంది అయినా తిట్టకుండా వెళ్ళిపోతున్నారు. మా ట్రూపులో ఏ తుంగల చలపతీ[1] లేడాయెమరి," అన్నాడు వామనరావు.

సత్యానికి బాగా జ్ఞాపకం. వామనరావు క్లాసులో చాలా అల్లరిగా ఉండేవాడు. అందరికీ తలా ఒక పేరుపెట్టాడు. దాదాపు అన్నీ పుస్తకాల పేర్లే. ఒక లెక్చరరుకు "కాలురాయి"[2] అని పేరు పెట్టాడు; ఇంకొకడికి "వాడేవీడు"[3] అని పేరుపెట్టాడు; మరొకడికి "తురుపు జాకీ"[4] అని పేరు పెట్టాడు. తెలుగు లెక్చరరుకు "తద్దిన" మనీ, ఇంగ్లీషు లెక్చరరుకు "సర్ విలియమ్ షేక్స్పియర్" అనీ పేరు పెట్టాడు.

---

1. తుంగల చలపతి : తుంగల చలపతిరావు (? 1906-1941) ప్రసిద్ధ రంగస్థల నటుడు, చలనచిత్ర నటుడు. 1935లో వచ్చిన సక్కుబాయి, అనసూయ చిత్రాలలో ప్రధాన పాత్రధారి, గొప్పగాయకుడు.
2. కాలురాయి : వేగుచుక్క గ్రంథమాల ప్రచురించిన డిటెక్టివు నవల. దేవరాజు వెంకట కృష్ణారావు రచన.
3. వాడేవీడు : వేగుచుక్క గ్రంథమాల ప్రచురించిన నవల. మొదటి భావ పరిమాణ (1912) దేవరాజు వెంకట కృష్ణారావు రచన.
4. తురుపుజాకి : వేగుచుక్క గ్రంథమాల ప్రచురించిన డిటెక్టివు నవల.

ఆ 'సర్' ఎందుకు పెట్టాడో ఎవరికి తెలీదు. వామనరావు దాన్ని గోప్యంగా ఉంచాడు. విద్యార్థులంతా అతనంటే చాలా ఇష్టంగా ఉండేవాళ్ళు; లెక్చరర్లకు మాత్రం చాలా కోపం. అట్లాగే అతను బియ్యే పాసయ్యాడు. ఆ తరువాత అతను ఏమయిపోయినదీ సత్యానికి తెలీదు. వాళ్ళది తూర్పుగోదావరి జిల్లాలో ఏదో ఊరు.

"పోదాం పద!" అన్నాడు సత్యం నిలుచున్నపాళంగానే.

"ఇంట్లో చెప్పి అయినా రా!" అన్నాడు వామనరావు. అతను తన భార్యను సత్యం కన్న ఎక్కువ ఆదరంతో చూస్తాడల్లే ఉంది. అతని ఎదట తన మౌనం కాపాడుకునేటందుకు లోపలికివెళ్ళి జానకితో, "ఇప్పుడే అరగంటలో వస్తా!" అన్నాడు.

"ఆ వచ్చినాయన భోజనానికి ఉంటారా?" అన్నది జానకి. సత్యం గుండె జారినట్టయింది.

"ఎటుబోయి ఎటువచ్చినా వంటచెయ్యి." అన్నాడు సత్యం.

వంట చెయ్యటానికేమీలేదని జానకి అనలేదు.

సత్యం బయటికి వచ్చేలోపల వామనరావు వీధిలోకివెళ్ళి దారేపొయ్యే బండిని ఆపి మాట్లాడాడు.

"ఇక్కడే ఉన్న సినిథియేటరుకు బండి ఏమిటి ?" అన్నాడు సత్యం.

"ఫరవాలేదులే, ఎక్కు, చెబుతా. స్టేటస్ !" అన్నాడు వామనరావు.

బండిలో ఎక్కాక వామనరావు, "ఆఁ ! ఇహ చెప్పు ! ఏం ఉద్యోగం చేస్తున్నావు ? ఎంత జీతం ?" అని అడిగాడు.

"ఖాళీగా ఉన్నాను," అన్నాడు సత్యం ముక్తసరిగా.

"తినటానికింత ఉందిగామల్లులే !" అన్నాడు వామనరావు.

"అదే అసలు సమస్య. ఉన్నదంతా కరారావుడై పోయింది," అన్నాడు సత్యం. తీరా అనేసినాక అతనితో ఆర్థిక చిక్కులు గురించి చెప్పటం అనవసరమేమో అనిపించింది. ఎందుకంటే ఇద్దరూ ఆప్తస్నేహితులు కారన్నమాట అటుంచి ఇద్దరి జీవితాలూ ఎక్కడా కలవవు. సత్యం జీవితాన్ని వామనరావు పంచుకునే ఆస్కారం ఏమేలేదు.

"అయితే డబ్బుకు చాలా ఇబ్బంది పడుతున్నావన్నమాట !" అన్నాడు వామనరావు.

"ఆ గొడవ పోనిస్తూ! మళ్ళీ వాడేవీడుగాని, తురుపు జాకీగాని కళ్ళపడ్డారా!" అన్నాడు సత్యం.

వామనరావు గట్టిగా నవ్వి, "వాళ్ళెందుకు కనిపిస్తారూ ? ఆ చాప్టర్ అంతటితోనే చెల్లు ! ....ఏదో చిన్నతనం ! ఏమంటావ్ ! అదో సరదా !" అన్నాడు వామనరావు ఈ మూడు నాలుగేళ్ళలో చాలా పెద్దవాడై పోయినట్లుగా.

ఒక థియేటరువాడు తొంటిచెయ్యి చూపాడు. ఆదే పిక్చరు ఎత్తగానే ఇంకొక పిక్చరు సిద్ధంగా ఉందిట. అదికాస్త మంచి థియేటరు. రెండో థియేటరువాడు వారం

రోజులు ఆగితే థియేటరు ఇస్తానన్నాడు. ఆ థియేటర్లో ప్రస్తుతం హిందీ సినిమాలే ఆడుతున్నారు.

వామనరావు థియేటరు కిరాయిగురించీ పబ్లిసిటీ ఏర్పాట్లు గురించీ మాట్లాడాడు. థియేటరువాడు అతనికి కావలసిన వివరాలన్నీ ఇచ్చాడు. వామనరావు థియేటరుకు బయానాకూడా ఇస్తానన్నాడు.

"ఎందుకండీ సత్యంగారిని బాగా ఎరుగుదుం. మీకు అనుకున్న రోజుకు థియేటరు తప్పక ఇస్తాం. డబ్బెక్కడికి పోతుందిలెండి ?" అన్నాడు థియేటరు యజమాని.

ఆ ఒక్క ముక్కతో అతను సత్యం ఆప్తులలో ఒకడైనాడు. అతని పేరు రాధాకృష్ణమూర్తి. అత నా థియేటరు అద్దెకు తీసుకుని లాభం లేకుండా నడుపుతున్నాడు. అతనికి మిగిలినదల్లా థియేటరుమీద నలుగురు బతుకుతున్నారన్న తృప్తే తన పై ఖర్చులకు, వచ్చినప్పుడు వచ్చేది, లేకపోతే లేదు. అతను ఆస్తిపరుడు.

ఇద్దరూ బండిలో సత్యం ఇంటికి తిరిగివచ్చారు.

"నేను హోటలుకుపోయి తిండితిని కాస్సేపు నడుంవాల్చి మళ్ళీ సాయంకాలం నాలుగూ, అయిదూ మధ్య వస్తా. ఇంట్లోనే ఉండు," అన్నాడు వామనరావు.

"మా ఆవిడ వంటచేసిందేమో ?" అన్నాడు సత్యం.

"ఎందుకూ ? నా పెట్టిబేడా హోటల్లో పడేస్తినిగా !" అన్నాడు వామనరావు.

"అదంతా మా ఆవిడ కేం తెలుసూ?"

"అయితే కనుక్కో," అన్నాడు వామనరావు.

జానకి వంట చెయ్యటమేగాక ఆర్భాటంగా రెండు కూరలూ, రెండు పచ్చళ్లూ పప్పూ, పులుసు కూడా చేసింది.

వామనరావు భోజనానికి ఉండిపోయినాడు.

"మీవాళ్ళకు వంట బాగా చాతొచ్చునే ! మావాళ్ళకు వంటరాదు. చచ్చిపోతున్నాననుకో" అన్నాడు వామనరావు.

భోజనాల అనంతరం ఇద్దరూ సత్యం గదిలో చాపలమీద దిళ్లు పెట్టుకుని పడుకున్నారు. సత్యానికి నిద్ర పట్టింది. శరీర శ్రమ చేసి అలసిన వాడిలా అతను బండనిద్ర పోయినాడు.

అతనికి మెలకువ వచ్చేసరికి వామనరావు కిటికీ దగ్గిరగా కుర్చీలో కూచుని చదువుతున్నాడు. అతను చదువుతున్నది తన నాటకమని సత్యం నింపాదిగా తెలుసుకున్నాడు.

సత్యం లేచాడని తెలుసుకోగానే వామనరావు, "ఎవరు రాశా రిది ? నువే ?" అన్నాడు.

"రాశాను ఏదో !" అన్నాడు సత్యం.

"బాగానే నడుస్తున్నదే," అన్నాడు వామనరావు.

"ఏం నడిస్తే ఏం లాభం ? అది స్టేజీకి పనికివస్తుందో లేదో చెప్పేవాడులేడు. ఆడేవాడు అసలేలేడు. సాంఘిక నాటకమైపోయింది."

"సాంఘిక నాటకమైతేనేం ? మేం ఆడుతున్న 'వరవిక్రయం'[1] సాంఘిక నాటకం కాదూ ? "మధుసేవా[2]" "చింతామణి[3]" సాంఘిక నాటకాలు కావూ ?" అన్నాడు వామనరావు.

ఆ పోలికకు సత్యం కంగారుపడ్డాడు. కాళ్ళకూరివారి నాటకాలలో ఉండే జనాకర్షణ తన నాటకంలో ఏమీ లేదని అతనికి తెలుసు. అయితే అవి అతని దృష్టిలో అంత మంచి తరగతి నాటకాలు కావు. జనాన్ని ఆకర్షించటానికి నాటక కర్తగా సత్యం ప్రయత్నించలేదు. అతను పాత్రలను మాత్రమే సృష్టించి వాటిమధ్య వ్యక్తిగతమైన సంఘర్షణ పెట్టాడు. అందులో సామాజిక సమస్య ఏమీలేదు. సంఘం మరమ్మతులేదు. పాత్రలన్నీ ఒకే కుటుంబానికి చెందినవి.

వామనరావు చదివేసిన పేజీలు ఒక్కసారి తిప్పి "ఇంచుమించు సగం చదివేశాను. ఈ రాత్రికి సాంతం చదివి, పనికి వచ్చేటట్లుంటే మా ట్రూప్ చేత ఆడిస్తా. ఇప్పుడు మే మాడుతున్నది పంతులమ్మ - సాంఘిక నాటకమే" అన్నాడు.

సత్యం ఊహాశ్వాలు ఎంత వద్దన్నా దౌడుసాగించినై. తన నాటకం స్టేజిమీద ఊహించుకోకుండా ఉండటానికి అతను విశ్వప్రయత్నం చేశాడు.

ఇంకొకవంక, "జానకి ఈ పూట ఈ వంటంతా ఎట్లా చేసింది?"అని అతని మనస్సు ప్రశ్నిస్తున్నది. నాటకం ఆడటమే జరిగితే నాటక కర్తకు ఏంగిట్టుబాటవుతుంది?"— ఎవరన్నా నాటకాలురాసి బతికారా?....

ఈ ధర్మసందేహాలు ఎవరు తీరుస్తారు ?

ఆ రాత్రి వామనరావు సత్యానికి హోటలులో ఆతిథ్యం ఇచ్చాడు. ఇంటిదగ్గర జానకి ఆ రాత్రి వంట చెయ్యలేదు. చెయ్యటాని కేమీలేదు. తిండిసరిగా తినీ తినకా తనదగ్గిర పిల్లవాడికి చాలినన్ని పాలుండటంలేదు.

"చాతనయితే నా రక్తంతాగి బతుకు. నాయనా! అంతకంటె ఏంచెయ్యను!" అనే దామె పిల్లవాడితో. పిల్లవాడు బాగా ఆకలిమీద ఉన్నప్పుడు చన్ను మహా నొచ్చేది. జానకి పళ్ళుబిగువున బాధ భరించేది.

సత్యం హోటలునుంచి పదకొండు గంటలకు ఇంటికి తిరిగివచ్చాడు. వామనరావు నాటకం సాంతం చదివి, ఆడిచూడవచ్చునన్నాడు. వాళ్ళట్రూపు నాటకం ఆడటానికి వచ్చినప్పుడు సత్యం ఎదటనే ఒక రిహార్సలు చేయిస్తాననీ, మార్పు లేవైనా చెయ్యవలసి ఉంటే వెంటనే తెలిసిపోతుందనీ చెప్పాడు.

---

1, 2, 3, వరవిక్రయం, మధుసేవ, చింతామణి: కాళ్లకూరి నారాయణరావు రచించిన ప్రసిద్ధ నాటకాలు.

ఈ మాట విని సత్యానికి ఆనందం తెచ్చుకుందామన్నా రాలేదు. వామనరావు తన నాటకం ఆడదగినదే ననగానే సత్యానికి దానిలో ఆసక్తిపోయింది. మధ్యాహ్నం జానకి వంట ఎట్లాచేసిపెట్టిందో తెలుసుకునేదాకా అతని అంతరాత్మలో ఆరాటం తీరేటట్టులేదు.

"చాలా పొద్దుబోయింది. ఇంట్లో ఒక్కతే ఉంటుంది!" అన్నాడు సత్యం లేస్తూ.

"నేను తెల్లవారుఝామున మెయిలులో వెళ్ళిపోతున్నాను. ఇదిగో ఈ పది రూపాయిలూ ఉంచు" అన్నాడు వామనరావు.

"దేనికి?" అన్నాడు సత్యం, డబ్బుకేసి పామును చూసినట్టు చూస్తూ.

"దేని కేమిటోయ్? ఖర్చుకు, నీవల్ల చాలా సహాయం కావలసి ఉంది— మా నాటకం సందర్భంలో."

"సహాయం కావలిస్తే చేస్తాలే," అన్నాడు సత్యం.

"మొహమాటం దేనికోయ్? నీ నాటకం వెంట పట్టుకెళుతున్నాను. దానిమీద ఎడ్వాన్సనుకో."

సత్యం డబ్బు తీసుకున్నాడు. వామనరావు స్థితిలో తానూ తన స్థితిలో అతనూ ఉంటే తానుఏదో వంకపెట్టి డబ్బిచ్చి ఉండేవాడా! ఇవ్వాలని తట్టి ఉండదు. తట్టినా ఎట్లా ఇవ్వాలో తెలిసి ఉండదు! దారిద్ర్యం అనుభవిస్తున్నా తనకు దానిసంగతి తెలిసినదానికంటె వామనరావుకు బాగా తెలుసు!

అతను ఇంటికి చేరేసరికి జానకి మేలుకునే ఉన్నది.

"ఇంత పొద్దుపోయిందేమండీ? ఒంటరిగా భయపడి చస్తున్నాను. పిల్లాడు ఏడిచి ఏడిచి ఇప్పుడే నిద్రపోయినాడు. వాడికి పోతపాలు పొయ్యక జరిగేట్టులేదు. ఏ పూటా కడుపు నిండా పాలుండటంలేదు."

సత్యానికి చిరాకు వచ్చింది. కొడుకుపైనా, భార్యపైనా సానుభూతి లేక కాదు; పిల్లవాడికి కడుపునిండా పాలు పొయ్యటంకూడా తన బతుక్కు ఒకపెద్ద సమస్య అయినందుకు.

"మధ్యానం వంట ఏం పెట్టి చేశావు, జానకీ?"

"కావమ్మగారి దగ్గిర అర్ధరూపాయి అప్పుచేశాను."

"ఈపూట ఒక్కత్తెవు వండుకుతిన్నావా?"

"వంట చెయ్యలేదు. మధ్యాన్నందే మిగిలితే తిన్నాను."

సత్యం జానకిని దగ్గరికి తీసుకున్నాడు. ఆమె కన్నీరు భుజంమీద వెచ్చగా కారింది.

"ఇదుగో, చూడు.... దినదినగండం వెయ్యేళ్ళు ఆయుస్సు!"

జానకి కళ్ళు తుడుచుకుంటూ పదిరూపాయల నోటు చూసి, "ఎక్కడిది? ఆయన ఇచ్చారేమిటి?" అన్నది.

"నాటకానికి ఎడ్వాన్సుక్రింద ఇచ్చాడు. దాన్ని ఆడిస్తానంటున్నాడు మరి!"

అతను తన దారిద్ర్యం గ్రహించి ఇచ్చాడని తన భార్య అనుకోవటంకూడా సత్యానికి బాధగానే ఉన్నది.

"ఏమున్నా, ఏంలేకపోయినా పిల్లవాడికి పాలడబ్బా మాత్రం రేపు తప్పక తీసుకురండి" అన్నది జానకి.

"తప్పకుండా!" అన్నాడు సత్యం.

పది రూపాయల నోటు చూసినాక జానకి నర నరానా ఎలాటి మార్పు వచ్చి నదీ సత్యం గ్రహించాడు. తనలోకూడా అంత మార్పు రాలేదు. మగవాడి సుఖం కంటెకూడా ఆడదాని సుఖం డబ్బుమీద అధికంగా ఆధారపడి ఉన్నమాట అబద్ధం కాదు....

జానకి ఆతనికి ఉద్రేకం తెప్పించినదాకా విడిచిపెట్టలేదు.

# 5

"పంతులమ్మ" నాటకం బాగానే జరిగింది. ఖర్చులన్నీ పోగా ట్రూపుకు నూరు రూపాయలకు పైగా మిగిలింది. వామనరావు కంపెనీలో వీరరాజు అనే మంచి నటుడున్నాడు. అతనే అందరినీ అదుపుచేసి ఒక తాటిమీద నడిపించేవాడు. ప్రేక్షకులను రంజింపజేసే రహస్యాలు అతనికి చాలా తెలుసు. అతను బాగా నటించటమే గాక చక్కగా పాడతాడు. హార్మోనియం వాయిస్తాడు. కంపెనీకి గ్రామఫోనూ, రికార్డులూ ఉన్నై. వాటిలో బాలగంధర్వ[1], పెండార్కర్[2], శాంతారాం[3], రనడే[4] మొదలైనవాళ్ళ రికార్డులుండేవి. శాంతారాం పాడిన "కాయానమవిలీ", అనే పాటకూ, రనడే పాడిన "చమకానలాంగీ" అనే పాటకూ నకళ్లు వీరరాజు "పంతులమ్మ" నాటకంలో పాడి, పాటలకే "వన్సుమోర్" కొట్టించుకున్నాడు.

సత్యానికి "పంతులమ్మ" నాటకం చాలా కృత్రిమంగా కనపడింది. అయితే అకృత్రిమ సన్నివేశాలే నిజంగా రక్తికట్టినై. సత్యం గుండె జారిపోయినట్టయింది.... తన నాటకంలో అటువంటి సన్నివేశాలు లేవు.

"నీ నాటకానికి "అదృష్టచక్రం" కాకుండా "కాల చక్రం" అని పేరు పెడితే ఎలా ఉంటుందంటావు ? వీరరాజు అడవచ్చు నన్నాడు. కొద్ది మార్పులు చెయ్యాలన్నాడు." అన్నాడు వామనరావు.

---

1. బాలగంధర్వ : చూడండి అరుణోదయంలో.

2. పెండార్కర్ : చూడండి అరుణోదయంలో.

3. శాంతారాం : ప్రఖ్యాత హిందీ చలనచిత్ర నిర్మాత, దర్శకుడు, నటుడు..

4. రనడే : వివరాలు అలభ్యం.

"ఏం మార్పులు చేసినా నా కభ్యంతరంలేదు. అసలు ఏ నాటకాన్నీ రాసినట్టుగా ఏనాడూ ఆడరుట !" అన్నాడు సత్యం.

సత్యం ఇంటికి ఒకరాత్రి వీ్రరాజూ, వామనరావూ వచ్చారు. వీ్రరాజు నాటకం ఆసాంతం చదివి తనకు తోచిన మార్పులు చెబుతూ వచ్చాడు.

అతని సూచనలు వింటున్నకొద్దీ సత్యానికి మంట ఎక్కువయింది. అతనిలో ఉన్న ఆహంకారమంతా పైకి తన్నుకువచ్చింది. ఈ మార్పులన్నీ చేసినాక తన నాటకం ఉండదు. ఇంకొక నాటకం తయారవుతుంది.

"నాటకా లాడటం సంగతి నాకు తెలీదు; వీ్రరాజుకు తెలుసు. అతను నాటకాన్ని పాడుచెయ్యటానికిగాను మార్చమనటంలేదు; రక్తిగట్టి జనరంజకంగా ఉండటానికీ, 'డ్రామా' బాగా రావటానికీ ఈ సూచనలన్నీ చేస్తున్నాడు. నేను ఆహంకరించటం కేవలం నిరర్థకం ! అని సత్యం తననుతాను ఎంత సమాధాన పరచుకున్నా ఆటే ఫలితం లేకపోయింది.

ప్రపంచం తమదారికి రావాలనుకునే బహుకొద్దిమంది మూర్ఖులలో సత్యం ఒకడు. అనేక విషయాలలో అతను ప్రపంచాన్ని మార్చలేని కారణంగా ఒంటరిగా నడవటానికికూడా సిద్ధపడ్డాడు. కేవలం డబ్బుకోసం ప్రపంచం నడిచేదారిన నడవ వలసి వచ్చినప్పుడల్లా అతనికి చెప్పరాని బాధ కలిగేది. డబ్బంటే అటువంటప్పుడు అతనికి అమితమైన అసహ్యం కలిగేది. డబ్బుతో తన కున్న అవసరాన్నీ ఈ ఏవగింపునూ సమన్వయించలేక మధనపడేవాడు.

ఈ సంఘర్షణలు తప్పవు. తన భార్యమీదా, పిల్లవాడిపైనా ఉండే సహజ ప్రేమకే అవాంతరం ఉంటున్నది. వాళ్ళ బరువు తనకు తెలిసివచ్చినప్పుడల్లా అతనికి వాళ్ళమీద రోత పుట్టుకొచ్చేది....స్టేజిమీద ఈ వీ్రరాజునుచూసి అతనికి ఎంత ఆనందం కలిగిందో, ఇప్పుడు తన నాటకాన్ని మార్చమంటున్నాడని అంత కోపం వస్తున్నది.

జీవితంలో హైరోడ్లు లేవు; చెట్టుకొమ్మల్లాగా జీవితమార్గాలు కొద్దిదూరం వెళ్ళినాక రెండు విరుద్ధ మార్గాల చీలిపోతాయి. ఇందులో మనిషి ఏ మార్గం తీసుకుంటాడనేది నిర్ణయించటానికి చాలా కారణాంతరాలుంటై.

* * *

నాటకంలో జరగవలసిన మార్పులన్నీ సత్యం చేతిమీదుగా జరగలేదు. కొన్నిమాత్రం అతనే చేసి మిగిలినవి వీ్రరాజునే చూసుకోమన్నాడు. ఆ మార్పులు తనకు ఏమాత్రమూ రుచించలేదన్న సంగతి సత్యం దాచిపెట్టటానికి ప్రయత్నించలేదు; కాకపోతే అది ఏమైపోయినా తనకు ఒకటేనన్న విషయం మటుకు స్పష్టం చేశాడు.

ఆ నాటకాన్ని ఆదేహక్కు తమ సమాజానికే ఉండేటట్టుగా వామనరావు సత్యంచేత రాయించుకుని అతనికి నూరురూపాయ లిచ్చాడు.

డబ్బు తీసుకునేటప్పుడు సత్యం, తనకు లోగడ పది రూపాయలు ముట్టినట్టు వామనరావుకు జ్ఞాపకంచేశాడు. వామనరావు నవ్వి "పోనిస్తూ ! మొత్తం నూటపది ముట్టిందనుకో. ఇంకో ఆరిచ్చేమంటా వేమిటి ? నూట పదహార్లవుతుంది !" అంటూ ఇంకొక ఆరురూపాయలు కూడా ఇచ్చాడు.

సత్యం ప్రయాణిస్తున్న జీవితపు ఎడారిలో ఈ మూడునాలుగేళ్ళ కాలంలోనూ తగిలిన మొదటి ఒయాసిస్ ఇదే అనవచ్చు. ఈ కాలంలో ఏనాడూ ఒక్కసారిగా నాలుగైదు నెలలకు సరిపోయే మొత్తం అతని చేతిలోకి రాలేదు.

ఇంకొక విధంగాకూడా ఇది అతని జీవితంలో ఒక ముఖ్యమైన సంఘటనే. చదువు పూర్తిచేసిన అనంతరం అతనిలోపల ఎంత సంఘర్షణ జరిగినా అతని శక్తులకు గాని, అతని భవిష్యత్తుకుగాని ఒకముక్కూ, మొహమూ ఏర్పడలేదు. "కాల క్రమాన నేను ఏం కాబోతాను ?" అని అతను ఎన్నోసార్లు ప్రశ్నించుకుని, ఆ ప్రశ్నకు సమాధానం పరిస్థితుల సంఘటనే నిర్ణయిస్తుందనుకుని ఊరుకున్నాడు. కాని ఇప్పుడు తనకు నాటకకర్త కావాలనే నిర్ణయం ఒకవిధంగా ఏర్పడింది.

ఇది తిరుగులేని నిర్ణయం మటుకు కాదు. ఎందుకంటే నాటకాలు రాసి ఎవరుగాని పెళ్లాం బిడ్డలను పోషించినట్టు అతను విని ఉండలేదు. కాని నాటకాలు రాసేవాళ్ళంటూ పేరుపడి కొందరున్నారు. అందులో తానుకూడా చేరితే తప్పేం ? వాళ్లు ఆస్తులుండి తింటున్నారో, గుమస్తాగిరీ చేస్తున్నారో, బడి పంతుళ్లుగా పని చేస్తున్నారో అతనికి తెలీదు. నాటకాలు రాస్తున్నారు. తనుకూడా బతుకుదెరువు కోసం మరోపని చేస్తూ నాటకాలు రాయవచ్చు. మామూలు నాటకాలు కాదు— కాస్త కొత్తరకం నాటకాలు – పాత్రలూ, సన్నివేశాలూ జీవితానికి దగ్గిరిగా ఉండే టట్టుగా - నాటకంలో ఉండే నీతి ప్రేక్షకుల మొహాన బూరాలతో విసరకుండా ! అటువంటి నాటకాలు రావలసిన అవసరం ఉన్నది.

సత్యం మరొక కొత్త నాటకం గురించి ఆలోచించసాగాడు.

మొదటి నాటకం తాలూకు పాత్రలూ, సన్నివేశాలూ అతని మనసులోకి ఊటలాగా వచ్చాయి. వాటికోసం అతను ఎటువంటి ప్రయత్నంగాని చేసినట్టు అతనికి అనిపించలేదు. ఈసారి అతను పనిపెట్టుకుని ప్రయత్నించాడు. విచిత్రమైన ఫలితం కనిపించింది. అతని బుర్ర అడ్డమైన అర్థంలేని ఆలోచనలనూ అతనికి ఎత్తి చూపింది. రాక్షసులూ, జంతువులుకూడా అనిపించుకోలేని పాత్రలు అతని మనసు లోకి వచ్చినై. ఇదంతా చూసి సత్యం నివ్వెరపోయాడు. ఈ దిక్కుమాలిన సన్నివేశాలూ వికృతమైన పాత్రలూ తనను చుట్టుబుట్టి, "నాటకం రాస్తావా, తమ్ముడూ ? రాయి, రాయి !" అని అవహేళన చేస్తున్నట్టు అనిపించింది అతనికి.

అతని బాహ్య జీవితంలో మళ్ళీమళ్ళీ రుజువైన అశక్తతే అతని ఆంతరంగిక జీవితంలో కూడా రుజువవుతున్నది. జీవితంలో విస్పష్టమైన సంబంధాలు పెట్టుకోక

మానసికంగా ఏకాకి అయి జీవించేవాడికి ఇదే అనుభవం కలుగుతుందని అతనితో చెప్పినావా రెవరూ లేకపోయారు.

అతను తన మనసును సరిదిద్దుకోవటానికిగాను రోజూ లైబ్రరీకి వెళ్ళి నాటకాలు చదవసాగాడు - ఇంగ్లీషువి. ఏదైనా ఒక నాటకం "చేతివాటు" వేస్తే ఎట్లా ఉంటుందా అన్న ఆలోచన కూడా అతనికి వచ్చింది. ఆధునిక నాటక రచయితలు అటువంటిపని చేస్తారని అతను విని ఉన్నాడు. కాని అతనికి అదీ కొంచెంకూడా సమ్మతం కాలేదు.

సత్యం నాటకం రాద్దా మనుకుని ఆరువారాలయింది. ఇంతవరకు అతని మనస్సులో దాని స్వరూపమేలేదు. "కాల చక్రం" ఆడుతున్నామనీ, వీలుంటే ఒకరోజు ముందుగా రమ్మనీ వామనరావు రాశాడు. సత్యానికి వెళ్ళబుద్ధి పుట్టలేదు. "బాగా ఉన్నా, చెడిపోయినా అది నా నాటకం కాదు; వీరరాజుది" అనుకున్నాడతను.

తరవాత వారం రోజులకు వామనరావు దగ్గిరనుంచి మరొక ఉత్తరం వచ్చింది. నాటకం చాలాబాగా రక్తికట్టింది. తెలిసినవాళ్ళు 'పంతులమ్మ' కంటె ఈ రచన బాగుందన్నారు. అయితే 'పంతులమ్మ' లాగ దీనికి ప్రతి సీనూ రక్తికట్టటంలేదు. పాటలుకూడా 'పంతులమ్మ'కు కుదిరినట్టుగా కుదరలేదు. ప్రేక్షకుల రియాక్షన్ అంతగా లేని సీనుల్లో పాడటానికి వీరరాజు రెండు పాటలు తయారుచేస్తున్నాడు. కొత్త ఐడియా. ఒక పాట నేపథ్యం పాట ! చాలా మంచి మట్టు దొరికింది.... "వైనెల మొదటివారంలో రెండో ఆట మీ ఊళ్ళోనే ఆడ నిశ్చయించాం. రాధాకృష్ణ మూర్తిగారితో మాట్లాడి ఆయనకు ఏ తేదీ వీలయేదీ తెలుసుకుని నాకు రాస్తావా?...." అని వామనరావు ఉత్తరంలో అడిగాడు.

సత్యాన్ని చూసి రాధాకృష్ణమూర్తి, "ఏమండీ, ఎప్పుడైనా సినిమా చూడటానికైనా రావటం లేదే ?" అన్నాడు.

సత్యం ఏదో గొణిగి తాను వచ్చిన పని చెప్పాడు.

"మీ నాటకమే ? తప్పకుండా ఆడదాం !"

రాధాకృష్ణమూర్తి సత్యాన్ని చాలాసేపు కూచోబెట్టాడు. డ్రింకు ఇప్పించాడు; ఒక గోల్డ్ ఫ్లేక్ పెట్టె తెప్పించి ఇచ్చాడు. అతనికి నాటకాల అనుభవంకూడా ఉంది. అసలు చిన్నప్పుడు చదువు ఎగగొట్టి నాటకాలవాళ్ళవెంట తిరిగాడు. అతను చెయ్యని పనిలేదు. నాటకాల పోస్టర్లు రాశాడు. వాటిని గోడలకు అంటించాడు. బండ్లో ఊరంతా తిరిగి కాగితాలు పంచిపెట్టాడు. బుకింగాఫీసులో కూచుని టిక్కెట్లు అమ్మాడు. తెరలు ఎత్తాడు. ప్రాంప్టరుగా పని చేశాడు. నటులకు గ్రీజు పెయింటు వెయ్యటంకూడా తెలుసు. ఒక్క వేషాలు వెయ్యటం మినహా అన్నీ తెలుసు.

నాటక సమాజాల కథలుకూడా అతని కెన్నో తెలుసు. నాటక ప్రపంచంలో అనేక గమ్మత్తులు జరుగుతై. ఒకఫారి ఎవరో పాపారాయుడి వేషం వేసి "నేనే తాండ్ర పాపరాయుడ" అనే పద్యం చదువుతూ "ఈ గుంటూరుజిల్లా కంతకూ నేనే

తాంధ్ర పాపరాయుడ" అన్నాట్ట. వెంటనే "పిట్"లో కూచుని ఉన్న పిల్లలమ్రి సుందరరామయ్య "విత్డ్రా ! విత్డ్రా !" అని హాలు మారుమోగేటట్టు అరిచి, ఆ అబ్బిదగ్గిర క్షమాపణ పుచ్చుకున్నాట్ట....నటుల మధ్య ఈర్ష్యలూ, వైరాలూ ఉంటై. నాయికా నాయక పాత్రలు ధరించేవాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడుకోని పరిస్థితికూడా ఉంటుంది. వాళ్ళు స్టేజీమీద ఒకరినొకరు గోతిలోకి తోసుకోవటానికి చేసే ప్రయత్నాలు ఎట్లా ఉండేదీ రాధాకృష్ణమూర్తి ఉదాహరణ లిచ్చి చెప్పాడు.... హార్మోనిస్టు సత్యనారాయణకు ఒక నటుడంటే కోపం ఉండేదట. ఇద్దరికీ మాటల్లేవు. ఆ నటుడి పద్యం వస్తే శ్రుతి అందించకా, ఎక్కువ శ్రుతో, తక్కువ శ్రుతో అందించీ, తప్పుడు రాగం వాయించీ నానాక్షోభా పెట్టేవాడుట. ఆనాటి స్టేజిలో ఉండిన చిత్రమేమిటంటే ఇటువంటివాటికి శిక్షణచర్యలు లేవు. ఎవరి బలాబలాలు వారు చూచుకోవటమే.

ఈ రకమైన కథలన్నీ వింటుంటే సత్యానికి టైము తెలియలేదు. అతను రెండుగంటలపైగా థియేటరుదగ్గిర గడిపి ఇంటికి తిరిగివస్తూ "నాటకం రాసేవాడికి నిజంగా ఈ వాతావరణం తెలియాలి. లేకపోతే నాటకాలు ఆకాశంనుంచి ఊడి పడ్డట్టుంటై—పెళ్ళికి పాతిన అరటి స్తంభాలల్లే ! వాటి వేళ్ళు నాటకరంగంలోకి చొచ్చుకుపోవు."

సత్యం ఇంటికివచ్చే దారిలో పోస్టాఫీసుదగ్గిర ఆగి, వామనరావుకొక కార్డు రాసిపడేసి వచ్చి, భోజనంచేసి గదిలో కాస్సేపు నడుం వాల్చాడు.

జానకి వచ్చి అతన్ని పక్కకునెట్టి అతని పక్కనే పడుకుని, ముక్కుతో అతని చెంప పొడవసాగింది.

"ఏమిటి?" అన్నాడు సత్యం.

"ఈసారి ముట్టు పదిరోజులు ఆలస్యమయింది. ఇంత ఆలస్యం ఎన్నడూ కాలేదు," అన్నది జానకి.

"మళ్ళీనా ? పిల్లవాడి కింకా ఎనిమిదినెలలన్నా నిండకుండానే-"

"ఇంకో పాపాయి ఉంటే బాగానే ఉంటుంది !" అన్నది జానకి.

"అవును- నలుగురు మాడవచ్చు !" అన్నాడు సత్యం.

కాని అతను పెద్దగా దిగులుపడలేదు. పరిస్థితులు మారతై. పీడకలలకు అంతం ఉంటుంది. జీవితం బొత్తిగా పీడకలవతుగా ఉన్నది. ఇది శాశ్వత పరిస్థితిగా నిలిచిపోవటం సాధ్యంకాదు.

"మనం ఇప్పుడు మాడుతున్నామా ఏమిటి ? ఎప్పుడన్నా ఒకపూట సగం తిండితింటే కొంప మునిగిపోతుందా ఏమిటి? ఏకాదశి అనీ, శనివారమనీ, సూర్యుడు కనిపించలేదనీ, కార్తీక సోమవారాల వంకపెట్టి మా తాతయ్య ఏడాదికి ఒకనెల రోజులు అన్నం మానేవాడు. మనం అంతకూడా మాడటంలేదు." అన్నది జానకి. తనకు నిజంగా కడుపే అయితే తన మొగుడు తనను చూసి అసహ్యపడకుండా

ఉండగలందులకు ఈ ప్రచారమంతా సాగించిందామె. పాపం, ఈ సంగతి ఎట్లా బయట పెట్టాలి. ఎప్పుడు బయటపెట్టాలన్న విషయం రోజల్లా రిహార్స్ చేసుకున్నది. నెలతప్పి పదిరోజులే అయింది. సత్యం ఆందోళనపడిన పక్షంలో, "అప్పుడే కడుపేసను కోవటానికి లేదులెండి!" అందామనుకున్నది. ఎక్కువ ఆందోళనపడలేదు గనక తాను రిహార్స్ చేసుకున్న రెండోవాదం- ముగ్గురు బతికితే నాలుగో నలుసు బతకలేదా అన్న ధోరణి- ప్రయోగించింది.

ఆమె ఒక్క పరిస్థితిని ఎదుర్కోవటానికే హడలిపోయింది. ఇంకొక బిడ్డ సత్యానికి ఏ మాత్రమూ ఇష్టంలేక తనకు నిజంగా గర్భమే అయితే తాను ఏం చేసేటట్టు? అది భయంకరమైన పరిస్థితి. సత్యం దేనికి ఏ మోతాదులో మండిపడతాడో జానకికి కొంచెం కూడా అంచనా లేదు. ఒక్కొక్కప్పుడు ఎగిరిపడదగిన వాటిని సౌమ్యంగా ఆమోదిస్తాడు. మరొకప్పుడు ఏమీలేని దానికి రోజుల తరబడి చిరాకు పడిపోతాడు. మళ్ళీ మామూలు మనిషి కావాటానికి అతనికి ఇష్టమైనది ఇంకేదన్న జరగాలి. అతని కోపం తగ్గించటం ఒకప్పుడు జానకికి సులువుగా చాతనయేది. ఒకప్పుడు ఆమె గుండుదెబ్బతిన్న దానల్లే అయిపోయి దైవంపైన భారంవేసి అతను మామూలు మనిషి అయినదాక కుళ్ళేది.

ఒకసారి సత్యానికి దేనికో - జానకి లెక్కన ఉత్తపుణ్యానికి— పట్టరానంత ఆగ్రహం వచ్చింది. అతని కోపం అకారణమని తెలియటంచేతనో ఏమో ఆమె భయపడక అతన్ని అమాంతం వాటేసుకుని అతని ముక్కు గుంజుతూ, "శాంతం, శాంతం!" అన్నది. అతని కోపం మంత్రించినట్టు మాయమయింది.

కాని ఇంకొకసారి అదే విధంగా మంత్రం వెయ్యటానికి జానకికి అవకాశం రాలేదు పాపం. ఆమెకు యుక్తి, నటనా చాతకాదు. అతని కోపానికి ఏ మాత్రం ఆధారం ఉందని తెలిసినా ఆమె అతని దూకుడుకు అడ్డం వెళ్ళేదికాదు. ఆ తుపానంతా తనమీదిగానే పోనిచ్చేది. తన తప్పే కానవసరంలేదు. ఇతర కారణాలవల్ల కూడా అతను బాధపడుతున్నట్టు తెలిస్తే అతన్ని ఎట్లా శాంతింపజెయ్యాలో ఆమెకు తెలిసేది కాదు. శాంతపరచాలని ఎప్పుడన్నా ప్రయత్నిస్తే అతని మూడో కన్ను ఆమెపైకి తిరిగే అవకాశంకూడా ఉంది. అందుచేత జానకికి నిజంగా ఆనందంగా ఉండేది, అతని మనస్సు శాంతంగా ఉండే కొద్ది సమయాల్లో మాత్రమే.

సత్యం తన భార్యకు చిన్న జీవిత సత్యం చెప్పాడు: "అన్నంలేక పస్తులుండటానికీ, కావాలని ఉపోషా లుండటానికీ తేడా ఉంది. నా ఇష్టమైతే నేను ఇల్లు కదలకుండా నెలలు తరబడి ఉంటాను. నన్ను ఒక నెల జైలులో ఉంచితే అదీ ఇదీ ఒకటి అవుతుందా?"

జానకి అతని చేతిమీద తలపెట్టుకుని, రొమ్ముమీద చెయ్యివేసి చిన్న కునుకు తీసింది. కాస్సేపటికల్లా అతని చెయ్యి మొద్దుబారిపోయింది. కాని నొప్పి అని పించలేదు. సత్యం మనసు ప్రేమతో నిండిపోయింది.

ప్రేమను ఎట్లా ప్రకటించటం ? దానికి నిజంగా మార్గమే లేదనే నిర్ణయానికి వచ్చాడు సత్యం. శరీరచేష్టలన్నీ కూడా ప్రేమోద్రేకానికి ఉపశాంతిచేసే ప్రక్రియలు గాని మరేం కాదు. తాను జానకిని ముద్దుపెట్టుకున్నాడా మొద్దుబారిన తన చెయ్యి తనకు జానకిపైనగల ప్రేమను మరింత దాగా వ్యక్తం చేస్తుందేమోనని అతనికి అనిపించింది.... అవును ప్రేమకూ, బాధకూ ఏదో సంబంధం ఉన్నది. తాను కనుక్కున్న ఈ గొప్ప సత్యం ఎంతోమంది ఆడవాళ్ళకు తెలిసి ఉండవచ్చుననుకున్నాడతను.

ఇంతలో పిల్లవాడు లేచి ఏడిచాడు. జానకి ఉలిక్కిపడి లేచింది. ఆమె ఒక్క క్షణం విచిత్రంగా చుట్టూ చూసి, "నిద్రపోయినానా ఏమిటి? మేలుకునే ఉన్నాననుకుంటున్నాను. మీరు కూమని ఏదో కొత్త నాటకం రాస్తున్నట్టు కల వచ్చింది. కలల్లో లేనేలేదు.... ఇదేగది.... అంటూ వెళ్ళి పిల్లవాణ్ని చిచ్చికొట్టసాగింది.

*

జానకి కల త్వరలోనే నిజమయింది. ఆ రాత్రి ఒంటిగంట దాకా సత్యం పడుకోలేదు. అతను నోటు పుస్తకంలో ఇంగ్లీషులో, తన నాటకానికి కథ రాసుకున్నాడు. అది సాఫీ అయిన కథ కాదు. సన్నివేశాల మధ్య లింకులు లేవు. కొన్ని పాత్రల వివరణ కూడా రాసుకున్నాడు. కథకన్న పాత్రల వివరణ అయిదారింత అయింది. పాత్రలకు విస్పష్టమైన స్వరూపం వస్తున్నకొద్దీ అతను అనుకున్న సన్నివేశాలు రూపం మారే అవకాశాలు పెరుగుతున్నై.

నాటక రచనకు ఈరకం ప్రయత్నం సాగించటం అతనికి ఇదే మొదటిసారి. ఇందులో ఉన్న సౌకర్యమూ, చిక్కులు కూడా అతనికి అర్థం కాసాగినై. అంతా తలకాయలోనే అనుకుంటే తన మనస్సులో ఏది స్పష్టంగా ఉన్నదీ, ఏది అస్పష్టంగా ఉన్నదీ తెలిసేదికాదు. ఇప్పుడు తెలుస్తున్నది.

తాలూకాఫీసులో ఒంటిగంట కొట్టటం విన్నాక అతను దీపం తగ్గించి పడుకున్నాడేగాని నిద్రవచ్చే సూచనలులేవు. మనుషుల కన్నా మనుషుల మెదళ్ళు బుద్ధిగలవి; అవి సగం పనిచేసి విశ్రమించవు. రెండు గంటలు కొట్టటంకూడా సత్యానికి తెలుసు. తరవాత చాలా సేపటికి అతను నిద్రపోయి ఉండాలి.

తరవాత రెండు రోజులపాటు సత్యం ఏం చేస్తున్నా, ఏం వింటున్నా, ఏం మాట్లాడుతున్నా అతని మనసులో ఒకమూల నాటకం మెదులుతూనే ఉన్నది. అది ఒక గుడ్డి జంతువు, ఒక పొట్లపాదు - అన్ని వైపులా తడివి చూసుకుంటూ, దొరికిన ఆధారమల్లా పట్టుకుంటూ మధ్య మధ్య పడిపోయి మళ్ళా పైకి లేస్తూ అతి ప్రయాసతో పురోగమిస్తున్నది.

ఈ లోపుగా ఒకసారి వామనరావు వచ్చి సత్యం మొదటి నాటకం 'కాలచక్రం' ఆడటానికి ఏర్పాట్లు చేసివెళ్ళాడు. రాధాకృష్ణమూర్తి నాటకం గురించి చాలా శ్రద్ధ తీసుకున్నాడు. గోడలకు పోస్టర్లు అంటించారు. "నాటకకర్త మన

సత్యంగారే!" అని వాటిమీద రాసి ఉన్నది. అది చూసి సత్యం నవ్వుకున్నాడు. అది రాధాకృష్ణమూర్తి పనే. అతనికి తనపైన అంతగురి ఎట్లా పడిందో సత్యానికి అర్థం కాలేదు. కొందరు మనుషులు ఏదో సూక్ష్మమైన ఆధారాన్ని పురస్కరించుకుని ఒక మనిషిమీద అభిమానమో - అసహ్యమో ఏర్పాటుచేసుకుని ఆజన్మాంతం ఆ అభిప్రాయాన్ని మార్చుకోరు. రాధాకృష్ణమూర్తి ఆ రకం మనిషి. సత్యంతో సన్నిహిత సంబంధం లేదేమో, అతనికి తన అభిప్రాయాన్ని మార్చుకునే అవసరం కూడా కలగలేదు.

నాటకంరోజు దగ్గిరపడుతున్న కొద్దీ సత్యానికి ఆ నాటకం-గురించి ఆసక్తి సన్నగిల్లింది. నాటకం అభాసు అవుతుందని ఎందుకో అతనికి అనిపించింది. "మన సత్యంగారే!" అన్నది కట్టికుడుపుతుంది! తానిక ఊళ్ళో తల ఎత్తుకు తిరగటానికి ఉండదు!

ఇటువంటి భయాలతో సత్యం తన కొత్తనాటకాన్ని గురించి కూడా ఆలోచించలేక పోయినాడు. నాటకం రోజు అతనికి మతి మతిలోలేదు. ఆ రాత్రి తొమ్మిది గంటలవేళ అతనూ జానకీ థియేటరుకువెళ్ళారు. థియేటరుకు బయట జనం ఉన్నట్టు కనిపించారు. కాని దగ్గిరిగా చూస్తే సోడాలవాళ్ళూ, కిళ్లీల వాళ్ళూ, ఏనాది పిల్లకాయలూనూ అంతా అపశకునంగానే కనిపించింది' బుకింగాఫీసు కిటికీదగ్గిర ఎవరూ లేరు. సత్యం చూస్తుండగానే ఎవరో ఒకాయన ముచ్చటముడి వేసుకుని కిటికీ దగ్గిరికి వచ్చి, టిక్కెట్లు అమ్మేవాణ్ని ఏదో అడిగి, టిక్కెట్టు కొనకుండానే వెళ్ళిపోయాడు.

హాలులోపల సరిగా ఇరవైమంది ఉన్నారు. అందులో పదిహేను మంది ఆఖరు తరగతిలో ఉన్నారు.

నాటకం, తన అదృష్టంలాగే, నిద్ర పోతున్నది.

సత్యానికి ఇంటికిపోయి పడుకుందామని క్షణం పాటు అనిపించింది. అతను జానకిని స్టేజి లోపలికి తీసుకువెళ్ళాడు. జానకి ఎన్నడూ తెరవెనక భాగోతం ఎరగదు. రంగులు వేసుకుంటున్న వాళ్ళనూ, దుస్తులు వేసుకుంటున్న వాళ్ళనూ, ఆమె నోరుతెరుచుకు చూసింది. ఆమె వేషం మీద వీర్రాజును కూడా గుర్తించలేదు. "ఏమమ్మా, కులాసాగా ఉన్నారా? మీ పాపాయి కదూ! కిందటిసారి చూసినప్పటి కన్న ఒళ్ళు చేశాడు!" అని వీర్రాజు పలకరించినాక, అతన్ని గుర్తించినట్టు నవ్వి, తన భుజంమీద పడుకుని నిద్రపోయే కొడుకుకేసి గర్వంగా చూసుకున్నది.

వామనరావు వాళ్ళను స్టేజి అవతలి భాగంలోకి తీసుకుపోయి కుర్చీలు వేసి కూచోబెట్టి, టీ ఇప్పించి బాతాఖానీ కొట్టాడు.

"ఈ నాటకానికి ఖర్చులుకూడా రావు," అన్నాడు సత్యం.

"అదేంలేదు. అంతో ఇంతో లాభం కూడా వస్తుంది. కొద్దిమందే చూసినా, నాటకం బాగున్నదనిపించుకుంటే మళ్ళీ ఇరకొకే ఆట ఆడవచ్చు. మొదట్లోనే ఏ నాటకానికీ లాభంరాదు," అన్నాడు వామనరావు.

నాటకం మొదలు పెట్టేప్పటికి పదిగంట లయింది. తొమ్మిదిన్నర దాటి నప్పటినుంచీ ప్రేక్షకులు ఈలలువేస్తూ వచ్చారు. నాటకం ప్రారంభం కాపోతుండగా సత్యం జానకిని తీసుకుని ఆడిటోరియమ్‌లోకి వచ్చాడు. హాలు దాదాపు సగం నిండి ఉన్నది. "ఫరవాలేదే! అన్నాడతను జానకితో.

ఇద్దరూ ముందువరసలో కూచున్నారు. ఊళ్లో పెద్దలు దాదాపు డజనుమంది నాటకం చూడవచ్చారు. డాక్టరు శేషాచలపతీ, ప్లీడరు ముకుందరావూ, లక్ష్మీనారాయణ మేష్టారూ, కౌన్సిలరు నాయుడూ- ఇటువంటివాళ్ళు నాటకం చూడరావటం సత్యానికి ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు కేవలం తన పేరు మూసే వచ్చిఉంటారని అతనికి తట్టలేదు. స్వస్థానంలో మనిషికి లభించే ఆదరం అతను రుచిచూసి ఎరగడు. "మన సత్యంగారే!" అన్న భావం అచ్చగా రాధాకృష్ణమూర్తి ఒక్కడిదే కాదనీ, ఊళ్ళో ఇంకా చాలామంది హృదయాలలో అది ప్రతిధ్వనించిందనీ అతను కలలోకూడా అనుకోలేదు.

నాటకం మొత్తంమీద జయప్రదంగానే ఉన్నది. వామనరావు చెప్పినట్టు,కొన్ని దృశ్యాలు రక్తికట్టినట్టుగా మరికొన్ని రక్తికట్టలేదు. నాటకం మొదటినుంచీ చివరదాకా ఒకే వేగంతో నడవలేదు. మొదటి అంకం బాగుండటంతో సగం విజయం లభించినట్టయింది. మళ్ళీ చివరి రంగాలు రక్తిగా ఉన్నై. అందుచేత నాటకమంతా బాగున్నట్టే అనిపించింది.

వీరరాజుచేసిన మార్పులను దాదాపు అన్నిటినీ ప్రేక్షకులు సంతోషంతో ఆమోదించటం సత్యం గమనించాడు. కాని వాటిని అతను పూర్తిగా ఆమోదించలేదు - సహించి ఊరుకున్నాడు.

ఇంకొక్క సీను ఉన్నదనగా వామనరావు స్టేజిపైకివచ్చి ప్రేక్షకులతో నాలుగు ముక్కలు చెప్పాడు. త్వరలోనే రంగస్థల నాటకాలలో మార్పు వస్తుందని, సినిమాల ప్రభావం నాటకాలపైన పడవచ్చుననీ, సినిమాపైన నాటకాల ప్రభావం సన్నగిల్లిందనీ, తాము ఈ రోజు ప్రదర్శించిన నాటకంలో కొత్త పద్ధతులు కొన్ని ఉన్నయనీ అన్నాడు.

అతను మాట్లాడుతుండగానే డాక్టరు శేషాచలం స్టేజీమీదికి వచ్చి తాను కూడా రెండు ముక్కలు చెబుతానన్నాడు. ఆయన నాటక ప్రదర్శనాన్ని చిన్న మీటింగుగా చెయ్యటంతో ప్రారంభించి క్రమంగా దాన్ని సత్యానికి సన్మానసభగా మార్చేశాడు. ఆయన నాటకంలో లేని సుగుణాలు కూడా కనిపెట్టాడు. సత్యంలో ఒక షేక్స్పియరునూ, ఒక కాళిదాసునూ చూడటానికి శాయశక్తులా పనిచేశాడు. సత్యానికి హాలులోనుంచి పారిపోదామని అనిపించింది; ఆయన చెప్పేది వినాలనీ అనిపించింది.

పోతూపోతూ ఆయన సత్యాన్ని స్టేజీమీదికి ఆహ్వానించి రెండు ముక్కలు

చెప్పమన్నాడు. అదివరకల్లా, "నాటకం జరగనివ్వండీ!.... దబ్బున తెమల్చవయ్యా బాబూ!" అని కేకలుపెట్టిన ప్రేక్షకులు చప్పట్లు కొట్టారు.

సత్యం గుండె గుభేలుమన్నది. ఈ దిక్కుమాలిన నాటకం రాసి ఇంత బరువు నెత్తికి తెచ్చుకున్న సంగతి అతను గ్రహించలేదు. అతనికి చచ్చే సభా కంపం ఉన్నది. పైన ఏం మాట్లాడాలో ఆలోచించలేదు. ఎవరో ఈడుస్తున్నట్టుగా స్టేజి ఎక్కి అందరికి దణ్ణంపెట్టి పావు నిమిషంసేపు నిలబడ్డాడు. ప్రేక్షకులు చప్పట్లు కొట్టారు. అకస్మాత్తుగా చప్పట్లు ఆగిపోయి అత్యంత భయానకమైన నిశ్శబ్దం వెలిసింది.

"మహాశయులారా" అన్నాడు సత్యం. అతని చేతులింకా జోడించే ఉన్నాయి. అతని కళ్ళఎదట రాక్షసుల రూపాలూ, సింహాలూ, పులులూ తాండవిస్తున్నై. అతను తలవంచి జానకికేసి చూశాడు. జానకి అతనికేసి నవ్వుతూ గర్వంగా చూస్తున్నది. పిల్లవాడు చప్పట్లకు కాబోలు లేచి తల అటూ ఇటూ తిప్పుతున్నాడు. ఉన్నట్టుండి వాడు ఒక కేకా, ఏడుపూ, అరుపుకానిది పెట్టాడు.

"మహాశయులారా, ఆ అరిచేది మా అబ్బాయి. వాడికి నాటకం ఏమీ బాగా లేదు!" అనేసి సత్యం స్టేజీమీదనుంచి గబగబా దిగివచ్చాడు.

అందరూ మళ్ళీ చప్పట్లు కొట్టారు.

తాను స్టేజిమీదినుంచి అన్న ఆ ఒక్క వాక్యంలోనూ నమ్రత ఎంత లోపించిందో తరవాత సత్యం ఒక్కడే సరిగా ఊహించాడు. అతనికి తెలిసినంతవరకూ మరెవరూ ఆ సంగతి గ్రహించలేదు....

నాటకానికి నాలుగు, అయిదు వందల మధ్య కలెక్షను వచ్చింది. చాలామంచి కలెక్షనని అందరూ అన్నారు. గొప్ప నాటకం అనకపోయినా, అందరూ మంచి నాటకమే నన్నారు.

# 6

కాలం ఎట్లా గడుస్తున్నదీ జీవితం ఏట్లా నడుస్తున్నదీ సత్యానికి పట్టలేదు. దూరప్రయాణం చేసేవాడు కొంతసేపు తన ప్రయాణం గురించి వైనవైనాలుగా ఆలోచించుకుని, ఆ తరవాత ఆ గొడవే మరిచిపోయి తన పరిసరాలలో తనకు కనిపించేవాటిలో నిమగ్నుడై పోయినట్టుగా సత్యం తన సమస్యలను గురించి ఆలోచించటం మానేసి ప్రేక్షకుడి మనస్తత్వం అలవరచుకుని తన మనసును ఒకేసారి అనేక విషయాలలో లగ్నం చెయ్యసాగాడు.

తనను గురించి తాను ఆలోచించటం మానేశాక అతనికి ఊళ్ళో మిత్రుల వంటివాళ్ళు అయిదారుగురు కనిపించారు. వాళ్ళు చాలాకాలంగా ఎరిగినవాళ్ళే. కాని దగ్గిరకు రాలేదు. తప్పు సత్యందే. తన భావాలలోనే మునిగిపోయి ఉన్న

సత్యం వాళ్ళ భావాలను పంచుకునేటందుకు ఏ మాత్రమూ ప్రయత్నించలేదు. తన దారిద్ర్యంకూడా ఇంకొకరికి తెలియ నివ్వటం సత్యానికి అవమాన మనిపించింది గాని, వాళ్ళు అతని దారిద్ర్యాన్ని చూచి ఏనాడు ఏవగించుకోలేదు. అతనికి కావల సిన కొద్ది పాటి సహాయం వాళ్ళు ఏనాడైనా చెయ్యగలవారే.

"కాలచక్రం" ఆడటం సత్యానికి ఇంకొకవిధంగా లాభించకపోయినా అతన్ని నలుగురి మధ్యా పడేసింది. అతనికి దగ్గిరిస్నేహితులు కాబోతున్న వాళ్లేకాక ఇంకా ఇతరులుకూడా అతన్ని పలకరించారు.

సత్యానికి ఈ స్నేహితులు మూలంగా ఉద్యోగమంటూ లేకుండానే బతుకు వెళ్ళమారిపోయింది. రాధాకృష్ణమూర్తి బావమరిది నరసింహం కొత్తగా ఒక మెడికల్ స్టోరు పెట్టాడు. సత్యం రోజూ ఉదయమూ, సాయంకాలమూ స్టోరులో కూచునే వాడు. నరసింహానికి స్థిమితంగా కూచుని అమ్మకాలు జరిపే ఓపికలేదు. పేకాట అతని వ్యసనం. పెద్దాట ఆడేవాడు. పై ఊళ్ళకు పోకపోతే సాయంకాలం విధిగా క్లబ్బుకుపోయి పోకరూ, రమ్మీ, పెద్దచేతులు పడితే అక్షన్‌బ్రిడ్జీ ఆడేవాడు. డబ్బు భారీగా పోగొట్టుకునేవాడుగా. భారీగాగెలిచేవాడు. గెలిచినా, ఓడినా మొహంలో తెలి సేదికాదు. నూరెకరాల ఆసామి.

చాలామంది ఆ మెడికల్ స్టోరును "సత్యంస్టోరు" అనేవాళ్ళు. కొట్టు తెరవ టానికీ, స్టేషనుకు వెళ్ళిరావటానికి కుర్రా డొకడుండేవాడు. మందులను గురించి సత్యానికి తెలిసినంతా వాడికీ తెలుసు. వాడికీ చదవటంరాదు. అయినా ఒకసారి మందుపేరు చెబితే సీసానుబట్టి జ్ఞాపకంపెట్టుకు సరిగా తీసి ఇచ్చేవాడు.

సత్యానికి ఇంత జీతమని లేదు. తనకు ఎప్పుడు కావలిస్తే అంత కాషులో నుంచి తీసుకునేవాడు. ఎవరన్నా ఎరిగినవాళ్ళు వస్తే హోటలు ఖాతానుంచి స్వతం త్రంగా కాఫీలు తెప్పించేవాడు. కుర్రాడూ, తానుకూడా రెండు పూటలా ఆ ఖాతా లోనే టిఫిను తినేవాళ్లు.

మెడికల్‌షాపుకు చిన్న డాక్టర్లు వచ్చి కూచుంటూ ఉండేవాళ్ళు. డాక్టరు అన్నేశ్వరం అట్లాగే సత్యానికి స్నేహితుడైనాడు. అన్నేశ్వరానికి ప్రాక్టీసు లేదు. కొత్త డాక్టరు; పైన భేషజంలేని డాక్టరు. అందరికీ వైద్యంలో ఉండే మట్లన్నీచెప్పే వాడు. మంచిడాక్టరు పైకిరాదని అతను వాదించేవాడు. ఎన్నో రోగాలు వాటంతట అవే నయమవుతై; ఈ మాట రోగితో చెబితే డాక్టరుకు డబ్బురాదు గదా! చికిత్సఉన్న రోగాలు తీసుకో. రోగం చప్పున నయమైతే డాక్టరుకు ఏం ఒరుగు తుందీ? రోగం వైద్యుడిచేతికి లొంగినట్టుండాలిగాని నయంకాకూడదూ .... .... అరె, భాయీ! బాగా డబ్బున్న నాలుగు దీర్ఘవ్యాధి కేసులుంటే డాక్టరుకు గడుస్తుంది. లేకపోతే విస్తళ్ళు కుట్టుకు బతకటం మేలు."

డాక్టరును ఎదిరించడానికి ఆచార్లు ఒక్కడే తగినవాడు. ఆచార్లుకు హోమియోపతీషాపు ఉన్నది. అది "సత్యంస్టోరు"కు కొంచెం అవతలగా ఉండేది.

"మిమ్మల్ని అని లాభం లేదులెండి. డాక్టరుగారూ! అసలు జబ్బు ఆ అలోపతి విధానంలోనే ఉంది. హోమియోపతీ విధానంలోనే న్యాయం ఉంది. దయగల కటికవాడంటే ఎంత అర్థం ఉంటుందో, న్యాయమైన అలోపతీ వైద్యమన్నా అంతే!" అనేవాడు ఆచార్లు.

పాపం ఆచార్లుకు ఎక్కువ అమ్మకా లుండేవికావు. తోచనప్పుడల్లా "సత్యం స్టోరు"లో కూచునేవాడు.

"అలోపతీలో న్యాయంలేక పోవచ్చుగాని, మీ బల్లిగుడ్డు మాత్రలంత పచ్చి మోసం ఎక్కడా ఉండదు. మీకన్న రైల్లో మందులమ్ముకునేవాళ్ళు ఎక్కువ న్యాయమైనవాళ్ళు. మంచో చెడో, అందులో మందంటూ ఉంటుంది!" అనేవాడు డాక్టరు.

ఒకరోజు సత్యం స్టోరులో ఆచార్లూ, డాక్టరూ కూచుని మాట్లాడుతుండగా కోర్టు అమీనా కేశవులు మూలుగుతూ వచ్చాడు. అతని తలకు నిలువుగా తువాలు చుట్టుకుని చెంపలు కప్పుకుని ఉన్నాడు. పళ్ళు కరచుకుని మాట్లాడుతూ, "ఇక్కడున్నారా, ఆచార్లుగారూ! చచ్చిపోతున్నాను! తెల్లవార్లూ యమబాధ!" అంటూ తువాలు విప్పారు. కుడిపక్క దవడ విపరీతంగా వాచి ఎర్రగా నిగనిగలాడుతున్నది.

"హరి సీదుంపతెగా ! అంతదాకా రానిచ్చావుటయ్యా ? పదపద !" అంటూ ఆచార్లు లేచి అమీనాను తన షాపుకు వెంటబెట్టుకు వెళ్ళాడు.

ఇది జరిగిన మర్నాడు కాఫీహోటలులో సత్యానికి ఆచార్లు, డాక్టరూకూడా తారసిల్లారు. అమీనా జ్ఞాపకంవచ్చి సత్యం, "ఆ కేశవులు కెట్లా ఉందో ?" అన్నాడు.

"బెల్లడోనా ముప్పై[1] తగిలించా అదే నయమవుతుంది." అన్నాడు ఆచార్లు నిర్లక్ష్యంగా.

"అదంతా ఉత్తది ! డోసు జాస్తయితే వాణ్ణి మరింత బాధ పెట్టటానికి ఆ బెల్లడోనా చాలు," అన్నాడు డాక్టరు.

వాళ్ళు బయటికి వచ్చేసరికి హోటలులోకి వస్తూ అమీనా కేశవులు కనిపించాడు. దవడవాపు ఏమీలేదు. మామూలు మనిషిలాగే ఉన్నాడు.

"పనిచేసినట్టుందే, కేశవులూ?" అన్నాడు ఆచార్లు చాలా మామూలు గొంతుతో.

'అట్టాయిట్టాగా ? ఏదీ ?' అంటూ కేశవులు కుడిదవడ తడువుకున్నాడు.

డాక్టరు ఒకవేళ ఆశ్చర్యపడితే దాన్ని పైకి చూపలేదు. సత్యానికి మాత్రం ఇది తనకు కలిగిన అపూర్వమైన అనుభవాలలో ఉత్తమోత్తమంగా కనిపించింది.

హోమియోపతీ మందుతో అంతలావు వాపూ తీసేసినట్టు పోయింది! ఇందులో గారడీగాని, కనుకట్టుగాని లేదు ! ఇంతశక్తివంతమైన వైద్యవిధానం కరతలామల

---

1. బెల్లడోనా ముప్పై : హోమియోపతిలో 30 పొటెన్సీగల ఒకరకం మాత్రలు.

కంగా తెలిసిన ఆచార్లును తాను ఎవరిమాటలో విని పూల్‌కింద కట్టేశాడు !

ఆరోజే సత్యం ఆచార్లును తన గురువులలో ఒకణ్ణిగా ఎన్నుకుని హోమియోపతిని గురించి అతను చెప్పేదంతా విన్నాడు. ఆచార్లు ఇటువంటి "మిరకిల్" చికిత్సలు చాలా చేసినట్టు స్పష్టమయింది.

"ఇందులో అదృష్టంకూడా చాలా ఉంది సత్యంగారూ ! సరిఅయిన సిమిలిమమ్ ఒక్కొక్కసారి దొరకదు. అదీగాక మనకు హోమియోపతీ గురించి తెలిసిందెంతా ? అది సముద్రం," అన్నాడు ఆచార్లు.

రోగాలమీద ఇంత శక్తితోబాటు ఇంత నమ్రతకూడా ఇచ్చే వైద్య విధానం గురించి తాను తెలుసుకోకపోతే తనకు జీవితం గురించి ఏమీ తెలియనట్టే ననిపించింది సత్యానికి. ఆచార్లు అతనికి చదవటానికి నాష్ పుస్తకం ఒకటి ఇచ్చాడు.

సత్యం ఎవరో డబ్బిచ్చి నియోగించినట్టు తన సర్వశక్తులూ, కేంద్రీకరించి హోమియోపతీ పుస్తకాలు చదివి ఆ విధానాన్ని జీర్ణించుకోసాగాడు. తొమ్మిది రూపాయలు ఖరీదుచేసే బోరిక్ అండ్ టాఫెల్‌వాళ్ళ రిపర్టరీ[1] సెకండ్‌హేండ్‌ది నాలుగు రూపాయలకు అమ్మకానికివస్తే ఆచార్లు సత్యానికి ఇప్పించాడు. అదిగాక మూడుపావలాలు పెట్టి ద్వాదశామా[2] చికిత్స పుస్తకం ఒకటికూడా కొన్నాడు సత్యం. అది మామూలు రోగాల మీద పనిచెయ్యటం ప్రత్యక్షంగా చూసినప్పుడల్లా అతనికి వాటిపైన అపారమైన భక్తిభావం కలిగేది. అవి పనిచెయ్యక మొండికెత్తినప్పుడు వెనకటి రుజువులన్నీ మరచిపోయి, "చాలామంది వీటిని నమ్మకపోవటానికి తగిన కారణం ఉందేమో ! ఇది వట్టి హంబగ్ కావచ్చు !" అనుకునేవాడతను.

"ధమ్మం శరణం గచ్ఛామి" అన్నంత మాత్రాన చాలదు. "సంఘం శరణం గచ్ఛామి" అనికూడా అనాలి. వర్తమానంలో చిక్కుకుపోయి, గతాన్ని విస్మరించి భవిష్యత్తులో విశ్వాసం కోల్పోయేవాడికి సంఘం ఆసట అవుతుంది. ఊళ్ళో ఉన్న ఇతర "ఉమాపతి"[3] భక్తులు సత్యం యొక్క విశ్వాసాన్ని బలపరిచి కాపాడారు.

* * *

సత్యం నాటక రచన సంవత్సరమున్నర క్రితమే నిలిచిపోయింది. అతను రెండో నాటకం రాశాడు. కాని దానిని ఎవరూ ఆడలేదు. తలవని తలంపుగా వామనరావు నాటక కంపెనీ విచ్ఛిన్నమైపోయింది. వీర్రాజుకు సినిమా ఛాన్సు తగిలింది. అతను కొల్హాపూరు[4] వెళ్ళిపోయినాడు. అటునుంచి ఎటు వెళ్ళాడో సత్యానికి

1. బోరిక్ అండ్ టాఫెల్ వాళ్ళ రిపర్టరీ : హోమియోపతి పుస్తకం.
2. ద్వాదశమా చికిత్స పుస్తకం : భాగానగరం గురులింగదేవర రాసిన ద్వాదశ లోహ భస్మ విధానం అనే వైద్య గ్రంథం కావచ్చునేమో.
3. 'ఉమాపతి' భక్తులు : హోమియోపతి వైద్య విధానాన్ని విశ్వసించేవాళ్ళు.
4. కొల్హాపూరు : తొలి చిత్రాల రంగభూమి, కుటుంబరావుకూడా కొన్నాళ్ళు కొల్హాపూరులో చిత్ర నిర్మాణ బృందంలో పనిచేశారు.

స్పష్టంగా తెలియదు. ఎవరిదగ్గరో అసిస్టెంటు డైరెక్టరుగా చేరినట్టు సత్యం విన్నాడు.

వీర్రాజు నటించిన పిక్చరు వచ్చినప్పుడు సత్యం చూశాడు. పిక్చరు బాగా లేక పోవటం అటుంచి వీర్రాజు కొంచెంకూడా బాగాలేడు. తెరమీద అతని మొహంలో చాలా లోపాలు కనిపించినై. అతని నటన నటనేకాదు.

"స్టేజిని రాజల్లే ఏలగలవాడు ఈ సినిమాకు ఎందుకు వెళ్ళినట్టు ? స్టేజికి నష్టం చేశాడు. సినిమాకు లాభం చెయ్యలేదు !" అనుకున్నాడు సత్యం. వీర్రాజు సినిమాలలో ఇంకా ఎక్కువ సంపాదించగలుగుతాడని అతనికి తట్టలేదు. సినిమాలకు మంచి భవిష్యత్తు ఉన్నదని అతనికి తెలీదు. అతనికి సంబంధించినంతవరకు సినిమా మరో ప్రపంచం. అందులోకి ప్రవేశించాలనే ఉద్దేశంకూడా అతనికి తట్ట లేదు.

కాని తలవని తలంపుగా అతను తాను నాటకకర్తా అన్నది మళ్ళా స్మరించ వలసివచ్చింది.

"పై మాసంలో ఓల్డ్‌బాయిస్ డే. నీ దగ్గిర ఏదో నాటకం ఉందిటగా. మనం ఆడకూడదటోయ్ ?" అన్నాడు శివరావు ఒకనాడు సత్యంతో.

"ఆడొచ్చునేమో!" అన్నాడు సత్యం ఆటే ఉత్సాహం లేకుండా. ఆ నాటకాన్ని అతను చాలాభాగం మరిచిపోయినాడు.

మర్నాడు శివరావూ, వెంకట్రామయ్యా, కృష్ణమూర్తీ సత్యం ఇంటికి వచ్చారు. సత్యం నాటకాన్ని పైకి తీసి వాళ్ళకు వినిపించాడు.

"ఇది పెద్దనాటకమే. తగ్గించి ఆడితే ?"

"కాదు, మామూలు స్టేజిమీద ఆడి టిక్కెట్లు పెడితే ఖర్చులైనా రావచ్చు."

"స్టేజి అంటే కుదిరేమేళాం కాదులే."

చర్చ జరిగింది. చివరకు సత్యం నాటకాన్ని కుదించి ఆడితేనే బాగుంటుం దన్నాడు. కొన్ని రంగాలు ఎత్తేస్తే నాటకం చెడదు. కొన్ని పాత్రలు తగ్గుతై.

తరవాత వేషధారులను గురించి చర్చ జరిగింది. మగవేషాలు ఫరవాలేదు. ఆడవేషాలు కావాలి. తల్లికూతుళ్ళయినా తప్పనిసరిగా వుండాలి.

"తల్లి వేషం సంగతి నాకు తెలీదుగాని కూతురు వేషానికి హైమవతి పనికొ స్తుంది. ఓల్డ్‌గరల్ కూడా !" అన్నాడు వెంకట్రామయ్య.

"ఆ హైమవతికి ఒక తల్లిలేదూ ?" అన్నాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి కొంచెం హాస్యగాడు.

"హైమవతి ఎందుకులేవోయ్ ?" అన్నాడు శివరావు నీరసంగా.

"అదేం ? గుంటూరులో స్థానంవాళ్ళు కన్యాశుల్కం ఆడితే బుచ్చమ్మ వేషం వేసింది. తెలుసా ? అద్భుతంగా చేసిందిట."

ఈ హైమవతి మామూలు సంసారిణిల్లాగా జీవించటంలేదని శివరావుడి అభ్యంతరమైనట్టుగా సత్యం అర్థం చేసుకున్నాడు.

హైమవతి గురించి చర్చ సాగింది. ఆమె మొగుణ్ణి వదిలిపెట్టిందని శివరావు అన్నాడు. కాదు మొగుడే వదిలేసి మళ్ళా పెళ్ళి చేసుకున్నాడనీ, ఆమెకు భరణంకింద పది ఎకరా లిచ్చాడనీ ఎప్పుడన్నా వచ్చి చూసిపోతూ ఉంటా డని వెంకట్రామయ్య అన్నాడు.

"జీవిత సభ్యత్వంక్రింద పది ఎకరాలిచ్చు కున్నాడుగామాలు. మామూలు చందాదారులూ, పోషకులూ, మహరాజ పోషకులూ ఎంత ఇచ్చుకోవాలో ?" అన్నాడు కృష్ణమూర్తి.

"కృష్ణమూర్తీ నువు కాస్సేపు ఊరుకుంటావా ?" అన్నాడు వెంకట్రామయ్య.

సత్యం వెంకట్రామయ్య అభిప్రాయాన్ని బలపరిచాడు. కృష్ణమూర్తి తన వోటును డిస్క్వాలిఫై చేసుకోవాలని తీర్మానించుకున్నాడు. శివరావు పొత్తిగా ఒంటరి గాడైపోయి, "అసలా మనిషి మన నాటకంలో వేషం వెయ్యటానికి ఒప్పుకోదు," అన్నాడు.

"అడిగిచూస్తాం తప్పేం ?" అన్నాడు సత్యం.

ఆరోజు సాయంకాలం సత్యమూ, వెంకట్రామయ్యా హైమవతి ఇంటికెళ్ళి మాట్లాడటానికి ఏర్పాటు జరిగింది.

హైమవతి ఇంట్లోనే ఉన్నది. స్టూడెంటులాగా బల్లముందు కూచుని ఏదో పత్రిక చదువుకుంటున్నది. ఎవరో వచ్చిన చప్పుడు విని ఆమె తల ఎత్తి చూసి లేస్తూ, "రండి కూచోండి!" అన్నది.

"మీ రెవరు ? ఏం పనిమీద వచ్చారు ?" అన్న ప్రశ్నలు ఆమె కళ్ళలో కని పించినై తప్ప నోటివెంట రాలేదు.

ఆమె రెండు కుర్చీలు బల్ల దగ్గిరగా లాగి ఇద్దరినీ కూచోబెట్టింది.

సత్యం కూచుని చుట్టూ కలియచూశాడు. అది ఒక హాలులా గున్నది. మామూలు ఇళ్ళకన్న నాగరికంగానే ఉన్నది! గోడలో ఉన్న అలమారులో పుస్తకా లున్నై. ఒకమూల రేడియో సెట్టున్నది. ఆమె కూచున్న బల్లమీద అందమైన టేబుల్ క్లాత్ ఉన్నది.

హైమవతి అంత చెప్పుకోదగిన అందగత్తెకాదు. మొహం చిన్నది. కనుముక్కు తీరున్నది. నుదురు విశాలమైనదికాదు. మామూలు చీరే కట్టుకున్నది. ఒంటిమీద విశేషం నగలుకూడా లేవు. ఎడమ చేతికి రిస్టువాచ్ ఉన్నది.

వెంకట్రామయ్య ఆమెను బాగా ఎరుగునని సత్యం ఊహించుకున్నాడు. కాని ఆమె అతన్ని గుర్తించలేదు.

"నా పేరు వెంకట్రామయ్య. మా చెల్లెలు అన్నపూర్ణ మీకు తెలుసుననుకుం టాను," అన్నాడు వెంకట్రామయ్య.

"అన్నపూర్ణ అంటే-" హైమవతి కొంచెం ఆలోచించి, "ఓవర్సీరు సుందరా మయ్యగారి భార్యేనాండీ ?" అన్నది.

"అవునవును ! ఇతను సత్యం అని—నాటకాలు రాస్తాడు."

"కాలచక్రం రాసింది మీరేనాండీ ?....నే నా నాటకం చూశాను-మన ఊళ్ళో ఆడినప్పుడు."

ఆ తరవాత హైమవతి వెంకట్రామయ్యకన్న సత్యాన్నే అప్తుదల్లే చూసింది.

వాళ్ళు వచ్చినపని చెప్పారు.

హైమవతి అసలు విషయం అవతలకి నెట్టేసింది.

"నన్ను రెండుమూడేళ్ళకిందట ఒక్కసారే ఓల్డ్‌బాయిస్ డేకి పిలిచారు. నే నప్పుడు నడిసముద్రంలో ఉండటంమూలాన రాలేకపోయినాను. మళ్ళీ నన్నెవరూ పిలవనూలేదు, నేను వెళ్ళనూలేదు," అన్నదామె.

వెంకట్రామయ్య పూర్వ విద్యార్థుల తరఫున ఆమెకు క్షమాపణ చెప్పాడు. ఆమె నవ్వి "నేను అందుకని చెప్పలేదు. నేను స్కూల్లో చదివానని అందరూ మర్చిపోయినందుకు చెప్పాను." అన్నది.

"డాక్టరు సరోజినీకూడా చదివారు. మన స్కూల్లో ఏటా పిలుస్తున్నాం. కాని రారు !" అన్నాడు వెంకట్రామయ్య బుద్ధి తక్కువగా.

"ఆవిడకు స్టేటస్ ఉన్నది గనక జ్ఞాపకం ఉంచుకున్నారు. నేనుకూడా కనీసం ఏ పంతులమ్మ పనో చేస్తూంటే—ట్రెయినింగు అయినానుకూడా, తెలుసాండీ ? అయితే డిస్ట్రిక్టు బోర్డులో పంతులమ్మలకు కావలసింది ట్రెయినింగు ఒక్కటేకాదు-ఎందుకులెండి ?" అన్నది హైమవతి.

ఒక నడికారు మనిషి పళ్ళాల్లో ఏవో తెచ్చి బల్లమీద పెట్టి, "తింటూ ఉండండి నాయనా కాఫీ చేస్తున్నాను," అన్నది.

ఆమెను చూస్తేనే హైమవతి తల్లి అని తేలిపోయింది.

"ఎందుకండీ, ఇదంతానూ ? కాస్సేపట్లో వెళ్ళి భోంచేస్తాంగద !" అన్నాడు వెంకట్రామయ్య.

"ఫరవాలేదు, తీసుకోండి నాయనా ! రోజూ వస్తారా ?" అన్నది హైమవతి తల్లి.

అందరికన్న సత్యం ముందుగా ప్లేటులోనుంచి రెండు వేయించిన జీడిపప్పులు తీసుకుని నోట్లో వేసుకున్నాడు.

"అయితే మనవాడు రాసిన నాటకంమాట ఏమిటి ? మీరు తప్పక వేషం వెయ్యాలి !" అన్నాడు వెంకట్రామయ్య.

"నన్ను బాధించక విడిచిపెడితే చాలా థాంక్స్ చేస్తాను." అన్నది హైమవతి.

హైమవతి ఎప్పుడూ ఇంత మెత్తగానూ మాట్లాడుతుందా ? కోపం వచ్చినప్పుడన్నా గొంతెత్తి అరవదా ? నాటకంలో కథానాయిక చాలాచోట్ల ఆవేశంతో మాట్లాడాలి. సత్యం ఆమెను గురించి అనుమానం చెందసాగాడు.

"మీ రట్లా తప్పించుకోవటానికి పిల్లేదు. మీవంటి నటిని పెట్టుకొని మగవాడి చేత ఆడవేషం వేయించటం నాకిష్టంలేదు." అన్నాడు వెంకట్రామయ్య.

"రెండుసార్లు బుచ్చమ్మ వెయ్యగానే నటిని అయిపోయినా నాండీ ?" అన్నది హైమవతి.

"ఒక్కసారే వేస్తే మాత్రమేమిటి ? మీ నటన నేనైతే చూడలేదుగాని; చూసినవాళ్ళు అద్భుతంగా చెప్పారు."

"బుచ్చమ్మ పాత్రకు కావలసిన నటనంతా ఆ గురజాడవారు సంభాషణలోనే పెట్టారు. ఎవరు నటించినా అద్భుతంగానే ఉంటుంది." అన్నది హైమవతి.

సత్యం చెవులు రిక్కించాడు. ఆ మాట అన్నమనిషి ఇంచుమించు మేధావుల జాబితాలో చేర్చదగిన దని అతనికి తోచింది. కాని ఆమె తన నాటకంలో శారద వేషానికి పనికివస్తుందా అన్న సందేహం మరింత బలపడింది. ఈ మనిషి బుచ్చమ్మ పాత్రకు ముమ్మార్తులా తగినదే. శారద పాత్ర బుచ్చమ్మ పాత్రకు అన్ని విధాలా విరుద్ధం. అయితే శారద పాత్రను అర్థం చేసుకునే తెలివితేటలు హైమవతికి తప్పకుండా ఉన్నై.

"నేను బెట్టుచెయ్యటానికి అంటున్నాననుకోకండి. మీకు నాటకం రక్తికట్టటం ప్రధానమైతే కొంచెం అనుభవంగల వాళ్ళచేత వేయిస్తే మంచిది. పైన, వారి సంభాషణలు బిగించినట్టుగా ఉంటై. కాలచక్రం చూశానుగద !" అన్నది హైమవతి.

"మనం కొత్తదారి తొక్కాలి. పాతనాటకాలులేక ఈ కొత్త నాటకం తీసుకుంటున్నామా అట్లాగే ఆడపాత్రకూడా–" అన్నాడు వెంకట్రామయ్య. అతని వాలకం చూస్తే నాటకరంగం పురోభివృద్ధిని గురించి చిన్న ఉపన్యాసం దంచేటట్టు కనబడ్డాడు. హైమవతి వేషం వెయ్యటానికి ఒప్పుకున్నది. ఆ సంగతి వెంకట్రామయ్యకు అర్థం కాలేదు.

సత్యం అతనికి అడ్డుతగిలి హైమవతితో, "రేపు నాటకం తెచ్చి వినిపిస్తాం. రాసిన నాటకం స్టేజి నాటకం. కొన్ని సీనులు తగ్గిస్తే మన అవసరానికి సరిపోతుందనిపించింది. తీసేసే సీనులు గుర్తుపెట్టి, కంటిన్యుయిటీ సరిచూసుకుని ఒక్కసారి చదువుకుంటే ఆ తరువాత పోర్షన్లు రాసుకుని రిహార్సల్స్ ప్రారంభించవచ్చు" అన్నాడు.

"రిహార్సల్స్ మా ఇంట్లోనే జరపటానికి అభ్యంతరం ఉంటుందా ? నేను ఇల్లు విడిచి ఎక్కడికీ వెళ్ళటం లేదు. దాదాపు అజ్ఞాతవాసమే. ఈ నాటకాల మూలంగా నేను ప్రపంచం మొహం చూడాలిసివస్తున్నది !" అన్నది హైమవతి.

"బొత్తిగా ఇంట్లో పాతుకుపోవటం కూడా మంచిదికాదు" అన్నాడు సత్యం.

హైమవతి తల్లి కాఫీ తెచ్చి ఇచ్చింది. మంచి ఫిల్టరు కాఫీ. సత్యం, ఎరిగిన్న ఎవరి ఇంట్లోనూ కాఫీ ఇవ్వరు. హైమవతికి దాగా బతకటం చాతనవును.

హైమవతికీ, తల్లికి వీడ్కోలు చెప్పి తిరిగివచ్చేటప్పుడు వెంకట్రామయ్య, "చూశావా మనం తల్చుకుంటే పని జరక్కపోవటమంటూ ఉండటానికి వీల్లేదు !" అన్నాడు ప్రగల్భంగా.

"ఆ మనిషి ఈ వేషానికి పనికొస్తుందా అన్నది ఒక్కటే నా అనుమానం ?" అన్నాడు సత్యం.

# 7

హైమవతి నాటకం రిహార్స్ చేసే పద్ధతి సత్యానికి చాలా చిత్రంగా తోచింది. ప్రారంభంలో పాత్రధారులు తీసుబడిగా కూచుని ఒకరి తరవాత ఒకరుగా నాటకాన్ని చదివారు. ఒక రిద్దరు ఉత్సాహపరులు తమ వాచిక సామర్థ్యం ప్రదర్శించినా హైమవతి తన పోర్షనును కేవలం పొడి వాక్యాలల్లే చదివింది.

చూసి చూసి సత్యం, "భావంతో చదివితే ఇంకా బాగుంటుందిగదా !" అన్నాడు.

"వాక్యాలు బాగా తలపట్టినాక భావం దానంతట ఆదే వస్తుంది. లేచి నిలబడి అభినయించేటప్పుడు భావంకూడా ప్రదర్శించవచ్చు, ఇంకా ఎవరికి పోర్షనులు బాగా వంటబట్టలేదు," అన్నది హైమవతి.

ఆమె మాటలు విని, భావయుక్తంగా చదువుతూ వచ్చినవాళ్ళుకూడా మామూలుగా చదవసాగారు.

సత్యానికి రిహార్సలులో ఆసక్తి తగ్గింది; అతను వెళ్ళటంకూడా మానేశాడు.

ఇంతలో అతని అత్తగారికి పెద్దజబ్బు చేసింది. సత్యం తన భార్యనూ ఇద్దరు పిల్లలనూ తీసుకుని అత్తవారూరు వెళ్ళాడు.

రెండు వారాలపాటు ఆవిడ చావుబతుకుల మధ్య కొట్లాడి చివరకు చనిపోయింది. సత్యం ఉత్తరక్రియలన్నీ ముగిసినదాకా ఉండి సరిగా ఓల్డ్ బాయిస్ డేనాటికి తిరిగి వచ్చాడు. జానకీ, పిల్లలూ అక్కడే ఉండిపోయినారు.

సత్యం మనసుమాత్రం అత్తవారింటనే ఉన్నది. తన అత్తగారు పోవటం మామగారి కుటుంబానికి ఎంత దెబ్బో అతను ఊహించుకున్నాడు. ఆమె చావుతో వాళ్ళంతా దారం తెగినాక దండతో పూసలల్లే అయినారు.

సంసారంలో ఏ మనిషి ఎటువంటి బరువు మోస్తున్నదీ ఆ మనిషి పోయినాక గాని తెలిసిరాదు. తన పినతండ్రి పోయిన అయిదో రోజున సత్యం వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. ఒక చెట్టంత మనిషి పోయిన లక్షణాలేమీలేవు. ఇల్లంతా మామూలుగానే ఉన్నది. అన్ని పనులూ ఎప్పటిలాగే జరిగిపోతున్నాయి. ఆ ఇంటిపైన పోయిన మనిషి ప్రభావం ఆవంత కూడా లేదు! ఆయన నాటకాల వెంబడి తిరుగుతుంటే మిగిలినవాళ్ళు ఆయన లేకుండా జరుపుకోవటం నేర్చుకున్నారు.

ఆ రాత్రి నాటకం ఆరంభమయేదాకా సత్యం ఆలోచనలు పరిపరి విధాల పోతూనే ఉన్నై. నాటకం ప్రారంభమైన అయిదు నిమిషాలలోపల అతని మనసు దానిపై లగ్నమై పోయింది. తన రచన ఎట్లా ఉన్నా ఆడటం బాగా ఆడుతున్నారు.

సత్యం హైమవతిని గుర్తించలేదు. మేకప్‌మీద ఆమె ఇంకా ఎత్తూ, లావూ వున్నట్టుగా కనిపించింది. మృదువుగా మాట్లాడటమంతా ఏమయిందో తెలీదు; కొన్ని కొన్ని వాక్యాలు సమ్మెట పోట్లులాగా చెప్పింది. ఆమె మొహాన వెటకారపు నవ్వూ, కోపమూ చూసి సత్యం తన కళ్ళను తానే నమ్మలేక పోయినాడు.

ఎన్నోసార్లు ప్రేక్షకులు "శారద" సంభాషణలకు చప్పట్లు కొట్టారు.

నాటకం మధ్యలో వెంకట్రామయ్య స్టేజి ఎక్కి చిన్న ఉపన్యాసం దంచాడు. "ఈ నాటకం కూడా రక్తికట్టిం దంటే మీరంతా ఒప్పుకుంటారు (చప్పట్లు) నాటకం రాసింది మన సోదరుడు సత్యమన్న మాట నేను చెప్పను ("వద్దు, వద్దు!"). కాని ఈ నాటకంలో శారద పాత్ర ధరిస్తున్న శ్రీమతి హైమవతి మన సోదర విద్యార్థిని— లేకపోతే సోదరీ విద్యార్థిని (చప్పట్లు)ఆమె ఈ పాత్ర ఇంత అద్భుతంగా నిర్వహిస్తున్నందుకు మనం గర్వించాలి; కృతజ్ఞత చూపాలి. అంతేకాదు—నాటక కర్త నాటకం రిహార్సల్సు స్వయంగా నిర్వహించటానికి అవకాశం లేనిసమయంలో శ్రీమతి హైమవతి రిహార్సల్సు కండక్టుచేసి ఈ నాటకాన్ని ఇంత రసవత్తరంగా చేసినందుకుకూడా మనం ఎంతైనా కృతజ్ఞులం....

నాటకం పూర్తి అయింది. సత్యం హైమవతిని వెతుక్కుంటూ లోపలికి వెళ్ళాడు. ఆమె మొహానికి నూనె రాచి గుడ్డపీలికతో రంగు తుడిచేసుకుంటున్నది. అతన్ని చూడగానే, "పాపం, మీ అత్తగారు పోయారట;" అన్నది. "అవును!" అన్నాడు సత్యం. అతను నాటకం గురించీ, ఆమె నటనగురించీ అనదలచుకున్న మాటలు అనే అవకాశం కాస్తా జారిపోయింది.

చాలామంది లోపలికి వచ్చారు. అందరూ సహజంగా హైమవతిని అభినందించారు.

"ఆయన ఆ పాత్రను అంత నిండుగా సృష్టించారు!" అన్నది హైమవతి.

అదే సమయంలో సత్యం ఎవరితోనో, "నాకు శారద పాత్ర స్వభావం బాగా తెలుసునని చెప్పగలను. ఆ శారద ఫలాని పరిస్థితిలో ఏంచేస్తుంది. ఎట్లా మాట్లాడుతుంది, అంటే వెంటనేచెప్పగలను. కాని ఆ మనిషి ఎట్లా ఉంటుంది. ఎట్లా చూస్తుంది. ఎట్లా మసులుకుంటుంది అంటే నాకు తెలీదు. ఇవాళ ఈ నాటకం చూశాను; నాకు శారద కళ్ళ ఎదట కనిపించినట్టయింది. ఇంకెవరు ఈ వేషం వేసినా నా కా పాత్ర శారదల్లే ఉంటుందనుకోను!" అంటున్నాడు.

హైమవతి ఆ మాటలు వినే ఉండాలి. కాని విననట్టు నటించింది.

నాటకం అయినాక చాలామంది వెళ్ళిపోయినారు. గాని కొందరు స్కూలు ఆవరణలోనే కూచుని పేకాట ఆడారు. సత్యం తెల్లవార్లూ అక్కడే ఉండిపోయి నాడు. తూర్పు తెల్లవారుతుండగా అతను మొహం కడుక్కుని కాఫీ హోటలుకు బయలుదేరాడు. నాటకం జరిగి ఎన్నో వారాలు గడిచినట్టున్నది అతనికి. పేకాట ఆరంభమయిన మరుక్షణం నుంచీ నాటకం అందరికీ గతచరిత్ర అయిపోయింది. సత్యం ఒక్కడే ఆ సంగతి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఉలికిపడుతూ వచ్చాడు.

హోటలునుంచి అతను నేరుగా ఇంటికిపోయి పడుకుని మధ్యాహ్నం పన్నెండు దాకా నిద్రపోయినాడు. తరవాత స్నానం చేసి బయలుదేరి హోటలులో భోజనం చేసి స్టోరుకు వెళ్ళాడు. స్టోరు ఎప్పటిలాగా నడుస్తూనే ఉన్నది. కుర్రాడే అన్నీ చూసుకు పోతున్నాడు. కొద్ది మందులు అయిపోయినై. ఎవరైనా వచ్చి వాటిని అడిగితే ఇంకొక షాపుకు పంపడమో, తానే తెచ్చి ఇయ్యటమో చేస్తున్నాడు.

సాయంకాలందాకా స్టోరుపనిలో నిమగ్నుడైనాడు సత్యం. వెంకట్రామయ్య గాని, శివరావుగాని, కృష్ణమూర్తిగాని, పెత్తనం వెలిగించిన ఇతరులుగాని సత్యా నికి ఆ రోజు దర్శనా లివ్వలేదు.

"హైమవతిని మళ్ళీ వెళ్ళి ఎవరైనా చూశారా! లేక అక్కర తీరిన అల్లుడి వంతు చేశారా?" అనుకున్నాడు సత్యం. మిగిలినవాళ్ళు మర్యాదకైనా ఆమెను చూసే ఉంటారనీ, తనను మరిచిపోయి ఉంటారనీ అతనికి తట్టింది.

దీపాలు పెట్టిన వేళ సత్యం బయలుదేరి హైమవతి ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో ఎవరూలేరు. ఇల్లు తాళం పెట్టి ఉన్నది.

సత్యం మళ్ళీ స్టోరుకు తిరిగివచ్చి, తొమ్మిదిదాకా కూచుని, స్టోరు మూసినాక హోటల్లో భోంచేసి రాత్రి ఆట సినిమా చూడటానికి బయలుదేరి వెళ్ళాడు.

సాయంకాలం ఆట ఇంకా పూర్తికాలేదు. థియేటరు దగ్గిర రాధాకృష్ణమూర్తి కనిపించి, నిన్నటి నాటకం చాలా బాగుందండీ అన్నట్టు ఆ అమ్మాయి సినిమాకు వచ్చిందే! బాల్కనీలో ఉన్నది. వెళతారా? పదండి!" అన్నాడు.

సత్యం బాల్కనీలోకి వెళ్ళేసరికి ఆట అయిపోయింది. హైమవతి, ఆమె తల్లి సీట్సులోనుంచి లేస్తూకనిపించారు. వాళ్ళు అతన్ని చూశారు. హైమవతి నవ్వుతూ పలకరించింది.

"మీరు సినిమాకు వచ్చారా? నాకు తెలీదు. మీ ఇంటికెళ్ళా .... ఇవాళ మన ఓల్డ్‌బాయిస్ ఎవరన్నా కనిపించారా?" అన్నాడు సత్యం.

"లేదే?" అన్నది హైమవతి — ఎందుకు కనిపించట మన్నట్టుగా.

"ఎందుకు కనిపిస్తారూ? పని తీరిపోయిందిగా? మళ్ళీ వచ్చే ఏడు గదా?" అన్నాడు సత్యం.

"ఇవన్నీ క్షణభంగురాలు!... పోదాం పదండి." అన్నది హైమవతి, అతను కూడా సినిమా చూశాడనుకుని.

ఆ మాట ఆహ్వానంకింద తీసుకుని సత్యం వాళ్ళవెంట కిందికి దిగివచ్చాడు. అతనికి ఏం మాట్లాడాలో తెలియలేదు. ఇంతలోనే వాళ్ళిద్దరూ ఒక గుర్రపుబండి మాట్లాడి, వస్తామనిచెప్పి సత్యండగ్గిర సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయినారు.

ఆ బండిలో ఇంకొక మనిషికి చోటున్నది. తనను ఇంటి దగ్గిర కాకపోతే ఇంటి దారిలోనైనా దింపవచ్చు; కాని వాళ్ళు అతన్ని బండిలోకి ఆహ్వానించలేదు.

"ఇవన్నీ క్షణభంగురాలు!" ఎంత నిజం!

సత్యం హైమవతిని ప్రేమించాడంటే అతిశయోక్తి అవుతుంది. కాని ఆమె వంటి శక్తిమంతురాలితో సన్నిహిత పరిచయం ఉంటే తన మానసిక జీవితం శోభిస్తుందని అతనికి తోచింది. ఆమె మేధావులకింద జమచెయ్యదగిన మనిషి అనటానికి ఏమీ సందేహం లేదు. పైన గొప్పనటి. ఆమె పాత్ర కోసం అంతగా ఎట్లా మారిపోయిందో సత్యానికి ఇంతవరకు అర్థం కాలేదు. ఆమె ఎంత గొప్పనటి అన్నది అతనికి పట్టలేదు. ఆమె నిజమైన నటి అన్నదే అతనికి అబ్బురంగా తోచింది. చాలా మంది నటులుగా చలామణీ అయేవాళ్ళు న్యాయంగా నటులుకారు. వాళ్ళు తమ పాత్రలను తాము ధరించవలసిందే.

తనతో పరిచయం పెంచుకోవటానికి హైమవతి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యకపోవటం సత్యానికి పెద్ద అవమానంలాగా తోచింది. అతని అభిమానం ఆమె ప్రవర్తనతో చాలా దెబ్బతిన్నది. కాని తాను ఆమెకు చేసిన ద్రోహ మేమిటి?

"ఆమెను గురించి నేనే అపోహపడి ఉంటాను," అనుకున్నాడు సత్యం.

అతనికి మళ్ళీ హాలులోకి పోబుద్ధి పుట్టలేదు; ఏదో ఆలోచించుకుంటూ ఇంటికి వెళ్ళిపోయినాడు.

* * *

"ఏమోయ్ సత్యం! ఎవరో డైరెక్టరు వీర్రాజుగారుట. నాయుడిగారి మేడలో ఉన్నారు. వీలుంటే నిన్నొకసారి రమ్మని చెప్పమన్నారు." అంటూ వీధిలోనుంచే కేకపెట్టి ఎరిగిన అతను తన దారిన వెళ్ళాడు.

అప్పుడే కాఫీ హోటలునుంచి వచ్చి స్టాక్ చూసుకోబోతున్న సత్యానికి ఒక్క క్షణంపాటు ఈ సందేశం అర్థంకాలేదు. తరవాత బోధపడింది—వీర్రాజు సినిమా డైరెక్టరుకూడా అయినాడన్న మాట!

వీర్రాజు నాయుడుగారి మేడలో కూచుని దారే వెళ్ళేవాళ్ళతో కబురుచెయ్యక పోతే తానే వచ్చి చూడకూడదా అనే అభిప్రాయం కలుగుతుండగానే దానికి సమాధానంకూడా తట్టింది. తన డైరెక్టరు హోదాకు భంగం కలుగుతుందని అట్లా చేసి వుంటాడు!

సత్యం మనస్సులో స్వార్థం తల ఎత్తింది. వీర్రాజు తనను ఎందుకు పిలిపించి ఉంటాడు? ఏదన్నా సినిమాపని ఇప్పిస్తాడేమో! డైరెక్టరయినాడు గదా! ఏమైనా, అతన్ని చూసి చాలా రోజులయింది, వెళ్ళి చూడాలిసిందే!

వీర్రాజు వేషమంతా మారిపోయింది. ఊలు పాంటూ, సిల్కు షర్టూ వేసుకున్నాడు; కోటులేదు. మెడకు స్కార్ఫ్ చుట్టుకున్నాడు. ఒక పేముకుర్చీలో వెనక్కువాలి కూచుని కొలువుతీర్చి ఉన్నాడు. చుట్టూ పది పన్నెండు మంది ఉండి వీర్రాజుచెప్పే సినిమా పురాణం వింటున్నారు.

"హలో, మిస్టర్ సత్యం! రా, రా! నీ కోసమే చూస్తున్నాను." అంటూ తన పక్కనే ఒకకుర్చీ చూపించాడు వీర్రాజు.

సత్యం మొహంలో ఏమీ చలనం లేదు. వీర్రాజును చూడగానే తన మొహం వికసిస్తుందని సత్యం రూఢిగా ఉన్నాడు. కాని ఎందుకో అతని మొహం రాయల్లే అయిపోయింది. అది వికసించనూలేదు, ముడుచుకుపోనూలేదు.

వీర్రాజు తనను నువు అనటం గమనించి అది స్నేహార్ద్రత అని అర్థం చేసుకున్నాడు సత్యం.

"ఈ మధ్య మీరంతా నాటకం ఆడారుట కాదూ!"అన్నాడు వీర్రాజు; "చాలా బాగుందని చెప్పారు."

"ఏదో ఉంది; ఎమెచ్యూర్‌మేళం. ఆ నాటకాన్నే థియేటర్‌లో డబ్బులకు ఆడితే అంత మెచ్చుకుని ఉండకపోదురు." అన్నాడు సత్యం చిత్తశుద్ధిగానే.

"నేను వచ్చినపని ఏమిటని అడుగుమరి. నాకు ఆర్టిస్టులు కావాలి. అదివరకు సినిమా మొహం చూడనివాళ్ళయి ఉండాలి. స్టేజిమొహం ఎరగనివాళ్ళయినా నాకు పట్టింపులేదు. కాని టాలెంట్ ఉండాలి- నాచురల్ టాలెంట్, మొహంలోకన్న గొంతులో భావాలు చూపించే శక్తి సినిమాకు ముఖ్యం. సినిమా నటన గురించి నాకు కొన్ని సిద్ధాంతాలున్నై. వాటిని ఇవాళ ఎవరూ ఒప్పుకోరనుకో. నా సిద్ధాంతాలు రైటని రుజువుచేసి చూపిస్తాను. స్టేజినటనకూ సంబంధంలేదు. స్టేజి నటుడు తన పాత్రనూ, దాని వికారాలనూ తానే సృష్టిస్తాడు. సినిమాలో ఆ బాధ్యత డైరెక్టరుది. నటుడు బంకమన్ను, డైరెక్టరు శిల్పి. కాని మన్ను మంచిదై ఉండాలి చూడూ! డైరెక్టరు ఏ రూపం ధరించమంటే ఆ రూపం ధరించాలి....గొప్ప సినిమానటుణ్ని అవుదామని వెళ్ళానా, ఈ రహస్యం తెలియగానే డైరెక్టరునవుదామని తీర్మానించుకున్నా, మరి అనుభవం కావాలిగా? ఆ అనుభవం సంపాదించా. సినిమా నటుల్ని మలిచేశక్తి ఇవాళ నాకున్నంతగా మరే డైరెక్టరుకూ లేదని చాలెంజిచేసి చెబుతాను...."

సినిమా హరికథ సాగిపోయింది. కొంతకాలానికి తారలు సినిమా ప్రపంచాన్ని ఏలుతారనీ, వాళ్ళే డైరెక్టర్లను మలుస్తారనీ, పాపం వీర్రాజు కలలోకూడా అనుకోలేదు.

ఒక గంటసేపు వృథాచేసిన తరవాత తనతో వీర్రాజు కేమీ పనిలేదని సత్యానికి అనుమానం వచ్చింది. అతను లేస్తూ, "స్టోరులో మనిషిలేడు; వస్తాను. వీలుంటే మళ్ళీ కలుసుకుందాం." అన్నాడు.

"వెరీగుడ్, వెరీగుడ్ ! మీ ఊరినుంచి నలుగురైదుగురు కొత్తవాళ్ళను కొట్టుకుపోవాలని చూస్తున్నాను. కాస్త సహాయం కావాలి" అన్నాడు వీర్రాజు కుర్చీలో మరింత వెనక్కువాలి, తల వెనక్కు విరిచి, నిలబడి ఉన్న సత్యం మొహంకేసి చూస్తూ.

"నే నెవరినీ రికమెండు చెయ్యలేనుగాని, మా నాటకంలో వేషం వేసిన హైమవతి చాలా మంచి ఆర్టిస్టు. కావలిస్తే వాళ్ళింటికి వెళ్ళి చూడవచ్చు. నన్ను కూడా రమ్మన్నా వస్తాను," అన్నాడు సత్యం.

"చూడు, మిస్టర్ సత్యం, నాకు ఊపిరి సలపటంలేదు. ఒక్కసారి ఆ అమ్మాయిని ఇక్కడికి తీసుకురాకూడదూ ?" అన్నాడు వీర్రాజు.

"రాదు !" అని సత్యం చప్పున అనేసి, మర్యాదగా ఉండదని, "బహుశా-" అని కలిపాడు.

"అంటే ఆ మనిషికి సినిమాల్లో నటించాలని ఆదుర్దా లేదన్నమాట. నేను ఆదుర్దా ఉన్న వాళ్ళనే తీసుకుంటున్నాను."

"అదీ నిజమే ! వస్తుందేమో చూద్దాం." అన్నాడు సత్యం.

"వస్తే రేపు సాయంకాలంలోగా రావాలి. నేను రేపురాత్రి మెయిలుకు వెళ్ళి పోతున్నాను" అన్నాడు వీర్రాజు.

తిరిగి వచ్చేస్తూ సత్యం వీర్రాజును ఒకందుకు మెచ్చుకున్నాడు. అతను ఎంత పెద్దపోజు పెట్టిన దానికి అనుగుణంగా మాట్లాడుతున్నాడు. నడుచుకుంటున్నాడు. అతను అన్న ప్రతిమాటా ఆలోచించి అన్నట్టుగా ఉన్నది. అందుకే అతను వేసిన అడుగు వెనక్కు తీసుకోవటంలేదు.

సత్యానికి ఇప్పుడొక సమస్య వచ్చిపడింది—తానే చేజేతులా తెచ్చుకున్నాడు. తానే మధ్య సంధానకర్తగా ఉండవలసిన అవసరం ఉండదనే ఉద్దేశంతో అతను వీర్రాజుకు హైమవతిని సిఫార్సు చేశాడు. ఆమెను తీసుకురావలసిన బాధ్యతను వీర్రాజు తనమీదికి తోశాడు. తాను మధ్య ఇరుక్కున్నట్టయింది. కావలిస్తే తాను హైమవతిని చూడటం మానవచ్చు. కాని ఎప్పటికైనా హైమవతికి ఈ సంగతి తెలిస్తే తనకు వచ్చే సినిమా ఛాన్సు సత్యం నిష్కారణంగా చెడగొట్టాడని హైమవతి అనుకుంటుంది.

ఈ చిక్కులోనుంచి బయటపడటానికి సత్యం హైమవతికి ఒక చిన్న ఉత్తరం ఇచ్చి కుర్రాడిద్వారా పంపాడు. అందులో ఇట్లా రాశాడు. "మైడియర్ "హైమవతిగారూ, నా మిత్రుడు వీర్రాజు అనే అతను కొత్తగా ఏదో సినిమా తీయబోతూ ఆర్టిస్టులకోసం మన ఊరువచ్చి నాయుడుగారి మేడలో ఉన్నాడు. ఇష్టం ఉన్న పక్షంలో రేపు సాయంకాలం లోపల అతన్ని ఒకసారి కలుసుకుంటే బాగుంటుందనుకున్నాను. నేను అతనికి మిమ్మల్ని రికమెండు చేసి ఉన్నాను. బెస్ట్ విషెస్—సత్యం."

కుర్రవాడు తిరిగివచ్చి, "ఇవాళ ఎప్పుడైనాసరే వీలుంటే మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు," అని చెప్పాడు.

ఇంకా చీకటి పడకముందే సత్యం హైమవతి ఇంటికి వెళ్ళాడు. అతనికోసం టిఫినూ, కాఫీ సిద్ధంగా ఉన్నై.

హైమవతి వీర్రాజు విషయం ఎత్తలేదు. తాను ఎట్లా ఎత్తాలో సత్యానికి తెలియలేదు. చివరకు ఆమే, "నన్నా డైరెక్టరుకు ఎందుకు సిఫార్సు చేశారూ ?" అన్నది.

సత్యం వీర్రాజును గురించి సంగ్రహంగా చెప్పాడు.

"ఆయనకు నిజంగా ఆర్టిస్టులు కావలిసే ఉంటే తన దగ్గిరికి అందరినీ ఎందుకు రమ్మంటారూ ?" అన్నది హైమవతి.

"తాను వెతుక్కుంటూ వెళ్ళటం సాధ్యంకాకనో, వెళితే చౌక అయిపోతాడనో !" అన్నాడు సత్యం.

"ఆయన అంత ప్రఖ్యాతిగల డైరెక్టరాండీ?" అన్నది హైమవతి.

అడగవలసిన ప్రశ్నే, కాని సమాధానమేమీలేదు. సత్యం మాట మార్చి "ఇంతకూ వీర్రాజును చూడబోతున్నారా ?" అన్నాడు.

"లేదు. ఆ విషయం ఉత్తరంలో రాస్తే మీరు నొచ్చుకుంటారని రమ్మన్నాను," అన్నది హైమవతి.

"మీరు రమ్మంటే రావటానికి నేను బిడియపడలేదు" అన్నాడు సత్యం.

హైమవతి నవ్వింది. ఆ నవ్వులో ఎంతో గ్రహింపు ఉన్నది.

"నేను వీర్రాజుగారిని చూడటానికి భయపడుతున్నాననుకోకండి. నాకు అటువంటి నిక్కులేమీలేవు. ఒకవేళ ఉన్నా మీమాట దక్కించేటందుకైనా వెళ్ళవచ్చు. కాని నాకు సినిమానటి కావాలని ఏకోశానా లేదు. తొంభై తొమ్మిదిపాళ్ళు నన్నెవరూ బుక్ చెయ్యరు. నేను బాగా ఫొటోగ్రాఫ్ కాను. పైన నాకు పాటరాదు. ఉన్నమాట చెబుతున్నాను. నాకు స్టేజిపైన నటించి పేరు తెచ్చుకోవాలనికూడా లేదు" అన్నది హైమవతి.

సత్యం నిర్ఘాంతపోయినట్టుగా, "ఏం ?" అన్నాడు.

హైమవతి తనలోతాను నవ్వుకుంటున్నదాని మొహంపెట్టి, "నాది కడుపునిండిన బేరం అనుకోండి. నాకు జీవితంలో ఏ లోటు లేదు. ఒక విధంగా నేను చాలా అదృష్టవంతురాలిని. నాకు అత్తవారి పోరులేదు. మామూలు ఆడవాళ్ళకన్న స్వేచ్ఛ ఉన్నది. సుఖంగా బతకటానికి డబ్బున్నది. పురుగుల్లాగా నన్ను తొలిచే కోరికలేవీ నేను పెట్టుకోలేదు. నా కేవిధమైన కీర్తీ, ఖ్యాతీ అక్కర్లేదు. సుఖంగా వెళ్ళిపోతున్న బతుకులో కొత్తసమస్యలు తెచ్చి పెట్టుకోదలచుకోలేదు. కావలిస్తే మళ్ళీ వచ్చేయేడు ఇంకో నాటకం రాయండి. సరదాగా వేషం వేస్తాను." అన్నది.

సత్యం ఏమీ చెప్పలేకపోయినాడు. చైనావాళ్ళో, లేకపోతే బౌద్ధంలో ఇటు వంటి వేదాంతం అవలంబిస్తారని అతను ఎక్కడో చదివాడు. ఈ వేదాంతం హైమవతికి సహజంగా వచ్చినట్టున్నది. ఇటువంటి మనిషి తనకు భార్య అయితే జీవితం ఎంత బాగుండేది?

తన పరిమిత జీవితంలో అతను హైమవతి వంటిదాన్ని ఇంకొకతెను చూడ లేదు. ఆ ఒక్క మనిషీ మొగుడు విడిచిన మనిషి కావటం ఒక్కటే మాత్రం. కాని ఆ భర్త అప్పుడప్పుడు వస్తుంటాడని అతనికి జ్ఞాపకం వచ్చింది.

"మీరు ఒంటరి జీవితం జీవిస్తున్నారనుకుంటాను; అది ఏమంత సుఖమైన జీవితం ?" అన్నాడు సత్యం సాహసించి.

"నటన వృత్తిగా పెట్టుకుంటే ఒంటరితనం సమస్య ఉండదనా !" అన్నది హైమవతి నవ్వుతూ.

"ఎబ్బే, నేను నటన విషయం ఆలోచించటంలేదు. నా కుతూహలం కొద్దీ అడిగాను." అన్నాడు సత్యం కంగారుపడి.

"నేను అంత మరీ ఒంటరిగా జీవించటంలేదు. మా ఆయన అప్పుడప్పుడూ వస్తూనే ఉంటారు."

కాస్సేపు ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వారు ఉండిపోయినాక సత్యం లేచి సెలవు పుచ్చుకున్నాడు.

* * *

వీరరాజుచుట్టూ మొదటి రోజు మూగిన జనం మర్నాడు లేరు. అతని "పోజు" ఊరివాళ్ళమీద పారలేదు. అతని దగ్గిరికి మళ్ళీ వెళ్ళటమా ? మానటమా అన్నది సత్యం చప్పున తేల్చుకోలేదు. వెళ్ళితే మర్నాడు సాయంకాలం అయిదునిమిషాల పాటు చూసివద్దామనుకున్నాడు.

కాని వీరరాజే మధ్యాన్నం పదకొండు గంటలప్పుడు అతన్ని వెతుక్కుంటూ స్టోరుకు వచ్చాడు. "సూర్యచంద్రులు భూమిమీదికి దిగివచ్చినట్టయింది !" అనుకు న్నాడు సత్యం వ్యంగ్యంగా.

"ఏమోయ్, మిస్టర్ సత్యం ?"

"ఏమోయ్, మిస్టర్ వీరరాజూ ?" సత్యం సంబోధన మార్చాడు. "రిక్రూట్ మెంట్ జోరుగా సాగుతున్నదా !"

వీరరాజు నిరుత్సాహంతో, "రిక్రూట్మెంట్‌లాగే ఉంది ! మీ ఊరివాళ్ళ చాలా చిత్రమైన మనుషులు ఎవరూ సరిగా కో-ఆపరేట్ చెయ్యటంలేదు." అన్నాడు.

వీరరాజుకు కావలసిన సహకార మేమిటో సత్యానికి అర్థం కాలేదు.

"ఏం చేస్తున్నారేం ? అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పరా " అన్నాడు సత్యం.

"నేను ప్రశ్నలడిగినదాకానా ? వాళ్ళే నన్ను ప్రశ్నలడుగుతున్నారు.

అన్నట్టు ఎవరో అమ్మాయి ఉన్నదన్నావు; తీసుకురాలేదేం ?"

"ఆ అమ్మాయి రాదులే,"

"ఆదేం?"

"సినిమా ఆర్టిస్టు కాదుట."

"నాన్సెన్స్ ! అందరూ సినిమా ఆర్టిస్టులవుతారు. ఛాన్సు దొరికితే చెప్పటంలో, ఉంటుంది. చెప్పవలసిన పద్ధతి నీకు చాతనై ఉండదు."

"అదంతా ఏమిలేదులే. స్టేజిమీద కూడా వేషాలు వెయ్యనన్నది. కేవలం నేను రాసిన నాటకాలలో అయితే వేషం వేస్తానన్నది."

చెప్పటం తనకు చాతకాలేదని వీర్రాజు తనని అవమానించినందుకు ప్రతిక్రియగా ఈ చిన్న కోతకోశాడు సత్యం. కాని అతని కోత అతని గుండెకే శూలమయింది. నిజంగా హైమవతి తన నాటకాలలో తప్ప వేషం వెయ్యనని అన్నట్టయితే తన కెంత ఆనందావేశం కలిగేదో అతను అర్థం చేసుకుని కుంగిపోయినాడు. అతని హృదయం ఏడుస్తున్నది. హైమవతి తనను ఎందుకు ప్రేమించకూడదు; ఎందుకు ప్రేమించనివ్వగూడదు ? ఆమె కేం ? ఏ లోటు లేదని తానే అంటున్నది. కాని తన జీవితంనిండా కంతలే—వట్టి జల్లెడ. ఆ సంగతి హైమవతికి ఎట్లా తెలియటం ?

వీర్రాజును మరిచిపోయి సత్యం పగటికలలో పడ్డాడు. బొమ్మలను చూసి ఏడుపు మానేసిన చంటిపిల్లలాగా అతని హృదయం ఈ పగటి కలలను నోరు తెరుచుకుని చూస్తున్నది....తాను ఒక ట్రూప్ ఏర్పాటు చేస్తాడు; వరసగా నాటకాలు రాసి ఊరూరా తిరిగి ఆడతాడు; హైమవతి వాటిలో వేషాలు వేస్తుంది. ఆ విధంగా హైమవతి తనకు సన్నిహితురాలు కావాలేగాని ఆమె ప్రేమను సంపాదించటం తనకు సాధ్యమవుతుంది. ఎందుకంటే తన ప్రేమలో కపటం ఏమీలేదు.

"మళ్ళీ నువ్వుకూడా వస్తే వ్యవహారం బెడుస్తుంది." అన్నాడు వీర్రాజు. అతను అంతకు మునుపు ఏమిటన్నాడో సత్యం వినలేదు.

"ఏమిటీ ? నేనింకేదో ఆలోచిస్తున్నాను. సరిగా వినలేదు." అన్నాడు సత్యం.

"ఆ అమ్మాయితో నేను వెళ్ళి మాట్లాడతానంటాను."

"ఏమీ లాభముండదు. నేను పంపాననుకుంటుంది."

"నువు పంపలేదని స్పష్టంగా చెబుతానులేవోయ్, బాబూ !"

"నీ యిష్టం ! ఇంకో ఆశాభంగం అవుతుంది, వెళ్ళిరా ?"

"వాళ్ళిల్లు నాకు తెలీదుగద."

సత్యం కుర్రాణ్ణి వెంట పంపాడు.

వీర్రాజు సత్యానికి తిరిగి కనిపించలేదు.

# 8

జానకి ఇంకా పుట్టింటినుంచి తిరిగి రాలేదు. అక్కడి పరిస్థితులు అస్త వ్యస్తంగానే ఉన్నట్టు తెలిసింది.

స్టోరు ప్రొప్రయిటరు మద్రాసు ప్రయాణం కట్టి సత్యాన్ని కూడా రమ్మ న్నాడు. సత్యం సంతోషంగా వెళ్ళాడు. రెండు రోజులపాటు ఇద్దరూ మందులమ్మే వాళ్ళ చుట్టూ తిరిగారు.

ఒకరోజు మౌంటురోడ్డులో ఉన్న ఎం. పి. పి. సి. స్టూడియోకు[1] వెళ్ళారు. అక్కడ ఏదో తెలుగు పిక్చరు షూటింగు జరుగుతున్నది. "ఈ సినిమా సంభాషణలలో కొంచెం కూడా పటుత్వం లేదు. వీటిని ఎవరన్నా రాయవచ్చు" అనుకున్నాడు సత్యం. అవును, వీరరాజు కూడా రాయవచ్చు. అందుకే అతను తనకు ఛాన్సు ఇస్తాననలేదు. ఒకవేళ అతను అడిగినా తాను వీరరాజు కింద పని చేసేవాడో, లేదో?

సత్యానికి స్టేజినటుడుగా వీరరాజు జ్ఞాపకం వచ్చి విచారం కలిగింది. మంచి నటుడు- ఎందుకూ కాకుండా పోయినాడు. ఇప్పటి వీరరాజులో కలిగిన మార్పేమిటా అని అతను చాలా కాలంగా ఆలోచిస్తున్నాడు. కాని ఇప్పుడు సమాధానం తట్టింది. ఇప్పటి వీరరాజు బిజినెస్ మాన్—వ్యాపారస్తుడు, కళాకారుడు కాదు. సినిమా తీస్తున్న వాళ్ళంతా వ్యాపారస్తులల్లేనే కనిపించారు. నటులు తమకు నచ్చినట్టుగా నటిస్తే డైరె క్టరు వ్యాఖ్యానం ఏమిటంటే, "ఓకే!" అంతే, ఇంకో షాటుకు రెడీకా!

నరసింహం పెద్ద తాగుబోతు. రోజూ సాయంకాలం హోటలు గదికి ఒక పెద్ద బుడ్డి తెచ్చేవాడు. సత్యాన్ని కూడా తాగమన్నాడు. అలవాటు లేదన్నాడు సత్యం. ఫరవాలేదు లెమ్మన్నాడు నరసింహం. సత్యం అనుభవం కోసం తాగాడు.

అది బ్రాందీ. గ్లాసులో కొద్దిగాపోసి దానికి సోడా చేర్చి నరసింహం సత్యాన్ని తాగమన్నాడు. సత్యం ఒక్క గుక్కన తాగి గొంతులో కోరువచ్చి పొడిగా దగ్గాడు.

ఈసారి మెల్లిగా తాగినాక నరసింహం నిషాగా నవ్వుతూ, "ఎట్లా ఉంది!" అన్నాడు.

"ఏమీ తెలియటంలేదు." అన్నాడు సత్యం.

"అబ్బో నువు పెద్దచెయ్యి! కమాన్, ఎంతవరకు నిలుస్తావో చూద్దాం."

సత్యం నాలుగోసారి తాగి, "ఇంక నాకు వద్దు" అన్నాడు. కాని నరసింహం పట్టుబట్టి అయిదోసారి కూడా తాగించాడు. అప్పటికీ అతనికి తనలో కలిగిన మార్పు అర్థం కాలేదు. నరసింహం నిషామీద ఉండటం అతనికి తెలుస్తూనే ఉంది.

---

1. ఎం. పి. పి. సి. స్టూడియో: మోషన్ పిక్చర్ కంబైన్ పేరిట ఉన్న స్టూడియో కావచ్చు. ఇప్పుడు జెమినీ స్టూడియోస్, ఎస్.ఎస్. వాసన్ తీసుకున్న తర్వాత పేరు మారింది.

నరసింహం బుడ్డి ఖాళీ చేశాడు.

"దాని ఖరీదు ఎంత?" అన్నాడు సత్యం. అతని నాలుక మడత పడింది.

"ఎంతైతే ఏం? తొమ్మిదిన్నరా!" అన్నాడు నరసింహం కూచునే తూలుతూ, చెయ్యి ఊపి.

సత్యానికి మండిపోయింది. రోజుకు పదిరూపాయల తాగుడా ? తన సంసారానికి పది రోజుల గ్రాసం! అతనికి కడుపు ఉబ్బుకొస్తుంది. అవతలికి వెళ్ళటానికి లేవగానే తన శరీరం తన వశంలో లేదని తెలుసుకున్నాడు....

మర్నాడు నిద్ర లేచేసరికి నరసింహం చాలా డీలా అయినాడు. సత్యం మామూలుగానే ఉన్నాడు. తాగటం వల్ల అతనికి జరిగిన నష్టమల్లా రాత్రి భోజనం చెయ్యలేక పోవటమే.

వాళ్ళు వచ్చిన మూడోరోజు రాత్రి తాగుడు అయినాక నరసింహం "అట్లా మింట్‌స్ట్రీట్ వైపు వెళ్ళివద్దాం రా!" అన్నాడు.

"నేను రాను!" అన్నాడు సత్యం.

"ఫరవాలేదు రద్దూ ! పోనీ తోడుగా రా!"

ఇద్దరూ రిక్షా ఎక్కి బయలుదేరారు. రిక్షావాడు వాళ్ళను చాలా ఇళ్ళు తిప్పాడు. శరీరాలు అమ్ముకుని జీవించేవాళ్ళు, వాళ్ళు నివసించే పద్ధతీ చూసి సత్యం రోత చెందాడు. ఒక్కరూ అతని కంటికి అందంగా లేరు.

అయిదారు ఇళ్ళు తిరిగినాక నరసింహం రిక్షావాణ్ణి తిట్టాడు. ఇవేనా వాడు చూపించగల బేరాలు.

రిక్షావాడు చెంపలు వాయించుకున్నట్టు అభినయించి ఇంకోచోటికి తీసుకు వెళ్లాడు.

"ఒక సారికా, రాత్రికా?"

"అసలు మొహం చూడందే ఏమిటి చెప్పటం?" అన్నాడు నరసింహం అధికారంతో.

"పది నిమిషాలు ఆగండి ఖాళీ అవుతుంది."

సత్యంగాని, నరసింహంగాని ఆ రోజు మామూలుకన్న తక్కువ తాగారు. కాని సత్యం కడుపులో ఉన్న బ్రాందీ అంతరాత్మలాగా తిరగబడింది. ఆడదానిపై రోత అతనిలో సమగ్రమైంది.

నరసింహం ఒక్క క్షణం ఆలోచించి రిక్షావాడితో, "ఇంతకంటె మంచి చోటు లేదా?" అన్నాడు.

"పన్నెండేళ్ళ పిల్ల ఉంది చూస్తారా?" అన్నాడు రిక్షావాడు.

"చూడటానిక్కాదూ బయలుదేరిందీ?" అన్నాడు నరసింహం.

పన్నెండేళ్ళ పిల్లకు పదేళ్ళే ఉన్నట్టుగా సత్యానికి కనపడింది. బేరం కుదిరింది.

"నీ మాటేమిటి?" అన్నాడు నరసింహం.

"హోటలుకుపోయి పడుకుంటాను. నిద్దరొస్తున్నది."

"తెల్లవారి వస్తా!"

సత్యం హోటలుకుపోయి పడుకున్నాడు కాని వెంటనే నిద్రపోలేదు. బుర్రలో ఇంకా "మందు" ఉన్నది. అతనికి దానికేసి చూడబుద్ధి కూడా కాలేదు.

ఏ ఆడదైనా సరే కాంక్షించే శక్తి మనుషులకు ఎట్లా కలుగుతుందో సత్యానికి అర్థం కాలేదు. అది అర్థమయ్యే వయసు అతనికింకా రాలేదు. అతని హృదయం హైమవతి కోసం మళ్ళీ ఏడవ సాగింది ... అరణ్య రోదనం.

* *

"తస్సదియ్యా. తాగితే నీ వంటివాడు తాగాలి! అనుభవం లేకపోయినా ఎంత బాగా లట్టుకుంటావు ! ఆట్టే తూలవు, వాంతి చేసుకోవు— కాని నీకు అమ్మాయి అక్కర్లేక పోవటమే నాకు వింతగా ఉంది. దీని తరవాత అది విధిగా ఉండి తీరాలి!" అంటూ నరసింహం సత్యాన్ని అభినందించాడు.

"అసలే నాకు స్త్రీవాంఛ తక్కువ. దిక్కుమాలిన తాగుడుతో అది కాస్తా పోతుంది." అన్నాడు సత్యం. తాను జన్మలో పొందిన మొదటి మెప్పు తాగుడుకా ? ఎంత చిత్రం! తన నాటకాలను గురించికూడా అపాటి మంచిమాట అన్నవాడు లేక పోయెనే!

ఆ రోజు కారోజు తాను మంచి నాటకం రాయగలనన్న విశ్వాసం అతనిలో పెరుగుతున్నది. ఇది ఇంకొకరు చెప్పే విషయం కాదు. వాళ్ళు తాను రాసిన నాటకాలనుబట్టి తనను అంచనా కట్టగలరుగాని తనలో పిండరూపంలో పరిణతిపొందే నాటక రచనా సామర్థ్యాన్ని ఎవరు అంచనా కట్టగలరు? తన గర్భంలో ఉన్న శిశువు యొక్క ప్రాణ చైతన్యం కాబోయే తల్లికి తెలియాలి. లోకం తనను గుర్తించటానికి చాలాకాలం పట్టవచ్చు— అయిదేళ్లు, పదేళ్ళు! అంత దాకా తను తపస్సు మానడు.... అర్థమైన పాత్రలచేతా మాట్లాడించటం నేర్చుకుంటాడు! వాళ్ళ మధ్య ఏర్పడే సహజ సంఘర్షణలను ఎక్స్‌రేల సహాయంతోటీ, మైక్రోస్కోపులతోటి పరిశీలిస్తాడు !.... ఈ పని తాను అప్రయత్నంగా చేస్తూనే ఉన్నాడు. అందరి మనస్తత్వాలూ ఆరా తియ్యటమే తన పని. ఈ పనిని తాను, అష్టకష్టాలూ పడుతున్నప్పుడు కూడా, ఎవరో డబ్బిచ్చి చేయిస్తున్నట్టుగా, చేస్తున్నాడు !

అందరూ అర్థమవుతారు— హైమవతి అర్థం కాదేం? ఆ మనిషి జీవిత వైఖరి చాలా అసందర్భంగా ఉంది. మనిషికి ఉన్న ప్రతిశక్తీ ఒక బాధ్యతకూడానూ. తాను మంచినటి. కాని నటికిగల బాధ్యతల నుంచి తప్పించుకు పారిపోతున్నది. ఎక్కడిస్టు ఎంతమంది రచయితలూ, నటులూ, గాయకులూ, చిత్రకారులూ, సినిమా డైరెక్టర్లూ విమర్శకు గురికావటం లేదు! అది వారు వహించే బాధ్యతకు నిదర్శనం. ఆ కళల మీద జీవిస్తున్నారుకదా అనవచ్చు. దానికీ దీనికీ ఏమీ సంబంధం లేదు. ఊరికే!

పత్రికలకు కథలూ, కవిత్వాలూ రాసి పంపేవారుకూడా విమర్శకు గురి అవుతూనే ఉన్నారు....

సత్యం బుర్ర ఎందుకో పరుగులు తీస్తున్నది. అతనికి తాగుతూ ఈ పట్నంలో కూచోవటం ఏమీ బాగాలేదు. ఊరికి వెళ్ళి ఏదన్నా చెయ్యాలి. ఒక నాటక సమాజం పెట్టాలి. నాటక సమాజం పెట్టటానికి ఎంతో కాకపోవచ్చు. ఎట్లాగైనా హైమవతిని ఒప్పించి మెంబరుగా చేర్చగలిగితే సమాజం జయించు కొస్తుంది. మిగిలిన మెంబర్లు చదువు సంస్కారాలుగల వాళ్ళయితే హైమవతి సరేననవచ్చు. ఏడాదికి ఏ నాలుగైదు ప్రదర్శనాలో వేసుకుంటే సరిపోయె. ఒకసారి నాటకానికి మంచిపేరు తెచ్చుకుంటే పొరుగూళ్ళకుకూడా పోవచ్చు. నిర్వహణ భారం వామనరావును వహించ మంటే తప్పక ఒప్పుకుంటాడు....

లలితా ఎమెచ్యూర్స్ బీజం మద్రాసులో ఉండగా సత్యం తలలో ఆ ఉదయం పడింది.

"నరసింహంగారూ, నేను మెయిలులో ఇంటికి పోదామనుకుంటున్నాను. మీరింకా ఉంటారా?" అన్నాడు సత్యం.

"అయితే నువు పద! నేను బెంగుళూరు వెళ్ళివస్తా!" అన్నాడు నరసింహం. బెంగుళూరులో రేసులు ఏవో ఉన్నట్టున్నై.

మర్నాడు ఉదయానికల్లా సత్యం ఇంటి దగ్గిర వాలాడు. ఇన్నాళ్లూ నిశ్చలంగా ఉండిపోయిన అతని రక్తం ఇప్పుడు మొదటిసారిగా ప్రవహిస్తున్నది. అది వరకల్లా పులివిస్తరాకు లాగా ప్రతిగాలికీ కొట్టుకుపోయిన సత్యం ఇప్పుడు తానై ఏదో చేద్దామని యత్నిస్తున్నాడు.

అతను స్నానం చేసి బట్టలు మార్చుకుని థియేటరుకు వెళ్ళి తనకు తట్టిన ఆలోచనను గురించి రాధాకృష్ణమూర్తితో సంప్రతించాడు. రాధాకృష్ణమూర్తి "శుభం!" అన్నాడు. అంతేకాదు. తనకు చేతనయిన సహాయమల్లా చేస్తానన్నాడు. కావలిస్తే డబ్బు కూడా ఇస్తాడని అర్థం చేసుకున్నాడు.

సత్యం వెంకట్రామయ్యతో కూడా సంప్రదించాడు. ఇద్దరూ కలిసి ఊళ్లో ఉన్న ఎమెచ్యూరు నటులనదగిన వాళ్ళందరి పేర్లూ జాబితా వేశారు. మొదటి పేరు- అది ఒకటే ఆడపేరు కూడా- హైమవతిది.

రాసుకున్న పేర్లలో ఒక అరడజను ముఖ్యుల పేర్లు గుర్తుపెట్టుకుని దాదాపు అందరినీ కలుసుకుని మాట్లాడారు. ఒక రిద్దరు-హైమవతి అన్నట్టు "కడుపునిండిన" బాపతు మనుషులు- నచ్చులు కొట్టి, "ఆ ఏమవుతుంది? ఏం చెందుతుంది? ఇవి జరిగే పనులు కావు." అన్నారు.

"కాకపోతే ఏం మునిగి పోయింది? కాస్త శరీర శ్రమ!"

ఆ తరవాత వెంకట్రామయ్య కొంతమంది "ప్రోత్సాహకులను" కూడా కలుసుకుంటే బాగుంటుం దన్నాడు. సత్యం దేనికైనా సిద్ధంగానే ఉన్నాడు.

''ప్రోత్సాహకులు'' ఎక్కువ ఉత్సాహం చూపారు. కాని వారు చేసేది ఏమిటో సత్యానికి సరిగా అర్థం కాలేదు. అయితే అతను ప్రారంభించిన ఉద్యమం కళ్ళాలు ఎట్లాగో వెంకట్రామయ్య చేతిలోకి వెళ్ళిపోయినై.

పార్వతీశంగారి వరండాలో చిన్న సమావేశం జరిగింది. "లలితా ఎమెచ్యూర్స్"కు వెంకట్రామయ్య ఒక ముసాయిదా నియమావళి తయారుచేశాడు. దానిని అతనే సభికులకు చదివి వినిపించాడు. ప్రకాశరావనే అతను ఏ కారణంచేతో ఈ ప్రయత్నాని కంతకూ శత్రువులాగా ప్రతి నియమంలోనూ తప్పు చూపించటమూ, సవరణలు ప్రతిపాదించటమూ, సాగించాడు. మిగిలినవారి ధోరణి గమనించి కొన్ని సవరణలను వెంకట్రామయ్య ఆమోదించాడు.

తానుచేసిన మొదటి సవరణ ఎప్పుడైతే ఆమోదించబడక పోవటం జరిగిందో, ప్రకాశరావు వెంటనే, ''సరే మీ యిష్టం! ఇష్టమైనవారే ఉంటారు!" అన్నాడు బెదిరింపుగా.

సమాజం ఆశయాలలో ఫలాని సత్యం రాసే నాటకాలను ఆడటం అన్న ప్రతిపాదనకు ఆ ప్రకాశరావే తీవ్రమైన అధిక్షేపణ తెలిపాడు.

"అదేం మాట? మంచి నాటకాలు ఆడటం ముఖ్యంగాని, సత్యంగారి నాటకాలే ఆడాలంటే ఎలా?"

వెంకట్రామయ్య కొంచెం తగ్గి, "ఇది రాయటంలో కొంచెం పొరపాటు జరిగిందని ఒప్పుకుంటాను. ఈ సమాజం ఆడే నాటకాలను సత్యంగారు వ్రాయవలెను, అని ఉండాలి.'' అన్నాడు.

"అమ్మ దగ్గిర కింద పడుకుంటే నేం. అయ్యదగ్గిర నేలమీద పడుకుంటే నేం ? సమాజమంటూ ఉన్నాక ఎవరు మంచి నాటకం రాస్తే వారిదే ఆడాలి. మాటవరసకు అంటున్నాను—ఈ సత్యంగారు రాసిన నాటకం ఏమీ బాగుండకపోతే ఏం చెయ్యాలి ? దాన్నే ఆడి సమాజం నష్టపడాలా ?" అన్నాడు ప్రకాశరావు పెద్ద గొంతు చేసుకుని.

"అయ్యా, మీరు ఒక సంగతి గమనించటం లేదు. ఈ ఐడియా అంతా సత్యందే," అన్నాడు వెంకట్రామయ్య.

"అయితే మటుకేమండీ ? సమాజం ఏర్పడ్డాక అది పిత్రార్జిత మవుతుందా?" అన్నాడు ప్రకాశరావు ఓర్పు పూర్తిగా కోల్పోయి.

వెంకట్రామయ్య ఏదో అనబోతుండగా సత్యం లేచి అడ్డొచ్చి,

"ప్రకాశరావుగారు చెప్పేదానిలో తప్పేమిటో నాకు తెలియటంలేదు. సమాజం ఆశయం మంచి నాటకాలు ఆడడమే. ఫలానావారి నాటకాలు ఆడటం కాదు. రేపు ఈ సమాజం పైకివచ్చి నెలకొక కొత్త నాటకం ఆడగలిగిన స్థితికివస్తే ఏడాదికి పన్నెండు నాటకాలు నేనెక్కడ రాయగలనూ ?" అన్నాడు.

ప్రకాశరావు వెటకారంగా నవ్వి, "ఆ మాటే నేను వెంకట్రామయ్యగారికి అర్థమయేలాగా చెప్ప లేకపోయాను," అన్నాడు.

"అసలు ఒకరి నాటకాలెందుకండీ ? బొబ్బిలియుద్ధమూ[1] ప్రసన్నయాదవమూ[2] సత్యహరిశ్చంద్రీయమూ,[3] చింతామణి,[4] పాదుకా[5]- ఓ లక్ష నాటకాలుంటుండగానూ!" అన్నారు మరొకరు.

"ఈ సమాజం ఉద్దేశం అది కాదులెండి. ఉద్యోగ విజయాలూ, సావిత్రి, తులాభారమూ వంటి నాటకాలు ఆడటానికి మనమే అక్కర్లేదు. మన బాబుల్లాటి వాళ్ళున్నారు. ఈ సమాజం కొత్తరకం నాటకాలను ముఖ్యంగా సాంఘిక నాటకాలను ఆడటానికి," అని పార్వతీశంగారు వివరించారు.

అంతవరకు ఓపిక పట్టిన వెంకట్రామయ్య నోరు చేసుకుని, "అందరూ మంచి నాటకాలంటున్నారు. ఆ మంచి నాటకం ఏదో నిర్ణయించేదెవరు ?" అని అడిగాడు.

క్షణంసేపు నిశ్శబ్దం.

"అందుకొక కమిటీ వేయించండి. లేకపోతే కార్యవర్గానికి నాటక నిర్ణయాధికారం ఇవ్వండి" అన్నాడు ప్రకాశరావు. ఎవరితోనూ ఎలాటి పేచీకూడా లేనివాడి గొంతుతో.

మీటింగు గులకరాళ్ళమీద బండిలాగా అడుగడుగునా చచ్చే కుదుపుతో అతి నింపాదిగా నడిచింది.

సభ్యుల సమస్య వచ్చింది. ప్రత్యక్షంగా నాటక ప్రదర్శనలలో పాల్గొనేవారు- నటులూ, సంగీత కళాకారులూ, ప్రాంప్టర్లూ వగైరా-"సభ్యత్వం" కట్టని సభ్యులు. మిగిలిన వారంతా చందాలు కట్టాలి. మొదటిరకం సభ్యులకు జీతాలుండాలా ? లాభాలలో వాటాలివ్వాలా ? నష్టంవస్తే వాళ్ళుకూడా రెండోరకం సభ్యులతో సమంగా పంచుకుంటారా ?ఎన్నో ప్రశ్నలు.

"నష్టం వచ్చే సమస్య ఉండరాదు. మామూలుగా నాటక ప్రదర్శనకు ఎంత ఖర్చవుతుందో అంత సభ్యులమీదనే వసూలయ్యేటట్టుగా తగినంత మంది సభ్యులను చేర్చుదాం!" అన్నారొకరు.

---

1. బొబ్బిలియుద్ధం : శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బొబ్బిలి యుద్ధ నాటకము కావచ్చు (1908). తొలిరోజుల్లో వేదంవారి బొబ్బిలియుద్ధ నాటకం (1916) కంటే ప్రఖ్యాతి పొందిన నాటకం శ్రీపాద వారి దంటారు.
2. ప్రసన్నయాదవం : చూడండి వెనుక.
3. సత్యహరిశ్చంద్రీయం : బలిజేపల్లి సత్యహర్చిశంద్ర నాటకం ప్రస్తావనే కావచ్చు.
4. చింతామణి : చూడండి వెనుక.
5. పాదుకా : పాదుకాపట్టాభిషేకం—పానుగంటి లక్ష్మీనరసింహారావు(1865-1940) నాటకం (1916) కావచ్చు.

"అవునండీ ! కాకపోతే ఏమిటి ? ప్రైవాష్ట్ వచ్చి మన ఊళ్ళో నాటకాలాడి డబ్బు దోచుకుపోవటంలేదూ ? మనకోసం మనం నాటకాలాడుకోలేమా ? మామూలు సభ్యత్వ చసుము సాధ్యమైనంత తక్కువగా ఉంచి ప్రతి నాటకానికి ప్రతి సభ్యుడు ఒక రూపాయి టిక్కెట్టు కొనాలని పెట్టండి. రెండు వందల మంది సభ్యులను చేర్చ లేకపోతామా ?" అన్నారు మరొకరు.

"ఏడాదికి పదినాటకాలాడితే పదిసార్లూ అందరూ కొనమంటే కొంటారుటండీ? మీదంతా చోద్యం !" అన్నారు మరొకరు.

"అధికారరీత్యా నాలుగు ప్రదర్శనలే అనండీ ! జనం విరగబడతారని తోచిన నాటకం అధికంగా ఆడి డబ్బు సంపాదించవచ్చు. ఏం మునిగిపోయిందీ ?"

ఎట్లాగో మీటింగు పూర్తి అయింది. అన్ని సమస్యలూ పరిష్కారం కాలేదు. ఒక తాత్కాలిక కార్యనిర్వాహకవర్గం తయారయింది. అధ్యక్షుడు పార్వతీశం, ఉపాధ్యక్షుడు సత్యం. వెంకట్రామయ్య కార్యదర్శి. ప్రకాశరావు కోశాధికారి.

నాటక కర్తకు నాటకానికింత అని ఇవ్వటమో, రాబడిలో ఇంత శాతమని ఏర్పాటు చేయటమో, నటులకు ప్రతిఫలం ఏ లెక్కన ఇవ్వాలో నిర్ణయించే భారం కార్యనిర్వాహకవర్గం పైన బడింది.

ఇంటికి వచ్చే దారిలో వెంకట్రామయ్య, "ఇంతవరకు సజావుగానే నడుస్తున్నది," అన్నాడు.

"ఏం నడవటమో ! నేననుకున్నది కోతిపుండైతే తీరా అయినది బ్రహ్మరాక్షసి అనుకో ! ఇంతాచేసి హైమవతి సహకరించ నన్నదో పడిన శ్రమ అంతా వృథా ! నన్నడిగితే ఇది లలితా ఎమెచ్యూర్స్‌కాదు హైమవతీ ఎమెచ్యూర్స్ !" అన్నాడు సత్యం.

వెంకట్రామయ్య విరగబడి నవ్వటం చూసినాకగాని అతనికి తాను అన్న మాటలో హాస్యం ఉందని తట్టలేదు....

* * *

మర్నాడు ఉదయమే సత్యమూ, వెంకట్రామయ్యా హైమవతి ఇంటికి వెళ్ళారు. హైమవతి వాళ్ళను చూసి సంతోషించిన దానిలాగా కనిపించలేదు. కాని వాళ్ళకు ఇడ్లీ, కాఫీ ఇప్పించింది.

వెంకట్రామయ్య ప్రభావం హైమవతి పైన ఆవగింజంత కూడా లేదని తెలిసి కూడా సత్యం అతను రాకుండా ఏం చెయ్యాలో ఊహించలేక పోయినాడు. తనకు అంతకన్న హెచ్చు సామర్థ్యం ఉండనికాదు. వెంకట్రామయ్య ఒక రకం గుద్దెద్దు - చేనుకు అడ్డం పడి అదేపోత పోతాడు. అతను ప్రకాశరావును ఆ మీటింగులో అకారణంగా రెచ్చగొట్టలేదా? ఇంకొకరు చెప్పేది వినిపించుకోవటం అతని తత్వంలో లేదు. ఆ సంగతి అతనికి తెలియను కూడా తెలియదు !

అనుకున్నంతా అయింది. పెత్తనం మీదవేసుకుని వెంకట్రామయ్యే పావు గంటసేపు లెక్చరు దంచేశాడు. ఎమెచ్యూర్ నాటకాల ప్రాశస్త్యాన్ని గురించి స్థూలంగానూ, లలితా ఎమెచ్యూర్స్ గురించి సూక్ష్మంగానూ అతను అభిభాషించాడు. ఈ సభ గ్రామంలోని రసికులైన పెద్దలందరి ఆశీస్సులనూ పొందిందని ఉద్ఘాటించాడు. "కనుక మీరుకూడా ఈ సంస్థలో - ఈ కళా సంస్థలో-సభ్యులుగా చేరి, అందులో ఆక్టివ్‌గా పాల్గొని, సంస్థయొక్క కార్యక్రమాలను విజయవంతం చెయ్యాలి.... అన్నట్టు; ఇందులో పాత్రధారణ వగైరా పనులు నిర్వర్తించేవారు గౌరవసభ్యులు. అంటే వారు చందా ఇవ్వనక్కరలేదు!" అని పూర్తి చేశాడు వెంకట్రామయ్య.

వెంకట్రామయ్య నెత్తిన బలంగా కొట్టాలన్న ప్రేరణను సత్యం అతికష్టం మీద అణుచుకున్నాడు. ఈ వదరుడంతా హైమవతితో దేనికి? ఆమె లేకుండా ఈ సంస్థే లేదని తాను నిన్ననే చెప్పేనుగద! సంస్థను వర్ణించి ఆమెను ఊరింపజూస్తాడేమిటి. కాస్తయినా బుద్ధి ఉందా లేదా?

వెంకట్రామయ్య మాట్లాడుతున్నంతసేపూ హైమవతి ఒళ్ళో చేతులు కలిపి పెట్టుకుని అతనికేసే చూసింది. సత్యం ఆమెనే చూస్తున్నాడు. అంతా విని ఆమె తల కొద్దిగా ముందుకు వంచి అమిత మృదువుగా, "క్షమించండి!" అన్నది.

వెంకట్రామయ్య మొహంలో కనిపించే ఆశ్చర్యాన్నిబట్టి అతను ఆ సమాధానం వస్తుందని కొంచెంకూడా ఊహించలేదనే స్పష్టమయింది. అతను సత్యంకేసి నోరు తెరుచుకు చూశాడు.

సత్యం తల అడ్డంగా తిప్పి, "నువు ఇచ్చిన ఉపన్యాసానికి ఆమె స్థానంలో నేనుంటే సరిగా ఆ మాటే అని ఉందును!" అన్నాడు. హైమవతి తనకేసి చూస్తున్నదని అతనికి తెలుసు. కాని ఆమెను చూడటం అతనికి కూడని పనిగా తోచింది. సత్యం తప్పనిసరి పరిస్థితి వచ్చిపడటంవల్ల "నటిస్తున్నాడు." ఈ నటన ఆమెపైన పారకపోతే ఏం చెయ్యాలో అతనికి తెలియదు.

"వెంకట్రామయ్యగారు, పాపం, తప్పుగా ఏమీ మాట్లాడలేదే! మీవంటి ఉత్సాహవంతులు తప్పకుండా ఇటువంటి సంస్థలను నడపవలసిందే! నా ఉద్దేశం కూడా రక్తి కట్టే వృత్తి నటుల నాటకాలన్నా రక్తి కట్టని ఎమెచ్యూరు నాటకాలే నాటక కళను ఎక్కువ ముందుకు తీసుకుపోతాయనే? నిజం చెబుతున్నాను. నన్ను నెలజీతం మీద తీసుకుంటామన్న వారున్నారు. నటించటం వృత్తిగా పెట్టుకోవటం ఇష్టంలేకనే. కానీకూడా పుచ్చుకోకుండా స్టేజి ఎక్కాను. నేను కూడా సిసలైన ఎమెచ్యూరునే. అయితే ఇటువంటి సంస్థలోచేరి పనిచేసేటంత ఓపిక నాకు లేదు. అసలే బాధ్యతలు తప్పించుకు తిరిగేదాన్ని! క్షమించండి!" అన్నది.

వెంకట్రామయ్య వెంట లేకపోతే సత్యం ఆమెను దవడ వాయగొట్టి అయినా ఉండేవాడు, లేదా ఆమె కాళ్ళు రెండూ తాకి కళ్ళకు అద్దుకుని అయినా ఉండేవాడు.

ఈ రెంటిలో ఏది జరిగినా ఈ సన్నివేశం అతని లెక్కన రక్తి కట్టి ఉండేదే, కాని ఏదీ చెయ్యటానికి లేకుండా వెంకట్రామయ్య పానకంలో పుడకలాగా అడ్డుపడ్డాడు.

అయినది చాలక అతను, "మీరలా అంటే-" అని సీళ్ళు నమిలాడు.

హైమవతి అడ్డుతగిలి, "నేను నిష్కపటంగా మాట్లాడుతున్నప్పుడు మీరు అర్థం చేసుకోవాలి. లౌక్యంగా ఏదో అన్నారనీ, బతిమాలించుకుని చివరకు అభిప్రాయం మార్చుకుంటాననీ అనుకోవటం ధర్మంకాదు." అన్నది మృదువుగానే.

"అవుననుకోండీ–" అంటూ వెంకట్రామయ్య నసిగాడు.

"డామిట్! ఎందుకామెను అట్లా కనబడకుండా నములుతున్నావ్?" అని సత్యం వెంకట్రామయ్యమీద లేచాడు. వెంకట్రామయ్య నివ్వెరపోయినాడు.

సత్యం హైమవతికేసి తిరిగి, "క్షమించాలి. వెంకట్రామయ్య చెప్పిన విషయాలలో దేనికీ నేను బాధ్యుణ్ణికాను. ఈ మధ్య మద్రాసు వెళ్ళాను. అక్కడ నాకు ఒక ఎమెచ్యూర్ నాటక సంఘం పెడితే బాగుంటుందని తోచింది. అటువంటి సంఘాలు పట్నంలో చక్కగా పనిచేస్తున్నట్టు విన్నాను. నేను ఒక్కణ్ణి ఈ పని చెయ్యలేక మన వెంకట్రామయ్యవంటి మిత్రుల సహాయం కోరాను. అందరూ కలిసి ఒక షేర్ల కంపెనీ లేపినంత ఆర్భాటంచేసి దానికి ఒక వర్కింగు కమిటీకూడా ఏర్పాటు చేశారు. కానీ ఇదంతా వట్టి హంబగ్. నాకు కావలసింది ఒక నాటకమూ దాన్ని ఆడేటందుకు నటులూనూ! ఈ సంస్థకు డబ్బులెట్లా వస్తాయని ఘూమున్నరసేపు ఆలోచనలు చేసి, తర్జన భర్జనలు జరిపారు. ఒక నాటకం ఆడటానికి డబ్బు నేనే తీసుకు రాగలను. ఆ డబ్బు ఇచ్చే మనిషి ఈ సంస్థలో ఇంకా సభ్యుడు గూడా కాలేదు! నేను జేబులో పెట్టుకు తిరుగుతున్న ఈ కాగితం చూడండి! అందులో మొదటి పేరు ఎవరిది? నాకు సహాయం కావలసింది వీళ్ళనుంచి. ఇందులో నాకు ప్రత్యేకమైన స్వార్థం ఏమీలేదు. నాటకం ఆడితే వచ్చే లాభాన్ని ఏంచెయ్యాలా అని నేను అంచనాలు వెయ్యటంలేదు. నిజంగా లాభమే వస్తే బీదవాళ్ళకు అన్నదానం చేద్దాం! స్తబ్దుగా కూచోవటమే నాకు బాగాలేదు. మీకు అదే ఇష్టమని నాకు తెలుసు. మిమ్మల్ని నేను మార్చటానికి ప్రయత్నించవచ్చునా? ఆ ఒక్క మాటా చెప్పెయ్యండి. మీరు ఒప్పుకోకపోతే నేను నా యత్నమంతా మానుకుంటాను. మీలాగే నేనుకూడా కుండపగలేసి చెపుతున్నాను - నాకు ఈ మిగిలిన వాళ్ళెవరిలోనూ అంతగా విశ్వాసం లేదు." అంటూ తన చేతిలో పట్టుకుని ఆడించే నటుల జాబితా ఆమె చేతికిచ్చాడు.

హైమవతి కాగితం చూసీ చూడకుండానే సత్యానికి ఇచ్చేస్తూ, "మీకు వెంటనే జరిగే ప్రోగ్రామేమన్నా ఉంటే చెప్పండి. చాతనైతే సహాయం చెయ్యటానికి ప్రయత్నిస్తాను. అంతేగాని నాకు సభ్యత్వమూ పాడూ అంటగట్టి మొయ్యరాని బరువు నా నెత్తి కెత్తకండి," అన్నది.

ముందే ఆలోచించి పెట్టుకున్నట్టుగా సత్యం సమాధానంతో రెడీగ్గా ఉన్నాడు.

"మనం ఓల్డుబాయిస్ డేకి ఆడిన నాటకం స్టేజిచేస్తే బాగుండునని నా కున్నది. పూర్తి నాటకం. దాన్ని నలుగురూ మెచ్చుకునే పక్షంలో నాట్యకళాపరిషత్తుకు పోయి పోటీచేద్దాం. అంతకంటె నా మనస్సులో ఇంకేమీ ఆలోచనలేదు. నేను మన్న వెంకట్రామయ్యలాగా భారీగా ఆలోచించగలవాణ్ని కాను." అన్నాడతను.

"అది ఏమంత కష్టం కాదనుకుంటాను." అన్నది హైమవతి ఎంతో తూచి నిర్ణయిస్తున్న దానిలా గా.

"థాంక్‌గాడ్ ! థాంక్‌యూ ! పూర్తినాటకం కాపీచేయించి పంపిస్తాను !" అన్నాడు సత్యం.

ఇద్దరూ ఇంటికి తిరిగివచ్చేటప్పుడు వెంకట్రామయ్య, "మంచి టుప్కా వేశావులే ! ఒకసారి ముగ్గులోకి దిగితే ఎక్కడికి పోతుంది. అసలామనిషి బెట్టు చేస్తున్నదని నాకు మొదటినుంచీ తెలుసు. ఆ మాట అనేద్దామనుకున్నాను కూడా. అనేస్తే పాకం చెడిపొయ్యేదే ! ఈ రకం మనుషులున్నారే, ఉన్నమాట చెప్పరు ఇంకొకర్ని చెప్పనివ్వరు ! అందుకని...." అంటూ విజయగర్వంతో ఏమేమిటో చెప్పుకుపోతున్నాడు. పాపం, అతనికి ఆత్మవంచన తప్ప మరేరకమైన వంచనా తెలియదు. చివరకు అతను, "హైమవతి సభ్యురాలు కావటానికి ఆమోదించిందన్న శుభవార్త వర్కింగు కమిటీ ఇతర సభ్యుల చెవులకూడా వేసేస్తాను" అన్నాడు సత్యం అనుమతి కోరేవాడిలాగా.

"వర్కింగూలేదు. కమిటీలేదు. లలితా ఎమెచ్యూర్స్‌లో నటులు తప్ప ఇంకెవరూ ఉండబోవటంలేదు !" అన్నాడు సత్యం.

"మెమొరాండం ? ఆర్టికిల్స్ ? ఆశయాలు ?"

"ఏమీ ఉండవు !"

"మరి నేను ?"

"నువ్వూ, నేనూ ఉంటాంలే ?" అన్నాడు సత్యం నవ్వుతూ.

సత్యం ఉద్దేశమేమిటో వెంకట్రామయ్యకు అర్థంకాలేదు. హైమవతి మెంబరుగా చేరిందన్న ఆనందమంతా తుడిచిపెట్టుకు పోయిందతనికి !

## 9

చిట్టచివరకు సత్యం మామగారు తన సమస్యను ఒక విధంగా పరిష్కరించుకున్నాడు. ఆయన పల్లెటూరు నివాసం కట్టిపెట్టి తన కుటుంబమంతా బస్తీకి తరలించాడు. ఆయనకు నిజానికి పల్లెటూళ్లో ఏమీలేదు. ఆయన పొలమంతా బాకీదారుల భుక్తంలో ఉన్నది. పొలాల ధరలు ఇంకా పూర్తిగా పడిపోకముందే ఆయన్ని తన్ని

పొలం పన్నెండేళ్ళపాటు కోమటి రత్తయ్య అనుభవించుకునేటట్టు రాసిచ్చి తనకున్న బాకీలన్నీ తీర్చుకున్నాడు. అప్పుడే ఆరేళ్ళు అయిపోయింది.

జానకి తల్లికి రెండున్నర ఎకరాల పొలం ఉన్నది; ఆవిడకు పుట్టింటివారు పసుపుకుంకం కిందా, నగలకిందా దాన్ని ఇచ్చారు. అదే ఈ ఆరేళ్ళూ వాళ్ళకి ఆధారంగా ఉంటూ వచ్చింది. ఆవిడ పోయింది గనక ఇప్పుడది న్యాయంగా ఆడపిల్లకు చెందాలి. అయితే సత్యం జానకితో దాని ఊసు ఎత్తవద్దని చెప్పాడు.

జానకికి దగ్గిరగా ఉండాలని ఆమె తండ్రి కాస్త ఎక్కువ అద్దెకు ఇల్లు తీసుకున్నాడు. జానకికి వాళ్ళు తోడుంటారుగదా అని సత్యం సంతోషించాడు. పిల్లలు స్కూళ్ళలో ప్రవేశించారు.

సత్యం మామగారు చిత్రమైన మనిషి. ఇంతకాలమూ అసహాయుడల్లే పల్లెటూళ్లో కూచుండి పోయినవాడల్లా బస్తీకి రాగానే వ్యాపారం ప్రారంభించాడు - బియ్యం వ్యాపారం. పెద్దబజారులో చిన్నకొట్టు పదిహేను రూపాయలకు దొరికింది. ఆయన తమ గ్రామంలో వాళ్ళందరితో మాట్లాడి ఒళ్ళమీద ధాన్యం తెప్పించి, కొంత మరపట్టించి, కొంత దంపించి తాను అద్దెకు తీసుకున్న కొట్లో మూడురకాల మరబియ్యమూ, రెండు రకాల దంపుడు బియ్యమూ పెట్టాడు. ప్లీడర్లందరి ఇళ్ళకూ, డాక్టర్లందరి ఇళ్ళకూ తిరిగి కొన్ని నెలసరి వాడికలు ఏర్పాటు చేసుకున్నాడు. సత్యం సంగతి చెప్పక్కర్లేదు. నెలకొక అరమూట దంపుడు బియ్యం వస్తూండేది ఇంటికి.

"మీ నాన్నకున్న చొరవలో నాకు సగం ఉంటే ఈపాటికి మేడలు కట్టి ఉందును." అన్నాడు సత్యం భార్యతో.

"ఆయన చొరవచూసి మీరు సంతోషించాలిసిందే!" అన్నది జానకి.

ఇద్దరు పిల్లలతల్లి అయినాక జానకి మారింది. తల్లి జబ్బప్పుడు ఆమె దాదాపు మూడు మాసాలు పుట్టింటిదగ్గిర ఉండిరావటంలో ఈ మార్పు మరింత స్పష్టంగా కనిపిస్తున్నది. ఆమె వెనకటిలాగా నిస్సహాయురాలల్లే ప్రవర్తించటంలేదు - కాస్త కరుకుతేలి, ప్రతి విషయంలోనూ స్పష్టమైన అభిప్రాయాలు ప్రకటిస్తున్నది.

"ఫరవాలేదు. జానకి త్వరలోనే తనకాళ్ళమీద తాను నిలబడుతుంది!" అనుకున్నాడు సత్యం. తన భార్యను గురించిన బాధ్యత తనకు కొంచెం తగ్గినట్టు అనిపించిందతనికి.

జానకి మార్పులో తన ప్రభావం కూడా కొంత ఉన్నట్టు అతనికి తోచింది. ఆమెకు గడచిన అయిదేళ్ళకాలంలోనూ శిక్షణ ఏమైనా లభిస్తే అది తననుంచే అయి ఉండాలి. ఆమె ఇప్పుడు మనుషులను పూర్వంకంటె నిశితంగా విమర్శించగలుగుతున్నది. ఆ విమర్శలో తన "సంస్కారం" కొంత ధ్వనించటం సత్యం గమనించాడు.

అదీగాక ఇద్దరు పిల్లల తల్లి కావటంతో ఆమెకు కొంత వ్యక్తిత్వం వచ్చింది. ఆమె జీవితానికి కుదురు ఏర్పడింది. ఎవరన్నా మాటల సందర్భంలో, "జానకి పిల్లలు చక్కగా పళ్ళల్లే ఉంటారు. వాళ్ళకు చక్కగా పోషణ చేస్తుంది! (గొంతు మార్చి) మా కోడలూ ఉంది! హయ్యో రాత! ఆ పిల్లలు ఎప్పుడూ బురదలో దొర్లి వచ్చినట్టే ఉంటారు. శుభ్రరం చెయ్యదు. ఒళ్ళు ఒంగితేగా?" అంటే జానకికి పర్వం .... అదే సమయంలో పెద్దవాడో, చిన్నవాడో ఒళ్ళంతా బురద చేసుకుని, ముక్కు కారుతూ, పెద్దపెట్టున ఏడుస్తూ అక్కడికి వస్తే — ట్రాజెడీ !

జానకి ఇటువంటి కష్ట సుఖాలలో మునిగితేలేటప్పుడు సత్యం కళ్ళకు పసి పిల్లల్లే కనిపించేది. అతనికి ఆనందం కలిగేది.

అయితే క్రమంగా జానకిలో ఇంకొక గుణం మొగ్గతొడుగుతున్నది - దాన్ని చూసి సత్యం కొద్దిగా భయపడ్డాడు. తన తండ్రి ఇక్కడ కాపరం పెట్టినప్పటినుంచీ జానకి వాళ్ళ సంసారపు చిత్రాలన్నిటిని గురించీ తను బాధపడటమూ, మనశ్శాంతి పోగొట్టుకోవటమూ సాగించింది.

"నువ్వెందుకు అకారణంగా మనోవ్యాధి పడతావు? నీ ధోరణిచూస్తే మీనాన్న ఏది చేసినా నీకు తప్పల్లేనే కనిపిస్తున్నది ? ఆయన బొట్టికాయకాడుగా ? ఆయనకు మంచిచెప్పే శక్తి నీకు నిజంగా ఉన్నదనిపిస్తే చెప్పిచూడు. వింటే వింటాడు లేక పోతే వదిలేసి ఊరుకో. ఆయన కోసం నువునరాలు తెంచుకోవటమేమిటి?" అన్నాడు. సత్యం.

"అదంతా మీరు మాటలు చెప్పినంత సులువుకాదండోయ్!" అన్నది జానకి కర్కశంగా అసలు తప్పు సత్యంది అయినట్టు.

మరొకసారి ఇదే సమస్య వచ్చినప్పుడు ఆమె, "నేను చాలా రోజులుగా చూస్తున్నాను, మీ రెప్పుడూ మా నాన్ననే వెనకేసుకొచ్చి నన్ను ఆక్షేపిస్తారు? ఈ బియ్యం వ్యాపార మేమిటి? అక్కడ వాళ్ళ ఊళ్ళో అందరికీ బాకీలేట! ఇది చాలక ఇప్పుడు కూరగాయలు తెప్పిస్తాట్ట! మా అమ్మ నగలన్నీ అమ్మేశాడు. మా ఆడ పిల్లల సొత్తు తాను అమ్మవలిసిన అవసరమేమిటీ ? మేం నిలవదీసి మా భాగాలు పుచ్చేసుకుంటే ఈ ఆటలన్నీ ఎట్లా ఆడేవాడూ ?" అని దుమదుమ లాడింది.

ఆమె మనస్సును పట్టి పీడించే ఈ క్షుద్రసమస్యలను తనకు ఆమడదూరం లోకి రానివ్వటం ఇష్టం లేకపోయినా, సత్యం, "ఇంతకూ నువు మీ నాన్న దుర్మార్గం రుజువు చేస్తున్నావా? నీ మంచితనమూ, మీ అక్క మంచితనమూ నిరూపిస్తున్నావా?" అన్నాడు.

"చాల్లెండి!" అన్నది జానకి సత్యాన్ని విదిలిస్తూ.

తన భార్యలో ఈ మార్పు సత్యానికి నచ్చలేదు. ఆమె మానసిక జీవితం తనకు దూరమవుతున్నకొద్దీ ఆమె తన పైకి వస్తూండటం అతనికి ఆశ్చర్యం కలి గించింది.

తన జీవితం ఒక నిర్ణీతమైన మార్గాన నడుస్తున్నదని సత్యం ఏనాడూ అనుకోలేదు. ఎవరైనా, "నువు ఏంచేస్తున్నావు?"అని అడిగితే, "ప్రత్యేకించి ఏమీలేదు.'' అనేవాడు. మందులషాపులో కూర్చుంటూ ఉండటం ఒక ఉద్యోగమని చెప్పటం అతనికి ఇష్టంలేదు. నాటకాలు రాయటం ఉద్యోగమని అన్నా ఎవరూ నమ్మరు.

ఇదంతా జానకికి నచ్చినట్టులేదు. ఆమె ఒకనాడు, "మీరు చేసే ఉద్యోగానికి జీతమెంత?" అని అడిగింది.

"ఏం?" అన్నాడు సత్యం పోట్లాటకు సిద్ధంగా ఉన్నవాడల్లే.

"ఏంలేదు. ఎవరన్నా అడిగితే చెప్పటానికి."

"అది ఉద్యోగమేకాదు— జీతంలేదు. ఊరికే ఉండలేక కూచుంటున్నాను. అవసరానికి సరిపడా తీసుకుంటున్నాను."

"ఉద్యోగమైనా కాకపోయినా ఒకరికోసం పనిచేస్తున్నప్పుడు జీతమంటూ తీసుకుంటే నాలుగురాళ్ళు వెనక వేసుకోవచ్చుగా? ఈకాస్త పనికూడా లేకుండాపోతే మనని ఎవరు ఆదుకుంటారు చెప్పండి!''

"ఎవరూ ఆదుకోకుండానే మనం గడుపుకు వచ్చామా? మనకు ఎన్నిసార్లు ఎందరు సహాయం చేశారో నీకు తెలియదా?''

"బాగుంది! తెలిస్తే ఎందుకంటానూ? ఒకవేళ మనం నిజంగా ఇబ్బందిపడితే సహాయపడ్డారేమో. డబ్బు వెనకేసుకునే అవకాశం ఉండి కూడా వెనకెయ్యకపోతే ఎల్లకాలం వాళ్ళు సహాయపడతారుటండీ? అత్యవసరమైనదానికే మిమ్మల్ని అడుగుతున్నాను. పిల్లలకేమన్నా చేసుకుందామన్నా, చెందుకుందామన్నా మిమ్మల్ని అడగటానికి నాకు ధైర్యంలేదు— కస్సుమని లేస్తారేమో అని?''

తాను కస్సుమని లేస్తాడన్న భయం పోబట్టే ఆ మాట అన్నదికాబోలని సత్యం ఊహించాడు.

"నేను ఏంచేస్తే బాగుంటుందంటావు?'' అన్నాడతను కొంచెం వెటకారంగానే.

"ఏదో ఒక జీతం ఏర్పాటు చేయమనండీ! తప్పేం వట్టి అప్రయోజకుడనుకున్న మా నాన్న కిందటి నెల నూరు రూపాయలు లాభం తీశాట్ట!''

"నేను అంత ప్రయోజకత్వం చూపలేనుగాని, నీ యిష్ట ప్రకారం వాళ్ళను జీతం అడుగుతాననుకో — మనం ఇప్పుడు తీసుకునేదానికన్న చాలా తక్కువ ఇస్తామంటే!''

జానకి ఒక్క క్షణంపాటు ఆలోచన తోచక, ''అట్లా ఎందుకంటారూ?'' అన్నది.

"ఇప్పుడు నేను తీసుకునే దానికన్న ఒక పది రూపాయలు హెచ్చుతీసుకోమనరు?'' అంటే ఇన్నాళ్లూ నన్ను మోసం చేసినట్టవుతుంది. ఎక్కువ ఇచ్చామని తెలియజేయటానికి అయిదు రూపాయలు తగ్గించే చెప్పవచ్చు. ఏమంటావ్?''

''తగ్గించనివ్వండి మన ఇష్టమైతే పనిచేద్దాం లేకపోతే మానేద్దాం!''

"మనం మానేస్తే ఆ పని చెయ్యటానికి పదిమంది దొరుకుతారు. మనకు ఉద్యోగమిచ్చే వాడు ఇంకొకడు దొరకడు!"

"ఇట్లా కాలికీ వేలికీ వెయ్యకపోతే జీతం అడగటం ఇష్టం లేదని చెప్పరాదు?"

తాను వితండవాదం చెయ్యటంలేదని నిరూపించటం అవసరంలేదు.

"ఈ జీతంగురించి నన్నే బాధపడనివ్వు !" అన్నాడు సత్యం.

"మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండిగాని నాకొక పాతిక రూపాయలిప్పిద్దురూ ! వీరబ్రహ్మం చక్కని గొలుసులు చేస్తున్నాడు. చెరొక ముక్కాలు సవరూవేసి పిల్లలిద్దరి మెడల్లోనూ గొలుసులు చేయించి వేద్దామని ఉంది," అన్నది జానకి.

"మగపిల్లలకు బంగారు గొలుసులు తక్కువయినయ్యా ?"

"చిన్న వెధవలకు వేసుకోరటండీ ? మగపిల్లలయితే ఏం?"

"చూద్దాం" అన్నాడు సత్యం.

ఇది మొదలు మాత్రమే. దీని తరవాత ఈ రకం డిమాండులు ఇంకా చాలా రాబోతై ! అతనికి తెలుసు.

అతని మనస్సు నాటకంమీద ఉన్నది. అన్ని పాత్రలకూ నటులు కుదరలేదు. చాలా మంది కొత్తవాళ్ళు కావలసి వచ్చారు. వేషాలు వెయ్యటానికి ఉబలాటపడేవారిలో కొందరికి అనువైన పాత్రలులేవు. నాటకం గురించి ఏంచేద్దామన్నా పెళ్ళా - పిచ్చా సామెతగా ఉన్నది.

ఒకసారి అతను చిరాకుపడి ఆ నాటకం మానేసి ఇంకోటి రాద్దామనికూడా అనుకున్నాడు.

ఈసారి నాటకానికి పాటలుకూడా కావాలి.

వామనరావు రానన్నాడు. అతను నాటకాలను విడిచిపెట్టి ఫర్నిచరు దుకాణం నడుపుతున్నాట్ట !

యువకవి రెండుపాటలు రాశాడు. మొహమాటానికి సత్యం, "ఫరవాలేదు బాగానే ఉన్న" య్యన్నాడు.

"బాగున్నయ్యంటే కాదు. వాటికేమిస్తారు ?" అన్నాడు యువకవి.

సత్యం తెల్లబోయి, "ఇప్పుడేమీ ఇయ్యలేను," అన్నాడు.

మట్లు పెట్టేవాళ్ళు కావాలి. హార్మోనిస్టు కావాలి.

వెంకట్రామయ్యతో ఈ విషయాలు మాటాడితే, "అన్నీ అవేవస్తయి ! నువు కంగారు పడకు," అంటాడు.

ఒక్కొక్కసారి సత్యానికి ఈ నాటకం హడావుడంతా వెంకట్రామయ్య ఊసుపోకకూ, ఆ హైమవతి కీర్తికోసమూ జరుగుతున్నట్టు అనిపించేది.

అతను వరసగా నాలుగురోజులు స్టోరుకేసి వెళ్ళకుండా రిహార్సల్సులో మునిగిపోయినాడు. రిహార్సల్సు అతనికి కొంచెంకూడా నచ్చలేదు.

అయిదోరోజు అతను స్టోరుకు వెళితే నరసింహం వచ్చి, "ఇటుకేసి రావటం లేదుటగా ? పోనీ ఇంకెవరినన్నా పెట్టుకోనా ?" అని అడిగాడు.

సత్యానికి తల తీసేసినట్టయింది.

అభిమానం చంపుకుని అతను నరసింహంతో తన నాటకం గొడవ గురించి చెప్పాడు.

"అదా సంగతి ? అయితే ఒక పని చేద్దాం. నీ నాటకం కంపెనీకి నేను ప్రొప్రయిటరుగా ఉంటాను. నువు షాపులో కూచోవద్దు. నెలకొకయాభై ఇస్తాను. ఖర్చులన్నీ నేను పెట్టుకుంటాను. నువు నాటకాల గొడవే చూడు !" అన్నాడు నరసింహం.

సత్యానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. యాభైరూపాయలు మంచి జీతం. నాటకం ఒకటి రూఢిగా పడుతుంది. నరసింహం జోక్యం కలిగించుకునే బాపతుకాదు.

"బతికించారు !" అన్నాడతను.

"అర్జంటు ఖర్చులేమిటి ?" అన్నాడు నరసింహం.

"పాటలు రాయించాలి. ఒక హార్మోనిస్టును పెట్టాలి."

నరసింహం రెండువందలు తీసి ఇస్తూ, "కాస్త ఎకౌంటుమాత్రం ఉంచు !" అన్నాడు.

ఇది సబబైన ఏర్పాటేనా అన్న సందేహం సత్యానికి తరవాతగాని రాలేదు. ఇది ఎమెచ్యూర్ నాటకసమాజం. దీనికి లాభాలు తీసే ప్రొప్రయిటరు ఉండేపక్షంలో నటుల మాటేమిటి? తనకు జీతం ఉంది-బాగానే ఉంది. వెంకట్రామయ్య మాటేమిటి ?

వీళ్ళంతా పాటలు రాసేవాడిపాటీ, హార్మోనిస్టుపాటీ చెయ్యరా ?....అన్నట్టు నటులలో పాడేవాళ్ళెవరో తెలియదు. హైమవతికి బహుశా పాడటం చాతకాదు !

తల ఏ గోడకైనావేసి కొట్టుకోవాలనిపించింది సత్యానికి. అతను మనస్సు రాయి చేసుకున్నాడు. ఎవరితోనూ నరసింహం గురించి చెప్పవద్దు. నాటకానికి పాటలూ వద్దు. పచ్చి బద్దలూ వద్దు, వట్టి పొడివచన నాటకం ఆడితేసరి !

పాటలు మానెయ్యటం అందరి ప్రాణాలకూ హాయిగానే ఉంది. రోజూ హైమవతి ఇంటనే రిహార్సల్సూ. కాఫీలూ, సిగరెట్లూ సత్యమే తెప్పిస్తున్నాడు.

నాటకంలో కొద్ది మార్పులు చేసినమీదట ఇంకా కొంచెం బాగా నడిచింది. ఎవరు ఏ మంచి సూచన చేసినా సత్యం ఒప్పుకున్నాడు. నాటకం సమిష్టిసృష్టి అయింది కొంతవరకు. నాటకానికి రెండుమూడు పేర్లు మార్చి చివరకు "ప్రతిక్రియ" అనేది ఖాయం చేశారు. (ఓల్డ్‌బాయిస్ డే నాడు ఆడినప్పుడు దానిపేరు "విద్యావతి")

నరసింహం సంగతి సత్యానికి తప్ప ఇంకెవరికీ తెలియదు. నాటకం మీద

లాభాలు వచ్చిన రోజున లాభంలో రూపాయికి ముప్పావలావంతు నటులకు పంక్షు తానన్నా నరసింహం అభ్యంతరం చెప్పడని సత్యం నమ్మకం.

కథానాయిక శారద తల్లిగా నటించటానికి ఒక నడివయసు మనిషి దొరికింది. ఆ మనిషి తన సంభాషణలను అందరికన్న బాగా చెప్పింది. ఆమెను ఎవరో కాంపౌండరు ఉంచుకున్నాట్ట.

ఇప్పుడు సత్యం హృదయం హైమవతి కోసం ఏడవటంలేదు. ఒక సంగతి. ఆమెను రోజూ చూస్తున్నాడు. జానకిని చూసినదానికన్న హెచ్చుచూస్తున్నాడు. ఇంకోసంగతి దూరంగా ఉంటే హైమవతి అతన్ని మరింత బలంగా ఆకర్షిస్తుంది.

కాని అతను జానకినీ, హైమవతినీ ఎన్నోసార్లు పోల్చుకుని చూసుకుని, తనకు హైమవతి మరింత అనుకూలమైన భార్య అయిఉండేదనుకున్నాడు. రహస్యం ఏమిటంటే హైమవతి తన స్వేచ్ఛను ఇంకొకరికి అర్పించదు. ఇంకొకరి స్వేచ్ఛను హరించటానికి ప్రయత్నించదు. భర్తగా తను జానకి స్వేచ్ఛను ఏనాడూ అరికట్టినట్టు జ్ఞాపకం లేదు, కాని జానకి తనకే తెలియకుండా ఎన్నోసార్లు అతన్ని నిర్బంధంలో పెట్టింది. అసలు జానకికి తన స్వాతంత్ర్యం గురించిగాని, ఇతరుల స్వాతంత్ర్యం గురించిగాని పిసరంత గౌరవంలేదు. ఆమెకు జీవితం గురించి ఏదన్నా వేదాంతం ఉంటే అది ప్రపంచం పెద్ద జైలు అనే!

ఈ విషయం రుజువు చెయ్యటానికల్లే ఆమె ఒకరోజున, "మీరు ఉద్యోగం మానుకున్నారా ?" అని అడిగింది.

ఆమె అటువంటి ప్రశ్న వేసి నప్పుడల్లా సత్యం, ఆ ప్రశ్న వేయటంలో ఆమె ఉద్దేశమేమిటో తెలియనిదే సమాధానం చెప్పకుండా ఉండటం అభ్యాసం చేశాడు.

"ఏం ?" అన్నాడతను.

"ఏంలేదు. నాన్న మీకోసం మందులషాపుకు వెళ్ళితే మీరు షాపుకు రావటం లేదని చెప్పారుట. ఇంకెవరో ఇప్పుడు షాపు చూస్తున్నారట."

"అవును నేను నాటకం రిహార్సల్సు చేయిస్తున్నాను."

"హవ్వ !" అని జానకి నోరుకొట్టుకుని, కళ్ళు పెద్దవిచేసి, "ఇదేం పనండీ ! ఎవరన్నా వింటే నవ్విపోతారు !"

"ఏం చెయ్యాలో, ఏం చెయ్యగూడదో నాకు తెలియదంటావా ఏమిటి ?"

"తెలిస్తే ఉద్యోగమూ, సద్యోగమూ లేకుండా నాటకాలాడిస్తారుటండీ ? ఎక్కడైనా ఉందా ?"

సత్యానికి మండిపోతుంది. ఆమె కోరిన ప్రకారం పాతికరూపాయలూ ఆమె చేతిలో పెట్టాడు. సంతోషిస్తుందనుకున్నాడు. తన జీవితాన్ని తీర్చిదిద్దే పరిస్థితి ఏర్పడుతుందని అతను కలలో కూడా ఊహించలేదు.

"నాటకం ఆడించటంకూడా ఒక ఉద్యోగమే," అందామని అతనికి నోటి

దాకా వచ్చింది. నాటకాలాడించినందుకు వెనకటికన్న ఎక్కువే జీతం వస్తున్నదంటే జానకి సంతోషించేదే కాని అతను ఆ మాట అనలేదు.

ఎవరైనా తనపైన అర్థంలేని ఆరోపణలు చేసినప్పుడు తననుతాను సమర్థించుకోవటం సత్యానికి అవమానమనిపించేది. అది అట్లా ఉంచి తనకు నరసింహం జీతం ఇస్తూ ఉన్న సంగతి ప్రస్తుతానికి పరమ రహస్యం. తాను భార్య మెప్పుకోసం ఈ రహస్యం బయటపెడితే అది క్షణంలో బయటపడుతుంది. తన భర్త యాభై రూపాయలు తెచ్చికుంటున్న సంగతి జానకి తండ్రికి చెప్పకుండా ఉండదు. ఆ తరవాత పెద్దబజారంతా పొక్కిపోతుంది.

"మీరీ నాటకం ఎందుకు పెట్టుకున్నారో నాకు తెలుసులెండి," అన్నది జానకి. ఈ మాట అనేముందు ఆమె కొద్దిసెకండ్లపాటు అందామా, మానుదామా అని వితర్కించుకున్నట్టు సత్యం శంకించాడు.

"ఎందుకుట ?" అన్నాడతను.

"మీ నాటకంలో ఎవతో వేషం వేస్తున్నదిటగా ?"

"ఎవతోకాదు. ఆవిడ పేరు హైమవతి."

"ఆ మైనంవత్తి కోసం చేసేచేసే ఉద్యోగం మానుకొని నాటకాల వాళ్ళలో చేరిపోయి బలాదూరు తిరుగుతున్నారా !" అన్నది జానకి.

సత్యం మండిపోయినాడు. అతని మంటకు ఒక కారణం కాదు— అనేకం ఉన్నై.

"నాకూ హైమవతికీ రంకుకట్టుతున్నావని చెప్పటానికి ఆ ప్రశ్న వేశావా ? నిజంగా మాకిద్దరికీ రంకుసాగుతున్నదని నమ్మినదానివైతే ఇంత నిబ్బరంగా ఎందుకున్నావు ? ఏడిచి రాగాలు పెట్టవేం ? ఈ రంకు గురించి ఎన్నాళ్ళబట్టో మనస్సులో పెట్టుకుని ఉన్నావు ? అది నీ మనస్సును ఎందుకు పొరకాల్చలేదు ? నేను ఏ ఉద్యోగంచేస్తే నీకేమిటి ! బలాదూరు తిరిగినా ఇంటిఖర్చు తెచ్చేభారమేగా నాదీ ? అది నీదికాదే ? ఇకముందు నీ పరువు ప్రతిష్ఠలకు అనువైన ఉద్యోగం చేస్తేనేగాని నన్ను ఏలుకోవా ? అట్లా గుడ్లు పెట్టుకు చూస్తావేం ? సమాధానాలు చెప్పు !" అని అరిచాడు సత్యం.

జానకి అష్టకష్టాలూ పడుతున్న దానివాలకంపెట్టి, "నేను మీకు చెప్పగలదాన్నా ? అడ్డమైన పీటిముండలతోనూ మొగుళ్ళు పోతుంటే ఎంతమంది చూస్తూ ఊరుకోవటంలేదూ ? చేసేదేమన్నా ఉంటేగద !" అన్నది.

"మొగుణ్ణి గనక అలుసుకొద్దీ నన్ను గురించి అనటానికి నీకు అధికారం ఉంటే ఉండవచ్చు. కాని నువు మొహం ఎరగని ఆడదాన్ని పీటిముండ అని ఎట్లా అంటున్నావు ? ఆ మనిషికి రంకు ఎట్లా కట్టుతున్నావు ?" అన్నాడు సత్యం.

"నాటకాలలోవేసే ముండ పీటిముండకాక పతివ్రత ఎట్లా అవుతుంది ? దాన్ని మొగుడు కూడా వదిలే—"

సత్యం జానకి మాట పూర్తికాకుండానే మొహంమీద బలంగా కొట్టాడు.

## 10

నాట్యకళా పరిషత్తు ఇంకో నెలరోజు లుందనగా "ప్రతిక్రియ" నాటకం ఆడారు. కలెక్షన్ రెండు మూడు వందల మధ్య వచ్చింది. కాని చూసినవాళ్ళు చాలా సంతోషించారు.

నాటకం అంతా సత్యం సీట్‌లో కూచునే చూశాడు. అతని పక్కన ప్రసాద రావుగారనే ఆయన కూచున్నాడు. ఆయన సంస్కారంగలవాడు.

మధ్యలో ఆయన సత్యంతో హైమవతిని మెచ్చుకుంటూ మాట్లాడాడు. ఆయన చెప్పిన విషయం అతనికి చాలా కొత్తగా అనిపించింది.

"ఈ అమ్మాయిలో ఉన్న ఆకర్షణ కేవలం గొప్పనటనే అని నాకుతోచదు. నేను స్థానం నరసింహారావును, 1920 లో అనుకుంటా[1] మొదటిసారి యశోద వేషంలో చూశా. స్థానం స్టేజీమీదికి వచ్చి నిలబడుతూనే ప్రేక్షకులను ఆకర్షిం చాడు. అతని వాచికం, ఆంగికం ప్రేక్షకులను పట్టేసింది. గొప్ప నటన అంటావా? కావచ్చు. కాకపోవచ్చు. కళలో హిప్నొటిజం ఉండాలి. అది లేకపోతే నువు ఎంతైనా శ్రమపడు. ఏమీ ప్రయోజనంలేదు. ఈ అమ్మాయిలో ఆ హిప్నొటిజం ఉన్న దబ్బాయ్ ! అది విమర్శకుడు విశదీకరించేదికాదు."

కళలో ఈ హిప్నొటిజం గురించి సత్యం అదివరకు వినలేదు. దీన్ని గురించి ఆలోచించవలసిందే అనుకున్నాడు. టాల్‌స్టాయ్ కాబోలు కళ అంటువ్యాధిలాగా ప్రేక్షకులను పట్టుకోవాలన్నాడు. ఆ అంటువ్యాధే ఈయన చెప్పే హిప్నొటిజమా ? తన సంభాషణలలో నిజంగా అది ఉందా? ఉంటే అందరూ వెర్రెత్తిపోరేం?

"ఈసారి ఆడితే ఇంకా డబ్బు రావటం నిజం." అన్నాడు రాధాకృష్ణమూర్తి.

మళ్ళీ పదిరోజులకు ఇంకో ఆటబడింది. మూడువందలు వచ్చింది.

---

1. 1920 లో అనుకుంటా : ప్రసాదరావు అనుభవం ఒక విధంగా కుటుంబ రావుగారిదే. "ఫస్టు కంపెనీలో స్థానం వేసిన పాత్రలు నాకు గుర్తున్నంత వరకు కృష్ణలీలలులో యశోద, (గోవిందశాస్త్రి కంసుడు) రుక్మాంగదలో మోహిని (గోవిందశాస్త్రి రుక్మాంగదుడు). అప్పటికి నావయసు 12మాత్రమే కావటంచేత ఆనాటి స్థానం నటనా సామర్థ్యం గురించి చెప్పలేనుగాని, కళా కారుడికి ఉండదగిన సమ్మోహన శక్తి – అంటే ప్రేక్షకుడి వ్యక్తిత్వాన్ని తన అధీనంలోకి తీసుకునే నేర్పు స్థానంలో పుష్కలంగా ఉండేదని రూఢిగా చెప్పగలను" (నటకావతంసుడు అనే వ్యాసంలో, వసుధ, ఏప్రిల్ 1971). కొ.కు. స్థానాన్ని యశోద వేషంలో 1920, 21 లో చూసి ఉండాలి. ఆయన పుట్టింది- 1909 లో కాబట్టి.

"పాటలుంటే ఇంకా వచ్చేది," అన్నారు కొందరు.

నిజం దేవుడికి తెలియాలి. ఈ రెండో ప్రదర్శనం తరవాత "బొబ్బిలియుద్ధం నాటకం ఆడారు. పది హేనువందలు కలెక్షన్ వచ్చింది.

జనానికి కావలసినది "ప్రతిక్రియ" వంటి నాటకాలు కాదు.

నరసింహం మొదటిసారి నాటకం ఆడినప్పుడు ఊళ్ళోలేడు. రెండో ప్రదర్శనం చూశాడు. నాటకం మధ్యలోనే స్టేజిలోకివెళ్ళి హైమవతితో, "నన్ను నువ్వెరగవనుకుంటా, ఈ కంపెనీకి ప్రొప్రయిటరును. అన్నట్టు సత్యం నీ కెంత ఇస్తున్నాడు? మరీ తక్కువ ఇస్తుంటే చెప్పు?" అన్నాడు.

అతను తాగి ఉన్నాడని తెలుసుకుని హైమవతి సౌమ్యంగానే, "నేను డబ్బు కోసం వేషం వెయ్యటంలేదు. సత్యంగారు అడిగారు. సరదాకు వేస్తున్నాను." అన్నది.

"అది చాలా తప్పు! ఇంద తీసుకో!" అంటూ నరసింహం పర్సు తీశాడు.

"ఉంచండి, మీ డబ్బు నాకు అక్కర్లేదు."

నాటకం అయిపోతుండగా నరసింహం సత్యం దగ్గిరికివచ్చి, "డబ్బిస్తానంటే వద్దంటుందేమిటోయ్? నీ సొంతమూ లేక పబ్లిక్ సరుకా!" అన్నాడు.

ఆ మాట అన్నది జానకి కాదుగనక సత్యం మొహం పగలగొట్టలేక పోయినాడు.

"హైమవతితో నాకేమీ సంబంధంలేదు. ఆమె డబ్బుకు దొరుకుతుందను కోను."

"మొగుడున్నాడా?"

"ఉన్నాడు."

"మరి వేషం వేస్తుందేం?"

"ఇల్లాలు వేషం వెయ్యకూడదా?"

"పోనీ....ఇంతకూ వేషంవేసినందుకు ఈ అమ్మాయికి మనం ఏమిస్తున్నాం?" అన్నాడు నరసింహం.

"కిందటిసారి ఖర్చులుకూడా సరిగా రాలేదు. ఈసారి కాస్త మిగిలేట్టుంది. లాభంలో భాగం ఇవ్వటమే, ఆ అమ్మాయికే కాదు, అందరికీ ఏదో ముట్టచెప్పాలి."

"మిగిలినవాళ్ళ సంగతి నువుచూడు. ఆ అమ్మాయికి ఈ వందా ఇచ్చేయి. నాటకం కాగానే నా కారులో ఎక్కమను. ఇంటిదగ్గిర దిగబెట్టేస్తాను."

"నేను చెప్పను, ఈ డబ్బుకూడా ఇవ్వను."

"నా తరపున ఇచ్చెయ్యవోయ్!"

"ఇవ్వను! నేనేమిటనుకున్నారు? తార్పుడుగాణ్ణనా?" సత్యం కోపంతో వణికి పోతున్నాడు.

నరసింహం అతనికేసి గుడ్లురిమిచూసి, "రేపు షాపుకువచ్చి నాకు ఎకౌంటు చూపించు, నీకు రెండువందలిచ్చాను!" అన్నాడు.

"సరే?" అన్నాడు సత్యం. నరసింహం మళ్ళీ స్టేజిలోకి వెళ్ళటం అతను చూశాడు.

"కలెక్షను డబ్బు మూడువందలూ వెంకట్రామయ్యదగ్గిర ఉన్నది, అతను ఆ డబ్బు తీసుకుపోయి ఆఫీసు గదిలో కూచుని ఉన్న రాధాకృష్ణమూర్తి దగ్గిరపెట్టి, "ఖర్చులకు ఎంత అయిందో చూసి తీసుకోండి!" అన్నాడు.

"ఏం?" అన్నాడు రాధాకృష్ణమూర్తి నవ్వుతూ.

"ఎకౌంటు క్లోజ్ చేస్తున్నా," అన్నాడు.

రాధాకృష్ణమూర్తి అరవై రూపాయల చిల్లర తీసుకున్నాడు. మిగిలినది సత్యం నటులందరికీ సమంగా పంచాడు. తాను చిల్లిగవ్వకూడా తీసుకోలేదు. అతను వెంకట్రామయ్యతో, "దీన్ని మీరంతా పంచి తీసుకోండి. హైమవతికి కూడా ఆమె వంతు ఇచ్చెయ్యి." అన్నాడు.

అతను మొదటిసారిగా నరసింహం గురించీ, అతను పెట్టుబడి పెట్టటం గురించీ, ఈ రోజు అతని ప్రవర్తన గురించీ, అతను అన్న మాటా – అంతా చెప్పేశాడు.

వెంకట్రామయ్య అంతా విని, "అరెరెరే! ఎంత అన్యాయమైపోయింది!" అన్నాడు.

సత్యానికి అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. కొద్ది నిమిషాలలో నాటకం అయిపోయింది. తాను హైమవతికిగాని, ఇతర నటులకుగాని మొహం చూపించలేదు.

ఎవరూ చూడకుండా అతను బయటికి జారుకున్నాడు. నిశ్చింతగా ఊరు నిద్రపోతున్నది. కుక్కలు మాత్రం ఎమెచ్యూర్ స్పిరిట్‌లో అలికిడి వినిపించినప్పుడల్లా మొరుగుతున్నై. సత్యాన్ని చూసికూడా కొన్ని కుక్కలు మొరిగినై. వాటికి అతని ఎక్కువేమిటి ? ఎందుకో ఒక కుక్క ముందు మొరిగి తరవాత తోక ఆడిస్తూ దగ్గిరికి వచ్చింది. దాని సానుభూతిని ఏం చేసుకోవాలో అతనికి అర్థం కాలేదు.

ఎక్కడికి వెళ్ళాలోకూడా అతనికి తెలియలేదు. తనకు మళ్ళీ ఉన్న ఉద్యోగం కాస్తా పోయింది. నాట్యకళా పరిషత్తు తన నాటకం లేకుండానే జరిగిపోతుంది. ఇంక తేను జన్మలో నాటకం మాట స్మరించలేడు. తనకు సహాయపడ్డవాళ్ళ ఎదటపడలేదు. ఊళ్ళో తల ఎత్తుకు తిరగలేడు.

ఆకస్మికంగా వచ్చిన అంధకారం మరింత గుడ్డిగా ఉంటుంది. సత్యానికి తన భవిష్యత్తు అంత గుడ్డిగా కనిపించటానికి కారణం అదే.

అతని ఆలోచన తెల్లవారేదాకా కాలుకాలిన పిల్లిలాగా ఊరంతా తిరుగుదామని, కాని అతని కాళ్ళు హైమవతి ఇంటికేసి నడిచినై.

"నువు హైమవతి ఇంటికి పోతున్నావా ?" అని ఎవరో అడిగినట్టుగా అతను తనలో, "అవును ! హైమవతికి చెప్పుకోవలసిన క్షమాపణ ఏదో ఇప్పుడే చెప్పేస్తే సరి. ఆలస్యం జరిగినకొద్దీ ఆ పని మరింత కష్టమవుతుంది."

హైమవతి ఇంటిముందుకు వచ్చి నిర్జనంగా ఉన్న వీధిమధ్య నిలబడి, "ఇంకా ఇంటికి వచ్చినట్టులేదు!" అనుకున్నాడు.

ఎక్కడో కారు హారన్ వినిపించింది. సత్యం ఎదటింటి అరుగుమీద పడుకుని కాళ్ళూ చేతులూ చాచుకున్నాడు. హాయిగా ఉన్నది. అతను జట్కాబండి చప్పుడుకోసం ఆలకించసాగాడు.

కారుహారన్ చాలా దగ్గిరలో వినిపించింది. కారు లైట్లుకూడా కనిపించినై. సత్యం వీధికి వీపుపెట్టి, గోడకు తిరిగి, కాళ్లూ చేతులూ ముడుచుకుని పడుకున్నాడు.

కారు అతనికి అయిదడుగుల దూరంలో ఆగింది.

"నేను లోపలికి రాగూడదన్న మాటేనా ?"

నరసింహం గొంతు.

"రాగూడదు."

హైమవతి గొంతు.

కారుతలుపు తెరిచి మూసిన చప్పుడయింది.

"మీరింక వెళ్ళవచ్చు."

"నువు లోపలికి వెళ్ళేదాకానైనా ఉండగూడదా?"

"మీరు వెళితేగాని నేను లోపలికిపోను. ఎంత స్పష్టంగా చెప్పినా మీకు అర్థం కావటంలేదు."

కారు ఇంజను బుర్రుమన్నది. గేరు మార్చిన చప్పుడయింది. కారు వెనక్కు తిరగకుండా ముందుకే వెళ్ళిపోయింది.

"ఏమిటీ పోజు ?"

సత్యం ఉలిక్కిపడి లేచాడు. హైమవతి అతని సమీపంలో నిలబడి ఉన్నది.

"మీరు జట్కాలో వస్తారనుకున్నాను, చేసిన అపరాధానికి క్షమాపణ చెప్పుకుందామని వచ్చాను. నరసింహం నన్నుచూసి ఉంటాడా ?"

"నాకు తెలీదు, బహుశా చూడలేదేమో ! నన్ను మంచిచేసుకోవటానికి ధూపం వెయ్యటంతోనే సరిపోయిందతనికి. అతనికి ప్రపంచంలో డబ్బు తప్ప ఇంకొకటి తెలిసినట్టులేదు. సామాన్యంగా దమ్మిడీలు పోగుచేసే పిసినిగొట్టులూ, డబ్బు తగలేసేవాళ్లూ అట్లా ఉంటారు."

సత్యం క్షమాపణ చెప్పుకునేటందుకు అనువైన ధోరణిలో హైమవతి మాట్లాడ్డంలేదు. సత్యానికి తన పెళ్ళినాటి విషయం జ్ఞాపకం వచ్చింది. పెళ్ళి ముహూర్తం కాగానే తనను అందరికీ దణ్ణాలు పెట్టమన్నారు. ఒకాయన ఎంతసేపటికీ దణ్ణం పెట్టించుకునే పోజులోకిరాలేదు. హైమవతి అట్లా ప్రవర్తిస్తున్నది.

"నేను పిసినిగొట్టునైనా, తగలెయ్యటానికి డబ్బుగల వాణ్ణయినా కూడా బాగు పడేవాణ్ణి. డబ్బుకోసం గడ్డితినే నేను మిమ్మల్నందర్నీ మోసం చెయ్యవలసి వచ్చింది," అన్నాడు సత్యం.

"నేనంతా విన్నాను. జరిగిందేదో జరిగింది. ఇప్పుడు జరిగిన నష్టమేమీ లేదు, ఇక నేను వెళ్ళి పడుకుంటాను," అన్నది హైమవతి ఆవలిస్తూ.

"మీరు వెళ్ళి పడుకోండి. చేసిన అపచారానికి నాకు శిక్ష అయింది. నేను మళ్ళీ రేపటి నుంచీ చిప్ప చేత పట్టుకొని తిరగాలి. మిమ్మల్ని మోసంచేసి నేనేదో బావుకున్నా ననుకోవద్దనటానికి చెబుతున్నాను."

"అదేమిటి?" అన్నది హైమవతి ఆశ్చర్యంగా.

"మన కంపెనీ చూస్తున్నందుకు నాకు నరసింహం నెలకు యాభై యిచ్చాడు. అవి తప్ప నాకు వేరే ఆధారం లేదు."

"నాకా సంగతి తెలియదు," అన్నది హైమవతి.

ఆమె ఆ మాట అనటంతో ఎందుకో సత్యం గుండెలో బరువు కొద్దిగా తగ్గి నట్టయింది.

"రెండు గంటలయి ఉంటుంది. కాస్సేపు మా ఇంట్లోనే కూచుందురుగాని, మాట్లాడదాం" అన్నది హైమవతి.

* * *

వాళ్ళ హాలులో బల్లమీద దిండొకటి పెట్టుకుని హైమవతి పక్కకు ఒత్తిగిలి పడుకున్నది. సత్యం ఈజీ చైర్‌లో పడుకున్నాడు. ఇద్దరూ అనేక రకాల విష యాలు మాట్లాడుకున్నారు.

సత్యం ఆమెతో ప్రసాదరావు అన్నమాట చెప్పాడు.

"హిప్నాటిజం, మెస్మరిజం నాకు తెలీదుగాని బాగా నటించటం అచ్చగా కసరత్తు చెయ్యటమూ, తల పగలగొట్టు కోవటమూ మటుకు కాదు. అవీ ఉండాలి, వాటి మధ్యను నిజమైన సహాయం ఎక్కడినుంచో వస్తుంది. ఒక్కొక్క స్పీచ్ అన టానికి ఎంతో మదనపడి తన్నుకుంటాను. ఎంతకీ తృప్తి కలగదు. ఆ తన్ను కుంటూండగానే ఏదో తట్టుతుంది. చిక్కు విడిపోతుంది...."

పెళ్ళిని గురించి మాట్లాడుకున్నారు.

"చలం చెప్పినట్టు పెళ్ళి మహా భయంకరమైనది. మన మిద్దరమూ అందుకు నిదర్శనం. పెళ్ళి రద్దయి మీరు సుఖంగా ఉన్నారు. పెళ్ళి చేసుకుని నేను యమ యాతన అనుభవిస్తున్నాను. పెళ్ళాం పిల్లల్ని పోషించే బాధ్యతమాట అటుంచి, మొగుడు పెళ్ళాలు ఒకరి అజ్ఞానాన్ని ఒకరు భరించాలి. ఇల్లుదాటి బయటికి వస్తే మనం అందరితోనూ అన్ని విషయాలూ మాట్లాడం. కొందరు బుద్ధి తక్కువ వాళ్ళుం టారు. వాళ్ళు తమకు విషయాలు తెలిసినట్టు మాట్లాడతారు. మన కిష్టం లేకపోతే వినం మాట్లాడం. వినం. మనకా స్వాతంత్ర్యం ఉంది. కాని మొగుడు పెళ్ళాలు

ఒకరి బుద్ధి తక్కువను ఒకరు భరించాలి. తప్పించుకునేటందుకు లేదు. నేను ఇల్లు దాటివస్తే నా స్వేచ్ఛను పూర్తిగా రక్షించుకుంటాను. ఇంటికి పోగానే నా మనస్సు పంజరంలోకి వెళ్ళిన పక్షిలాగా అవుతుంది.... మొగుడు పెళ్ళాలు ఏవో చచ్చు విషయాలను గురించి కీచులాడుకోవటం- ఒకరితో ఒకరు పోటీపడి నీచంగా ప్రవర్తించుకోవటం, మాటలతో హింసించుకోవటం- చివరకు మొగుడు పెళ్ళాన్ని చావగొట్టటం! గొప్ప గొప్ప భావాలను ప్రచారం చెయ్యటానికి నానాయాతనలూపడే మనిషికి ఎటువంటి గృహవాతావరణం !" అన్నాడు సత్యం.

"ఇదంతా మీ సొంత అనుభవమే?" అన్నది హైమవతి ఆశ్చర్యంతో.

"నూటికి తొంభైతొమ్మిదిన్నరమంది అనుభవం ఇదే గదా?"అన్నాడు సత్యం.

"మీ ఆవిడ చాలా అందంగా ఉంటుందనీ, మీ కావిడమీద చాలా ప్రేమ అనీ విన్నానే?" అన్నది హైమవతి.

"అదీ నిజమే, నే నింతకు ముందు చెప్పినదీ నిజమే. మనకు విస్పష్టమైన స్వభావం అంటూ ఉన్నదా? లేదు. వాస్తవ జీవితంలో ప్రతి మనిషి అందరు మనుషులూనూ. ప్రేమ ఏమైనా బాంక్ ఎకౌంటా? ప్రాణులకు పెరగటం ఎంత సహజమో ప్రేమించటం అంత సహజం. ఒక్కొక్క సమయంలో ప్రేమ నిర్విఘ్నంగా సాగుతుంది. ఇంకో సమయంలో పూర్తిగా ఇగిరిపోతుంది. ఎప్పుడో ఒకప్పుడది సమూలంగా ఎండిపోతుంది. మళ్ళీ ఆ క్షేత్రంలో అది చిగిర్చదు ...నేనూ నరసింహం పట్నం వెళ్ళాం. రోజూ చెడ తాగేవాళ్ళం. ఒకరోజు నరసింహం తాగి ముండలవేటకు బయలుదేరాడు. నేను ఒక మనిషిని తలచుకుని ఏడుస్తూ పడుకున్నాను. ఆ మనిషిని నేను ప్రేమించటం మానలేదు. కాని ఆ మనిషే నాకు భార్య అయిందంటే ఆ ప్రేమ దక్కుతుందని నాకు నమ్మకం లేదు" అన్నాడు సత్యం.

హైమవతి వెల్లికిలా తిరిగి ఒక చెయ్యి తలకు పైగా పెట్టుకుని, రెండో చెయ్యి పొట్టమీద పెట్టుకుని, ఒక కాలుచాచి, రెండవది కొద్దిగా ఎగలాగి, చిత్తరువులో మనిషిలాగా కాస్సేపు మౌనంగా పడుకున్నది.

తాను ప్రేమించినది ఆమెనేనని ఆమె గ్రహించిందా అని సత్యం వితర్కించుకున్నాడు.

చివరకు హైమవతి పోజు మార్చి మళ్ళీ అతనివేపు ఒత్తిగిలి, "మనం నాట్యకళా పరిషత్తుకు వెళ్ళటం-మానవద్దు. ఎందుకు మానటం?'' అన్నది.

"ఖర్చులు?"

"ఇవాళ వచ్చిన డబ్బంతా అయిపోయిందా!"

"అయిపోతుంది. దాన్ని వేషాలు వేసిన వాళ్ళందరికీ పంచమని వెంకట్రామయ్యతో చెప్పాను."

"వద్దంటే సరిపోలా"

"అది నా దగ్గిరే ఉంటే నరసింహం ఎకౌంటు అడిగి పుచ్చుకుంటాడు. తెల్లవారగానే వచ్చి ఎకౌంటు చెప్పమన్నాడు. నా చేతిలో దమ్మిడీ మిగలకుండా చెయ్యదలుచుకున్నాను. కావలిస్తే నా మీద కేసు పెట్టి జైలుకు పంపనీ! నల్ల ఆడ కుక్క కనిపిస్తేచాలు పెద్ద పెద్ద నోట్లు తీస్తాడు !— అతనిది రెండు వందలే ఖర్చయింది. మరేం ఫరవాలేదు. అతను తాగినంతలేదు."

సత్యం నరసింహం పైన ఆగ్రహం తవ్వితెచ్చుకుంటూ ఉండటం చూసి హైమవతి నవ్వింది.

"పరిషత్తుకు వెళ్ళటానికి ఎంతోకాదు. ఎవరి ఖర్చు వాళ్ళు పెట్టుకున్నా సరి పోతుంది. లేకపోతే నేనే ఖర్చంతా భరిస్తాను," అన్నదామె.

హైమవతి తన మనస్సును సముదాయించటానికే ఈ మాట అన్నదని సత్యానికి అనుమానం వేసింది. ఆమెకు కీర్తికాంక్షలేదు. అకస్మాత్తుగా పుట్టుకొచ్చి ఉండటానికి తగిన కారణమేమీలేదు. అందుచేత ఆమె ఈ నిర్ణయం చెయ్యటం అతని కీర్తి పెరగటానికి కావాలి. నాటకకర్తగా తనకు పేరు తెచ్చుకోవాలని ఉన్న సంగతి అతను ఆమెకు చెప్పాడు—దాచలేదు.

నాకోసమైతే ఏమీ శ్రమపడవద్దు. నేనెట్లాగూ నాటకాలురాసి బతకలేను. మా మామగారి బియ్యపు కొట్టులో అసిస్టెంటుగా అయినా ఉద్యోగం చేసుకోవలసిందే నాగతి. కాని మీరు నటిగా పైకి రావలసిందే. నేనైతే మూలకూచోను, నటించేవాళ్ళే బహుకొద్ది. అందులో శక్తిగల వాళ్ళు మరీ కొద్దిమంది." అన్నాడతను.

"నటి అనిపించుకోకపోతే నాకేమీ కొరతలేదని మీరు తెలుసుకోకుండా ఉన్నారు. మా ఆయన చాలా పెద్ద ఆస్తిపరుడు. నాకు బోలెడంత ఆస్తి ఇవ్వటమే గాక, ఎప్పుడు ఎంతసొమ్ము పంపమన్నా పంపిస్తారు. ఎందుకొచ్చిన బెడద?" అన్నది హైమవతి.

"డబ్బేనా? కళకు ఇంకో ప్రయోజనంలేదా? రాఘవాచార్లుగారు ఎంత ప్రోత్సహించినా సంస్కారంగల స్త్రీలు స్టేజి ఎక్కటంలేదు. సంస్కారంలేని ఆడవాళ్ళు తెర ఎక్కి సంస్కారం సంపాదించుకుంటున్నారు. నిజానికి చాలామంది స్త్రీలకు చాటుగా రంకుతనాలు చేసే అవకాశాలన్నా ఉన్నైగాని బహిరంగంగా స్టేజిపైకివచ్చే అవకాశాలులేవు! అన్నీ ఉండి మీరు—"

"మీకెంత నోటి దురుసు !" అన్నది హైమవతి.

"సారీ ! ఉన్నమాట అనటం జబ్బే—ఆ జబ్బు నాకున్నది...."

"మీరు నిజంగా నాటకాలు విడిచిపెట్టేస్తున్నారా ?" అన్నదామె కాస్సేపుండి.

"నేనైే వాటిని విడిచిపెట్టకపోయినా అవి నన్ను అవతలికి గెంటేస్తున్నై. నా ప్రయోజకత్వమంటూ ఏమీలేదు. నా నిర్ణయం అసలేలేదు."

"అట్లా అయితే మనకీ నాట్యకళా పరిషత్తు వద్దనేవద్దు. మీ రేదైనా నాలుగు

డబ్బులు తెచ్చుకునే ఉపాయం చూడండి. నన్ను కూడా విచారించి కనుక్కో - మన్నారూ?"

"అంతకంటేనా ? . .చిత్రం ! డబ్బుగురించి ఆలోచించవలసిన నేను కళ గురించి ఆలోచిస్తున్నాను. డబ్బు కావలసినంత ఉండి కళగురించి ఆలోచించే అవ కాశం ఉండి మీరు డబ్బు గురించే ఆలోచిస్తున్నారు." అన్నాడు సత్యం.

"నేనొక రహస్యం చెప్పనా ?"

"ఏమిటది?"

"మన్ను తిన్న పాములా ఉండటం నా అసలు స్వభావము కాదు. ఈ స్వభా వాన్ని తెచ్చి పెట్టుకున్నాను. నాలో అగ్ని పర్వతాలున్నై. నేనే మగవాణ్ణయి పుట్టి ఉంటే నాకు పట్టపగ్గాలుండేవి కావేమో ! స్టేజిమీద ఉన్నంతసేపూ నాకు వెర్రి మొర్రి ఆలోచనలు తన్నుతూంటై. నరసింహంతో కారులో వస్తుంటే ఒకవంక నాకు ఆలోచన కారును అతని ఇష్టంవచ్చిన చోటికి తీసుకుపొమ్మందామని ! తెగబడి పోయే ధోరణి నాలో లేకకాదు. మా అమ్మమీది ప్రేమా, శాంతంగా బతకాలనే కోరికా ఉండటంచేత నన్ను నేను నిగ్రహించుకుంటున్నా నన్నమాట. నిజం చెబుతున్నాను, నాకు మా అమ్మ ఉంటే ఇంకెవరూ లేకపోయినా ఫరవాలేదు."

"సరే, అయితే నేను వచ్చే జన్మలో మీ అమ్మగా పుడతాను," అన్నాడు సత్యం....

తెల్లవార వచ్చింది. సత్యం పడక కుర్చీలోనుంచి లేస్తూ, "నేను పోతా ?" అన్నాడు.

(ముద్రణ : యువ మాసపత్రిక,

జూలై 1960 నుండి జూన్ 1961 వరకు ధారావాహిని)

# పశ్చాత్తప్తుడు

నేను గౌరవ మర్యాదలు కల కుటుంబంలో పుట్టినవాణ్ణే. ఆ సావాసాలూ ఆ అలవాట్లూ నాకు ఎప్పుడు అలవడినవో జ్ఞాపకంలేదు. నాకు పది పన్నెండేళ్ళు రాకపూర్వమే నేను ఇల్లు పట్టకుండా తిరగసాగాను. నాకు అనేకమంది స్నేహితు లుండేవాళ్ళు. అంతా ధైర్యవంతులు. వాళ్ళ ధైర్య సాహసాలకు నేను భ్రమిసిపోయి నాను. నేను తలపెట్టటానికి అసంభవమైన పనులు వాళ్ళు ప్రతిరోజూ అనేకం చేసే వాళ్ళు. మా అమ్మా మా నాన్న నేను గొప్పవాణ్ణనీ, నా స్నేహితులు వట్టివెధవ లనీ, వాళ్ళ సహవాసం చేసి నేను చెడిపోతాననీ చెప్పేవాళ్ళు. ఆ మాటలు నేనెట్లా విశ్వసించను! నా స్నేహితులు నాకన్న వెధవలు ఎంతమాత్రమూ కాదు. వాళ్ళతో నన్ను సహవాసం చెయ్యనివ్వటమే నాకెంతో గొప్పగా ఉండేది. అంతేకాక మా పెద్ద వాళ్ళకు దేనిదేనియందు గురి ఉండేదో వాటిలో ఒకదానియందు కూడా నాకు గురి లేదు. నాకు చదువులో గురిలేదు! నాకు చదువుచూస్తే అసహ్యం, మేష్టరును చూస్తే అసహ్యం. మంచి మార్కులు వచ్చే పిల్లలనుచూస్తే అసహ్యం! నాకు స్నేహి తులతో తిరగటమూ, చాటుగా మామిడికాయలూ, కొబ్బరికాయలూ కొయ్యటమూ టిక్కెట్టు లేకుండా నాటకాలకూ సినిమాలకూ రైలుమీద దగ్గిర ఊళ్ళకూ వెళ్ళిరావ టమూ, నాతో విరోధం కట్టినవాళ్ళను తన్నించటమూ తప్ప ఇంకేమీ ఇష్టం లేదు. ఇదంతా తప్పని లోకం అనుకుంటుందని నే నెరుగుదును. కాని అది తప్పని నా మనసుకు తట్టలేదు. నా కర్థమయ్యేటట్టు ఎవరూ బోధించలేదు.

నాకు పదిహేను పదహారేళ్ళు వచ్చేటప్పటికి నన్ను మావాళ్ళు "వదిలిపెట్టి కూరుకున్నారు!" వాళ్ళు ఆ పనిచేసి నాకేదో పెద్ద శిక్ష ఇచ్చామనుకున్నట్టు కన పడ్డారు. కాని నా ప్రాణం మరింత సుఖపడ్డది. ఆ రోజుల్లో నేను భోజనానికి మాత్రమే ఇంటికి వెళ్ళేవాణ్ణి. నాకు బీడీలకూ కాఫీకి కావలసిన డబ్బులు మా నాన్న నడిగో, మా అమ్మ నడిగో, ఇద్దరూ ఇవ్వకపోతే దొంగలించో అదికూడా వీలుపడకపోతే ఏమైనా వస్తువులు యింటినుంచి ఎత్తుకుపోయి అమ్మో సంపాదించేవాణ్ణి.

ఒకనాడు నా దొంగతనం పట్టుకుని మానాన్న నన్ను చావగొట్టాడు. మా అన్నయ్యకు చదువుకింద బోలెడంత ఖర్చు అయ్యేది. అదంతా నాకెందుకివ్వరు? నాకు రోజూ మూడణాలు కావాలి. మావాడి జీతానికే రోజూ అర్ధరూపాయి పడు తుందే! ఈ వాదన మా నాన్నకు నచ్చలేదు. నేను కూడా చదువుకుంటే నాకూ

డబ్బులిస్తానంటాడు. స్కూలువాళ్ళకివ్వటానికి ఆయనకు అభ్యంతరం లేదు. కాని నాకివ్వటానికి అభ్యంతరం !

ఒకనాడు మా అన్నయ్య నేనింటికి భోజనానికి వచ్చేటప్పటికి "తిండి వేళకు మాత్రం ఇల్లు కనపడుతుంది అయ్యకు!"అని వెక్కిరించాడు నన్ను. నాకు వాణ్ని చూస్తే మండిపోయింది, వాడిమీదపడి చావగొట్టాను.

ఆ తరవాత మా నాన్న ఇంటికి అసలే రావద్దని శాసించాడు. నేను అమిత పొగరుగా "నేను రానేరాను పో!" అని భోజనం చెయ్యకుండా వచ్చేశాను. ఇక ఆ యింటో అడుగు పెట్టకూడదనుకున్నాను. ఆనాడల్లా నాకు తిండిలేదు. ఆరాత్రి సత్రం అరుగుమీద పడుకుని ఆపుకోలేకుండా ఏడిచాను. నాకప్పుడు ఆకలికూడా తెలియలేదు. కాని మా అమ్మ జ్ఞాపకం వచ్చింది. నా చిన్ననాటి సంగతంతా జ్ఞాపకం వచ్చింది. మా అమ్మనుచూసి ఎంతో కాలమయినట్టుగా ఉంది నాకు.

మర్నాడు ఉదయమే సత్రంలో ఒకామెను "ఏమండి, కాస్త చద్దన్నం ఉంటే పెడతారా ? ఆకలి అవుతున్నది," అని అడిగాను. ఆవిడ నన్ను చూసి "ఎవరబ్బాయివి?" అంది. నాకు కోపంవచ్చి అక్కడినుంచి కదిలాను. ఆవిడ వెనక్కి పిలిచి, "రా, నాయనా! ఎందుకు వెళ్ళిపోతావు? అన్నం పెడతా రా!" అన్నది .... మా అమ్మ అయినా నా కంత బాగా పెట్టి ఉండదు. కాని నేను ఎక్కువ తినలేక పోయినాను. ఇన్ని మంచినీళ్ళు తాగి అక్కడినించి బయలుదేరాను. సాంబయ్య కొట్టులో ఒక బీడీ అడిగి తీసుకుని అది కాల్చుకుంటూ మా స్నేహితులెవరైనా కనిపిస్తారేమో అని బయలుదేరాను.

గుడిదగ్గిర సెకండు కంపెనీ వాళ్ళ గదిలో హార్మోనియం వాయింపు వినిపించింది. లోపలికి తొంగిచూస్తే హార్మోనిస్టుగారు పెట్టెదగ్గిర కూర్చుని ఒక చేత్తో ఏదో వాయించుకుంటున్నాడు. లోపల ఇంకెవరూ లేరు. నేను మెల్లిగా లోపల ప్రవేశించి ఆయన దగ్గిరికి జరిగాను. ఆయన వాయించటం మానేసి నా వంకచూసి, "ఎవరునువు?" అన్నాడు.

"ఏదన్నా వాయించండి!" అన్నాను. ఆయన వినిపించుకోలేదు.

కొంచెం ధైర్యంచేసి "నేను పాడితే వాయిస్తారూ?" అన్నాను.

ఆయన ఎగతాళిగానవ్వి "ఏం పాడతావు" అన్నాడు.

"ఏదన్నా పద్యం."

"పాడు." అన్నాడాయన శ్రుతిపెట్టి. ఆ శ్రుతి నాకు చాలా ఎక్కువయింది. ఇంకో శ్రుతి పెట్టాడు. నేను రామనాధశాస్త్రి[1] పద్యం ఒకటి పాడాను.

"ఇంకోటి పాడు!" అంటూ ఆయన నాకు వాయించటం మొదలుపెట్టాడు.

"కీర్తనలేమన్నా వచ్చునా ?" అన్నాడాయన. ఎవరో ఆడమనిషి— హీరా

---

1. రామనాధశాస్త్రి పద్యం : కపిలవాయి రామనాధశాస్త్రి పద్యం.

బాయి అనుకుంటాను!— రికార్డులో పాడిన కీర్తన ఒకటి నేను కల్పించుకున్న సాహిత్యంతో పాడాను.

మా ఇద్దరికీ సావాసమయింది.

"సుందర్రామయ్యగారికి రాసి, ఆయనకు పాడి వినిపింతువుగాని!" అన్నాడాయన. నా సంతోషానికి మేరలేదు. నాచేతకూడా వేషాలు వేయించి డబ్బిస్తారేమో అని నాకు ఆశపుట్టింది. నాకు వేషాలువెయ్యాలని ఎప్పుడూ ఉండేది. కాని నన్నెవ్వరూ వెయ్యనివ్వరనీ, నాకు వెయ్యటం చాతకాదనీ అనుకునేవాణ్ని.

సుందర్రామయ్యగారు కూడా నాచేత చాలాసేపు పాడించి నన్ను వీపుమీద తట్టి "భేష్" అన్నాడు. అంతే! ఇంకేమీ జరగలేదు. నాకు కష్టం వేసింది. నేనాచోటు వదిలిపెట్టి పుల్లా బజారువెంట నడవసాగాను.

వీధివెంట సినిమా వాళ్ళబండి వస్తున్నది. ఆ బండిలో మా స్నేహితుడొకడు కాగితాలు పంచిపెడుతున్నాడు. నేను కూడా ఆ బండిలోనే ఎక్కి వాడితో జరిగిందంతా చెప్పాను. వాడు కూడా సంతోషించి, "ఒరేవెధవా ! వేషం వేస్తానని సుందర్రామయ్యతో అడక్కపోయినావుట్రా? వాళ్ళంతట వాళ్ళే వేషం ఇస్తారూ?" అన్నాడు.

ఆ సాయంకాలం నా స్నేహితుడిచ్చిన రెండణాలు పెట్టి కాఫీహోటల్లో తిని ఒక కానీ బీడీలు కొనుక్కొని సెకండు కంపెనీవాళ్ళ గదికి మళ్ళీ వెళ్ళాను. వాళ్ళకు మళ్ళా వచ్చినందుకు కోపం వస్తుందేమో అని భయపడ్డాను. కాని హార్మోనిస్టుగారు నన్ను చూడగానే సంతోషపడి, మళ్ళీ పాడమన్నాడు. ఈ సారి గదిలో చాలా మంది ఉన్నారు. వాళ్ళంతా ఏమనుకుంటారో అని భయపడుతూ ఒక కీర్తన పాడాను. హార్మోనిస్టుగారు నన్ను ప్రోత్సహించి ఇంకొకటి పాడమన్నాడు.

నాకు వేషం ఇమ్మని సుందర్రామయ్యగారిని అడగటం మాత్రం నాచాత కాలేదు. సాయంకాలం ఆయన వెంట వారింటికి వెళ్ళి ఆయన ఇంట్లోకి వెళ్ళబోతుండగా పిలిచి భయపడుతూ అడిగాను. ఆయన కాస్సేపు అనుమానించి, "రేపు చూదాంలే" అన్నాడు....

నాటకాల్లోదిగి కాస్త పేరు సంపాదించటం మొదలు పెట్టగానే నా వెనకటి స్నేహితాలు తగ్గి కొత్త స్నేహితాలు జాస్తి అయినై. ఈ స్నేహితులకంటే వెనకటి స్నేహితాలే మంచి వాళ్ళనిపించేది నాకు. అయినా వీళ్ళకున్న నాగరికత నా వెనకటి స్నేహితులకు లేదు. వీళ్ళు నా చేత డబ్బు ఖర్చు పెట్టించేవాళ్ళు, నాచేత పనులు చేయించుకునేవాళ్ళు. నమ్మించి మోసం చేసే వాళ్ళు. అయినా వీళ్ళ దుర్బుద్ధులకు అలవాటు పడిపోయినాను. నా వెనకటి స్నేహితులను నేను కావాలని వదిలిపెట్టలేదు. వాళ్ళంతట వాళ్ళే దూరంగా తొలిగి పోసాగారు—నా కారోజున సినిమావాళ్ళబండిలో కనిపించినవాడు కూడా !

ఈ కొత్త స్నేహితులవల్ల నాకు తాగుడొకటీ, వేశ్యలొకటీ, పట్టుబడినై.

తాగుడు నేను పనిపెట్టుకుని అలవాటు చేసుకున్నాను. కాని భోగంవాళ్ళు

నన్ను పిలిపించుకుని నాచేత డబ్బు ఖర్చు పెట్టించేవాళ్ళు. మొట్ట మొదట వాళ్ళు పిలిస్తే వెళ్ళి తీరాలన్నట్టు వెళ్ళేవాణ్ణి. కాని క్రమంగా వాళ్ళను తప్పించుకుని తిరగటం నేర్చుకున్నాను. నాకు భోగంవాళ్ళు ఎన్నడూ సరిపడలేదు. వాళ్ళు అబద్ధాలాడుతారు. వాళ్ళాడేవి అబద్ధాలని ఎంత తెలివి తక్కువ వెధవకుకూడా తెలుస్తూనే ఉంటుంది.

కాని నాకు ఇందుమతిమీద నిజంగా ఆపేక్షపుట్టింది. మా ఇద్దరి సాహవాసమూ సంగీతం దగ్గిర ప్రారంభమయింది. దానిమీద దానితల్లి చాలా ఆశలు పెట్టుకున్నది. ఆ ముసలిదానికి నెలకు అరవైరూపాయల జీతగాణ్ణి నేను అనలేదు. (నిజానికి ఇందుమతి—మొదలు పెట్టిన పేరు వెంకట నరుసులు—చాలా అందగత్తే, చిన్నదీ, మంచిదీకూడానూ!) కాని ఇందుమతి నన్ను వదిలి పెట్టలేదు. నిజమైన స్త్రీసుఖం దాన్నించే నేను తెలుసుకున్నాను.

నా పేరు పేపర్లలోపడటం మొదలు పెట్టిన తరవాత నా జీవితంలో మరొక మార్పు జరిగింది. నాటకానికి యాభై చొప్పున ఇచ్చి నన్ను పెద్ద పెద్ద నటులంతా పిలవటంకూడా ముఖ్యవిషయం కాదు. కంపెనీవాళ్ళ మూకలోనించి లేచి నేను నాగరిక ప్రపంచంలో పడ్డాను ! అమిత గొప్ప గొప్ప వాళ్ళంతా—ప్లీడర్లేమిటి, మునసబులేమిటి, కవులేమిటి, పండితులేమిటి, అన్ని రకాలవారూ—నన్ను చూడరావటమూ నాతో పరిచయం పెంచుకోవటమూ ప్రారంభించారు. ఎప్పుడన్నా పౌరుగూళ్ళకు వెళ్ళినప్పుడు అనేకమంది చదువుకున్న ఆడవాళ్లూ మొగవాళ్లూ మా లాడ్జికి కూడా వచ్చి టీకీ టిఫినుకూ కార్లమీద ఎక్కించుకు తీసుకుపోసాగారు నన్ను.

ఈ రోజుల్లో నేను పశ్చాత్తాప పడసాగాను, నా చిన్నతనపు పాపాలకు. వీళ్ళంతా పుటకలో నాకన్న ఎక్కువయినవాళ్ళు కారు. కాని నేను నా బాల్య ప్రవర్తన వల్ల ఈ సమాజానికి వెలి అయినాను. ఈ నాగరికత మధ్య నాకు తాత్కాలిక స్థానమేకాని మళ్ళా నేను వెళ్ళవలసింది ఇందుమతి దగ్గిరకేగా ! అది నేను రోజూ చూచే సంసారి స్త్రీలతో ఎన్నడు సమానం కాదు ! ఇతరులు తమ తమ భార్యలను వెంటపెట్టుకుని ఎక్కడికైనా పోగలరు, గౌరవం పొందగలరు. నేనా ? నేనూ. నా ముండా నాముండవల్ల నాకు కొంత సుఖం లేదనికాదు-అంతకంటె ఎక్కువలేదని!

ఒకప్పుడు నాగరికతను నిరసించి ఉండటం నాదే పొరపాటు. నన్ను తప్పు పట్టిన నా తల్లిదండ్రులూ, మా అన్నయ్య, నా బంధువులూ నా మీద కట్టుకట్టారనుకున్నాను. నేను సుఖపడటం వాళ్ళకిష్టం లేదనుకున్నాను. ఎంత పొరపాటూ !

నేను బాగుపడ్డందుకు అందరూ సంతోషించారు. నేనిప్పటికైనా వాళ్ళ ప్రపంచంలోపడి బాగుపడతానని విశ్వసించుతున్నారు ! వాళ్ళు అప్పుడప్పుడూ రాస్తూ వచ్చిన ఉత్తరాలవల్ల నాకు ఆశ పుట్టటం మొదలుపెట్టింది-ముఖ్యంగా మా అన్న రాసిన ఉత్తరంవల్ల!

"....నువ్విప్పుడు లోకజ్ఞానం చాలా సంపాదించినావు ! నీకు నే నేమీ చెప్ప నక్కర్లేదు కాని నీ ధర్మం నువు నిర్వర్తించటం, అనగా నీకు తగిన పిల్లను వివాహం చేసుకుని ఆమె యందు సంతానం కనటం, నీ విధి ! మనతో జాతి అంతం కాదు. మన పిల్లలకు సంఘంలో మనకున్న పరపతి ఉండాలి. ఉండటం విధి ! నీ పేరు ప్రతిష్టలు అభివృద్ధి అయినకొద్దీ నీకు నాగరికతగల భార్యా, నాగరికతగల జీవనమూ మరింత అవసరం. నీ సుఖం విసర్జించమని చెప్పటంలేదు. నీకు తగిన భార్యా సంసారమూ ఏర్పాటయితే దాని చాటున నువ్వేమిచేసినా కనిపించదు. బాగా ఆలోచించుకో? ....ఇక్కడ ఒక దివ్యమైన సంబంధం ఉంది. నీ కభ్యంతరం లేకపోతే వచ్చి చూసిపో. నువు సరేనంటే ఒక్క క్షణంలో ముహూర్తం పెట్టించి పెళ్ళి జరిపింతాము !"

ఎట్లాగైనా విద్యావంతుడి రాత విద్యతో కూడుకుని ఉంటుంది !

మా అన్నయ్య సలహా బాగుంది. నేను ఇందుమతిని వదిలి పెట్టవలసిన అవసరం కూడా లేదు. కాని ఈ పెళ్ళి చేసుకుంటే నలుగురు బంధువులూ వస్తూ పోతూ ఉంటారు ! ఇల్లంటూ ఒకటి ఏర్పడి పచ్చపచ్చగా ఉంటుంది. నాకు పుట్టే పిల్లలకు సమాజంలో స్థానం ఉంటుంది. ఇప్పుడేముంది ? దిక్కు దిక్కు మంటూ నేను ఇందుమతీ ! మా ఇంటికి మర్యాదస్థు లెవరూ రారు. మాకు సమాజంతో ఏమీ సంబంధం లేదు. మేము అదృష్టం చాలక పిల్లలను కంటే వాళ్ళను మా అనంతరం దగ్గిరకు తీయవలసిన వాళ్ళు ఇందుమతి చుట్టాలూ; నా స్నేహితులూ!

మా అన్న చెప్పినట్టు చెయ్యటానికి తీర్మానించుకున్నాను. అతను సంఘ మర్యాదలు గుర్తెరిగినవాడు. సంఘంలో పరపతి కలవాడు.

అతను నాకు సహాయం చెయ్యటానికి పూనుకోవటమే నా అదృష్ట మనుకున్నాను.... ఈ గొడవంతా ఇందూకు చెప్పటం దేనికి?

తీరికగా ఉన్నరోజు చూసి సాధ్యమైనంత త్వరలో మా అన్నగారుంటున్న ఊరు చేరాను. మా అన్నగారికి ఉద్యోగమయింది. మా అమ్మా నాన్నా అక్కడే ఉంటున్నారు. వాళ్ళనందర్నీ చూసి ఏడేళ్ళయింది? మా అమ్మ నన్ను చూడగానే ఏడిచింది. నాకు కూడా కళ్ళు తడి అయినై. మానాన్న నన్ను చూడగానే "ఏమోయ్! ఇంకా మనిషి ఆకారంలోనే ఉన్నావే! పుచ్చి పురుగులు పడిపోయినా వనుకున్నాను!" అన్నాడు. మా వదినగారు నన్ను విషప్పురుగును చూసినట్టు చూడసాగింది. నాకు కష్టం వేసింది— కాని ఆవిడ తప్పేముంది?

మా అన్నయ్య నన్ను చూసి చాలా సంతోషించాడు. నా పరివర్తనకు నన్ను చాలా శ్లాఘించాడు. తను ఆకాశాన్నించి ఊడిపడ్డవాడల్లే అదొక రకమైన ధోరణిలో మాట్లాడాడు కాని నేను అణకువతో సహించాను. నిక్కినీలగటానికి నాకు నైతికంగా ఏమి హక్కున్నది?

"పిల్ల చాలా బాగుంటుంది. ఆటే భాగ్యవంతులుకారు కాని చాలా పరువు మర్యాదలు గల కుటుంబం. నీకు వాళ్ళు పిల్లనివ్వటానికి అంగీకరించటం నీ అదృష్ట మేనని నిష్పక్షపాతంగా చెబుతాను!.... పిల్లను సాయంకాలం చూతామా?"అన్నాడు మా అన్నయ్య.

నాలో ఒక విధమైన ఆందోళన ప్రారంభమయింది. ఈ పశ్చాత్తాపమూ పరి వర్తనా నేననుకున్నంత రుచికరంగా లేవు. నేను ఇంతకాలమూ బురదలో పొర్లాడి వచ్చానని నన్ను చూసిన ప్రతివాడూ నాకు జ్ఞాపకం చేస్తున్నాడు!... దీనికి నేను తల ఒగ్గి తీరాలల్లే కనిపించింది. కానీ, ఏం చేస్తానుని తృప్తిపడ్డాను.

ఆ సాయంకాలం మూడు గంటలకు నేనూ మా అన్నయ్యా పిల్లను చూడ టానికి వెళ్ళాం. వారిల్లు చూడగానే నా ఉత్సాహం సహించచ్చింది. వట్టి పూరికొంప. మరీ దరిద్రులల్లె కనిపించారు. నాకు పిల్లనివ్వటానికి అంగీకరించిన పెద్ద మనిషి మమ్మల్ని చూడగానే ఎంతో వినయ విధేయతలతో, "రండి, రండి దయచెయ్యండి!" అని ఒక నులకమంచం వాల్చాడు.

"ఇవాళ శివరామయ్య గారింట్లో తద్దినం పెట్టించి ఇప్పుడే వచ్చాను!"[1] అన్నా డాయన మా అన్నయ్యతో! నాకు మతి పోయినట్టయింది! మా అన్నగారు నిశ్చి తంగా చిరునవ్వు నవ్వటం చూశాను.

"పిల్లేదీ ?" అన్నాడు మా అన్నగారు.

"ఆఁ! ఆ ! పిల్లది!.... ఒసే, పుణ్యవతిని ఇట్లా రమ్మనవే!"

పుణ్యవతి వచ్చింది! పదేళ్ళపిల్ల. నల్లగా ఉంది; మొహాన కాసీ పరిమాణంగల ఒక కాల్చు మచ్చ; మిట్టకళ్ళు; పైన వెడల్పుగా ఉండి కిందికి కోలగావచ్చి గడ్డం దగ్గర కొనతేలిన మొహం . . ఇక నేనేమీ గమనించలేక పోయినాను. మా అన్న గారు ఆ పురోహితుడూ పెళ్ళి నిశ్చయమైనట్టే మాట్లాడుతున్నారు.

నాకంతా అర్థమయింది. నేను పోగొట్టుకున్న నాగరికత ఇదీ! నా ప్రాణానికి ఈ పిల్లే అందగత్తె ! ఆ పురోహితుడు తన కూతుర్ని నా కివ్వటం నా అదృష్టం! అంతకంటె నేను ఎక్కువ కోరుతున్నానని తెలిస్తే సంఘం నిర్ఘాంత పోతుంది !

"నువ్వు కాస్సేపుంటావా? నేను కాస్త పనిమీద వెళ్ళాలి!" అన్నాను.

మా అన్నయ్య నావంక చూసి లాలూచీగా నవ్వి, "సరే, పద! ఇంటి దగ్గిరే ఉండు. నే నిప్పుడే వస్తున్నాను!'' అన్నాడు. నేను తల ఊపి బయటికివచ్చి టైము చూసుకున్నాను. నాకు తిరుగుబండి అందుతుంది ....

నేను రైలులో ఎక్కగానే నే నెక్కినపెట్టె పక్క పెట్టెలో ఒకాయన బిగ్గి రగా అరవటం వినిపించింది.

---

1. శ్రాద్ధకర్మలు చేసే వైదీకి బ్రాహ్మణ సంప్రదాయం.

"ఈ రోజుల్లో డబ్బుపెట్టి కొనుక్కోలేం దేముందండి ! డబ్బున్నచోటికి నాగరికత నడిచిరాదూ? వర్తకం ఉన్నచోట బస్తీలు ఏర్పడటం లేదూ ? నీతిగా ఉండి డబ్బు లేని వాళ్ళకు సంఘంలో ఎక్కువ స్థానం ఉంటున్నదా ? డబ్బుండి నీతిలేని వాళ్ళకు ఎక్కువ స్థానం ఉంటున్నదా?"

"అవును! నా బంధువులంతా నేను మారానని నన్ను కటాక్షించలేదు. నేను డబ్బు సంపాదించు తున్నానని— ఒక్కొక్క నెల నాకు వెయ్యి రూపాయల ఆదాయం కూడా ఉంటున్నదని—మళ్ళీ నాతో చుట్టరికం కలప వచ్చారు! ఈ వెధవ లంపరిపేటా నా ఇంటా అడుగులకు మడుగు లొత్తేటట్టు చేస్తాను! నా డబ్బుతో దానికి నాగరికత కలిగిస్తాను. దాన్ని నాగరికతల మధ్య పెట్టి సంసారి స్త్రీలందరూ దాన్ని పూసుకుని తిరిగేటటు చేస్తాను. నా చుట్టూ ఉండే సాంఘిక జీవితం దాని చుట్టూ, సూర్యుడిచుట్టూ గ్రహాలు పరిభ్రమించినట్టు పరిభ్రమించుతుంది! ఫాషనులకూ పేరంటానికి గూడా దానికే అగ్రతాంబూలం అవుతుంది!" అని ప్రతిజ్ఞ చేశాను.

నా ప్రతిజ్ఞ ఎంతవరకు నెరవేర్చ కలిగానో లోకం ఎరుగును !

— ముద్రణ : ఆగస్టు 1937,

స్వాగతం కథల సంపుటి, యువ కార్యాలయం; తెనాలి.

# విమోచనం

నా పెళ్ళి విషయమై ఇతర్లు ప్రసంగించకుండా ఉంటే అది నిజంగా ఇంత క్లిష్టసమస్య కాకపోను. ఎందుకంటే నేనా విషయం తలపెట్టరాదని ఎన్నోసార్లు తీర్మానించుకున్నాను. ఏ పదహారో ఏటనో నాకు పెళ్ళి అయివుంటే ఎంతో బాగుండి పొయ్యేది. కాని అట్లా జరగలేదు. ఆటు తర్వాతకూడా కొంతకాలం పాటు నేను పెళ్ళి విషయం తీవ్రంగా ఆలోచిస్తూకూడా చేసుకోలేని స్థితిలో ఉండి పోయినాను. ఆ రోజుల్లో నన్ను పిల్చి నాకు పిల్లనిస్తామన్న మానవుడు లేకపోయి నాడు. ఉన్న కాస్త ఆస్తీపోయి యాభై రూపాయలమీద పెద్ద సంసారం ఈదుతున్న వాడికి పిల్లనివ్వటాని కెవరెగబడతారు మరి?

ఇంతలో నాకు సరోజిని పరిచయం కలిగింది. సరోజినిని చూసిన తరవాత నాకింకొకర్ని పెళ్ళాడాలనే ఆలోచన అసాధ్యం అయింది. ఆమెకి అంత అగ్రస్థానం ఎందుకిచ్చానో నేను చెప్పలేను. అంతకన్న అందమైన వాళ్ళనుచూసి ఉంటాను. అంతకన్న తెలివైనవాళ్ళని చూసి ఉంటాను. కాని నాకు మరే ఆడదీ అంత సమీపం లోకి మటుకు రాలేదు. నేను సరోజిని కోసం తపించలేదు, విరహం పడలేదు, కలలు కనలేదు. సామాన్య ప్రేమికులు చేసేది ఏదీ చెయ్యలేదు. కాని అంతకంటె లక్ష రెట్లు సన్నిహితమైన పనిచేశాను—ఆమెతో నా యిష్టా యిష్టాలూ కష్టసుఖాలూ చెప్పు కున్నాను. సరోజిని నా ఆత్మతో పరిచయం చేసుకున్నది. అంతకంటె ఇద్దరు వ్యక్తులు ఒకరి నొకరు సమీపించటం ఎట్లాగో నాకు తెలీదు.

నే నే వస్తువులు ఇష్టపడి తింటానో, ఏ పుస్తకాలు ఇష్టపడి చదువుతానో, ఏ రకం మనుషులతో మనస్ఫూర్తిగా మాట్లాడతానో, ఏ రకం హాస్యం ఆమోదిస్తానో సరోజినికి సమగ్రంగా తెలుసు. ఒక్క ముక్కలో చెప్పాలంటే నన్ను గురించి ఆమెకు తెలియని విషయం లేదు.

అదీగాక నా లక్షణాలను గురించి సరోజిని ఎన్నడూ ఎటువంటి తగాదా కూడా చెయ్యలేదు. "అందుకే నిన్ను చూస్తే నాకు కోపం" అనే పద్ధతి ఆమె నా విషయంలో ఒకసారి కూడా అవలంబించినట్టు నాకు జ్ఞాపకం లేదు. నన్ను ప్రత్యక్షాన ఎట్లా చూసేదో పరోక్షాన నన్ను గురించి అంతకంటె తక్కువచేసి మాట్లాడే దనుకోను.... అనేక మందికి ఆపోహకూడా కలిగింది. ఆమెకు నామీద ఏదో మమకారం ఉన్నదని !

మూడో విషయం ఏమంటే, నా పరిచయం వల్ల ఆమెలో ఏదో కొద్దిపాటి మార్పు కలిగిందని నా నమ్మకం. ఆ మార్పు ఆమెకుగాని ఆమె నెరిగిన వారికిగాని అసంతృప్తి కలిగించలేదని కూడా నా విశ్వాసం. "వెనకటికన్న సరోజిని ఇప్పుడు చాలా నయం కాదూ ?.... సరదాగా మాట్లాడటం నేర్చింది !" అని ఒకరిద్దరు నా ఎదుటే అనటం జరిగింది. ఆ మార్పుకు నేనే కారణమైతే ఎంత బాగుండు నని చాలా సార్లనుకున్నాను. ఆఖరుకు అతిశయం పట్టలేక నేనే కారణమని తెల్సుకు న్నాను కూడాను. ఆ విశ్వాసం నన్నిప్పటికీ వదలకుండా వుంది. నిజం దేవుడికి తెలి యాలి.

ఏమయినా మా ఇద్దరి స్నేహం గురించి ఇప్పుడు వివరాలు తవ్వటం అనవ సరం. అందులో తప్పు పట్టేటందుకేమీలేదు. దురదృష్టవశాత్తూ అందులో ప్రణయ లక్షణాలు—నేను పైన చెప్పినవి తప్ప—ఏమీలేవు "నేను సరోజినిని ప్రేమిస్తు న్నాను" అని కూడా నా అంతరాత్మలో అనుకున్న సాహసం పోలేదు.

కాని అకస్మాత్తుగా ఈ భావం పైకి రావటానికి ప్రబలమైన కారణం ఏర్ప డింది. సరోజినికి వరసగా రెండు మూడు సంబంధాలు వచ్చినై.

సరోజిని నన్ను పెళ్ళి చేసుకోవాలని నేనెప్పుడూ అనుకోలేదు. ఆమెకి పై సంబంధాలు నా ఎదటే రావటానికి బదులు-ముందుగా ఎవరైనా మాకిద్దరికీ పెళ్ళయితే బాగుండునని సూచించి వున్నట్టయితే—నా ఆలోచనని ప్రతిఘటించి ఉండేవాణ్నేమో కూడానూ ! ఎందుకంటే, నావంటి దరిద్రుణ్ని పెళ్ళాడి సరోజిని ఏం బావుకుంటుంది ? నాకా మనిషి మీద ఈషత్తయినా ఇష్టం వుంటే నన్ను పెళ్ళా డమని ఎట్లా అనగలను ?

కాని అట్లా జరక్క నా ఎదటే ఎవరో సరోజినిని చూడరావటమూ, సరోజిని తన తల్లి దండ్రులతో ఆ వచ్చిన వాడి మంచిచెడ్డలు తర్కించడమూ జరిగేసరికి నాలో ఏదో వింత వికారం కలిగింది. సరోజినికి నేనేమవుతాను? తనవారిన తాను ఎవరినో పెళ్ళాడి నా పరిచయాన్ని ఏం చేదామనుకుంటున్నది? ఇంకో ప్రాణి ఆత్మను అంత సులభంగా అవతల పెట్టెయ్యటానికున్నదా ? ఉంటే నేను సరోజినిని అవతల పెట్టి మరె వరినో పెళ్ళాడటానికి నిశ్చింతగా ప్రయత్నం చెయ్యలేనా ? ... ఏ పిల్లనో చూడ బోయి ఆమె అందచందాలను గురించీ, చదువు సంధ్యలను గురించీ నిశ్చితంగా చర్చించటం అసాధ్యమని నాకెందు కనిపించాలి ?....ఇంతకీ సరోజినికి ఆత్మ— "సోల్" అనే పదార్థం—లేదా ? అంత సామాన్యపు మనిషా ? అంత సామాన్యపు మనిషిని నేనింత పెద్ద చేశానా ?

"ఏం చదివితే మాత్రం, నెలకి డెబ్భై సంపాదన; నాన్నా ?" అని సరోజిని అన్న మాటలు నా అంతరాత్మలో గులకరాళ్ళల్లే చేరి ఎంత మథించినా జీర్ణానికి రాకపోయినై.... యాభై సంపాదించుకునే నన్ను గురించి సరోజిని ఏమనుకుంటూ వుండి ఉండాలి ?....నేను ఒకంతట పశ్చాత్తాప పడే ప్రాణిని కాను. కాని సరోజినికి

నా సంపూర్ణ పరిచయం—స్నేహం—ఇచ్చినందుకు నేను చెప్పతరం గాని బాధ పడ్డాను. ఆమె విషయమై వెనక ఎన్నడూ రాని ఆలోచనలన్నీ వచ్చినై. సరోజిని నన్ను పెళ్ళాడటానికెందుకు ప్రయత్నం చెయ్యదూ ? నేను తక్కువ సంపాదిస్తూ ఉంటేనేం ? నాతో అంత తృప్తి చెందినట్టు కనిపించిన మనిషి, డబ్బు కొంత వరకు త్యాగం చెయ్యకూడదా ? ఎంత భాగ్యవంతుడు వచ్చినా తనకి లక్షాధికారి రాడుగదా ! ఏ వందో సంపాదించేవాడు రావచ్చు. నా కోసం యాభై త్యాగం చెయ్యకూడదూ ? తనని పెళ్ళాడేవాడు ఏ రెండు వందలో సంపాదిస్తున్నాడని తెలిస్తే వాడి అంతరాత్మ ఎటువంటిదైనా పెళ్ళాడేస్తుందా ? ...ఈ ఆలోచనల కంతే లేదు.

నాకు మరో సంగతి కూడా తెలిసింది నేను సరోజినిని ఇంతకాలమూ ఎంతో గాఢంగా ప్రేమించి ఉండాలి. ఆమె మీద ఇంత కోపంగా వున్నా కూడా ఇంత విశాల ప్రపంచంలోనూ నాకు సరోజిని కంటె దగ్గిరిగా రాగల మరో ఆడది కనిపించ లేదు. సరోజిని మరొకడ్ని పెళ్ళాడటం ఎంత రూఢో నేను ఆజన్మ బ్రహ్మచర్యం అవలంబించటం కూడా అంత రూఢే అని తేలిపోయింది.

* * *

చిత్రమేమిటంటే నేను మావూరు సరోజినినీ వదిలేసి వెళ్ళిన సంవత్సరానికి కూడా ఈ విశ్వాసం నాలో అట్లాగే ఉండిపోయింది. కాని సరోజినికింకా పెళ్ళి కుదరనేలేదు. ఆ విషయం నాకు పట్టలేదు. సరోజిని ఎవర్నయినా చేసుకోనీ, చేసు కోకపోనీ నన్నుమటుకు చేసుకోదు. ఆమెతో స్నేహం చేసినందు కెప్పుడయితే పశ్చాత్తాపపడ్డానో అప్పుడే మా ఇద్దరి మధ్యా ఉన్న బాంధవ్యం కాస్తా దగ్ధమై పోయింది. నేను చాలా అతిశయంగల జీవిని. నాలో ఒక మనిషి రెండుసార్లు పశ్చా త్తాపం తెప్పించినా ? వొట్టిది !

నాకిప్పుడు ఒకటే ఆలోచన—సంపాదన. డబ్బే నాకు చుక్కాని, లంగరు లేనేలేదు. నెలకు రెండు మూడు వందలు సంపాదించేవాళ్ళు చాలా గొప్ప వాళ్ళ యితే నేను సంపాదనకోసం ఎక్కడికైనా వెళతాను. అవసరమైతే సముద్రాలు దాటిపోతాను. నన్నొకచోట బంధించేటందుకే మున్నది ?

సముద్రం ఒడ్డుకిపోతే నాగిచిప్పలు కావలసినన్ని. డబ్బు సంపాదించటం కష్టంకాదు. అదే ఆశయంగా పెట్టుకొని మిగతా విషయాలకు ప్రాముఖ్యం యివ్వ కుండా వుంటే! పట్నం చేరాను. మనుషుల్ని ఆశ్రయించాను. ఏర్లుదాటి తెప్పలు తాల్చాను. మనుషులకి వేరే విలువలు చూడలేదు. ఏరుదాటే తెప్ప అవునా కాదా అని తప్ప. ఓ సంవత్సరం తిరిగేటప్పటికి ఓ వెయ్యి బాంకులో నిలవ చేశాను. నెల నెలా రెండు వందల యాభై అందుతున్నై.

ఆనందమా? తృప్తా? అటువంటిదేమీలేదు. యథార్థం చెప్పాలంటే ఈ మహా పట్టణంలో నేను పొందిన ఆనందమంతా కలిపితే సరోజినితో ఒక్కగంట గడిపిన

తృప్తితో సమానమవుతుందని నాకు నమ్మకంలేదు. కాని సరోజిని స్నేహానికి జరిగిన పరాభవం చూస్తూ ఆ తృప్తిని గురించి ఏమని తృప్తిపడను? అనుభవాన్ని ఎట్లా తృణీకరించను ? ఆ తృప్తిని గురించి తలచుకోవటానికి ప్రయత్నించినప్పుడల్లా నాకు జ్ఞాపకం వస్తున్నది పరాభవమే. అది నన్ను వెన్నంటి వదలకుండా ఉంది.

కొంత ఆత్మోపశాంతి చేసుకుందామనే ఉద్దేశంతో సరోజిని తండ్రికి ఒక ఉత్తరం రాశాను: నా సంపాదన గురించి రాస్తూ, డబ్బును తిట్టాను. దానివల్ల మన శ్శాంతి లేదన్నాను. సరోజినికి తెచ్చే మొగుణ్ణి కేవలం డబ్బు మాత్రమే చూసి నావంటి ఆత్మశాంతి లేనివాణ్ణి తీసుకురావద్దన్నాను.

ఈ ఉత్తరానికి సరోజిని స్వయంగా సమాధానం రాస్తూ నేను బాగా సంపాదించుకుంటున్నందుకు తనకు చాలా సంతోషంగా ఉన్నదనీ, నాకు అర్థమైన సంపాదన లేనందుకు వెనక తనకు ఎంతో కష్టంగా ఉండేదనీ,దారిద్ర్యం ఎరిగి ఉండి కూడా నేను డబ్బును తృణీకరించటం తనకు నచ్చలేదనీ, తను పెళ్ళాడితే తప్పకుండా నావంటి వాడినే పెళ్ళాడుతుందనీ, ఆత్మశాంతి నాకు లోపించిన పక్షంలో నాకు తగిన ఆడదాన్ని పెళ్ళాడి తద్వారా తెచ్చుకోవచ్చుననీ, డబ్బును తిట్టనవసరం లేదనీ బోధించింది.

ఆ ఉత్తరం చూసి నేనేమనుకోను ? ఎండిపోయిన చెట్టు చిగిర్చినట్టయింది. మళ్ళీ నేనెరిగిన గొంతు వినిపించింది. సరోజినిని నేనపార్థం చేసుకున్నానేమోనని అనుమానం కలిగింది. ఆలోచించిన కొద్దీ అనుమానం హెచ్చిందేగాని తగ్గలేదు. సరోజిని నాకు చేసిన అపకారమేమిటి ? ఆమె పైకేమంటేనేం? ఎవర్ని పెళ్ళాడింది? ఎవర్నీ పెళ్ళాడలేదు. నేను తనని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నానని తెలిస్తే — నేను నోరుచేసుకుని అడిగివుంటే— నన్ను పెళ్ళాడేదేమో? నేనెందుకంత తొందర పడ్డాను? వెనక నాకైనేను ఆమెను పెళ్ళాడతాననక పోవటానికి కారణం ఉంది— దారిద్ర్యం. ఇప్పుడది అంతగా లేదుగా? ఇప్పుడు మించిపోయిందేమిటి? ఇప్పుడెందు కడగరాదూ.

కూచుని సరోజినికి ఎంతో ప్రేమ పూర్వకంగా ఉత్తరం రాశాను. కవరుమీద ఎడ్రసు కూడా రాశాను. ఉత్తరం తిరిగి చదువుతుండగా భయంకరమైన అనుమానం మరొకటి తలఎత్తింది.

నేను దారిద్ర్యంలోవున్న రోజుల్లో సరోజిని నావంటి వాణ్నే తప్పక పెళ్ళాడతానని సూచనగానైనా నాతో ఎందుకనలేదూ? అప్పటికీ యిప్పటికీ నాలో ఏదో తేడా వుండబట్టేనా ? అది నా యిప్పటి అప్పటి ఆర్జనలు తేడాయేనా ?

నా ఉత్సాహమంతా భగ్నమయింది. నేను రాసిన వుత్తరం చించేశాను. నా అశాంతి పదింతలయింది. నేను వెనక హృదయంలో పెట్టుకుని తిరిగిన సరోజిని ఏమయింది? ఆ సరోజినికి బదులు ఈ సరోజిని ఎక్కణ్ణించి ఊడిపడింది. ఈ సరోజినిని ఆకర్షించిన నా జీవితంమీదా నేను చేసే అర్థంలేని ఉద్యోగం మీదా

కోతపుట్టింది.... నేనింత దూరంవచ్చి డబ్బు సంపాదించటానికి శ్రమపడింది ఈ సరోజినిని ఆకర్షించటానికేనని నాకిప్పుడు తోచసాగింది. నా ప్రయత్నం సఫలమయింది. సరోజిని నన్నిప్పుడు నమ్మకంగా పెళ్ళాడుతుంది! కాని నాకు సంతృప్తి కలగలేదు. పైపెచ్చు ఈ సరోజిని ఎదట కనిపిస్తున్న కొద్దీ నేను వెనక ఎరిగిన సరోజినికోసం ప్రాణం పీకసాగింది. ఆమెకోసం ఎక్కడ వెతకను ?

*

ఈ విధంగా నేను బాధపడుతున్న సమయంలో నాకు పెళ్ళిచేయాలని చాలా మంది పట్టుపట్టినట్టు విశదమయింది. అంతా కూడబలుక్కున్నట్టు అనేక మంది బంధువులూ స్నేహితులూ నాకు సంబంధాలు తీసుకురాసాగారు .... ఒక్కసారిగా ఒక డజను మంది సరోజినులు— నా కక్కర్లేని సరోజినులు—వెంటపడ్డట్టయింది.

"ఎవర్నో ఒకర్ని పెళ్ళిచేసుకుని నలుగురితోబాటే కాలం వెళ్ళబుచ్చవచ్చు. నీ ముష్టి రెండువందల యాభై రూపాయల గురించి ఇంత మథనపడకు." అని అంతరాత్మ మందలించసాగింది.

"నీ సరోజిని ఎక్కడో వుంది. వెతికి పట్టుకో. నలుగురితో పాటే అని అందరూ దిగే బురద గుంటలో దిగకు. నీ వ్యక్తిత్వం చేజేతులా పారేసుకోకు," అని మరోవంక బుద్ధి మందలిస్తూ వచ్చింది.

ఈ సందిగ్ధంలో సత్యనారాయణగారు ఒక మంచి సంబంధం తెచ్చారు. ఎవరో బీదవాళ్ళ పిల్లట. చాలా బుద్ధిమంతు రాలట, పనిపాటలు బాగా వచ్చుట. "నువు చేసుకుంటే చాలా సుఖపడతావు. ఆ పిల్ల తల్లిదండ్రులకి మహోపకారం చేసినవాడివవుతావు. .... నీకు ఉద్యోగం లేకపోయినా నీ వంటి సంబంధం వాళ్ళు తీసుకురాలేరు. అంత బీదవాళ్ళు, పాపం. నిన్ను కళ్ళ కద్దుకుంటారు...." అన్నారాయన.

మిగిలిన బంధు మిత్రులందరి శిఫార్సులూ పెడచెవిని బెట్టిన నేను సత్యనారాయణగారి మాటలు ఆలకించాను. ఆయన భాష నాకెప్పుడూ అర్థమవుతుంది. ఆయన చాలా ఉత్తముడు.... ఆయనతో పరిచయం లేకపోతే ఈ పట్టణం నాకు దాదాపు అరణ్యమే.

కాని ఆ బీదపిల్లని చేసుకుంటానని సత్యనారాయణగారికి ఎట్లా మాట ఇవ్వను? ఆ పిల్లని చేసుకోవటానికి ఒకటే అభ్యంతరం—నేను పోగొట్టుకున్న సరోజిని! ఆ సరోజినిని పట్టుకోవటానికి నేను ఏమాత్రమైనా ప్రయత్నించవద్దా? ఎట్లా ప్రవర్తించను?

ఆలోచించగా, ఆలోచించగా ఒక మార్గం దొరికింది.

* * *

నన్ను చూసి సరోజినీ చాలా సంతోషం కనబరిచింది. ఏదో ఉద్రేకం, దాచటానికల్లే వసపోసిన పిట్టలాగా ఊపిరి తియ్యకుండా మాట్లాడింది. అఖరుకు మాటల

సంవత్సరంలో ఏ పనిమీద వచ్చాననేదీ ఎంత కాలం వుంటావనేదీ ఆమె నోటంట వొక్తినై.

పెళ్ళి చేసుకునే టందుకని వచ్చా నన్నాను. ఎవరి నన్నది.

"చేసుకుంటే నిన్నయినా చేసుకుంటా" నన్నాను.

"నేనే ఏమిటి ? చేసుకోదలిస్తే నాకన్న మంచి వాళ్ళే దొరుకుతారు," అన్నది సరోజిని.

"నాకు నువు చాలు," నన్నాను. "అయినా పట్నంలో వుద్యోగం చేస్తుం డగా ఎవరైనా దొరికే వాళ్ళేమోగాని ఇప్పుడెవరు దొరుకుతా," రన్నాను.

సరోజిని వులిక్కిపడింది. "ఏమిటి ఉద్యోగం పోయిందా ?" అన్నది.

"నేనే వదిలేశాను," అన్నాను.

ఎందుకన్నది.

"చూడు, సరోజినీ. నేను నిన్నే పెళ్ళి చేసుకుందామని గట్టి తీర్మానంతో వచ్చాను. నువు నన్ను వుద్యోగం కోసం చేసుకుంటున్నా వనేది నన్ను బాధించ కుండా వుండగలందులకు వుద్యోగం వదిలేసి వచ్చాను," అన్నాను.

సరోజిని మొహం జేవురించింది.

"అయితే నాలో అంత నమ్మకం లేదా?" అన్నది.

"నాలోనే నమ్మకం లేదు. నావంటి వాన్ని నువు చేసుకుంటావని నమ్మకం లేకనే ఈ పని చేశాను," అన్నాను.

"వుద్యోగం మానెయ్యకుండా వస్తే ఆ వుద్యోగం చూసి ఒప్పుకుంటాననేనా మీ భయం" అన్నది.

"ఆ భయం నువు ఈ క్షణాన తీర్చవచ్చు. నన్ను పెళ్ళి చేసుకుంటావా ?" అన్నాను.

"క్షమించండి. నాలో నమ్మకంలేని వాళ్ళని ఎట్లా చేసుకోను ?" అంటూ లేచి పోయింది. నేను ఆమెను నిలిపి, "అన్నీ వొట్టిదే. ఉద్యోగం పోలేదు, ఏమీ పోలేదు. వేళాకోళానికన్నాను."

తక్షణమే ఆమె మొహం మారింది.

"మీదంతా విచిత్రమైన హాస్యం....పెళ్ళికెన్ని రోజులు శలవు తీసుకున్నారు" అన్నది.

"వారం రోజులు," అన్నాను,

"అంటే ? అప్పుడే రెండు రోజులైపోయినాయిగదా ? ప్రయత్నాలు చేసుకో వద్దా ? ముహూర్తం పెట్టుకోవద్దా ఏదీ వ్యవధానం ?" అన్నది.

"ప్రయత్నాలేమీ లేవు....వాళ్ళు, పాపం, చాలా బీదవాళ్ళు. ఏదో ముహూర్తం వుందని చెప్పారు. దానికి చేసెయ్యమందే చేసేస్తారు;" అన్నాను.

పాపం సరోజిని మొహం సున్నం కొట్టినట్టయింది.

"ఎ-ఎ-ఎవరు—వాళ్ళు ?" అన్నది.

చెప్పాను, వీలుంటే పెళ్ళికి రమ్మని ఆహ్వానించాను.

సరోజిని నాకేసి చూళ్ళేక పోయింది. తలవంచుకుని పిలుస్తున్నా పలుక్కుండా వెళ్ళి పోయింది.

నా మనస్సు కుదుట పడింది. ప్రశాంత హృదయంతో ఆ సాయంకాలమే నా కాబోయే అత్తవారూరు ప్రయాణమైనాను.

—ముద్రణ : రూపవాణి, జనవరి 1945.

# ఇంతలో వుంది!

నా జీవితంలో అనేక దుర్దినాలు. కాని అవేవీ ఇప్పుడు నాకు జ్ఞాపకంరావు. జ్ఞాపకం వచ్చినా నన్ను బాధించవు. నేను దూరదేశంలో ఉండి జేబులో కానీ లేక పస్తుండిన రోజు జ్ఞాపకం వచ్చినా నా కిప్పుడు నవ్వేవస్తుంది కాని మరొకటి జరగదు. కాని నేను ఉద్యోగం సంపాదించిన రోజు— ఉద్యోగం సంపాదించిన రోజుకూడ కాదు, నా మొదటి నెల జీతం వచ్చిన రోజు — జ్ఞాపకంవస్తే పశ్చాత్తాపమూ, విచారమూ, భయమూ కలుగుతుంది.

ఆనాడు నేను జీవితంలో కల్లా ప్రియతమమయిన నా భార్య స్నేహాన్ని పోగొట్టుకోవటం మొదలు పెట్టాను. నా కళ్ళ ఎదుట, నేను నిస్సహాయుణ్ణి అయి చూస్తుండగా, నాకు పంచప్రాణాలుగా వుంటూవచ్చిన నా సీత నాకు పరమ శత్రువుగా మారిపోయింది. ఇప్పటికి కూడా నే నాశ్చర్యపడేది దేనికంటే నా వల్ల జరిగిన పొరపాటేమిటో, సీత అట్లా మారకుండా వుంటానికి నేను ఏంచేసి వుండవలసిందో నాకు తెలియలేదు— ఇప్పటికి అప్పటికీ ! ఈ క్షణాన కాలచక్రం ఎనిమిది సంవత్సరాలు వెనక్కు వెళ్ళి తిరిగి ఆ రోజు వచ్చినట్టయితే నేను ఎట్లా ప్రవర్తించాలో తెలుసుకో లేని స్థితిలో వున్నాను. నేనైనా మందమతిని కాను. నా కంటె మేధావులు ఇంకా చాలామంది వుండివుంటారు. నాకు విప్పరాని చిక్కుగావున్నది వారి చేతుల్లో ఇట్టే విడిపోవచ్చు ననే విశ్వాసంతో నా అనుభవం ఈ రూపంగా లోకానికి తెలియజేస్తున్నాను.

నాకా వుద్యోగం దొరికేవరకూ మే మిద్దరమూ— నేను నా సీతా— ఎంత అన్యోన్యంగా వుండే వాళ్ళం! నాకు సీత ఒక పెద్ద ఆనందకరమైన అనుభవం. సీత కాపరానికి వచ్చేనాటికి నాకు స్త్రీ వాంఛ స్పష్టంగా అనుభవంలోకి రాలేదు. కామమనేది ఎట్లావుంటుందో తెలుసుకోదగిన వయస్సుకాని, అనుభవంకాని, జ్ఞానంకాని నా కప్పటికింకా లేవు. సీతే మొదటిసారి నాలో కామం అనేదాన్ని రగిల్చింది. దాన్ని మళ్ళా శమింపచేస్తూ వచ్చింది. నేను సీతవల్ల ఎంత సుఖపడేవాణ్నో సీత కూడా నా వల్ల అంత సుఖపడేదని కూడా నేను నా మనస్సును సర్దిపుచ్చక సీతవల్ల నేను పొందుతూ వచ్చిన సుఖానికంతకూ ఆమెకు ఎంతో కృతజ్ఞుణ్ణి అయి వుండేవాణ్ణి.

మా అన్యోన్యత అంతటితో ఆగలేదు. సుగంధం ఒకచోట వుంచితే క్రమంగా ఇల్లంతా వరించినట్టు మా అన్యోన్యత మా దైనిక జీవితాన్నంతా ఆవరించింది. కామం

నాకు అనుభవంలో వుండి వుండనట్టే నాకింకా అనేక విషయాలు అనుభవం లేదన్న సంగతి సీత క్రమంగా బయట పెట్టింది. నాకు మాతృప్రేమ కూడా తెలియదు. నాకు మంచి స్నేహితులెవరూ లేరు. తల్లీ, స్నేహితులూ, పరిచారకులూ వుంటే ఎట్లా వుంటుందో నాకు సీత చూపింది. ఇంకొకరిచేత "అయ్యో, పాపం!" అనిపించుకోవటమనేది లేక, ప్రతిదానికీ నాకు నేనే సంపూర్ణంగా బాధ్యుణ్ని అవుతూ, నాకు నేనే సహాయుణ్నిగా వుంటూవచ్చిన నాకు కొత్తలో సీత ప్రతిదానికీ అడ్డం వస్తున్నట్టుండేది. కాని క్రమంగా ఆ భావం పోయింది. అనేక విషయాల్లో నేను సీత సానుభూతీ, సలహా కోరటమేకాక, మరికొన్ని పనులు సంపూర్ణంగా సీత బాధ్యత మీద సీతకే వదిలి వెయ్యటం నాకు లాభకరమూ సుఖకరమూ అనికూడా నేర్చుకున్నాను.

మధ్య మధ్య నన్నొకక్క ఆలోచన బాధిస్తూ వుండేది. సీత నాకు ప్రతిక్షణమూ ఏదో రూపంగా— అనేక వందల స్వల్పవిషయాలలో— ఇంత ఆనందం కలుగజేస్తున్నది; నే నామెకు తిరిగి ఏమి ఇస్తున్నాను? సీత ఇన్ని విధాల నాసుఖం గుర్తించగలదు; సీత కంటె నేను నాలుగేళ్ళు పెద్ద అయి ఉండి కూడా— నాకు పంధొమ్మిదో ఏడు, సీతకు పదిహేనో ఏడు ప్రవేశించింది — నేను సీత సుఖం ఏమిటో ఏమీ తెలియని స్థితిలో వుండటానికి కారణ మేమిటి ? ఎప్పుడన్నా సీతకు పూలు తెచ్చిపెట్టటమూ కాఫీహోటలునించి తినుబండారాలు తీసుకురావటమూ తప్ప నే నామెకు చెయ్యగలది ఏమీ కనిపించకపోయింది—సీత వెర్రిగా, అదివరకు ఎన్నడూ ఎవరినీ ప్రేమించనట్టు, ప్రేమించటం తప్ప !

ఇట్లా కాలం వెళ్ళుతూండగా అకస్మాత్తుగా మా నాన్న చనిపోవటంతో నా దారిద్ర్యం బయటపడ్డది. అప్పటికి నేను బి. ఏ. పూర్తి చేశాను కాని ఇంకా ఉద్యోగంలో ప్రవేశించలేదు. మా యిల్లు తప్ప మిగతా ఆస్తి యావత్తూ అప్పువాళ్ళ పాలయింది. మా నాన్న తన జీవితాన్ని రెండువేలకు భీమా చెయ్యకపోతే ఆ యిల్లు కూడా పోవలసిందే. ఈ స్థితిలో నేను అకస్మాత్తుగా నా తిండికీ గుడ్డకూ నా భార్యమీద ఆధారపడవలసి వచ్చింది.

నా భార్యకు కూడా తల్లి చిన్నతనంలోనే గతించటంవల్ల నా పెళ్ళి అయిన కొద్దికాలానికే సీత మాతృవతల్లి చనిపోగానే ఆవిడగారి తాలూకు ఆస్తి పధ్నాలుగెకరాల యీనాం మాగాణి భూమి సీతకు సంక్రమించింది. మే మిద్దరమూ అన్యోన్యంగా కాపరం చేస్తూ ఉండటం చూసి సహించలేనివాళ్ళు, "మగవాడు ఆడదాని అడుగులకు మడుగులొత్తితే కాపరం గుంభనగా వుండకేంజేస్తుంది? పధ్నాలుగెకరాలు వెంట తెచ్చిన పెళ్ళాన్ని బాగా చూడక ఏంచేస్తాడు?" అని అనేవాళ్ళు. ఇది నా చెవిన పడ్డప్పుడు నా కెంతో కష్టంవేసింది. ఈ సంగతి సీతతో అంటే నన్ను ఆ పదిహేనేళ్ళ వెళ్ళని పిల్ల ఎంతబాగా ఓదార్చిందో నాకే తెలుసు—"ఎంత ఓర్వలేని వాళ్ళంటారండీ!.... నా డబ్బు వచ్చి మీ ఒళ్ళోపడినట్టు ! మీరు, పాపం,

ఖానొత్తు ఒకదమ్మిడీ అయినా తిన్నట్టు ! నల్ల పూసలకు కూడా మీరే నాకు ఖర్చు పెట్టినట్టు!" ఈ మాటలు — లోకజ్ఞానం లేని అమాయకురాలు అన్న ఈ నిష్కపట వాక్యాలు — నా చెవిలో ఈ నాటికికూడా మోగుతూ ఉంటై!

ఇంకేం ? సీత ఈ మాటలని సంవత్సరమయినా వెళ్ళక పూర్వమే నన్ను నా సీత పోషించటం మొదలు పెట్టింది. మా మామగారికి ఏర్పాటు ఎంతమాత్రమూ రుచించలేదు. సీత ఆయన్ను నానా మాటలూ అన్నది. సీతకు తల్లి పోయినప్పటి నించీ తండ్రి దగ్గిర చాలా చనువూ స్వతంత్రమూనూ. తన కెంత యిష్టం లేక పోయినా ఆయన కుమార్తె ఇష్టప్రకారం చెయ్యవలసినవాడయినాడు.

మా యిద్దరికీ ఇది ఒక నూతన బంధం అయింది. ఇప్పటి సాంఘిక పరిస్థితుల్లో మగవాణ్ణీ ఆడదాన్నీ త్రాసులో తూస్తే మగవాడివైపు మొగ్గు చాలా జాస్తిగా ఉంటుంది. విద్యా జ్ఞానమూ, బలమూ, అవకాశమూ మొదలైనవన్నీ మగవాడి వైపే ఉన్నై. సాంఘికాచారాలు ఈ భేదాను తగ్గించటానికి బదులు మరింతచేసినై. కాని ప్రత్యేకించి మా దాంపత్య విషయంలో మొదటినుంచీ ఈ తేడా దాదాపు ఏమీ లేకుండా వచ్చింది. దానికి మా యిద్దరి అన్యోన్యతా, లోకజ్ఞానం లోపించటమూ కూడా సహాయపడినై. అప్పటికీ ఇంకా నావైపు మొగ్గు జాస్తి అయి వుంటే నా దరిద్ర్యం వచ్చి దాన్ని సరిచేసింది.

సరిచేసిందని ఇప్పుడంటున్నాను. సీతవైపే మొగ్గు జాస్తి అయిందని నేను నా అంతరాత్మలో భావించి వుండాలి.

నేను అమిత గర్విని దురభిమానినీ అని చెప్పలేదింకా. అనేక సంవత్సరాలు ఎవరి ప్రాపకమూ లేకుండా జీవించినవాణ్ణి కావటంవల్ల ఆ దుర్గుణాలు నాకబ్బి ఉండవచ్చును. లేక మా అమ్మ పోలిక నాకు వచ్చి ఉండవచ్చును. ఆవిడ అమిత అభిమాని అని చెప్పుకునేవారు— చనిపోయిన మనిషిని దురభిమాని అనటం ఇష్టం లేకనేమో !

నా భార్య ఆస్తిమీద జీవించటం నా అభిమానానికి గొడ్డలిపెట్టే. కాని అక్కడ నాకు సీత మీదకల ప్రేమ నా గర్వాన్ని అణిచివేసింది. అదే సీతకాక మరొకరై ఉండినా, సీతకు నాకూ అంతస్నేహం లేకపోయినా నేనా ఏర్పాటుకు ప్రాణం పోయినా అంగీకరించి ఉండను. సీత తూకం నా తూకంకంటె జాస్తి అయిందన్న ఆలోచన నా అంతరాత్మలో ఉండనే ఉంది కనుక, ప్రేమ నా గర్వాన్ని జయించగానే— అంటే ఈ ఏర్పాటుకు నేను తల ఒగ్గిన మరుక్షణంనుంచీ— నేను సీతకు భృత్యుడల్లే ప్రవర్తించసాగాను. అన్ని ఆలోచనల్లోనూ సీతది పైచెయ్యి కానిచ్చాను. సీతను నాకంటె ఉత్కృష్టతరమైన వ్యక్తిని చూసినట్టే చూసేవాణ్ణి. నా జడ్జిమెంటు— నా స్వతంత్రబుద్ధి—వినియోగించటం పూర్తిగా మానేశాను. ఇంటి యాజమాన్యం సీత చేతిలోకి పూర్తిగా వెళ్ళనిచ్చాను. ఆడపనులు చెయ్యటంలో ఎంత నిధి అయినా సీత మగ పెత్తనం నెత్తిన వేసుకుని చిన్న చిన్న పొరపాట్లు

చెయ్యటం ప్రారంభించింది— అనుభవం లేని నేనే పట్టగలిగినవి. కాని నేను సీత తప్పులు దిద్దేవాణ్ణికాను. నా కళ్ళకవి తప్పులుగా కూడా కనపడేవికావు !

ఇదంతా ఒక విధంగా చూస్తే నేను నా వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోవటమే. కాని దానికి నాకేమీ అభ్యంతరం లేకపోయింది. నాకు సీతమీదగల ప్రేమ నా స్వాభిమానం నెత్తిన కూర్చోకపోతే నేను నా వ్యక్తిత్వాన్ని అంత సులభంగా విసర్జించేవాణ్ణి కానేమో కాని, అభిమానం ఎప్పుడయితే తల ఎత్తలేక పోయిందో అప్పుడు సీతమీది నా ప్రేమా అభిమానమూ ఏక చక్రాధిపత్యం వహించినై.

నా సహజగర్వం తాత్కాలికంగా ఓడిపోయినా ఓటమికి అంగీకరించలేదని తోస్తుంది. నా ప్రేమ చాటున పడిపోయి కూడా అది అదృశ్యంగా పనిచేస్తూ ఉండి ఉండాలి. "దబ్బున ఉద్యోగం సంపాదించు. ఇట్లా భార్యమీద పడి ఎంత కాలం జీవిస్తావు ?" అనేది నాగర్వం, అదను కనిపెట్టి. దాని ప్రేరణకు నా మనస్సు కలతపడటం ప్రారంభించగానే, నా ప్రేమ నన్ను నానా చివాట్లూ పెట్టేది:

"నీ మగదుర్బుద్ధి పోనివ్వలేదు. సీతను నీ కంటె ఎక్కువగా చూడవలసి రావటం నీకు కష్టంగా ఉంది. ఆమెకు రుణపడితే ఆమెకు నువు పయిచెయ్యిగా ఉండలేవనేగా నీ దిగులు ! తన సొత్తు నువు తింటున్నావన్న దిగులు సీతకులేదని నువ్వెరగవా ? సీత నీ విషయం తండ్రితో పోట్లాడటం నువు కళ్ళారా చూడలేదా ?" అనేది నా ప్రేమ. అప్పుడు మళ్ళా మనస్సు కుదుట పడేది.

కాని నా గర్వం మళ్ళా సమయం చూచి, "ఓరి మూర్ఖుడా ! నిన్ను ఒక సంవత్సరం మేపటానికి సీత ఉబలాట పడవచ్చు. పది సంవత్సరాలు కూడా మేపవచ్చు. శాశ్వతంగా నిన్ను భరించటంవల్ల మీ ఇద్దరి ప్రేమకూ ఎంత అపాయం ఉందో ఆలోచించు !" అనేది. వెంటనే కోటు తొడుక్కుని ఎవరినన్నా చూసిరావటానికి బయలుదేరేవాణ్ణి !

నా ఉద్యోగ ప్రయత్నం ప్రత్యేకంగా ఒక కధగా రాయవలసిన విషయం. మొదట మొదట ఉద్యోగం దొరకటం నాకొక కష్టమైనదాన్లో జత కాదనే అహంకారంతో ఉండేవాణ్ణి. చిన్న చిన్న ఉద్యోగాల్లో శాశ్వతంగా బతకటం నాకే ఇష్టం లేదు కాని వాటికి నేను పాల్పడితే ఏ వంక పెట్టి నా కివ్వమంటారు ? మంచి ఉద్యోగం వచ్చినప్పుడే చేతాంలే, ఇతరుల మాదిరిగా మనం తక్కువ జీతాలకు చిన్న ఉద్యోగాలలో ప్రవేశించవలసిన అగత్యమేమిటనుకునే కాలం వెళ్ళిపోయింది: చిన్న ఉద్యోగమో చచ్చు ఉద్యోగమో వెంటనే సంపాదించి తీరాలి. కాని చింత చచ్చినా పులుపు చావక ఉద్యోగం రాకేం చేస్తుంది లెమ్మని చాలా నిర్లక్ష్యంగా ఉంటూ, నాకా ఉద్యోగాలివ్వదగిన వాళ్ళతో ఆకాశం నుంచి దిగివచ్చిన వాడల్లే మాట్లాడేవాణ్ణి.

ఆరునెలలు ప్రయత్నంచేసినా నాకొక 30 రూపాయల ఉద్యోగం దొరకలేదు. ఉద్యోగంకోసం నేను తమను ఆశ్రయించానన్న కారణం ఆధారం చేసు

షని ఉద్యోగం ఇచ్చేవాళ్ళు నాతో అమిత అమర్యాదగా, వీధి బడిపంతులు తన షిద్యార్థులతో మాట్లాడే ధోరణిలో సంభాషించసాగారు. కొంత కాలంవరకూ, "ఛీ ! ఇటువంటి వెధవలకింద ఉద్యోగం చేసేదేమిటి ? అయినా ఇదేమంత గొప్ప ఉద్యోగమని!" అని నన్ను నేను సముదాయించుకునే వాణ్ణి. కాని క్రమేణా నా గర్వం గాయపడసాగింది. ఉద్యోగాలిచ్చే వాళ్ళంతా నా మీద కచ్చపట్టారా? లేక నేను ఎంత పచ్చు ఉద్యోగానికి కూడా అర్హుణ్ణికానా ? అందరూ నామీద పగపట్టారని నన్ను నేనే సమ్మించుకోలేక పోయినాను. ఇక మిగిలిన అనుమానం నా గర్వాన్ని దాని ద్వారా నా మనస్సునూ దహించసాగింది. ఆ పరిస్థితులలో సీత నన్ను ఎన్నో విధాల అనునయించకపోతే ఏమయి ఉండేవాణ్ణో ?....తప్పక బాగుపడి ఉండే వాణ్ణేమో !

కాని సీత గాయపడిన నా మనస్సుకు చక్కగా శైత్యోపచారం చేసింది. వాళ్ళంతా వెధవలన్నది. వాళ్ళు నా తెలివితేటలు కనుక్కోలేరన్నది. "పోనివ్వండి, వెధవ ఉద్యోగం. ఈ కాని ఉద్యోగాల కోసం ఎందుకు హైరాన పడతారు ? మనకు సుఖంగా జరిగి పోవడం లేదా?" అన్నది సీత.

"కాదు, సీతా ! నేను, పాపం, నీకేమీ పెటకపోగా, నీ సొమ్ముతింటూ కూర్చోటమేమిటి? రేపు పిల్లలు పుటుకొస్తారు. అప్పుడింత హాయిగా వెళుతుందా?" అన్నాను.

సీత చిన్నబుచ్చుకుని, "మీరట్లా అంటే నాకు కష్టంగా ఉంటుందండీ ! నా దబ్బేమిటి ? నాకటువంటి భేదాలు లేవు ! అంతగా అయితే పిల్లలు పుట్టిన తరువాత ఉద్యోగం కోసం తిరుగుదురు గానిలెండి !" అన్నది.

"కాదు సీతా ! నాకెందుకు ఉద్యోగం దొరకదో చూడాలి. ఆత్మగౌరవం కోసమైనా నేను ఉద్యోగం సంపాదించి తీరాలి," అన్నాను.

సంపాదించి తీరాను కూడానూ !— కాని నాతెలివివల్ల కాదు, చిన్నప్పుడు మా యింట్లో వారాలు చేసుకుతింటూ, నలుగురు పెద్దమనుష్యుల సహాయంవల్ల ఇంతకు ముందే మంచి ఉద్యోగం సంపాదించిన ఒకడిదయవల్ల. మా ఊళ్ళో కొత్తగా స్థాపించిన బాంకుకు అతను సెక్రటరీగా ఉంటున్నాడు. అతనంటే అందరికీ అభిమానం— ప్రెసిడెంటుగారికి మరీనూ. అతని శిఫార్సువల్ల నాకు కూడా అందులోనే అరవై అయిదు రూపాయల ఉద్యోగం లభించింది.

ఆనాడు నాలో కలిగిన మార్పు వర్ణనాతీతం. కొంతకాలంనించీ వాయు ప్రచారం ఎరగని వాణ్ణి బయటికి తెచ్చినప్పుడు వాడి ఊపిరితిత్తులకు కలిగే సంతోషం నాకు కలిగింది. అయితే నా విషయంలో ప్రత్యేకత ఏమిటంటే అదివరకల్లా నాకు పూరిగా ఊపిరి సలపటం లేదని నేను ఈ క్షణానే గుర్తించాను. విరిగిన వెన్నెముక సరి అయినట్టు కూడా అయింది నాకు. ఆదివరకల్లా నా వ్యక్తిత్వాన్ని భోషాణంలోపెట్టి తాళంవేసి ఉంచుతూ వచ్చానని కూడా వ్యాకిప్పుడే తెలిసివచ్చింది.

ఇకనించీ నేను సీతతో సమానంగా తూగగలనని ధైర్యం వచ్చేసింది. ఇక మా ఇద్దరి అన్యోన్యతకూ నా దారిద్ర్యం అడ్డం వస్తుందని భయంలేదు. నేను ఉద్యోగం సంపాదించలేనివాణ్ణి అవుతానేమో అన్న దిగులుకూడా పోయింది. నా జీవితంలో అదొక పర్వదినంగా కనిపించింది.

ఆనాటి ఉత్సాహంలో నేను ఉద్యోగం సంపాదించినందుకు సీత పొంగి పొర్ల లేదన్న విషయం కూడా నేను గమనించలేదు. నా ఉద్యోగం సీతలో కలిగించిన మార్పు నేను సరిగా గమనించలేదు. ఆ మార్పు అర్థం చేసుకోవటం అసలేలేదు. పగలల్లా ఆఫీసులో గడిపివచ్చి సీత ఉత్సాహంగా లేకపోవటానికి నా ఉద్యోగమే కారణమని నేనెట్లా ఊహించగలను ? నేను ఇంట్లోలేని సమయంలో ఏం జరిగినా జరిగి ఉండవచ్చును — అల్ప విషయాలు ! కొంపకూలి సీతమీద పడ్డదన్నంత అనుమానం నాకు కలగటానికి తగినంత మార్పు మాత్రం సీతలో కలగలేదు.

ఆఖరుకు నాకు జీతంవచ్చిన నాడు పాపం పండి బద్దలయింది! నేను ఆఫీసులో జీతం తీసుకుని నేరుగా బజారుకువెళ్ళి రెండు కోట్లకూ నాలుగు చొక్కాలకూ గుడ్డ తీసుకుని టెయిలరుకిచ్చి, నాకు కొన్ని ధోవతులూ, సీతకు రెండు చీరలూ, రెవిక గుడ్డలూ తీసుకుని ఇంటికి వచ్చాను. అవిచూసి సీత మొహం వికసించటంచూసి ఆనందింతామని! నా మొహాన అదివరకే చిరునవ్వు మొలకెత్తి ఉంది. ఏమీ మాట్లాడ కుండా, మొహాన ఎటువంటి వికారమూ లేకుండా సీత నా చేతిలోంచి గుడ్డలూ, నమూనాలూ తీసుకుని వాటిని దీర్ఘంగా పరీక్షించసాగింది. నాకు కలిగిన ఆశ్చ ర్యంలో నా చిరునవ్వు మాయమై ఉంటుంది. గడిచిన నెల రోజులకుగాను నేను సీత మొహాన్ని పరిశీలనగా చూడటం అదే మొదటిసారి.

సీత పరీక్ష ఎంతకూ పూర్తి కాలేదు. ఆ గుడ్డల హృదయాలు పగలదీసి వాటి పాతకం యావత్తూ అర్థం చేసుకోదలచుకున్నట్టు కనిపించింది సీత. ఆమె నోటివెంట ఇంకా ఏమీ రాక పూర్వమే నాకు అవమానం కలిగినట్టయింది. కనీసం నా ఉత్సాహమైనా విరిగిపోయింది.

"ఎట్లా ఉన్నై గుడ్డలు ?" అన్నాను. నాకు కలగటం ప్రారంభించిన నిరు త్సాహం నా గొంతులో కనిపించకుండా ఉండాలని వ్యర్థప్రయత్నం చేస్తూ.

"బాగానే ఉన్నై. ఈ కోటుగుడ్డ పరుపులు కుట్టటానికి బాగా పనికి వస్తుం దేమో, ఈ చొక్కా గుడ్డలు దిళ్ళు కుట్టటానికి, ఈ రెవిక గుడ్డలు గలీబులకూ ! ఈ చీరలోనే ఉదారంగు పోగుంటే ఇంకా బాగుండేది. మీ ధోవతులు కూడా ఒక్క ఉతుక్కే దారప్పడి పొయ్యేటట్టున్నై," అన్నది సీత - పరిహాసంగా కూడా కాదు. నిర్వికారంగా ! పిల్లవాడి జ్ఞానాన్ని పరీక్షాధికారి తనిఖీ చేస్తున్నట్టు ! తన మాటలవల్ల నాకు కలిగే బాధ తన్ను ఏ మాత్రమూ బాధించనట్టు !

నేను లోలోపల మండ సాగాను.

"అయితే ఈ గుడ్డల్లో సువు ఒకటైనా పాసు చెయ్యలేదన్నమాట!" అన్నాను వణకుతున్న గొంతుతో, నా ఉద్రేకాన్ని అణిచి పెట్టాలని ప్రయత్నమైనా చెయ్యకుండా.

"పోనివ్వండి. ఇప్పుడేం చేస్తారు? ........ పోనీ నాతో ముందుగా మాట మాత్రం చెబితే ఏం?"

"ఇప్పుడు మించిపోయిందేమీలేదు. ఆ చీరలు తిరిగి పుచ్చుకుంటాడు," అన్నాను.

"అయితే ఇవి మంచివి ఉంటే తీసుకురండి!"

నేనా చీరలు తీసుకు వెళ్ళి షాపులో ఇచ్చి వట్టిచేతులతో ఇంటికి తిరిగివచ్చాను. సీత నేనేమీ తీసుకురాలేదని గమనించింది, కాని వెంటనే నన్నేమీ అడగలేదు. ఆ విషయం నేను గమనించాను.

ఎప్పుడో నేను భోజనం చేస్తుండగా సీత "మీరేమి తిరిగి తీసుకురాలేదల్లే ఉందే" అన్నది. సీత దేన్ని గురించి మాట్లాడుతున్నదో నాకర్థం కానట్టు నటించాను కాస్సేపు. ఆఖరుకు "నీకు నచ్చే చీరెలు బజార్లోలేవు. ఉన్నా నేను గుర్తించలేకపోయినాను." అన్నాను. ఆ మాటమీద సీత ఏమీ వ్యాఖ్యానం చెయ్యలేదు.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. నా మనస్సు చాలా కలత పడ్డది. నా బుద్ధి సన్నిపాత రోగి మనసల్లే ఒక్కసారే పరిపరి విధాల వెళ్ళింది. దానికొక దోవా డొంకా లేదు. కాని నేనా రోజు తేల్చుకున్నదిదీ:

సీత సొమ్ము కొంతకాలం తినటం చాలా బుద్ధితక్కువ పనిగా పరిణమించింది. ఆ రోజుల్లో నేను తప్పనిసరిగా కొంత వినయ విధేయతలూ కృతజ్ఞతా సీతకు చూపి ఉండాలి. నా వ్యక్తిత్వమూ నా అభిరుచులూ సీత వ్యక్తిత్వానికీ అభిరుచులకూ దాస్యంచేసి ఉండాలి. తిరిగి ఆ వ్యక్తిత్వాన్నీ అభిరుచులనూ నేను వ్యక్తపరచ దగిన పరిస్థితులు కలగటం సీతకు రుచించలేదు. నా వ్యక్తిత్వంమీదా అధికారం చలాయించటానికి వాటిని శాసించటానికీ అలవాటు పడిన సీత "మాటమాత్రం నాతో ముందుగా చెబితే ఏం?" అనక ఏం జేస్తుందీ? సీత నాకు చూపిస్తూ వచ్చిన ప్రేమ కూడా ఇప్పుడు సంశయాస్పదంగానే కనిపించింది. అది మనం విశ్వాసంగా ఉండే మన కుక్కమీద చూపే ప్రేమ. సీత నాకు చూపిన సానుభూతి కూడా అటు వంటిదే. నాకు ఉద్యోగం దొరికిన మర్నాడు నేను తనకు బానిసగా ఉండటం మానేస్తానని సీతకు తెలుసు. అందుకనే ఉద్యోగం రానందుకు నన్ను విగులు పడనిచ్చేది కాదు సీత. నేను ఉద్యోగ ప్రయత్నం చెయ్యకుండా ఉండాలని సీత ఎంత ప్రయత్నం చేస్తూ వచ్చిందో నాకిప్పుడు తెలిసింది. "కాని ఉద్యోగాల కోసం ఎందుకు తిరుగుతారులెస్తురూ, కాళ్ళుపడిపొయ్యేట్టు!" అని ఎన్నిసార్లో అంది సీత.... నెలకు ఏ పాతిక రూపాయలో వ్యయంచేసి— నా సొంత ఖర్చు అంతకంటె ఉండదు—సీత నా ఆత్మను కొనాలని చూసిందన్నమాట!

ఈ విధంగా ఆలోచించుకుపోతే సీతకు నాకూ ఉంటూ వచ్చిన అన్యోన్యత యావత్తూ నా బానిసత్వంగానూ, సీత నిరంకుశత్వంగానూ, సీత నామీద చూపిన ప్రేమ యావత్తూ కుట్రగానూ, నేను సీతమీద చూపిన ప్రేమ గుడ్డితనంగానూ కన బడసాగింది. నా రక్తం ఉడికిపోయింది. నా అభిమానానికి అంత దెబ్బ యెన్నడూ తగలలేదు!

ఆనాటినించీ నాకూ సీతకూ మధ్య ఒక అగాధం ఏర్పడి అభివృద్ధి కాసాగింది. మనిషికీ మనిషికీ ఉండే తేడాలు వారి అన్యోన్యతను బాధించకుండా చెయ్యగలిగి సది సానుభూతి. సీతయందు నాకూ నాయందు సీతకూ సానుభూతి ఎప్పుడైతే అంత రించిందో, ఆ క్షణం నించీ మేమిద్దరమూ ఒకరొకరం ప్రతిఘటించ సాగాం. నా అభిప్రాయాలను సీత తృణీకరించితే నాకు సీతమీద నైతికంగా ఉన్న హక్కు నంతా వినియోగపరిచి నేను సీతను శాసించసాగాను. చివరకు కూరగాయల దగ్గిర న్నించీ నాయిష్టమే చెల్లించుకుంటూ రాసాగాను. ఒక్క నా ఇష్టం చెల్లటమే కాదు సీత యిష్టం చెల్లకుండా కూడా చూడసాగాను. నన్ను ప్రతిఘటించటానికి అవ గింజంత అవకాశం ఉంటే జారవిడవటం లేదు సీత. నాకెన్ని విధాల అసంతృప్తి కలిగించటానికి వీలుందో అన్ని విధాల అసంతృప్తి కలిగిస్తున్నది.

సీత తను ఓడిపోయిన సంగతి ఎందుకు గుర్తించకూడదూ ? తన పెత్తనం అయిపోయిందనీ నా పెత్తనం ప్రారంభమయిందనీ ఆ మనిషి ఎందుకు తెలుసు కోరాదూ? ఇంకా నన్ను వశపరుచుకుందామని ఆశవుంది కాబోలు సీతకు ?- ఈ విధంగా అనుకుని నేను మరింత కాఠిన్యం అవలంబించటం మొదలు పెట్టాను. నా ప్రయత్నం సీతకువీ విధంగా ఊపిరి సలపకుండా చెయ్యాలని. కాని నా ప్రయత్నం ఏదో విషయంలో నిష్ఫలం అవుతూనే వస్తున్నది. అందువల్ల నా క్రౌర్యం అంతు లేకుండా విజృంభించ సాగింది.

నే నప్పటికి చాలా అజ్ఞానిని - నేను తెలుసుకోలేక పోయినప్పటికీ, అందు కనే సీతను సొంతంగా జయించటం సంభవమనుకున్నాను. సంసారం ఒక వ్యక్తి యొక్క సంపూర్ణ శాసనంకింద సాగటం అసంభవం. అది రెండు కత్తుల ఒర- కాదని నేను భ్రమపడ్డాను. ఆడదాని వంతు రాజ్యంలో మగవాడు అడుగుపెట్టి ఆడదాన్ని జయించటం అసంభవం. మగవాడి రాజ్యంలో మగవాణ్ణి ఆడది జయిం చటం కూడా అసంభవమే. ఎవరి పరిపాలనలో వారికి నేర్పు ఎంత అవసరమో స్వేచ్ఛ కూడా అంత అవసరం. సంసారానికి సంబంధించిన సమస్యలన్నీ ఈ రెంటి లోనూ ఏదో ఒకటి— లేక రెండూ— లోపించిన చోటనే బయలు దేరుతున్నై.

నా మటుకు నేను నా కిష్టమై సీతకు ఇష్టంకాని కూరలుగాచూసి ప్రతిరోజూ తీసుకురాగలను. కాని సీత తొమ్మిదిన్నరకో పదింటికో నాకు భోజనం చేసి పెట్టే ట్టు చెయ్యటం ఎట్లా? ఒకరు ఒకపని చెయ్యకుండా చేయ్యవచ్చును కాని, చెయ్యటం ఇష్టం లేనప్పుడు చేయించటం ఎట్లా ?

నా గర్వమూ దురహంకారమూ నా మెదడును ముట్టడించి ఉండటంవల్ల నాకా మాత్రం తట్టలేదు. సీతను తిట్టటం మొదలు పెట్టాను. ఒకసారి నోటికి స్వేచ్ఛ ఇచ్చిన తరవాత అది చాలా దూరం వెళ్ళగలదు— నా నోరు వెళ్ళింది. నాకంటె నాగరికత కల మనిషి కావటం చేతనో, నా అంత గర్వి అయినప్పటికీ నా అంత దురహంకారి కాకపోవటం చేతనో, సీత నేను వెళ్ళినంత దూరం వెళ్ళక పోయినా కొంతవరకు నోటికి స్వేచ్ఛ ఇచ్చింది. నేను సీతను — కొట్టటం కూడా అలవాటు చేశాను.

మేము ఎంతదూరం వెళ్ళ వలసి ఉందో, మా పతనం ఎక్కడ అంతమై పోతుందో నేను ఊహించలేక పోయినాను. నిన్న నోటివెంట అనటానికి వెరిచిన మాటలు ఇవాళ ధైర్యంగా అనేస్తున్నాము. నిన్న చెయ్యటానికి వెరిచిన పనులు ఇవ్వాళ చేసేస్తున్నాము. సీత నేను కొంత కాలం తన డబ్బు తిన్న సంగతి తరుచు ఎత్తుతూ ఉండేది. తన డబ్బు ! "నాకటువంటి భేదాలులేవు?" అన్న సీత నోటివెంట ఆమాట !

మేమిట్లా ఎందుకు తలపడ్డామో కూడా మరిచిపోయినాం. ఒకరి నొకరం హింసించుకోవటంవల్ల మాకేమైనా తృప్తికలుగుతున్నదా అని కూడా మేం ఆలో చించుకోలేదు. అంత ఆలోచించడానికి మాకు వ్యవధానంలేదు, ఓపికాలేదు.

మధ్య మధ్య నేను సీతకు ఉపన్యాసాలిచ్చే వాణ్ని: "నాకు ఆడవాళ్ళను తిట్ట టమూ, కొట్టటమూ అంటే ఎంత అసహ్యమో ఆ పరమాత్ముడికి తెలుసు. నాచేత అటువంటి పనులు కూడా చేయిస్తున్నావు నువ్వు ! .. ..." అట్లా అంటే నా అంత రాత్మ తృప్తిపడేది—నేను నిజంగా ఏ పాపమూ ఎరగను, తప్పంత సీతదేనని. నా మాదిరిగా పాశ్చాత్య సారస్వతం చదవని సీతకు అటువంటి ఉపన్యాసాలు చేసే శక్తిలేదు.

అప్పుడప్పుడూ నాకు కాస్త జ్ఞానోదయం కలిగి నిజమైన పశ్చాత్తాపం కలి గేది— నా ఒక్కడి తరఫునా అనుకునేరు; కాదు, మా ఇద్దరి తరఫునా. మేం ఒక ప్పుడు— ఎంతోకాలం కిందటకూడా కాదు మళ్ళీ!— ఎంత ఆనందం అనుభ వించాం! ఇప్పుడైనా ఈ విధమైన వైరం పెంచుకుని ఎంత సుఖం చేజేతులా పోగొట్టు కుంటున్నాం! ఇంకా అంతా మించిపోలేదేమో! సీత నాకు లొంగకపోతే నేనే సీతకు లొంగిపోయి బతికి వుండే నాలుగురోజులూ ఇంత సుఖమైనా అనుభవించరాదూ ? ఎందుకొచ్చిన అహంకారం? దీనివల్ల సాధించ దగినది చీమ తలకాయంత కూడా లేనప్పుడు!

సీతతో నాలుగైదు సార్లు సంధిచేసుకుని చూశాను. కాని నా వేదాంతం ఫలి చెయ్యలేదు. సీతకు కూడా అటువంటి వేదాంతం లేకపోవటంవల్ల నేను రాజీగా ఉద్దేశించినది నా అపజయంగా పరిణమించింది. అందువల్ల నేను పొందగలిగిన క్షణికసుఖమూ కృత్రిమసౌఖ్యం మాదిరిగా ఉండటమే కాక మర్నాటినుంచీ సీతకు

నన్ను చూస్తే అలుసు జాస్తికాసాగింది. ఇట్లా నాలుగైదుసార్లు జరిగిన తరవాత ఇక రాజీ ప్రయత్నం చెయ్యనని ప్రమాణం చేసుకున్నాను.

ఆ పట్టున పూర్తిగా నెలా పదిహేనురోజులు నేను సీతతో ఎటువంటి సంబంధమూ లేకుండా ఉన్నాను. ఆ రోజుల్లో నా మనసు బురదగుంట మాదిరిగా అయిపోయింది. రాత్రివేళ ఒంటరిగా పడుకుని అనేక పిచ్చి ఊహలు ఊహించేవాణ్ణి—సీతను వదిలేసి ఇంకో పెళ్ళి చేసుకుందామనీ, ఎవతినైనా ఉంచుకుందామనీ, విచ్చలవిడిగా తిరిగి సమస్తమైన వ్యాధులూ అంటించుకుని ఆ తరువాత సీతను కూడా బాధపడేటట్టు చేతామనీ, ఏమిటేమిటో ! అట్లా ఆలోచిస్తూ ఆలస్యంగా నిద్రపోయి జాముపొద్దెక్కి లేచి, చప్పున కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకు వెళ్ళేవాణ్ణి.

నీటిని కాచటం మొదలు పెడితే కొంత వేడెక్కిన మీదట అది ఆవిరిగా మారిపోయినట్టు మా సంసారం ఈ పరిస్థితులలో ఎప్పటికైనా విచ్ఛిన్నం అయి తీరవలసి ఉంది. కాని ఆ పని అంతత్వరగా జరుగుతుందని భావించటంలేదు. తను చేస్తున్న పాపానికి అంతత్వరలో ఫలితం వస్తుందని ఏ పాపికూడా అనుకోలేడు-అది ఎంత ఆలస్యంగా వచ్చినాసరే.

ఆనాడు నేను చాలా చిరాకుతో ఇంటికి వచ్చాను. వస్తూనే ఏదో వంక పెట్టి సీతను నానా తిట్లూ తిట్టాను. భోజనం సరిగా చెయ్యకుండా వెళ్ళి నా పక్క మీద పడుకున్నాను. అలిసిపోయి ఉన్న నా శరీరానికి వెంటనే నిద్ర పట్టింది. నాకు మళ్ళీ నిద్ర మెలుకువ వచ్చేటప్పటికి ఒంటి గంటన్నర అయింది. నా శరీరానికి బడలిక తీరింది. మనస్సుకూడా ఎంతో నిర్మలంగా ఉంది. నా మనస్సు అంత నిర్మలంగా ఉండి ఎన్నో యుగాలయినట్టుంది. నాకా క్షణాన సీత మీద వాంఛ కలిగింది. నేను లేచి సీత మంచం పక్కన నిలబడి నిద్రపోతున్న సీతవంక చూశాను. ఆమె మొహం ప్రశాంతంగా ఉంది. ఈ మొహం నన్ను చూడంగానే మిట మిటలాడే మొహం కాదు. ఈ సీత మొదట నేను ప్రేమించిన సీత. మా ఇద్దరికీ చెడిపోక పూర్వం ఒక రాత్రివేళ ఇట్లాగే నిద్రాభంగం కలిగితే నేను సీత మొహం పరీక్షచేస్తూ మేలుకుని ఉండేవాణ్ణి. నేనటువంటి సమయాల్లో తన చెక్కిళ్ళు నిమిరినా, జుట్టు సర్దినా, ముద్దు పెట్టుకున్నా సీత ఎంత నిద్రలో ఉండి కూడా నా స్పర్శ గుర్తించిన దానల్లే సూక్ష్మంగా చిరునవ్వు నవ్వి తన చెయ్యి నామీద వేసేది. ఆ సీత నాకిప్పుడు జ్ఞాపకం వచ్చింది. నేను ఆ ఆలోచన భరించలేక పోయినాను. సీత కళ్ళు తెరచి నన్ను చూసి నవ్వకూడదూ ? ఈ నాలుగైదు మాసాలలో మేమిద్దరమూ అన్న మాటలూ చేసిన పనులూ ఏ భగవంతుడైనా తుడిచి వెయ్యరాదూ ?

నేను సందేహిస్తూ—సగం అయిష్టంగానే —సీత భుజంమీద చెయ్యివేశాను. ఆమె చప్పున కళ్ళు తెరిచి చూసింది. వెంటనే ఆ మొహంలో నాకు రోజూ అను

భవం ఉన్న పరివర్తన వచ్చేసింది. సీత నన్నుచూసి నవ్వుతుందని ఆశ ఉండటానికి నాకేమీ ఆధారం లేకపోయినప్పటికి హతాశుణ్ణి అయినాను. ఆ చిట్లించిన మొహం చిట్లించినట్టే ఉంది. సీత మళ్ళీ కళ్ళు మూసుకుని నా చేతిని విదిలించి పక్కకు తిరిగి పడుకుని మళ్ళీ వెంటనే గాఢనిద్రలో పడ్డదానల్లే శ్వాస పీల్చటం మొదలుపెట్టింది. ఆమె నిద్ర పోవటం లేదని ఆమె మొహం చిట్లింపే చెబుతున్న ది.

అంతటితో నా సుఖ స్వప్నం భగ్నమయింది. కలకదేరిన నా మనస్సు మళ్ళా కెలికి నట్టయింది. నాకు పట్టరాని కోపంవచ్చి సీతను రెక్కపట్టుకుని ఒక్క ఊపున లాగి కూర్చోపెట్టాను. సీత ఒక ముక్కు ముక్కి నా చేతిని బలవంతాన వదిలించుకోవాలని ప్రయత్నించింది. నేను వదలలేదు. సీత నా వంక "ఏమిటీ ఈ దౌర్జన్యం ? నేనెవరో ఎరుగుదువా?" అన్నట్టు చూసింది. నేనా చూపు భరించ లేకపోయినాను. రెండో చెయ్యి చాచి సీత చెంపమీద నాశక్తికొద్దీ కొట్టాను. ఆ దెబ్బతో నా ఆగ్రహం రెట్టింపయింది.

"ఏమిటా వెధవచూపు ? నన్నేం చెయ్యగలవని ? ఆ చూపేమిటంటాను. !" అని సీత దవడలు రెండూ పొంగిపోయేటట్టు కొట్టాను. ఎన్ని దెబ్బలు కొట్టానో నాకే తెలియదు. సీత నాకు చేసిన దానికీ చేసిందని నేననుకున్న దానికి — అన్నిటికీ నాకసి తీర్చుకోవాలనిపించింది. నాకసి తీరక పూర్వమే నా చేతులు నెప్పెత్తినై! . .

మర్నాడే సీత తన సామాను యావత్తూ తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

ఆరు సంవత్సరాలు గడిచినై.

ఆ కాలంలో నేను సీతను స్మరించని రోజు లేదు—నాదగ్గిరనించి వెళ్ళి పోయిన సీతను కాదు, నా దగ్గిరికి వచ్చిన మొదటి సీతను. మొదటి సీతను ప్రేమిం చటం మాననే లేదు నేను. ఆ సీతనూ ఆమె వల్ల నేను పొందిన సౌఖ్యాన్నీ నేను మరవకలిగితే మనిషినేకాను. ఈ రెండో సీత నాకు అర్థం కాలేదు. ఈమెను నేనెన్నడూ కోరలేదు, కోరను. నేను పడ్డ మనోవ్యథ కాని పశ్చాత్తాపం కాని ఆ మొదటి సీతకోసమే. ఆ సీత ఏమైపోయింది ?

నా అసలు సీత జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు మా బావమరిది ప్రసాదు జ్ఞాపకం వచ్చేవాడు. ఆ సీతతోపాటు నేను ప్రసాదునుకూడా పోగొట్టుకున్నాను. వాడు అక్కకంటె రెండేళ్ళు చిన్న. వాణ్ణి కని మా అత్తగారు మరణించింది. వాడికీ వాడితండ్రికీ (మామగారికి) ఒక్క క్షణం పడేదికాదు. ఆ పసివెధవతో ఆయన ఎప్పుడూ కీచులాడే వాడు, వాణ్ణి కవ్వించి వాడిచేత ఏదో అనిపించి "అదుగో ఆ మాట అన్నావు !" అని గోలెత్తేవాడు. సీత అన్నట్టు వాళ్ళిద్దరిదీ సవతిపోరు.

సీతకు తమ్ముడంటే అమిత ప్రేమ. తండ్రి తను చెప్పినట్టు వినేవాడు కనక తండ్రికీ తమ్ముడికీ తను మధ్య ఉంటూ, ఆయనవల్ల వాడికి జరగనిదంతా తన ద్వారా జరిగేటట్టు చేసేది. సీత సహాయమే లేకపోతే వాడు తండ్రితో వేగలేక ఎన్నడో ఆత్మహత్యో ఎక్కడికైనా లేచిపోవటమో ప్రయత్నించి ఉండును.

నేను ఆఖరుసారి వాణ్ణి చూసినప్పుడు, వాడికి పదమూడేళ్ళుంటవేమో! వాడి లేత మొహమూ, కళ్ళ మీదికి పడే ఉంగరాలజుట్టూ, విశాలమైన కళ్ళూ జ్ఞాపకం వచ్చేవి నాకు, వాడు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా. అయితే వాడు మాత్రం ఈ ఆరు సంవత్సరాల కాలంలో చాలా మారి ఉండాలి. వాడి కిలోపల పెళ్ళి, పెళ్ళాం కాపరానికి రావటమూ కూడా జరిగినవని విన్నాను. వాణ్ణి పోగొట్టుకున్నందుకు కూడా నేను చాలా పశ్చాత్తాపపడేవాణ్ణి.

ఒక నాడుదయం నేను నాగదిలో కూర్చుని పత్రిక చూస్తుండగా మా ఇంటి ముందు బండి ఒకటి వచ్చి ఆగిన చప్పుడు వినిపించింది. నాకెందుకో వెంటనే సీత తిరిగి వచ్చిందేమో ననిపించింది. నేను అనుమానిస్తూ కుర్చీలోనించి లేస్తుండగా ప్రసాదు నా గది తలుపు తెరిచి నా వంక భయంతో చూసి నట్టు చూస్తూ గుమ్మంలో నిలబడ్డాడు. వాడివెనక చీర కనిపించి నాయమైంది. నా గుండె గబగబా కొట్టుకోవటం ప్రారంభించింది. సీత వచ్చిందను కున్నాను.

"ఏంరా, ప్రసాదూ? ... రా, లోపలికిరా! నీ వెనక ఎవరూ?" అన్నాను.

"నా— నా భార్య!" అన్నాడు ప్రసాదు కొంచెం సిగ్గుపడుతూ.

"రండి లోపలికి!.... ఎంతకాల మయిందిరా నిన్ను చూసీ!" అన్నాను. వచ్చిన మనిషి సీత కానందుకు నాకు చాలా ఆశాభంగం అయింది. నా మొదటి సీత నాకు ఎప్పటికైనా మళ్ళీ దక్కుతుందనే ఆశ నన్ను పట్టుకుని ఉండాలి.

ప్రసాదు అనుమానిస్తూ లోపలికి వచ్చి నా ప్రోద్బలం మీద ఒక కుర్చీలో బలవంతాన కూర్చున్నాడు. వాడి భార్య రెండడుగులు లోపలికివచ్చి దూరాన నిల బడ్డది భర్తవంక నేచూస్తూ.

"భయంలేదు. రా అమ్మా!" అన్నాను. ఆ పిల్లను చూడగానే నాకు ఎంతో ముచ్చటవేసింది. ఆ పిల్ల పేరు భారతి అని తరవాత ప్రసాదు చెప్పాడు. భారతి చాలా చిన్నపిల్ల. ఆమె వయస్సు ఇంకా కొంచెం ఉండవచ్చునేమో కాని చూడటానికి పదమూడేళ్ళయినా ఉండవేమో ననిపించింది. నేను లోపలికి రమ్మనగానే తనభర్త దగ్గిరికివచ్చి వాడి కుర్చీని ఆనుకొని నావంక అమాయకంగా చూస్తూ నిలబడ్డది. వాళ్ళిద్దరికీ ఒకరి కొకరు సమస్తంగా ఉన్నారని గ్రహించగలిగాను. వాళ్ళను చూడ గానే నా సీత కూడా ఒకప్పుడు నేనే లోకంగా ఉండేదని జ్ఞాపకం వచ్చింది.

నాకు సీతను గురించి ప్రసాదును అడగాలని ఉంది; ఈ ఆరు సంవత్స రాల అనంతరం వీడు భార్యా సహితంగా నా దగ్గిరికి ఏంపనిమీద వచ్చాడో తెలుసు కోవాలనీ ఉంది. అంతా వాడే చెబుతాడని చూస్తూ కూర్చున్నాను.

"బావా, ఇంతకాలం అయిన తరవాత నేను నీ పంచన తలదాచుకోటానికి వస్తే నీకు సహజంగా ఇష్టం కాక పోవచ్చును. నాకిప్పుడు దిక్కులేదు — నువ్వు తప్ప! కనీసం నాకొక పాతిక రూపాయల నౌకరీ అయినా దొరికే వరకూ ఎవరి

చాటున అయినా ఉండాలి. నా విషయం కూడా నాకు దిగులులేదు. కాని నావంటి దౌర్భాగ్యుణ్ని చేసుకుని, పాపం ఈ భారతి— అప్రయత్నంగా వాటి భుజంమీద చెయ్యి వెయ్యటం నేను గమనించాను.

"మేం నీ చాటున ఉండటం నీకిష్టం లేకపోతే చెప్పు, బావా!" అన్నాడు ప్రసాదు భారతి స్పర్శతో కొత్త శక్తి పొందిన వాడల్లే.

"అటువంటిది నువు కల్లో కూడా అనుకోకు. మీ యిష్టం వచ్చినంత కాలం ఇక్కడ వుండండి. ఈ ఇల్లు మీది. నాకు పెద్దతనం వస్తున్న కొద్దీ పిల్లల మీద భ్రాంతి పోతున్నది. మీరే ఆ కొరత తీరుద్దురు గాని!" అన్నాను ....నిజానికి నాకప్పటికి ఇరవై ఎనిమిది ఏళ్ళేకాని భారతి వంక చూస్తుంటే నా తల నెరిసి చాలా ఏళ్ళయిందనిపించింది. అటువంటి కుమార్తె నాకు ఉండి వుంటే ఎంత బాగుండునని కూడా అనిపించింది.

"మా సీత ఎంత మారిపోయిందో నేను ఊహించలేక సీదే తప్పని కూడా చాలా కాలం నమ్మాను, బావా ! నాదాకా వస్తే కాని నాకు తెలిసిరాలేదు," అన్నాడు ప్రసాదు.

"అదే నేను అడుగుదామనుకున్నాను. ఏమయిందే? నువ్విట్లా దిక్కులేని వాడివి కావటానికి కారణమేమిటి?" అన్నాను. ప్రసాదు జరిగిందంతా చెప్పాడు.

మా మామగారికి నా భార్య మొదటి సంతానం కాదు. అంతకు పూర్వం ముగ్గురు పిల్లలు—ఇద్దరు ఆడపిల్లలూ మగపిల్లవాడూ—పుట్టి పెరిగి పెద్దవాళ్ళయి పోయినారు. ఇద్దరాడ పిల్లలకు పెళ్ళిళ్ళు కూడా చేశాడాయన. మగపిల్లవాడు మాత్రం అయిదేళ్ళు పెరిగి పోయినాడు. (వాణ్ని చూస్తే కూడా ఆయనకు పడేది కాదట. వాడికి రోగంవస్తే మందిప్పించక చంపాడు మా మామగారు!) మేమెవ్వరమూ కనుక్కోలేదు కాని ఆయన ప్రీతియమైన ఆస్తి నాకిచ్చిన కట్నంతోనే సున్నా చుట్టింది. కాని ఆయన ఉద్యోగం అప్పటికింకా అయిపోలేదు. సీత నా దగ్గిరనుంచి వెళ్ళిపోయిన రోజుల్లో ఆయన రిటైరు కాబోతున్నాడు.

తరవాత ఆయన రిటైరయినాడు. ప్రావిడెంటు ఫండూ కొంత ఇన్సూరెన్సు డబ్బు వస్తే అది సీత పొలంమీద వచ్చే అయివేజుకు జతచేసి ఒక ఇల్లు కట్టించి నాలుగెకరాలు పొలంకొని అంతా సీత పేర పెట్టేశాడుట. భారతి కాపరానికి వచ్చే వరకూ ప్రసాదుకు ఈ ఏర్పాటువల్ల ఏమీ ఇబ్బంది కలగలేదు. కాని భారతి వచ్చిన క్షణంనుంచీ ప్రసాదుకూ సీతకూ చెడింది. ప్రసాదు భారతిని ఎంత ప్రాణ ప్రదంగా చూడటం నేర్చుకున్నాడో సీత ఆ పిల్లను అంత అసహ్యంగా చూడ సాగింది. భారతిని సీత కోరంటికం పెడుతుంటే ప్రసాదు చూసి సహించలేక పోయినాడు. ఎన్నడూ అభిప్రాయభేదం ఎరగని వాళ్ళిద్దరూ రోజూ పోట్లాడుకో సాగారు. మాటమీద మాటవచ్చి సీతా ప్రసాదూ నువ్వెంత అంటే నువ్వెంత అను కున్నారు. సీత ఆఖరుకు "నా సొమ్ము తింటున్నందుకూ, నా ఇంట్లో ఉన్నందుకూ

సేకు కృతజ్ఞత అయినాలేదు!" అన్నది. ప్రసాదు మరుక్షణమే భార్యను బండి ఎక్కించి నా దగ్గిరికి ప్రయాణమైనాడు.

"వెనకటి సీత కాదు బావా!" అన్నాడు ప్రసాదు. "సీత ఏమన్నా నేను తెక్కచేసి ఉండను. నాకది అంటే ఇప్పటికీ యిష్టమే కాని నిజంగానే దాని ఉప్పుతింటూ దానితో అభిప్రాయభేదం వచ్చినప్పుడు సర్దుకుపోవటం చచ్చినట్టు పడి ఉండటం అవుతుంది. కాని సర్దుకుపోవటం కాదు!" వాడన్న ఆ ముక్క నేను ఎప్పటికీ మరవలేదు.

నేను హోటల్లో భోజనం మానేసి ఇంట్లోనే వంట పెట్టించాను. భారతి అమాయకురాలే గాని అసమర్థురాలు కాదు. వంట దివ్యంగా చేస్తుంది.

పదిహేను రోజులు గడిచింది. ప్రసాదునూ భారతినీ చూస్తే నాకు చాలా జాలి కలిగేది. నా ప్రేమకు కలిగిన అపాయమే వాడి ప్రేమకూ కలిగేటంత పని అయింది. ఈ కొత్త సీత నన్నూ నా మొదటి సీతనూ వేరుపరచ గలిగింది. కాని ప్రసాదునూ భారతినీ వేరుచెయ్య లేకపోయింది. ప్రసాదే నా కంటె ఎంతో అదృష్ట వంతుడు. వాడికీ వాడి భార్యకూ నేను చెయ్యదగిన శాశ్వతమైన ఉపకారం ఏమైనా ఉందా అని చాలా దీర్ఘంగా ఆలోచించాను. చివరకు ఒక ఉపాయం తట్టింది. నేను సీతతో సంధి చేసుకుని ఆమెకు బానిసగా ఉండటానికి అంగీకరిస్తేసరి ! ఎవరన్నా తన కింద తొత్తుగా ఉంటే తప్ప ఆ మనిషికి తృప్తి కలిగేటట్టు లేదు. నేనట్లా ఉండ టానికి ఒప్పుకుంటే ప్రసాదుకూ సీతకూ సఖ్యత కలుస్తుంది. సగంలో ఆగిపోయిన వాడి చదువు పూర్తి అవుతుంది. ఆ తరవాత వాడుకూడా ఎక్కడన్నా నాలుగు రాళ్ళు తెచ్చుకుని భార్యతో స్వేచ్ఛగా ఉంటాడు. నేను మనసారా ప్రేమించిన సీత కోసం భారతికి ఈ మాత్రం ఉపకారం చెయ్యటానికి తీర్మానించాను.

ఈ ఆలోచన కలిగిననాడే నేను మా అత్తవారూరు బయలు దేరాను. దారిలో నేను వెయ్యబోతున్న పశ్చాత్తప్తుడి వేషం చక్కగా రిహార్సు చేసుకున్నాను. కష్ట మంతా మొదట్లోనే ఉంది. నన్ను చూడగానే సీత పుటిక్కిన ఏదో పిడుగంటి మాట అంటుంది. అప్పుడు నేను చలించకుండా ఉంటే మిగిలిన నాటకం సులభంగా ఆడ వచ్చును. ఆ తరువాత కూడా కొంత కష్టం లేకపోలేదు. నేను నిజంగానే పశ్చా త్తాప పడుతున్నాను, నాది దొంగెత్తుకాదు, అని సీతను నమ్మించాలి. అంత నటనా కౌశలం నాలో ఉందా ? ఇటువంటి విద్యలు జీవితంలో అవసర పడతవని నేను కలలో కూడా అనుకుని ఉండలేదు. నిజానికి నాగరిక ప్రపంచం రోజూ చేస్తున్నది నటనకాదా— ఆ చిరునవ్వులు, ఆ నమస్కారాలూ, ఆ వినయమూ, ఆ మర్యాదా !....

నేను వెళ్ళేటప్పటికి నా అదృష్టము బాగుండి సీత ఒంటరిగానే ఉంది. ఒక్క చూపులోనే గ్రహించాను, సీత కొద్దిగా పాలిపోయి కొద్దిగా చిక్కి ఉందని. నన్ను

చూడగానే ఆవిడలేచి నిలబడి నా వంక దిగ్భ్రమచెందిన దానల్లే చూడసాగింది. నేను శక్తిగా ధైర్యం చిక్కబట్టి పారం వప్పగించసాగాను.

"సీతా ! నేను నీ విషయంలో ఎంత దుర్మార్గంగా ప్రవర్తించానో కనుక్కోటానికి ఇంత కాలం పట్టింది. నిన్ను—నువు నన్ను క్షమించి—" ఆ వెధవముక్క దగ్గిర నాకు నోరు కట్టుపడ్డది. అదృష్టవశాత్తూ నేను నా వాక్యం పూర్తి చెయ్యవలసిన అవసరం తప్పింది. సీత నమ్మశక్యంగాని పనిచేసింది—నా మాటలు పూర్తి కాకమునుపే మొహానికి చీరె చెంగు అడ్డం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

ఒక్క క్షణ కాలం నేను నిశ్చేష్టుణ్ణి అయిపోయి సీత వంకచూశాను. మరు క్షణం నా అనుమానాలన్నీ రహితమయినై. ఏం జరిగిందో, ఎట్లా జరిగిందో నా కెందుకు ? ఈ ఏడిచే సీత మూడు మూర్తులా నా మొదటి సీత మాదిరిగా ఉంది. నేను చప్పున సీత దగ్గిరికివెళ్ళి ఆమెను నా చేతుల్లోకి తీసుకుని కన్నీటితో తడిసిన ఆమె చెక్కిళ్ళు ముద్దు పెట్టుకున్నాను. ఆ తరవాత సీత నిమిషంలో నా అనుమానా అన్నీ తీర్చింది.

"మీరు ఉద్యోగం కోసం తహతహ లాడటం చూసి, మీకు నా మీద మొదట్లో ఉండిన ఆపేక్ష పోయిందనీ, అందుకనే నాసొమ్ము ముట్టుకోవటం మీ కంత కష్టంగా ఉందనీ అనుకున్నాను. ఉద్యోగం రాగానే మీరు నేననుకున్నంతా చేశారు. ఆ వెధవ నౌకరిమీదపడి మీరు నాకు రోజల్లా కనపడకుండా ఉండటమే కాక రాత్రివేళ కూడా నా సంగతి విచారించటం మానేశారు. నాకు మీమీద చాలా కోపం వచ్చేది, చెప్పొద్దూ ! చివరకు ఒకనాడు అన్నీ పాడుగుడ్డలు తెచ్చి నాచేతి కిచ్చారు. (అవన్నీ పాడు గుడ్డలు అయి ఉండవచ్చునని నాకు ఇంతకాలమయిన తరవాత సీత చెప్పేదాకా తట్టనైనాలేదు. మొదట్లోనే అన్నదనుకోండి. ఆ అనటానికీ ఆరు సంవత్సరాల అవతల అనటానికీ చాలా భేదం ఉంది !) నేనామాట అన్నానని మీకు కోపం వచ్చి మీరు నాకు తెచ్చిన చీరెలు ఇచ్చేశారు. అప్పటినుంచీ మీరు మారిపోయినారు. (ఇది అన్యాయం. నేను సీతను గురించి అనుకున్న మాటే, నన్ను గురించీ సీత అనుకుని ఉండటం !) అది వరకు మీ దగ్గిర ఎంత చనువు తీసుకున్నా మీకు ఇష్టమయ్యేది. మీకు ప్రతి దానికీ నా మీద కోపం రావటం మొదలు పెట్టింది. జరిగిపోయిన రోజులు తలుచుకుని రోజూ ఏడిచేదాన్ని. ఆఖరికి మిమ్మల్ని చూస్తే భయమూ, అసహ్యమూ కలిగింది. నాకు ఇష్టమైన మొగుణ్ణి చంపేసి ఆ స్థానం మీరు పుచ్చుకున్నారనుకొనే దాన్ని.

నాది ఎంత పాపిష్టిజన్మో, నా మనసులో ఒకటుంటే పైకి ఇంకొకటి వచ్చేది. నానోటివెంబడి ఏది వచ్చినా మీకు తప్పుగానే కనపడేది. ఆఖరుకు ఆయింటో ఉండలేకా వచ్చేశాను.

కాని నేను మీ విషయంలో ఎంత ఘోరంగా ప్రవర్తించానో నాకు తెలిసి రాలేదు, మా ప్రసాదు ఇంటినుంచి లేచిపొయ్యేవరకూ !"

నా అనుమానాలన్నీ తీరినై కాని ఇంకా ఒకటి మిగిలి ఉంది.

"అదంతా సరే కాని, పాపం, మీ మరదలిని అంత ఒత్తిడి పెట్టావుట దేనికి ?" అన్నాను.

"నాకేదో భూతం ఆవేశించింది. వాళ్ళిద్దర్నీ చూచినప్పుడల్లా మన కాపరం మొదటి రోజులు జ్ఞాపకం వచ్చేవి. నా మనస్సు భగభగ మండిపొయ్యేది. వాళ్ళు ఆపేక్షగా ఉండాలంటే నేను చూడకుండా ఉండరాదా ? నా కెందుకీ శిక్ష ? అని పించేది! పాపం ! వాడికేమర్థమవుతుంది నాబాధ ! వాడితో కూడా అంతే—ఒకటి మనసులో ఉంటే ఇంకోటి అనేదాన్ని. నాకు ఎటువంటి శిక్షవిధించాలో అటువంటి శిక్ష విధించాడు ! మొదట మీకు దూరం కావటమూ తరవాత వాడికీ ! తీరా వాడు వెళ్ళి పోతున్నాడని తెలిసిన తరవాత నా ప్రాణం దిమ్మరపోయింది. బుద్ధితక్కువై ఆ మాట అన్నాను. నన్ను క్షమించమని అందామనుకున్నాను కాని నా నోట మాట రాలేదు. వాడు వెళ్ళిపోయినప్పటినించీ నాకు నిద్రాహారాలు సరిగా లేవు. ఇప్పుడు మాట్లాడినందుకు నోరెండి పోతున్నది....

నేను మీతోనూ వాడితోనూ అని ఉండాలిసిన మాటలు మీరు నాతో అనే టప్పటికి నా గుండె పగిలిపోయింది. ఏమైతే ఏం మీరు మళ్ళీ నాకు కనపడ్డారు! ..."

ఇంతకూ నేను చెప్పవచ్చిందేమంటే—ఇంతలో ఉంది !

ముద్రణ : ఆగష్టు 1937, స్వగతం కథల సంపుటి.

యువ కార్యాలయం : తెనాలి.

# రసికుడు

మునసబు బావమరిది పెళ్ళికి రాజరత్నాన్ని పిలిపించారు. "వీరయ్య పెళ్ళికి గొప్ప భోగం మేళం పెడుతున్నారుట" అని ఊరంతా పొక్కింది. నిలకడమీద అది భోగం మేళం కాదని తెలిసింది. రాజరత్నం భోగందేగాని, ఆ మనిషి గజ్జెకట్టి మేజువాణీలు చేయదనీ, అధ్యాత్మ రామాయణ కీర్తనలు అభినయిస్తూ పాడుతుందనీ తేలింది.

ఈ సంగతి వినగానే బ్రాహ్మణ వీధివాళ్ళకు చాలా కోపాలొచ్చినై. రావూ మరీ ? వాళ్ళంతా డొక్కశుద్ధిగలవాళ్ళు. "ఏం బావా ? అధ్యాత్మ రామాయణం చెప్పించాలంటే ఆ వెల్లటూరాయన్ను[1] పిలిస్తే పొయ్యేదిగా ?" అన్నారు ఒకరిద్దరు మునసబుతో.

"అప్పుడు సానిమేళం పెట్టలేదేమని మీరే ఎత్తిపొడుస్తారుగా ?" అన్నాడు మునసబు.

"అది సరేగాని, భోగంది అధ్యాత్మ రామాయణం పాడడ మేమిట్రా?" అని బ్రహ్మచార్లు ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

"అది వస్తుంది, ఏదో పాడుతుంది, పోతుంది. మధ్య మనకెందుకు ?" అనీ ఒక బ్రహ్మచారి అన్నాడు.

ఆ మాట ఖరారే. ఎందుచేతనంటే ఈ రాజరత్నం అధ్యాత్మ రామాయణం పాటలు ఖూనీ చేస్తుంటే చూడటానికి బ్రాహ్మణ్యం వెళ్ళగూడదని ఊరంతా ప్రచారమైపోయింది.

మంచినీళ్ళ బావిదగ్గిర కూడా ఈ విషయం వచ్చింది.

"ఏ జన్మలో పుణ్యం చేసుకుపుట్టింది. ఈ జన్మలో అధ్యాత్మ రామాయణం అబ్బింది!" అన్నదొకావిడ.

"నీదంతా చోద్యం ! ఆ మనిషి వస్తే వెళ్ళేవాళ్ళంతా అధ్యాత్మం వినబోతారనుకున్నావా ఏ ? మనిషిని చూడబోతారు," అన్నదింకో ఆవిడ.

"మనిషికూడా అందంగా వుంటుందట, పిన్నీ!" అన్నదొక కొత్తగా కాపరానికి వచ్చిన పిల్ల.

---

1. వెల్లటూరాయన : కుటుంబరావు పశ్చాత్తప్తుడు కథలోనూ, భగవద్భక్తి కథలోనూ కన్పించే ఈ వెల్లటూరాయన ఎవరో ! వెల్లటూరు భాగవతుల్లో ఆ రోజుల్లో ప్రసిద్ధుడైన ఒక వ్యక్తి అయివుండాలి.

"ఎందుకు బాగుండదు తల్లీ ? వాళ్ళకు గంధర్వాంశ !" అన్నదొక ముసనడి వయస్సావిడ.

"మన బజారులో ఎవరూ వెళ్ళరుట !"

"ఎవరు వెళ్ళినా, వెళ్ళకపోయినా సూరయ్యకు తప్పదుగా !" కొత్తగా కాపరానికి వచ్చిన పిల్ల కిలకిల్లాడబోయి, అత్తగారు బావికేసి వస్తూండటంచూసి బిందె ఎత్తుకున్నది. ఆమె బావి దాటి రోడ్డెక్కబోతూ ముందుగా మాలమాదిగ ఉన్నారేమో అనిచూసి తరవాత చెట్టుకిందగాని, వీధి మొగలగాని సూరయ్య వున్నాడేమో అని చూసింది. ఎందుకంటే సాధారణంగా ఉంటాడు. సూరయ్య తనకేసి చూడనవసరంలేదు. తనకు కనిపిస్తే చాలు ఒళ్ళంతా జల్లుమన్నట్లయేది. ఆ క్షణానికి అది అసహ్యంగా తోచినా తరవాత ఏదో బాగున్నట్టే వుండేది.

సూరయ్య సంగతి ఊళ్ళో అందరికీ తెలుసు. ఆయన నలభై చాయలవాడు. బ్రాహ్మణీకం ఏనాడో మంటగలిపాడు. క్రాపింగు పెట్టాడు. బెంగాల్ ధోవతులు వాలుగోచీ పెట్టి కట్టేవాడు, స్లిపర్లు తొడిగేవాడు. కోటు వేసుకునేవాడు, సిగరెట్టు కాల్చేవాడు. నెలకు ఇరవై రోజులు బస్తీల వెంట తిరిగేవాడు. ఏడాదికి అధమం ఒకసారైనా పట్నం వెళ్ళివచ్చేవాడు. చిన్నతనంలో తండ్రికి ఎదురుతిరిగి సంస్కృతం మానేసి ఇంగ్లీషు చదువుకు వెళ్ళాడు. కాలేజీలో రెండోఏడు చదువుతుండగా పెళ్ళాం కాపరానికి వచ్చింది. వెంటనే చదువు మానాడు. మరుసటి ఏడే కూతురు పుట్టింది. తరవాత పిల్లలులేరు. రెండేళ్ళక్రితం భార్య పోయింది. మళ్ళీ పెళ్ళాడమన్నారు. కాని, సూరయ్య పెళ్ళాడలేదు. వెధవ అప్పగారు కాచిపోస్తుంది— గ్రామంలో సూరయ్య ఉన్నప్పుడు.

సూరయ్యది పెద్ద ఆస్తి. డబ్బు మంచినీళ్ళలాగా ఖర్చుచేసి సగం ఆస్తి తగలేశాడు.

ఆయనకు గ్రామంతో బహుకొద్దిపాటి సంబంధం. అందుచేత గ్రామస్థులు ఆయనను సాధించలేకపోయారు.

రెండేళ్ళక్రితం గాంధీ మహాత్ముడి సహాయనిరాకరణోద్యమం[1] ఈ గ్రామా

---

1. గాంధీమహాత్ముడి సహాయ నిరాకరణోద్యమం : 1920 మే 20 ఖిలాఫత్ కమిటీ ఆమోదించిన సహాయ నిరాకరణ ప్రేరణతో 1920 సెప్టెంబరు 4-9 తేదీల్లో జరిగిన కలకత్తా కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో గాంధీజీ అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమ తీర్మానం సూచించారు. కొద్ది మెజారిటీతో ఈ తీర్మానం ఆమోదాన్ని పొందింది. లజపతిరాయ్, చిత్తరంజన్ దాస్ వంటివారు వ్యతిరేకించారు. 1920 డిసెంబరులో జరిగిన నాగపూరు సమావేశంలో అత్యధికులు బలపరిచారు. ఈ సమావేశం నుంచే గాంధియిజం కాంగ్రెసు అధికార భావజాలమైంది.

నాశీహూడా వచ్చింది. ఈ ఉద్యమంలో ఆసక్తి పుట్టిన యువకులు ఇక్కడకూడా ఉతులుదేరారు. సూరయ్యా వారితోనూ కలిసినవాడు కాలేదు.

ఒక్క విషయం మాత్రం అందరూ ఆమోదించారు. అదేమిటంటే, సూరయ్యా రసికుడు. దేశంలో పేరుపడ్డ నాటకాలన్నీ చూశాడు. ఏనాడో బొంబాయి వెళ్ళి బార్‌వాలా థియేటర్‌వాళ్ళ నాటకాలు చూశాడు. పాటకచేరీలకు హాజరయే వాడు. ఏం సూరయ్యా ? ఎప్పుడూ ఇంటిపట్టున ఉండవేం ! అని ఎవరన్నా అడిగితే, "ఈ గ్రామంలో ఏముంది ? ఒక నాటకమూ, ఒక పాటకచేరీయా ?" అనే వాడు. తమకులేని ఆనందం అనేక విధాలుగా సూరయ్యా పొందుతున్నాడని ఊళ్ళో అందరికీ తెలుసు. "అటువంటి ఆనందం లేకనేపోతేం గనక ?" అని కొందరు అనుకున్నా, మరికొందరు సూరయ్యానుచూసి అసూయపడేవారు.

## 2

రాజరత్నం వచ్చిందన్నారు. ఆలయం అవతల సత్రంలో దిగిందన్నారు. సూరయ్యా వెళ్ళి రాజరత్నాన్ని చూసి పలకరించి వచ్చాడన్నారు. బ్రహ్మచార్లకు వెన్నుపూసలు జలదరించాయి. కాని తీరా విచారిస్తే రాజరత్నం పెద్ద అందగత్తెకాదనీ, అటే చిన్నదికూడా కాదనీ తెలిసింది. "తెల్లతోలు! అంతకన్నా విశేషం ఏమీలేదు. ఒక్కపలచని మనిషి !" అన్నారు చూచినవాళ్ళు.

"మరీ అందగత్తె అయితే చూడటం తప్పేమోగాని, సామాన్య మనిషైతే మనం చూడవచ్చునే!" అన్నాడొక బ్రహ్మచారి. అది వ్యంగ్యమో, అమాయకత్వమో తెలియకుండా.

ఏమైనా ఆ సాయంకాలం గుడి మంటపంలో కుర్రకారువాళ్ళు చాలామంది చేరారు. వాళ్ళ చూపులు సత్రంవైపే ఉన్నై. ఇదంతా వృథా శ్రమ. ఎందుకంటే దీపాలు పెట్టేవేళ రాజరత్నం ఆలయానికి వచ్చింది. వెంట ఒక ముసలాడున్నాడు. ముసలాడికి ముందు పళ్ళు లేవు.

ఈసారి బ్రహ్మచార్లు రాజరత్నాన్ని బాగానే చూశారు. పాతికేళ్ళమనిషి. చూడటానికి ఇంచుమించు సంసారస్త్రీలాగే ఉంది.

"భోగందని తెలుస్తూనే ఉంది. ఎంత దాచినా, దాందుంపతెగా, అది దాగి చావదు." అన్నాడొక బ్రహ్మచారి. మిగిలినవాళ్ళు అవునని ఒప్పుకున్నారు. కాని భోగంమనిషి లక్షణాలు ఆ మనిషిలో ఎక్కడ ఉన్నదీ ఎవరికీ స్పష్టంగా తెలీదు.

మెరకవీధి వాళ్ళుకూడా రాజరత్నాన్ని చూసి పెదవులు విరిచారు. "వీర్రాజునికుడు వెంకమ్మగారి రోసెయ్యా పెళ్ళికి వచ్చిన భోగం వాళ్ళముందు ఇది బలాదూర్ !" అన్నారొకరు. అంతో ఇంతో ఖర్చు చేయటానికి సిద్ధపడిన వాళ్ళకు ఆశాభంగం అయినటయింది. కొంతమంది మటుకు ఏ నిర్ణయానికీ రాదలచలేదు.

మర్నాడే రాజరత్నం అధ్యాత్మం. మునసబూ, సూరయ్యా, ముందుపళ్ళులేని ముసలాడు కలిసి పెద్ద చర్చ చేసి నాలుగురోజుల్లో ఏమేం పాడాలో నిర్ణయించటానికి ప్రయత్నించారు. "అమ్మాయి రెండు నెల్లు చెప్పమన్నా చెబుతుంది" అన్నాడు ముసలాడు.

"తన యిష్టం వచ్చినవి, తనకు వచ్చినవి, పాడమను" అన్నాడు సూరయ్య. ఇది మంచి నిర్ణయమేనని మొదటిరోజే రుజువై పోయింది. ఎందుకంటే రాజరత్నం అచ్చగా అధ్యాత్మరామాయణం పాటలేగాక సందర్భానుసారంగా తరంగాలూ, అష్టపదులూ, కృతులూ, కృష్ణకర్ణామృతంలో[1] శ్లోకాలూ, భాగవతంలో పద్యాలూ, పారిజాతాపహరణంలో పద్యాలూ[3], ఆఖరుకు వరూధినీ ప్రవరాఖ్యుల ఘట్టంలో పద్యాలూ[4] కూడా పాడింది.

రాజరత్నం సరుకున్న మనిషి అనటానికి ఏమీ సందేహం లేదు. "అసలా మనిషికి అధ్యాత్మం నోటబట్టినప్పటి మాటగద !" అన్నవాళ్ళు చాలా పొరపాటు పడ్డారు. ఆ సంగతి తెలుసుకోవటానికైనా వాళ్ళు వచ్చి వినలేదు. రుజువు కాని అబద్ధాలు నిజంకన్న బలమైనవి.

రాజరత్నం సరుకు ఏపాటి ఉన్నదో తెలుసుకోగలవాళ్ళెవరూ అధ్యాత్మం వినటానికి రానేలేదు. వచ్చినవాళ్ళు బొత్తిగా పామరులు. రాజరత్నానికిగల ప్రతిభ కొంచెమే అనుకున్నా, అది బూడిదపోసిన పన్నీరయింది.

పన్నీరంతా బూడిదలోనే పడిందనటం భావ్యం కాదు; కొంత సూరయ్య మీదకూడా పడింది. కాని అందువల్ల సూరయ్యకు కలిగినది ఆనందమని చెప్పటానికి లేదు. ఆయన బాధపడ్డాడు.

నాలుగోరోజు మునసబుగారు సూరయ్య ఎదటే రాజరత్నానికి ఇవ్వటానికి మాట్లాడుకున్నది కాస్తా తాంబూలంలో పెట్టి ఇచ్చేశాడు. ముసలాడూ, మృదంగం వాయించినవాడూ, రాజరత్నం సత్రానికి తిరిగివచ్చినప్పుడు సూరయ్య కూడా వెంటవచ్చాడు.

ఏదో ముగిసినట్టూ, దేనికో స్వస్తి చెప్పినట్టూ, ఎవరినో దహనంచేసి వచ్చినట్టూ సూరయ్యకు భావన కలిగింది. చిత్రమేమిటంటే, ఈ ముగింపు తన జీవితంలోనే

---

1. కృష్ణకర్ణామృతం : లీలాశుకుని రచన.
2. భాగవతంలో పద్యాలు : పోతన (1420-1480) ఆంధ్ర మహాభాగవతంలో పద్యాలు.
3. పారిజాతాపహరణం : నంది తిమ్మన (16వ శతాబ్ది) పారిజాతాపహరణ ప్రబంధంలోని పద్యాలు.
4. వరూధిని....అల్లసాని పెద్దన (1470-1540) మనుచరిత్రలోని వరూధినీ ప్రవరాఖ్య సన్నివేశంలోని పద్యాలు- తృతీయాశ్వాసంలోనివి.

వాత రాజరత్నం జీవితంలో సర్వమూ సూరయ్యకు గోచరించి. ఇకముందు రాజరత్నానికి కష్టాలే తప్ప సుఖమనేది ఉండదని సూరయ్య గుండె ఆరాటపడుతున్నట్టు కనిపించింది. ఆ భావం ఆయన నోటివెంట విచిత్రమైన ప్రశ్నగా బయటికి వచ్చింది.

"ఇక ఏమిటి ?" అన్నాడాయన రాజరత్నంతో.

ఆమెకు ఆ ప్రశ్నయొక్క అంతరార్థం అర్థమయినట్టులేదు. ఆవిడ నవ్వుతూ, "మేం వచ్చినపని అయిపోయింది. సెలవిప్పించండి. మీరు చాలా సహాయం చేశారు. మీ ఋణం తీరదు" అన్నదామె నమస్కారం చేస్తూ.

మగవాళ్ళు తమ వస్తువుల కోసం విసుక్కుంటూ వెతుక్కుంటున్నారు. "నేను అట్లా అవతలికి వెళ్ళగానే యీరాజరత్నంకూడా విసుక్కుంటూ తన వస్తువుల కోసం వెతుక్కుంటుంది. వాళ్ళమీద వీళ్ళమీద ఎగురుతుంది. ఆధ్యాత్మంలేదు ! చిద్వృత్తూలేదు !....వేషం విప్పేసుకున్నట్టే" అనుకున్నాడు సూరయ్య.

ఆయనకు భోగం వాళ్ళతో పరిచయం ఉంది. వాళ్ళ జీవితాలు ఎంత నికృష్టంగా ఉంటాయో ఆయన ఎరుగును. ఈ రాజరత్నం కూడా అట్లా జీవించటం అన్యాయం, ఘోరం ! కాని తాను చేయగలిగింది ఏముంది ? ఈతరానివాడు ఒడ్డున ఉండి నీళ్ళలో మునిగిపోతున్న మనిషిని చూసినట్టు సూరయ్య రాజరత్నంకేసి చూడసాగాడు .ఆ మగవాళ్ళను పంపేసి రాజరత్నాన్ని తనయింటికి తీసుకుపోయి, ఊళ్ళోవాళ్ళతో, "ఇదుగో, నేను చేసుకున్న మనిషి!" అని చూపితే ఎంత బాగుండు ననుకున్నాడు.

ఇప్పటికీ సూరయ్య నమ్మకం ఆ బాగు రాజరత్నానికేగాని తనకు కాదని! రాజరత్నాన్ని ఎట్లాగైనా ఉద్ధరించటానికే సూరయ్య మనసు తటతటా కొట్టుకుంటున్నది ! ఆమెకు తన ఉద్ధరింపు అవసరంలేదేమోనని ఆయనకు తట్టలేదు.

"కొద్ది రోజుల్లో నేను గుంటూరు రావలసిన పని ఉంది. వీలుంటే అట్లా మీ యింటికేసి వస్తాను. నా దగ్గిర మీ ఎడ్రసుంది!" అన్నాడు సూరయ్య.

"తప్పక రండి!" అన్నది రాజరత్నం.

## 3

రాజరత్నం వెళ్ళిపోయాక సూరయ్యకు గ్రామం ఎంత కళాహీనంగా కనబడిందో వివరించటం కష్టం. సత్రమూ, గుడీ, మునసబుగారిల్లూ, యింటి ముందు పందిరి వేసిన చోటూ శాపోదకం చల్లినట్టుగా ఉన్నాయి. ముసలాడి ఫిడేలూ, మృదంగం ముక్తాయింపులూ, రాజరత్నం పాడిన పాటల పల్లవులూ, అభినయమూ తలలో సందడి చేస్తున్నాయి.

సూరయ్యా యువకుడు కాడు. ఆడవాళ్ళ మోహం ఎరగనివాడూ కాడు. అయినా ఆయన నవయువకుడి తొలి విరహబాధలన్నీ అనుభవించాడు. "దీని

బాబుల్లాంటి అందగత్తెల్ని చూశాను... కాని, దీనిలో ఏదో విలువైనది ఉంది - దాన్ని ఎట్లాగైనా ఉద్ధరించాలి! ఎట్లా?" అని ఆయన తనను తాను చాలాసార్లు ప్రశ్నించుకున్నాడు.

వారం రోజులలోపలే అయిదువందలు చేతబట్టుకుని గుంటూరు వెళ్ళాడు. ఉదయం తొమ్మిది గంటలప్పుడు రాజరత్నం యింటికి వెళ్ళాడు. ముసలాడు వసారాలో కూచుని చుట్ట కాలుస్తున్నాడు. దూరంగా ఊసి, "రండి" అన్నాడు. గొంతు సవరించుకుంటూ. తరవాత గొంతెత్తి "రాజమ్మా!" అని పిలిచి, జవాబు కోసం ఆగకుండానే, "లోపలికి వెళ్ళండి" అన్నాడు.

ఎటువంటి అవతారంలో రాజరత్నం ప్రత్యక్షమవుతుందో అని సూరయ్య భయపడ్డాడు గాని ఆమె మామూలు అవతారంలోనే ప్రత్యక్షమయింది. తనను చూసి నమస్కారం చేసింది. కూచోటానికి కుర్చీ చూపింది.

సూరయ్య తాను తెలుసుకోదలిచిన విషయాలన్నీ ఒక్కొక్కటే అడిగాడు. రాజరత్నానికి జరుగుబాటు ఎట్లా అవుతున్నది? ఎవరన్నా పోషకులున్నారా ? అధ్యాత్మరామాయణం చెప్పే అవకాశాలు తరుచు వస్తాయా? ఎవరికన్నా అధ్యాత్మం నేర్పి డబ్బు సంపాదించరాదా? నాటకాలలో వేషాలు వెయ్యటం గురించి రాజరత్నం ఉద్దేశమేమిటి?

రాజరత్నానికి జరుగుబాటుకు లోటులేదని తెలిసింది. ఆమె సొంత ఇంట్లో వుంటున్నది. ఇదిగాక ఇంకా రెండిళ్ళున్నై. అద్దెలమీద యాభై రూపాయల దాకా వస్తుంది. ముసలాడు ఫిడేలు పాఠాలునేర్పి సంపాదిస్తాడు. రాజరత్నాన్ని కొంత కాలం ఒక పాటగాడు ఉంచుకున్నాడు. ఆయనే కొంత పాట అభివృద్ధి చేశాడు. ఆయన వెళ్ళిపోయాక ఆమెకు ఎవరూ లేరు.

జరిగిపోయిన రోజులే మంచివి. తెలివిగల కుర్రాడు దొరికితే పెంచుకుందామని ఉంది. నేను పెద్దదాన్నయాక నా భారం వాడే మోస్తాడు. అయిదేళ్ళ క్రిందట కూడా అందమైన ఆడపిల్లను పెంచుకుందామని ఉండేది- నాలాంటిది కాకుండా!" అన్నది రాజరత్నం.

"మరి ఉద్దేశం మార్చేసుకున్నావేం?" అన్నాడు సూరయ్య.

"ఇంక ఆడపిల్లలు సంపాదించే దేమిటి? మేంతినేదేమిటి? నాకు పెళ్లి కాకపోయెనే అని కొంతకాలం విచారించా. జరిగిన పెళ్ళిళ్ళుచూస్తే ఆ భ్రమ వదిలింది. మీరేమన్నా చెప్పండి, మా కులంవాళ్ళు మడులూ, మాన్యాలూ సంపాదించే రోజులు పోయినై !" అన్నది రాజరత్నం.

"మడులూ మాన్యాలూ సంగతి దేవుడెరుగు. మంచి తెలివితేటలుగల పిల్లన్ని చూసి పెంచుకుని దానికి నీ విద్య నేర్పు. నీతో పోనివ్వకు."

రాజరత్నం నవ్వింది.

"ఏం నవ్వుతున్నావు?"

"ఎవడికొక్కావాలండీ ఈ అధ్యాత్మరామాయణం?"

"నా బోటివా డుండడా?"

"నాలుగు డబ్బులు సంపాదించటానికి ఇవ్వే అక్కర్లేదు. గీత బాగుండాలి. అంటే !.... అందానికి నాకు అప్పో చెల్లెలో అవుతుంది— ఇద్దరు జమీందార్లను పట్టింది!"

"నీకూ కూడా జమీందార్లు దొరక్కపోయెనే అని విచారిస్తున్నావా?" అన్నాడు సూరయ్య ఆశ్చర్యంగా.

"మాటవరసకి చెప్పా!"

"ఒక్క కీర్తన పాడతావా ఏమిటి? నేను మళ్ళా వెళ్ళాలి."

"ఇప్పుడా?"

"ఏం?"

"ఒక్క మనిషి వింటే పాట ఏంరక్తి కడుతుంది?"

"మాపూళ్ళో నువు పాడినప్పుడు నేనొక్కణ్ణే వినలేదని నువు నమ్మకంగా చెప్పగలవా?"

"అందరూ విన్నారన్న భ్రమ ఉంటుందిగద?"

"అయినా డబ్బు తీసుకుపాడే దానివి ఒకరికే పాడమంటే పాడతావా? ఇదుగో!" అంటూ సూరయ్య జేబులోంచి తీసి డబ్బు ఆమె చేతికిచ్చాడు.

రాజరత్నం కాస్సేపు నిర్ఘాంతపోయినట్టే కనిపించింది. తరవాత డబ్బు తీసుకుని పక్కనే బల్లమీద పెట్టింది. ఆమె తనను గురించి ఘనంగా భావించి ఉంటుందనుకున్నాడు సూరయ్య.

తరవాత రాజరత్నం తంబురా తీసుకుని, "వినవే పల్లవ మృదుచరణా" అన్న పాట పాడింది. పాటలో లోపం ఏమిటో సూరయ్యకు తెలియలేదు గాని, ఆ పాట వాళ్ళ ఊళ్ళో ఉన్నంత రక్తిగా లేదు.

రాజరత్నంపాట ముగించి తంబురా పెట్టేస్తూ, "ఇట్లా పాడితే ఏం బాగుంటుంది?" అన్నది.

"బాగానే ఉంది.. .ఎప్పుడూ బాగానే ఉంటుంది." అంటూ సూరయ్య దగ్గిరికి వచ్చి రాజరత్నాన్ని చెంపమీద ముద్దుపెట్టుకున్నాడు.

# 4

అది మొదలు సూరయ్య రాజరత్నాన్ని ఉంచుకున్నాడు. మరుసటి ఏడు రాజరత్నానికి ఆడపిల్ల పుట్టింది.

"ఫరవాలేదు. మీ కూతురు నీకన్న చక్కనిదే!" అన్నది రాజరత్నం సూరయ్యతో.

"వాన్ని వృత్తితో దింపనని ప్రమాణం చెయ్యి!" అన్నాడు సూరయ్య. వయస్సు మళ్ళుతున్న కొద్దీ సూరయ్యకు డబ్బుచింత జాస్తి కాసాగింది. 1927 నుంచీ ఆయన నాటకాల కాంట్రాక్టులు ప్రారంభించాడు. లాభం వచ్చినప్పుడు డబ్బు ఏమయిపోయేదో, నష్టం వచ్చినప్పుడు ఆ బొక్క పూడటమంటూ ఉండేది కాదు.

సూరయ్యను అల్లుడు వ్యాపారంలో దింపాడు. ఇద్దరూ చేరి బియ్యం మర అద్దెకు తీసుకున్నారు. నష్టం వచ్చింది. బాకీదార్లకు సూరయ్య ప్రోనోట్లు రాశాడు. ఆయేటి కాయేడు సూరయ్య అప్పు పాపం పెరిగినట్టు పెరుగుతున్నది. పొలం తెగ నమ్మి తీరుద్దామనుకుంటూనే తాత్సారం చేశాడు.

ఆయన గుంటూరుకేసి నెలలపర్యంతం పోవటం లేదు. రాజరత్నానికి పట్టుమని పదిరూపాయలిచ్చి ఎంతకాలమయిందో.

ఉప్పు సత్యాగ్రహానికి[1] వాళ్ళ ఊరు ఉద్రూతలూగింది. ఒక్క ఊపున పద్నాలుగురు కుర్రాళ్ళు జైలుకు సిద్ధపడ్డారు. వారివెంట సూరయ్య పదిహేనో వాడుగా తయారయాడు. జైలునుంచి తిరిగివచ్చాక ఊళ్ళో సూరయ్య పలుకుబడి హెచ్చింది. జైలులో డబ్బున్నవారి స్నేహం లభించింది.

ఆయనకూ రాజరత్నానికీ మధ్య తెగిపోయినట్టయింది. రెండు మూడు సార్లు గుంటూరు వెళ్ళికూడా రాజరత్నాన్నీ, మాణిక్యాన్నీ చూడకుండానే తిరిగివచ్చాడు. "ఏది ? వ్యవధిలేకపోయింది . . ఈసారి !" అని మనస్సుకు సమాధాన పరుచుకున్నాడు.

మరి రెండేళ్ళకు మళ్ళీ రాజకీయ నిస్తబ్దత[2] ఏర్పడింది. జైళ్ళకు పోయినవాళ్ళే జైళ్ళను మరిచిపోయారు. సూరయ్య పని పెట్టుకుని నెలకు ఒకటి రెండుసార్లు రాజరత్నాన్ని చూడసాగాడు. వెళ్ళినప్పుడు పదీ, పరకా మాణిక్యం చేతికే ఇచ్చేవాడు.

ఉన్నట్టుండి ధరలు పడిపోయినై[3]. సూరయ్యకు కంగారు పుట్టింది. ఈ ధరల్లో తన బాకీలు తీర్చటానికి తన ఆస్తి చాలదు ! మళ్ళీ ధరలు లేవకపోవు. కంగారు అనవసరం !" అనుకున్నాడు.

---

1. ఉప్పు సత్యాగ్రహానికి : 1930 మార్చి 12 ఉప్పు చట్టానికి వ్యతిరేకంగా సముద్రతీరంలో ఉప్పు తయారు చేయడానికి గాంధీజీ జరిపిన దండి యాత్రతో మొదలైన జాతీయోద్యమ కార్యక్రమం. గాంధీజీ 78 మంది శిష్యులతో సబర్మతీ ఆశ్రమం నుండి సముద్రతీరాన ఉన్న దండికి మార్చి 12 బయలుదేరి ఏప్రిల్ 6కు చేరి ఉప్పు ప్రోగుచేశారు.

2. 1932 ప్రాంతాల పరిస్థితి.

3. ఆర్థిక సంక్షోభ దశలోని 1933, 34, 35 సంవత్సరాలు కావచ్చు.

ఇది అబద్ధంగా పరిణమించింది. "దివాలా అనిపించుకోవటం ఇష్టంలేదు. వచ్చినంత తీసుకుపోండి" అని సూరయ్య అప్పులవాళ్ళకు కబురు చేశాడు.

ఆస్తిపోయాక నాలుగేళ్ళపాటు ఆయన రాజరత్నం మొహం చూడలేదు.

తిరిగి 1937లో కాంగ్రెసు ఎన్నికలకు నిలబడ్డప్పుడు సూరయ్య జీవితంలో చైతన్యం ఏర్పడింది. చేతిలో డబ్బు ఆడింది. సూరయ్యను కాండిడేటుగా నిలబెడు దామా అన్నదాకా వచ్చింది. కాని అది సాధ్యం కాలేదు. ఎన్నికల హడావుడిలో సూరయ్యచేతిలో డబ్బు ఆడింది.

"నరసింహారావుతో మాట్లాడిరావాలి. గుంటూరు వెళ్ళివస్తావా ఏం?" అని సూరయ్యను అడిగారు. సూరయ్యకు చప్పున మాణిక్యంమొహం జ్ఞాపకం వచ్చింది. మాణిక్యం మీద మమకారం తన హృదయంలో చాలా రోజులుగా అణుచుకుని ఉంది. గుంటూరు వెళ్ళినప్పుడు రాజరత్నం ఇంటికి వెళ్ళాడు.

మాణిక్యం పాట నేర్చుకుంటున్నది-అధ్యాత్మరామాయణం పాట. రాజరత్నం నేర్చుకున్నది. ఎవరో కొత్తవాడు ఫిడేలు వాయిస్తున్నాడు. (ముసలాడు కిందపేడు పోయాడు.)

"ఏమిటి ? పిల్లకు అధ్యాత్మం నేర్పుతున్నావా ?" అని అడిగాడు సూరయ్య.

"అవును, ఏం ?" అన్నది రాజరత్నం.

"ఈ చెత్త ఎందుకు నేర్పుతున్నావు ? ఇది అధ్యాత్మం చెప్పుకు బతుకుతుం దనా?" అన్నాడు సూరయ్య ఆశ్చర్యంగా.

"ఎందుకు బతకరాదూ ? దాని గొంతు నా గొంతుకన్నా బాగుంటుంది. సంగీతం కూడా నేర్చుకుంటూనే వుంది. కాస్సేపు వినండి."

సూరయ్య మండిపడ్డాడు. "నేను వినక్కర్లేదు, అది పాడా అక్కర్లేదు; ఈ ఆలోచన కట్టిపెట్టు !"

"ఇది నా ఆలోచన కాదు. మీ ఆలోచనే!" అన్నది రాజరత్నం.

"ఇంకా నయం !- నా కూతురు—"

"నాదే పొరపాటులెండి" అన్నది రాజరత్నం; సూరయ్యకు అడ్డువస్తూ.

"మీరు అధ్యాత్మం నేర్పమన్నది నేను పెంచుకున్న పిల్లకుగాని, మీ పిల్లకు కాదు!"

రాజరత్నం ఏమంటున్నదీ అర్థం కానట్టుగా సూరయ్య ఆమెకేసి వింతగా చూశాడు.

ముద్రణ : అభ్యుదయ, అక్టోబర్ 1956.

# వ్యర్థజీవితం

ప్రాతికేళ్ళ కిందట మార్కండేయులూ నేను కలిసి చదువుకున్నాం. అప్పటి నుంచీ వాణ్ణి నేను బాగా ఎరుగుదును. వాడికి తెలివితేటలున్నై, మంచితనం ఉన్నది. అన్నీ ఉన్నై, కాని బాగుపడేవాడికి ఉండవలిసిందేదోలేదు. చిన్నతనంలో వాడికి పెద్దవాళ్ళూ, ఉపాధ్యాయులూ, సహాధ్యాయులూ కూడా ఒక్కే ఒక సలహా ఇచ్చేవారు: "నీ గొడవ నువు చూసుకోలేవుట్రా?" అని. అది మాత్రం వాడికి ఆనాటికీ, ఈనాటికీ అబ్బలేదు.

మార్కండేయులు ప్రతివాళ్ళ వ్యవహారాలలోనూ చీటికీ మాటికీ జోక్యాలు కలిగించుకునే వాడనుకోకండి. ఇంకొకరి విషయాలు నిజంగా వాడికక్కర్లేదు. ఎవరికన్నా అన్యాయం జరిగిందని వాడికి తోచినప్పుడే తన తల రోకట్లో దూర్చే వాడు- రోకటిపోట్లు తినేవాడు.

మేమిద్దరమూ మావూరి హైస్కూల్లో సెకండుఫారం చదివేటప్పుడు మా హెడ్మాస్టరు గారి రెండో కొడుకు నాగేశ్వరం మాతో కలిసి చదివేవాడు. హెడ్మాస్టరుగారబ్బాయని చాలామంది మేస్టర్లు నాగేశ్వరానికి మార్కులు బాగావేసేవారు. తెలుగు మేస్టరు మరీ ఆప్యాయంగా వాడికి ఫస్టుమార్కే వేస్తూ ఉండేవాడు. మా క్లాసులో నిజంగా అందరికన్నా తెలివిగలవాడు శ్రీరామ్మూర్తని ఒకడుండేవాడు. (శ్రీరామ్మూర్తి ఇప్పుడు కాలేజీ లెక్చరరుగా పనిచేస్తున్నాడు.) వాడూ నాగేశ్వరమూ చాలా స్నేహంగానే ఉండేవాళ్ళు కాని అర్థ సంవత్సరపు పరీక్షల్లో తెలుగుమేస్టరు నాగేశ్వరానికి ఫస్టుమార్కులేసి తనకు తక్కువ మార్కులు వేసినందుకు శ్రీరామ్మూర్తికి కష్టం కలిగింది. శ్రీరామ్మూర్తి నాగేశ్వరం ఆన్సరు పేపరు మంచిగా అడిగితీసుకుని తన పేపరుతో పోల్చి చూసుకున్నాడు. ఎక్కడా పోలికలేదు. రెండు పేపర్లూ తీసుకొచ్చి శ్రీరామ్మూర్తి మా అందరికీ చూపించాడు. అందర్మూ చూసి ఊరుకున్నాం. కాని మార్కండేయులు మాత్రం ఆగ్రహావేశుడైనాడు. ఆ పేపర్లు రెండూ పట్టుకుపోయి హెడ్మాస్టరుకుచూపి, "చూడండి, మీ అబ్బాయని తెలుగు మేస్టారు ఎంత అన్యాయం చేశాడో!" అని ఫిర్యాదుచేశాడు.

హెడ్మాస్టరు ఆ కాగితాల కేసి చూడడానికి బదులు మార్కండేయులును రెండు బెత్తపు దెబ్బలతో సత్కరించి, "ఇక ఎన్నడూ నీకు సంబంధించని విషయాల్లో వేలుపెట్టకు" అని హెచ్చరించి పంపాడు.

ఇందువల్ల మార్కండేయులుకు కలిగిన మరొక లాభమేమిటంటే, శ్రీరా

మూర్తి నాగేశ్వరమూ యథాప్రకారం స్నేహితులుగానే ఉంటూ ఇద్దరూ కలిసి మార్కండేయులుతో మాట్లాడటం మానేశారు.

* * *

అన్యాయమంటే మార్కండేయులు కంతపగ దేనికో నేనర్థం చేసుకోలేను. వాడికాబుద్ధి తల్లినుండో తండ్రినుండో సంక్రమించి ఉండాలి. నేను చూచినంత వరకు సాంఘిక దురన్యాయాన్ని ఏ పరిస్థితులలో చూసీ చూడనటు నటించాలో తెలిసినవాళ్ళే అంతో యింతో బాధపడుతున్నారు. సుఖపడుతున్నారు.

మార్కండేయులు బాగుపడలేదన్న దానికి వేరేరుజువు అవసరంలేదు. వాడు సుఖపడ్డాడా అన్న విషయం తెలుసుకోవటమే కష్టం; వాడిలో పశ్చాత్తాపమన్నది ఏకోశానా ఉన్నట్టు నాకు తోచదు. అందుచేత, ఒకవేళ వాడు సుఖపడకపోయినా, తాను సుఖపడటం లేదన్న బెంగ వాడికి లేదనే అనుకోవాలి.

చదువుకుంటున్నంత కాలమూ మార్కండేయులు ఉపాధ్యాయులతోనూ, లెక్చరర్లతోనూ, ప్రిన్సిపాలులతోనూ పేచీపడుతూనే వచ్చాడు. ఒక ప్రిన్సిపాలు వాడికి ట్రాన్స్‌ఫరు సర్టిఫికెట్టు ఇచ్చి కాలేజీనుంచి పంపించేశాడు కూడానూ.

వాడి న్యాయపర్వతం వాణ్ణి ఒక విధంగా హింసించలేదు. దానిమూలంగా వాణ్ణి అందరూ అంతదూరాన వుంచటమేకాక, అవహేళనకూడా చేసేవాళ్ళు. తానేదైనా తప్పు చేసినట్టుతోస్తే వెంటనే తనవల్ల అపచారం జరిగినవాళ్ళకు క్షమాపణ చెప్పుకునేవాడు. ఇతరుల తప్పులను క్షమించలేనట్టే వాడు తన తప్పులను కూడా క్షమించలేక పొయ్యేవాడు. అందువల్ల కూడా వాడు అవహేళన పాలవుతుండేవాడు.

మార్కండేయులు ఆటే కలవాడు కాకపోవటంచేత వాడు చదువు ముగిస్తూనే ఉద్యోగంలో చేరవలసి వచ్చింది. ఉద్యోగంలో కూడా వాడిగతి ఇంతే అయింది. ఏ ఉద్యోగంలోనూ ఎక్కువకాలం నిలవలేక పొయ్యేవాడు. వాడికి క్రమంగా న్యాయంతోబాటు హక్కుల మీద కూడా అభిమానం ఏర్పడింది. న్యాయానికీ హక్కులకూగల సంబంధం అర్థమైనాక వాడు ఇతరుల హక్కులకోసమూ, తన హక్కులకోసమూ రకరకాల మనుషులతో పేచీపడసాగాడు.

* * *

మార్కండేయులుకు పెళ్ళి అయింది. చదువు పూర్తి అయే సమయానికే పెళ్లాం కాపరానికి వచ్చింది. వాడి అత్తవారు పెద్ద భాగ్యవంతులు కారుగాని, వాడికన్న కాస్త మంచి స్థితిలోనే ఉన్నారు. వీడికి ఉద్యోగం ఊడినప్పుడల్లా వాళ్లే ఆదుకుంటూ ఉండేవాళ్లు. వాడి పినమామగారు పోలీసు సబిన్‌స్పెక్టరు కూడానూ. ఆయన వీణ్ణి సబిన్‌స్పెక్టరు సెలెక్షనుకు పొమ్మన్నాడు. వీడు పోలీసులనూ, బ్రిటిషు అధికార్లనూ పడతిట్టేసి ప్రాణంపోయినా పోలీసుశాఖలో పనిచెయ్యనన్నాడు.

"మా బాబాయి పోలీసుశాఖలో ఉన్నాడు గదా, ఆయన ఎదటనే పోలీసులను తిట్టకపోతేనేం ? ఆయన ఏమనుకుంటాడు?" అన్నది వాడిభార్య.

"ఏమనుకుంటాడూ? నాకు పోలీసులంటే అసహ్యమనీ, వాళ్లను మనుషులల్లే చూడలేననీ అనుకుంటాడు" అన్నాడు మార్కండేయులు. "ఏదో సహాయంచేద్దా మని ప్రయత్నించేవాణ్ణి అట్లా అవమానిస్తారండీ?"

"ఆయన్నేం అవమానించానూ? పోలీసులను మెచ్చుకోకుండా ఆయనను గౌర వించటానికి వీల్లేదా ఏం?"

"ఆయన చేసే ఉద్యోగాన్ని తిట్టి ఆయన్ను మర్యాద చేస్తారు కాబోలు. ఆ సంగతి నాకు తెలీదు." అన్నది వాడిభార్య.

"అర్థం ఉండేటట్లు మాట్లాడ్డం నీకే తెలుసునన్న భావంతో మాట్లాడకు. ఆయన నన్ను పోలీసుల్లో చేరమనకపోతే నేనాయన ఉద్యోగం ఊసే ఎత్తనేమో. పోలీసుపని నీచమని నా నమ్మకం. ఆయనకే ఆ నమ్మకం వుంటే ఆ ఉద్యోగం చేస్తాడా? ఆయనకు తెలీనివిషయం నేను చెప్పటంలో తప్పేం? ఆ వెధవ ఉద్యోగం చెయ్యటమేకాక ఆయన దాన్ని వెనకేసుకుని కూడా రావాలా?"

"ఆయనేమీ వెనకేసుకురాలేదు."

"నన్నాపని చెయ్యమంటూంటేనే?"

"ఇంతలో మీ సొమ్మేంపోయింది. చెయ్యనని చెబితే సరిపోలా."

"ఎట్లా సరిపోతుందీ? ఎందుకు చెయ్యనని అడగడూ?"

"నాకిష్టంలేదంటే సరి!"

"ఎందు కిష్టం లేదంటే?"

"ఆయనేమీ అనడు."

"నాలో నిజంగా ఆసక్తి కలవాడైతే తప్పక అడుగుతాడు. అప్పుడీ సమా ధానాలు చెప్పాలిసొస్తుంది."

"మీ మనస్సులో ఉండేదంతా తడివి తెలుసుకునేటందు కాయనకేం పట్టింది?"

"ఆయనకు పట్టబట్టే నా ఉద్యోగం సంగతి మాట్లాడాడనుకున్నాను. నన్ను ఉద్ధరించిన కీర్తికోసం మాట్లాడాడనుకోలేదు. అట్లా వచ్చినవాడైతే నేనన్నదాన్లో తప్పేమీ లేదులే!"

"మీరు చేసినపని రైటని ఋజువు చేయటానికి ఎంతవాదనైనా చేస్తారు."

"ఏ వాదనా చెయ్యకుండా నువు చెప్పింది రైటంటే నీకెక్కువ తృప్తి కలుగుతుంది కాదూ? నే నెన్నడూ నావల్ల తప్పు జరిగిందని ఒప్పుకోలేదు కాదూ?"

వాడిభార్య వాడితో ఇటువంటి వాదనలు చేసినప్పుడు, వాదనలో ఓడనన్న నమ్మకంతో కాక, కేవలం ప్రాణం విసిగి మాట్లాడటం మానేసిందీ. ఇప్పుడుకూడా అట్లాగే మానేసింది.

మార్కండేయులుకు భార్యమీద ఎంత ప్రేమ ఉన్నదో చెప్పటం సాధ్యం కాదు. వాడు ప్రేమించలేనివాడు మాత్రంకాడు. కాని వాడిభార్య వాణ్ణి ఎంతవరకు ప్రేమించిందన్నది సందేహాస్పదమే. ప్రేమించేవాణ్ణి లోకం ప్రేమిస్తుందని ఇంగ్లీషు సామెత ఒకటి ఉంది. కాని కంటికి కనిపించని వాటిని ప్రేమించేవాళ్ళను మామూలు మనుషులు సులభంగా ప్రేమించలేరు. కళలనూ వీరి నియమాలనూ ప్రేమించే వాళ్లను సామాన్యంగా ఎవరూ ప్రేమించలేరు. మార్కండేయులును వాడిభార్య ప్రేమించలేకపోయినట్టయితే అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. తనను ఆమె సరిగా అర్థంచేసుకునేదన్న విశ్వాసంకూడా మార్కండేయులుకు ఉండేదికాదు. వాళ్ళిద్దరికీ పిల్లలు కలక్కపోవటంతో ఈ ఎడం మరింత అయిందేమో కూడానూ.

యుద్ధంసాగిన అయిదేళ్ళ చిల్లరకాలమూ[1] మార్కండేయులుకు ఒక విధంగా సాగిపోయింది. ఈ కాలంలో మార్కండేయులు అత్తవారిస్థితి బాగా పెరిగింది. మార్కండేయులు బావమరుదులిద్దరూ తమపింతండ్రి మొదలైనవారి సహాయంతో రెండుచేతులా కుప్పలుతెప్పలుగా ఆర్జించారు.

యుద్ధంముగిసిన ఆరునెల్లకల్లా మార్కండేయులు యధాస్థితికి వచ్చేశాడు. ఉద్యోగంలేదు. ఆరేళ్ళు కష్టించి వాడు మిగిల్చినదల్లా నూరు రూపాయలు. ఇది కూడా చూస్తుండగానే కర్పూరం హరించినట్లు హరించిపోయింది.

మార్కండేయులు పెద్దబావమరిది ఒక రోజువచ్చి మార్కండేయులు భావి కార్యక్రమం గురించి మాట్లాడాడు.

"నీకి ఉద్యోగాలవేట దేనికి, మావూరు వచ్చేసి మా వ్యాపారంలో తోడు పడు. నీకేలోటూ ఉండదు. నాలుగు మంచిముక్కలు చెవిని వెయ్యటానికి స్వాములవారున్నారు. ఎటువంటివాళ్ల ఇళ్లకూ పోని ఆయన మన ఇంటికి పదిరోజులకు కొకసారన్నా వస్తూ ఉంటారు." అన్నాడు.

ఈ స్వాములవార్ని మార్కండేయులు చూడలేదుగాని ఆయన్ను గురించి కొంత విని ఉన్నాడు. కొన్నేళ్ళ కిందట ఈయనే ఒక గ్రామంలో కృష్ణస్వామివాడు. కృష్ణావతారం ధరించి రాసక్రీడలు చేశాడు. భక్తులంతా పారవశ్యంతో భజన చేస్తుండగా ఈ అవతారపురుషుడు చుట్టూ పరివేష్టించి ఉన్న ఆడవాళ్లను బట్టలు విప్పదీసేసి తనకు సాష్టాంగపడమన్నాడు. ఆయనను మెల్లిగా ఆవూరి వారు సాగనంపారు. స్వాములవారు కావటంచేత దేహశుద్ధి తప్పింది.

"నాకు దొంగవ్యాపారం మీదా, దొంగస్వాములార్లమీదా నమ్మకంలేదు. నా బతుకు నన్ను బతకనీ!" అన్నాడు మార్కండేయులు. వాడు పెళ్ళాంకేసి చూడలేదు. ఆమె మొహాన ఏభావం ఉంటుందో వాడి కీపాటికి బాగా తెలుసు.

"నువ్వు చాలా ధర్మపరుడివని నాకు తెలుసులే. అయినా నీ బతుకు నువ్వు

1. రెండవ ప్రపంచ యుద్ధకాలం 1939-1945

క్కడివే బతకటంలేదు. మా చెల్లెలుకూడా బతుకుతున్నది. ఆ సంగతి నీకు తట్టినట్టు లేదు.'' అన్నాడు బావమరిది.

"ఈ దౌర్భాగ్యపు దేశంలో ప్రతి ఆడదీ మొగుడి బతుకులో భాగంపంచుకోవలిసిందే గాని గత్యంతరంలేదు.''

"అది ఆసరాచూసుకుని నీ భార్యపట్ల నీ ధర్మం నెరవేర్చకుండా కూచుంటావా!''

"దొంగవ్యాపారం చెయ్యడమేనా నువు ధర్మమనేది?''

''దొంగ వ్యాపారమన్న మాటను నువు ఉపయోగిస్తున్నదేగా —''

''నువయితే దాన్ని ఏమంటావ్?''

"నేనయితే, మా యింటో కూర్చుని హాయిగా ఇంత తినగలమనిషి, నీ ఇంట పస్తులెందుకు పడాలంటాను? నీ మూర్ఖత్వంవల్లనే గదా దానికీగతి అంటాను!"

"నీ చెల్లెలు తిండి తిన్నగా తినకుండా ఉండగలందులకే నేను దారిద్ర్యం అనుభవిస్తున్నాననా నీ ఉద్దేశం? ఏనాడు నాతో కష్టాలు పడలేకపోతే ఆనాడు మీ చెల్లెలు మీ ఇంటికి వెళ్ళిపోవచ్చు. దానికి నేను తిండీ,గుడ్డా లోపంచేశానేమోగాని మనిషి కుండదగిన మానవ హక్కులు లోపం చెయ్యలేదు." అన్నాడు మార్కండేయులు.

"దానికి సమయం వస్తుందేమోలే" అన్నాడు బావమరిది.

* * *

గాంధీజీ హత్య జరిగిన వారంరోజులు కాకపూర్వమే[1] మార్కండేయులునూ, వాడి భార్యనూ, బావమరుదులు తమ యింటికి తీసుకుపోయినారు. అప్పటికి పది హేనురోజుల క్రితమే మార్కండేయులు మరొక ఉద్యోగం పోగొట్టుకుని ఉన్నాడు. అందుచేత అత్తవారింటికి వెళ్ళటానికి ఆటే పేచీ పెట్టలేదు.

స్వాములవారుకూడా వచ్చి మార్కండేయులు అత్తవారింట బసచేసి ఉన్నాడు. ఆయన కోసం వచ్చేభక్తులూనూ. పొయ్యే భక్తులూనూ. అందులో అనేకమంది గొప్ప ఉద్యోగాలు చేసేవారూ, చదువుకున్నవారూ, ధనికులూనూ. స్వాములవారిని చూస్తూనే మార్కండేయులకు ఏవగింపు కలిగింది. దానికితోడు ఆయనచేసే సంభాషణ వాడు అసలే సహించలేకపోయినాడు.

స్వాములవారు ఎంతసేపు మాట్లాడినా రెండు మూడు విషయాలను గురించే మాట్లాడేవాడు. అందులో ఒకటి తాను తలుచుకుంటే ఎవరినన్నా భస్మీపటలం చెయ్యగలనని. గాంధీజీ హత్య నిర్ణయించింది తానేనని ఆయన బాహాటంగా ప్రభుత్వాధికారుల ఎదటా, ఉద్యోగస్తుల ఢంకామీద దెబ్బకొట్టి చెప్పాడు. ఆయన చెప్పే మరొక విషయం ఏమంటే తాను చేసిన బంగారం గురించి, గుట్టలకు గుట్టలు రాళ్ళు బంగారం చేసిపెట్టాట్ట. అది తనకు అవసరం లేదుట, కావలసినవాళ్ళ

1. గాంధీజీ హత్య జరిగింది 1948 జనవరి 30వ తేదీన. అంతకుముందు వారంరోజులు అంటే జనవరి 24వ తేదీ.

తెచ్చుకోవచ్చుట. "ఆ బంగారమంతా అట్లానే పడివుంది," అంటాడు గాని అది ఎక్కడ పడి ఉన్నదీ ఆయన చెప్పనూలేదు. ఎవరూ అడగనూలేదు.

స్వాములవారికి అన్నిటికన్న ప్రియతమమైన విషయం ఆడవాళ్ళను గురించి మాట్లాడటం. వాళ్లు పిల్లల్ని కనటం గురించీ, పిల్లలకు పాలివ్వటం గురించీ, వాళ్ళ పుట్టుకావటం గురించీ ఎంత మాట్లాడినా ఆయనకు విసుగులేనట్టు కనబడింది.

ఆయన భక్తులకు ఉద్యోగాలిప్పిస్తాడు. డబ్బు రప్పిస్తాడు. తనమీద గురి ఉంచడానికి వాళ్ళకు చెప్పరాని బాధలు కల్పిస్తాడు.

ఆయన ప్రసంగం వింటుంటే మొట్టమొదట మార్కండేయులుకు కలిగిన సందేహమేమంటే వినేవాళ్ళంతా వెర్రివాజలని ఆయన అనుకుంటున్నాదేమోనని. ఒక గంటకల్లా ఈ సందేహం పోయింది. వాళ్లు వెర్రివాజలే. ఆయననోట ఏం వచ్చినా స్వీకరిస్తారు. నమ్ముతారు.

"మనుషులిట్లా ఎందుకవుతారు? వాళ్ళ ఆలోచనాశక్తి ఏమవుతుంది?" అనుకున్నాడు మార్కండేయులు. ఆ ప్రశ్నకు సమాధానం తెలిసివచ్చింది. ఈ స్వాములవారి దగ్గిరికి వచ్చేవారు జిజ్ఞాసువులుగా రావటంలేదు. వాళ్లు తమ మేధస్సుకు స్వస్తి చెప్పి డబ్బుకోసం, క్షేమంకోసం, ఇహ సుఖాల గ్యారంటీకోసం వస్తున్నారు. వీళ్ళవి ఆయన ఎదట బానిస బుద్ధులు. అవి ప్రశ్నించలేవు, విమర్శించలేవు, తిరగబడలేవు. సమాజం విచ్ఛిన్నమవుతున్నదనీ, మనుషుల సాముదాయిక భావాలు పటాపంచలై వ్యక్తి స్వార్థమే మిగిలి ఉందనీ ఈ స్వాములవారు కనిపెట్టాడు. ఏ రాజకీయవాదికి అర్థంగాని జీవితసత్యం ఈ సన్యాసివాడికి అర్థమయింది. వీళ్ళను తన ఇనపపిడికిట్లో చిక్కించుకున్నాడు.

"నేను ఇంటికి వెళ్ళిపోతున్నాను. వస్తావా?" అన్నాడు మార్కండేయులు పెళ్ళాంతో.

"పొద్దునేగా వచ్చింది? అప్పుడేనా పోవటం!" అన్నదామె.

"రాత్రిబండికి పోదాం. నువు రాకపోతే నేను ఒక్కణ్ణే పోతాను."

"మా అన్నయ్యలతో చెప్పండి."

మార్కండేయులు చెప్పాడు. చెప్పటమే కాదు, స్వాములవార్ని గురించి తానేమనుకుంటున్నదీకూడా చెప్పాడు. వాళ్ళు మారు మాట్లాడలేదు.

"నువు స్వామివారి అనుజ్ఞతీసుకుని వెళ్లటం మంచిది. ఆయన అనుజ్ఞ లేకుండా బయలుదేరినవాళ్లు చాలా కష్టాలపాలవుతారు." అన్నాడు పెద్ద బావమరిది.

"ఈ చాదస్తమంతా నువుకూడా నమ్ముతున్నావా?"

"నువుకూడా అంటే? నేనాయన అమానుషశక్తులు కళ్లారా చూసినవాణ్ణి."

"నేనాయన్ను అడగను. నాకాయన గార్డియనుకాదు." అన్నాడు మార్కండేయులు.

"త్రిమూర్తులకుకూడా ఆయనే గార్డియను. నువ్వు అడక్కపోతే నేనే అడుగుతాను."

"మీ చెల్లెలు వెళ్లటానికి మా ఆజ్ఞలేదు. ప్రాణంలేని తోలుబొమ్మలు నిష్క్రమించవచ్చు. అగచాట్లపాలు కావచ్చు," అన్నాడు స్వాములవారు, మార్కండేయులు బావమరిది ప్రశ్నించగా.

"స్వాములవారు ఒప్పుకోలేదు. నేను పోతున్నాను, వస్తావా" అన్నాడు మార్కండేయులు భార్యతో.

"అమ్మో, నేనురాను." అన్నదామె.

ఆ రాత్రి బండికని మార్కండేయులు బయలుదేరాడు. స్టేషనుకువెళ్ళే దారిలో వాడి పక్కగా ఒకటి రెండు రాళ్లు పడినై. స్వాములవారికి రాళ్ళుపడేయించే మహత్తుండికూడా, ఆ రాళ్ళు తగిలేటట్టువేసే గురిలేకపోవటానికి వాడు నవ్వుకుని రైలెక్కాడు.

*

మార్కండేయులు భార్య ఆనాటినుంచీ పుట్టింటోనే ఉన్నది. వాడి భార్య ఏడాదికింపట ఒక పిల్లను కన్నది. అంతకుపూర్వం తొమ్మిది మాసాలక్రితం మార్కండేయులు డబ్బుకోసం రహస్యంగా వచ్చి రెండు రోజులుండి డబ్బు పట్టుకు పోయినట్టూ స్వాములవారే డబ్బు ఇచ్చినట్టూ వాడి అత్తవారు చెబుతారు. స్వాములవారు వాడి పెళ్లానికి చాలా నగలు చేయించిపెట్టారు.

తన భార్య ప్రసవించిందని తెలిసిన రోజే మార్కండేయులు మా ఇంటికి వచ్చాడు. రాత్రి మాయింటనే పడుకున్నాడు. తన విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు. నన్ను కొంత డబ్బు అడిగి తీసుకున్నాడు. మర్నాడు ఫలానిచోటికని చెప్పకుండా బయలుదేరిపోయినాడు. వాడిప్పుడెక్కడ ఉన్నదీ ఎవరికీ తెలీదు. నాకైనా ఒక కార్డుముక్క రాయలేదు. ఇక వాణ్ణి గురించి నాకేమీ ఆశలేదు. వాడి అధ్యాయం ముగిసినట్లే భావిస్తాను. "ఈ జీవితం ఇట్లా ఎందుకయినట్టు" అని వాడన్న మాటమాత్రం నేను బతికున్నన్నాళ్ళూ నా చెవుల్లో మారుమోగుతూనే, ఉంటుంది. ఆ మాట అన్నప్పుడు వాడు తన విషయమే ఆలోచిస్తున్నాడని నాకు తోచలేదు.

— ముద్రణ : ఆంధ్రజ్యోతి మాసపత్రిక,
మే 1950

# ఆత్మసంయమం

ఆత్మసంయమం గురించి నాకు బుద్ధెరిగిన నాటినుంచీ ఎవరో ఒకరు ఉపదేశిస్తూనే వచ్చారు. అబద్ధం ఎట్లా చెప్పేది ? కంచంలో కూరవేస్తే అన్నం పెట్టేలోపల కూర తినెయ్యకూడదని మా అమ్మ చేత్తోనూ నోటితోనూ కూడా చెప్పింది. బుర్రకెక్కి చావలేదు. నాతప్పే అనుకోండి. ఓ వేళ చిన్నపిల్లకి ఆత్మ సంయమ మంత పెద్ద విషయం అబ్బదేమో. ఎటుపోయి ఎటొచ్చినా మంచిదని మా అమ్మ, తప్పని తెలిసికూడా, వొట్టి కంచంలో అన్నం పెడుతూ వచ్చేది. అట్లాగూ నాకు ఆత్మసంయమం అబ్బిచావక ఉత్తమెతుకులే నోట్లో వేసుకునేవాణ్ణి. ఆర్థిక దృష్టిలో ఓవేళ వొట్టి కూర తినటంకంటె వొట్టి మెతుకులు తినటం ఓ పక్షాన నయమే అయినా, ఆత్మసంయమం దృష్టిలో చేతిని, నోటిని కట్టెయ్య లేకపోవటం కూర విషయంలో ఎంతో అన్నం విషయంలోనూ అంతేగా!

ఈ సంగతే మా అమ్మకు తట్టిందో ఏమిటో మరి. ఆవిడమటుకు తన అను మతి పొందకుండా నేను నోట్లో ఏమీ పెట్టుకోరాదనీ, అట్లా పెట్టుకోవడం పెద్ద మనిషి లక్షణంకాదనీ, నలుగురిమధ్యా తినేటప్పుడు ఈవిధంగా నడుచుకున్నట్టయితే నన్ను కాస్త ఇదిగా చూస్తారని నాకు నచ్చచెప్పింది. నాకా యీడున ఆత్మసంయమం గురించి తెలియకపోతే తెలీదేమోగాని పెద్దమనిషితనానికి రోషంవచ్చినా నన్ను నలుగురూ ఇదిగా చూసినా ఒప్పుకోవటానికి సంసిద్ధుణ్ణికాని కారణంచేత కంచంలో వడ్డించిన పదార్థాలు వడ్డించినట్టే నోట్లో వేసుకునే అలవాటు మానుకున్నాను. అయినా నా ఆత్మసంయమం పూర్తి అయింపనుకోవటానికి వీల్లేదు. ఎందుచేతనంటే నా నోరు కట్టుపడినా చెయ్యిమటుకు కట్టుబడి చావక కంచంలో వేసిన కూరగావి పచ్చడిగాని వేలుతో పొడవటమూ, అన్నంలో బియ్యపుగింజల కోసమూ, రాళ్ళు ఏరటమూ మొదలైన పనులుచేస్తూ ఉండేవాణ్ణి.

ఇంతా శ్రమపడి మా అమ్మ నేర్పిన ఆత్మసంయమం దక్కలేదని చెప్ప టానికి నాకెంతో విచారంగా ఉంది. మా అమ్మ చెప్పిన పాఠాలు నేను పెద్దయినాక ఆచరణలో పెట్టలేదు. మరీ నిగ్రహపరులైన వాళ్ళమధ్య భోజనానికి కూచున్నప్పుడు వాళ్ళనుచూసి సిగ్గుపడి చేతినీ నోటినీ కట్టేసుకుంటానే గాని మామూలు మానవ మాత్రుల సమక్షంలో అన్నం ముందర ఆత్మసంయమం అంటే పాటించను.

మా అమ్మేకాదు, నా చిన్నతనం నాకు చాలా మంది పెద్దలు ఆత్మ సంయమం నేర్పటానికి ప్రయత్నించి విఫలులైనారు. చేతిలో రెండణాల డబ్బులు

కన్పించినప్పుడల్లా కాఫీ హోటల్లో తినవద్దని, సినిమాలూ దిబ్బలూ చూడవద్దనీ నాకు పెద్దలు చాలా ప్రభోదం చేశారు. ఈ విధంగా నేనే నా మొదటి పదిహేను సంవత్సరాల వయస్సులోనూ తగలేసినడబ్బు దాదాపు ఓ పాతిక రూపాయలుంటుం దనే ఆర్థిక విషయం అట్లా ఉంచి నాకు కాఫీ హోటలూ, సినిమా నాటకాదులూ వ్యసనం అయిపోవటం గురించి పెద్దలు చాలా గట్టిగా చెప్పారు. ఎనభై ఏళ్ళ మా తాత తను పుట్టి పెరిగిన అరవైయేళ్ళదాకా సినిమా అనేది చూసిఎరగడని విన్నప్పుడాయన ఆత్మసంయమంచూసి నేను చాలా సిగ్గుపడ్డాను. పూర్వకాలం వాళ్ళ ఆత్మసంయమం గురించి వింటుంటే నాకు నేనెంత పాతకుణ్ణో తెలివొచ్చింది. చిన్నతనంలో నేనెరిగిన ముసలాళ్లలో నలభై ఏళ్లదాకా రైలెక్కని వాళ్లు, జన్మలో ఎన్నడూ, ఊరికే చూసే కూచిపూడి భాగోతాలూ, హరికథలూ, తోలుబొమ్మలూ, జంగం కథలూ తప్ప, కానీ ఖర్చుచేసి నాటకాలు చూడనివాళ్ళూ ఉన్నారు. వెధవది, డబ్బు ఖర్చు మాటకాదు; కాని అక్కడ ఆత్మసంయమం ప్రధాన విషయం. ఘుంచిగోష్ఠి ఎవరూ కాదనరు. నేనెరిగిన ఓ ముసలాయన మా ఊళ్లో వెంకటనారాయణగార్ని భాగోతం[1] పాతిక ప్రదర్శనాలు చూశాడు. అవును మరి. భాగోతం చూడటం పుణ్యం! అట్లాగే మా తాతయ్య కూడా డెబ్బై ఆరోఏట శ్రీరామజననం[2], శ్రీకృష్ణజననం, కాళీయమర్దన[3], అహి మహి[4], లంకాదహనం[5] మొదలైన పుణ్య సినిమాలు వరసనచూశాడు. దానికేం? నేను సినిమా కోసం తాపత్రయపడ్డానంటే శాకందులో పుణ్యం గురించి తెలిసికాదుగా — ఏదో సరదాగా ఉంటుందని : పాయె ఆత్మసంయమం ..

నాకీ ఆత్మసంయమం ఎందుకంటలేదు భగవద్గీత చదివితే అర్ధమయింది. భగవద్గీతలో కూడా ఆత్మసంయమం గురించి ఉంది. "బుద్ధీంద్రియాణి సంయమ్య"[6]

---

1. వెంకట నారాయణగారి భాగోతం...
2. శ్రీరామ జననం : దాదాసాహెబ్ ఫాల్కే తీసిన మూకీ చిత్రం.
3. కాళీయ మర్దన : దాదాసాహెబ్ ఫాల్కే తీసిన మూకీ చిత్రం.
4. అహి మహి : దాదాసాహెబ్ తీసిన మూకీ చిత్రం.
5. లంకాదహనం : దాదాసాహెబ్ తీసిన మూకీ చిత్రం. ఇంకొక రాదా పిలిం కంపెనీ సంస్థ కాళ్లకూరి దర్శకత్వంలో మరొక టాకీ ఈ పేరుతో 1936 లో వచ్చింది. ఇందులో నటేశన్ అంజనేయ పాత్రదారి.
6. బుద్ధీంద్రియాణి సంయమ్య : "భగవద్గీతలోని మూడవ అధ్యాయం 6 వ శ్లోకం "కర్మేంద్రియాణి సంయమ్యాయ అస్తే మనసా స్మరన్ ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే." ఏదో చదివినట్లు గుర్తు అని చెప్పదన్నాడు కాబట్టి తర్మస్థానంలో బుద్ధి పొరపాటని సర్దుకోవచ్చు.

ద్రవ్యస్థుడో ఏదో మరి చదివినట్టు గుర్తు. ఏమైనా భగవద్గీతలో చెప్పబడిన హంశాలు మనబోటిగాళ్ళకి కాదని మా పెద్దత్తయ్య మొగుడు గట్టిగా చెప్పేవాడు. ఒకసారి ఆయన అస్పృశ్యతను సమర్థించి మహాత్ముణ్ణి తిడుతుంటే "ఇదేమిటి, మామయ్యా, కుక్కనూ చండాలుణ్ణి ఒకటిగానే పండితులు చూస్తారని భగవద్గీతలో ఉందిగామాలు గదా!" అని నేనంటే, "భగవద్గీతలో ఉన్నదంతా మనం చేసి యీడవగలమట్రా, నాయనా." అన్నాడాయన. దాన్నిబట్టి నాకేమనిపించిందంటే, నాకన్న పెద్దలైన వాళ్ళు చెప్పబట్టేకదా నాకు ఇంద్రియ సంయమమూ, బుద్ధిసంయమమూ అంట కుంచా పోయింది అనుకున్నా.

అటుపిమ్మట కూడా "పెళ్లామంటే ఆపేక్షగా ఉండకురా, బాబూ," "అత్త వారిమీద ఆడపాదడపా అలుగుతూ ఉండరా, నాయనా," "కనపడ్డ నిర్భాగ్యుని చేతిలోనూ కానీ డబ్బులు వెయ్యకురా తండ్రీ" అంటూ చెప్పారనుకోండి. అవి నా బుర్రకెక్కలేదు. (వెధవది కానీ డబ్బు అడుక్కునేవాడి చేతిలో పెడితే ఇంతలో దివాలా తీస్తామని కాదనుకోండి; అటువంటి ఆనందాని కలవాటు పడితే అది వొదిలించుకోవటం మళ్ళీ మన సాధ్యంకాదు గదా అని!).

జీవితం ఎంత విచిత్రంగా ఉంటుందనటానికింతకన్న తార్కాణం ఏం కావాలి? నాకిక సంయమం కుదరదని నేనూ నా పెద్దలూ ఏకగ్రీవంగా రూఢి చేసుకున్న తరవాత అకస్మాత్తుగా తలవని తలంపుగా, నాకా తారక మంత్రం పట్టుపడింది. నాకివాళ ఆత్మ సంయమం కుదరటమే కాక దాన్ని అభ్యసించేటందుకు శాస్త్రీయ మైన మార్గం కూడా దొరికింది.

ఈ తారకం నా కందించినవాడు నా స్నేహితుడు. నాతో కలిసి మా ఆఫీసులో పనిచేసే శేషాద్రి.

మా ఆఫీసులో అందరమూ గాలికెగిరే పుల్లాకుల మోస్తరుగా యుద్ధ విషయాలు[1] చర్చిస్తూ జర్మనీ గెలిచినట్టు కనపడ్డప్పుడు వార్తల్ని నమ్ముతూ, ఓడిపోతున్నట్టు వార్తలు వచ్చినప్పుడు వార్తల్లో ఉండే అసత్యాన్ని గ్రహిస్తూ కిందూ మీదూ అవుతూ ఉండే వాళ్ళం. బెంగాలులో కరువొచ్చిందంటే[2] ఇక అక్కడ విప్లవం ఎప్పుడొస్తుందా అని ఎదురు చూసేవాళ్ళం. వెధవది కడుపులో చల్ల కదల కుండా కూర్చున్నవాళ్ళం దేశానికి విముక్తి తీసుకురాలేక పోవటమంటూ కలగటం నిత్యమేమో కాని ఎట్లాగూ తిండికిమాడి చచ్చేవాళ్ళు ఊరికే చావటం దేనికి, నిష్షేపంగా స్వాతంత్ర్యంకోసం చావక అని మాలో కొందరికి దాహగా ఉండేది.

కాని మా శేషాద్రిమటుకు ఈ చర్చలకు చలించేవాడు కాడు. ఎంతో నిప్పులో ఉండేవాడు. ఒకసారి నాకు వాడి వాలకం చూసి మరీ ఆశ్చర్యంవేసి,

1. రెండవ ప్రపంచ యుద్ధ విషయాలు.

2. బెంగాలు కరువు : అరుణోదయంలోని ప్రస్తావన గమనించండి.

"ఏమిటోయ్ నీ అభిప్రాయం బెంగాలు ఫామిన్ రిలీఫుకు చందాలు వేస్తున్నారు. వెయ్యటం మంచిదంటావా? వెధవది. డబ్బిక్కాదనుకో. ఈ డబ్బిచ్చి మనం మంచి చక్కని విప్లవాన్ని కాస్తా పాపం చేసినవాళ్ళ మవుతామేమో, భారత స్వాతంత్ర్యానికి తెరచి ఉన్న ఒక్క తలుపూ మూసినవాళ్ళ మవుతామేమోనని ! ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటి?" అన్నా.

శేషాద్రి నా అజ్ఞానానికి చిరునవ్వు నవ్వి, "పిచ్చివాడా, ఈ బెంగాలు క్షామమూ, భారత స్వాతంత్ర్యమూ, ఎక్కడున్నై?" అన్నాడు.

ప్రశ్న తెలివిగానే వేశాడు. బెంగాలు క్షామం బెంగాల్లోనే ఉన్నట్టు పత్రికల్లో పడింది. ఓవేళ నీ రాయలసీమకన్నా, ఏ కేరళానికన్నా వచ్చిందేమో అప్పటి కింకా తెలీలేదు. భారత స్వాతంత్ర్య మంటే దాన్ని గురించి అభిప్రాయభేదా లున్నట్టు నాకర్థ మయింది. కొందరది ఇంగ్లీషువాళ్ళ దగ్గిరుందన్నారు. మరి కొందరు అది మహాత్ముడి దగ్గిరికి ఎన్నడో వచ్చిందనీ మిగిలినవాళ్ళనే ఇంకా చేర లేదనీ అస్పష్టంగా చెప్పారు. ఈ విషయాలన్నీ పైకి అని నా రాజకీయమైన అజ్ఞానం ఎందుకు బయట పెట్టాలని నాకు తెలీసట్టు ఒప్పుకున్నా.

అయితే నేను చెబుతా పట్టు. అది మన మనస్సుల్లోనే ఉందన్నాడు శేషాద్రి. ఇది నేను వెనక విన్న సంగతి మటుకు కాదు.

నా విస్మయం కనిపెట్టి శేషాద్రి నాకు తత్వం బోధించాడు.

"ఒక్క రహస్యం చెబుతున్నా విను. అన్ని మానవసమస్యలకీ ఒకటే సూత్రం. దాన్ని ఆటోసజెషనంటారు[1] ఇంగ్లీషువాళ్లు. అదే ఆత్మ సంయమం." అన్నాడు శేషాద్రి. "మిమ్మల్నందర్నీ బాహ్య సమస్యలు బాధిస్తయ్. మీ మనస్సులూ బుద్ధులూ బాహ్యానికి బంధించబడి బాహ్యవిషయా లెట్లా ఆడిస్తే ఆడుతున్నై. నా మనస్సు బాహ్యాన్ని జయించింది. నాకు సృష్టి మీద ఆధిపత్యం వచ్చేసింది. బెంగాలు సమస్య నీకుంది. నాకు లేదు. భారత స్వాతంత్ర్య మంటున్నావు నువు. నే నటువంటిది లేదంటున్నాను".

"ఎందుకు లేదూ! ఉందిగా మరీ"

"ఉందని నువు కనుక్కున్నావా? లేదు. నీకెవరో చెప్పారు. నువ్వెక్కడో చదివావు. ఆ చెప్పిన ముక్కా చదివిన ముక్కా నీ బుద్ధిని లొంగదీసి నిన్నాడిస్తున్నయ్. నిన్ను నువు పరీక్షించుకో నువ్వెంత దీనస్థితిలో ఉన్నదీ బోధపడుతుంది."

---

1. ఆటో సజషన్ : వైయక్తిక బోధద్వారా, వైయక్తిక ప్రోత్సాహంద్వారా కోరిన ఫలితాన్ని ఒక వ్యక్తి సాధించే వైద్య విధానం. కు (cou'e) అనే ఆయన దీన్ని మొదట్లో వ్యాప్తికి తెచ్చారు. (Self Mastery through Conscious Autosuggestion, London, 1922).

నే నాశ్చర్యపడ్డా, శేషాద్రి నాకన్న చాలా బలంగా ఉన్నట్టు నాకు స్పష్టమయింది. నీకి బలం ఎట్లావచ్చిందన్నా.

"ఆటోసజషన్ ఇంకోళ్ళు చెప్పిన మాటలు విని దుర్బలుడవై పోతున్నావు కదా నీ మాట నువు విని బలాఢ్యుడివి కాగలవు."

"ఎట్లా?"

"బలంగా అనుకో. ప్రపంచంలో నా అంత గొప్పవాడు లేడనుకో. అన్నిటినీ జయిస్తున్నాననీ, ఏదీ నన్ను చలింపచెయ్యలేదనీ రోజూ అనుకో. ఉదయం నిద్ర లేవగానే ఓ పదిసార్లూ, నిద్రపొయ్యేముందు మరో ఓ పదిసార్లూ అనుకో. ఈ విధంగా ఓ నెలరోజులనుకో. నీలో మార్పు నీకే బోధపడుతుంది." అన్నాడు శేషాద్రి చాలా బలంగా.

నేను వెంటనే నమ్మలేకపోయినా.

"నీకో నిదర్శనం చెబుతా విను. మా చుట్టాల్లో ఓ కుర్రవాడికి జబ్బుచేసి మంచాన పడ్డాడు. దబ్బుతగలేసి ఎంతోమందిచేత మందులిప్పించారు. రోగం నయం కాలేదు సరేకదా వాడికి చచ్చిపోతాననే అధైర్యం ఏర్పడింది. ఆ స్థితిలో నేను వాడికి ఆటోసజిషన్ రహస్యంచెప్పాను. అంతే, ఇకవాడు డాక్టర్ను దగ్గిరికి రానిస్తే ఒట్టూ. తనకి రోగం లేదన్నాడు. రోగం నయమయిందన్నాడు.

శేషాద్రి నాకేసి సగర్వంగా చూశాడు.

"జబ్బు నయమయిందా?" అన్నా.

"కాలేదనటానికి మనం ఎవళ్ళం?"

"లేచి తిరుగుతున్నాడా?"

"లేదు, పోయినాడు" అన్నాడు శేషాద్రి. అది మన వాదన కప్రస్తుతం అని సూచిస్తూ.

ఈ ముక్క వినగానే నేను కొంత నిరుత్సాహపడ్డమాట నిజమేగాని శేషాద్రి ప్రోద్బలం మీద నేను అతనిదగ్గిర ఉన్న పుస్తకాలు చదవటానికి ఒప్పుకున్నా. దానికూడా మొదట ఒప్పుకోలా. శేషాద్రి నాకేసి తీవ్రంగా చూస్తూ, "నా దగ్గిర ఉన్న పుస్తకం చదువు. చదువు, చదువు, చదువు, చదువు, చదువు, చదువు, చదువు, చదువు." అని తీవ్రంగా అనేటప్పటికి ఎందుకనో సరేనన్నా. ఆ తరవాత తెలిసింది—వాడు తన ఆత్మశక్తి హెటరో సజషన్[1] ద్వారా నామీద ప్రయోగించాడని.

ఆ పుస్తకాలు చదివానేమో, నేను బాగుపడ్డాననుకోండి. ఇప్పుడు నా దౌర్బల్యం యావత్తూ పోయింది.

ఇదే నిజమైన ఆత్మసంయమం. అదివరలో నన్ను ఆత్మసంయమం చేసుకోమన్న వాళ్ళే గాని దానికిటుకు చెప్పినవాళ్ళులేరు. ఆ పుణ్యం శేషాద్రి కట్టుకున్నాడు.

---

1. హెటరో సజషన్ : అన్యబోధ సోత్సాహం ద్వారా అనుకున్న ఫలితాల్ని సాధించడం.

ఇదే తపస్సు. ఈ తపస్సు చేసే మునీశ్వరులు గొప్పవాళ్ళయినారు. అప్సరసలు వాళ్ళ మనస్సులను చలింపజేసి వాళ్ళ తపోభంగంచేశారు. బాహ్య ప్రపంచం తాలూకు సజెషనుకు యోగి లొంగరాదు.

నేను ప్రస్తుతం అదే అభ్యసిస్తున్నా. నా భార్య చిక్కిపోతున్నదని చెబుతారు. నాకు మతిమరుపు కలుగుతున్నదని చెబుతారు. నేను లక్ష్యం చెయ్యను. కాంగ్రెసు మిత్రులొచ్చి జిన్నాను[1] మనం ప్రోత్సహించకూడదంటారు. కమ్యూనిస్టు మిత్రులొచ్చి ప్రజాసంస్థల కైక్యత కావాలంటారు. అయితే ఏమంటాను, మా చుట్టాలొచ్చి నా స్థితిలో ఉన్నవాడు నలుగురికీ సహాయపడాలంటారు. నే వినిపించుకోను. నా సంసారం గురించీ, నా భావిని గురించీ ఎవరెవరో ఏమిటేమిటో చెబుతారు. దాంతో నాకేంపని? నాకు ఆర్థిక సమస్యలు లేవు, రాజకీయ సమస్యలు లేవు, సాంఘిక సమస్యలు లేవు. నాకు కావలసిన అన్ని ఇంద్రియ సుఖాలూ, స్వేచ్ఛలూ నా మనస్సులోనే ఉన్నై. నేను రాజాధిరాజును, దేవాది దేవుణ్ణి. నాకు చుట్టాలూ, స్నేహితులూ ఎవరూలేరు. ఎవరూ అవసరంలేదు. మనుషులంతా తుచ్ఛులే. ఎక్కడైనా ఒక పూర్వజన్మ వాసనగల మహాయోగి కనిపించి, "బాబూ ఓ రూపాయి యిప్పించండి. అదే పదివేలుగా భావిస్తాను." అంటాడు. నాకు పరమానందమవుతుంది. "అహో, ఈ భ్రష్టుడికి ఆటో సజెషన్ కిటుకు తెలియకపోబట్టికదా ఆ రూపాయి సహాయం అవసరం లేకుండా పదివేలు భావించలేకుండా ఉన్నాడు?" అనుకుంటాను. వెధవది డబ్బుకాడు.

ఈమధ్య ఇట్లాగే మా బావమరిది నాతో, "బావా మా పెద్దదాన్ని మీవాడికి చేసుకో, ఇవి చేతులుకావు కాళ్లు." అని బతిమాలాడు. మావాడి ఆత్మసంయమం చూసి సంతోషించాను గాని, దానిబలం ఎంత ఉందో చూడటానికి "కట్నం ఏమిస్తావు" అన్నా. "మామూలు లాంఛనాలు తప్ప నావల్లకాదు. అవే వెయ్యినూట పదహార్లనుకో. మోటారు సైకిళ్ళనుకో." అంటూ ప్రారంభించాడు.

"అబ్బాయీ, నువు ఆటోసజెషన్ ఎరక్కపోవటం మూలంగా నా మనోశక్తి నీ విధంగా తృణీకరిస్తున్నావు. నేనో పుస్తకం ఇస్తాను. అది చదివి అభ్యసించి, అప్పుడు నా దగ్గిరికి మాట్లాడటానికిరా. మీ పెద్దదాని పెళ్ళి విషయం మాట్లాడతా." అని చెప్పి పంపించా.

కనక ఈ విషయం గురించి తీస్తే ఎంత లోతైనా ఉంది. ప్రస్తుతం మన దేశీయులంతా ఈ రాజకీయాలూ, ఈ సాహిత్యాలూ, ఈ సిద్ధాంతాలూ మానేసి ఆటో

---

1. జిన్నా : మహమ్మద్ అలీ జిన్నా (1876-78) జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన ముస్లిం నాయకుడు. పాకిస్తాన్ మొదటి గవర్నర్ జనరల్ (1947 - 1948)

సజషను అభ్యసించటం మొదలుపెడితే దేశమంతటా హెన్రీఫోర్డులూ[1], రాక్ఫెలర్లూ[2] అయిపోతారు. మన దేశంలో నలభై కోట్ల రాక్ఫెలర్లయిపోయిన తరవాత ఏ రాజకీయ సమస్యా, సాంఘిక సమస్యా ఉండదు. ఉండదు, ఉండదు, ఉండదు, ఉండదు, ఉండదు, ఉండదు, ఉండదు, ఉండదు....

—ముద్రణ : ఆంధ్రజ్యోతి (మాసపత్రిక),
నవంబరు 1945

1. హెన్రీ ఫోర్డు (1867-1947) అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన ఆటో మోబైల్ ఉత్పత్తిదారుడు.
2. రాక్ఫెల్లరు : (1874-1960) అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన సంపన్నుడు, ఆయిల్ మేగ్నట్ దాత.

# భగవద్భక్తి

"ఏమండీ ? మనింటోకూడా ప్రతిరోజూ భజన చేసుకుందాం?" అన్నది నా భార్య. ఇప్పుడెవరింటో చేసుకుంటున్నారేమిటి?" అన్నాను చదువుతున్న పుస్తకం మూతపెట్టి. మాది చాలా అన్యోన్య దాంపత్యం. రోజూ కీచులాడుకునే భార్యాభర్త లకు ఒక్కరోజయినా అన్యోన్యంగా ఉందామని ఉండటం సహజం. నాకుమటుకు ఏవంక పెట్టుకుని మా రాజితో కీచులాడుదామా అని ఉంటుంది. అదృష్టవశాత్తూ ఇప్పుడు నాకు దొరకవలసిన విషయం దొరికింది—దేవుడు !

నా భార్యకు నామీద అపారమైన ప్రేమ ఉందనటానికి ఎటువంటి సందేహమూ లేదు. నలుగురు పిల్లల్ని కనికూడా అన్నివిదాల కంటిని రెప్పలాగా కనిపెట్టి ఉండ టమే కాక నామీద తనకు పెంచిన మోహముట—అంటుంది మా రాజీ ! తన పిల్ల లంతా పళ్ళేటగాని, నావంటి ముంతమామిడి పళ్ళు కారుట! ఇదంతా నేను లేకితనం కొద్దీ చెప్పుకుంటున్నా ననుకోవద్దు. నేనంటే అంత మమత ఉన్నా మా రాజీకి నన్ను చూస్తే ఒకందుకు అలుసు—నేను నాస్తికుణ్ణిట ! నా వైపు వాళ్ళంతా నాస్తికులేట ! తనూ తన తల్లిదండ్రులూ, తన అన్నలూ పరమ భాగవతోత్తములుట !

మా వైపు వాళ్ళంతా నాస్తికులని నేను ఒప్పుకున్నాను. మా నాన్న దేవుడి పేరు చెప్పి కానీ ఖర్చు చెయ్యవలసి వస్తే, "ఆఁ! భగవంతుడు తిరపతిలోనే ఉన్నాడా ఏమిటి? ఇక్కడలేడూ ? గుళ్ళోకి పోయి కొబ్బరికాయలు కొడితేనే సంతోషి స్తాడా ఏమిటి ?ఇంట్లోనే బెల్లంముక్క నైవేద్యంచేస్తే సంతోషించడూ?" అని తప్పిం చుకో జూచేవాడు. మా అమ్మ ఈనాటికి కూడా ఒక పురాణంగాని, హరికథగాని, భాగోతం గాని, ఏమిటో ఎరగదు. అటువంటి వాటికి తీరిక లేదు. ఆవిడకు తీరినా ఆవిడ కవి అర్థం కానూకావూ, బాగానూ ఉండవూ ! ఇక నేను ఉండనే ఉన్నాను, నా భార్య అన్నట్టు, ఆవలించి అయినా "అబ్బ ! శ్రీరామచంద్రా !" అనుకోని పరమ నాస్తికుణ్ణి!

ఎటొచ్చీ నా భార్యే అంగీకరించదు, తన వారంతా ఆస్తికులై మాకంటె వెలగ బెట్టిందేమీ లేదని. మా మామగారు అపర రామదాసు. ఆయన ఇప్పుడు రెండవ రామకోటి రాస్తున్నాడు. భద్రాచలంలో ఆయన్ని ఎరగని వారు లేరని ఆయనే చెప్పుకుంటాడు. గనక నిజమే అయి ఉండాలి? మా పెద్ద బావమరిది బైరాగి ముండా కొడుకై తిరుగుతూ, పెళ్ళీపెటాకులూ లేకుండా, గంజాయి గాళ్ళ దగ్గిర చేరినా వాడి నోటివెంట వేదాంతం తప్పరాదు. మధ్య మధ్య తనే ఆ యొక్క

విరాట్స్వరూపం అనే భ్రమలోపడి అందర్నీ హైరాన పెడుతూ ఉంటాడు కూడానూ. ఇక మా రెండో బావమరిది భజనలు చెయ్యటానికి ప్రసిద్ధి. వాడు లేని భజనలూ సప్తాహాలూ ఉండవు. మా ప్రాంతాల అసలు భజన తంతు వాడికి తెలిసినట్టు మరొకరికి తెలియదుట. (భజన కొక తంతుకూడా ఉందని నా అంతట నేను ఊహించగలిగి లయినా ఉండను.). మా రెండో అబ్బాయి ముఖ్యంగా తరంగాలు పాడటంలో నిధి. బాల గోపాల తరంగం[1] ఆ వెల్లటూరాయన[2] పాడితేనే వినాలి. మళ్ళీ మా బావమరిది పాడితేనే వినాలి అని ఒక అభిప్రాయం వుంది కొంత మందిలో.

పోతే మా అత్తగారు! ఆవిడ కాపరానికి వచ్చిన చాలా సంవత్సరాల వరకు ఏమీ ఎరగని దానల్లే ఉండి ఉండి అకస్మాత్తుగా ఒకనాడు తనే అందరికన్నా తలపన్నిన భక్తురాలని రుజువు చేసుకున్నది. సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రమూర్తి ఆవిడ వంటిమీదికి వచ్చాడు అది కొంచెం వివరంగా చెప్పవలసిన కథ.

మా మామగారు మొదట రామకోటి పూర్తిచేస్తూ ఉండిన రోజులవి. ఆ రోజుల్లో మా అత్తగారికి ఒంటో సరిగా ఉండటంలేదు. ఈ బ్రాహ్మడేమో భోజనాల ముందర రామకోటి పెట్టుకుని రెండుజాములదాకా వడ్డనకు అనుజ్ఞ ఇచ్చేవాడు కాడు.

ఒకనా డిట్లాగే మా మామగారు రామకోటి రాసుకుంటున్నాడు. మా అత్తగారు ఆయనకు ఎదురుగా గోడకు చేరగిలబడి కూర్చుని, "దబ్బున కానిస్తురా! నా ప్రాణం పోతున్నదీ!" అని అంటున్నది. ఇంత దైవచింతన లేని భార్యను తనకు అంటగట్టటంలో భగవంతుడి ఉద్దేశం ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపడుతూ మా మామగారు రామకోటి రాస్తూండగా, నిస్త్రాణగా కూర్చుని ఉండిన మా అత్తగారు చప్పున నిలుక్కుపోవటం ఆయన కళ్ళ పడింది.

"అమ్మాయి! ఒసే, మీ అమ్మకు పైత్యపు దడ వచ్చినట్టుంది. ఒకసారి ఇట్టరావే!" అని ఆయన కూతుర్ని కేక పెట్టాడు.

మా అత్తగారు కోపంతో చలించి పోతున్నదానల్లే కంపిస్తూ, భయంకరమైన కళ్ళతో భర్తవంక చూస్తూ, "నాకు పైత్యమంటావుట్రా? చూడు, నిన్నేం చేస్తానో! పెట్టు నాకు హారం పెట్టు! పెడతావా లేదా!" అని పెడబొబ్బలు పెట్టింది.

నా భార్య— అప్పటికింకా నాకు పెళ్ళి కాలేదు; పసిది — తండ్రి కేక విని పరిగెత్తుకుంటూ వచ్చి, తల్లి పెడ బొబ్బలకు నిర్ఘాంతపోయి వణుకుతూ అట్లాగే

1. బాలగోపాల తరంగం : కూచిపూడి భాగవతులు ప్రదర్శించే నారాయణ తీర్థుల బాలగోపాల తరంగాలు.
2. వెల్లటూరాయన : చూడండి పశ్చాత్తప్తుడు కథ.

నిలబడ్డది. ఇదంతా ఇట్లా ఎప్పుడు జరుగుతుందా అని కనిపెట్టుకున్న వాళ్ళల్లే పొరుగింటి పుల్లమ్మా, ఎల్లమ్మా అక్కడ మరుక్షణంలో హాజరయినారు.

"త్రిపురమ్మకు పూనింది!" అన్నది పుల్లమ్మ, వెంటనే జరిగిందంతా అర్థం చేసుకుని.

"అపరాధం అనవయ్యో, పిచ్చి బ్రాహ్మడా ! నువ్వు రామకోటి రాస్తున్నా వాయెనూ! మరి దానికి శాంతి వద్దూ? మొక్కుకో — సంతర్పణ చేస్తానని మొక్కుకో!" అన్నది ఎల్లమ్మ.

"ఓహో, ఇదా సంగతి?" అన్నట్టు మా మామగారు అక్కడ ఉన్నవారిమీద ఒక చిరునవ్వు ప్రసరింపజేసి, భార్యవంక తిరిగి, "నాకామాత్రం తెలియదా, స్వామీ! నీ కోటి పూర్తి కాగానే భద్రాచలం రానా? నిన్ను దర్శించనా? వైభవంగా సంతర్పణ చెయ్యనా- వెయ్యి బ్రాహ్మణ్యానికి?" అని మృదువుగా తన భార్య వంటిమీదికి వచ్చిన శ్రీరామచంద్రమూర్తిని మందలించాడు. ఆయన మాటల ధోరణి చూస్తే ఆ యొక్క శ్రీరామచంద్రమూర్తి ఈ మాత్రం తెలుసుకోలేనందుకు మా మామగారు ఆశ్చర్యపడ్డట్టూ, ఆ సారికి రామచంద్రుడి అజ్ఞానాన్ని తాను క్షమించినట్టూ కనపడ్డాడు. అయితే ఎదురుగా సాక్షాత్కరించిన శ్రీరామచంద్రమూర్తి, విగ్రహరూపంలో భద్రాచలంలో చూడటం ఎందుకో నాకర్థం కాలేదు!....అయినా నా మామగారివంటి భాగవతోత్తముడి ఉద్దేశాలను విమర్శించటానికి నేనెవణ్ని? నా భార్యా, మామగారూ స్వయంగా చెప్పిన సంగతులే ఇక్కడ రాస్తున్నానుగాని నేనేమీ కల్పించటం లేదు. ఊహించటం కూడా లేదు.

అట్లా ఊహించదలుచుకున్న వాణ్ణే అయితే, మా మామగారు మా అత్తగార్ని చూసి అసూయపడ్డట్టు ఊహించగలను. నిజానికి, చూడండి. పేరుపడ్డ రామదాసు మా మామగారు, రామకోటి రాస్తున్నది మా మామగారు, గడ్డాలూ మీసాలూ పెంచుకున్నది మా మామగారు, రామకోటి రాసినందుకు తద్దోష పరిహారార్థము సంతర్పణ చెయ్యబోతున్నది మా మామగారు! (రామకోటి రాయటానికి జ్యేష్ఠా నక్షత్రానికి చేసినంత శాంతి చెయ్యాలల్లే కనపడుతుంది మరి[1]) చివరకు ఆ రామచంద్రుల వారు మా అత్తగారి వంటిమీదికి వచ్చి ఆమెను పవిత్రం చెయ్యటమేమిటి ? ... ఇట్లా ఊహించగలను కాని నా ఊహ నిజమని నాకే నమ్మటానికి లేదు.

ఎందుకంటే—

పై కథ వినండి. ఆ నాటికి మా అత్తగారికి గుగ్గిలం పొగా పాడు వేసి, వళ్ళు తెలిసేటట్టు చేశారు ఎల్లమ్మా, పుల్లమ్మా. ఆ తరవాత ఆవిడను బావి దగ్గిరికి తీసుకుపోయి ఇన్ని బిందెలు తోడి ఆవిడకు స్నానం చేయించి వాళ్ళు వెళ్ళిపోయినారు.

---

1. జ్యేష్ఠా నక్షత్రానికి — : జ్యేష్ఠా నక్షత్రం దుష్టప్రభావంగల నక్షత్రమని జ్యోతిష్యం నమ్మేవాళ్ళ నమ్మకం.

కాని రెండు మూడు రోజులకు మా అత్తగారికి మళ్ళీ పూనింది. ఆవిడ మళ్ళీ "హారం! హారం!... నాకు హారం కావాలి!" అని పెడబొబ్బలు పెట్టింది.

మా మామగారీసారి రాముడికి కటీఁటిగా చెప్పేశాడు — "స్వామీ! నిన్ను నమ్మిన భక్తుల్ని నువ్విట్లా ఒత్తిడి చేస్తే ఎట్లా? నీకు శాంతి చేస్తానని నీకు నేను వాగ్దానం చేస్తినే! నీకు పరిస్థితులన్నీ తెలుసునే''

కాని మా అత్తగారు మట్టుకు తన ధోరణి మానలేదు.

''స్వామీ, నేను నీ భక్తుణ్ని. నువ్వు భక్తులకు దాసుడివి. నువ్వు నన్నేమీ చేయలేవు....ఇక సర్దుకోవాలి! లేకపోతే వీలులేదు!" అని మా మామగారు భార్య మీద ఎగిరి పడ్డాడు.

తరువాత అప్పుడప్పుడూ మా అత్తగారికి పూనుతూనే ఉండేది. మా మామగారు "స్వామీ, సర్దుకోవాలి ఊఁ!'' అని రాముణ్ణి తొందర చేస్తూనే ఉండేవాడు.

నిరాకారుడైన శ్రీరాముడి యందు అంత భక్తి ప్రేమ విశ్వాసాలు కలిగి ఉండిన మా మామగారు, రాముడు ఏ క్షణాన సాక్షాత్కరించుతాడో, తన భార్య నోట ఏ క్షణాన పలుకుతాడో అని గడగడలాడి పోతుండేవాడు. రామచంద్రమూర్తి తన యింటికి రావటం తన మంచికి కాదన్నట్టు ఆయన భావించే వాడనిపిస్తుంది, ఆయన ప్రవర్తన చూస్తే. కాని భక్తుడికి అటువంటి మనస్తత్వం అసంభవం! అందుకనే అన్నాను భక్తుణ్ని విమర్శించేటందుకు నే నెవణ్ణని.

నా భార్యవైపు వాళ్ళను గురించి యింత వివరంగా చెప్పాను. రాతలో చెయ్యి తిరిగిన వాణ్ణి కావటం చేత నేను కొంత యుక్తి వినియోగించి, మా మామగారి కుటుంబాన్ని గురించి అంతా నిజమే రాసినప్పటికీ, మా వాళ్ళ నాస్తికత్వం కంటే నా భార్య వైపు వాళ్ళ ఆస్తికత్వం ఏమంత ఘనంగా లేదని వినేవాళ్ళకు అనిపించేటట్టు చేసి వుండవచ్చును. నా రచనకు వశులై ఎవ్వరూ నా వైపు వాళ్ళను శ్లాఘించవద్దు, నా భార్య వైపు వాళ్ళను నిరసించవద్దు.

ఏమంటే ఆస్తికత్వమేమిటో, నాస్తికత్వమేమిటో మనమెవరమూ ఎరగము. మేమంతా నాస్తికులమేనని నేను అంగీకరించబట్టే నా భార్య మా వాళ్ళను నాస్తికులని చెప్పగలుగుతున్నది. "కాదు, మేము ఆస్తికులమే!" అని నేను నా నోటివెంట అన్నట్టయితే నా భార్య ఏమీ చెయ్యలేదు. వెనకటికి పురాణాలుకూడా ఇటువంటి చిక్కులోనే పడినై. "నాకన్న దేవుడెవడురా కుర్రకుంకా! జగన్నాధుండ, నాకంటె నీ భూతశ్రేణికి రాజు లేడొకడు![1]" అన్న హిరణ్యకశిపుణ్ణి భాగవత కర్త నాస్తికుడన్నాడు. (అంతకంటె చండాలమైన మాటలుకూడా అన్నాడులెండి) "నేనే సమస్త

1. నాకన్న....పోతన మహాభాగవతంలోని సన్నివేశం.

చరాచర ప్రపంచానికి నాధుణ్ణి, మా మేవ శరణం వ్రజ"[1] అన్న కృష్ణుణ్ణి భారత కర్త, ఆస్తికుణ్ణి చెయ్యటంతో పోనివ్వక సాక్షాత్తూ ఆ మూల విరాట్టు యొక్క భౌతిక స్వరూపం చేసిపారేశాడు. అట్లాగే "ఇందుగలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు"[2] అన్న ప్రహ్లాదుడు నాస్తికుడని నా భార్య అనలేదు గాని, "దేవుడు గుళ్లోనే ఉన్నాడా ఏమిటి? మన ఇంటో లేడూ?" అన్న మా నాన్నను నాస్తికుడనటానికి సందేహించదు. కనక అయ్యా చెప్పలేం!

నిజమయిన ఆస్తికుడికీ నాస్తికుడికీ మత వైషమ్యం ఉండితీరాలి. ఆస్తికుడు నాస్తికుడికి కాళ్ళుకడిగి పిల్లనివ్వడు. నా భార్య నన్ను అన్నివిధాలా ప్రేమతో చూసినా, నాస్తికత్వాన్ని మటుకు తప్పు పట్టటంలో అర్థంలేదు. ప్రపంచంలో ఎంతమంది ఆస్తికులున్నారో అంతమంది భగవంతులున్నారు. ఒకడి భగవంతుడితో ఒకరు తప్పు పట్టటానికి లేదు. ఇప్పుడిప్పుడు మతబుద్ధి నశించి, నాగరికత ప్రబలటంవల్ల ఒక మతం తాలూకు భగవంతుణ్ణి మరొక మతం సహించటం నేర్చుకుంటున్నది—"అంతా ఒకటే! మీరు అల్లా అంటారు, మేం కృష్ణుడంటాం, కిరస్తానీలు క్రీస్తు అంటారు!" అంటే పేరుతో ఏమీలేదని తాత్పర్యం. కాని మన ఆస్తికత్వం అంతటితో ఆగలేదు. మనదేవుడికి వెంట్రుకలు కావాలి, రక్తం కావాలి, లంచాలు కావాలి, దుష్టుడికి దూరంగా ఉన్నట్టు మనం మన దేవుడికి దూరంగా ఉండాలి. మన సామీప్యానికిగాని యీ దేవుడొచ్చాడో మనకేదో ఆపద ఉందన్న మాటే! ఎందుకో తెలియకుండా చెంపలు వాయించుకుని అపరాధం అన్నా — దేవుణ్ణి ఎట్లాగయినా సాగనంపాలి. తిరపతికి పోదామని ఊరికే అనుకోనైనా కూడదు! చెంపలు వాయించుకుని, ముడుపులు కట్టి, కొండలెక్కి, దేవాలయ నిధికి దోచిపెట్టి, సంతర్పణలు చేస్తామని వాగ్దానంచేస్తే అమృతాంజనం అవసరం లేకుండా తలనొప్పి పోతుంది! ఈ పరిస్థితులను సహించగలిగినవాడు ఆస్తికుడు, సహించలేనివాడు నాస్తికుడు!

1. నేనే సమస్త చరాచర.... భగవద్గీతలోని కృష్ణుడు "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ । అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః (18వ అధ్యాయం, 66వ శ్లోకం) అనగలిగినవాడు. మహాభారతంలో మానుషధర్మ ప్రవర్తకుడైన ఒక పెద్ద దిక్కుగా, రాజనీతిజ్ఞుడుగా, మనిషిగా కన్పిస్తాడు.

2. చక్రిసర్వోపగతుండు : పోతన భాగవతంలోని "ఇందుగల డందులేఁడని, సందేహము వలదు చక్రిసర్వోపగతుం, డెందెందు వెదికిచూచిన, నందందే గలడు, దానవాగ్రణి! వింటే" అన్న పద్యం, ప్రహ్లాదుడు హిరణ్యకశిపునితో అన్నది.

"ఏమండీ! ప్రతిరోజూ మనింటోకూడా భజన చేసుకుందాం?" అన్నది నాభార్య ఒకనాడు.

"ఇపుడెవరింటో చేసుకుంటున్నారేమిటి?" అన్నాను. నాభార్య కాపరానికి వచ్చిన కొత్తలోనే నేనూ ఆవిడా ఒకవిధంగా రాజీపడ్డాం— ఆవిడ తన యిష్టం వచ్చిన ప్రకారం భగవంతుణ్ణి ధ్యానించుకునేటట్లూ, నేనుమటుకు అందువిషయమై బాధింపబడకుండా ఉండేటట్లూ. ఆ రాజీని అతిక్రమించి నాభార్య నా దగ్గిర దేవుడి విషయమైన ప్రశంస తెచ్చింది కనక ఆవిణ్ణి కొంత ప్రాసింగులో పెట్టటానికి నాకు అధికారం ఉందని నేననుకున్నాను.

నే నడిగినదానికి నాభార్య "పోనిస్తురూ! మనకు ఒకళ్ళతో పోటీ ఏమిటి?" అన్నది. "అయితే 'మనంకూడా' అని ఎందుకన్నావు?—దీన్నే ఇంగ్లీషువాళ్ళు ఆడతర్కం[1]మంటారు."

"ఇంగ్లీషువాళ్ళకు తెలుగు వచ్చునా ఏమిటి?....అదంతా ఎందుకు లెస్తురూ? మనింటో భజన చేసుకుందాం."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? భజనచేస్తే ఇంటికి వంటికి మంచిది. దుష్టగ్రహాలు ఆసించవు."

"దుష్టగ్రహాలు ఆసించకుండా ఉండటానికి చీనాలో ఏంచేస్తారో తెలుసా? టపాకాయలు కాలుస్తారు. మనంకూడా—"

"ఏమి ఎగతాళండీ! మనం చీనావాళ్ళమూ ఏమిటి? డబ్బు ఏగాని ఖర్చు లేకుండా భజన చేసుకోటానికింత వితర్కిస్తున్నారుగాని టపాకాయలు కొంటారూ?"

"కొంటాను! దేవుణ్ణి భజన చేస్తున్నందుకు కళ్ళు నెత్తిమీదికి వచ్చే వాళ్ళున్నారు. టపాకాయలు కాలిస్తే ఒళ్ళు కాలుతుందేమో కాని కళ్ళు నెత్తిమీదికి మాత్రం రావు."

నా భార్య నావంక చాలసేపు విచారంతో చూసి, "నేను అడిగినదానికీ, మీరు మాట్లాడే దానికీ ఏమైనా సంబంధం ఉందీ? రెండక్షరాల్లో చెప్పేదానికి ఇంత రభస ఎందుకు చెప్పండి!" అన్నది.

"సరే నీ యిష్టం— నీ పిల్లల యిష్టం! నేనుమాత్రం భజన చెయ్యను. మీరు నాకు ఏనాడు అడ్డం వస్తే ఆనాడు ఇది ఆపుదలచేస్తాను!" అన్నాను.

ఎటుపోయి ఎటువచ్చినా మంచిదని నా భార్య నాకేమీ జవాబు చెప్పలేదు.

ఆరోజునించీ మాయింటో భజన ప్రారంభమయింది. మా పిల్లలు నలుగురూ

---

1. ఆడతర్కం : స్త్రీలకు సహజబుద్ధి తక్కువని సూచించే Women's logic అనే మాటకు తెలుగు.

భజనలు చేసేవాళ్ళ దగ్గిరికివెళ్ళి కీరపాండురంగ భజన కీర్తనలు[1] నేర్చుకోసాగారు. మా ఆవిడకూడా వడ్డించేటప్పుడూ, వంటచేసేటప్పుడూ, కసువు వూడ్చేటప్పుడూ— కీచుగొంతుతో ఆ కీర్తనలు మననం చేసుకోవటం వింటూండేవాణ్ణి.

మాయింటో భజన చెయ్యటానికి అనుజ్ఞ యిచ్చిన వారంరోజులకు నేను నా భార్యతో అన్నాను.

"ఏమే ఇవాళ వెంకట్రావు బందరునించి వచ్చాడు, కనిపించాడు—"

"వెంకట్రావంటే కాంతమ్మ మొగుడా? నల్లగా పొట్టిగా అసహ్యంగా ఉండే ఆయన!" అని నా భార్య నాకు అడ్డం వచ్చింది.

"సరేలే! అసలు సంగతి విను. ఈ భజనలు మొదలుపెట్టిన తరవాత వాళ్ళింటో మాణిక్యంవంటి వెండి గిన్నె పోయిందిట! నామాట విను. ఈ భజన ఎందుకు? మానెయ్యి!"

"చాల్లెండి! భజన చెయ్యటమేమిటి, వెండిగిన్నె పోవటమేమిటి? నేనేం తెలివి తక్కువ దద్దమ్మ ననుకున్నారా? కావలిస్తే ఆయన్నదంతా కథ రాయమనండి!"

"అప్పుడు నమ్మదగినట్టుగా ఉంటుందేం? ఎంత కష్టపడి రాసినా నేను రాసే కథలు నమ్మదగినట్టుగా ఉండవు! కాదూ? పోనీ, నాకేం? నీ యిష్టం!"

ఒకనాడు మా పెద్దమ్మాయి నా దగ్గిరికివచ్చి, "నాన్నా, నాన్నా! 'పాండురంగప్రభో!'[2] పాటకు స్వరంచేసిపెట్టవూ? నేను హార్మనీమీద వేసుకుంటా నాన్నా!" అని గంతులు వేసింది. అది మాండ్ రాగంమీద ఒక మరాఠీ కీర్తనకు అనుకరణం. ఆ కీర్తనకు స్వరంవేసి, నేను వాయించి, మా పెద్దపిల్లచేత వాయింపించటం పూర్తిగా ఒకపూట పని అయింది. ఆరోజు సాయంకాలం నేను బయటికి పోతుండగా మా రెండోపిల్ల తనకు సరిగమలు నేర్పమని అర్జీ పెట్టుకుంది. రేపు చూస్తాను లెమ్మని నా దారిన నేను వెళ్ళాను.

ఆ రాత్రి పెద్దది తప్ప మిగిలిన ముగ్గురూ నా దగ్గిరికివచ్చి ఫిర్యాదు చేశారు— మా పెద్దది భజనకు హార్మోనిస్టు పనిచేసి భజన యావత్తూ తగలవేసిందట. ఆ విషయమై తీర్పు నావల్ల కాదని పిల్లలకు నచ్చచెప్పటానికి నాకు ఒక గంట పట్టింది.

మరొకనాడు మా పెద్దపిల్లను ఎవరో శ్లాఘించారుట, భజన చేస్తుంటే విని— "పక్కాముది ఏం వరహాల గొంతే! అది పాడుతుంటే అంతా సినిమాలో పాడినట్టుంటే!" అని.

---

1. కీరపాండురంగ కీర్తలు : 1919లో వెలువడిన వి. శి. బాబురావు పాండురంగ కీర్తనలు పుస్తకంలోనివేమో.

2. పాండురంగప్రభో : పాండురంగ భజనపాట పాదం.

దాని ఫలితం, మిగిలిన ముగ్గురు పిల్లలూ దానిమీద సత్యాగ్రహంపూనారు. దానితో కలిసి పాడారు. అది ఒక చరణం పాడితే వీళ్ళు మరొక చరణం పాడతారు. ఆఖరుకు గొంతులన్నా శ్రుతిలో కలపరు. అది త్వరగా పాడితే వీళ్ళు మెల్లిగా పాడతారు.

ఇక పెద్దది అపర నారదుడై పోయింది. అది మేలుకుని ఉందంటే పాడుతూ ఉందన్నమాటే. ఎవరన్నా దాన్ని పలకరిస్తే పాడుతూనే "ఏం కావాలి?" అన్నట్టు తల ఊపుతుంది. వాళ్ళడిగినదానికి అవుననో, కాదనో, తనకు తెలియదనో, అంతేననో పాడుతూనే సంజ్ఞచేస్తుంది తల ఊపుతో. అది దొడ్లో ఏ మూలో పాడుతూ ఉంటే, నా భార్య దేనికయినా కేకపెడితే అది పాట ఆపి "ఓయ్" అనకుండా, పాడుకుంటూ తల్లిదగ్గిరికివచ్చి పాడుతూ నిలుచుంటుంది.

నా భార్యకు ఒళ్ళుమండి దాన్ని ఏదోవిధంగా మాట్లాడేటట్టు చేస్తుంది. మా పెద్దది కోపం పట్టలేక "ఏం ఓర్వలేనితనమే, తల్లీ!" అని చెప్పి సమాధానం చెప్పకుండా మళ్ళీ పాడుకుంటూ వెళ్ళిపోతుంది.

రెండు మూడు రోజులపాటు నా భార్య పెద్దదాని కూనిరాగం వినపడ్డప్పుడల్లా, "అబ్బ! తలపట్టి పోతున్నది. తండ్రీ— దీని కూనిరాగాలతో!" అని నాకు వినపడేటట్టు విసుక్కునేది. ఇది ఎట్లాగూ నాదాకా వచ్చే సంగతేనని ఊహించి నేను జోక్యం కలిగించుకోలేదు.

ఆఖరుకు నా భార్య నా దగ్గిర ఫిర్యాదు చేసింది—పిల్లలందరిమీదా కూడా! అంతా విని నా తీర్పు చెప్పసాగాను.

"ముందు పెద్దదాని సంగతి విచారింతాం. అది రోజల్లా పాడుతుందంటావు. పాట ఆపిస్తే దెప్పుతుందంటావు.అది పాడేది మీరు భజనచేసే కీర్తనలేనా? ఇంకేం? అది రోజల్లా భజన చేస్తున్నది. ఇందులో తప్పేముందీ? వెనకటికి నారదుడూ ఇంతే— రోజల్లా పాడుతూనే ఉండేవాడు. పాడటం మానేశావో, ఎవరికో తంపులు పెట్టాడన్న మాటే!అందుకని దేవతలంతా నారదుణ్ణి నీవంటి భక్తుడు లేడని ఉబ్బించి, ఆ ముండాకొడుకును రోజల్లా పాడేటట్టు చేస్తుండేవాళ్ళు. నువు కూడా పెద్దపిల్ల విషయంలో అట్లాగే చెయ్యి—ఇంటికీ వంటికీ మంచిది. ఇక రెండో దాని సంగతి—"

కాని నా భార్య రెండో దాని విషయంలో నా తీర్పు వినడానికి ఆగలేదు, ముద్దుగా మొహం చిట్లించుకుని నా దగ్గిరనించి అవతలికి వెళ్ళిపోయింది.

తరవాత వారం రోజులదాకా నా భార్య నా సహాయం అపేక్షించలేదు. భజనలు జయప్రదంగా లేవని నేను ఊహించగలిగాను.

ఆఖరుకు మా ఆవిడ నాతో రాజీకి వచ్చింది.

"ఒక్కనాడు మీరు మేం భజన చేసేటప్పుడు దగ్గిర ఉండండి. ఈ కొంపవలకు నా మాటంటే ఖాతరిగా లక్ష్యం చేయటం లేదు! రెండు రోజులు మీరు దగ్గర

ఉండి వాళ్ళచేత భజన చేయిస్తే ఇంత అల్లరి ఉండదు. వాళ్ళకు మీరంటే గురి. నాలుగైదు రోజులు ఓపిక పట్టారంటే ఆ తరవాత మీరు మా చాయలకు రాకుం డానే పని జరిగిపోతుంది—"

ఆవిడను ఈ విధంగా మాట్లాడనిస్తే ఒక రోజు కాస్తా నెలలూ, సంవత్స రాలూ అయిపోతుందని, "ఈ విషయం మాత్రం నన్ను బాధించకు" అన్నాను. ఆవిడకు అర్థం వచ్చి.

"నా మాట వినరూ? పండు కామా?"

"కాదు !"

"మాకారూ?"

"మాడను!"

నా భార్య పాశుపతం ప్రయోగించింది — నా దగ్గర కూర్చుని నా తల నిమురుతూ "ఇంత బతిమాలుతుంటే ఒప్పుకోక పోవటానికి మీకు నోరెట్లా వస్తున్న దండీ!" అన్నది.

సరే, ఆ సాయంకాలం మా యింటో భజనకు నేను అతిథిని. మావాళ్ళు ఆనాడు చేసినది భజన కాదు కోలహాలం. ఏ చిన్న విషయంలోనూ నా భార్యా పిల్లలు ఒకరితో ఒకరు ఏకీభవించలేదు. భగవంతుడి సాన్నిధ్యంలో అందరూ ఒకటే నన్నది నేనానాడు ప్రత్యక్షంగా చూశాను — భజన దగ్గిర మావాళ్ళంతా మా పసి దానితో సమానమైనారు.

ముందు మా పెద్దపిల్ల హార్మోనియం తెచ్చి దగ్గిర పెట్టుకుని కూర్చున్నది. ఆ తరవాత మిగిలిన నలుగురూ చేరారు. "పాండురంగని భజనకు బోవా భక్తు లందరు రారమ్మా[1]" అనే కీర్తన ప్రారంభించారు. మా పెద్దది విడిగా హార్మోనియం వాయిస్తేనే చెప్పతరం కాకుండా ఉంటుంది. దానికి పడ్డచోట త్వర త్వరగా వాయించి పడని చోట్ల ఏకుపింజ తీసినట్టు సాగతీసి వాయిస్తుంది. ఇక నలుగుర్తో కలిసి పాడే భజనలో అది హార్మోనియం వాయించటం ఎట్లా ఉంటుందో చెప్పనవ సరం లేదు. మధ్య మధ్య దాని చేతికి తప్పు మెట్లు కూడా తగులుతూ ఉంటై. ఇది జరిగినప్పుడల్లా మా రెండోది ఆడ టార్జాను[2] కేక పెట్టినట్టు కేక పెడుతుంది. అప్పుడు మా మూడోది కడుపారా నవ్వుతుంది.

నా భార్యా పిల్లల్ని కసిరిన మీదట మళ్ళీ భజన సాగుతుంది. మా రెండోదీ మూడోదీ వాళ్లకు జ్ఞాపకం వచ్చిన చరణాలు వాళ్ళ యిష్టం వచ్చిన శ్రుతుల్లో పాడతారు.

---

1. పాండురంగని భజనకు....పాండురంగ భజనపాట పాదం
2. ఆడ టార్జాను : అసాధారణమైన బలిమి, పౌరుషంగల ఆటవికుడైన టార్జాన్ వంటి శక్తిగల స్త్రీ.

నేను చూసిన నాటికి భజన దీనికిందికి తేలింది — మా పెద్ద పిల్ల ప్రాణా నికి తన సంగీతంపాడే నేర్పు ప్రకటించే పాటకచ్చేరీ, రెండోదానికీ మూడోదానికీ అల్లరిచేసే అవకాశం, మా నాలుగోదానికి చాటుగా ప్రసాదం పొదం చేసే అవకాశం, నాభార్యకు పిల్లలమీద తను అధికారం చలాయించే అవకాశం. ఇందులో ఎవరికీ జయం చేకూరక పోవటాన మా యింటి భజన ఏ విధంగానూ రక్తి కట్టక పోయింది.

నా భార్య ఎన్నడూ పిల్లల్ని కొట్టదు. ఆనాడు వాళ్ళంతా తన్ను నా ఎదట పరాభవించటం సహించలేక, నా మాట వినక తను ప్రారంభించిన భజన యిట్లా పరిణమించటం నేను కళ్లారా చూశానన్నది తెలుసుకుని, పట్టలేక పిల్లలందర్నీ తలా ఒకదీ పెట్టింది. ఆనాటికి భజన ఆఖరయింది.

మా ఆవిడ మనస్సు కష్టపడుతున్నదని గ్రహించి, నేను, "నువ్వెందుకు, పాపం, వృథాగా హైరాన పడతావు? దేవుడి దగ్గిర పిల్లలకు అల్లరి చేసేటందుకూ, నవ్వేటందుకూ అధికారం లేకపోతే ఇంకెవరికుంది? భజన అంటూ పెట్టినదానివి నీ యిష్టం వచ్చినట్టు నువ్వు చెయ్యి. వాళ్ళ యిషం వచ్చినట్టు వాళ్లను గోల చెయ్యనీ! భజనవల్ల మనస్సుకు కాస్త శాంతి రావాలి కాని వ్యథ కలిగితే ఎట్లా?" అని బోధిం చాను.

"అయితే మానెయ్యండి!" అన్నది నా భార్య కళ్ళనీళ్ళ పర్యంతమయి.

అభిమానవతి, ఎగతాళి చేస్తే దారికి రాదని ఆ రాత్రి నా భార్యను బుజ్జగించి మంచి చేసుకుని ఒక సలహా చెప్పాను.

"నా మాట విని వారం రోజులపాటు ఈ భజన ఆపేసెయ్యి. ఆ తరువాత నేను వీళ్ళను ఎట్లాగైనా దారికి తెస్తాను," అన్నాను.

"ఈ రాక్షస సంతానంతో భజనలు కాదు" - అని మా ఆవిడ మిగిలినది నా ఊహకు వదిలి వేసింది.

అయితే నేను చెప్పిన సలహా జయప్రదంగా పనిచెయ్యలేదు. మా ఆవిడ భజన మానేసినా మా పిల్లలు మాత్రం మానలేదు. యథా సమయానికి వీళ్ళంతా చేరి మామూలు ధోరణిలోనే భజన ప్రారంభించారు. తల్లి దగ్గిరకూడా లేదేమో, వాళ్ళా రోజున చేసిన ఆగం అంతా యింతా కాదు. వ్యవహారం ముదురుతున్నదని తోచ గానే నేను భజన ఆపుదల చేయించి భోజనాలు పెట్టించాను. ఈ విధంగా రెండు మూడు రోజులు జరిగిన తరవాత మా ఆవిడ "వీళ్లఅల్లరి ఎట్లాగైనా మానిపింతురూ! పొద్దూకనివ్వరు. తల పట్టి పోతున్నది," అన్నది నాతో.

ఆనాటితో నా భార్య నాకు సొంతంగా ఓడిపోయింది. మళ్ళీ ఎన్నటికీ యిటు వంటి ఎత్తు ఎత్తనని ఆవిడచేత వాగ్దానం చేయించుకుని మా పిల్లల చేత యీ అల్లరి మానిపించాను. దానికి నేను చేసిందేమిటంటే ఒక గ్రామ ఫోనూ నాలుగు రికార్డులూ తెచ్చి ఇంటో పెట్టాను. మా పిల్లలు అల్లరి పిల్లలు కావచ్చుగాని అందరూ సంగీత

మంటే చెవి కోసుకుంటారు. సాయంకాలంపూట నేను పిల్లల్నందర్నీ చుట్టూ కూర్చో పెట్టుకుని ఆ నాలుగు రికార్డులు మోగించేవాణ్ణి.

అంతటితో నా భార్యకు భజన పిచ్చి వదిలింది. వదిలిందనుకున్నాను. ఎందు చేతనంటే ఆ మధ్య ఒకనాడు మా ఆవిడ నాతో, "ఏమండీ, విన్నారూ? ఈ మధ్య మనింటి పక్కన ఉండే వాళ్ళే, వాళ్ళ పిల్ల మూగది, కుసుమ హరనాథ్ జపం చేస్తే నోరు వచ్చింది. రోజూ వెయ్యిసార్లు 'కుసుమ హరనాథ్' అనుకునేదిట!.. మనింటో ఏమీలేదూ! అంటే, నేను, "మూగది జపం చెయ్యటం వింతకంటె మూగదానికి నోరు రావటం వింత ఏ విధంగా ఎక్కువ? మనస్సులో చేసిందంటావా? నువ్వు కూడా రోజూకు పదివేలసార్లు మనస్సులో కుసుమ హరనాథ్! అనుకో. మళ్ళీ భజన అంటూ పెట్టకు, నీ పుణ్యముంటుంది!" అన్నాను. "ఆ కీర్తనలు ఎంత బాగుంటయ్యను కున్నారు!" అన్నది. నేను 'ససేమిరా' అన్నాను. నా భార్య నిట్టూర్చి, "పోని వ్వండి గీతలో లేకపోతే ఏం చేస్తాం?" అని సరిపుచ్చుకుంది. ఇక ఎప్పటికీ ఆవిడ భజన ఊసెత్తదుకదా అని నేను దిగులు కూడా పడ్డాను—అర్థం లేకుండా.

కాని నిన్ననంటే నిన్న సాయంకాలం మా ఆవిడ బజారుకు బయలుదేరి నన్ను వెనక్కి పిలిచి, "ఏమండోయి! జ్ఞాపకం పెట్టుకుని గ్రామఫోను షాపులో రండయ్యా, రండయ్యా[1], రికార్డు తీసుకురండి! మరచిపోకండి" అని హెచ్చరించింది

—ముద్రణ : భారతి, మే 1938

1. రండయ్యా, రండయ్యా భజనకీర్తనకర్త తెలియదు.

# పెద్దవాడి ప్రాపకం

ఎన్నో రోజుల్లా అరిచి నాన్న నెల తిరిగేసరికి నూటపది తెస్తాడు. ఎట్లా సరిపోతుందీ ? నానమ్మా, అమ్మా, నాన్నా, నలుగురు పిల్లలూను. ఇంటికింద గుడ్డ పీలిక అనేది కొని సంవత్సరం ఐంది. ఆ బాకీ ఐరిసి దాగుంది గాని ఇంటో అన్నీ చింకిపాతలే. అమ్మ చీరలన్నిటికీ పుత్తకుట్లే. రవికెలన్నిటికీ మాసికలే. పిల్లల గుడ్డ లన్నీ చిరుగులుపట్టినై. ఒక్క దిండుకు గలీబు లేదు, ఒక్క దుప్పటి సరిగాలేదు. నాన్న బడికి వెళ్ళటానికైనా ఒక దోవతిగాని, చొక్కాగానిలేదు. వంటింట్లో అన్నీ చిల్లిబొచ్చెలే. గుడ్డపీలికలు పెట్టీ, చింతపండు మెత్తి అమ్మ నానా అగచాట్లూ పడు తున్నది. బొక్కెనకి చిల్లి. పైకి లాగేలోపల సగం నీళ్ళుండవు. కొత్త బొక్కెన కొనటానికి డబ్బులేదు.

నాన్న అమ్మను కోప్పడతాడు : "ఎవరు అయినవాళ్ళనూ, కానివాళ్ళనూ భోజనానికుండమనకపోతే ఇంత ఇబ్బంది ఉండదు. రాఘవరావు డెబ్బయ్యయిదు రూపాయల జీతంతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు" అంటాడు.

"రాఘవరావుకేం? ముగ్గురే పిల్లలు ! మనకు నలుగురాయె....ఇంటికొచ్చిన వాళ్ళని భోజనానికి ఉండమనకుండా పోనివ్వటం నా చాతకాదు బాబూ. మానాన్న పంక్తిని పదిమంది ఉంటేగాని భోంచేసేవాడు కాడు" అంటుంది అమ్మ.

మీ నాన్న సంగతి నా దగ్గిర చెప్పకు. మీ మేనత్త ఆస్తి లోకులకుపెట్టి, ఇంటిల్లిపాదీతిని, తన ఆస్తి దమ్మిడీలతో సహా పాతరేశాడు. కుర్రాణ్ణి పెంచుకుంటా నంటే ఇదుగో అదిగో అని ఆవిడ చచ్చేదాకా తాత్సారంచేసి ఆఖరుకు అంతా తనే దిగమింగేశాడు."

"చాతకాకపోతే మా వాళ్ళమీద విరుచుకుపడాలిసిందే."

"నే పడేదేమిటి ? నీ అన్నల సంగతి. వాళ్ళాయన అల్లుళ్ళకారుగా, ఒక్క గాను ఒక్కకూతురువు. నీ కెన్నడన్నా తన చేతిమీదుగా ఒక పాతికరూపాయలు ఖరీదుచేసే చీరకొన్న పాపాన పోయినాడా, మీనాన్న ?"

"ఏమో, మీకెవరు చెబుతారు ?. అన్నట్టు శాస్తుర్లు కొడుకు పెళ్ళి ఇంకా నాలుగు రోజులే వుంది. పదిహేను రూపాయలుంటే వెళ్ళిరావచ్చు. ఓ పది రూపా యలు చదివిస్తే చాలు. మన కున్నదేమిటో వాళ్ళకు తెలీదా ఏమిటి?"

"తన కొడుకు పెళ్ళినిమిత్తం మనం పాతికరూపాయలు ఖర్చు పెట్టగల

మనుకుంటే మీ శాస్త్రుర్లుకు మన సంగతి ఏమీ తెలీదన్నమాట. కావలిస్తే నే చెప్పానని మీ శాస్త్రుర్లుతో చెప్పు. అర్థమైంది గదూ ?"

"మీరు మరీ యిట్లా అయిపోతున్నా రేమిటండీ ? డబ్బులేదని పెళ్ళికి పోకుండా వుంటారా ? నే నెక్కడా విన్లేదు."

"మరి ఏంలేదని మానుకుంటారో చెప్పు, చూతాం."

"నేను నలుగురిలోనూ తలెత్తుకు తిరగక్కర్లా?"

"నేను ఇంట్లోనే తలెత్తుకు తిరగలేకుండా ఉంటే, నువు నలుగురూ అంటా వేమిటీ? ప్రస్తుతం నా తలే ఎత్తు. మాట్లాడక ఊరుకో."

"మీరేమీ ఇవ్వక్కర్లేదులెండి. చేతిగాజులు తాకట్టు పెట్టేస్తాను.''

"నీ పిల్లలు చింకిపాక్కాలేసుకుని ఏబ్రాసిలల్లే తిరుగుతుంటే నీకు అవమానం లేదు. వేలువిడిచిన పింతల్లి కొడుకు తన కొడుక్కు పెళ్ళిచేసుకుంటే వెళ్ళకపోతే నీకవమానం.''

"వాడు నాకు సొంత అన్నలకంటె ఎక్కువైనవాడు. ప్రేమానుబంధాలు మీకులేకపోవచ్చుగాని, మేం మీ మాదిరిగా పెరగలేదు.''

''అడగక్కర్లేదు. మీ పెద్దన్నా పెద్దవాడి వాడుక్కు నిన్ను పిలిచాడా ?''

"ఏదో డబ్బు యిబ్బందిలో ఉండి వాడు ఎవర్నీ పిలవకుండా ఆ పోగుకాస్తా పిల్లాడి మెళ్ళో వేసుకుంటే దానికి దెప్పేనా ?"

"ఇప్పుడు నీకేగాదు డబ్బుయిబ్బంది లేంది !''

"పెళ్ళి ఒడుగూ ఒకటేనా ఏమిటి ?''

అమ్మతో వాదించటం చాలాకష్టం. నాన్నవేసే ప్రశ్నలో తనకు చిక్కిన మాట అందుకుని విషయం తిప్పేస్తుంది.

# 2

''అమ్మా, తాతయ్య వస్తున్నాట్టేవ్ !"

తాతయ్య నాన్నకు కార్డు రాశాడు. తాతయ్య దగ్గిర రెండువేల రూపాయలకు తక్కువ వుండవు. అంతా తన ట్రంకు పెట్టెలోనే వుంచుకుంటాడు. తాతయ్య వస్తే ఎన్నో చిక్కులు తీరుతై.

''.. నాకొడుకులు నాకు కానివాళ్ళయిపోయినారు. పెద్దవాడో మామగారి వాడైపోయినాడు. రెండోవాడు పెళ్ళాం ఎట్లా ఆడిస్తే అట్లా ఆడతాడు. ఏనాడు మీ అత్తగారు కాలధర్మం చేసిందో ఆనాడే నేను దిక్కులేని పక్షి నయిపోయినాను. ఇక నాకు నువూ, అమ్మాయీ తప్ప ఎవరున్నారు ? ముసలి వృద్ధును. నా ఆయుర్దాయం యిక వారాలలోనూ, నెలలలోనూ ఉందిగాని సంవత్సరాలలో లేదు. నా ఆయుశ్శేషం మీ మధ్యనే గడపదలిచాను. నీ పిల్లలే నా అసలు మనుమలూ, మనుమరాళ్ళూనూ . ''

అంటూ రాశాడు తాతయ్య.

తాతయ్య వస్తున్నాడంటే నాన్నకూడా లోపల కొంచెం సంతోషంగానే ఉంది. మామూలుగా ఆయన పేరుచెబితే మండిపడేవాడు, "ఈయనకిట్లా గాలి మళ్ళిందేం ?" అని ఊరుకున్నాడు.

తాతయ్య రాసిన వుత్తరం మడిచి కళ్ళు తుడుచుకుంటూ అమ్మ "కాక పోయినా మా చిన్నన్నయ్య దగ్గిర ఎవరూ ఉండలేరు. పాపం వాడు మంచివాడే. వాడి పెళ్ళాం.. .!" అని వాపెలేసింది.

"నువ్వట్లా అంటేనే నాకు మంట. మా జానకివంటి మహాఇల్లాలు ఏదో పాపం చేసుకుని మీ చిన్నన్న పాలపడింది. దాన్ని అన్నవాళ్ళు పుపగులుబడి పోతారు. మీ అన్న దానిచేత నీచమైన పనులన్నీ చేయిస్తాడు. తను లోకానికి మంచివాడుగా కనిపించాలి. తన పెళ్ళాం చెడ్డదని అంతా అనుకోవాలి. వెధవ వేషాలు!" అన్నాడు నాన్న.

మర్నాడు తాతయ్య వచ్చాడు. ట్రంకు పెట్టెతోసహా బండిదిగాడు. బండి వాడి చేతిలో రెండణాలు పెట్టాడు.

"ఇదేంటయ్యోయ్? పావలాకు తక్కువరాసని ఆడనే చెబితినిగా?" అన్నాడు బండివాడు.

"నువు చెప్పింది వేదవాక్యమా. నేను బేహాకన్న నాలికపీక్కుచచ్చినా ఇవ్వననలా. ఆ మాట చెప్పవేం?" అన్నాడు తాతయ్య.

"చాల్చాల్లే, ఇంకో బేడా ఇయ్యి."

"మాటలు తిన్నగారానీ, ఎవరనుకున్నావ్, పుండాఖోర్!" అని తాతయ్య చేతికర్ర ఎత్తి బండివాణ్ణి ఒకటి పెట్టాడు. వాడు దెబ్బ తప్పించుకుని తాతయ్య కర్ర లాక్కుని తిరిగి ఒకటి పెట్టబోయినాడు. నాన్న అడ్డంపడి బండివాడికి మరో రెండణాలు యిచ్చి బుజ్జగించి పంపేశాడు.

తాతయ్య కాళ్ళకడుక్కుని కూర్చుంటూనే పిల్లలు నలుగురికీ తలా ఒక కానీ యిచ్చి ఏడన్నా కొనుక్కోమన్నాడు. అమ్మ మొహం చాటంత అయింది.

అమ్మా, తాతయ్యా కూర్చుని చిన్నన్న పెళ్ళాం జానకిని గంటసేపు తిట్టు కున్నారు.

నాన్న బడికి వెళ్ళేటప్పుడు తాతయ్య "ఏమోయ్, నువు సాయంకాలం వచ్చేటప్పుడు ఒక అరడజను బత్తాయిపళ్ళు పట్టుకురా, నేను రాత్రివేళ భోంచెయ్యను" అన్నాడు.

## 3

శాస్త్రుల్లు కొడుకు పెళ్ళికి అమ్మా పిల్లలూ వెళ్ళారు. తాతయ్యదగ్గిర అమ్మ ముఫైరూపాయలు బదులు తీసుకున్నది. నాన్న రానన్నాడు. శలవ దొరకదుట.

"అదేమిటోయ్ మీ హెడ్మాష్టరుతో నేను చెబుతా పద!'' అన్నాడు తాతయ్య.

"మీరూరుకోండి. అసలే నేనంటే మా హెడ్మాష్టరుకు మంట'' అన్నాడు నాన్న.

నాన్న పెళ్ళికైతే వెళ్ళలేదు గాని, తాతయ్య హెడ్మాస్టరు దగ్గిరికివెళ్ళి తన గొప్పతనమంతా చెప్పుకుని ఆయనను నానా మాటలూ అని వచ్చేశాడు. స్కూలులో హెడ్మాష్టరు నాన్నను కాల్చుకు తినసాగాడు.

తాతయ్య ఇంటి చాకలితో కూడా పోట్లాడాడు.

''ఇదుగోనోయ్. ఈ చాకలివెధవను తక్షణం తీసెయ్యి. వీడింత పొగరుగా మాట్లాడతాడా? నేను ఎన్నివేలమంది చాకళ్ళను చూసి ఉంటాను. ఏమిటి వీడి ఉద్దేశం?" అని తాతయ్య అరిచాడు.

''అట్లాగే తీసేద్దాం లెండి. వాడికి ఏడో, ఎనిమిదో ఇవ్వాలి. ఇచ్చిన తరవాత వీణ్ణి పంపించి మరొకర్ని పెట్టుకుందాం. అయినా అందరూ ఇట్లాగే వుంటారు, ఇప్పుడు వాళ్ళవీ రోజులు'' అన్నాడు నాన్న - తాతయ్యకు ఇష్టమయ్యేట్టుగానూ, తన కిబ్బంది లేకుండానూ.

తాతయ్య పెద్ద చప్పుడుతో పెట్టె తెరిచి పదిరూపాయల కాగితంతీసి నాన్న కిచ్చి, ''వాడిది వాడిమొహాన పారేసి ఇక ఎన్నటికీ ఈ గడపలో అడుగు పెట్ట వద్దని వాడితో చెప్పెయ్యి'' అన్నాడు, వాడితో స్వయంగా చెప్పటంకూడా తనకు అసహ్యమైనట్టు.

నాన్నకు ఏం చెయ్యాలో తోచలేదు.

''తొందరేంలెండి. ఇద్దాం మెల్లిగా, ఎల్లుండి నాకు జీతం వచ్చేస్తుందిగా!'' అన్నాడు.

''అదే నాకు పనికిరాదు. కటాదిటీగా వుండాలి. అవేవీను నా చేతకాదు ఊఁ!''

చాకలికి వుద్వాసన అయింది.

కూరలవాళ్లు గడపతొక్కటం మానేశారు. తాతయ్య అందరితోనూ పోట్లాడాడు. ఆ పోటాటకు అర్థంలేదు.

''వొంకాయలు వీశె అరణాలా? నా చిన్నతనంలో అర్ధణాకూ బుట్టెడిచ్చేవాళ్లు ... మూణ్ణాల కిస్తే ఇయ్యి. లేకపోతే పో!— ఏం రాళ్లవి? నిన్నిప్పుడు పోలీసులకు పట్టిస్తా!.... ఇంకో బేడా ఇవ్వాలా? మూణ్ణాలపైన దమ్మిడి ఇవ్వనని చెప్పలా! .. నువ్వసలు మాకు వంకాయలే ఇవ్వలా. పోయి నీ బాబుతో చెప్పుకో! భడవా, పుండాఖోర్! చెప్పు తీసుకు తన్నేను!" ఇది వరస.

పెరుగుపోసే ముండను పట్టుకుని ''నీ మొహం చూస్తే లంజవల్లే ఉన్నావు గాని సంసారల్లే లేవే!'' అన్నాడు తాతయ్య. నాన్న జీతంలో మిగిలిన డబ్బులు

అప్పటికప్పుడిచ్చేసి దాన్ని వదిలించుకోవలసి వచ్చింది. శేరు రూపాయికొచ్చినా అది పెరుగు పొయ్యనన్నది.

నాన్నకు ఎటుతిరిగినా ఊపిరి సలపలేదు. తాతయ్య వచ్చినాక ఇల్లంతా తారుమారయింది. నాన్నా అమ్మా రోజూ కొట్లాడుకోవటమే. పిల్లలుకూడా ఒకళ్లతో ఒకళ్లు పోట్లాడుకుని చచ్చేట్టు కొట్టుకునేవాళ్లు. నాయనమ్మకూ తాతయ్యకూ ఒక్క క్షణం పడేదికాదు. తాతయ్య విషయం ఎవరన్నా నవ్వుతూ మాట్లాడటం మొదలు పెడితే నాన్నకు ప్రాణం చచ్చి ఊరుకునేది.

# 4

మొదట్లో అమ్మ పూర్తిగా తాతయ్యను వెనకేసుకుని వచ్చి నాన్నతో పోట్లాడేది. రాను రాను ఆవిడ నాన్నను ఓదార్చసాదింది:

"పోనివ్వండి, ముసలాడు. ఇంతకాలమూ ఆయన కట్లా జరిగింది. ఇప్పుడు మనం మారిస్తే మారతాడా? బతికినన్నాళ్లు బతకడు. ఆయనకున్నదీ మనకే ఇస్తాడు. మనకన్న ఆయన కెవరున్నారు?"

ఈ మాటలు నాన్నకు తృప్తి కలిగించలేదు.

"ఆయనకేం, ఆయన రాయల్లే ఇంకా పాతికేళ్ళు బతుకుతాడు. మనంచరి చావూ కళ్ల జూసిగానీ ఆయన హరీ అనడు. ఈలోపల ఏంచెయ్యాలో నాకు తోచటం లేదు. నాకోసం ఎవరన్నా రావటం భయం. నాకన్న ముందు వాళ్ళని తనే సంభాషణలో పెడతాడు. వాళ్లంతా పసిపిల్లలనుకుంటాడో ఏమిటో! వాళ్ళు తననుచూసి నవ్వుతారనన్నా తెలుసుకోలేడు. వాళ్లతో చివరకు పోట్లాడి ఇష్టంవచ్చినట్టు తిడతాడు, లేదా నన్ను గురించి పరమఛండాలంగా వాళ్ళ ఎదట మాట్లాడతాడు. ఇంతకాలమూ తిన్నామో పస్తేవున్నామో, పైకి మర్యాదగా బతికాం. ఇక అది సాధ్యంకాదు. అందరిలోనూ నేను నవ్వులపాలై పోయినాను."

"రోజూ నన్ను పనివున్నట్టు పిలిచి, నీకిచ్చిన ముప్పైరూపాయలూ, చాకలి కిచ్చిన ఏడు రూపాయల తొమ్మిదణాలూ, పెరుగుదాని కిచ్చిన అయిదురూపాయల మూడణాలూ, నాకు బదులిచ్చిన యాభై రూపాయలూ ఏకరువుపెట్టి, 'జ్ఞాపకం ఉండటానికి చెబుతున్నాను. మరేంలేదు' అంటాడు. ఆయనవచ్చి మూడు నెల్లయింది. ఆయనకు పళ్లకనీ వొడ్డీ మంగలాడికనీ నేను పదిహేను రూపాయలపైచిల్లర ఇచ్చుకున్నాను; ఆ సంగతి ఎత్తడు. ఇంటి ఖర్చుకింద దమ్మిడీ ఇవ్వడు. ఎప్పుడైనా పిల్లల చేతిలో కానీ అర్ధణా పెడతాడు, అందులో కూడా పక్షపాతమూ పగలూను. తనకెవరు కోపం తెప్పిస్తే వాడికి కాని ఇవ్వక పగతీర్చుకుంటాడు. పిల్లలు వాళ్లలోవాళ్లు కీచులాడుకు ఛస్తున్నారు. ఆ పిల్లలకీ ఆయనకీ తేడా ఏమీలేదు. ఆయనదగ్గర డబ్బుంది. వాళ్ల దగ్గరలేదు. అంతే. ఇదంతా ఎట్లా తేలుతుందో

నాకేక్షీ పాలుపోవటంలేదు. ముసలాణ్ణి పొమ్మనటానికి నోరురాదు. కానిఆయనంతట ఆయనపోతే నేను దేవుడికి డజను కొబ్బరికాయలు కొడతాను - సత్యప్రమాణకంగా చెబుతున్నాను'' అన్నాడు నాన్న.

నాన్న అన్న మాటలలో ఆవగింజంత అబద్ధంలేదు. రెండోవాడికి నెత్తురు బంక విరేచనాలు పట్టుకున్నై. నాన్న చేతిలో దమ్మిడీ ఆడటంలేదు. అప్పు యిక పుట్టదు. అమ్మ తాతయ్యను రెండు రూపాయ లడిగింది.

"తే, తే తే! డబ్బు చెట్టున కాస్తుందా? ఒళ్లు తెలీకుండా ఆగడ్డీ ఈగడ్డీ తింటే రోగం రాదూ ? ఎందుకు మందులకు పొయ్యటం ? మా చిన్నతనంలో వైద్యులూ, మందులూ లేవు గనకనే రాళ్లల్లే బతికాం. ఏమీ అక్కర్లేదు. అదే పోతుందిలే!'' అన్నాడు తాతయ్య. తాతయ్యకు రెండో వాడిమీద కోపం.

"మీ చిన్నతనంలో రైళ్లు లేవు అందుకని ఇప్పుడు మీరు రైలెక్కటం మానారా? ఆ రోజులలో లేనివి ఈ రోజులలో ఎన్నో ఉన్నై'' అన్నాడు నాన్న.

"అంగట్లో అన్నీ వున్నై. అల్లుడినోట్లో శని ! వుంటే తెచ్చుకో. నేను వద్దన్నానా ఏమిటి ? ఇప్పటికి వందరూపాయల దాకా అప్పిచ్చాను. అయిదు నెల్లయింది. ఒక్క రూపాయి చెల్లిచ్చావా? ఒక్క అర్ధరూపాయ చెల్లిచ్చావా ? ఫలానప్పుడు ఇస్తానన్నా చెప్పావా? ఎందుకీ కబుర్లు? ఛష్!'' అన్నాడు తాతయ్య.

''ఐదునెల్లనుంచి నువు నా ఇంటో వుండి తినటంలేదా?'' అని నాన్న అడగలేదు. అడగలేదని తాతయ్యకు తెలుసును.

# 5

నాన్నకి ప్రాణం విసిగిపోయింది. ఎవరికైనా విసుగుతుంది. తాతయ్యకు ఎదురుచెప్పటం మొదలుపెట్టాడు. ఒకప్పుడు పాకులాడిన మంచితనానికి పూర్తిగా స్వస్తి చెప్పేశాడు.

అయితే తాతయ్యకు భయంలేదు. ఎందుకంటే నాన్న దగ్గిర డబ్బులేదు. డబ్బులేనివాడి మాటలకు అర్థంలేదు. డబ్బులేనివాడు చెప్పేన్యాయం న్యాయం కాదు. చేసే తర్కం తర్కంకాదు. డబ్బులేనివాడు హీనుడు, భ్రష్టుడు, అస్పృశ్యుడు అని తాతయ్య మతం. అందుచేత నాన్న ఎన్ని ప్రశ్నలడిగినా తాతయ్య దులిపేసుకుని ఆఖరుకు ఒక్కటే ప్రశ్న అడిగేవాడు.

"నా దగ్గిర పదినెల్ల కిందట నువ్వు స్వయంగా నీ చేతులతో తీసుకున్న యాభై రూపాయలలో ఒక్క దోలీ తిరిగి ఇచ్చావా ? నేను మిగిలినవాటి విషయం అడగను. నా కిష్టమై ఇచ్చుకున్నాను. నా కూతురికి పెట్టుకున్నాను. ఇది బాకీయే. పెద్దమనిషిని, బాకీ ఏమని ఎగేశావు ? అది చెప్పు నాకు ముందు; నువేమన్న పెద్దమనిషివి ? ఏమని మాట్లాడవస్తున్నావు?"

"నాతో పోట్లాడుతూ నా యింటో వుండటం దేనికి ? అది మీకేం సుఖం?" అన్నాడు నాన్న.

"నే యిల్లా? నిన్ను చూసి నేను రాలేదు. ఈ పెద్దమనుషులందర్నీ అడుగు. (అక్కడ చేరిన పెద్దమనుషులు పోస్టుజవానూ, వీధిన గుడ్డలమ్ముకునే వర్తకుడూ, చాట అరువడగటానికి వచ్చిన పక్కింటివారి పనిమనిషిని!) నేను నా కూతురింటికి వచ్చాను. ఈ క్షణం పోతాను. నా డబ్బు నాకు పారెయ్యి."

తాతయ్యతో పోట్లాడటం కంఠశోష అనిపించింది నాన్నకి. నాన్న కష్టాలు ఒకరు ఆర్పేవి తీర్చేవి కావు. అవి భగవంతుడే తీర్చాలి.

తాతయ్య అకస్మాత్తుగా జాయిలా పడ్డాడు. మర్నాడు రాత్రి కిందపెట్టారు. తెల్లవారుఝామున పోయినాడు.

నాన్న బావమరుదు లిద్దరికీ తంతులిచ్చాడు. వాళ్ళు నాలుగోరోజున కాని రాలేదు. ఈ లోపల దహనసంస్కారానికి నాన్నే తల తాకట్టుపెట్టి యాభై రూపాయలు తెచ్చి ఖర్చు చేశాడు.

మామయ్య లిద్దరూ వచ్చారు. తండ్రిగారి పెట్టె తెరిచి డబ్బు లెక్కచూసుకున్నారు. పెట్టెలో పదిహేను వందల పైన కొద్ది చిల్లర వుంది.

"ఇంకా అయిదువందలుండాలి" అన్నాడు పెద్ద మామయ్య. "నాకు కిందటేడు నాన్న రాసిన ఉత్తరం ఇదుగో!"

"మా యిల్లు వదలి వచ్చేటప్పుడు — పదకొండు మాసాల కిందట — నాన్న నాతో ఆమాటే అన్నాడు" అన్నాడు చిన్నమామయ్య.

ఇద్దరు మామయ్యలూ నాన్న కేసి చూశారు.

"మా యింటికి వచ్చినాక మా చేతికి సరిగా వందరూపాయ లిచ్చాడు. అది కూడా ఏడెనిమిది నెలల్రకితం" అన్నాడు నాన్న.

"మిగిలిన నాలుగువందలూ ఏమయినట్టు?" అన్నాడు పెద్దమామయ్య.

"ఏమో, ఏంఖర్చు చేసుకున్నాడో ?" అన్నాడు నాన్న.

"తాగుడా, ముండలా ? ఏం ఖర్చు ఆయనకు ?" అన్నాడు చిన్నమామయ్య.

"అది ఎవరు చెప్పగలరు? ఆయన దహనక్రియలకు కూడా నేనే డబ్బు అప్పు తెచ్చాను."

"ఆయనకు మందిప్పించటానికి డబ్బు అప్పు తెస్తే ఆయన ఇంకా బతికే వుండును" అన్నాడు పెద్దమామయ్య.

"పదిహేనువందలు పెట్టెలో పెట్టుకుని వైద్యుడు కావాలంటే నాతో చెప్పకూడదూ ? ఆయన బొట్టికాయా?" అన్నాడు నాన్న.

"అదంతా ఇప్పుడెందుకన్నయ్యా ? ఈ నాలుగు వందలూ ఏమయినట్టు ?" అన్నాడు చిన్నమామయ్య.

"నేను చెబుతా పట్టు. నేనూ మీ చెల్లెలూ కలిసి దొంగిలించినట్లు !" అన్నాడు నాన్న వెటకారంగా.

"తెలుస్తూనే వుంది!" అన్నాడు పెద్దమామయ్య.

—ముద్రణ : జ్యోతి, జూన్ 1948

# అంతరాత్మ

నేనూ, ప్రకాశరావూ పార్కులో కూచుని కళల్లో వాస్తవికతను గురించి చర్చించుకుంటున్నాం. ఆ చర్చ యెట్లా వచ్చిందీ నేనిప్పుడు సరిగా చెప్పలేను కాని, అభ్యుదయ రచనల్లో దుష్టపాత్రలను సృష్టించేటప్పుడు ఆ పాత్రలు తమ వర్గానికే దుర్మార్గంగా వుండేటట్టు చిత్రించటం వాస్తవికత కాదని నేనన్నాను. ఆ దుర్మార్గం వర్గవైషమ్య జనితంగా వుంటేనే తప్ప అభ్యుదయ దృక్పథం వ్యక్తం కాదని నేనంటు న్నాను. ప్రకాశరావు ఇంచుమించు నాతో ఏకీభవిస్తున్నాడు.

ఈ సమయంలో "క్షమించండి" అంటూ ఆ యువకుడు మాకు సమీపంలో వచ్చి కూర్చున్నాడు. నేనతని కేసి ఆశ్చర్యార్థకంగా చూశాను. చాలా చిన్నవాడు. పాతికేళ్ళు కూడా వుండవేమో. పట్నంలో యెంతకాలం నుంచి వుంటున్నాడో తెలీదు గాని, తెలుగువాళ్ళ ఆకార వైఖరులు మారలేదు. మట్టిరంగు మిల్లుబట్టలు కట్టు కున్నాడు. నిండు చేతుల షర్టు, సైకిలు కట్టు ధోవతీ, పైన ఉత్తరీయం కూడా ఉంది. అప్పుడే ఏ బెజవాడనుండో దిగినట్టుగా వున్నాడు.

"మీరిప్పుడన్నమాట విన్నాను," అన్నాడా యువకుడు. "మీరు చెప్పే మాటలో నాకు నమ్మకం కుదరలా !"

"ఏమైనా తప్పు చెప్పానా ?" అన్నాను.

"మీకు అమ్మా, నాన్నా వున్నారా ?" అని అడిగాడు.

ఎందుకిట్లా అడుగుతాడా అని ఆశ్చర్యపడుతూ, "లేరు," అన్నాను.

"పోనీ అన్నదమ్ములున్నారా ?" అన్నాడు.

"దగ్గిర్లో యెవరూ లేరు," అన్నాను.

"మీ బంధువులెవరూ మీకు దగ్గిర్లో లేరనుకుంటాను ?"

"అవును."

"అందుకే మీకు సవర్గ దుర్మార్గం గురించి ఏమితెలీదు." అన్నాడతను.

"సవర్గ దుర్మార్గం నేనూ చూశాను. అన్నదమ్ములమధ్య కలహాలూ, భార్యా భర్తల మధ్య కలహాలూ వుంటాయి. కాని వాటికి ప్రత్యేక కారణాలుంటాయి. ఒకే వర్గానికి చెందిన కారణంగా వ్యక్తులమధ్య వైషమ్యం వుండదు. ఆ కారణాలు వ్యక్తి పరంగా వుంటాయిగాని వర్గపరంగా వుండవు," అన్నాను.

"అయితే మధ్యతరగతిలో కొన్ని వర్గాలనుగురించి మీకేమీ తెలియదు," అన్నాడా యువకుడు.

"చెప్తే తెలుసుకుంటాను," అన్నాను, కపటవినయం నటిస్తూ.

ఆ యువకుడు కొంచెం ఆలోచించి, "నా కథ చెబుతాను, వినండి" అన్నాడు.

నా పేరు సుదర్శనం (అన్నాడు యువకుడు). నేను మద్రాసులోనే పుట్టాను, పెరిగాను. నా అవతారంచూసి పొరపాటుపడకండి. రెండేళ్లనుంచీ నేను ఆంధ్రలో వుంటున్నాను. మీబోటివారంతా ఆంధ్రను వదలి పట్నంవస్తే నేను పట్నంవదలి అటువేపు వెళ్ళాను. మా నాన్న చాలా ఏళ్లు పట్నంలో ఉద్యోగంచేసి రిటైరై మూడేళ్ళ క్రితం పోయినాడు. ఆయన పేరు చెప్తే మీరు బహుశా గుర్తించవచ్చు. కాని చెప్పను. అది మీకు అనవసరం. మా నాన్న పోయేవరకూ మేం బాగా బతికాం. నాకిద్దరన్న లున్నారు. ఒక అక్కా, ఒక చెల్లెలుకూడా ఉన్నారు. మా అమ్మ బతికున్నది.

మా నాన్న "ఆధునికుడు". ఆయన ఈ మద్రాసులోనే చదువుకున్నాడు. ఆ రోజుల్లో వీరేశలింగం[1]గారిని కూడా యెరుగును. ఆయనకు మూఢ విశ్వాసాలంటే కోపం. మమ్మల్ని — కనీసం మా ముగ్గురు మగ పిల్లల్నీ — తన ధోరణిలో పెంచాడు. ఆయన బతికున్నంత కాలం మా అమ్మ కూడా ఆయన పద్ధతులే అవలం బించింది. ఆవిణ్ణి చాలా సంస్కారం పొందిన మనిషల్లే చూసేవారు. ఆవిడ మహిళల సభలకు వెళుతూ ఉండేది. కొన్ని మహిళా సమాజాలలో సభ్యురాలుగా ఉండేది.

రాజకీయాల విషయంలో మా నాన్నను నాస్తికుడనవచ్చు. ఆయనకు ఏ రాజకీయోద్యమంలోనూ విశ్వాసంలేదు. ఒక్క సంఘసంస్కారం విషయంలో తప్ప మిగతా ఏ విషయంలోనూ ఆయనకు విశ్వాసం లేదు. కాంగ్రెసు ఉద్యమా లన్నిటినీ ఆయన ఖండించాడు. వాటివెంట ప్రజలు సంస్కారం పొందలేదని కొన్ని కేకలు వెయ్యటంమటుకే నేర్చుకున్నారని ఆయన నమ్మాడు. ఆయన దృష్టిలో సంస్కారహీనులుగా ఉండి కాంగ్రెసు ఉద్యమంతో పైకివచ్చిన ప్రతివ్యక్తిని ఉదా హరణగా తీసుకుని, ఆయన కాంగ్రెసు ఉద్యమాలను ఖండించాడు. సంస్కారం గురించి ఆదర్శవాదం అవలంబించిన వారంతా ఇట్లాగే ప్రవర్తించారేమో అనుకుం టాను. మా అన్నలిద్దరూ కాంగ్రెసు భక్తులుగా తయారుకావటం ఆయనకు చెప్ప రాని బాధ కలిగించింది. "ఫలానా కాంగ్రెసు దౌర్భాగ్యుడు తన కూతురికి పదోఏట పెళ్ళిచేశాడు. పన్నెండోఏట అది ముండమోసింది. దానికి పెళ్ళి చెయ్యడు. నా కడుపున పుట్టినవాళ్ళు వాడి రాజకీయపక్షమా?" అని ఆయన ఆక్రోశించటం నే నెరుగుదును.

భారతదేశానికి స్వాతంత్ర్యం రావటం ఆయన ఎరుగును. దానిక్కూడ

---

1. కందుకూరి వీరేశలింగం పంతులు ప్రస్తావన.

ఆయన చలించలేదు. "ఈ కాంగ్రెసు వాళ్ళువచ్చి అఖరుకు శారదా చట్టమైనా[1] గట్టిగా అమలుచేస్తారని నాకు నమ్మకంలేదు. దొంగలూ దొంగలూచేరి ఊళ్ళుపంచు కుంటారు చూస్తూండండి!" అనేవాడాయన.

ఆయనకు కమ్యూనిస్టులన్నా కోపమే. సంస్కారానికి వాళ్లు పరమశత్రువు లని, దరిద్రులనూ, మూఢ విశ్వాసపరులనూ వాళ్లు వెనక వేసుకువస్తారని, అందరి కంటె గట్టిగా అరవటంతప్ప వాళ్ళ కింకో ఆశయం లేదని ఆయన దృఢ నమ్మకం.

ఇక హిందూమహాసభంటే[2] ఆయనకున్న ఆగ్రహం చెప్పనలవికాదు. వాళ్లు కమ్యూనిస్టులల్లే అసంస్కారులేగాక, కుసంస్కారులనికూడా ఆయన వాదం.

ఇదంతా ఎందుకు చెప్పానంటే ఆయన పోయిన మరుక్షణంనుంచీ మా కుటుంబంలో కలిగిన సాంస్కృతిక పరిణామం చూస్తే ఆయన ఏమనుకునేవాడో అని నేనిప్పటికీ ఆశ్చర్యపడుతుంటాను. అయన పోగానే ఆయన భీమాచేసిన మొత్తం పదమూడువేల చిల్లర మా అమ్మ పేర వచ్చింది. అప్పటికే మా అన్నలిద్దరూ ఏవో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. నేను మటుకు ఒద్యే ప్యాసై ఎమ్మేలో ప్రవేశం

---

1. శారదా చట్టం. శారదాబిల్లు-ఈ చట్టం ప్రస్తావన 1915-40మధ్య జీవితం ఇతివృత్తంగా ఉండే కథల్లో, నవలల్లో కుటుంబరావు తరచు తెస్తారు. రజస్వల అయ్యేనాటికి ఆడపిల్లకు పెళ్ళి చెయ్యాని తండ్రి, ఆ పిల్ల పెళ్ళిచేసే టంతవరకు ఆ అమ్మాయి బహిష్టు రక్తాన్ని తాగాలి అనే అమానుష సంప్రదాయాన్ని సంస్కరించేందుకు ఉద్దేశించిన చట్టమే శారదా చట్టం. 1930 ఏప్రియల్‌లో ఈ చట్టం అమలులోకి వచ్చింది. శారదా చట్టం కర్త హర్‌జిలాస్ శారద. ఈ చట్ట ప్రకారం 18 ఏండ్లలోపు మగపిల్లలు, 15 ఏండ్లలోపు ఆడపిల్లలు పెళ్లి చేసుకోకూడదు. బాల్య వివాహాలకు శిక్ష మూడు నెలలు జైలు లేదా వెయ్యి రూపాయల జరిమానా. సనాతన హిందువులు సహజంగానే ఈ చట్టాన్ని వ్యతిరేకించారు. కుయుక్తులతో చట్టానికి తూట్లు పొడిచారు. 1938లో 7వ చట్టం వచ్చేదాకా ఫ్రెంచివాళ్ళ ఏలుబడికింద ఉన్న ప్రాంతాల్లోనూ, నైజాంవంటి రాజ్యాల్లోను బాల్య వివాహాలను చేశారు. (మరికొన్ని వివరాలకు చూడండి - కుటుంబరావు సాహిత్యం, నాలుగవ సంపుటం. పుటలు 137, 138).

2. హిందూ మహాసభ : మదనమోహనమాలవ్యా తదితర పంజాబీ నాయకులు 1915లో హరిద్వార కుంభమేలా సందర్భంలో ప్రారంభించారు. 1923 తర్వాత హిందూమత తత్త్వవాద ప్రయోజనాలకు ఈ సంస్థ బలమైన దన్ను నిచ్చింది.

చాను. అప్పటికే మా అక్కకు వివాహమయింది. ఆవిడ తాను కోరిన వరుణ్ణి పెళ్లాడింది. మా నాన్న కోరిక ప్రకారమే దమ్మిడి కట్నం లేకుండా, దుర్వ్యయం ఏమీ లేకుండా ఆవిడ పెళ్లి అయింది. ఆవిడ భర్త బియ్యేబీటి పాసై మన ప్రాంతాల ఉపాధ్యాయుడుగా ఉంటూండేవాడు. వారికిద్దరు పిల్లలు కూడా కలిగారు. మా చెల్లెలుకు మాత్రం యింకా వివాహం కాలేదు. మా నాన్న పోయేనాటికి దానికి పద్దెనిమిదేళ్ళ మాత్రమే. ఇంటరు రెండో ఏడు చదువుతూ ఉండింది.

మా నాన్న పోగానే మా అమ్మలో కలిగిన మార్పు వర్ణనాతీతం. ఆవిడ ఒక్కసారిగా పదమూడు,పన్నాలుగువేల రూపాయలకు అధికారిణి అయింది. ఆ డబ్బును ఆవిడ ఎట్లా ఖర్చు చెయ్యాలో మా నాన్న నిర్ణయించలేదు. మా నాన్న అనేక స్వల్ప విషయాలను గురించికూడా ఆవేశంగా మాట్లాడటం నే నెరుగుదునుగాని, ఆయన డబ్బును గురించి యెన్నడూ ఆలోచించినట్టు గాని, దానికి ఏ విధమైన ప్రాధాన్యంమూ ఇచ్చినట్టుగాని నాకు జ్ఞాపకంలేదు. తాను అభిమానించేవారిలో ఎవరికి డబ్బుతో అవసరం వచ్చినా, తనదగ్గిర సిద్ధంగా డబ్బుంటే ముందూ వెనకా ఆలోచించకుండా ఆదుకునేవాడు.

మా అమ్మమటుకు తనదగ్గిర ఉన్నడబ్బును ఒక్క క్షణంకూడా మరిచిపోలేక పోయింది. భర్త పోయినందుకు ఏడిగినవాళ్ళ పరామర్శించే స్థితి ఇంకా దాటక పూర్వమే ఆవిడ ఆ పదమూడు వేలతోనూ ఇల్లు కట్టించటమేకాదు, కారు—చవుకలో వచ్చేది. పాతదైనా సరే పోనీ—కొనటమే కాదు, మా అక్క పిల్లలకు తోపుడు బళ్ళ కొనటమేకాదు, మా అక్కకు చెల్లెలికీ బంగారు తొడుగులు చేయించటమే కాదు— లక్షలకు విలువైన ఆలోచనలుచేసి అన్నీ నిజమయినట్టే ఆనందించింది. ఆవిడ ఆ డబ్బును ఒక్కక్షణం మరచిందనుకోను.ఎవరెవరికి ఎంతెంత ఆస్తి అనుకోకుండా సంక్రమించినా ఆ కథలను పవిత్రంగా చెప్పుకునేది. మానాన్న ఎప్పుడెప్పుడు ఎంతెంత మొత్తాలు దానధర్మాలు చేసిందీ చెప్పి, అటువంటి పనులు చెయ్యకుండా వుంటే మాకు అధమం యాభై వేలు రొఖ్ఖం ఉండి ఉండాలిసిందే ననేది. ఆ మధ్య రైలు ప్రమాదంలో చచ్చిపోయినవారి పిల్లలకు ప్రభుత్వం ఎంతో పరిహారం ఇచ్చినట్టు విని, "పోనీ, పాపం! సంపాదనపరుడు పోయినాక పిల్లలకు ఆపాటి ఇవ్వకపోతే ఎట్లా ?" అన్నది. ఆవిడ మాటలు వింటుంటే రైలు ప్రమాదంలో చచ్చిపోవటంకంటె పోయినవాడి పిల్లలకు డబ్బురావటం చాలా ముఖ్యమనిపించింది. ఎవరు ఏంలేదనుకున్నా సరే మా అమ్మ, "కొందాం!" అనేది. "కొందాం" అనేమాట ఎవరు ఏ క్షణంలో అన్నా అనవచ్చు. కాని ఆ రోజుల్లో మా అమ్మ అన్నప్పుడు ఆ "కొందాం" అన్న మాటకు పదమూడువేల తులాల బరువుండే దంటే మీరు నమ్మవచ్చు!

నేను మా అమ్మను గురించి ఎరగనివారి ఎదట ఇట్లా మాట్లాడుతుంటే, "వీడెంత అసహజమైన కొడుకు!" అని మీరు ఆశ్చర్యపడవచ్చు. అదే నే చెప్ప

పోతున్నది కూడా. నేను సహజమైన కొడుకును కాను. నా కెందుకో ఆవిడ తల్లిలాగా కనిపించదు. నేను ఆవిడను ఎవరో అల్లే పరిశీలించాను. ఆవిడ ముఖంలో కలిగే ప్రతి మార్పునూ, ప్రతిమాటలో ప్రతినొక్కునూ బద్ధవైరిలాగా గమనించి మనసారా ద్వేషించాను. ఆ డబ్బు నాకు రాకుండా ఆవిడచేతికి వచ్చిందని నాకు లోపల ఆక్రోసు అనుకునేరు. అదెంతమాత్రం కాదు. నేను కాస్తకపటంగా ప్రవర్తించి ఉంటే నా డబ్బులో కొంత వచ్చిఉండేది. ఆవిడమీద నాకుగల అసహ్యాన్ని బయటపెట్టి నే నా డబ్బును దూరంగా కూడా ఉంచాను. ఆవిడ షరతు మీద ఆ డబ్బు ముట్టుకునేకంటె తిండికి మాడి చావటం మేలనిపించింది నాకు. ఆ డబ్బూమా నా ఆత్మగౌరవానికి మధ్య మా అమ్మ మనస్తత్వం సైంధవుడల్లే అడ్డుపడింది. నా కథ వినండి:

మా అమ్మలో మార్పు నాకే అసహ్యం కలిగిస్తే, మా చెల్లెలు నాకన్న కూడా మరింత అసహ్యపడింది. ''అమ్మకి నిజంగా మతిపోయింది!'' అని అది యెన్నో సార్లు నాతో అన్నది. నేనూ మా చెల్లెలూ ఒక వయస్సు వాళ్లం కావటంచేత నేమో, చాలా విషయాలలో ఏకీభవించే వాళ్లం. కాని ఏ విషయంలో కూడా మా అమ్మ విషయంలో కలిగినంత ఏకాభిప్రాయం కలగలేదన్నమాట. మా అమ్మ చదకేది కొంటానని ఉబలాటపడినా సరే మా చెల్లెలు చదువుకోకుండా, ''నాకది అక్కర్లేదు. నా కదంటే అసహ్యం!'' అనేసేది. ఒకసారి మా అమ్మ బజారు నుంచి మెచ్చటగా జరీచీరె తెస్తే మా చెల్లెలు, ''ప్రాణంపోయినా నేనీ చీరె కట్టుకోను. మా కాలేజీలో ఆడపిల్లలంతా గేలిచేస్తారు. మగపిల్లలంతా వెంటపడతారు!'' అని ఖచ్చితంగా చెప్పేసింది.

కొద్ది రోజులపాటు మా అమ్మ నాలోనూ, మా చెల్లెలిలోనూ విరోధభావం వున్నట్టు గమనించలేదు. కనీసం గమనించనట్టు నటించింది. గమనించక విధిలేని పరిస్థితి యేర్పడ్డాక మేం తనను చూసి యేడుచుకుంటున్నామని ఆరోపించింది. ''నిన్ను చూసి ఏడుచుకోవటానికి నీలో ఏముంది?" అని మా చెల్లెలు అడిగేసింది. దానికి మా అమ్మ నేరుగా సమాదానం చెప్పక, ''మీ నాన్న పోయినాక మీకు నన్నుచూస్తే గౌరవం పోయింది. బయటివాళ్ళే నయం. వాళ్ళు నన్ను వెనకటిలాగే చూస్తున్నారు" అన్నది. "వెనకటిలాగేం ఖర్మం? అంతకంటె బాగానే చూస్తున్నారు!" అన్నది మా చెల్లెలు.

మా చెల్లెలనే మాటలు సరిగా నా మనసులోనుంచి వస్తున్నట్టే వుండేవి. కాని నేనా మాటలు అనగలిగివుండను. మా అమ్మ మనస్తత్వానికి నేను చలించినంతగా మా చెల్లెలు చలించలేదని, అందుకే నే ననలేని మాటలు అది అనేసేదని నా అనుమానం.

ఏమైనా మా అమ్మకు కావలసిన సంతృప్తి మేమివ్వలేకపోయాం. అటువంటి సంతృప్తి ఇచ్చినవాడు మా బావ—మా అక్క మొగుడు. ఆ భార్యాభర్తలు

మా నాన్న పోయినప్పుడు వచ్చారు. నాలుగు రోజులుండి వెళ్ళారు. మళ్ళీ ఇప్పుడు నాలుగు మాసాల అనంతరం, వేసవి సెలవుల్లో పట్నం వచ్చారు. మా అమ్మ తనకు నామీదా మా చెల్లెలిమీదా ఉన్న కోపమంతా ప్రేమ రూపంలో మా అక్క మీద కురిపించింది. మా అక్క కూడా మా అమ్మకు తగ్గట్టుగానే ప్రవర్తించింది. ఆవిడ మా అమ్మ చెప్పే కబుర్లన్నీ ఎంతో ఆత్రంగా విన్నది. ఆత్రంగా వినటమేకాదు, ఆవిణ్ని బాగా ఎగదోసింది కూడానూ. మా అక్కా బావా వచ్చినరోజే మా అమ్మ వాళ్ళిద్దర్నీ వేసుకుని బజారుకు బయలుదేరింది. దీని కెంత ఉపోద్ఘాతం ! మా అమ్మ చేసిన హడావుడేనా? "ఒరే ! అబ్బాయ్ ? బాంకు నుంచి ఓ వందైనా డ్రా చెయ్యాలిరా? కాస్త ఈ పూట బాంకుకు పోయిరావూ? మా నాన్నగా! అన్నట్టు వెయ్యి విడిగా ఫిక్సెడ్ డిపాజిట్టు వేశాం చూడూ? దానికి గడువెప్పుడో!— ఆవిడ ఈ ధోరణిలో మాట్లాడుతుండగనే నేను అవతలికి వెళ్ళిపోయినాను. నా మీద గొంతుదాకా కోపం వచ్చేవుంటుందిగాని అంతకుమునుపే రైలు దిగిన అల్లుడు కూతుళ్ళ యెదుట తన నిత్యజీవితం అసంతృప్తికరంగా వుంటోందని బయటపడనిస్తే యెట్లా ? అందుకని నన్నేమి అనకుండా మాట్లాడక వూరుకుంది. ఆ రాత్రి దీపాలు పెట్టాక మా అమ్మా, మా అక్కా, బావా టాక్సీలో దిగారు – తోపుడు బండీ, ఆటవస్తువులూ మొదలైన వాటితో సహా!

కొన్ని రోజులపాటు మా అక్కా, అమ్మా అతుక్కుని ఊడిరాలేదంటే నమ్మండి. మా అమ్మ నా కోసమూ, మా చెల్లెలికోసమూ తలపెట్టిన ఖర్చును మేమిద్దరం యెంత ప్రతిఘటించామో, మా అక్క తమకోసం అమ్మ చెయ్యబూనిన ఖర్చును అంతగా ప్రోత్సహించింది. ఆవిడ ఒక చీరె కొంటానంటే మరోటికూడా కొనమనేది. మా అమ్మ మా బావకు ధోవతులు కొంటానంటే ఏకంగా సిల్కువి కొనమనేది. న్యాయం ఆలోచిస్తే, నేనూ, మా చెల్లెలూ మా అమ్మకు అసంతృప్తి కలిగించాం గనక, మా అక్క చాలా సంతృప్తి కలిగించివుండాలి. కాని అట్లా కలిగించిందని నేననుకోను. మా అక్కమీది అసంతృప్తి ఎప్పుడు ఏ రూపంలో బయటపడుతుందో చూడాలని నేను పొంచివున్నా నన్నమాట. మా అక్క వచ్చిన మూడోనాడు మా అమ్మ మా అక్క పిల్లలకు వీధిలో అమ్మే బెలూనులు అణాపెట్టి కొంటూ, "ఎంత డబ్బూ హతమై పోతోంది. ఏంచిత్రమో !" అన్నది. నాకు కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు. గొప్ప పరిశోధకుడికి కొత్త విషయం తెలిసినా అంత ఆనందం కలగదు.

ఇక మిగిలిన పరిణామాలేవీ నా దృష్టిలో ఆశ్చర్యకరమైనవికావు. ఒక లక్షాధికారి మనస్తత్వం అణాదగ్గిర ఎప్పుడైతే పిల్లిమొగ్గవేసిందో అప్పుడే నేను రాగలవి కొంత వరకు వూహించ గలిగాను.

మా బావ శెలవులు అయిపోయాయి. కాని మా అక్కకు పట్నం విడిచి పోబుద్ధి కాలేదు. వెధవది నూట డెబ్బైరెండు రూపాయలన్నర జీతానికి పట్నం

వొదిలేసుకుని దిక్కూ దివాణం లేనిచోట పడివుండటం వృథా. కాస్తనింపాదిగా విచారిస్తే తన భర్తకు పట్నంలోనే ఏదో ఉద్యోగం దొరక్కపోదని మా అక్కయ్య అభిప్రాయపడింది. మా బావను ఉద్యోగానికి రాజీనామా ఇప్పించటానికి ఒప్పించింది. ఆయనకు అనుకున్నంత సులభంగా ఉద్యోగం దొరకలేదు. కాని మునిగి పోయిందేం? ఖర్చు చేసేటందుకు డబ్బున్నవి. కాలం హాయిగా వెళ్ళిపోతోంది.

తనదగ్గిర డబ్బున్నందుకు మా అమ్మ సంతోషించినమాట నిజమేగాని ఆవిడ పడ్డబాధ ఆవిడకన్న నేను బాగా గుర్తించాను. విరుద్ధభావాల మధ్య ఆవిడ నలిగ సాగింది. మా అక్కా ఆవిడా ఒకే కట్టగానే ఉన్నారు గాని లోలోపల యేదో రగులుతూ ఉన్నట్టు మధ్యమధ్య సన్నటి పొగలు వచ్చేవి. మా అక్క ఏదన్నా ఖర్చు చెబితే, మా అమ్మ దమ్మిడీలదగ్గిర్నుంచీ పొదంగా వాడుతున్నదానల్లే, "అబ్బ. అది లేకపోతే ఇప్పుడేమే? అన్నీ దండగమారి ఆలోచనలూ!" అనేది. ఆ మర్నాడే దానికి పదింతలు దండగమారి ఖర్చుచేసేది—మా అక్క కోసమే. ఒకసారి మా అక్క రెండు రూపాయలిమ్మని అడిగితే, "నన్నడగాలిటే? తీసుకోరాదూ?" అనేది. ఆ మర్నాడే మా అక్క పెట్లోనుంచి అర్థరూపాయి తీస్తే మా అమ్మ దానికోసం వెతుక్కుని, రాద్ధాంతంచేసి, "క్షణం కిందట పెట్టిన డబ్బులు మాయమవుతై" అనేది. "నేను తీశానమ్మ! ఎందుకంత ఆర్భాటం చేస్తావ్?" అని మా అక్క అంటే, "కాస్త చెప్పకూడదు? నాకు వెతకటం తప్పునుగా" అనేది.

ఎంతసేపూ మా అమ్మకూ, డబ్బుకూ గల చుట్టరికంగురించే మాట్లాడుతున్నానని విసుక్కోకండి. ఇంకా ఇతర విషయాలు—మానాన్న చూస్తే నిర్ఘాంత పొయ్యేవి కొన్ని జరిగాయి. మా అక్కపిల్లలు వచ్చాక వాళ్లు తుమ్మినా, చీదినా మా అమ్మ వాళ్ళకు దిష్టితీసేది. మా నాన్న హయాంలో ఈ దిష్టి ఎరగం. దిష్టితోబాటు దేవుళ్ళకు మొక్కోటాలు వారాలూ, వర్జ్యాలూ చూడటాలూ, శకునాలు పాటించటాలూ ప్రారంభమైనాయి. వీటికి మా బావ ఊతం యివ్వసాగాడు. ఆయనకు జ్యోతిషంలోనూ, హస్తసాముద్రికంలోనూ, అంకెల శాస్త్రంలోనూ కొంత ప్రవేశం వుంది. నేను చూస్తుండగానే తిరపతియాత్ర కూడా ఒకటి జరిగింది.

ఇవన్నీ ఉండగా మా చెల్లెలు పెళ్ళి సమస్య ఒకటి వచ్చింది. మా అక్క పెళ్ళిగురించి మా నాన్న యెన్నడూ ఆదుర్దా పడలేదు. సంబంధాలు వెతికినా మా అక్కకు తెలీకుండా ఎన్నడూ వెతకలేదు. మాచెల్లెలితో చెప్పకుండాకూడా మా అమ్మ సంబంధాలు స్థిరపరచటానికి ప్రయత్నించింది. "మనకులం, మనశాఖ" చాలా ప్రాముఖ్యం వహించాయి. నా సహాధ్యాయి అన్న ఒకడు మా చెల్లెల్ని చేసుకోవటానికి ఇష్టపడినట్టు తెలియజేశాడు. కాని "మావాడు" కాదని మా అమ్మ కొట్టి పారేసింది.

"కావలిస్తే అమ్మాయికి నేను కట్నం ఇస్తాగా! మంచి సంబంధమే చేద్దాం!" అనేది మా అమ్మ.

మా అమ్మకు ఇష్టమైందని తెలిశాక మా చెల్లెలు ఏ సంబంధమైనా కొట్టి పారేసేస్థితికి వచ్చింది. దీనివల్ల కొన్ని మంచిసంబంధాలు పోయాయేమోకూడానూ! కాని అది లక్ష్యపెట్టలేదు.

మా అమ్మకు అక్కకూ మధ్య పొగలురావటమల్లా మంటలు రేగటందాకా వచ్చింది. ఎవరూ తక్కువతిన్నవాళ్లు కారు.

"తే, తే, అంటావు, యెక్కణ్ణించి తెచ్చేదే? నీకన్న చిన్నవాళ్ళున్నారు. వాళ్ళిద్దరూ నా డబ్బు కానీ ముట్టరు. ఎంతపెట్టినా నీకు మెప్పులేదు. తే, తే అనటంతప్ప నీ కింకేమీ తెలీదు!" అని మా అమ్మ.

"నిన్నసలెవరు పెట్టమన్నారూ? నీ మాటలకు మోసపోయికాదూ మేం నిక్షేపమంటి ఉద్యోగం మానుకుని ఈ దిక్కుమాలినచోట పడింది? నీ మిగిలినపిల్లలకు పెట్టొద్దని నే నన్నానా?" అని మా అక్క.

మా అక్క ఆగ్రహం మామీదికికూడా తిరగసాగింది—తన సొత్తేమో మేం అపహరిస్తున్నట్టు!

నేను ఎమ్మే పరీక్షకు కూచున్న ఏడు మా అన్నలిద్దరూ శలవులకు వచ్చారు, కుటుంబాలతోసహా. మా అమ్మ తన ధనికత్వమూ, ఆప్యాయతా వాళ్ళమీద చూపింది. కొద్దిరోజుల పాటైనా వాళ్లు మా అక్కలాగా ప్రవర్తిస్తారనుకున్నది మా అమ్మ. కాని ఆ ఆశ పారలేదు. వాళ్లు ఆవిడడబ్బు ఖర్చుచెయ్యటానికి ఒప్పుకున్నారుగాని దానికి ప్రతిఫలంగా ఆవిణ్ణి ఉబ్బెయ్యటానికి మటుకు సిద్ధపడలేదు. మా బావకూ వాళ్ళకూ అసలు పడలేదు. అతను సంవత్సరంనుంచీ ఇక్కడే తిష్టవేసి ఉండటం వాళ్ళకేమీ రుచించలేదు. మొగుణ్ణి వెనకేసుకొచ్చి మా అక్క వాళ్ళతో చచ్చేట్టుపోట్లాడింది. తనకొడుకుల్ని వెనకేసుకొచ్చి మా అమ్మ మా అక్కతో పోట్లాడింది. వాళ్లున్నన్నాళ్ళూ కొంప యెట్లా ఉండాలో అట్లా ఉంది. చాల రోజులకు ఆప్తులు కలుసుకున్న వాతావరణం ఏకోశానా నాకు కనిపించలేదు. అన్నలు తమ్ములకేమవుతారో, చెల్లెళ్లు అక్కలకేమవుతారో మా కుటుంబాన్ని చూసిన వాళ్ళకి అర్థమై ఉండేదికాదు.

దురదృష్టవశాత్తూ ఈ శలవులైపోయేలోగానే మా రెండో అన్నకు పట్నం బదిలీ అయింది. ఆయన మళ్ళీ వెళ్ళిపోలేదు. మా ఇంటి వాతావరణం చెప్పటానికి వీల్లేదు. రోజూ కొట్లాటలే. ఈ కొట్లాటలకు కారణాలుండేవేగాని ఆ కారణాలకు అర్థం ఉండేదికాదు.

నేను సమ్మెలు చూశాను. పోలీసుల లాఠీఛార్జీలు చూశాను. ఎన్నో ఘోరాలు చూశాను. కాని మా ఇంట్లో జరిగే పోట్లాటలంత అర్థరహితమైన సంఘటనలు యెక్కడా చూడలేదు. ఇంత తినడానికుండి బతకటం చేతకాని మధ్యతరగతి కుటుంబంలో పుట్టినవాడు తప్ప ఈ కొట్లాటలను ఊహించుకోలేడు. ఇంట్లో డజను

మంది ఉంటే ఏ ఇద్దరిమధ్యనైనా శత్రుత్వం ఉండేది. అది అచ్చగా స్వార్థంతో కూడుకున్న దికూడాకాదు.

ఒక ఉదాహరణ చెబుతాను: మా చిన్నన్న వచ్చాక ఆయన మా బావగారికొక ఉద్యోగం ఇప్పించటానికి ప్రయత్నించాడు. జీతం తక్కువ. నూటపాతికే. మా అక్క మా చిన్నన్నమీద మండిపడింది. "నువు మూడొందల రూపాయల ఉద్యోగం చెయ్యాలా? మా ఆయనకు నూటపాతికా! చేతకానివాడివి ఊరుకోరాదూ? తగుదునమ్మా అని రాకపోతే ఏం ? నిన్ను ఉద్యోగం ఇప్పించమని కాళ్ళావేళ్ళా పడ్డామా ?'' అని గయ్ గయ్‌లాడింది. మా చిన్నన్న నాలుగూ పెట్టాడు. ఇంతకూ మా బావ ఆ ఉద్యోగం ఒప్పుకున్నాడు. ఒప్పుకుంటే ఏమయిందీ ? రోజూ వచ్చి మా చిన్నన్నను చెప్పేవాడు. పని జాస్తిట ! తనను తగినంత గౌరవంగా చూడరుట ఆఫీసులో ! శనివారంకూడా పనిచెయ్యాలిట ! ఉద్యోగం మాష్టరు పనల్లె లేదుట !

ఎవరు ఏ క్షణాన ఎవరిపక్షమో ఎవరికీ తెలీదు. ఒకరోజున, ముహూర్త బలాన్నిబట్టి మా అమ్మ మా చిన్నన్నను వెనకేసుకొచ్చి మా అక్కతో ఏదో అన్నది. మా అక్కకు కోపం రెచ్చిపోయి మొగుడితో "ఈ వెధవకొంపలో నే నొకక్షణం ఉండను. ముందువెళ్ళి ఇల్లుచూస్తారా చూదరా ?'' అన్నది. అసలు మా అక్క వారానికోసారి వేరే ఇంటికి వెళ్ళేనంత పనీ చేసేది. ఇల్లులేకనో, సామాను పట్టుకెళ్ళ టానికి సమయానికి డబ్బులేకనో మానేసేది.

ఇట్లావుండగా మా చెల్లెలు—ఇంటరు[1] పూర్తిచేసి ఇంటిదగ్గరే వుంటున్నది —తన పెళ్ళి ప్రయత్నాలు తానే చూసుకోసాగింది. ఈ సంగతి కొన్నాళ్ళు మా వాళ్ళకి తెలీదు. అందరికన్న ముందు తెలిసింది నాకే. అప్పటికే ఉభయపక్షాలూ పెళ్ళి స్థిరం చేసుకున్నారు. నే నెవరితోనూ చెప్పలేదు. కాని మా చెల్లెల్ని చేసుకో పొయ్యేవాణ్ణి గురించి మటుకు కొంత ఆరా తీసి కొంత వరకు తృప్తిపడ్డాను.

మా చెల్లెలి రహస్యం మా అక్క కనిపెట్టింది. మా చెల్లెలి డ్రాయరు వెతికి అందులోంచి ఒక చిన్న ఉత్తరం తీసింది. మా చెల్లెలి రంకు కనిపెట్టినట్టుగా మాట్లా డింది మా అక్క. మా చెల్లెలు పోట్లాడింది.

"నీ విషయాలు నువు చూసుకో. నా జోలికిరాకు!" అని అది సాహసం చెప్పింది.

మా అమ్మ పంచాయితీ చేసింది. ఆ వుత్తరం రాసిన వాడిపేరు చెప్పమని మా చెల్లెల్ని నిలవేసింది. నేనూ, మా చిన్నన్నా మా చెల్లెలి పక్షం అయినాం. మా బావ భార్యపక్షం అయినాడు. ఆ చర్చ వర్ణనాతీతం. ఎవరో సంబంధంలేనివాళ్ళ రంకు గురించికూడా అంత ఆసక్తి కనబరచం. మా చెల్లెలు మటుకు పరీక్షకు నిల బడింది. దాని నోట ఒకమాట రాలేదు.

---

1. S.S.L C అంటే 11 వ తరగతి తర్వాత రెండేళ్ళ ఇంటర్‌మీడియేట్.

తరవాత కొద్దిరోజులకే దాని పెళ్ళి అయింది. మా అమ్మ రాజీకివచ్చి ఈ పెళ్ళికి కనీసం వెయ్యిరూపాయలైనా ఖర్చుపెట్టటానికి యత్నం చేసింది. అనేక వస్తువులు కొన్నదికూడా. మా చెల్లెలు వాటిలో ఒక్కటీ ముట్టుకోలేదు.

ఈ పెళ్ళికి ముందే నేను ఉద్యోగం సంపాదించుకుని పట్నం వదిలేశాను. ఇల్లు వొదిలేసినాకనే నాకు మనుష్యులమీద అభిమానమంటూ పుట్టింది. ఇంకొకరిని అర్థంచేసుకోవటమూ, ఇంకొకరి కష్టసుఖాలు పంచుకోవటమూ మొదలైనవి నాకు బయటి ప్రజలు నేర్పారుగాని, ఇంట్లో వాళ్లుకారు. ఈ యింట్లోవాళ్ళ మీదనైనా దూరం వెళ్ళాకనే యేదో అభిమానం పుట్టింది. మొన్ననే మళ్లీవచ్చాను.

నేను మా ఇంట్లో అడుగుపెడుతుండగానే మా వాళ్లంతా ఎగబడి పెద్ద శుభవార్త చెప్పినట్లు ఎంతో ఆనందంతో ఒకరికొకరు అడ్డంవస్తూ చెప్పారు. తీరా వింటే మరేమీలేదు. మా బావగారికి ఉద్యోగం ఊడిందిట ! అందులో మా అమ్మ పట్టలేనంత ఆనందం పొందడానికేముందో, మా వదినె అందరికీ అడ్డంవచ్చి అందరి కన్నా గొంతుచించుకొని పరవశమైపోవటానికేముందో నాకర్థంకాలేదు. ఇది ఒకటేకాదు, మా బావ ఒక్కడికే కాదు; ఆ కొంపలో యెవరికి యెదురు దెబ్బ తగిలినా మిగిలినవారంతా ఏకగ్రీవంగా నవ్వటానికి సిద్ధంగా వున్నారు. ఇది మా ఇంటి కథ. దీనికి అర్థం ఏమన్నావుంటే మీరు చెప్పండి. తెలుసుకోవటానికి నేను సిద్ధంగా వున్నాను.

ముద్రణ : ఆంధ్రజ్యోతి, (మాసపత్రిక) జనవరి 1953.

# జూదం

ఆరాత్రి రెండుగంటలదాకా చదివిపడుకుందామని ప్రోగ్రాం వేసుకున్నాం నేనూ జానకిరాముడూనూ. పరీక్షలు వచ్చిపడుతున్నై; నాకు పోర్షన్లయినా తెలీదు, మా జానకిరాముడికి అవైనా తెలుసు. నాలుగ్గంటలకే జానకిరాముడు స్టేషను మాస్టరు గారబ్బాయి, గోవిందరాజు దగ్గిర స్టౌ తెచ్చాడు.

"ఇదెందుకురా?" అన్నాను.

"టీ"

"చా! అదితాగితే నిద్దర్రాదుట్రా!"

"రానినిద్దర తెప్పించదుకదా?"

"ఏమో! ఎవడు చూశాడు!"

"చాలా తాగితే నిద్దరొస్తుందని నీకనుమానంగా ఉంటే హోమియోపాతిక్‌గా ఒకచుక్క ఎడ్మినిష్టరు చేస్తాలే!"

అన్నవాడు భోంచెయ్యగానే ఎక్కడికి ఉడాయించాడో పదిగంటలయినా జిపిలేడు. పోర్షన్లే ఎరగనివాణ్ణి ఏంచదవను? పోనీ తెల్లవారుజామునే లేచి చదువు కోవచ్చు. వెంటనే నిద్ర పోదామంటుంటే, పుస్తకంపట్టందే నిద్దరెట్లావస్తుంది? పది న్నర కటూ ఇటూ జానకిరాముడుగూడా చేరుకున్నాడు. కాని మనలోకంలో ఉంటేనా?

"సరే, చదువు మొదలు పెడదామ్రా?"

మాట్లాడ్డు.

"పోనీ, టీ కాయన్రా?"

పలకడు.

"అయితే పడుకుని శయనింతామ్రా?"

జవాబులేదు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావు?"

"ఊఁ?"

"ఏమిట్రా ఆలోచిస్తున్నదీ?"

"ఊఁ?"

మూడోసారి మళ్ళీ వేసిన ఎత్తేవేస్తే ఆట "డ్రా" అవుతుందని మహా పెట్టాను.

అంటే లేచివెళ్ళి వాణ్ణి కుర్చీమీదినుంచి కిందకి పడదోసి, పెంకులేరటం మొదలు పెట్టాను.

"ఊఁ! ఊరిఖే! చెప్పేది గ్రహించకుండా!" అంటూ వాడు లేచి అవయవాలను యథాస్థానంలో అమర్చుకోసాగాడు.

"నువ్వేదో చెప్పినట్టు!" అన్నాను.

"ఆఁ! ఏముంది చెప్పేందుకు!"

ఇవాళ నాగరాజుకు ముప్ఫయిరూపాయలు మనీఆర్డరు వచ్చింది, తెలుసునా?"

"ఎందుకొచ్చిందా అని ఏడుస్తున్నావా? వాళ్ళయ్య పదిమంది కాళ్ళూ పట్టుకొని వాడికి పాతిక రూపాయలూ పంపుతున్నాడు నెల నెలా."

"ఇంకేం, ఇవాళ వచ్చిన డబ్బంతా పంతులు కాజేశాడు!"

"దొంగతనమే! ఎవరైనా చూశారా! ఒరే, మనం ఎమెచూర్ పత్తేదార్లు కావటానికి మంచి చాన్సురా! ఏదీ "డేటా" యావత్తూ నా ముందుంచు. నేను కుర్చీలో కళ్ళుమూసుకొని పడుకుని ఆలకిస్తాను. నువ్వు వాట్సను వనుకుందాం!"

"దొంగతనమూకాదు నీ మొహమూకాదు. ఈ నాగాయివెధవ వెళ్ళి వాడితో జూదమాడాడు."

"హరి! వీడిదుం—వీడికిదివరకులేదే ఈ వైయ్యేకాలం. కావలసిందే—శిక్ష!"

"నువ్వంతా వినవా ఏం? తెలివిగలకుంక కదా అని ప్రిన్సిపల్ వీడికి ఎడ్మిషన్ అప్పుపెట్టాడు. ఆ అప్పుతీర్చి పై కర్చుకుంచుకోమని వాళ్ళయ్య ఈ డబ్బు పంపాడు. వీడికి డబ్బు వచ్చిన సంగతి ఆ పక్షి పసికట్టాడు. తమాషాకు పేకాడదాం రమ్మన్నాట్ట పంతులు. నేనంత భాగ్యవంతుణ్ణి కాదు మహాప్రభో, నన్ను చంపకన్నాట్ట నాగాయి. నవ్వులకేనోయి, నీ డబ్బెవరికావాలి అన్నాట్ట పంతులు. నాకసలు చాతగాదన్నాట్ట నాగాయి. నాకు చాతవునా ఏమిటి? గంటసేపాడామంటే ఎవరిడబ్బు వారిదగ్గరే ఉంటుంది. అట్లా కాకపోతే జూదగాళ్ళు ఊళ్ళు కొనకపోయినారా అన్నాట్ట పంతులు. అప్పటికీ నాగాయి పడకపోవటం చూసి నీకు భయముటోయ్! అన్నాట్ట చాలా ఆశ్చర్యంగా! దాంతోపడ్డాడు. నా బుద్ధికి నాగాయి తప్పు జాస్తిగా కనపడదు. వాడికి జూదం విషయంగాని పంతులు దగ్గిర డబ్బులేని సంగతి గాని తెలీదు. వాడుగెలిస్తే పంతులు డబ్బు ఇచ్చి ఉండేవాడే. పంతులూ అంతేననుకున్నాడు."

"ఛా!" అన్నాను ఆశ్చర్యార్థకంగా.

"పాపం, నాగాయిని చూసితీరాలి జీవచ్ఛవమల్లే ఉన్నాడు. నాతో అంతా చెప్పాడు. వాడేడుస్తున్నాడురా, పాపం!"

"పంతుల్ని నిలవేసి చావదన్నితే? డబ్బు కక్కటూ?"

"నాగాయితో ఆ మాటే అన్నా. వాడికదినచ్చలేదు. అదముండల్లే మనచేత చెప్పిచేయించుకోవటం అట్లా ఉంచి, ఆ డబ్బుమీద తన హక్కును చేతులారా

వదలుకున్న వాడికటువంటి పని చేయించడం తగదంటాడు. వాడు చెప్పేదాన్లో కొంత నిజం లేకపోలేదు. పైగా మనం ఆ పని చేస్తే వాడాత్మహత్య చేసుకుంటాడని నాకు గట్టి నమ్మకం. అంతా మెతగ్గా ఉండే వాళ్లెంతకయినా తగుదురు!"

ఈ విధంగానే కాస్సేపు మాట్లాడి నిద్రపోయినాం. మర్నాడు జానకిరాముడు ఈ ప్రశంసే ఎత్తలేదు. నేనెత్తినా సరిగా జవాబు చెప్పలేదు. నాకయినట్టుగానే వాడికీ ఒకరిద్దరితో దాని మీదనించి మనస్సుపోయింది కామల్లనుకున్నాను.

ఆ తరవాత వృత్తాంతం నాకు నారాయణవల్ల తెలిసింది. అదైనా వాడంతట వాడే బయటపెడితే—

"ఏమిట్రా, సీనూ, మీ జానకిగాడుకూడా మాలో కలిశాడే! వాణ్ణింకా మేం చదువొచ్చేవాళ్ళలో వేశామే! అయినా డబ్బున్నవాడేలే!" అన్నాడు నారాయణ.

"ఏమిట్రా? ఏమిట్రా?" అన్నానాశ్చర్యంతో.

"వాడుకూడా పలాసాడటానికి[1] పంతులింటి కొస్తున్నాడు. ఐదురోజుల్నించీ! రోజూ రెండూ మూడు పెడుతున్నాడురా!"

"ఛా!"

"ఆః!"

"పంతులేనా గెలుస్తున్నది?"

"పంతులు కాదోయ్! వాడెవడో పంతులు స్నేహితుడల్లే ఉన్నాడు. ఇక్కడి వాడు కాదు. ఎంత అద్భుతంగా ఆడతాడనుకున్నావురా? ముక్కలు చూసినట్టాడతాడు. ఎట్లా ఆడతా వింతాట అంటే, ఆఁ వెధవ పదిహేడు ముక్కల బతుకుతె లేకపోతే ప్రజ్ఞ ఏమిటన్నాడ్రా! ఒకసారి వాడికి వరస చూపించి రోజల్లా కలుపు, కత్తెర వెయ్యి, ముక్కలు వరస చెబుతాడు. బలేవాడు!"

"ఛా!"

"ఆఁ!"

"వాడా ఇప్పుడు వీణ్ణి గొరగటం?"

"ఆఁ. పంతులిప్పుడాడటంలేదే! వాడిచేత ఆడిస్తాడు. రేపో ఎల్లుండో పెద్దాట ఆడతారట. అర్ధరూపాయి గేటు. ఎవర్నీ రానీరు. చూదామంటే, పోయి ఆడదామంటే—" డబ్బు లేదని సంజ్ఞచేశాడు.

జానకిరాము డానాడు కనపడగానే వాణ్ణి సతాయించాను. లాభంలేకపోయింది. ఎనుబోతుమీద వర్షం కురిసినట్టే వాడికి మాటలు.

ఆ తెల్లవారుజామునే పెద్దగోల. ఆపలాసు ప్రొఫెసర్ను—అతని పేరు సీతారామయ్య అని తెలిసింది— మా జానకిగాడు తెల్లవారుజామున అయిదింటికి రోడ్డు

---

1. పలాసాలాడటానికి: పేకముక్కలాడటానికి, ఆకులాడటానికి. పలాశం అనే సంస్కృతం నుంచి వచ్చిన మాట పలాస. పలాశం అంటే ఆకు.

మీద పడేసి చావదన్నాడు. ఆవేళకు వాడు గదిలో లేదని నేను సాక్ష్యం యివ్వ గలను. ఆ సీతారామయ్య మాత్రం "నేను సరిగా చూడలేదు. చెప్పలేను" అన్నాడు గాని దూరాన్నించి చూసినవాళ్ళు ఒకరిద్దరు మావాణ్ణి సరిగానే వర్ణించారు. జానకి రాముణ్ణె అడిగితే—ఉందిగా వనమూలిక!—మాటాడ్డు.

నాకు చాలా అసహ్యమేసింది. ఆ నాగరాజు డబ్బు ఎట్లాగైనా తిరిగి సంపా దిద్దామని ఈ దరిద్రపెద్దమ్మ తన డబ్బు కూడా పోగొట్టుకొంటున్నాడు. చదువు కూడా మాని! డిస్టింక్షన్ రావలసిన వెధవ! ఎవడికిగీత ఎట్లావుందో!

పెద్దాటకు మావాడు వెళ్ళనే వెళ్ళాడు. ఆనాడు ఆదివారం. ఉదయం తొమ్మి దింటికి వెళ్ళాడు, మధ్యాన్నం భోజనానికి రాలేదన్నాడు హోటలువాడు, నేను సాయంకాలం భోజనానికి వెళ్ళినప్పుడు.

రాత్రి ఎనిమిదింటికి హాజరు దొరగారు! తెల్లమొహమూవాడూ!

"ఎంత పోయిందిరా?"

"స్టౌ ఉందా? టీ కాయి! రోజల్లా తిండిలేదు."

"నీకు టీ ఎందుకింకా పైత్యానపడటానికి?"

"ఫరవాలేదు కాయిరా! బోలెడంత చదవాలిసి వుంది?"

"నీ చదువూ, నువ్వూ! ఎంత వదిలించుకున్నావు?"

జానకిరాముడు జేబులో చెయ్యిపోనిచ్చి ఒక కాగితాలకుప్ప కిందపారేశాడు. అన్నీ నోట్లే!

"లెక్కపెట్టు! అరవైఅయిదో ఎంతో ఉండాలి!"

"అందులో పది మన సీతాయికి బహుమానం ఇద్దాం, నాగరాజు బాకీ తీరుద్దాం. వాడికో అయిదు రూపాయలు పాకెట్ మనీకింద ఇద్దాం. మిగతాది ఇన్నిరోజుల్నించీ నేను ఖర్చుపెట్టింది?"

"మీ సీతాయెవరు?"

"ఎన్నడూ వినలా? ప్రాడ్జీలు చాలా తక్కువగా ఉన్న ఈ పాడు ప్రపం చంలో వాడు పేకముక్కల ప్రాడ్జీ!"

"అయితే?"

"అన్నట్టు వాడు తొమ్మిదిగంటల బండిలో తిరిగి వెళ్ళిపోతున్నాడు. మనం స్టేషనుకు పోవాలి."

"అన్నట్టు వాడెవడో పంతులు స్నేహితుడు బాగా ఆడతాట్ట! వాడిమీద ఎట్లా గెలిచావురా నువ్వు?"

"పంతులు స్నేహితుడెవరు? వాడే సీతాయి. మాపింతల్లి కొడుకయితే, పంతులు స్నేహితుడంటావేమిటి?"

"నాకర్థం కాలేదు? అతన్నేనా నువ్వు కొట్టింది?" జానకిరాముడు విరగబడి నవ్వాడు.

"అదో పార్సు! ఇద్దరం మాట్లాడుకోవాలి సొచ్చింది. సరే తెల్లవారుజామున పంతులింటి బయట కలుసుకున్నాం. మేం మాట్లాడుకోటం తేలేదేమో? ఎదురుముఖా లుగా నుంచోటంలేదు. వాడు ముందు నడవటమూ, నేను వాడి వెనకే నడుస్తూ మాట్లాడటమూ, అట్లాగే మాట్లాడుతూ నడుస్తుంటే దూరాన పంతులూ మరొకడూ హాజరు. సరే నాకేమీ తోచక రోడ్డుమీదవాణ్ణి బొక్కబోర్లా పడదోసి మీదెక్కి కూర్చుని కొట్టినట్టు నటించి పక్కసందుగుండా దవుడుతీశాను. అయితే వాడితో ముందే రహస్యంగా చెప్పానుగనుక దెబ్బతగలకుండా వాడే పడ్డాడు ...ఏదిరా, టీ?"

"ఛా!"

-ముద్రణ : మాదురి, ఏప్రియల్ 1935.

# నాకు తెలీదు

వాడి సంగతులన్నీ నన్నెందు కడుగుతారో? నాతో ఎందుకు చెబుతారో? వాడి జోక్యం నాకసలవసరం లేదు. నేనసలు వాణ్ణి సరిగా ఎరగను.

"వాడు నీ బంధువేటగా" అంటారు- నా బంధువులందర్నీ నేనెరిగినట్టు. కస్త్వం భ్రాతః? మొన్న ఈ మధ్య ఒక అతను మా ఇంటికొస్తే మర్యాదగా కూర్చో బెట్టి "ఏం పనిమీద వచ్చారు? ఏవూరు?" అడిగాను. నేనంత మర్యాదగా మాట్లా డించినా, అతను మొహం మట మట లాడించుకొని, ఏదో గొణుక్కుని లేచి వెళ్ళిపోయినాడు. మొహం ఎక్కడో చూచినట్టుందే అని అనుకున్నానుగాని, ఎంత సేపటికీ తట్టలేదు. ఆఖరుకు మా చెల్లెలి మొగుడి మొహమల్లే ఉందని జ్ఞాపకం వచ్చింది. అతనేనా అన్నంత అనుమానం కూడా కలిగింది. చెప్పొద్దూ! కాని అతనయితే ఎందుకు వెళ్ళిపోతాడూ? పాపం, ఏం చూచుకుని అతనికింత అహం కారం ఉంటుందీ ? బొత్తిగా లేనివాడు. నాబోటిగాడినుంచి అంతో ఇంతో సహా కారం ఆపేక్షించ దగినవాడు. అటువంటివాడు మాటా, పలుకు లేకుండా లేచివెళ్ళి పోతాడా?....కాని అంత పోలిక ఉండటం - ఉంటారు మనిషిని పోలిన మనుషులు !....

ఈ సీతాపతి- వీడి సంగతి అట్లా కాదే. వీడి మొహం ఎరుగుదును. కన పడితే మర్యాదకు పలుకరిస్తాను. వీడూ నేనూ చిన్నతనంలో పదేళ్ళు కలిసి చదువుకున్నాం కూడాను. అయితే వాడి సంగతేమీ నాకు తెలీదు. నాకు వాడితో పెద్ద పరిచయం ఏమీలేదు. వాడు నన్నెరుగుదునని చెప్పుకుంటే నేనందుకు బాధ్యుణ్ణా? ఎవరెవరో వచ్చి, "నేను నీ మేనత్త మొగుణ్ణిరా, నాయనా!" "నేను మీ పెద్దక్క బావగార్నోయ్!" "నేను మీ పినతల్లి- మామగార్నబ్బాయీ" "నేను నీ పోర్తు ఫారం క్లాసుటీచర్ని" "నేను నీ మేనమామ కొడుకునిరా ! "నేను నీ పెత్తల్లి కొడుకును!" అంటూ చెప్పుకుంటారు. మొహాలు చూడబోతే అన్నీ కొత్తగా ఉంటై.

పోనీ నేను మొహాలు గుర్తించలేని వాణ్ణా ? చదలవాడ కుమారరాజాగార్ని నేనెప్పుడూ చూడలేదు. ఫోటో కూడా చూచినట్టు జ్ఞాపకంలేదు; కనక చూడలేదనే చెప్పాలి. మరి ఆయన్ని చూడగానే పోల్చుకోగలిగానా?

అ మధ్య గిరి[1] గారు ఫలాని టాకీ బహిరంగ ప్రదర్శనానికి వస్తారంటే

---

1. గిరిగారు : వరహగిరి వెంకటగిరి (1894 - 1980) ప్రముఖ జాతీయ వాది, కార్మికోద్యమకారుడు, మాజీ రాష్ట్రపతి.

ఆహ్వానమే తెప్పించుకు మరీ వెళ్ళా. గిరిగార్ని నేనెప్పుడూ చూడలేదు. ఆయన పరిచయ భాగ్యం కోసరమే వెళ్ళాను కూడాను. ఆయన ఫోటో చూడలేదని ఎట్లా చెప్పనూ? చూశాను. కాని గిరిగారికీ ఫోటోకీ ఏమీ సంబంధంలేదు. ఆయన పొట్టిగా సన్నగా ఉంటారు. తలపాగా చుట్టుకుంటారు. వయసు అరవై పై చిల్లర ఉంటై. ఫోటో చూసినవారెవరూ ఆయన్ని చూసి గుర్తించలేరని ఖండితంగా చెప్పగలను. అయినా నేనాయన్ని వెంటనే పోల్చాను.... ఎవరో దేశద్రోహులు ఆ వచ్చినది గిరిగారు కాదనీ, మరొకరనీ అనుకుంటుంటే విన్నాను. తమ నాయకుల్నే గుర్తింపలేని ఈ జనసామాన్యమంటే నాకు మంట కాదూ మరి?—

అందుచేత నేను మొహాలు గుర్తుపట్టలేననటానికి వీల్లేదు. గాంధీజీని ఎప్పుడో 1924 లో చూశానా, ఇవాళ ఆయన్ని చూసి క్షణంలో గుర్తించగలను.

ఈ సీతాపతి నన్ను ఆర్నెల్లు పోషించానని అందరితోటీ చెప్పుకుంటున్నట్లు విన్నాను. ఇది నేను సహించను. వాడికెప్పుడో గట్టిగా బుద్ధి చెబుతాను. ఈ ఓకాటి వెధవ నన్ను పోషించడమేమిటి ? నా వ్యాపారం మీద ఒక గంటలో వచ్చే లాభమంత లేదు, వాడి నెల ఖర్చు. వాడి జన్మలో ఎన్నడైనా బీడీ తప్ప కాల్చి ఎరుగునా ? నన్ను వీడు పోషించటమేమిటి? ఎవడైనా వింటే నవ్వి పోతాడు.

పోనీ నేనేమైనా ఇటువంటి విషయాలు మరిచే మనిషినా ? ఎప్పుడో నేనింటర్ చదువుతున్న రోజుల్లో శేషాచలానికి ఒక పావలా బదులిచ్చాను. అది అతను తిరిగి ఇచ్చేసినట్లె చెప్పాడు, తరవాత అడగ్గా. ఇచ్చేసే ఉంటాడు కూడాను. చెప్పొచ్చిందేమంటే నాది చెడ్డ జ్ఞాపకశక్తి. చచ్చినా మరవను. అటువంటిది ఈ సీతాపతిగాడు నన్నారు నెల్లు పోషిస్తే నాకు జ్ఞాపకం ఉండదా ?

అసలు మేమిద్దరము కలిసిఉన్న దెప్పుడూ ? ఎక్కడా ? 1936 లో ఒక గది తీసుకుని వాడు జార్జి టవును సందుల్లో ఉండేవాడు. అప్పుడు మద్రాను నాకు కొత్తగనక, బ్రాడ్వేలో నేను కనిపిస్తే,నన్ను వాడు, "ఎక్కడ ఉంటున్నా"వని అడిగితే, సామాను సత్రంలో పెట్టుకుని గదికోసం వెతుకుతున్నాననీ, ఉద్యోగం కోసం మద్రాసు వచ్చాననీ నేను చెప్పితే, వాడు నన్ను గది దొరికే దాకా తన గదిలోనే ఉండమని అంటే, పోనీ వాడికీ తోడుగా ఉంటుందిగదా అని సరే నన్నా. దగ్గిరగదా అని వాడు తినే హోటలుకే నేనూ వెళ్ళేవాణ్ణి. సినిమాలకు వాటికీ కలిసి వెళ్ళేవాళ్ళం.

సీతాపతిది నక్క తెలివని ఒప్పుకుంటాను. వాడికెంత ముందాలోచనో ! నాకు హోటలు టిక్కెట్లు కొనిపెట్టేశాడు. తాను బీడీలుకొన్నా నాకు సిగిరెట్లు పెట్టె కొనిపెట్టేవాడు. తన డబ్బుతో నన్ను సినిమాకు తీసుకెళ్ళేవాడు. నన్ను పోషించానని చెప్పుకునేటందు కివన్నీ చేస్తున్నాడని నాకేం తెలుసూ? పైగా ఆరు నెల్లని చెబుతున్నాడా? ఫిబ్రవరీలో నేను పట్నంవస్తే ఆగస్టుకల్లా నాకు ఉద్యోగం దొరకనే దొరికింది గద !....

ఈ సీతాపతి ఎవరో నాకు తెలీదు. వీడి ఊసెత్తకుండానే నా జీవితం హాయిగా వెళ్ళిపోతుంది. వీణ్ణిగురించి అరక్షణం కూడా వేదన పడవలిసిన అవసరం నాకులేదు. అయినా పోనీగదా, కష్టంలో ఉన్నాడుగదా, చెడుసావాసాలు చేస్తున్నాడు గదా, మంచిదారిని పెడదామనీ, ఆదుకుందామనీ, ఇంత రాబడి ఏర్పాటు చేద్దామనీ, నేను ప్రయత్నించిన మాట నిజమే. నేనల్లా కోరిందేమంటే - అదయినా వాడి మంచికోరేగాని - నాకేమో జరుగుతుందని కాదు - ఆ దేశద్రోహుల సావాసం మానమన్నా. "నీకీకూలివాళ్ళ సంఘాలెందుకు? దొంగ మార్కెట్టు వాళ్ళెట్లా పోతే నీకేం? జమీందార్లమీద కత్తిగట్టే పాటివాడివా? ఎంత గొప్పవాడివైనా అణకువ తెచ్చిపెట్టుకో. గాంధీజీకీ, సర్దారు పటేలుకూ, నెహ్రూకూ తెలిని రాజకీయాలు నీకు తెలుసునంటే ఎవరన్నా నవ్విపోతారు. నిన్ను చూసి అంతా ఎంత నవ్వుతున్నారో నీకు తెలుసునా ?........ ఇవన్నీ వొదిలేసుకుని నా దగ్గిరకిరా, నీకు, ఉద్యోగం ఇస్తా" అన్నాను.

రోగికి పథ్యం ఎక్కడన్నా రుచిస్తుందా? నన్ను నానా మాటలూ అన్నాడు. నేను నా కూలీల రక్తం పీలుస్తున్నానుట. వాళ్ళ డొక్కకొడుతున్నానుట. వాళ్ళు తనమాట వింటారుట. వాళ్ళచేత సమ్మె చేయించి నేను తినేదంతా కక్కిస్తాట్ట. నావంటి వాళ్ళలో విశ్వాసం ఉంచబట్టే కాంగ్రెసు నాయకుల రాజకీయాలు అడివిదారి పట్టినాయిట! తాను పనివాళ్ళ పక్షం ఉంచబట్టే తనని కొనెయ్యాలని నేను చూస్తున్నానుట. తనలో సహం చదువులేని వాడికి నా ఫ్యాక్టరీలో చీఫ్ ఫోర్మన్ ఉద్యోగం ఇచ్చి రు. 350లు జీతం ఇస్తున్నాను అతనికి. పాపం, పనివాళ్ళంటే ఏమీ ఆపేక్ష లేదు. ఎంతో స్వామిభక్తి పరాయణుడు. కూలీ వెధవల్ని వెనకేసుకొచ్చిన వాళ్ళందరికీ ఉద్యోగాలిస్తే నేను అడుక్కు తినవలసిందే!

అడ్డమైన వాళ్ళతోటీ తిరిగి ఇటువంటి త్రాష్టులు "దొంగ వ్యాపారం, దొంగ వ్యాపారం" అంటే నా వొళ్ళు మండిపోతుంది. దొంగ వ్యాపారం అనగా ఏది? ఆర్థికశాస్త్రం బట్టి లేని వస్తువులకి ధర హెచ్చటం ధర్మం. ధరలు ఇష్టమై ఇవ్వగల వాళ్ళే కొంటారు. ధరలు ఇవ్వగల వాళ్ళనుబట్టే హెచ్చుతై. కొనుక్కోలేని వాళ్ళ కోసం వ్యాపారం చేస్తామా? కొనుక్కోలేనివాళ్ళు ఎప్పుడూ ఉంటారు. ఏ ధరలకి వ్యాపారం చేసినా దొంగ వ్యాపారమే. పరప్రభుత్వం ఉండబట్టే ఈ కంట్రోళ్ళన్నీ వచ్చినై.

నేను దొంగ వ్యాపారం చేసి లక్షలు చేసుకున్నానని ఈ సీతాపతి - నా ముక్కూ మొహమూ ఎరుగని ఈ దరిద్ర నాయకుడు - నామీద ప్రచారం చేస్తున్నాడు. అవును, వ్యాపారం చేసుకున్నాను. సంపాయించాను. తనకు చాతయితే సంపాదించుకోలేకపోయినాడా? నామీద పడి ఏడవటం దేనికి? నేను లక్షలు సంపాదిస్తే కట్టుకుపోయినానా? పరిశ్రమ సాగిస్తున్నాను. నలుగురికి భృతి ఏర్పాటు చేస్తున్నాను. వాళ్ళు తిండి తిని పోతున్నారే అని ఏడుపు తనమా! వారిచేత సమ్మెలు

చేయిస్తాట్ట, కూలివాళ్ళు ఆ కాస్త తిండి తినిపోతున్నారని పీడి ఏడుపు ఓర్చ లేనమ్మ తను పెట్టదు. అడుక్కో తిననివ్వదు. అందర్నీ దొంగ వ్యాపార్లనీ ప్రజాద్రోహులనీ తిట్టే ఈ మూకనెప్పుడైనా చూడండి - వీళ్ళు ఒక ఈగకి పని చూపించలేరు. పనిచేసే వాళ్ళని ఇంత తిననివ్వరు. సంఘాలంటారు. సమ్మెలంటారు.

వాళ్ళనని తప్పేమిట్లే? ఈ కూలి వెధవలు కూడా వాళ్ళనే నమ్ముతారు. పెట్టే చెయ్యే కరిచే కుక్కలు వాళ్ళు. వాళ్ళకే చదువా, సంధ్యా? వాళ్ళకు మన మాటలెందుకు నచ్చుతాయ్? ఈ సీతాపతి వంటి వాళ్ళే వాళ్ళకు నచ్చుతారు.

లేదు - నాకీ సీతాపతి ఎవరో తెలీదు. తెలియవలసిన అవసరం కూడా నాకు లేదు. వాళ్ళు సన్మార్గుడునని చెప్పుకుంటే నేనందుకు బాధ్యుణ్ని కాను. అట్లా గొప్పగా ఉంటుండని చెప్పుకుంటే చెప్పుకోనివ్వండి. సన్మార్గుడునని చెప్పుకునే వాళ్ళెంత మంది లేరు గనక?

—ముద్రణ : అభ్యుదయ, అక్టోబరు 1948

# బ్రతకనేర్చినవాడు

నేను ఉద్యోగంలో చేరిన పావుగంటలో నాతో స్నేహం చేసుకున్న నా సహోద్యోగి రత్నం. అందులో నా ప్రతిభ ఏమీ లేదు. నేను సులువుగా అందరితోనూ స్నేహం చెయ్యలేను. ఒకప్పుడు నేను ఎవరన్నా పలుకరిస్తేచాలు, ముడుచుకుపొయ్యేవాణ్ణి. నాకు "టచ్ మీ నాట్" అని నాతోటి విద్యార్థులు పేరుపెట్టారు కూడా. అయితే నేను స్నేహభావం లేనివాణ్ణికానని రుజువయినాక ఆ పేరుతో పిలవటం మానేసి పొడిఅక్షరాలతో "టి.ఎమ్.ఎన్." అని, అందరికీ అర్థం కాకుండా పిలుస్తూవచ్చారు. ఆ "టి.ఎమ్.ఎన్" లక్షణాలు సొంతం పోలేదు.

రత్నం నాకు పూర్తిగా విరుద్ధం—అందుకే మాకు దోస్తీ అంత బాగా కుదిరి ఉంటుంది. అతను ఎటువంటి వాడితోనైనా నిమిషంలో స్నేహం చేసుకునే వాడు—ఒక్క నావిషయంలో అతనికి పదినిమిషాలు పట్టింది!

మొదటిసారి పలకరించేటప్పుడే నాతో దీర్ఘమైన పూర్వపరిచయం ఉన్నవాడల్లే పలకరించాడు. ఎంతో అన్యోన్యంగా ప్రారంభమైన మా స్నేహం ఆరోజుకారోజు ఇంకా అన్యోన్యం కాసాగింది అతనిప్రజ్ఞే—నాదేమీలేదు.

అతని స్నేహం నన్నేమీ బాధించలేకపోవటంవల్లా, ఆఫీసులో అతను తప్పిస్తే నాకింకో స్నేహితుడు లేనందుచేత అతను నన్ను వెంటబెట్టుకుని అంతరిక్షంలో ఎగురుతుంటే నేను అభ్యంతరం చెప్పలేదు.

పైకి నేను ఏమీ అనకపోయినా రత్నం గురించి నాలో ఒకటి తరవాత ఒకటిగా అభిప్రాయాలు ఏర్పడినై. అంతకంటె, మొదట ఏర్పడిన అభిప్రాయం రంగులుమారుతూ వచ్చిందనటం సబబేమో.

"వట్టి సౌఖ్యరాయుడు! మనిషిదగ్గిర ఏమాత్రమూ బింకంగాని, బెట్టుగాని లేదు. తనను గురించి ఇతరు లేమనుకుంటారో అన్న ఆలోచనే లేదు!" ఇది నా మొదటి అంచనా, రత్నం గురించి.

"నేను కొత్తవాణ్ణిగనకా, నాకు తననుగురించి ఏమీతెలీదు గనకా నన్ను పట్టుకున్నాడు. నన్ను ఫూల్ చెయ్యాలనో—మోసం చెయ్యాలనో చూస్తున్నాడు. నేను బొత్తిగా వెర్రికుట్టె ననుకుంటున్నట్టున్నాడు," ఇది నా రెండో ఆలోచన.

కొత్తవాణ్ణిగనక నాకు మా ఆఫీసు గొడవలు తెలియనిమాట నిజమే. రత్నం నాకు సహాయంచేస్తూ—సలహాలిస్తూ వచ్చాడు. అవి నాకు లాభించాయికూడా. అయితే నా మనసులో అతనిపట్ల కృతజ్ఞత కలగలేదు. ఆ మనిషి సద్బుద్ధిని శంకించాను.

మా ఆఫీసులో అందరిని గురించీ నాకు పూసగుచ్చినట్టు చెప్పాడు. ఫలాని ఫలానివాళ్ళు మంచివాళ్ళు, ఫలాని ఫలానివాళ్ళు బొత్తిగా స్వార్థపరులు, తమస్వార్థం కోసం ఏమైనా చేస్తారు-వాళ్ళను గురించి జాగ్రత్తగా ఉండాలి.

అతను చెప్పినదంతా శ్రద్ధగానే విన్నాను కాని అంతా నమ్మలేదు. స్వానుభవంతో అతనన్నది సరిచూసుకుని ఆ తరవాత అవసరమైతే నమ్ముదామని నా మనసులో నిశ్చయించుకున్నాను.

ఒక్క సౌమిత్రినిగురించే రత్నం చాలా ఘాటుగా చెప్పాడు.

"వాడసలు మనిషికాడు, నీచుడు. కాని తెలివిగలవాడు. అవకాశం దొరికితే వాడు తన తల్లి మెళ్ళో పుస్తెలు కాజేసే రకం. వాడి మంచితనం మీద పొరపాటున కూడా ఆధారపడవద్దు, బ్రదర్!"

రత్నం ఇంతఘాటుగా ఎందుకు మాట్లాడుతున్నాడో నాకర్థం కాలేదు. సౌమిత్రి చాల మంచిమనిషిలాగే కనబడ్డాడు. రెండుమూడుసార్లు మాట్లాడాను. అతనిలో నాకేమీ అవలక్షణాలు కనపడలేదు. మా ప్రొప్రయిటరుకు అతను పర్సనల్ అసిస్టెంటువంటివాడు. ప్రొప్రయిటరుగారి ఆఫీసుపనులూ, ఇంటిపనులూకూడా చూసేవాడు. అతనికి గంటలతో పనిలేదు. అవసరం ఉంటే తెల్లవారుతూనే వచ్చేవాడు. రాత్రి పన్నెండుగంటలకు ఇంటికి వెళ్ళేవాడు. మిగిలిన వాళ్ళకు అతని ఆజ్ఞ ప్రొప్రయిటరు ఆజ్ఞే. అటువంటిస్థితిలో ఉన్న మరొకడైతే మిగిలినవాళ్ళపైన ఎంత అధికారం చెలాయించునో! సౌమిత్రిలో అటువంటి అధికార వ్యామోహం నాకేమీ కనబడలేదు.

రత్నం సౌమిత్రిని గురించి పొరబడి అయినా ఉండాలి. లేదా అతనిమీద కక్ష అయినా ఉండాలి. ఈ మాట రత్నం దగ్గిర సూచనగా అన్నాను. రత్నం నా అపనమ్మకం చూసి ఆశ్చర్యపోయి, "వాడితత్వం ఎటువంటిదో చెప్పటానికి నీకొక్క ఉదాహరణ చెబుతాను" అన్నాడు.

సౌమిత్రికి చిన్నతనంనుంచీ డబ్బు యావేనట. పేదకుటుంబమేమో కూడాను. పేదవాళ్ళూ డబ్బు అవసరం ఉన్నవాళ్ళూ ఎందరులేరు? కాని సౌమిత్రి చిన్నతనంలోనే డబ్బుకూ దుర్మార్గానికి ఏదో సంబంధం ఉన్నదని తెలుసుకున్నాట్ట. ప్రతిఏడూ తన పైక్లాసు పిల్లలతో సావాసంచేసేవాట్ట. పరీక్షపోయి ఫలితాలు తెలియగానే ప్యాసయిన వాళ్ళందరి దగ్గరికివెళ్ళి వాళ్ళపాతపుస్తకాలు ముష్టెత్తి తెచ్చేవాట్ట. వాటిలో తనకు కావలసినవి ఉంచుకొని మిగిలినవి కాస్త మరామ్మత్తు చేయించి సగం ఖరీదుకు ఇతర పిల్లలకు అమ్మేవాట్ట. వాడి స్నేహితులలో ఒకడు ఒక ప్రెస్సు యజమాని కొడుకు. పుస్తకాల మరమ్మత్తుకు ఈ ప్రెస్సు అక్కరకు వచ్చేది.

సౌమిత్రి నాలుగోఫారం[1] చదువుతుండగాకాబోలు వాళ్ళవూరికి దగ్గిరగా ఉన్న

1. తొమ్మిదోక్లాసు. అయిదోఫారం తర్వాత S.S.L.C

పెద్దకాలవ అవతల మిడిల్‌స్కూలు[1]ను హైస్కూలు చేశారు. వెంటనే సౌమిత్రి ఇంకొక డబ్బున్న స్నేహితుడితో ఒక ఆలోచన చేశాడు. ఆ వూరికి కావలసిన టెక్స్టుబుక్కులు, నోట్సు బుక్కులు తామే అమ్మదా మనుకున్నారు. రెండోవాడు పెట్టుబడి పెట్టి పాతికరూపాయల పుస్తకాలు కొన్నాడు. ఇద్దరూ కాలవదగ్గిరికి వచ్చే సరికి పుస్తకాల షాపువాడి మనిషికూడా ఒక పెద్దకట్టతో హాజరు. సౌమిత్రీ వాడి స్నేహితుడూ కూడబలుక్కున్నారు. బల్లకట్టురాగానే పుస్తకాలషాపు మనిషి తన కట్టతోసహా ఎక్కాడు. సౌమిత్రి వాణ్ణి మాటల్లో పెట్టాడు. సౌమిత్రి స్నేహితుడు చూడక తన్నినట్టు పుస్తకాల షాపుకట్టను నడికాలవలోకి తన్నేశాడు. పుస్తకాలషాపు మనిషి లబాయిలూ, దిబాయిలూనూ! ...వీళ్ళిద్దరూ వెళ్ళి పాతిక రూపాయల పుస్త కాలూ రెండురూపాయల లాభానికి కొత్తస్కూలులో అమ్ముకుని సాయంకాలాని కల్లా తిరిగివచ్చారు.

ఇదీ రత్నం చెప్పినకధ.

"ఇదంతా నీకెట్లా తెలిసింది!" అని అడిగాను.

"వాడేచెప్పాడు. దాపరికం ఏమీలేదు. వాడి ఉద్దేశం తాను గొప్పపని చేశా నని! కావలిస్తే మంచిగా అడుగు—నీకూ చెబుతాడు" అన్నాడు, రత్నం.

ఏదో వంక పెట్టుకుని సౌమిత్రిచేత ఈ కథ చెప్పించాను. సౌమిత్రి ఏమీ దాచ కుండా అంతాచెప్పి, షాపువాడి మనిషి మూట నీటిలో పడిపోయిన సంగతి చెబుతూ కళ్ళనీళ్ళు కారేదాకా నవ్వాడు.

"పోరిపశువా!" అనుకున్నాను.

"నువుచెప్పింది నిజమేనోయ్! ...మొత్తానికి ఈ సౌమిత్రిగాడు బతకనేర్చిన వాడే!" అన్నాను.

"వాడా? వాడితలకాయి! బతకనేరవటమంటే మానవత్వం ఉండాలి. వాడికి నాకన్న హెచ్చుజీతం, కాని నేను వాడికన్న ఎక్కువ సంపాదిస్తాను—" అన్నాడు రత్నం.

"నువ్వా?" అన్నాను ఆశ్చర్యంతో.

"అవును, అందుకు చాలా పద్ధతులున్నై. అవి బయటపెట్టేవి కావు," అన్నాడు రత్నం.

వాటిలో ఒకటి నా అంతటనేనే కనుక్కున్నాను.

మా ఆఫీసులో రెండు చిట్‌లున్నై. ఒక నూరురూపాయలది, రెండోది నూట యాభై రూపాయలది. మొదటిదానిలో పదిమందీ, రెండోదానిలో పదిహేనుమంది ఉన్నారు. నేనే ఒక్కణ్ణి కావటంచేత నూరురూపాయల దానిలో చేరాను. జీతం

1. ఎనిమిదో తరగతి వరకు ఉండే స్కూలు.

వచ్చేరోజున ఎవరి అవసరాన్నిబట్టి వాళ్ళ తక్కువకు పాడుకుంటారు. అందరికన్న తక్కువ పాడినవాడికి పాడినంత మొత్తం పోతుంది. దాన్ని మిగిలినవాళ్ళు సమంగా వేసుకుని ఇచ్చుకుంటారు.

మూడునెలలపాటు నాకు డబ్బు అగత్యంరాలేదు. అగత్యంపడిన వాళ్ళు ఏ ఎనభైకో డెభైకో పాడేసేవాళ్ళు. మిగిలినవాళ్ళు తాము ఇచ్చుకోవాలిసిన పదిలో రెండూ, మూడూ ఆదా చేసుకునేవాళ్ళు. డబ్బు అవసరం గలవాళ్ళు హెచ్చు ఉన్న రోజున పాట పాపం పెరిగినట్టు పెరిగేది—కాదు, తరిగేది.

నాబుద్ధికి ఈపాట చాలా అమానుషంగా కనిపించింది. ఒకనెల ఒక అతని ఇంట్లో అందరు రోగాలతో తీసుకున్నారు. డాకరు పిల్లుకూ, మందులకూ అతని జీతంకూడా చాలదు. ఆ నెలాఖరున అతను అరవై రెండు రూపాయలకు పాట పాడాడు. అతని అవసరం గుర్తించి ఇద్దరు తమకు డబ్బు అవసరం లేకపోయినా పాడించారు. "అరవైరెండు" అనేటప్పుడు అతనిముఖంలో జీవంలేదు. తనను మిగిలినవాళ్ళు అడవి జంతువును వేటకుక్కలు తరిమినటు తరుముతున్నారని అతనికి తెలుసు, కాని ఏమీ చెయ్యలేడు.

చిట్ అంటే ఇతరుల అవసరాన్ని క్రూరంగా దోపిడీ చెయ్యటం - సహకార విధానాన్ని అవలంబించిన రక్తదాహం !

ఈ చిట్‌లలో రత్నం ఎందుకు చేరనిరాకరించాడో నాకు అర్థమయింది. కాని వేలంపాడే చోటికి ఎందుకు పనిపెట్టుకుని వచ్చేవాడో నా కర్థం కాలేదు.

నాలుగోనెలలో నాకు డబ్బు అవసరమయింది. మరీ పెద్దపోటీ లేకుండా ఉంటే—ఏ ఎనభైకో అయితే—పాడేద్దామనుకున్నాను. ముందుగా ఏమాత్రం తెలిసినా పాట పెంచేస్తారని నా అవసరంగురించి ఎవరితోనూ చెప్పలేదు. రత్నంతో మాత్రం చెప్పాను.

"నీకు నిజంగా డబ్బు అవసరమా ఏమిటి?" అన్నాడతను.

నా అవసరం ఏమిటో కూడా అతనికి చెప్పేశాను.

అయితే భయపడకు, నీ చిత్తంవచ్చినట్టు పాడు. నేను ఆగమన్నప్పుడు మాత్రం ఆగు! నాకేసి చూస్తుండు—నేను సంజ్ఞ చేసినప్పుడు విరమించు," అన్నాడు రత్నం.

అతని ఉద్దేశం నాకర్థం కాలేదు.

"ఎనభైకంటె పాటతగ్గితే ఆగుదామనుకుంటున్నాను—" అన్నాను. "ఎనభైకి ఆగదులే, అరవైఅయిదుదాకా భయం ఉండదు. తరువాత నన్నుకనిపెట్టి ఉండు," అన్నాడతను.

"ప్రతినెలా రెండూ, మూడూ అదా అవుతున్నది గనక ఎనభైదాకా నాకు నష్టం ఉండదు. అంతకంటె తగ్గితే—"

"నీకు నష్టం రాకుండా చూసే పూచీనాదీ!" అన్నాడు రత్నం.

ఎందుకో నాలో అతనిపైన చప్పున నమ్మకం కుదరలేదు. అయినా అతని సలహా పాటించటానికే నిశ్చయించాను.

పాట ప్రారంభమయింది. లోగడ తీసుకున్న ముగ్గురుగాక మిగిలిన ఏడుగురమూ పాటలో ఉన్నాం. పైవాళ్ళు ఇద్దరు, ముగ్గురున్నారు—వాళ్ళలో రత్నం కూడా ఉన్నాడు—మామూలు ప్రకారం.

అసలు వాణ్ణి నేను నోరెత్తకముందే రేచులల్లే తగులుకుని గబగబా మొత్తాన్ని డెబ్భై రెండుకు దించారు. నాకు డబ్బు అవసరం వచ్చినప్పుడే అందరికీ అవసరం కావటం నాకు ఆశ్చర్యం కలిగించింది. కాని ఆపాడేవాళ్ళలో ఇద్దరు ముగ్గురు నాకేసి చూస్తుండటాన్నిబట్టి నా అవసరం వాళ్ళు పసికట్టారా అన్న అనుమానం కలిగింది నాకు.

కాని వాళ్ళకు ఎవరు చెబుతారు? రత్నం చెప్పాలి. అతనికేసి చూశాను. పాడమన్నట్టు సంజ్ఞ చేశాడు. ఏడుగురిలోనూ ముగ్గురే ఎందుకు పాడుతున్నారో నాకర్థం కాలేదు.

నేను నోరు జారినవాడల్లే "అరవై అయిదు," అన్నాను.

ఎవరో చప్పున "అరవై," అన్నారు.

నేను రత్నంకేసి చూశాను. అతను పాడవద్దని సంజ్ఞ చేశాడు. అందరూ నాకేసి చూస్తున్నారు. నేను రాయల్లే దిగుసుకు పోయినాను. అరవైకి పాటకొట్టేశారు. "అరవై." అన్నవాడి మొహం చూసితీరాలి. అక్కడే బావురుమని ఏడిచేస్తాడనుకున్నాను.

తరువాత రత్నం నాకు నూరు రూపాయలిస్తూ, "నీ వంతు వచ్చినప్పుడు ఇచ్చెయ్యి," అన్నాడు.

"నూటికి నూరు వస్తాయని ఏమిటి? పాటవుంటే?" అన్నాను.

"పాట ఉండదులే!" అన్నాడతను ధైర్యంగా.

"ఎవరూ పాడకపోయినా నామకార్థం రెండు రూపాయలు తీసేస్తారు." అన్నాను.

"సరే అప్పుడా రెండురూపాయలూ ఇచ్చేద్దుగాని," అన్నాడతను.

తరువాత రెండునెల్లే పాటసాగింది. పాడేవాళ్ళ సంఖ్య బొత్తిగా తీసిపోయింది.

అసలు సంగతి ఆరునెలలు గడిచాక బయటపడింది. గడిచిన ఆరునెలల కాలంలోనూ పాడుకున్న వాళ్ళు తమ మొత్తాలు పాడుకుని తీసుకోక చివరిదాకా పాడి పోయినవాళ్ళ మొత్తాలు వాళ్ళకు చెల్లించి వాళ్ళ అవసరాలు తీర్చి వాళ్ళ వంతులు తనపేర రాయించుకున్నాడు రత్నం.

పెద్దచిట్‌లకి కూడా ఇదేపని చేశాట్ట!

ఎవరూ నష్టపడ్డట్టు భావించలేదు. అతనిదగ్గర డబ్బు తీసుకున్న వాళ్ళు తమ అవసరాలు గడుపుకోవటమేగాక పాటలో తమను ఓడించిన వాళ్ళకన్న రెండో మూడో ఎక్కువే చేజిక్కించుకున్నారు, వాళ్ళకు లాభించింది!

రత్నం చేసిన పనికి ఆగ్రహించినవాళ్ళు పాడి గెలుచుకున్నవాళ్ళే.

"రత్నం చేసినపని చాలా అన్యాయం" అన్నారు వాళ్ళు.

"నెలకు ఇద్దరి అవసరాలుతీరే ఏర్పాటు చేశాననా?" అన్నాడు రత్నం.

"చిట్‌లు లేనివాడు లాభం పొందటం చాలా అన్యాయం," అన్నారు.

"నన్ను బొత్తిగా పరాయివాడికింద కట్టెయ్యకండి. మనవాడు చాలా డబ్బు ఇబ్బరకాటంలో ఉన్నాడని నేను చెపితేనేకద, అతను నోరు తెరవకుండానే మీరంతా చేరి పిచ్చెత్తినట్టు పాడాడు!" అన్నాడు రత్నం.

"ఏదో స్నేహపూర్వకంగా నడుపుకుంటున్న చిట్‌ను సుప్ప ఇలా చెయ్యటం ఏమీ బాగాలేదు," అన్నారు.

"అసలు మీ చిట్ ఉద్దేశమే నాకు బాగాలేదు. మీ అంతరాత్మలు సంతృప్తి పరచటానికి ఈ మిగిలిన ఆరునెలలు ఎవరో ఒకరిచేత తొంభై ఎనిమిది అనిపించి ఆ డబ్బు నేనే పుచ్చుకుంటాను. మీ దుఃఖమంతా పాట పెంచేవాళ్ళు లేరనే, కనక మీరు బాధపడుతున్నది లోభంతో కాదని నన్ను నమ్మించకండి. నేను అబద్ధాలు నమ్మను!" అన్నాడు రత్నం.

—ముద్రణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 1 జూన్ 1960

# మిత్రద్రోహం

నాకేదో యింత భగవంతుడిచ్చాడు. నేను జైలుకు వెళ్ళిన వాణ్ణి కాక పోయినా నా కొడుకు లిద్దరూ ప్రభుత్వోద్యోగాలు చేసుకుంటున్నారు. వెనక దొరల ప్రభుత్వంలో ఎంత శ్రద్ధగా తమ పని చేసుకొని పోయినారో ఇప్పుడు మన కాంగ్రేసు వాళ్ళకిందకూడా అంత శ్రద్ధగానూ ఉంటున్నారు. ఇళ్ళ అద్దెల మీద, పొలం మీద నాకేదో ఏటా రెండు మూడు వేలు వస్తుంది. అందుచేత నాకు ఇహ చింత లేదు. నేనేమో నా భగవధ్యానమేమో!

అందుచేత నాకు సీతారామస్వామి ఎక్కువాలేదు. రఘుపతి తక్కువా లేదు. ఇద్దరూ కావలసినవాళ్ళే. వాళ్ళిద్దరికీ చెడ్డదంటే, మీరు నమ్మరుగానీ నేనెంతో ఖేదించానన్నమాట.

మేము ముగ్గురమూ విడవకుండా తిరిగేవాళ్ళం. అదేం చిత్రమో ప్రపంచం మంచి ఎక్కడ వున్నా సహించలేదుగద. మేము ముగ్గురమూ కలిసి తిరిగితేనే మా సహాధ్యాయిలు సహించలేక పోయారు. మమ్మల్ని విడగొట్టటానికి ఎన్ని ప్రయత్నాలు చేశారు! రఘుపతితో అనేవాళ్ళుగదా "ఒరే, నీతోకలిసి చదవకపోతే స్వామికి ఇంగ్లీషులోనూ, లెక్కలలోనూ సున్నాయే. అటువంటి వాడితోకన్న మరెవరైనా ఇంకా తెలివిగల వాడితో కలిస్తే యింకా మార్కులు ఎక్కువ వస్తాయిరా!" అనేవాళ్లు. రఘుపతి తండ్రి తద్దినాలు పెట్టాడనీ, వితంతువివాహాలు జరిగితే వెళతాడనీ నాతో చెప్పేవాళ్ళు. నేను రఘుపతీ వెళ్ళి రాత్రిపూట స్వామి ఇంట్లో చదువుకుని కిరసనాయిలు ఆదాచేస్తున్నామని కూడా అన్నారనుకోండి.

అయినా మేం చీలిపోలేదు. మాది అంత మంచిస్నేహం. నేను చదువు మానేసినాక కూడా వాళ్ళిద్దరూ బి. ఎ. దాకా కలిసి నెట్టారు. వాళ్ళిద్దరూ పాసయితే నేను కూడా బియ్యే పాసయినట్టే సంతోషించాననుకోండి. మాది అటువంటి స్నేహం.

కావటానికి మాలో స్వామి కాస్త ధనికుడే. రఘుపతి కూడా నా కంటే ఇంత కలవాడే. అయితే మాలోమేం అటువంటి పట్టింపులెప్పుడూ కలవాళ్ళంకాం. ఇంత కాలానికి రఘుపతి, స్వామి కలిమిచూచి అసూయ పడుతున్నాడనుకోవడానికి నాకే మాత్రమూ మనస్కరించలేదు. కాని స్వామిమీద రఘుపతిచేసే దుష్ప్రచారానికి మరే ఆధారం ఉండదనుకోవాలి.

స్వామి దాదాపు రెండు లక్షలు చేసుకున్నాడంటే నిజంగా సంతోషించవలసిన

వాళ్లలో నేనూ, రఘుపతి మొదటి వాళ్ళం. నేను సంతోషించాను. రఘుపతి మరొక లాగా మాట్లాడనవసర మేముందీ ?

పోనీ స్వామి కూడనిపని ఏమన్నా చేశాడుగనకనా? చేనేత గుడ్డల వ్యాపారం చేసుకున్నాడు. అతను చేసిన పెట్టుబడి పదివేలే అయినా రోజులు కలిసిరావటం వల్ల అంతకు ఏడింతలు లాభించింది. వర్తకమన్నా తరవాత లాభాలే ఉంటాయనే మిటి ? రఘుపతి కూడా చేనేత గుడ్డల వ్యాపారం చేసినవాడేగా. ఎందుకు నష్టపడ్డాడూ? తనకు నష్టం వచ్చిందిగనక లాభం వచ్చినందుకు స్వామిని ఆడిపోస్కోటం ఏంసబబుగావుందీ ?

నన్నడిగితే డబ్బుకన్న పాపిష్టిదిలేదు. దరిద్రులే సంఘానికి శత్రువులు. పాకీవాళ్ళ చూడండి, కార్మికులు చూడండి, రైతుకూలీలు చూడండి, వీళ్ళ మనకు తెచ్చే అగచాట్లకు అంతంటూవుందా ? హత్యలూ, దొంగతనాలు, దోపిడీలు చేసేది ఎవరు ? రఘుపతి యిప్పుడు దరిద్రుల జాబితాలో చేరాడు. అందుచేత అతను ఏమన్నా నా కాశ్చర్యంలేదు. డబ్బు పాపిష్టిది !

ఇద్దరూ ఒకే వ్యాపారం చేస్తే చేశారు. కలిసి చెయ్యకుండా ఎవరి దారిని వాళ్ళు చేసుకుంటే అదెట్లావుండేదో, రఘుపతివెళ్ళి స్వామితో ఎందుకు కలవటం? తన గుడ్డంకొంటేమో, తానేమో అన్నట్టుంటే ఏ పేచీ లేకపొయ్యేదిగా ? స్వామికి పెట్టుబడి చాలని మాట నిజమేననుకొందాము. అంత చాలకపోతే ఉన్నదాని మీద రాబడితోనే తృప్తిపడేవాడో, ఎక్కడైనా తల తాకట్టుపెట్టి తెచ్చుకునేవాడో. రఘుపతి కెందుకూ? డబ్బు దగ్గిరనా స్నేహితాలు ? తను కూడా స్వామికి పది వేలిచ్చాడు. స్వామి తయారు చేయించే బట్టలు జిల్లా అంతటా తానే అమ్మి లాభాలు తీద్దామని ఆశపడ్డాడు. రఘుపతి యిచ్చిన డబ్బు స్వామి తన వ్యాపారంలో పెట్టుబడి చేసుకున్నాడు. దానివల్ల వ్యాపారం బాగా సాగింది కూడాను. సాగినంత కాలమూ రఘుపతి వ్యాపారం కూడా బాగానేసాగింది. స్వామి రఘుపతికి ఒక్కడికే రెండు మూడు లక్షల రూపాయల గుడ్డ అందించాడు. రఘుపతి ఆ డబ్బంతా ఎప్పటికప్పుడు స్వామికి పంపుతూ వచ్చాడనుకోండి. దానివల్ల తన వ్యాపారమే పెంచుకున్నాడు. కాని స్వామికి ఒరగబెట్టిందేముంది. నేతగుడ్డకి ధరలు పడిపోతాయని ముందుగానే తెలుసుకుని స్వామి వ్యాపారం ముగించుకుని దీపం ఉండగా ఇల్లు చక్కబెట్టుకున్నాడు. రఘుపతి కా అవకాశం లేకపోయింది. పదివేల రూపాయల గుడ్డ అతని దగ్గిర మిగిలిపోయింది. దానిక్కూడా యిప్పుడు ధర పడిపోయిందనుకోండి. దాని నెవరేం చేస్తారూ ?

ఇద్దరూ కలిసి అయిదారేళ్ళు వ్యాపారం చేశారుగదా, ఇప్పుడు తీరా వ్యాపారం అయిపోయినాక తనను ముంచాడని స్వామినిగురించి రఘుపతి ప్రచారం చెయ్యటం ఏమైనా బాగుందా ? అవును స్వామికి వ్యాపారం కలిసి వచ్చింది. రాహు మహాదశ ఆరంభంకాగానే అతనికి సిరిఎత్తుకుంటుందని రాసి

పెట్టే ఉంది. "తనతో సమంగా నేనూ పెట్టుబడిచేశాను. తన లాభాలలో నాకు దమ్మిడీ యివ్వలేదు!" అంటాడు రఘుపతి. "రఘుపతి నాచేతికిచ్చిన ప్రతి దమ్మిడీకి లెక్క నా దగ్గిరనే ఉంది. అంతకీ నేను గుడ్డ అందిస్తూనేవచ్చాను." అంటాడు స్వామి.

రఘుపతి యింతా అసందర్భాలు చాలా చెబుతాడనుకోండి. నేతగుడ్డతో ముతకరకం వేలకు వేల సరుకు ఖద్దరుకింద బొంబాయికి స్వామి ఎగుమతిచేశాట్ట. దానిమీద చాలా లాభాలు తిన్నాట్ట. తనకు తెలియకుండా తనమీద పోటీకి చౌకగా మా జిల్లాలోనే యింకా ఇతరులకు స్వామి గుడ్డ అమ్మాట్ట. చేనేత వ్యాపారం మీద లాభాలతో స్వామి యింకా అనేక వ్యాపారాలు చేశాట్ట. స్వామి తనవ్యాపారం మానలేదని, ఇప్పుడు చేనేతగుడ్డ ఎగుమతికి ప్రయత్నాలు సాగిస్తున్నాడని, తన బంధువులందరిపేరా వ్యాపారం పంచి ఏవో తంత్రాలన్నీ పన్నుతున్నాడని ఇదంతా తనను మోసగించటానికేననికూడా రఘుపతి చెబుతున్నాడు. ఈ మాట లన్నింటికీ ఎక్కడిక్? ఇందులో వ్యాపారపు కిటుకులెన్ని ఉంటాయో నాబోటివానికేం తెలుస్తుంది?

స్వామి పెద్దమనిషి, అతను రఘుపతి వ్యాపారం చెడిపోయినందుకు చాలా విచారిస్తున్నాడని నేను చెప్పగలను. చేసుకోవటం చేతకాక పనికి మాలినగుడ్డ యావత్తూ తన దగ్గిర పేరబెట్టుకున్నాడని, అంతా అమ్ముకుని వుంటే రఘుపతి నష్టపడేవాడుకాడని ఆపత్సమయంలో అతను తననేమైనా అంటే అంతమాత్రం చేత తను ఏమీ అనుకోబోవటంలేదని, ఇప్పటికైనా అతను జారిపోకుండా నిలబడితే చక్కగా వ్యాపారం మాట చూచుకోవచ్చునని స్వామి నాతో అన్నాడు. స్వామికి గొప్ప గొప్ప వాళ్ళదగ్గిర చాలా పలుకుబడి ఉంది. అతని ఇంటిదగ్గిర రోజూ కవులూ, రాజకీయవేత్తలూ, పండితులూ, ఇతరులూ చేరటం నేను కళ్ళారా చూచాను. అతను చేసే దానాలకి అంతేలేదనుకోండి. వెధవది ఏ కమ్యూనిస్టులో స్వామిని అనవలసిన మాటలు రఘుపతే అంటున్నాడంటే అతన్ని గురించి పెద్దమనుషులేమనుకుంటారో నాకు బోధపడకుండా ఉంది !

ఎన్నయినా చెప్పండి, డబ్బు చాలా పాపిష్టిది. అది యుక్తా యుక్తాలుకూడా తెలియనివ్వదు !

— ముద్రణ : ఆంధ్రశిల్పి, మార్చి 1948.

# పిరికిగుండె

కోటీశ్వర్రావు ఉద్యోగం సంపాదించాడు. అతనికింకా ఈ విషయం యదార్థ విషయంగా తోచటంలేదు. కలగావుంది. ఏ క్షణానయినా ఈ కల అంతమైపోయి తాను తన పూరిగుడిసెలో కుక్కిమంచము[1]లో లేచికూచోవచ్చు. ఒకటి రెండుసార్లు కలలో పూరిగుడిసే, కుక్కిమంచమూ కనిపించినై కూడానూ. మరోసారి కలలో తన ఉద్యోగం చేస్తానని వచ్చినందుకు అధికార్లు తనను మెడమీదినించి వీదుల్లోకి విసిరిపారేసారు; వీధిలో ట్రాములూ బస్సులూ తనమీదుగా తోలటానికి ప్రయత్నించారు.

చిత్రమేమంటే కోటీశ్వర్రావు దరిద్రం అనుభవించినంత కాలమూ చలించలేదు. ఈ దౌర్భాగ్యపు ప్రదేశంలో తనకన్నా దరిద్రులు - ఈ పూరిగుడిసె కూడా లేనివారు— ఏ రోజూ సరిగా తిండి తినని వారున్నారని అతనికి తెలుసు. వారికి లేని సంస్కారం తనకున్నది; దారిద్ర్యాన్ని ధైర్యం ఎదుర్కోగలగాలి— ఎదుర్కొన్నాడు. అతను కలంపట్టి ఒకకథో పద్యమో రాసినప్పుడు కూడా దారిద్ర్యాన్ని గురించి ఒక్కముక్క రాయలేదు. కారణం: సాహిత్యంలో సొంతఘోష రానుకోవటం అతనికి నీచంగా కనిపించింది. తన సమస్యల్ని ఇతర్ల మీద రుద్దటానికి తనకేమి అధికారం వుంది. ఇతర్లంతా ఇంచుమించు సొంత గొడవలే సాహిత్యంలోకి తెస్తున్నారని అతనికి తోచి కష్టంవేసేది. ఆ సాహిత్యాన్ని ప్రజలాదరించటం కూడా అతనికి శోచనీయంగా తోచేది. ఒక్కోసారి కలంపట్టితే చెయ్యి వొణికి రాత సాగేదికాదు.

సాహిత్యంలోనూ, భావనా ప్రపంచంలోనూ విలువైన విషయాలన్నీ అభౌతికమైనవిగానే అతనికి తోచేది. రచనలోనుంచి ఒక నీతో, ఒక తాత్విక విషయమో రాందే అది సాహిత్యమల్లే అతనికి కనిపించేదికాదు. యథార్థ జీవితంలో ఇది పొసగదు. ఒక నీతినిగాని తాత్విక సిద్ధాంతాన్ని గానీ జీవితానికి తగిలించాలని ప్రయత్నిస్తామేగాని, జీవితంలో నుంచి అవి రావటం అతనికెక్కడా కనిపించలేదు. సాహిత్యానికి జీవితానికి అదే ముఖ్యమైన తేడా అని కూడా అతడు విశ్వసించేవాడు. తనకు నచ్చిన తాత్విక నైతిక సిద్ధాంతాలను అతను సులభంగా ఆచరణలో పెట్టగలిగినట్టు కనపడ్డది. అతను అబద్ధం ఆడి ఎరగడు. తన ప్రవర్తనను జయప్రదంగా శాసించగలిగాడు. అతని ఉన్నతమైన ఆశయాలు చాలావరకు

1. కుక్కి మంచంలో

అతన్ని దారిద్ర్యంలో ఉంచటానికి తోడ్పడ్డ విషయం నిజమేకాని, అతను దాన్ని గురించి చింతించలేదు. ముఖ్యంగా దారిద్ర్యం అతన్ని బాధించకపోవటానికి కూడా కారణం ఇదే.

కాని ఇప్పుడు - తీరా ఉద్యోగం సంపాదించినాక - తనలో దారిద్ర్యం గురించిన పిరికితనం ఉందనేది బయటపడింది. ఈ ఉద్యోగం పోతుందనే భయం తన్నెందు కిట్లా నిద్రావస్థలో పట్టుకుని వేధించాలి? ఈపాటి ఆర్థికబలంతోనే తన నైతికబలం దెబ్బతిన్నదా ? ఏమో! డబ్బు పాపిష్టిది. ఉద్యోగం వొదిలేసిపోతే? మళ్ళీ ఆ గుడిసెలోకేగా ? వొళ్ళు గరిపొడిచింది. ఇక సందేహమేమీలేదు. దారిద్ర్యం చూస్తే ఇప్పుడు భయమే. కాస్త ఆలోచించి చూసుకుంటే ఈ భయం నిద్ర అవసరం లేకుండానే తనకు తెలిసివొచ్చేటట్టుంది !

తన పిరికితనం గురించి ఈ విధంగా ఆలోచించినకొద్దీ నిద్రలో దరిద్రపు కలలు రావటం కొంత తగ్గింది. డబ్బు గురించి మళ్ళీ తాను నిర్లిప్తత సంపాదించుకోవాలని పని పెట్టుకున్నాడు కోటీశ్వర్రావు. కాని నిర్లిప్తత కుదర్లేదు. అన్నీ భయాలే. ఈ క్షణంవరకూ తన జేబులోవున్న డబ్బులు ఇంటిదగ్గిర అప్పుజేసి తెచ్చినవే! ఉద్యోగమైతే వచ్చిందిగాని జీతం డబ్బులు చేతిలో పడేవరకూ తన స్వార్జితమంటూ ఉండదు. ఎక్కడో అప్పుచేసి తెచ్చిన డబ్బు గురించి నైతికదృష్టి కలవాడికి నిర్లిప్తత సాధ్యమౌతుందా? వొట్టిది. అదీగాక-తన ఉద్యోగం కాస్తా మధ్యలో పోతే? ఏదో చెయ్యరాని తప్పుచేసి తనను అధికారులు ఉద్యోగంలోనుంచి తొలగించి, జీతం డబ్బులివ్వకపోగా జరిమానా తగిలిస్తే?

నిద్రలో, కలలో, వెంటాడే ఈ భయాలు తనకు పట్టపగలే రావటంచూసి ఒక్కసారిగా కోటీశ్వర్రావు ఉలిక్కిపడ్డాడు. అంత దారుణం మామూలు మనుషుల కెందుకు జరుగుతుందీ? ఎన్ని లక్షలమంది ఉద్యోగాలు చెయ్యటంలేదూ? వాళ్ళకి జరగని దారుణం తనకెందుకు జరుగుతుందీ? తన మనస్సింత బలహీనమై పోయిందేం? తాను ఇంతకాలమూ చేసిన తాత్విక నైతిక చింతన కంతకీ ఫలితం ఇదా?

మొదటినెల జీతం వచ్చింది. కొంత దగ్గిర వుంచుకుని మిగతాది అప్పులో చెల్లువేస్తూ ఇంటికి పంపాడు. కాని జేబులో నెల ఖర్చుకుగాను ఉంచుకున్న కొత్త నోట్లు తన మనస్సును మాటిమాటికీ ఆకర్షిస్తున్నాయి. జేబులో చెయ్యి పెట్టినప్పుడల్లా అది చేతికి తగిలి వొళ్ళంతా గరిపొడుస్తున్నది. పక్కనున్న వాళ్ళు చెప్పే మాటలు వినిపించకుండా పోయి సంభాషణకిబ్బంది కలుగుతున్నది. ఇది నిజంగా అన్యాయం? తనకు కలగవలసిన అనుభవం కాదు. తనకి నిజంగా డబ్బుమీద మమకారం లేదు. ఇది క్రమేణా పోతుంది. తాగుడంటే అసహ్యపడే వాడు మట్టుకు తాగితే నిషా ఎక్కదా? ఇదీ అటువంటిదే! రెండుమూడు నెల్లు ఈ నోట్లమీద కలగవలసిన తృణీకారభావం దానంతట అదే కలుగుతుంది.

రెండుమూడు నెల్లు గడిచాయి. ఇంటిదగ్గిర బాకీ తీరిపోయింది. ఇకనుంచీ నెలకు పాతిక చొప్పున మిగుల్చుకో వచ్చును. దగ్గిరుంటే ఖర్చయిపోతుంది. మీనన్ లాగా బ్యాంకులో వేస్తే పడివుంటుంది. మీనన్‌కు తనకంటె తక్కువ జీతం. వాడు నెలకు నలభై కూడా బ్యాంకులో వేస్తాడు. వాడు ఉద్యోగం ప్రారంభించి ఏడాది అయిందో లేదో బ్యాంకులో మూడొందలున్నది.

కాని బ్యాంకి అనగానే పాస్‌బుక్కులు, సంతకాలూ అన్నీ ప్రతిబంధకాలే! ఏమయినా డబ్బుదగ్గిర ఉంచుకోవటం తద్దినం. రోజూ పెట్టె తెరిచినప్పుడల్లా కని పిస్తూ వుంటుంది.

మీనన్ వేసే బ్యాంకులోనే తనుకూడ మూడోనెలాఖర్న వచ్చిన జీతంలో నుంచి ఒక పాతిక వేద్దామనిపించింది. ఏమీ కష్టంలేదు. మీనన్ అయితే అరవై వేసును. ఎందుకు వృథాగా డబ్బు తగలెయ్యటం? తను ఎంత దరిద్రం అనుభ వించలేదు? తిండీ, బట్టా, గది అద్దే, ట్రాముచార్జీలూ తప్పిస్తే మిగతాదంతా వృథాయేగద?

నాలుగోరోజున పాస్‌బుక్కు చేతికొచ్చింది. కొత్తబుక్కు, చక్కని అక్షరా లతో యాభై రూపాయలూ జమవేసింది. యాభై రూపాయలనోట్లను చూచినా కలం గని ఆనందం కలిగింది. ఒకదికి పదిసార్లు చూచుకోబుద్ధి అయింది. దానికింద డజను యాభైలు ఊహించుకో గలిగాడు, కోటీశ్వరావు. ఆరొందలు! ఒక్క సంవత్సరానికల్లా! వచ్చే సంవత్సరం ఈ పాటికి! కాని భయం పట్టుకుంది! ప్రతినెలా సాధ్యమవుతుందా? తనకు జబ్బుచేసి డాక్టరుకు నూరు పొయ్యవలసి వస్తుందేమో! ఆ జీతంకూడా రాదూ! ఒకవేళ తన చెల్లెలుగాని మరెవరన్నాగాని, "ఇబ్బందిలో వున్నాం పదిరూపాయలు పంపు." అంటారేమో?

తనభయాలు చూసి కోటీశ్వరావు ఆశ్చర్యపోయినాడు. తనకే తెగులు పుట్టింది? అందరికీ ఇటువంటి భయాలుంటాయా? ఆ సీతాపతి చిల్లిగవ్వమిగల్చ కుండా జీతమంతా నిశ్చింతగా ఖర్చు చేసేసికుంటాడే? అతన్ని చూసి తను అసహ్యపడలా? కాని తనకన్న వాడికే ఎక్కువ ధైర్యం ఉందే? తనకెందుకీ పిరికి తనం?

ఖర్చు అనుకున్నంత పొదుపుగా వెళ్ళటంలేదు. ఎవరో సినిమాకి పిలుస్తారు. కాఫీ హోటలుకు పిలుస్తారు. తన డబ్బుగూడా వాళ్ళే ఇచ్చేస్తారు. ఎంతకాలమని వాళ్ళ ఖర్చున తినటం? రెండుమూడుసార్లు తనే సినిమాలకు ఖర్చు చేశాడు. తనతో తిరిగేవాళ్ళని కాఫీ హోటల్లో మేపాడు. పదిరూపాయల అదనపు ఖర్చయింది. ఆ పదిరూపాయలూ బ్యాంకులో నుంచి తియ్యవలసొచ్చింది, తీశాడు. పాసు బుక్కులో వున్న 50 కాస్తా 40 అయింది. ఆ నలభై అంకె చూస్తున్నకొద్దీ ఏడుపొచ్చింది. ఆ అంకె అంత దుర్భరంగా వుంటుందని అతనదివరకెన్నడూ ఊహించనైనాలేదు.

పైగా అతనా పదిరూపాయలూ కాషియరు దగ్గిర్నుంచి పుచ్చుకుంటే సిగ్గే

సింది. తన పక్కవున్నవాళ్ళు రెండువందలూ, మూడువందలూ, పదిహేను వందలూ పుచ్చుకుంటున్నారు. పదిహేను పచ్చకాగితాలు నిర్లక్ష్యంగా పుచ్చుకొని వెళ్ళిపోతున్న పెద్దమనిషికేసి దీనంగా చూశాడు కోటీశ్వరరావు. తనకి డబ్బంటే ఏమిటో అసలు తెలుసునా? యాభైవెయ్యటమూ, ఏడుస్తూ పది మళ్ళీ తియ్యటమూ. ఇంతే తన జన్మ! ఒక పదివేలు బ్యాంకులో వేసే శక్తి తనకెప్పుడొస్తుంది? డబ్బు తుచ్ఛమయిందే అపుగాక! ఆ మాట అనుకోటానికక్కడా తనక ర్హతలేదే. వెధవ యాభై బ్యాంకులో వెయ్యటానికి తనకు పెట పెట లవుతున్నది గదా!

ఇంక ఏమైనాసరే, కోటీశ్వరరావు ప్రతి కానీ కూడా ఆదా చెయ్యాలనుకు న్నాడు. పిసినిగొట్టుతనం కాదుసుమా? లాభం అంతంటె కాదు! కాని దీని అంతే మిటో చూడాలి. చాలా డబ్బుంటేతప్ప తనకు నిజమైన నిర్లిప్తత నిజం అలవడదు. తన ఆఫీసులోనే అయిదువందలూ, నాలుగు వందలూ సంపాదించే వాళ్ళని చూసి ఓర్చలేనితనం కలిగింది కోటీశ్వరరావుకి. ఎందుకో? వాళ్ళు డబ్బుకు గడ్డితినే వాళ్ళల్లే కనిపించారు.

అనుకున్నంతా అయింది. అతను డబ్బుకూడబెట్టటం ప్రారంభించిన రెండో నెల్లోనే చెల్లెలు పదిరూపాయలు పంపమని రాసింది. కోటీశ్వరరావు మరో ఆలోచన లేకుండా పంపాడు. కాని తన చెల్లెలు డబ్బుకోసం తనకి రాయటం అన్యాయమని పించింది. ఆ చెల్లెలు పెళ్ళికి బోలెడంత ఖర్చయింది. తన బావమరిదికి ఉద్యోగం లేదు. అల్లాడుతున్నారు అది నిజమే. కాని అతను తన దారిద్ర్యాన్ని దీక్షతో సహించక తన చెల్లెలిద్వారా ఇట్లా రాయించటం పిరికిపని! పంపించటానికి తన కభ్యంతరమని కాదు! అతను కూడా తనలాగే ఏదో చూచుకోకూడదూ? పెళ్ళాం పిల్లలు కూడా కలవాడుకదా?

తను ఏమీ చూచుకోకుండా గడిపిన ఏళ్ళు కోటీశ్వరరావు కాక్షణాన జ్ఞాపకం రాలేదు.

రాను రాను కోటీశ్వరరావుకు పిరికితనం తగ్గిపోయింది. పాసుబుక్కులో పెరిగే సంఖ్య అతన్నిప్పుడు గల్లంతు చెయ్యటంలేదు. కాని అతని కిప్పుడు డబ్బు మీద నిర్లక్ష్యమూ పోయింది మరి.

"తప్పేముందీ? డబ్బుకన్న ప్రధానమయిందిలేదు. డబ్బు వెధవదేకావచ్చు గాక, ప్రపంచం మనని మన డబ్బును బట్టె లక్ష్యపెడుతుంది." అనుకున్నాడు కోటీశ్వరరావు.

అతనిప్పుడు ధారాళంగా రచనలు కూడా చేస్తున్నాడు. తృణమో పణమో ఇచ్చే పత్రికలకే పంపుతున్నాడు. రానురాను అతని పై సంపాదన పెరుగుతున్నది. ఏదైనా తర్జుమాలు చేయించుకునీ, ప్రత్యేక వ్యాసాలు రాయించుకునీ అతనికి డబ్బిస్తున్నారు. డబ్బు పుచ్చుకుని అతను ఒక నటుడిమీద ప్రశంసా వ్యాసం రాశాడు.

యుద్ధం వచ్చింది.[1] ఎవరో స్నేహితుడు తన్నొక వ్యాపారంలో చేరమన్నాడు. గత యుద్ధంలో లాగే వస్తువుల ధరలు పెరిగి బాగా లాభం వస్తుందన్నాడు. కోటీశ్వరరావు తాను పోగుచేసిన అయిదు వందలూ స్నేహితుడికిచ్చేశాడు. ఏవో వస్తువులు కొన్నారు. అమ్మారు. చాలా డబ్బొచ్చింది. వ్యాపారం సాగింది. కోటీశ్వరరావు భాగం పెరిగింది. ఒక సంవత్సరం కాలంలో అతను రెండువేలు లాభం పేశాడు. ముఖ్యంగా మందులమీద చాలా లాభం వచ్చింది.

గుడ్డల వ్యాపారం చేతామన్నాడు స్నేహితుడు. సరేనన్నాడు కోటీశ్వరరావు. స్నేహితుడు బొంబాయివెళ్ళి మల్లులూ, పాప్లినులూ, వాయిల్లూ పట్టుకొచ్చాడు. రహస్యంగా అమ్మారు. చాలా లాభం వచ్చింది.

మరో సంవత్సరం జరిగింది. కోటీశ్వరరావు అయిదు వేలు చేసుకున్నాడు. వ్యాపారం రకరకాలుగా సాగుతున్నది. ఇప్పుడంతా దొంగ వ్యాపారమే. స్నేహితు డెక్కడెక్కడినుంచో సరుకులు తెప్పించి రెండింతలకి మూడింతలకి అమ్ము తున్నాడు.

ఉన్నట్టుండి దొంగ వ్యాపారం బయటపడింది. కోటీశ్వరరావు ఏమాత్రమూ భయపడలేదు. తనకేమీ తెలియదనీ, వ్యాపారమంతా తన స్నేహితుడే చేస్తున్నాడనీ కోర్టులో చెప్పుకున్నాడు. కోటీశ్వరరావుకి వ్యాపారం సంగతి పూర్తిగా తెలుసు నని అతని స్నేహితుడు ఋజువు చేశాడు. స్నేహితుడికి ఎక్కువగా శిక్ష పడింది. కోటీశ్వరరావు తేలికతో పోయినాడు. రెండు వేల జరిమానా ఆరు నెలల శిక్ష పడింది.

ధైర్యంగా కోటీశ్వరరావు జరిమానాకట్టి జైలుకు వెళ్ళాడు. అతనిపేర బ్యాంకులో ఇంకా మూడు వేలుంది. ఆర్నెల్లలో యుద్ధం అయిపోయింది.[2] దొంగ మార్కెట్టు అంతకన్నా అయిపోదు. భయపడటాని కిందులో ఏముంది?

—ముద్రణ ఆంధ్రజ్యోతి (మాసపత్రిక), జూన్ 1946.

---

1. రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945)
2. 1945.

# ఓడలు-బళ్ళూ

పదిన్నరకు కాప్టన్ జాన్సన్‌తో అప్పాయింటుమెంటు ఉండటంవల్ల రంగారావు చాలా పెందలాడే ఆడావిడిగా ఆఫీసులోకి అడుగుపెట్టాడు. ఆఫీసులో గుమాస్తాలంతా కేకులుతింటూ, టీలు తాగుతూ, నానా అల్లరి చేస్తున్నారు. రంగారావును చూడగానే ఆఫీసంతా సద్దుమణిగింది. యుద్ధం కోసం[1] ఏర్పరచిన ఈ అభాగ్యపు డిపార్టుమెంటుల్లో చదువు సంధ్యల్లో మునిగి ఉండవలసిన కుర్రకారంతా చేరడంవలన పై ఉద్యోగి మీద గౌరవం ఉండటమనేది చాలా అరుదుగా ఉంటుంది. కాని రంగారావెట్లాగో తన కింద పనిచేసేవాళ్ళ గౌరవానికి పాత్రుడు కాగలిగాడు. వాళ్ళకెంతో స్వేచ్ఛ ఇచ్చి కూడా వాళ్ల భయభక్తులు సంపాదించుకున్నాడు. అతని అలవాట్లన్నీ గుమాస్తాలందరికీ తెలుసు. అతను పెందలాడే వచ్చాడంటే త్వరలోనే మళ్ళీ బయటికి వెళ్ళుతాడన్నమాట.

అతను సీటులో కూచుంటుండగానే ఒక గుమాస్తా కాగితాలన్నీ తెచ్చి ముందు పెట్టాడు.

"నాకు టైము లేదు. ముఖ్యమైన కాగితాలుంటే విడిగా తీసి పట్టుకురా," అన్నాడు రంగారావు, డయిరీ తిరిగేసి యెంగేజిమెంటులు చూస్తూ.

"ఇంకో ఫైలింగు క్లర్కు కావాలనుకున్నాం. వచ్చి కనిపెట్టుకున్నాడు. చూస్తారా?" అన్నాడు గుమాస్తా.

"తరవాత, తరవాత," అన్నాడు రంగారావు పరధ్యానంగా. కాని గుమాస్తా కదలక పోవటం చూసి అది ముఖ్యమై ఉండాలని గ్రహించి "ఏడి? లోపలికి పంపు అప్లికేషను తెచ్చాడా?" అన్నాడు.

మరో క్షణంలో ఒక తెలుగు మనిషి - వాలకం చూస్తేనే స్పష్టంగా తెలుస్తున్నది- రంగారావు యీడువాడే లోపలికొచ్చాడు.

రంగారావు అతని మొహంకేసి చూడకుండానే, "ఏదీ అప్లికేషన్" అన్నాడు ఇంగ్లీషులో.

వచ్చినతను అప్లికేషనిస్తూ తెలుగులో, "మీరు మా ప్రాంతంవారే అని విన్నాను" అన్నాడు.

రంగారావును చెంపమీద కొట్టినట్టయి తల ఎత్తి చూశాడు. తెలుగువాడనే మిష మీదో, తన ప్రాంతం నుంచి వచ్చిన వాడనే మిషమీదో ఉద్యోగం సంపా

---

1. రెండవ ప్రపంచ యుద్ధ ప్రస్తావన (1939-1945)

దించాలని అతని ఉద్దేశమేమో అనే అనుమానం రంగారావు మనస్సులో ఒక్కసారి మెరిసి అతనికి కోపం తెప్పించింది.

"మీదే ఊరు?" అన్నాడు రంగారావు. అంతు చిక్కని కంఠస్వరంతో అతను చెప్పాడు.

రంగారావు మొహాన ఎటువంటి మార్పులేదు. "మీ పేరు?" అంటూనే అప్లికేషను కేసి చూసి, "మీ పూర్తి యింటిపేరు?" అని ప్రశ్న మార్చాడు.

కొత్త మనిషి అది కూడా చెప్పాడు.

"మీ తండ్రిగారి పేరు?"

దానికీ వచ్చిన మనిషి సమాధానం చెప్పాడు.

రంగారావు తలవంచుకొని అప్లికేషను కేసి చూడసాగాడు.

"మీదేవూరో అడగొచ్చునా?" అన్నాడు ఉద్యోగం కోసం వచ్చినతను చాలా తియ్యగా.

రంగారావు సమాధానం చెప్పలేదు, కాని అప్లికేషను మీద ఒకచోట పెన్సులుతో గుర్తుపెట్టి, "బియ్యే పరీక్షక్కూడా కూర్చొని యీ చిన్న ఉద్యోగం దేనికి? మాకు కావలసింది మామూలు ఫైలింగు క్లర్కు. ఏ స్కూలు ఫైనల్ తప్పినవాడయినా చాలు. జీతంకూడా చాలా తక్కువ," అన్నాడు.

"చాలా చిక్కుల్లో వున్నాను. కుటుంబం కలవాణ్ణి. ఏ కాస్త దొరికినా చాలు. తరవాత మీ అనుగ్రహం వుంటే కాస్త పెద్ద ఉద్యోగం సంపాదించగలనేమో!" అన్నాడు కొత్త మనిషి.

రంగారావు ఒక్క క్షణం ఆలోచించి "అప్లికేషను మీద ఫైలింగు క్లర్కుగా వేసుకోవటమయింది," అని రాసి సంతకం చేసి యీ లోపుగా తన గుమాస్తా తెచ్చిపెట్టిన అర్జంటు కాగితాల మీద సంతకాలు చేసి, జవాబురాసి, టోపీ పట్టుకొని గడియారం చూసుకుంటూ గబగబా వెళ్ళిపోయినాడు.

తన సంగతేమయిందీ తెలియక ఆదుర్దా పడే తెలుగాయన చల్లగా గుమాస్తా దగ్గిరకి వెళ్ళి, "నా అప్లికేషనేమయింది?" అని అడిగాడు. ఆ గుమాస్తా చెయ్యి చాస్తూ, "నీకు ఉద్యోగం యిప్పించేశాను. నాకేమిస్తావు?" అని దక్షిణదేశపు ఇంగ్లీషులో అడిగాడు.

"నిజంగానా?" అన్నాడు తెలుగాయన.

"ఇదుగో ఆఫీసార్డరు టైపు చెయ్యబోతున్నాను. కనీసం అందరికీ టీ ఇప్పించాలి!"

గుమాస్తాలంతా పెద్ద గుమాస్తాను బలపరిచారు. అందరికీ టీలు ఆర్డరు చేయబడినై.

కొత్త గుమాస్తా పేరు కె. వి. ఎస్. డి. పి. రావు అనేది ఆఫీసులో తెలిసింది.

జ్ఞాపకం పెట్టుకునేటందుకు వీలుగా ఎ బీ సీ డీ ఎఫ్. రావని కొందరు నామకరణం చేశారు. మన పాలిటికి అతని పేరు ప్రకాశరావు.

ప్రకాశరావు కొక కుర్చీ చూపించి ఫైల్సూ అవీ పరిచయం చేశాడు. కాని అతనికిప్పుడే పనిలో మునిగిపోవాలని లేదు.

"ఈ రంగారావుడి సూదీ ఒక వూరే!" అన్నాడు ప్రకాశరావు. అందర్నీ ఆశ్చర్య నిమగ్నుల్ని చెయ్యాలని అతని ఆశ. ఆ సంగతి గ్రహించి ఒకరిద్దరు, "ఓ, రియల్లీ" అన్నారు.

"అట్లాచెప్పు! అందుకనే అంత సులభంగా నీ కార్డరు పడింది!" అన్నాడు మీనన్.

"ఈ రంగారావు బ్రాహ్మడు కాడు!" అన్నాడు ప్రకాశరావు మరో బాంబు వేస్తున్నవాడల్లే.

"నువ్వో?" అన్నాడు మీనన్.

"నేనా? హఁ! నేను బ్రాహ్మణ్ణే!" అన్నాడు ప్రకాశరావు. ఆ సంగతి వాళ్ళకి సందేహం కలగటమే అతని కాశ్చర్యంగా వున్నట్టు కనపడ్డది.

"మనం బ్రాహ్మలమంతాచేరి ఒక అబ్రాహ్మడి కింద పని చెయ్యాలి సొచ్చిందే! ఎంత అన్యాయం!" అన్నాడు నాయరు.

మీనన్ నాయరుతో ఏకీభవించాడు.

ప్రకాశరావు విజయోత్సాహం పట్ట లేకుండా, "ఇదేం విన్నారు? ఇంకా వినండి!" అన్నాడు.

"చెప్పు చెప్పు!" అన్నా రందరూ.

"ఈ రంగారావు తండ్రి రైతు ...మాపొలం చేసేవాడు!"

ప్రకాశరావు అందరి మొహాల కేసి ఆత్రంగా చూశాడు. ఆ మొహాల్లో అతనికి కావలసిన ఆశ్చర్యం కనిపించలేదు. ఆ మాటే మళ్ళీ చెప్పాడు.

మీనన్ అకస్మాత్తుగా, "రంగారావు గారి తండ్రి పేరేమిటి?" అన్నాడు.

ప్రకాశరావు "నాగభూషణం," అని తడువుకోకుండా చెప్పాడు.

మీనన్ గబగబా రంగారావు గదిలోకి పరిగెత్తి మరో రెండు నిమిషాల్లో బయటి కొచ్చి "నిజమే," అన్నాడు.

"నీ కెట్లా తెలుసు?" అన్నాడు నాయరు.

"రంగారావు కొత్తగా కట్టిన పాలసీ ఆయన బల్లమీదే వుంది," అన్నాడు మీనన్.

"నే నబద్ధం చెప్పటం లేదు!" అన్నాడు ప్రకాశరావు గుమాస్తాల్లో కలిగిన మార్పుకు ఏమాత్రమో కంగారవుతూ.

"పాపం నీ ప్రారబ్ధం! మీ పొలం చేసిన వాడి కొడుకుకింద ఉద్యోగం చెయ్యాలి సొచ్చింది!"

"మాలో ఓ సామెత వుంది. ఓడలు బళ్ళవుతై, బళ్ళు ఓడలవుతై," అని ప్రకాశరావు ఇంగ్లీషులో అన్నాడు.

"ఆ సామెత కర్థం వున్నట్టే కనపడదేం?" అన్నాడు మరో గుమాస్తా.

"అర్ధం యేమిట్లే! యుద్ధం ధర్మమా అంటూ అడ్డమైన వాళ్ళకీ పెద్ద పెద్ద ఉద్యోగాలయినై," అన్నాడు ప్రకాశరావు ఏవగింపుగా.

"అవును మరి మనవంటి చవటల క్కూడా గుమాస్తాగిరీ దొరికింది!" అన్నాడు మీనన్.

తనను చూసి మిగిలిన గుమాస్తాలంతా ఎక్కిరిస్తున్నారేమో అనే సందేహం ప్రకాశరావుకు పొడమ సాగింది.

"పెద్ద ఉద్యోగాలు కావాలంటే శూద్రుడై పుట్టాలి. అందుకనే మీకు నాకూ ఈగతి!" అన్నాడు ప్రకాశరావు అక్కసుతో.

ఆ గుమాస్తాలూ ఒక్కసారిగా నవ్వారు. ప్రకాశరావు మరింత కంగారు పడ్డాడు. వాళ్ళ వూళ్ళో యీ విధంగా మాట్లాడితే యెంతో తెలివి గలవాడను కుంటారు. ఈ పట్టణానికేం తెగులొచ్చినట్టు?

ప్రకాశరావుకు మరో సందేహంకూడా కలగసాగింది. వీళ్ళంతా యీ రంగారావేదో గొప్ప వాడనుకుంటున్నారు. ఇతని పుట్టుపూర్వోత్తరాలు వాళ్ళకేం తెలుసూ? గుమాస్తాలంతా యెగతాళి చేసినా సరే రంగారావును గురించి నిజం చెప్పేయాలను కున్నాడు.

"మా పొలం చెయ్యటానికొచ్చినప్పుడు రంగారావు తండ్రికి సెంటు పొలం లేదు. పాతికేళ్ళు మా పొలం మీద తెగబడిరాడు. రెండెకరాలు సొంతాన కొనుక్కున్నాడు. ఈ రంగారావుకు విద్యేదారా చదువు చెప్పించాడు. ఇవాళ ఈ రంగారావెంత గొప్పవాడయినాడంటే మా చలవే!" అన్నాడు ప్రకాశరావు ఉద్రేకంతో.

కొంచెం సేపెవరూ మాట్లాడలేదు.

"మరి నీకిదేం ఖర్మం? — ఈ గుమాస్తాగిరి'' అన్నాడు నాయరు.

"చెపితినిగా? ప్రారబ్దం! ఓడలూ బళ్ళూ!"

"చాలా ఫైలింగు చెయ్యవలసి ఉంది. కాసె మరి," అన్నాడు మీనన్...

రంగారావు మధ్యాన్నం దాటిన తరవాతగాని ఆఫీసుకు రాలేదు. అతను ఆఫీసుకొచ్చిన అరగంటకల్లా ప్రకాశరావుకు కబురు వెళ్ళింది.

"కూర్చోండి, ప్రకాశరావుగారూ!" అన్నాడు రంగారావు.

ప్రకాశరావు కెందుకో కూర్చోవటానికి భయం వేసింది.

"యుద్ధం ధర్మమా అని నాకీ ఉద్యోగం దొరికింది. ఇంతకు పూర్వం నేను చిప్పచేత పట్టుకొని తిరిగినవాణ్ణి. మేం చాలా పేదవాళ్ళం. మా నాన్న చిన్నతనంలో చాలా స్థితిమంతుడు. ఒళ్ళు కానక అంతా తగలేసుకున్నాడు. మేమంతా పుటుకొచ్చే టప్పటికి అంతా కరా రావుడయి పోయింది. తరవాత మా నాన్న మీ పొలం మక్తాకు

తీసుకున్నాడు. మీ నాన్నగారా పొలంకేసి చూచిన పాపాన పోలేదు. ఊళ్ళో చైతు వొత్తిడి జాస్తిగా ఉండడం మూలాన మా నాన్న చెవులుపిండి మీ నాన్నగారు గడ్డి కూడా పూర్తిగా చక్కనీకుండా మక్తా దిగించాడు. మా నాన్నగారు కారం మెతు కులు తిని, మా కడుపులుమాడ్చి యిరవైయేళ్ళలోగా రెండెకరాలు కొనుక్కోగలి గాడు. కాని ఆయన తిండికి మాడుతూ అనేక రోగాలు తెచ్చుకుంటూ పసరు వైద్యాలు చేసుకుంటూ గాలికి పెరిగాడు. నా చదువంతా కులాభిమానుల చందాలతో సాగింది. నా తమ్ము డిప్పటికీ ఎందునా కాకుండా తిరుగుతున్నాడు. ఒకరిద్దరు పొలాలు చేసు కుంటున్నారు. ఈ ఉద్యోగం దొరికినంత మాత్రాన నేను గొప్ప వాణ్ణయి పోలేదు. మీరంటే పెద్ద కుటుంబంవారు. ఇవాళ చితికిపోయినా మీ గొప్పతనం తగ్గదు. మీరు నాకింద పనిచెయ్యటం నాకేమీ మనస్కరించదు. దాన్ని గురించే పొద్దుటి నుంచీ విచారిస్తున్నాను....ఏదైనా మీకు తగిన ఉద్యోగం వెతుక్కోండి. నా చాతయిన శిఫార్సు చేస్తాను. మరోడిచేత అవసరమైతే చేయిస్తాను. ఇది మరీ తక్కువ ఉద్యోగం—మీనన్, రావుగారి నౌకరి తాలూకు ఆపీ సార్డరు పట్టుకురా, కాన్సిల్ చేసేస్తాను!" అన్నాడు రంగారావు.

—నవోదయ, జనవరి 20, 1946 సం. 1, 1.

# టాకీ తీసిచూడండి!

ఇక ఈ దిక్కుమాలిన టాకీ లైనులోకి ఎన్నటికీ అడుగుపెట్టను. వాళ్ళ "ప్రభావతీ ప్రద్యుమ్నం" నామూలంగా చెడిపోయిందని వాళ్ళ దేశమంతా చాటుతున్నారు. వాళ్ళు చాటకపోయినా అటువంటి టాకీలో వేలుపెట్టిన తరవాత నన్నెవరు చేరనిస్తారు మళ్ళీ?

కాని ఆ దిక్కుమాలిన టాకీ అట్లా కావటానికి నేనే కారణమంటే మాత్రం నేను సహించలేను. నా తెలివితేటలలో విశ్వాసం ఉన్నవాళ్ళు నా స్నేహితులూ నన్ను చూడగానే పెట్టే మొహాలు చూస్తే నాకు ఆత్మహత్య చేసుకో బుద్ధి పుడుతున్నది. నేను జరిగిందంతా చెప్పేస్తాను. నాకు శక్తిలేదుకాని నేను పనిచేసిన కంపెనీ డైరెక్టర్ల నందరినీ "పిచ్చి బొమ్మలల్లే వేళ్ళాడగట్టి" "తలా తోకా తెలియకుండా టాకీలు తీసామని ఒప్పులుదేరిన వారందరికీ ఈగతే పడుతుంది" అని చాటింతామని

మా కంపెనీలో భాగస్తులలో ఒక్కణ్ణి కూడా నేను స్వయంగా ఎరగను. అందులో ఇద్దరు కంపెనీ తరపున బాడుగకు తీసుకున్న మోటారుకారులో మా ఇంటికి వచ్చారు. వాళ్ళ వెంట మా సూర్యనారాయణకూడా ఉన్నాడు. వాడి కా కంపెనీతో ఏమిసంబంధమో, వాడి సలహా కంపెనీవారు ఎట్లా ఆమోదించారో, ఆఖరుకు వారికీ వాడికీ ఎట్లా తెగిపోయిందో—ఇవేవీ నాకీనాటికీ తెలియవు. ఆ కంపెనీవారు నన్ను ప్రొడక్షను మేనేజరుగా బుక్కు చెయ్యటానికి నిమిత్తమాత్రుడుగా వాడు రంగం మీదికి వచ్చి ఆపని కాగానే బయటికి వెళ్ళి తన ప్లీడరు గుమస్తాగిరీలో నిమగ్నుడైపోయినాడు.

నా దగ్గరికి వచ్చిన పెద్ద లిద్దరూ నా దరిద్రస్థితి చూచారు. నేను చవుకగా వస్తానని తెలుసుకున్నారు. వారికి నేనేంచేస్తానో, చెయ్యగలనో, చెయ్యాలో తెలియదు. నన్ను ప్రొడక్షను మేనేజరుగా పెట్టుకోండని నేనే చెప్పాను. వారు నా అనుభవం అడిగారు; నాకు తెలియవలసిన అవసరంలేని విషయాలను గురించికూడా ప్రశ్నించారు. ప్రతివిషయాన్ని గురించీ కొంత కొంత మాట్లాడగలశక్తి భగవంతు డిచ్చి ఉండటం వల్ల వాళ్ళకేవేవో సమాధానాలు చెప్పాను. వాళ్ళు నన్ను అనేక విషయాలను గురించి సలహాలు కూడా అడిగారు; అవికూడా ఇచ్చాను. వాళ్ళు నా మాటలు సంపూర్ణంగా అర్థంచేసుకుని వాటితో తృప్తిపడ్డట్టు కనిపించారు. ఒక్క డబ్బు ఖర్చుపెట్టటం విషయంలోనే నేను ఆ ఇద్దరిలోనూ ఒకరికి కోపం తెప్పించాను.

నేను మరేమీ అనలేదు; "ఈ లైనులో అనుభవం లేనివారు సామాన్యంగా దుర్వ్యయం చేస్తారు. ఒక్కొక్కరకం ఖర్చు అవసరమైనదల్లే కనిపించినా గిట్టదు; ఒకొక్కదానికి ఎంత ఖర్చుచేస్తే అంతకు పదింతలు ప్రతిఫలం ఉంటుంది. అది తెలుసుకుని ఖర్చుచేస్తే వృథావ్యయం చాలా తగ్గించుకోవచ్చు" అన్నాను. ఆమాట మీద ఒకాయన కొంచెం అతిశయంగా, "మనం అటువంటి కక్కుర్తిపడ నవసరం లేదు లెండి? లక్ష రూపాయలు అవుతవనే అంచనా వేశాం!" అన్నాడు.

ఈ విషయంలోనే కాదు, నేను మాట్లాడినదానికంతా వారు ఆమోదం కనబరచినప్పుడల్లా నేనన్నది వారి తలకు ఏమాత్రమూ ఎక్కలేదని క్రమంగా తెలుసుకున్నాను.

చక్కని సాంఘిక సమస్య తీసుకుని కథ రాయించమన్నాను. కథాగ్రా తయారు చేసుకుని నటులను బుక్కు చెయ్యమన్నాను. లేకపోతే చాలా ఇబ్బంది పడి పోమా అన్నారు!

ఆఖరుకు "ప్రభావతీ ప్రద్యుమ్నం" నిశ్చయం చేశారు. నిశ్చయం చెయ్యడమేమిటి? నటులను బుక్కు చెయ్యట మేమిటి? ప్రభావతి వేషానికి ఆరుగురు ఆడ వాళ్ళను బుక్కుచేశారు. ఆరుగురికీ అడ్వాన్సులిచ్చి పిలిపించి రిహార్సల్సు ప్రారంభించారు. రిహార్సల్సంటే మరేమీ లేదు, హార్మోనిస్టును కుదిర్చి సంగీతం అభ్యాసం చెయ్యటం. ఆ హార్మోనిస్టుకు బాపట్ల లక్ష్మీకాంతయ్య[1]గారి కీర్తనలన్నీ వచ్చును. ఇంతమంది ప్రభావతులూ ఆ ఒక్క ప్రద్యుమ్నుడిమీద పడ్డారు. అందుకని అతన్ని వెళ్ళగొట్టి మరొక హార్మోనిస్టును పిలిచారు. బుక్కయిన ఆడవాళ్ళకు ఏ హార్మోనిస్టయినా ఒకటేనని నేను కంపెనీవారికి చెప్పాను. కాని నా మాట ఎవరికీ అర్థం కాలేదు. కవిని తెచ్చి కథ రాయించేలోపల ముగ్గురు హార్మోనిస్టులయినారు.

ఆ కవి నేను పుట్టక పూర్వం ప్రసిద్ధుడైన నాటకకర్త అని చెప్పారు. ఆయన దగ్గర అచ్చుపడని ప్రభావతీ ప్రద్యుమ్న నాటకం ఉందిట. దాని సమస్త హక్కులూ మా కంపెనీవారు నిపుణతతో బేరమాడి ఎనిమిదివందల రూపాయలకు కారుచౌకగా పుచ్చేసుకున్నారు. వేరే డబ్బు పుచ్చుకోకుండా ఆకవే ఆ నాటకానికి "అనుబంధాలు" రాయటానికి ఒప్పుకోవటంవల్ల కంపెనీకి మరింత కలిసివచ్చింది!

ఆ నాటకంలో పద్యాలూ అనుబంధాలూ కలిసి నూటఇరవై రెండయినై. అందులో పది అంకాలు; ఇరవైమూడు రంగాలు.

ఈ టాకీలో పాల్గొనటానికి బుక్కయిన నటీనట సముదాయం మొత్తం నలభై ఇద్దరు. ఇదికాక వంటవాళ్ళూ, పనివాళ్ళూ ఇంకోపదిమంది. ఈ బాపతులో వచ్చిన ఒక వ్యక్తిని గురించి ఒక్కముక్క చెబుతాను. అతనెవరో ఎవరికీ తెలియదు.

1. బాపట్ల లక్ష్మీకాంతయ్యగారి కీర్తనలు.

అరను మా లాడ్జికి (తాత్కాలికంగా కంపెనీవారు ఉన్న ఊళ్ళో ఏర్పరచుకున్న శిబిరాకు) రావటం నేనెరుగుదును. ఎవరు కావాలని అడిగితే "గోపాలస్వామితో కొంచెం మాట్లాడాలి పిలుస్తారా?" అన్నాడు.

గోపాలస్వామి ఎవరో ఎవరికీ తెలియదు. "నువ్వే పిలుచుకో!" అని వాడికి సమాధానం చెప్పారు. ఆ తరవాత వాడు నలుగురిలో పాటు లాడ్జిలో అటూ ఇటూ అర్జంటుపని ఉన్నట్టు తిరగసాగాడు. వాడు లాడ్జిలో అడుగుపెట్టిన అరగంటలో ఆడవాళ్ళంతా తలా ఒక పని వాడి కంటగట్టారు. ఆ తరవాత వాడి కందరూ పని చెప్పారు. వాడు పని తలాయించటం ప్రారంభించేటప్పటికి పదిరోజులు గడిచింది. వాణ్ణి నిలదీసి "నువ్వెవరు? నిన్నెవరిక్కడ పనిచేయమన్నారు?" అని అడిగేటప్పటికి వాడికి కంపెనీవారు నెలజీతం బాకీ ఉన్నారు. ఆ జీతం ఇంత అనిమాత్రం వాడికే తెలియదు.

అయిందేదో అయిపోయింది, ఉన్నవాణ్ణి ఉండనిమ్మన్నారు కంపెనీవారు. ఇంత డబ్బు ఖర్చుపెట్టి చిత్రం తీస్తూ నెలకు పదిహేను రూపాయల దగ్గిర వెనకాడటం నామర్దాగా తోచింది వారికి. నాచెవిలో రహస్యంగా ఒక భాగస్థుడు చాలా దూరాలోచన చేసి అన్నాడు, "ఇప్పుడు మనం వీణ్ణి వెళ్ళగొడితే వాడు మనం తీసే టాకీని గురించి ఏకేస్తాడు" అని.

స్టూడియో మాట్లాడటానికి అయిదుగురు భాగస్థులు వెళ్ళారు బొంబాయికి. అక్కడ ఒకడి సహాయం తీసుకున్నారు. వాడు స్టూడియోవారి దగ్గిరనించి ఖచ్చితంగా వెయ్యి రూపాయల కమిషను మా వాళ్ళకళ్ళ ఎదటే కొట్టేసి మేం తియ్యబోయ్యే చిత్రాన్ని పుత్ర పౌత్రాభివృద్ధిగా దీవించి తనదారిన తాను చక్కావెళ్ళాడు. అనుకున్న స్టూడియో అద్దెలో సగం అడ్వాన్సు పారేసి, టెక్నీషియనుల చేతుల్లో, ఎందుకైనా మంచిదని తలా ఒక నూరురూపాయల పచ్చకాగితమూ పెట్టి దిగ్విజయం చేసిన మొహాలతో ఇంటికి తిరిగి వచ్చారు మావాళ్ళు.

మేము బొంబాయి ప్రయాణమయ్యే వరకు నాకయినఖర్చు ఇరవై ఐదువేలు కూడా లేదు!

నేను ప్రొడక్షను మేనేజరు కావటంవల్ల భోజనాది సౌకర్యాలన్నీ చూడటం పనిమీద నేనుండిపోయినాను.

మా డైరెక్టరును మేం బొంబాయిలోనే బుక్కుచేసుకున్నాం. అతను తెలుగువాడే. బి. ఏ. తప్పి తండ్రి చావగొడతాడనే భయంతో తల్లి నగలు కొన్ని చేతపట్టుకుని బొంబాయి పారిపోయివచ్చాడుట. బొంబాయిలో అయిదారునెలలు జలసాగా గడిపాడు. హోటలుకు నెలాపదిహేను రోజులకు బాకీ పడితే, వాళ్ళు అతని బట్టల పెట్టె తొక్కిపెట్టి డబ్బుతీసుకువచ్చి పెట్టె పట్టుకుపొమ్మన్నారు. ఆ స్థితిలో మాముతా వచ్చి దిగినట్టు తెలిసింది అతనికి; నేరుగా వచ్చేసి మా లాడ్జిలో ఒక పూట మకాంపెట్టి ముందు కవిగారితో స్నేహం చేశాడు. కవిగారు, దొరికాడే

చాలునని, తాను రాసిన పద్యాలన్నీ అతనికి వినిపించాడు. మా అతిథి ఆ పద్యా లకు అట్టే పరవశుడైపోయినాడు. ఆ పారవశ్యానికి కవిగారు పరవశుడైపోయి మన కింతకంటె మంచి డైరెక్టరు దొరకడని ఖచ్చితంగా చెప్పాడు. డైరెక్టరన్న ప్రాణికి మూడువేలకు తక్కువ ఎట్లా ఇస్తారు కనకా? పైగా అతనికి బొంబాయిలో ఉన్న స్టూడియోలపేర్లూ, వాటిని పరిపాలిస్తున్నవారి పేర్లూ, నటులపేర్లూ, వారి జీతాలూ సమస్తమూ తెలుసును! ఇంకో డైరెక్టరుకు మాత్రం ఆ విషయాలను గురించి అంత కంటె ఏం తెలుస్తుంది?

మా డైరెక్టర్‌గారు అడ్వాన్సు తీసుకొని పనిలో ప్రవేశిస్తూనే తనకు మరొక ప్రభావతి కావాలన్నారు. ఆయన వెంట నన్ను తోడిచ్చి ఆంధ్రదేశం పంపారు ప్రభావతిని మళ్ళా బుక్కుచెయ్యటానికి. దిగిన గడప ఎక్కకుండా మేమిద్దరమూ అయిదువందల ఇళ్ళయినా తిరిగాం. ఆఖరుకు చూపులకు బాగా ఉండే పిల్లను చూసి మా డైరెక్టరు బుక్కుచేశాడు. ఆ పిల్లపేరు మాణిక్యం. దానికి 'పూర్వానుభవం' లేదు. ఫరవాలేదన్నాడు డైరెక్టరు. అది కంట్రాక్టు కాగితంమీద 'మణికంరాలు' అని రాసింది. మా డైరెక్టరుగారు 'మా'కు దీర్ఘమూ, 'కా'కు క్యావడీ స్వయంగా తగిలించి 'రాలు' అనే పదం వాడుకభాషే ననే నెపంమీద అల్లాగే ఉండనిచ్చాడు.

కుమారి మాణిక్యాదేవినీ దాని తల్లినీ వెంట బెట్టుకుని బొంబాయి వచ్చాం. దారిలో మా డైరెక్టరుగారు నాతో లోపాయకారిగా అన్నాడు.

"డైరెక్టర్లు హీరోయిన్ భుజాలమీద చెయ్యి వెయ్యటమూ, పక్కన కూర్చో బెట్టుకోవటమూ ధర్మం—విధి— ఆచారం. అదిచూసి తెలియనివాళ్లు ఏడుస్తారు!" అని.

నేనెట్లా ఏడిచేవాణ్ణి కానని చెప్పాను. అధర్మంగానే ఆడవాళ్ళమీద చెయ్యి వేసే జబ్బు నాకు చాలాకాలమై ఉందని కూడా చెప్పాను.

డైరెక్టరుగారు నావంక పెద్దకళ్ళు చేసి చూసి, "కొంపతీసి మనలాడ్జిలో అటు వంటి వేవీ చెయ్యకండి! చాలా లొల్లి అయిపోతుంది" అన్నారు. ఆ తరవాత అసందర్భంగా, "మణి మాత్రం, భోగందయినప్పటికీ అందరినీ మీద చెయ్యివెయ్యనివ్వదు!" అని కూడా అన్నారు.

"కంపెనీ డైరెక్టర్లు తప్పరేమో?" అన్నాను. డైరెకరు గుండెలో పిడుగు పడింది.

మణికీ తల్లికీ వేరే లాడ్జి ఏర్పాటు చేయించాడు డైరెక్టరు. మేము బొంబాయి చేరే లోపల అక్షాజు చేర్చబడ్డది మాణిక్యాలదేవి కంట్రాక్టులో!

ఈ మేళం నాకు కొంత తెలుసునని తెలిసి మా డైరెక్టరుగారు నన్ను తనకు అసిస్టెంటుగా వేసుకున్నారు. ఆనాటినుంచీ నాసిగరెట్ల ఖర్చూ, సినిమాల ఖర్చూ ఆయనే పెట్టుకోసాగాడు.

మా డైరెక్టరుగారి కేమీ తెలియదని మా కంపెనీవారికి తెలియటానికి రెండు నెలలు పట్టింది. ఆ రెండు నెలల మింజామలే మేము షూట్‌చేసిన ఫిలిము నంబర్లతో సహా అయిదువేల అడుగులకు పైబడ్డది!

స్టూడియో యజమానే మామీద కనికరించి, "మీ డైరెక్టరు ఎందుకూ పనికి రాడు. మీ అసిస్టెంటు డైరెక్టరును అడ్డం పెట్టుకుని పనికానివ్వండి. మా టెక్నీషియనులు చాతనయిన సహాయం చేస్తారు! అవి చెప్పిన తరవాత మా కంపెనీవారికి కొంచెం నిద్రమత్తు వదిలింది.

నేను వెనకటి వందరూపాయల జీతంమీదనే డైరెక్టరు పదవి స్వీకరించాను. ఆనాటినించీ నేను పచ్చి వెలగకాయలాగా అందరి గొంతులకూ అడ్డుపడ్డాను; నా గొంతుక్కూ అడ్డుపడింది మణి.

నన్ను డైరెక్టరు చెయ్యటం నటుల కెవరికీ ఇష్టంలేదు. నేను నా ధర్మం నిర్వర్తించటం వారికి అవమానం చెయ్యటంలాగోచింది. నేను సెట్టింగుమీద డైరెక్షను ఇస్తుంటే ఒకానొకనటుడు చాలా ఎగతాళిగా "అయ్యా ఒక్కరోజులో మేము డైరెక్టరు కాలేకపోయినప్పటికీ మాకూ స్టేజిమీద పదిహేను సంవత్సరాల అనుభవం ఉందండీ!"అన్నాడు. కామెరామాన్ ముందుకువచ్చి నాతో, "ఆ జంతువు ఏమిటి లెక్చరిస్తాడు సరిగా నిలబడడేం?" అన్నాడు హిందీలో. ఆ జంతువు నాతో అన్నముక్క అతనికి తర్జుమాచేసి చెప్పాను. "వెధవను బూటు తీసుకుని బయటికి తగులు!" అన్నాడు కామెరామాన్. నాటి ఆంధ్రుణ్ణి పైవాడట్లా అంటుంటే నాకు కష్టమేవేసింది.

నామీద చాలా రిపోర్టులు వెళ్ళినై మా ప్రొప్రయిటర్లకి. వారు నన్ను పిలిచి, "అయ్యా మీకు నటులజోలి దేనికి? మీ డైరెక్షనేదో మీరు చూసుకోండి!" అని సవినయంగా చెప్పారు.

ఇక మణి విషయం, నేను డైరెక్టరుగా వ్యవహరించినంత కాలమూ నాస్వార్థం ఏమీ చూసుకోలేదనటానికి మణికంటె మంచి ఉదాహరణ ఇవ్వలేను.

మా టాకీలో నటించటానికి వచ్చిన మూకలోకల్లా మంచిదీ, నన్ను గురించి అసహ్యంగా మాట్లాడనిదీ అది ఒకతే. కాని అందరిలోకీ అసమర్థురాలుకూడా అదే— అది వేస్తున్న వేషాన్ని బట్టి చూస్తే నన్ను నానామాటలూ అన్నవారినీ, అవమానించినవారినీ, నన్ను పడగొట్టటానికి సర్వ కష్టాలూ పడ్డవాళ్ళనీ క్షమించాను- మణిని క్షమించలేదు. మణి మంచితనానికి ముప్పాతిక మూడు మీసాలు కారణం అది విడిగా, వేరే లాడ్జిలో ఉండటం కావచ్చు. కాని అది అందరూ ఉన్న లాడ్జిలోనే ఉండి, అందరితోపాటు నన్ను తూలనాడితే అందుకు నేను దానిమీద వేరే పగ సాధించి ఉండేవాణ్ణి కాను.

నేను మణితో మొదటినించీ చెబుతూనే వచ్చాను— "నువ్వు కథానాయి

కవు. ఈటాకీ పాడయినా బాగయినా నీమీదే ఉంది. ఈ స్థితిలో మిగిలిన అందరి కన్నా నువ్వెక్కువ శ్రమపడాలి" అని.

నిజానికి మణి శ్రమపడ్డది. కాని నాకు కావలిసిన ఫలితం మాత్రం కని పించలేదు. దానిచేత మాటలు సరిగా చెప్పించటానికి సరిగా సంగీతం పాడించ టానికి రోజుకు పదహారు గంటలు రిహార్సలు చేయించాను. దానికోసం షూటింగు ఆపించాను. ఆ రిహార్సలుకోసమని రాత్రీపగలూ అక్కడేపడివుండి, అక్కడే భోంచేసి, అక్కడే నిద్రపోయినాను. నా ప్రాణం ఎట్లా విసిగిపోయిందో, ఒక్కొక్క ముక్క దానిచేత చెప్పించ లేకపోతుంటే నానరాలు పెటపెటా ఎట్లా తెగిపోయి నయ్యో, ఓర్పు చచ్చి దానిమీద ఎట్లా ఎగిరిపడ్డానో, ఆఖరుకు నేనంటే దానికి ఎంత సింహస్వప్నమయిందో ఎవరు విచారించారూ?

"ఇంకేం షూటింగు ? మా డైరెక్టరు మణిని తగులుకున్నాడు!" అని ప్రారం భించారు మా నటీనటులు. ఇట్లా అంటున్నారని నాకు తెలుసును. కాని నేను లెక్క చెయ్యలేదు.

మణిని బాధపెట్టటంలో నిజానికి లర్థంలేదు. అది అన్యాయం. మొదటి నుంచీ ఆటాకీలో కలిగిన వంకరలన్నీ మణిచేత సరిచేయించటానికి ప్రయత్నం చేస్తున్నానని నాకు తెలుసు. టాకీమీద లాభంవస్తే నాకు దమ్మిడీ రాదు, కాని టాకీ బాగుపడాలనే యావ తప్ప నాకు మరొకటి లేదు. నన్నట్లా సృష్టించాడు దేవుడు.

కాని నా అంతరాత్మ నాకు చెబుతూనే ఉంది, కళ్ళాలు వదిలేసి' టాకీని దాని తోవన దాన్ని పోనిమ్మని. ఆ ప్రబోధం నాకు చాలింది కాదు. అంతకంటె మంచి ప్రబోధం నాకు మణే కలిగించింది.

ఒకనాడు పగలల్లా మణిచేత వెట్టిచాకిరీ చేయించాను. అక్కడే భోంచేసి రెండుగంటలు దానికి విశ్రాంతి ఇచ్చి మళ్ళీ రాత్రి తొమ్మిదింటినించీ రిహార్సలు ఎత్తుకున్నాను. అర్థరాత్రి పదకొండు గంటలయింది. మణి తల్లి మాతో విసిగి నిద్రకుపడ్డది. నాకు శరీరమంతా యంత్రంలో పెట్టి ఒత్తినట్టున్నది.

అకస్మాత్తుగా మణిచేతులో ఉన్న కాగితాలు పక్కనపెట్టి, రెండుచేతులూ ఎత్తిజోడించి,

"నన్నెందుకీ విధంగా చంపుతారు? నాకీపని చేతకాదు. నన్నింటికి పోని వ్వండి! నన్ను బుక్కు చెయ్యమని నేను మీవెంటపడలేదు. మీరే నన్ను వెతు క్కుంటావచ్చారు....

"నేను నిజంగా అంత మందమతిని కాను. మీరెదురుగా పులిమాదిరిగా కూర్చుంటే నేను బెదిరిపోతున్నాను. నేను ఒంటరిగా ఉన్నప్పుడు ఈ మాట లే ఇంతకంటె బాగా అనుకోగలను.

"మీరింత క్రూరంగా ఉంటారని నే నెరగను. ఈ డైరెక్టరుపని తీసుకునే వరకూ ఈ లాడ్జిలో మీరే మంచి వారనుకున్నాను; నా అదృష్టమో ఏమో, మీరు అందరినీ మించి పోయినారు!" అని బొటబొటా కన్నీరు కార్చి ఏడవసాగింది. నాకా క్షణంలో దాన్ని చూస్తే అపరిమితమైన జాలివేసింది. పాపం! అది ఎన్నడూ ఇటు వంటి శ్రమ ఎరుగదు. తల్లి ఎంత గారాబంగా పెంచిందో! దానికి అక్షరజ్ఞానంకూడా సరిగా లేదు.

నేను మృదువుగా, "నా ప్రాణంకూడా విసిగిపోయింది, మణీ! ఇక ఈటాకీ గొడవ ఎత్తను. ఇది ఇవాళ ఉంటుంది, రేపు పోతుంది. అంతకంటే శాశ్వతమయిన విషయం ఏమంటే నువ్వాడదానివీ, నేను మగవాణ్ణినీ. ఆ సంగతి ఈ పదిహేను రోజుల్లోనూ ఒక క్షణమైనా నాకు జ్ఞాపకం రాలేదు. ఆ బడితెలు నాకు ఆ సంగతి స్పష్టంగా అర్థమయ్యేటట్టు చెబుతూనే ఉన్నా, నా మట్టిబుర్ర కెక్కలేదు. ఇక ముందు ఆ మాట మరిచిపోను....ఆ దీపం ఆర్పేసి ఇట్లా వచ్చి కూర్చో! కబుర్లు చెప్పు!" అన్నాను.

* * *

మా ప్రొడ్యూసర్లు ఎంతసేపు నన్ను దెప్పినా నేను మాణిక్యాన్ని తగులుకు పోయినానని, అందువల్ల వాళ్ళకు కలిగినమేలు, నేను చేసిన ఏ మంచిపనివల్లా కలగలేదు. నన్ను చూస్తే భయంపోయి, నాదగ్గిర చనువు దొరికిన తరవాత మణి నాకు కావలసినట్టు నటించ గలిగింది. ప్రభావతీ ప్రద్యుమ్నం దిక్కూ దివాణమూ లేకుండా పోయిందంటే దానికి తగిన కారణాలు వేల సంఖ్యలో ఉన్నై. మాణిక్యం ఏమీ చెడలేదు. ఆ దరిద్రపు చిత్రంలో దాన్నిచూసి అది పనికివస్తుందని కనుక్కో గలిగిన పెద్దమనుష్యులు అప్పుడే దాన్ని మరొక టాకీలోకి బుక్కుచేశారు. రేపీ పాటికి అది మరొక ఆంధ్రతార అయి కూర్చుంటుంది.

ఎటువచ్చీ అకారణంగా ఎందుకూ కాకుండా పోయిందెవరంటే—నేనే.

—ముద్రణ : భారతి, సెప్టెంబరు 1939.

# అరిచేతిలో వైకుంఠం

మా క్లబ్బు కేవలం సంస్కృతిని పెంపొందించటానికి ఏర్పాటయినది కావటం చేత లోకాభిరామాయణం మాట్లాడుకునేటందు కెవరూ దొరికే వాళ్ళుకారు. అందరూ చీట్లపేకలు మొదలైన సాంస్కృతిక వ్యాపకాల్లో నిమగ్నులై ఉండేవారు. పోగా సాంస్కృతిక వాసన బొత్తిగా లేని వాళ్ళం మేం ముగ్గురం నలుగురం ఉండే వాళ్ళం. మేమైనా కబుర్లుచెబితే వినేవాళ్ళమేగాని చెప్పగల వాళ్ళంకాం.

అందుచేత మాకు భగవాన్లుగారు దైవప్రసాదంలాగా దొరికాడన్నమాట. ఆయన విలువ కనిపెట్టటానికి మాకాటే కాలం పట్టలేదు. సీమచింతకాయలు మొదలు కొని సినిమాలదాకా ఆయన అనేక విషయాలను గురించి ధారాళంగా చెప్పేవాడు. పురాణయుగంలో సూతుడు మాట్లాడుతుంటే శౌనకాది మహామునులైతే యే విధంగా చెవులురిక్కించి తన్మయులై వినేవారో భగవాన్లు చెప్పే కబుర్లు మేం అంతా ఆసక్తితో వినేవాళ్ళం. ఆయన కసలు మేం సూతుల వారని నామకరణం కూడా చేశాం.

ఒకనాటి గోష్ఠి సినిమాల మీదికి వెళ్ళింది.

"సుమారుగా ఉజ్జాయింపున ఒక మాదిరి పిక్చరు తీయాలంటే రమారమీ ఏపాటి పెట్టుబడి అవసరమౌతుందంటారు?" అని అడిగాడు మా సదస్యం. అతనికి మాటలు తూచి మాట్లాడ్డం అలవాటు. అంతేగాక అతను ఏ ప్రశ్న వేసినా అది తనకు అత్యంత ముఖ్యమైన సమస్య అనిపించేటట్టుగా తోపింపజేసేవాడు. నా మటుకు నేను సదస్యం వేసిన ఈ ప్రశ్నవిని అతనే సుమారుగా ఉజ్జాయింపున ఒక మాదిరి పిక్చరు రమారమీ తీయబోతున్నాడనుకున్నాను.

ఆ ప్రశ్నకు మా సూతులవారు ఒక చిరునవ్వు నవ్వాడు, ఆయన తల అడ్డంగా ఆడించి, "ఇప్పుడు కాలం మారిపోయింది" అన్నాడు.

నలుగురమూ ఆయనకేసి ప్రశ్నార్థకంగా చూశాం. సూతులవారు గొంతు సవరించుకున్నాడు. ఏదోకథ రాబోతుందని మాకర్థ మయింది.

"వెనకటి రోజుల్లో—అంటే పదిహేనేళ్ళ క్రితం[1]-నేనో మనిషిని చూశాను. ఆయన రెండు వందల రూపాయల పెట్టుబడితో ఒక పిక్చరు తీశాడు," అన్నాడు మా సూతులవారు.

---

1. కథాకాలం 1953

"ఎట్లాగెట్లాగూ?"

"పిక్చరు పూర్తి అయిందా?"

"లాభం వచ్చిందాండీ?"

తొందరపడకుండా ఉంటే అన్ని ప్రశ్నలకూ సమాధానం వస్తుందన్నట్టు మా సూతులవారు సంజ్ఞచేసి కథ ప్రారంభించాడు.

* * *

ఆ రోజుల్లో మా బంధువులు కొందరు మద్రాసులో పిక్చరొకటి తీశారు. నాలాగే వాళ్ళక్కూడా సినిమాలను గురించి ఏమీ తెలీదు. అందుచేత నేను వాళ్ళకి కాస్త ఆసరాగా ఉంటానని నన్నుకూడా రమ్మన్నారు. నేను మాత్రం చేసే పెద్దపనేమీ లేకపోవటంచేత వాళ్ళ వెంట వెళ్ళాను. నేను రావటంవల్ల వాళ్ళకు నష్టమేమీ కలగలేదు. సినిమా గొడవ తెలీనివాణ్ణి నేను కూడా ఉండటం వాళ్ళకి కొంతలో కొంత ధైర్యంగా ఉండేది. లాడ్జిలో మంచి వేపుడు కూరలు చేయించటానికీ, అప్పుడప్పుడూ పెసరట్లతో పాటు అల్లప్పచ్చడి వేయించటానికీ, అప్పటికప్పుడు దానిలో ఆవరాయ వేయించటానికీ నేను బాగా సహకరించాననే చెప్పగలను.

మా పిక్చరేమయిందంటారా? అది వేరే కథ. నేను చెప్పదలచిన కథ అది గాదు.

మా పిక్చరు తీసే స్టూడియోలో మాకు మంచి ఆదరం ఉండేది. కారణం ఆ స్టూడియోలో తీస్తున్న పిక్చరు ఆ రోజుల్లో ఇది ఒకటే. అసలే డిప్రెషన్[1] అందులో అది పెద్ద ప్రసిద్ధిగల స్టూడియో కాదు. స్టూడియోవాళ్ళు మమ్మల్ని బాగా చూసేవారని చెప్పాను గదూ? మా లాడ్జి స్టూడియోకు చాలా దగ్గరగా కూడా ఉండేది. అందుచేత మాకు షూటింగున్నా లేకపోయినా స్టూడియోకు వెళ్ళి కాలక్షేపం చేస్తుండేవాణ్ణి. ముఖ్యంగా కామెరామెన్ శ్రీనివాసన్, సౌండ్ రికార్డిస్టు రాఘవన్ కూడా నాతో వచ్చీరాని తెలుగులో ఆప్యాయంగా మాట్లాడేవాళ్ళు.

ఇట్లాగే ఒకరోజు నేను స్టూడియోలో ఉండగా ఒక పరమడొక్కు కారులో ఒక పెద్దమనిషి దిగాడు. ఆయన నడివయస్సువాడు. ఆయన మాట్లాడుతున్నా, నడుస్తున్నా, ఊరికే నిలబడి ముక్కుతుడుచుకుంటున్నా కూడా ఎంతో తొందరమీద ఉన్నట్టుగా కనబడేవాడు. ఆయన వెంట ఒక యువకుడు కూడా ఉన్నాడు, పొక్కా మీద పొంటు వేసుకొని. ఆ యువకుడి చంకలో పెద్ద ఫైల్ వుంది.

"నా పేరు చిదంబరం. మీ స్టూడియో మేనేజరెవరు?" అడిగాడా మధ్యవయస్కుడు శ్రీనివాసన్‌ను.

"చెప్పండి, మేమంతా మేనేజర్లమే" అన్నాడు శ్రీనివాసన్.

ఇందులో అబద్ధం ఏమీలేదు. ఆ స్టూడియోకు అయిదుగురు భాగస్వాములు.

---

1. ఆర్థికకాటకం (1929-34)

అయిదుగురూ అయిదు డిపార్టుమెంట్లు పనిచేసేవారు. ఇక మేనేజరంటూ ఉండిన వాడు కేవలం గుమస్తా. లెక్కలూ అవీ చూసేవాడు.

"నేను పిక్చరు తీస్తాను. నాకు పని తొందరగా జరగాలి. మీ స్టూడియోలో ఎక్కువ పని లేదని తెలిసింది. పోనీ మీ స్టూడియోలోనే తీస్తామని యోచించాను. ఇదుగో, ఈ పిల్లకాయ నా స్క్రిప్ట్‌రైటర్. నేనే ప్రొడ్యూస్ చేసి డైరెక్టు చేసుకుంటాను" అన్నాడు చిదంబరం.

"చాలా మంచిది," అన్నాడు శ్రీనివాసన్ తమిళ భాషలో.

"ముందు ఒక రీల్ టెస్టుతీస్తాం. దాన్ని నా భాగస్వాములుచూసి ఆమోదించిన తరవాత స్టూడియో ఎగ్రిమెంట్ చేస్తాం" అన్నాడు చిదంబరం.

ఈ టెస్టు ఎప్పుడు తీస్తావు, ఎవరితో తీస్తావు, అని శ్రీనివాసన్ అడిగాడు. ఆ సాయంకాలమే తన ఆర్టిస్టును తెస్తాననీ, ఏదో ఉన్న సెట్టుమీదనే నాలుగైదు షాట్లు తీస్తామనీ చిదంబరం అన్నాడు. సాయంకాలం వచ్చేటప్పుడు ఒక రీల్ నెగెటివ్, సౌండూ తెస్తానన్నాడు. మా కోసం వేసిన సెట్టొకటి ఉంటే చూపించారు.

"నాది సోషల్ పిక్చర్. ఇది చూస్తే పౌరాణిక్ పిక్చర్ సెట్లల్లే వుంది. అయినా ఫరవాలేదు. ఈ వాకిలికి కర్టెన్లు తగిలించండి. ఈ మూలగా రెండు క్రోటన్ తొట్లు పెట్టండి. ఈ మధ్యగా కొంచెం డ్రాయింగ్ రూమ్ ఫర్నిచర్ ఆరెంజ్ చెయ్యండి. పని అయిపోతుంది" అని హెచ్చరించి చిదంబరం యువకుడితో సహా నిష్క్రమించాడు.

మామూలుగా సాయంత్రం ఆరుకల్లా పని మానెయ్యటం స్టూడియోకు అలవాటు. కాని ఈ రోజు కొత్తబేరం తగులుతుందన్న ఆశతో అందరూ చిదంబరం కోసం కనిపెట్టుకుని వున్నారు. సుమారు ఏడుగంటలకు మళ్ళీ కారు వచ్చింది. కారులోంచి చిదంబరం వెంట కుర్రాడుగాక మరో ఆడమనిషి కూడా దిగింది. సన్నగా యెండుకుపోయి వుంది. కాని మనిషి తెల్లని తెలుపు. ఏ పిక్చర్లోనూ నటించిన మనిషికాదు. సరికొత్త సరుకు.

"నా పిక్చర్లో పెద్ద మేకప్ ఏమీలేదు. మామూలు పాన్‌కేక్ వేస్తే చాలు. డ్రెస్సుకూడా మార్చక్కర్లేదు" అన్నాడు చిదంబరం.

సెట్టు మీదికి వెళ్ళారు. సెట్టేమో చిదంబరానికి కావలిసినట్టు సిద్ధంగా ఉంది.

"ఎంతసేపూ? గంటలో అయిపోతుంది" అన్నాడు చిదంబరం, చేతిలో ఉన్న గోల్డ్‌ఫ్లేక్ టిన్నులోనుంచి సెట్టుమీద ఉన్న వాళ్ళందరికీ తలా ఒక సిగరెట్టూ ఇస్తూ.

ముందు ఆమెను కుర్చీలో కూర్చోబెట్టి క్లోజప్ తీయించాడు. క్లోజప్[1]లో అనేక రకాల భావాలు ఆమెచేత అభినయం చేయించాడు.

---

1. క్లోజప్ : దృశ్యంలో పాల్గొనే వ్యక్తి తలను, మెడను కెమెరాలో చిత్రించడం.

"ఒక చిన్న డయలాగ్ టాకీ షాట్[1] తీస్తాం" అన్నాడు చిదంబరం రెండో విడత సిగరెట్లు పంచుతూ. టాకీ షాట్ తీశారు.

తరవాత ఆమె కుర్చీలో నుంచి లేచి వాకిలి దగ్గిరికి వెళ్ళటం మిడ్ షాట్[2] పానింగ్[3]తో సహా తీయించి మళ్ళీ సిగిరెట్లు పంచాడు. ఎందుకైనా మంచిదని వాకిలి గుండా గదిలోకి ఆమె రావటం మరొక షాట్, లాంగ్‌షాట్[4] తీయించాడు.

అప్పటికి అయిదువందల అడుగులు అయిపోయింది. మరి రెండు టాకీషాట్స్ తీసి టెస్టు ముగిస్తామన్నాడు. కుర్రవాడు పుస్తకంలో నుంచి పది పదిహేను వాక్యాలు విడిగారాసి ఆర్టిస్టు చేతికిచ్చాడు. వాటిని ఆమె అదివరకే కంఠస్థం చేసి ఉండాలి. రెండుసార్లు మోనిటరిచ్చి టేక్‌కు సిద్ధమయింది. రాత్రి పదిన్నరకు ఆ టేక్[5] కూడా అయిపోయింది.

"ఇంకా రెండు వందల అడుగుల నెగిటివ్[6] ఉంది," అన్నాడు శ్రీనివాసన్.

"కామెరాలో ఉండనివ్వండి. రేపు ఒకటి రెండు ఔట్‌డోర్ షాట్స్ కూడా తీసి నా భాగస్తులకు చూపుతాను. వాళ్ళకు మీ స్టుడియో పని గురించి ఐడియా వుంటుంది," అన్నాడు చిదంబరం.

మరునాడు స్టుడియో కాంపౌండులోనే మూడు షాట్లు తీశారు. ఆ ఆర్టిస్టే. అదే రోజారంగు చీరె. ఆ చీరెకు స్టుడియో వాళ్ళు "కంటిన్యుయిటీ" అని నామకరణం చేశారు. మూడూ టాకీ షాట్లే తీశారు.

"ఈ రీల్ త్వరలో డెవలప్[7] చేసి చక్కగా ప్రింట్ చేసి[8] ఇవ్వండి," అన్నాడు చిదంబరం.

చిదంబరం టెస్ట్[9] అని పేరుపెట్టి తన పిక్చర్లో ఏ పాతిక షాట్లో తీసేవాడనీ, ప్రస్తుతం అతని దగ్గర ఈ ఆర్టిస్టు తప్ప మరెవ్వరూలేరనీ, భాగస్వాములు కూడా లేరనీ, ఈ రీల్ చూపించి భాగస్వాములను సంపాదించి, డబ్బు తీసుకొని, స్టుడి

---

1. టాకీ షాట్ : శబ్ద దృశ్య చిత్రీకరణం.
2. మిడ్ షాట్ : దృశ్యంలో పాల్గొనేవ్యక్తి నడుము పైభాగాన్ని చిత్రం కెమెరాలో తీయడం.
3. పానింగ్ : Horizontalగా కెమెరాను తిప్పుతూ పోవడం.
4. లాంగ్‌షాట్ : పిక్చరు ఫ్రేములో మూడుభాగాలు నిలువుగా ఉండేట్లు దృశ్యంలో పాల్గొనే వ్యక్తిని కెమెరాలో చిత్రించడం.
5. టేక్ : ఒక కెమెరాలో తీసిన దృశ్యాన్ని ఒకేసారి రికార్డు చేయడం.
6. నెగటివ్ : వెలుగు నీడలు తలక్రిందులుగా పడే ప్రతిబింబం.
7. డెవలప్ : బొమ్మ కన్పించేటట్లు ఫిల్మును తయారుచేసే ప్రక్రియ.
8. ప్రింట్ : నెగటివ్ నుండి తీసిన ఛాయాచిత్రం.
9. టెస్ట్ : వెండి తెరకు పరీక్షించడం.

యోకు కొంత అడ్వాన్సిచ్చి, మిగిలిన ఆర్టిస్టులను బుక్ చేసి తతంగం నడిపిస్తాడని స్టుడియోలో పుకారు పుట్టింది.

ప్రింటు పట్టుకు పోయిన వారం రోజులకు చిదంబరం తిరిగి వచ్చాడు. స్టుడియోకు వెయ్యిరూపాయలు అడ్వాన్సిచ్చాడు. మర్నాడు సెట్టు వెయ్యమన్నాడు. అతను తాను తీసిన షాట్లు పదిమందికి చూపి తలా ఒక వెయ్యి అడ్వాన్సు తెచ్చాడన్నారు. చిదంబరమే ప్రొడ్యూసరు. అతనే దర్శకుడునూ. కుర్రవాడు కవీ, అసిస్టెంటూనూ, ఆ ఆడమనిషి హీరోయిన్.

కొత్త సెట్టు[1] మీద పని చెయ్యటానికి మరి ముగ్గురు నటులు వచ్చారు. అందులో ఒకడు హీరో. ముగ్గురూ సినిమాకు కొత్తవాళ్ళేగాని స్టేజి అనుభవం గలవాళ్ళు.

మా షూటింగు మాట ఏమైనా చిదంబరం షూటింగు మహాజోరుగా సాగింది. నెల పూర్తి అయ్యే లోపల పిక్చరు పూర్తి అవుతుందనీ, స్టుడియో బిల్లు చెల్లించే లోపల పిక్చరు విడుదల అవుతుందనీ పుకారు పుట్టింది.

చిదంబరం ఉద్దండుడు. ఒక షాట్ అయిపోయి రెండో షాట్‌కు లైట్లు అరెంజ్ చేసే లోపుగా అందరికీ సిగిరెట్లు అందించి, "ఎంతసేపూ పనేనా? పొగ ఆనందించండి. ఈ పాటి ఆనందమైనా లేకపోతే జీవితం దేనికి? అదే నా పిక్చర్‌లో సందేశం" అనేవాడు. ఇంకోవంక తన ఆర్టిస్టులను తెగ అదిలించి, "కమాన్, కమాన్. ఇన్ని రిహార్సల్సా? ఇక్కడి టెక్నీషియన్లు మనని చూసి నవ్వరూ?" అనేవాడు.

షూటింగు ప్రారంభమైన మూడు వారాలలోగా పదిహేడు పద్దెనిమిది రీల్సు నెగిటివ్ షూట్ చేశాడు. ఎడిట్[2] చేస్తే పన్నెండు, పదమూడు రీల్సు అవుతుందన్నారు. చూస్తున్న వాళ్ళకి కథ అయోమయంగా వున్నా షాట్లలో "ఎన్, జీ"లు[3] లేవు. అయిదారు పాటలున్నాయి. ఆ పాటలు అయిపోయేసరికి పిక్చరు కూడా అయిపోతుందని పుకారు పుట్టింది.

హీరో వేస్తున్నవాడికి స్నేహితులు సలహా ఇచ్చారు—డబ్బు విషయం జాగ్రత్త పడమని. తనకు ఎడ్వాన్సు కూడా ఏమీ ముట్టలేదని హీరో చల్లగా బయటపెట్టాడు. అతనికి కంగారు పుట్టింది. చిదంబరం దగ్గిరికి పోయి, "నా జీతం ఎంత? ఎప్పుడిస్తావు?" అని అడిగాడు.

"ఏం జీతం?" అన్నాడు చిదంబరం.

"నేనీ పిక్చర్లో నటిస్తున్నందుకు జీతం లేదా?" అన్నాడు హీరో.

---

1. సెట్ : సన్నివేశ చిత్రణకు సిద్ధంచేసిన రంగభూమి.
2. ఎడిట్ : కూర్పు.
3. షాట్లలో ఎన్,జీ : షాట్లలో **No, good.**

"ఉంటే నెలాఖరుకు వస్తుంది," అన్నాడు చిదంబరం.

"నాకు కొంత అడ్వాన్సు కావాలి!" అన్నాడు హీరో.

"ఎందుకు?" అన్నాడు చిదంబరం, "నీ ఖర్చులన్నీ నేనిచ్చుకుంటున్నానే!"

"ఇంటికి పంపాలి," అన్నాడు హీరో.

"నేను ఇంటి దగ్గిరనుంచి తవ్వితెచ్చి ఈ పిక్చరు కోసం ధారపోస్తుంటే నాతో సహకరించకపోగా ఇంటికి పంపటానికి డబ్బు కావాలంటావా? నీకెవడు హీరో ఛాన్సిస్తాడు? ఇట్లాగేనా నువు నాకు కృతజ్ఞత చూపేది."

చిదంబరం వాలకం చూస్తున్నకొద్దీ హీరోకు అనుమానం హెచ్చసాగింది. వాడు బ్రహ్మాస్త్రం వేశాడు. "నాకు రెండు వందలిస్తేగాని నేను మేకప్ వెయ్యను," అన్నాడు.

బ్రహ్మాస్త్రం కాస్తా గడ్డిపోచ అయిపోయింది.

"నువు వేషం వెయ్యనక్కరలేదు. నీ వేషం అయిపోయింది. నువు పోవచ్చు. ఇక నీకు లాడ్జిలో భోజనం కూడా లేదు. నీకు తిరుగు రైలు ఖర్చు కూడా ఇవ్వను. నువు నామీద తిరుగుబాటు చేసినట్టు ఇంతమంది సాక్ష్యం వుంది. నీకేమైనా రావలిసి వుంటే కోర్టుకు పోయి రాబట్టుకో!" అన్నాడు చిదంబరం.

హీరో తెల్లబోయినాడు. వాడికి జన్మలో మొదటిసారిగా దైవభీతి వంటిది ఒక భావం కలిగింది. స్టుడియోలో వాళ్ళ దగ్గర పదిరూపాయలు ముష్టెత్తి వాడు స్వగ్రామం వెళ్ళిపోయాడు.

త్వరలోనే చిదంబరం చిత్రం పూర్తి చేశాడు. రహస్యంగా డిస్ట్రిబ్యూటర్లను చూట్లాడాడు. పన్నెండువేలు అడ్వాన్సు పుచ్చుకున్నాడు. బాక్ గ్రౌండ్ సంగీతంతో సహా, బాక్‌గ్రౌండ్ పాటలతో సహా ఫలానితేదీకి పదికాపీలు రిలీజిస్తానన్నాడు. అన్నతేదీకి కాపీలు వెళ్ళాయి. కాని వాటికి బాక్ గ్రౌండ్ మ్యూజిక్‌లేదు. ఆ చిత్రాన్ని అట్లాగే రిలీజు చేశారు. అది రిలీజయిన మూడో రోజుకే ఇంజక్షన్ ఆర్డరు వచ్చి ఎక్కడి కాపీ అక్కడ నిలిపి వేశారు. కారణం అడ్వాన్సు పదివేలు తీసుకుని చిదంబరం ఎటో వెళ్ళిపోయాడు. అతనికి పదివేలిచ్చిన భాగస్వాములకు డిస్ట్రిబ్యూషన్ గొడవే తెలీదు. అసలింకో రెండు మూడు నెల్లకిగాని పిక్చరు పూర్తి కాదని వాళ్ళనుకుంటున్నారు. పత్రికలో ప్రకటనలు చూసి వాళ్ళు మేలుకున్నారు.

కాని ఏం లాభం, పిక్చరు వట్టి తుక్కు. వాళ్ళ డబ్బు వాళ్ళు మళ్ళీ కళ్ళ చూడలేదు. చిదంబరం రంగూను వెళ్ళిపోయినాడన్నారు. అతన్ని గురించి నేను మళ్ళీ వినలేదు.

— ముద్రణ : కినిమా, ఆగస్టు, 1953.

# స్వర్గంలో బందీలు

బొంబాయి బస్సుడిపోకు ఎదురుగా ప్రసిద్ధమైన పార్కు. వచ్చేజనం, పొయ్యేజనం. సాయంకాలం కావడంచేత పొయ్యేజనం కన్నా వచ్చేజనమే ఎక్కువ. ఇద్దరు ఆర్టుస్టూడెంట్లు చెరొకపక్కా తిరిగి స్కెచెస్ వేసుకుంటూ, మధ్య మధ్య ఏవో సంప్రదించుకుంటున్నారు. అందులో ఒకడు వేస్తున్న స్కెచ్‌లు మరో రెండు నెల్లకి ఒక మరాఠీ పత్రికలో పడతాయి. రెండోవాడు తన కాలాన్ని వృధా చేస్తున్నాడు. వాడు బొమ్మలు గీసి జీవించలేడు. కాని వాడికా సంగతి తెలీటాని కింకా కనీసం రెండేళ్లు పడుతుంది. చిత్రకారుడుగా పైకిరానున్న వాడికి రెండో చెయ్యి అవిటిదని తెలుసు. కాని ఆ మాట పైకి అనడు. ప్రస్తుతాని కిద్దరూ సమానమే. ఇద్దరిదీ ఒకటే క్లాసు.

బొంబాయిలో ఎన్నో రకాల విద్యలు నేర్చుకోవచ్చు. ఎన్నో బతుకుతెరువు లున్నాయి. కాని ఈ అవిటి చేతివాడు చిత్రకళ ఎందుకు ఏరుకున్నట్టు ? మనకు తెలీదు. వాడికి, పాపం బొమ్మలంటే తగనిష్టం కావచ్చు. వాళ్ల దగ్గిర బంధు వెవడైనా చిత్రకారుడుగా పేరు గడించి ఉండవచ్చు. లేదా వాడికి మరే చదువూ అబ్బక, బొమ్మలు గీసుకునైనా బతగ్గలుగుతాడేమోనని వాళ్ళ వాళ్ళు వాణ్ణి చిత్ర కళాభ్యాసానికి బొంబాయి పంపివుండవచ్చు—వాడు మూడోక్లాసు చదువుతుండగా డ్రాయింగు మేస్టరు "నీకు డ్రాయింగు బాగావస్తుందిరా!" అని ప్రోత్సహించి ఉండ వచ్చు. ఇటువంటి ప్రోత్సాహ బీజం అనేక సంవత్సరాల తర్వాత మొలకెత్తి మహా వృక్షంలా తయారు కావటం కూడా కద్దు........

ఎడమచేతి పక్కగా పులులూ, సింహాలూ ఉండే బోనులున్నాయి. అక్కడ దిక్కుమాలిన వాసన. ఆ వాసనను భరించి చాలా మంది- ఆడా, మగా, పిల్లా, పెద్దా నిలబడివున్నారు. ఉండి ఆ క్రూరమృగాలను చూసి భయంకరమైన సన్ని వేశాలు ఊహించుకుంటున్నారు.

హోమియోపతి మందుల్లాగే భయం కూడా చిన్న చిన్న డోసుల్లో చాలా మేలు చేస్తుంది.

"ఈ కటకటాలే అడ్డంలేకపోతే మనం వీటికింత దగ్గిరగా నిలబడ గలు గుదుమా?" అంటున్నాడొక వృద్ధుడు తన వృద్ధపత్నితో.

వృద్ధపత్ని 'ఔ' నన్నట్టుగా ఏదో గొణిగింది. ఆవిడ అనుకుంటున్నది — "ఈ సింహం ఈ బోనులోంచి తప్పించుకుంటే అది ముసలాడిమీద పడుతుంది గాని

నామీద పడదు. ఎందుకు నామీద పడదో నాకు తెలీదు కాని పడదంతే!"

ఆవిడ ధైర్యానికి కారణం కటకటాలే కావచ్చు. కాని ఆ కటకటాలే లేక పోతే సింహం తన భర్తమీదే పడుతుందన్న అనుమానానికి కారణం ఏమిటో మనకు తెలీదు.

ముసలి దంపతు లిప్పటికి దాదాపు ముప్పైఏళ్ళుగా- యుద్ధానికి ఒక సంవత్సరం ముందునుంచీ- బొంబాయిలోనే మకాం చేస్తున్నారు. వాళ్ళ స్వగ్రామం అట్టే దూరంలేదు. కళ్యాణ్‌కు అవతలి స్టేషను. 1938 లో బొంబాయి వచ్చి బొంబే, బరోడా అండ్ సెంట్రల్ రైల్వేలో ఆయన ఉద్యోగం సంపాదించు కున్నాడు. అట్లాగే 'బీ బీ' దాదర్లో ఒక ఫ్లాట్ అద్దెకు తీసుకున్నారు. అద్దె పది రూపాయలు.

యుద్ధం వచ్చినప్పుడే వాళ్ళకో కొడుకుపుట్టాడు. వాడిప్పుడు ఐ. ఎ. ఎస్. వాడి నివాసం మలబార్ హిల్‌మీద. ముసలాడికి పింఛను వస్తుంది. అదీగాక కొడుకు నెలనెలా మూడువంద లిస్తాడు. వీళ్ళుమాత్రం "బీబీ" దాదర్లో అదే భాగంలో అదే అద్దెకు ఉంటున్నారు.

ముసలావిడకు కొడుకుదగ్గిర ఉండాలని! వాళ్ళ భాగం ఖాళీ చేసేట్టుంటే పది వేలు పగిడీ వస్తుంది. కాని ముసలాడికి డబ్బెందుకు? ఆయనకు కావలసింది జీవితం. అదేలేదు. ఇప్పటికూ్కడా ఆయన కలకంటే తమ పాతయిల్లూ, తమ గ్రామంలో గడిపిన జీవితమూ కలలోకి వస్తాయి. ఆపుకోలేక ఒకసారి వాళ్ళగ్రామం వెళ్ళాడు. ఊరునిండా కొత్తవాళ్ళు. ఊరు మారింది. జీవితం మారింది. తాను తన పాత జీవితానికి తిరిగి పోదామన్నా అది అక్కడ లేదు.

చెట్లకింద పడుకుని కొందరు నిద్రపోతున్నారు. వాళ్ళెవరో చెప్పటం కష్టం. నైట్‌డ్యూటీకిపోయే కార్మికుడు కావచ్చు. ఇల్లు ఇరుకు, పిల్లలూ, ఏడుపులూ పెళ్ళాం కేకలూ మొదలైన కారణాలవల్ల ఇంటిదగ్గిర నిద్రపోయే సౌకర్యం లేక పోవచ్చు. మరి కాస్సేపు నిద్రపోయి లేస్తాడు. ఇంటికి పోతాడు. ఇంత తిని పనికి బయలుదేరుతాడు.

ఎక్కడినుంచో పారిపోయివచ్చి మహానగరంలో అజ్ఞాతంగా తిరుగుతున్న నేరస్థుడు కావచ్చు. అలా అయే పక్షంలో చీకటిపడ్డాక లేచి ఎక్కడికి పోతాడో, ఏం చేస్తాడో మనకు తెలీదు. వాడికీ తెలీదేమో కూడా.

నిరుద్యోగి కావచ్చు.

కావచ్చునేమిటి? అవును. ఆ పడుకున్నవారిలో ఒకడు ప్రస్తుతం నిరుద్యోగే. అతని పేరు ప్రకాశం. అతనిది తెనాలి తాలూకా జిమ్మిపల్లి గ్రామం. ఆ గ్రామంలో అతని తండ్రి పన్నెండెకరాల భూవసతి, పెద్ద పెంకుటిల్లూ పెట్టుకుని 'మహారాజు' లాగా బతికాడు. ఆ మానవుడు తన జీవితంలో "ఇదిలేక పోయేనే" అనుకోలేదు. పాతర్లో ఏడాది పొడుగునా ఎక్కితొక్కినట్లు సరిపోయే ధాన్యం, రెండు గేదెలపాడి,

మెరకభూమిలో పండే కాయగూరలు, మనిషి అయినవాడి కింకేం కావాలో ప్రకాశం తండ్రికి తెలీదు. ఆంజనేయస్వామి గుడికి ప్రతి శనివారమూ వెళ్ళి, అందరికన్నా గట్టిగా భజన చేసేవాడు. సృష్టిలో ఎందరు దేవుళ్ళుంటే అందరితోనూ ఆయన సఖ్యంగా ఉన్నాడు. ఏ దేవుణ్ణి వేధించుకు తినలేదు. ఎవరికీ లంచాలు ఆశపెట్టలేదు. మొక్కులు మొక్కలేదు. అందుకే అందరు దేవుళ్ళు ఆయనపట్ల కనికరించి నట్టున్నారు.

జీవితంలో అంత అన్యోన్యంగా జీవించినవాణ్ణి ఊళ్ళో అందరూ ఆదరించారు గాని ప్రకాశం మెచ్చలేదు. తన తండ్రిబతుకు "వానపాము" బతుకు. అది బురదలో పుడుతుంది. బురదలో ఆప్యాయంగా జీవిస్తుంది. అందులోనే నశించి, ఎరువైపోతుంది. తన తండ్రికూడా అట్లాగే జీవించాడు. దాన్ని జీవించటమంటారా? బురదపురుగు నిజంగా జీవిస్తుందా?

"నిజంగా జీవించటం" అనేదాన్ని నిర్వచించ మంటే ప్రకాశం బహుశా చెప్పలేకపోయే ఉండును. కాని అతనికి ఒకటి ఖచ్చితంగా తెలుసు. జిమ్మిపల్లిలో ఉండి ఎవడూ నిజంగా జీవించలేడు.

నిజమైన జీవితం పొద్దున్నే కాఫీ హోటలుతో ప్రారంభమై రాత్రి సెకండ్‌షో సినిమాతో ఆఖరవుతుంది. ఈ మధ్య కాలంలో వీలయినన్ని పనులు చెయ్యాలి. అనుభవం పొందాలి.

ప్రకాశానికి చాలా ఇష్టమైన మాట "అనుభూతి". వాళ్ళనాన్న అనుభూతిలేని జీవితం గడిపాడు. తాను స్కూలుఫైనలు పాసయే లోపునే తనతండ్రి జన్మలో ఎన్నడూ పొందని అనుభూతులన్నీ పొందాడు. ఆయనకన్న ఎక్కువమంది పరిచయం సంపాదించాడు. తన తండ్రికి బాలగోపాల తరంగం లాంటి రెండు మూడు తరంగాలూ, ఒకటి రెండు అధ్యాత్మ రామాయణ కీర్తనలూ తప్ప ఏమీరావు. తనకు మాట అరవై ఎనిమిది సినిమాపాటలు వచ్చు. అనేక వందలసార్లు రేడియో విన్నాడు, వందలకొద్దీ సినిమాలు చూశాడు.

లేదు. లేదు. తన తండ్రి తనతో పోలిస్తే నూరోవంతు జీవించలేదు.

అప్పుడే ఏమయింది? తనకింకా ముందెంతో జీవితం ఉన్నది-అంతెందుకు? తను బియ్యే చదువుతుండగా తండ్రి పోగానే కాలేజికి గుడ్‌బై కొట్టి బెజవాడలోవున్న రెండేళ్ళలో ఎన్ని విషయాలు నేర్చుకోలేదు? తన జీవితం ఎన్ని కొత్త మొగ్గలు తొడగలేదు?

నిజం చెప్పాలంటే, ఆ రెండేళ్ళలో ప్రకాశం ఎంతగా పెరిగాడంటే, అతనికి బెజవాడ ఇరుకై పోయింది. కనీసం మద్రాసులో ఉంటేగాని లాభంలేదు.

ప్రకాశం తొందరపడి మద్రాసు వెళ్ళాడని అతని శత్రువులు కూడా అనలేరు. మద్రాసు పోవాలని నెలరోజులు తహతహలాడి మరీ బయలుదేరాడు. తలుచుకున్న

నాడే రైలెక్కితే అతన్ని కాదనే వాళ్ళెవరు? ఒకరోజు కాదు రెండు రోజులు కాదు మద్రాసు జీవితంకోసం నెలరోజులపాటు తపించి మరీ రైలెక్కాడు.

బెజవాడలో ఉన్న రెండేళ్ళలోనూ ప్రకాశం రెండెకరాలు అమ్మాడు. ఈ రెండేళ్ళలోనూ అతనికి ఇద్దరు ఆసాములు పిల్లలనిచ్చి పెళ్ళిచేస్తామని కూడా అన్నారు. కాని ఎవరూ రెండువేలు మించి కట్నం ఇవ్వజూపలేదు. ప్రకాశానికి చాలా అవమానమయింది. ఓ.ఇడి. చదివి లెక్కల మేష్టరుగా పనిలో చేరిన వైకుంఠానికి నాలుగువేలు కట్నం ఇచ్చి 'సక్కు'లాంటి పిల్లనిచ్చారు. వెధవకు పేక ముక్కల పేర్లయినా తెలీవు. కిందటినెల విడుదలైన పిక్చర్లన్నిటిలో రేలంగి[1] వేషం కట్టిందీ చెప్పలేడు.

ప్రకాశం ఆలోచించాడు—పెళ్ళి కావలసిన ఆడపిల్లలు మద్రాసులోనూ ఉన్నారు. తాను డబ్బు సంపాదించటమే సమస్య అయినట్లయితే మద్రాసులోనూ సంపాదించుకోవచ్చు.

నిన్నటిదాకా—అంటే ప్రకాశం మద్రాసు బయలుదేరటానికి నెలక్రితం దాకా—వాళ్ళో వీళ్ళో ఇప్పించిన కాఫీలు కతుకుతూ ఓడీలు కాల్చిన భాస్కరం గాడు, తానిచ్చిన పాతచొక్కాలు తొడుక్కుని తిరిగినవాడు ఏదో సినిమా కంపెనీ వాళ్ళు పిలవగా, తనదగ్గిరే రైలుఛార్జీలు అరువు పుచ్చుకొని, మద్రాసు రైలెక్కి వెళ్ళాడు. సినిమా కంపెనీవాళ్ళు వాణ్ణి కాస్తా బుక్ చేశారు. ఎడ్వాన్సిచ్చారు. భాస్కరం ఈ శుభవార్త తెలుపుతూఅప్పు పుచ్చుకున్న డబ్బు పంపేశాడు.

అది అందిన మర్నాడే ప్రకాశం మద్రాసుకు ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టు 'కోయించి' మరీ రైలెక్కాడు.

ఏ మనిషిగాని కొత్తచోటికి అడుగుపెట్టినప్పుడు అక్కడి జీవితం, కొలతలు తీసుకుని దర్జీవాడు కుట్టిన చొక్కాలుగా అమరదు. మద్రాసు జీవితం కొద్దిరోజుల పాటు ప్రకాశానికి వదులు అయింది.

అఫ్‌కోర్స్, మొదట్లో ప్రకాశానికి భాస్కరమే హోస్ట్. నెల్లాళ్ళలో భాస్కరంలో కలిగిన మార్పు ప్రకాశానికి వర్ణనాతీత మనిపించింది. వాడు తనని రిసీవ్ చేసుకోవడానికి స్టేషనుకు రావడమే సినిమా హీరో వేషంలో టెరిలీన్‌పాంటూ, టీ షర్టుతో సహా వచ్చాడు.

"అరే నీ జుట్టేమిటి అలా మారిపోయింది!" అన్నాడు ప్రకాశం.

"కరల్ చేయించాను. కనిపించటం లేదా?" అన్నాడు భాస్కరం నవ్వుతూ.

బెజవాడలో లాగ భాస్కరాన్ని పేట్రనైజ్ చేద్దామని ప్రకాశం ప్రయత్నిం

---

1. రేలంగి : రేలంగి వెంకట్రామయ్య. ( ) సుప్రసిద్ధ తెలుగుచలనచిత్ర హాస్య నటుడు. 1935లో వచ్చిన శ్రీకృష్ణ తులాభారంలో తొలిసారిగా నటించాడు. తర్వాత 200 చిత్రాల్లో నటించాడు.

చాడు. కాని అది సాధ్యంగా కనపడలేదు. పైపెచ్చు వాడు రేసులో గెలిచిన వాడి లాగా కనిపించాడు. వాడితో రెండురోజులపాటు తిరిగిన మీదట సినిమా ప్రొడ్యూసర్లూ ఒకరిద్దరు జర్నలిస్టులూ, ఒక తార—కాస్త వయసు మళ్ళినదే అవుగాక—వాడితో మాట్లాడటం చూసినాక భాస్కరం ప్రకాశానికి మరో మనిషిలాగా కనపడ సాగాడు.

అందాకా ఎందుకు? భాస్కరం ఫ్రెండునని చెప్పుకోవడం ప్రకాశానికి ఒక గౌరవంగా కూడా కనబడింది.

అయితే మద్రాసు జీవితం ప్రకాశానికి త్వరలోనే వదులుకావటం మానేసింది. అంటే దాని ప్రమాణానికి ప్రకాశం పెరిగాడు. అట్లా పెరిగేశక్తి ఒక్క హనుమంతుడికే ఉందనుకోవటం పొరపాటు. 'ఏరోయ్ నీకు పట్నం నీళ్ళు వంటబట్టినట్టున్నాయ్!' అని ఎవరన్నా అంటే 'పట్నం ప్రమాణానికి అప్పుడే పెరిగినట్టున్నావే' అని కాంప్లిమెంటు చేస్తున్నారన్నమాట.

వచ్చి నెల తిరగకముందే ప్రకాశం, "మనకు మద్రాసు కొట్టిన పిండేగా!" అనదగిన స్థితికి వచ్చాడు.

పట్నం బాగుంది. పట్నం జీవితం మోతగా ఉన్నది. కాని—

సినిమా ఫీల్డు చుట్టూ లోతైన అగడ్తలూ, బలమైన ప్రాకారాలూ ఉన్నట్టు కనబడ్డాయి. ప్రకాశమేమో తాను సినిమా రంగంలో తప్ప ప్రకాశించలేనని రూఢి చేసుకున్నాడు.

సినిమా రంగానికి చాలా గేట్లున్నాయి. నువు ప్రొడ్యూసరువు కావచ్చు. డైరెక్టరువు కావచ్చు. అసిస్టెంటు డైరెక్టరువు కావచ్చు. ప్రొడక్షన్ అసిస్టెంట్ కావచ్చు. చిల్లరనటుడు కావచ్చు. ప్లేబాక్ పాటగాడు కావచ్చు. మ్యూజిక్ డైరెక్టరో, అతని అసిస్టెంటో, తబలా వాయించేవాడో కావచ్చు. చిల్లర డ్యాన్సరు కావచ్చు. టెక్నీషియనులలో ఒకడైనా కావచ్చు. కెమెరా తోసేవాళ్లుకూడా సినిమాకారుల్లో జమే!—కాని ఇంతమందికున్న ద్వారాలలోని ఒకటీ ప్రకాశంకోసం తెరుచుకుని లేదు.

జీవితంమీద ఆశలు పెట్టుకుని స్వశక్తితో సఫలం చేసుకోలేనివాడు నాస్తిక మతం అవలంబించి లాభంలేదు. కలలు నిజమైన మేటి సినిమాకారులకే వెంకటేశ్వరస్వామి ఇష్టదైవం. కాంట్రాక్టుమీద సంతకం పడిన మర్నాడే భాస్కరం తిరపతి వెళ్ళొచ్చాడట. అది మొదలు అతను నెలకోసారి వెంకటేశ్వరస్వామిని సందర్శించి వస్తున్నాడు. అతనివెంట ప్రకాశంకూడా రెండుసార్లు తిరపతికి వెళ్ళి, సినిమా రంగంలో తాను సంపాదించే మొదటి వెయ్యిలో సగం వెంకటేశ్వరుడి కిస్తానని మొక్కుకున్నాడు.

మూడో నెలలో డబ్బింగ్[1] పిక్చరుకు ప్రొడ్యూసరయే అవకాశం ప్రకాశానికి వచ్చింది. దాని కోసం ప్రకాశం అయిదెకరాలు అమ్మాడు. అతని జీవితానికి రెక్కలు

1. డబ్బింగ్ పిక్చరు : భాషాంతరాన్ని సమకూర్చిన చలనచిత్రం.

వచ్చాయి. డబ్బింగ్ హీరోయిన్‌తో స్నేహం కలిసింది. డబ్బింగ్ హీరోతో మరొక రకం స్నేహమయింది.

డబ్బింగ్ పిక్చరు రిలీజై దెబ్బతిన్నది. కాని అదే సమయానికి మొదలైన గుర్రప్పందాలు ప్రకాశానికి అచ్చి వచ్చాయి. డబ్బింగ్ హీరోకు గుర్రప్పందాల తరవాతే మరేదైనా?

అయిదారు వారాలు తిరిగే లోపల రేసుల్లో ప్రకాశం జీవితం ఎటువంటిదో సైంటిఫిక్‌గా తేలిపోయింది. ప్రకాశం తానై డబ్బు రాయకపోతే అతను గెలుస్తుందన్న గుర్రం గెలుస్తుంది!

'మీరాడకండి, మేష్టరుగారూ! మీరు గుర్రం చెప్పండి, నేను కాస్తాను. లాభం చెరి సహం,' అన్నాడు డబ్బింగ్ హీరో.

ఆ సీజనులో ఇద్దరూ చెరో వెయ్యి గెలిచారు. ఆ ఆనందంలో ప్రకాశం తన డబ్బు నలభైవేలు డబ్బింగ్‌లలో స్వాహా అయిన దానికూడా మరిచాడు. అసలు సినిమా రంగాన్నే మరిచాడనవచ్చు.

బొంబాయిలో రేసు లారంభమయాయి. భాగస్వాములు బొంబాయి వెళ్ళారు. బొంబాయిలో ఇరవైనాలుగు గంటలు గడిచాక ప్రకాశం 'ఉంటే బొంబాయిలో ఉండాలి,' అని లేకపోతే ఏం చెయ్యాలో చెప్పలేదు.

మద్రాసు ఈక్వేషను బొంబాయిలో పారలేదు. ప్రకాశం చెప్పిన గుర్రాలు మహాలక్ష్మి రేస్ కోర్స్‌లో నెగ్గలేదు. డబ్బింగ్ హీరో 'మేష్టరుగారు' చెప్పిన గుర్రం మీద కాకుండా ఇతర గుర్రాలమీద డబ్బుకాసి, కొంతలో కొంత లాభం పొందాడు. లాభం చెరి సహం అన్న ఏర్పాటు ఉద్వాసన అయిపోయింది.

డబ్బింగ్ హీరో ఇంకో విషయం కూడా కనిపెట్టాడు. ప్రకాశం తన వెంట రావటానికి పడని రోజున అతను అయిదారువందలు సంపాదించుకున్నాడు ఆ తరువాత అతను ప్రకాశాన్ని తన వెంట రేస్ కోర్సుకు రానివ్వలేదు. హోటలుకు తిరిగి వచ్చి, ఆ రోజు తన అదృష్టం ఎల్లా ఉండినదీ చెప్పేవాడుకాడు. 'అంత పెద్దగా నష్టం రాలేదు....కిందటిసారి వచ్చిన నష్టం పూడిందని చెప్పొచ్చు . ఈ ధోరణిలో మాట్లాడేవాడు.

ఇద్దరికీ మధ్య జీవితం పెద్ద బీటపెట్టింది.

సీజన్ ఇంకో వారంలో ముగుస్తుందనగా ఒకనాడు ప్రకాశం చుట్టుపక్కల వీధులన్నీ బలాదూరు తిరిగి హోటలుకు చేరుకునేసరికి, 'మీరు వెళ్ళిపోలేదా?' అని రిసెప్షనిస్టు అడిగాడు.

డబ్బింగ్ హీరో గంటక్రితమే హోటలు బాకీ చెల్లించి పెట్టే బేడా తీసుకుని, గదిఖాళీ చేసి వెళ్ళిపోయాడని తెలిసింది.

ఆ హోటల్లోనే ఉంటున్న ఒక తెలుగువాడు ప్రకాశాన్ని చూసి జాలిపడ్డాడు. కాని ప్రకాశం అతని దగ్గిరకూడా పెద్దపోజువేసి, తాను ప్రొడ్యూసరుననీ, రెండో

వాడు తన మోచేతి క్రింద నీళ్ళు తాగిన అర్టిస్టునీ ప్రగల్భాలు పలికాడు.

"మీకు రైలు చార్జీలు అప్పు పెడతాను. మద్రాసుపోయి పంపండి" అన్నాడు.

అది ప్రకాశానికి చాలా అవమానంగా తోచింది. అతను అప్పటికే బొంబాయి జీవితపు ప్రమాణానికి పెరిగి ఉన్నాడు.

"ఎబ్బే! బొంబాయిలోనే ఉండాలండి! మద్రాసు చాలా చండాలం. వెధవ తిండి! వెధవ మనుషులు! రొచ్చుగుంట! ఈ బొంబాయిలాంటి చోట కూలిచేసుకు బతికినా మేలే" అన్నాడు.

"మీకు వెంటనే ఏదన్నా ఉద్యోగం కావాలంటే ఏర్‌లైన్స్‌లో ట్రైచెయ్య గలను. అందులో నాకో ఫ్రెండున్నాడు," అన్నాడు తెలుగతను. అతను వెయ్యి రూపాయల జీతం తెచ్చుకునే బ్రహ్మచారి. బొంబాయిలో ఇళ్ళు దొరకవుగనక, హోటల్లోనే రెండు మూడేళ్ళుగా ఉంటున్నాడు.

"ఏం బొంబాయి జీవితం లెస్తురూ? ఇల్లూ, వాకిలీ లేదు. పెళ్ళామూ, పిచ్చా లేదు. సంపాదనలో ముప్పాతికా మువ్వీసం ఇక్కడి హోటల్ ప్రొప్రయిటర్స్‌నూ, టాక్సీలవాళ్ళనూ, దర్జీలనూ, మిగతా వాళ్ళనూ పోషించటానికే సరిపోతున్నది. మన ప్రాంతాల్లో ఇందులో సగం జీతం వచ్చినా హాయిగా జీవిస్తున్నామనిపించును. చూస్తూ చూస్తూ వెయ్యిరూపాయల ఉద్యోగం వొదులుకోలేను! డబ్బుకు దానిసం" అన్నాడతను.

"నాకూ కొన్ని స్కీములున్నాయి లెండి. వాటిని ఈ బొంబాయిలోనే కారీ ఔట్ చెయ్యాలి. ప్రస్తుతానికి మీరు చెప్పిన ఉద్యోగం ఇప్పించారంటే కాస్త కాలు నిలదొక్కుకుంటాను." అన్నాడు ప్రకాశం.

ఒకవారంలో ప్రకాశానికి ఉద్యోగం వచ్చింది. జీతం డబ్బులు హోటల్లో ఉండటానికి చాలవు. ఎక్కడో మలాడ్‌లో ఉండే ఒక కొలీగ్ ఇంట పేయింగ్ గెస్టుగా కుదిరి దాదాపు సంపాదన రాళ్ళన్నీ ఇచ్చుకుంటూ, సీజన్ టిక్కెట్టుమీద తిరుగుతూ ఒక ఏడాది గడిపాడు.

ఇంతలో రిట్రెంచ్‌మెంట్ వచ్చింది. ఉద్యోగం ఊడిన వాళ్ళలో ప్రకాశం కూడా ఉన్నాడు. మిగిలిన వాళ్ళు సమ్మె నోటీసిచ్చారు. ఏం కాబోతుందో తెలీదు. మూడురోజుల నుంచీ ప్రకాశం స్వేచ్ఛాజీవి—ఆ మాటకు అర్థం ఏమన్నా ఉంటే.

ప్రకాశం పడుకున్న చోటినుంచి లేచి ఇవతలకు వస్తూ పులుల బోను దగ్గిర ఆగాడు.

బోనులో ఆడపులి నిశ్చింతగా పడుకుని ఉన్నదిగాని మగది తెగ తారట్లా డుతూ, ఛాన్సు దొరికితే ఎటైనా సరే పారిపోవటానికి సిద్ధంగా ఉన్నట్లున్నది.

ప్రకాశాన్ని ఆపేవాళ్ళెవరూ లేరు. కాని అతను బొంబాయి నగరానికి బందీ.

—ముద్రణ : ఆంధ్రజ్యోతి (వారపత్రిక),
18 ఆగస్టు 1967

# నువ్వయితే ఏంజేస్తావు?

చేసిన పాపం చెపితే పోతుందంటారు. నేను కాంగ్రెసు వ్యతిరేకినని గాంధీ పటం నెత్తిన పెట్టుకు ప్రమాణం చేసిన మాట నిజమే. పీకెమీది కొచ్చినాక చావనా? అటువంటి అగత్యం నా జీవితంలో కలుగుతుందని నేను కలగన్నానా? పోలీసు వగైరా అపాయకర శక్తులు సుస్థిరంగా కాంగ్రెసు పక్షాన ఉంటాయని తెలిసేగదా నేను ఖచ్చితంగా కాంగ్రెసు పక్షాన నిలబడి వున్నది? నాకేం రాజకీయాలు తెలిసేడుసునని? స్వరాజ్యం రాకమునుపు దైవంమీదే భారంవేసి కాంగ్రెసు ఉద్యమాలన్నిటినీ తిట్టినవాణ్ణేగా? అటువంటప్పుడు నన్ను మీరు అపార్థం చేసుకుంటే ఎట్లా? నే నెప్పుడూ గెలిచే పక్షమే ఉంటాను. నా వల్ల బలవంతుల కెప్పుడూ అపాయం వుండదు. మామూలు పోట్లాటల్లోకూడా నేను నాలుగు తినేవాణ్ణే. రెండు వేస్తానుగాని, వేసేవాడి జోలికి పోనే.

అటువంటివాడికి నాకే ఎందుకు జరగాలి ఈ పాడు పరీక్ష? ఆ లోకోత్తర పురుషులు నా దగ్గిరకే ఎందుకురావాలి? వారి ప్రశ్నలకు నేనెందుకు సమాధానం చెప్పాలి—ఏమో నాకు తెలీదంటే పొయ్యేదాన్ని! వాళ్ళుకూడా కాంగ్రెస్ పక్షపాతులల్లే కనపడేసరికి నేను గోతిలో పడ్డాను. ముఖ్యంగా ఆంజనేయస్వామి వారి వాలకం చూసేసరికి——

ఇట్లా చెప్పకపోతే జరిగిన విషయం మీకేమీ బోధపడదు. అందుకని జరిగిన విషయం జరిగినట్టు మీకు మనవి చేస్తాను. నావల్ల ఎట్టి దోషమైనా ఉంటే దండించండి.

ఆ రోజు రాత్రి నా కెంతసేపటికీ నిద్ర పట్టలేదు. అసలే ఇల్లు బిక్కుబిక్కుమంటోంది. మా ఆవిడ పిల్లలతో సహా ఆ సాయంకాలమే పుట్టింటికి వెళ్ళింది. చెల్లెలికి పురుడు వస్తోందని. 'రేపు ఉదయం వెళ్ళవే' అంటే వింటా? అంత ఇంటికి బిక్కు బిక్కుమంటూ నేనొక్కణ్ణే. అసలే నాకు చీకటంటే భయం. దొంగాళ్ళ మాట జ్ఞాపకం వచ్చినా కమ్యూనిస్టుల మాట జ్ఞాపకం వచ్చినా ఇక రాత్రికి జాగారమే అనుకోండి. అందుచేత ఎంతకీ నిద్ర పట్టలేదు. నిమిషాలు లెక్కపెట్టాను. నేను లెక్కపెడుతున్నవి సెకండ్లా అనిపించింది. ఎన్నివేల నిమిషాలు లెక్కపెట్టినా ఒక గంట కాదాయె!

పన్నెండు గంటలు కూడా విన్నాను. మా గడియారం పన్నెండు గంటలూ పూర్తిగా కొట్టిందో లేదో దభీమని చప్పుడయింది. నా గుండె కాస్తా ఆగిపోయింది.

వొణుకుతూ కళ్ళు గట్టిగా మూశాను.

"అబ్బాయ్! చూడు బాబు!"

ఆ గొంతు వినగానే భయం పోయినట్టయింది. కళ్ళు తెరిచి చూద్దును గదా నాటకంలో వేషంలాగా ఎదుట నిలబడి ఉన్నాడు - చెమ్కీ కోటు,చమ్కీ లాగూ, మెడలో చౌకరకం పూసల దండలూ, మొహానికి అరదళం - ఎన్నడో నేను నా పసితనంలో చూసిన హరిశ్చంద్రుడి వేషంలా వున్నాడు. ఈ పాత్రధారి ఎవడు? ఈవేళ నా యింట్లోకి ఎట్లా వచ్చాడు? ఎక్కణ్ణుంచి వచ్చాడు? ఎందుకు వచ్చాడు? ఇలాంటి సందేహాలెన్నో నాకు కలిగాయి.

"ఎవరు మీరు ?" అన్నాను.

"నేను హరిశ్చంద్రుణ్ణి నాయనా ? నీవల్ల ఒక ఉపకారం కావాలి."

నన్ను వెర్రిబాగులవాడికింద కట్టిన ఆ మనిషిని చూస్తే నాకు నవ్వూ, కోపమూ కూడా వచ్చింది.

"అట్లాగండీ, హరిశ్చంద్రుడుగారూ ! మీరు రావటం ఎక్కడి నుంచి ?"

"దేవేంద్రుడి సభనుండి బాబూ. ఒక చిన్న అన్వేషణమీద దేవేంద్రుడి కోరికపై వచ్చాను. ఇంత కాలానికి ఈ పుణ్యభూమిలో సత్యమే ప్రాతిపదికగా రాజ్యం ఏర్పడిందట. ఈ రాజ్యం తాలూకు వివరాలు కనుక్కొనివచ్చి చిన్న రిపోర్టు తయారు చెయ్యమనీ, మరొకర్నీ మరొకర్నీ పంపితే తనకంత నమ్మకం ఉండదనీ దేవేంద్రుడు నన్ను కోరాడు. నేను కాదనలేకపోయాను" అన్నాడాయన. "ఏం వివరాలు కావాలి మీకు ?" అన్నాను.

"మీరు నిజంగా సత్య రాజ్యంలోనే ఉన్నారా ?"

"మీకా సందేహం దేనికి? మా జాతీయ మాటో - క్షమించండి మాటో అనే ఇంగ్లీషు మాటలకు సరి అయిన తర్జుమా తెలియదు - సత్యమేవజయతే అని ?"

"నిజమా ! ఆహా ఎంత అదృష్టవంతులు నాయనా మీరు. నే నారోజుల్లో సత్యసంధత మీద నిలబడ్డానంటే బొత్తిగా ఒంటరిగాణ్ణి. నాకొక్క పురుగు తోడు లేదు. మీ ప్రభుత్వమే 'సత్యమేవజయతే' అంటున్నదా ? కొంపతీసి 'సత్యమేవ జయితీ' అనడంలేదుగదా. ఎందుకంటే" అని అన్నాడాయన.

"లేదులెండి. ఎక్కడన్నా అచ్చు తప్పులు రావలసిందేగాని 'జయతే' అనే అంటున్నాం. కష్టపడి సాధించిన స్వాతంత్ర్యాన్నన్నా వదలుతారుగాని కాంగ్రెసువారు సత్యాన్ని మట్టుకు వదిలిపెట్టరు."

"అట్లాగే ఉండాలి నాయనా. నేను సత్యంకోసం రాజ్యాన్ని, భార్యాబిడ్డలనూ వదిలిపెట్టెయ్యలా ?"

"నిజమేనండి, మీ నాటకం చాలాసార్లు చూశా చిన్నతనంలో. అందులో మా మేనమామగారు వీరబాహుడి వేషంవేసి జనాన్ని భలే నవ్వించేవాడు."

"వీరబాహుణ్ణి చూసి జనం నవ్వేవాళ్లా ? ఏంచిత్రం ? అయితే, బాబూ మీరు స్వాతంత్ర్యం కోసం చాలా కష్టపడ్డారా నాయనా ?"

"అయ్యో అంతులేని కష్టాలు పడ్డామండీ"

"పోనీ, పాపం. సుఖించాలంటే కష్టపడాలి, నాయనా ఏమేం కష్టాలు పడ్డారో కొంచెం టూకీగా చెబుతావూ, రాసుకుంటాను !"

ఆ మానవుడు జేబులోంచి పుస్తకం తియ్యసాగాడు.

"ఆ రాజకీయాలు నాకంత బాగా తెలీవండీ. మీరు మా కాంగ్రెసు నాయకులను కలుసుకుంటే అవన్నీ వారు వివరంగా చెప్పగలుగుతారు."

"అట్లాగా ? సరేలే ! నేను వెళ్ళి అక్కడక్కడా నాకు కావలసిన విషయాలు సేకరించి మళ్ళీ పోయేటప్పుడు కనిపించి మరీపోతాను;" అన్నాడు సత్యహరిశ్చంద్రుడు. మాటలోనే అంతర్హితుడౌతూ.

ఆయన మాయమైన మరోక్షణం ఏదో భ్రమపడ్డాననుకున్నాను. హరిశ్చంద్రుడేమిటి ? నా దగ్గరికి రావడమేమిటి ? తెలుగు - అందులోనూ మా జిల్లా భాష, మీదు మిక్కిలి వ్యావహారికం - మాట్లాడటమేమిటి ?

ఈ మాట అనుకుంటూ కన్ను మూశానో లేదో గదిలోకి వంద గ్యాసులైట్లు వచ్చినట్టయింది. బలవంతాన కళ్ళు తెరచి చికిలించి చూద్దునుగదా, ఒక దివ్య పురుషుడు నా ఎదుట నిలబడి వున్నాడు. ఆయనను మీరెవరు ? అని అడగవలసిన అవసరం కలగలేదు. నా గదిలో వున్న బుద్ధుడి బొమ్మకు అచ్చమైన నకలు.

"ఏం స్వామీ ఇట్లా దయచేశారు" అన్నాను.

బుద్ధుడికీ తెలుగువచ్చు.

"ఇంద్రలోకం నుంచి వస్తున్నాను నాయనా. మీ రాజ్యంలో అహింస నూటికి నూరుపాళ్ళు అమలు జరుగుతుందట. ఇంద్రుడు నన్ను ఆ విషయం చిన్న రిపోర్టు రాయమని పంపాడు."

"అట్లాగాండీ ? అందులో సందేహమేమీ లేదు. హింసలో విశ్వాసంలేని ప్రభుత్వమంటూ ఉంటే ఈ ప్రపంచంలో మాదే. రష్యా - చైనాలపట్ల మాకెంతో స్నేహభావముండి కూడా, వాళ్ళు హింసాయుత విప్లవాలు జరిపారన్న కారణంచేతనే మా ప్రభుత్వం ఆ దేశాల సాహిత్యాన్ని బహిష్కరిస్తున్నది. హింసను తగ్గించాలనే ఉద్దేశంతోనే మా ప్రభుత్వం హింసావాదులను అంటే కమ్యూనిస్టులేండి - ఏమీ తప్పు చేయకుండానే బొక్కలోకి - అంటే జైల్లో అన్నమాట - తోస్తున్నది. మేం ఒక్క ఇంగ్లీషువాడి రక్తబిందువు చిందకుండా వాళ్ళ దగ్గిరనుంచి స్వరాజ్యం పుచ్చుకున్నాం. అటువంటి స్వరాజ్యాన్నయినా వొదులుతాంగాని అహింసను మాత్రం వదలం."

"చాలా సంతోషం నాయనా! రాజ్యమెందుకు బాబూజీ? నేను రాజ్యాన్ని అవలీలగా తృణీకరించి ప్రేమమార్గం కనుక్కున్నాను."

"మీరు కాంగ్రెసు నాయకులను కలిసి మాట్లాడితే అంతా బోధపడుతుంది."

"అట్లాగే, నాయనా. నువు చెప్పిన ఈ రెండు ముక్కలూ నాకెంతో సంతోషం కలిగించాయి. అయితే, చూడు బాబూ ! అహింసా చిహ్నం ఏదైనా మీ దేశంలో ఉందా ?"

"లేకేమండీ ? మా జెండామీద ధర్మచక్రం ఉంది."

"అశోకుడిదేనా, బాబూ ?"

"అవునండీ, అవును !"

"మంచిది. నాయనా! అశోకుడుముందే హింసద్వారా అహింసను చేరుకున్నాడు."

"మా కాంగ్రెసువారు ముందే అహింసను అవలంబించారు."

"భేష్ ! బాగుంది ! వస్తా నాయనా ! మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు నిన్ను చూసి మరీ దేవేంద్రలోకం పోతా !"

ఒక్కసారిగా కాంతి మాయమైంది. కళ్ళు చీకట్లు కమ్మాయి. మళ్ళీ నా కళ్ళు గుడ్డిదీపపు వెలుతురుకు అలవాటుపడ్డ తరువాత ధైర్యంగా కళ్ళు మూశాను. కన్ను ఇట్లా మూశానోలేదో - కప్పువిరిగి మీద పడిందనుకున్నాను - అంత భయంకరమైన చప్పుడై, భూమి కంపించింది. కళ్ళు తెరచి చూద్దునుగదా ఆంజనేయులవారు ఎదుట ప్రత్యక్షం. మూడు మూర్తులా రవివర్మ గీసిన ఆంజనేయుడే.

"ఏం స్వామీ, ఇట్లా దయచేశావు?"

నా మాటవినిపించుకోలేదు. అటూ ఇటూ ఊగుతూ "రామ రామ రామ సీతా" అని పాడుతున్నాడు. నేను నోరుతెరిచి అతనికేసి చూస్తున్నాను. చిన్నప్పుడు చూసిన సి. యస్. నటేశం హనుమంతుడికీ[1], ఈ అబ్బికీ చాల పోలిక లున్నాయి. అంతే ఎత్తుకూడా ఉన్నాడు. పాడుతూ పాడుతూ నా మీదకురికి గొంతు పిసగపోయినాడు.

"ఆగు, ఆగు ఏమిటీ దౌర్జన్యం?" అన్నాను.

"ఇది రామరాజ్యంకాదూ?"

"అవును అయితే?"

"నేను రాంభజనచేస్తుంటే నువుకూడా చెయ్యవేం? నువ్వుచూస్తే దేశద్రోహిలా ఉన్నావు! చంపేస్తా? ఎవడనుకున్నావో? రామబంటును!"

"ఎట్లా! ఏం వచ్చారు తమరు?"

"ఇక్కడ రామరాజ్యం ఎట్లా అమలు జరుగుతుందో చూసిరమ్మని దేవేంద్రుడు నన్ను పంపాడు. రాముడి తరవాత ఇంతకాలానికి మళ్ళీ రామరాజ్యం ప్రపంచంలో

1. సి.యస్. నటేశం హనుమంతుడికీ : సి. ఎస్. నటేశం( - 1953)సుప్రసిద్ధ రంగస్థల నటుడు, చలనచిత్ర నటుడు, సమాజ స్థాపకుడు, దర్శకుడు, ఆంజనేయ పాత్రధారిగా పేరుమోసిన నటుడు. 1936లో వెలువడిన లంకా దహనం నాటకంలోకూడా ఆంజనేయ పాత్రధారే.

పెట్టుడిందంటే నాకు పరమానందంగా ఉంది. రామ రామ రామ సీతా!"

మళ్ళీ పాటలో పడ్డాడు.

"అవును రామభక్తాగ్రేసరులైన అనేకమంది అయ్యంగార్లు ప్రభుత్వంలో ఉన్నారు—అంటే వైష్ణవస్వాములన్నమాట."

"రామ రామ రామ సీతా! ఈ దేశానికి రాజెవరు?"

"రాజులుండరు. ఇది రిపబ్లిక్ అంటే ప్రజారాజ్య మన్నమాట. అంటే ప్రజలే రాజులు!"

"హా రామా! నీ ఆశయం నెరవేరిందయ్యా! నువు రాజువై ఉండి ప్రజాభిప్రాయాన్ని పాటించావు! ఇంతకాలానికి ప్రజలే రాజులైపోయినారు. రామ రామ సీతా!"

"ఈ మధ్యనే ఎన్నికలైనాయి. ప్రజలు కాంగ్రెసుమంత్రులనే ఎన్నుకున్నారు కాంగ్రెసు మంత్రులను ఎన్నుకోకపోతే రామరాజ్యం పోయే ఉండును. అదృష్టవశాత్తు అట్లా జరుగలేదు."

"రామ రామ రామ సీతా! నేను అట్లావెళ్ళి మీ రామరాజ్యాన్ని స్వయంగా చూసివస్తా. తిరిగి వెళ్ళేటప్పుడు మళ్ళీ కనిపిస్తాలే! రామ రామ రామ సీతా! రామ రామ రామ సీతా!"

ఆంజనేయుడి పాట క్రమంగా పేడవుట్ అయింది. నేనుకూడా కళ్ళుమూశాను. కాని ఇంకెవరు వస్తారో అని నాకు అనుమానంగానే ఉంది. అయితే ఇది వొట్టి అనుమానమే అయింది. ఎందుచేతనంటే ఇంకెవరూ రాలేదు. నేను నిద్రకూడా పోయి ఉండాలి.

ఎందుచేతనంటే నాకు ఈసారి నిద్రా భంగమయినట్టయింది. ఈసారి నేను లేచింది చప్పుళ్ళకుకాదు. ఆకస్మికంగా వాళ్ళంతా దగ్గమైపోతున్నట్లనిపించింది. ఏదో పీడకల వచ్చినట్టుగా వంటిమీద రోమాలన్నీ నిక్కబొడుచుకున్నాయి. శరీరమంతా కంపిస్తున్నది. నాలుక ఎండుకుపోయి పిడచ గట్టింది.

నేను కంగారుగా పక్కలో లేచి కూచునేసరికి ఆ ముగ్గురూ నా ఎదుట ఉన్నారు. నాకేసి రౌద్రంగా చూస్తున్నారు. వాళ్ళను చూస్తేనే పై ప్రాణాలు పైన పోసాగాయి.

"నాతో అబద్ధాలాడావుట్రా? పాపీ!" అన్నాడు హరిశ్చంద్రుడు, పళ్ళు పటపటా కొరుకుతూ. హరిశ్చంద్రుడేమో నోట్లో నాలుకలేని సత్తెకాలపు మనిషనుకున్నాను. బుద్ధుడు ఏమీ అనలేదు. కాని ఆయన నాకేసి చూసేచూపు దుర్భరంగా ఉంది. ఇక ఆంజనేయుల వారి సంగతి చెప్పనే అక్కర్లేదు. నిప్పులు తొక్కిన కోతిలాగ, ఇంకోమాట అనటానికిలేదు — చిందులు తొక్కుతున్నాడు. అతని తోక, భయంకరమైన కొండశిలలాగా నా మీదికి దూకుతోంది.

"క్షమించండి! నేను అల్పుణ్ణి. మీ ఆగ్రహం తప్పుచేసిన వారిమీద చూపండి."

"మాతో అన్ని పచ్చి అబద్ధాలెందుకు చెప్పావు?" అన్నాడు హరిశ్చంద్రుడు.

"నేనేం అబద్ధాలు చెప్పానో నాకు తెలీదు. కాని చెప్పక చెప్పక నే హరిశ్చంద్రుడి
డికే అబద్ధాలు చెప్పటం ఏమిటి? నా ప్రారబ్ధం కాకపోతే అబద్ధాలను ఎవరైనా
సహిస్తారుగాని హరిశ్చంద్రుడు సహిస్తాడా!"

"సత్యమేవజయతే. హాహ్హాహ్హా!" హరిశ్చంద్రుడు.

"అహింస, ధర్మచక్రం! హాహ్హాహ్హా!" బుద్ధుడు.

"రామరాజ్యం! గుర్‌ర్‌ర్" అన్నాడు ఆంజనేయులు.

నేనేం చెయ్యాలి? నాకు మతిపోయింది! వాళ్ళ ఎదుట సాష్టాంగపడ్డాను. నా
సుకుమారమైన చర్మాన్ని రక్షించుకునేందుకు నోటికి వచ్చినమాట అనేశాను.

"అయ్యా మీ ఎడల నేను అపచారంచేసి వుండివుండవచ్చు. నాకు నిజంగా
రాజకీయాలు తెలియవు. కాకపోయినా నేను కాంగ్రెసు వ్యతిరేకిని, మీరు సి. ఐ. డి.
లేమోనని భయపడి అట్లా అన్నాను."

వీళ్ళు ఏ రాజకీయ దృక్పథం గలవారో నాకు తెలిసి చావకపోయే. ఏ రష్యా
ఏజంట్లయినా అయితే కమ్యూనిస్టునని చెబుదామనికూడా తెగబడ్డాను. చెప్పొద్దూ?
కాని ఆ ఇంద్రలోకంలో ఏ రాజకీయాలు తెలిసి ఏడవలేదు. అందుచేత కాంగ్రెసు
వ్యతిరేకినని మాత్రం ఊరుకున్నాను.అదే నా ప్రాణాన్ని కాపాడింది. హనుమంతుడి
తోక నామీద ఆడటం మానేసింది. బుద్ధుడు నాకేసి తీవ్రంగా చూడటం మానేశాడు.
హరిశ్చంద్రుడు కూడా కొంత సౌమ్యంగా మారాడు.

"నువ్వు వెధవ్వి! మీ బతుకు బండారమంతా ఇప్పుడేవెళ్ళి ఇంద్రుడికి
చెప్పేస్తాం. ఇక ముందైనా బుద్ధికలిగి మసలుకో. తెలీని విషయాలు మాట్లాడకు"
అన్నారు వాళ్ళు.

"పోనీ, ఒక్క సలహా ఇవ్వండి. ఈ మునిసిపల్ ఎన్నికల్లో వోటు ఎటు
వెయ్యమన్నారు. ఇప్పుడు కొత్త వార్డులు! మీకు తెలుసుననుకుంటా!"

"నీ వెధవ రాజకీయాలతో మాకు ప్రసక్తిలేదు. మేం మీ సమాజధర్మం
తెలుసుకోవటానికి వచ్చాం. అటువంటిదేమీ కనిపించలేదు. పోతున్నాం. మీ జీవితం
నరకకూపమల్లే చేసుకున్నారు. అందులోనే పొర్లండి?" అంటూ ఆ త్రిమూర్తులు
అంతర్థితులైనారు. ఇదీ జరిగిన సంగతి. ఈ నా రహస్యం ఎట్లా బయటపడిందో
నాకు తెలీదు. దేశభక్తులైన నా స్నేహితులు నన్ను పురుగును చూసినట్టు చూస్తు
న్నారు. నేను కాంగ్రెసు విరోధినని ఆ దేవతా మూర్తుల ఎదట ప్రమాణం చేసినట్టు
ఎట్లా బయటపడిందో నాకే తెలియటంలేదు. ఎంతో గండకత్తెర అయితేనే తప్ప
నేనంత మహాపాతకం చేస్తానా? ఇంతమాత్రంచేత నన్ను కాంగ్రెసు నుంచి బహి
ష్కరిస్తారా? నావంటి వాళ్ళకు స్థానం లేకుండా చేస్తే కాంగ్రెసు ఏమయేటట్టు. మీరే
ఆలోచించండి, న్యాయం చెప్పండి? నా స్థానంలో ఉంటే మీరేం చేస్తారు?

ముద్రణ : విశాలాంధ్ర, 28 సెప్టెంబరు 1952
(ఆదివారం సంచిక)

# ట్యూటర్

"వాణీ dear!"

"yes, జోయ్ dear!"

"ఇది విని ఏమిటో చెప్పగలవా?"

"కొత్త L. P. కొన్నావా? ఏదీ వెయ్యి. .. Sound of Music! ఆ మాత్రం తెలుసుకో లేననుకున్నావా? మళ్ళీ beginning నుంచీ వెయ్యి!"

వాణి టెలిఫోనుకు అంటుకుపోయింది.

జోయ్-అంటే జయరాం-దగ్గిర Hatari, My Fair Lady, Cleopatra మొదలైన పిక్చర్ల మ్యూజిక్ బోలెడంత వుంది.

వాణీ, వాణీ బ్రదర్స్ జోయ్, జోయ్ సిస్టర్స్ మక్, మక్ బ్రదర్స్ అండ్ సిస్టర్స్-వీళ్ళంతా కలిసి ఒక smart set. వీళ్ళతండ్రులు లక్షలు సంపాదించే వాళ్ళు. వాళ్ళ జీవితంలో ఉత్సాహోద్రేకాలు సముద్రపుకెరటాల్లాగా అనుక్షణమూ వస్తూ పోతుంటాయి. వాళ్ళ హీరోలు beatles, వాళ్ళ ఆదర్శ సాహిత్యం Play-boy, Femina, Readers Digest మరీ మేధావులు చదివి జీర్ణించుకునేది.

అరగంట అయాక వాణి, "ఇక పెట్టేస్తాను dear. మా tutor వచ్చే వేళయింది. Deadly bore కాని duty's duty, Cheerio!" అంటూ టెలిఫోన్ పెట్టేసి తల ఎత్తి చూసేసరికి, "deadly bore" రాజశేఖర్ గదిలో ఓ మూల కూర్చొని ఏదో రాసుకుంటున్నాడు.

ఎవరూ చూడకపోయినా అలవాటు చొప్పున వాణి నవ్వుకొంటూ నాలుక కొరుక్కున్నది.

"Sorry, teacher! Kept you Waiting" అన్నది వాణి. చెంగు చెంగున దూకుతూ వచ్చి అతను కూర్చున్న కుర్చీ పక్క సోఫాలో కూలబడుతూ. సోఫాల్లో కూలబడటమూ వాటిల్లోంచి చెంగున ఎగరటమూ వాణీకి చాలా ఇష్టం.

"ఫరవాలేదు వాణీ. నేను నాసొంతపని చూసుకుంటున్నాలే. At your expense."

వాణి serious ఐపోయి, Protest చేస్తున్నట్టుగా, "మీరెప్పుడూ డబ్బు గురించే ఆలోచిస్తారేం, టీచర్?" అన్నది.

శేఖర్ చాలా slow fade - in లాగా నవ్వుతూ, నీబోటి charming girl కు డబ్బు కోసం ట్యూషన్ చెప్పాలిసిన గతి నీకు పట్టిందనుకో, నువ్వూ

డబ్బు గురించే ఆలోచిస్తావు. అరగంట waste అయింది. నీ పుస్తకాలు తెచ్చు కుంటావా? నా కవతల అయిదు గంటలకు engagement ఉంది. లేకపోతే ఇబ్బంది లేకపోను."

"I' m so so....rry, teacher. అవతల ఓ ఫ్రండ్ Sound of Music వినిపిస్తున్నాడు. మీరు పిక్చర్ చూశారా, టీచర్?"

"లేదు. నేను afford చెయ్యలేనంటే నువు Protest చేస్తావు— మళ్ళీ డబ్బుమాటే ఎత్తుతున్నానని?"

"తప్పక protest చేస్తాను. మీ కేమన్నా డబ్బు ఇబ్బందుంటే చెప్పరాదా, టీచర్?"

"చెప్పకూడదు, వాణీ. నాబోటివాడు charity తీసుకోకూడదు. నా అవసరా లకు సరిపడే డబ్బు సంపాదించుకునే శక్తి నాకున్నది. అవకాశాలే లేవు. ఎందుకు లేవో కూడా నాకు తెలుసు."

'ఎందుకు లేవు, teacher?'

"నాబోటివాడు చెయ్యవలసిన పనులు నాకన్న cheap fellows చేసేస్తు న్నారు. Bad coin good coin ను circulation నుంచి తోసేసినట్టు Gresham's Law! అదో కారణం."

"ఇంకా?"

"Charity మీద బతికేవాళ్ల too many గా ఉంటున్నారు ప్రపంచంలో. సొసైటీకి useful గా ఉండేవాళ్ళు ఆర్జించవలసిన డబ్బు ఆ chanel లో పోతున్నది. అదో కారణం."

"చూశారా, teacher? మీరు డబ్బు గురించే ఇంతసేపూ మాట్లాడు తున్నారు!" అన్నది వాణి తన పాయింటు నెగ్గించుకున్న ఉబలాటంతో.

శేఖర్ చుట్టూ కలయజూసి, "ఈ గదిలో డబ్బుకు దొరకనిది ఒక్కటికూడా లేదు. నీకో్క్రపం రాకుండా ఉంటే ఈ గదిలో ఉన్నవాటన్నిటిలోకి చవుక అయింది నా బుర్రే!" అన్నాడు.

వాణి కాస్సేపు సోఫామీద పైకీ కిందికీ ఎగిరి, "మీరింతకుముందేమిటి రాస్తున్నారు?" అన్నది.

"రాయటం కాదు, తిరగరాస్తున్నాను. నాటకం అయిదుగంటలకు రిహార్సల్ ఉంది!" అంటూ శేఖర్ గడియారం చూసుకున్నాడు.

"అయితే మీరు నాటకాలు రాస్తారా?" అన్నది వాణి ఆశ్చర్యంగా.

"నాటకా—లూకాదు, నాటకం అను. ఇది నా మొదటి నాటకం."

"ఇది రాసినందుకు మీకేమిస్తారు, టీచర్?"

"ఇచ్చేందుకెవరున్నారు? నాటకం ఆడేవాళ్ళకూడా ఏమీ ఇవ్వరు, ఇదంతా worthless activity."

"నాటకం ఓవేళబాగుంటే అప్పుడు మీకు Plenty of money! Plenty of name, fame! అవునా టీచర్?"

శేఖర్ మళ్ళీ తన చిరునవ్వును slow fade-in చేశాడు. ఏమీ అనలేదు.

*　　　*　　　*

వాణి ఉండే ప్రపంచం వేరు, శేఖర్‌ది వేరు. ఈ రెండూ ఎక్కడా అంటవు. ఆఖరుకు వాణి స్టడీ రూమ్‌లో కూడా ఒకదానికొకటి సమీపంగా వస్తాయిగాని వాటి మధ్య స్పర్శలేదు.

వాటికి జీవితం ఒక variety programme. గడిచే క్షణమే ఆమెకు focus లో ఉంటుంది. బీదవాళ్ళు కష్టాలు పడతారనీ, దారిద్ర్యం ప్రపంచంలో ఉందని వాణికి తెలుసు. కాని అటువంటి విషయాలను గురించి ఆమెకు గలిగే భావాలు, ఏ సినిమాలోనో, నవలలోనో పాత్రలు అనుభవించే కష్టాల మూలాన కలిగే లాంటివే. అవి ఆమెలో ఒక ప్రత్యేక చైతన్యాన్ని కలిగించవు. తనకు సమీపంలో ఉండే నౌకర్ల ఆర్థిక చిక్కులను తాను ఎంత సులువుగా పరిష్కరించ గలదో ఆమెకు తెలుసు. అందుచేత ప్రపంచంలో ఉండే అసహాయుల సమస్య ఆమె కొక పెద్ద సమస్యగా కనిపించేది కాదు.

వర్కర్లూ, సమ్మెలూ, గలాటా, వాళ్ళ విప్లవాలూ, వాళ్ళ రాజకీయాలూ, సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ—ఇదంతా ఒక ఉన్మాదమని వాణి తన మనసులో నమ్మేది. వాటిని గురించి అట్టే ఆలోచించేది కాదు.

జీవితం సబ్బునీళ్ళలాంటిది. అట్టడుగున మురికి, దానికి ఎగువగా నీరు, ఇంకా ఎగువన బుడగలు. వాణి వంటివాళ్ళు ఆ బుడగల మధ్య జీవిస్తారు. జీవితం రంగురంగులుగా, అందంగా ఉంటుంది. కాని అందులో సారం చాలా తక్కువ. వాణికి ఏ జీవిత సమస్య గురించీ ఏమంత తెలీదని చెప్పొచ్చు.

ఆఖరుకు ప్రేమను గురించికూడా ఆమెకు చెప్పకోదగినంత నమ్మకం లేదు. Fun! జీవితంలో fun చాలా ఉంది. Young men nice గానూ naughty గానూ ఉంటారు. కొందరు nice గా మాట్లాడి, naughty గా ప్రవర్తిస్తారు. మరి కొందరు naughty గా మాట్లాడుతారు గాని, వాళ్ళ ప్రవర్తన nice గా ఉంటుంది. కొందరు bold గా ఉంటారు. కొందరు పిరికివాళ్ళు. వాణి తనకుతాను average కింద వేసుకున్నది. ఆమె స్నేహితురాళ్ళలో కూడా bold గానూ, naughty గానూ ఉండేవాళ్ళున్నారు. Girls ను kiss చెయ్యటానికి young men రకరకాల వంకలు కనిపెడతారు. అందులో కొందరు clever, కొందరు crude కాని అదంతా fun.

ఒక్కటి నిజం. ప్రేమకూ, పెళ్ళికి ఏమీ సంబంధం లేదు. ఈ విషయం lower middle class కుండే భ్రమలు upper middle class కుండవు. వాణికి అటువంటి భ్రమ లేమీ లేవు. వాణి జౌళి పరిశ్రమను పెండ్లాడ బోతున్నది. ఆమెకు కాబోయే భర్తను నిర్ణయించిన శక్తులేవో ఆమెకు తెలీదు. అవి వర్తమాన పారిశ్రామిక సాంఘిక రాజకీయాలకు సంబంధించినవి.

కిందటి spring లో వాణిని చేసుకోబోయే వాడు వచ్చాడు. వాణితో చాలా nice గా behave చేశాడు. Kiss చెయ్యాలని కూడా ప్రయత్నించలేదు. Engagement ring తో బాటు ఒక sweet little watch కూడా present చేశాడు.

వాణి అతన్ని తన set లో అందరికీ present చేసింది. అది మంచి gala party. అయితే అందరూ proper గా behave చేశారు. అతను ఎలా ఉన్నాడని formal గా అందర్నీ అడిగింది.

"Wooden" అన్నాడు జోయ్.

సహజంగా వాణి తన కాబోయే భర్తను defend చేసుకున్నది.

Pharmaceuticals కూ, textiles కూ పెళ్ళి జరిగేటప్పుడు, మనమూ మనమూ మాట్లాడుకున్నట్టుగా కట్నాలు మాట్లాడుకోరు. కాని కాబోయే భర్త వాణిని ఒక విషయం personal request చేశాడు; వాణి బాగా హిందీనేర్చుకోవాలి. జౌళి పరిశ్రమ చేసే విజ్ఞాపన ఆజ్ఞతో సమానం.

అందుకే ఈ ట్యూషన్. శేఖర్ వాణికి హిందీ నేర్పటానికి ప్రయత్నిస్తున్నాడు.

వాణి ఆ హిందీని slow motion లో నేర్చుకుంటున్నది. తనకు ఎంత హిందీ వచ్చిందన్నది ఆమెకు ప్రదానంగా కనపడలేదు— హిందీ నేర్చుకోవటానికి ఎంత ఖర్చు చేశామన్నదే తన effort కు కొలబద్ద అని ఆమె భావించింది.

ఇప్పటికామె వెయ్యి రూపాయల హిందీ నేర్చుకున్నది. Note చేసుకోండి కావలిసే.

శేఖర్ శషభిషలు పనికిరాని మనిషి. అతనికి సార్థకంగా బతకాలన్న ఆశయం తప్ప మరే ఆశయమూ లేదు. "అర్థం" అంటే డబ్బు అనే అర్థం కూడా ఉన్నదని జీవితం అప్పుడప్పుడూ జ్ఞాపకం చేస్తూ ఉంటుంది. అప్పుడతను చిరాకు పడతాడు. డబ్బంటే అతనికి గౌరవం లేదు. కాని డబ్బు అవసరం ఉన్నది. తనకే పుష్కలంగా డబ్బుంటే తాను చేయదలచుకున్న పనులు మరింత హాయిగా చేసుకొని ఉండేవాడని అతను ఒకప్పుడు అపోహ పడ్డాడు. కాని ఆ అపోహ తొలగిపోయింది. డబ్బు పుష్కలంగా ఉండి దాన్ని ఖాతరు చెయ్యనివాళ్లు ఏ ఆశయమూ లేకుండా

జీవిస్తున్నారు. లేదా, మరింత డబ్బు సంపాదించటమే జీవిత లక్ష్యంగా జీవిస్తున్నారు.

అర్థ సాధనకే కృషి చెయ్యాలి. కృషిచేసి మన ఆశయాలకు అనుగుణంగా ఉంటే, దాని ద్వారా ఎంత డబ్బు వచ్చినా చింతించరాదు. ఏమీ రాకపోయినా విచారించరాదు. శేఖర్ ప్రస్తుతం ఆ దృక్పథంలో ఉన్నాడు.

అతని ఆశయం నాటకాలు రాయటం. అతను ఇంగ్లీషులోనూ, హిందీలోనూ, తెలుగులోనూ అనేక నాటకాలు చదివి, ఒక నిర్ణయానికి వచ్చాడు. నాటకాలను అనువదించటం వృథా. షేక్స్పియర్ నాటకాలు గాని, షా నాటకాలు గాని తెలుగులోకి అనువదిస్తే తెలుగు నాటకాలు కావు. ఏ జాతికి కావలసిన నాటకాలు ఆ జాతి, తన భాషలో సృష్టించుకోవాలి. కవిత్వం అనువదించటమే నిరుపయోగం. నాటకానువాదాలు ఇంకా నిరుపయోగం.

శేఖర్ ఏడాదినుంచీ ఒక నాటకం రాస్తున్నాడు. అది ఇటీవలనే ఒక రూపం దాల్చింది. ట్రూప్ అందుబాటులో లేనివాళ్ళు నాటకాలు రాయగూడదు. వాటిని ఎవరు ఆడతారు? రిహార్సల్స్‌తోబాటు రచన సాగుతూనే ఉండాలి. చదవటానికి బాగున్నట్టుండి మాట వినటానికి ఇంపుగా ఉండకపోవచ్చు. కథల్లో అతను చాలా భయంకరమైన సంభాషణలు చూశాడు. వాటిని ఎవరన్నా నోట అంటే తప్ప, ఎంత చెత్తగా ఉన్నదీ తెలీదు. నాటకంలో అటువంటి సంభాషణ మచ్చుక్కూడా ఉండ గూడదు.

నాటకాలూ, రిహార్సల్సూ శేఖర్‌కు కొత్త కాదు. అతను రేడియోకూ, విద్యార్థులు ఆడటానికీ నాటకాలు రాశాడు విద్యార్థులచేత రిహార్స్‌చేయించాడు కూడా. అయితే సంపూర్ణమైన స్టేజి నాటకం రాయటమూ, స్టేజి అనుభవంగల ఎమెచూర్ నటులచే రిహార్స్ చేయించటమూ ఇదే మొదలు.

రిహార్సల్ అతను అనుకున్నదానికన్న బాగానే జరిగింది. ఒక నటుడూ, ఒక నటీ బొత్తిగా miscast గా కనిపించారు. వాళ్ళు తమ పాత్రలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించినట్టు కూడా లేదు. ఆ నటుడి వాచికం ఘోరం. చాలా బరువుగా మాట్లాడుతున్నాననుకొని "అ- మామగారూ అ—పార్వతిని అ—మీయింటివద్దనే ఉండనివ్వండి." అన్న ధోరణిలో మాట్లాడతాడు. ఏనాడో శేఖర్ పుట్టక పూర్వం స్టేజిమీద ముఖ్యపాత్రలు ధరించే చౌకబారు నటులంతా అట్లాగే మాట్లాడేవారుట. నటుడుగా పేరుమోసిన శేఖర్ పెత్తండ్రి వాళ్ళను imitate చెయ్యటం శేఖర్‌కు బాగా జ్ఞాపకం.

అసలే నాటక ప్రదర్శనం తుమ్మితే ఊడే ముక్కులాగుంది. నటులంతా ఔత్సాహికులు. వాళ్ళు ప్రస్తుతానికి డబ్బు అడగటంలేదు. ఈ నాటకం ఆర్థికంగా విజయవంతం కావటమూ, నటులకు తృణమో, పణమో ముట్టటమూ అనేది ప్రస్తుతానికి పగటికలే. అటువంటప్పుడు శేఖర్ నటులను మార్చాలని పట్టుబడితే ఏం బాగుం

టుంది ? వాళ్ళను సరిదిద్దటానికే అతను జంకుతున్నాడు.

"చూడండి. సూర్యంగారూ, 'మావగారూ' అనండి. 'మామగారూ' అంటే నోటి మాటగా వినిపించటంలేదు." అన్నాడు శేఖర్.

సూర్యంగారు కాస్త offend అయినట్టు కనబడ్డాడు.

"ఇక్కడున్నట్టు చదువుతున్నాను. మార్చి చదవమంటే అలాగే చదువు తాను ...మ్ ... మామగారూ ! "

చదివేస్తే ఉన్నమతి పోయిందన్నట్టయింది. శేఖర్ అతని ఉచ్చారణ భారాన్ని దేవుడికి వదిలేశాడు.

ఆ స్థితిలో మరో నటుడు దేవుడల్లే అడ్డుపడి, "మామ్మగారూ ఏవిట్రా ? మామూలుగా మాట్లాడినట్లు, మావగారూ అనలేవూ ?" అని సూర్యంగారిని కోప్పడ్డాడు.

రిహార్సల్స్ సాగినకొద్దీ నటులు నాటకం mood లో పడ్డారు. వాళ్ళ పాత్రల మనస్తత్వాలను గురించి చర్చించుకోవటం శేఖర్ చెవిని పడింది. అది మంచి లక్షణమని అతనికి తోచింది. నటులకు నిజంగా పాత్రలలో ఆసక్తి పుట్టిననాడు నాటకం రక్తికట్టే అవకాశం ఉంది.

Miscast అనుకున్న ఆడకూతురు కూడా తన పాత్రను కొంతవరకైనా అర్థం చేసుకుంటున్నట్టు కనబడింది.

నాటకానికి కావలసిన సెట్టింగు ఒక సినీ ఆర్టు డైరెక్టరు ముడివస్తువుల ఖరీదుకు తయారుచేసి పెట్టాడు. నాటకంలో ఉండే మూడు అంకాలకూ ఒకటే సెట్టింగు.

హాలు బుక్కయింది. టికెట్లు అచ్చేశారు.

శేఖర్ కాంప్లిమెంటరీ టికెట్లు ఒక అరడజను తెచ్చి వాణికిచ్చాడు.

"మీ నాటకమే కదూ, టీచర్? ఇన్ని టికెట్లు దేనికి, టీచర్, మా ఫ్రెండ్స్‌కు ఇవ్వమంటారా? Thank you very much, teacher. I heartily wish the drama success, teacher. దీనికి back-ground music ఉందా, టీచర్? మక్‌తో చెదితే ఓ electric guitar, ఓ piano, ఓ double bass, ఓ bow, drum ఏర్పాటు చేసేవాడే?" అన్నది వాణి ఉత్సాహం పొంగి పొర్లిపోతూ.

"ఇది అంత high - class production కాదులే, వాణీ! నాటకానికి వీలుంటే రండి. ఇంకా టికెట్సు కావాలంటే అడుగు ఇస్తాను. Of course, no obligation కాంప్లిమెంటరీలిచ్చిన మాత్రాన show చూడాలని ఏమీ లేదు."

"అదేమిటి, టీచర్. తప్పక ట్రై చేస్తాను. మా friends కూడా వస్తారు." అన్నది వాణి.

"Very nice of you!"

"టికెట్స్ sold out అయ్యాయా?"

శేఖర్ నవ్వి "ఈ మహాపట్నంలో టికెట్లు sell out కావటం కూడానా? అందరికీ అంటగట్టి డబ్బు వసూలు చేస్తున్నాం. అప్పటికి ఖర్చులు గిట్టుతాయో, లేదో తెలీదు," అన్నాడు.

వాణి తన చేతిలో ఉన్న టికెట్టుమీద "patron" అని చదివి, "patrons దగ్గిర ఎంత collect చేస్తున్నారు?" అన్నది.

"ఏమీ collect చెయ్యటం లేదు. గొప్పవాళ్ళు వచ్చి ముందు వరుసల్లో కూర్చుంటే నాటకానికి status వస్తుంది. అందుకని గొప్పవాళ్ళకు కాంప్లిమెంటరీ లిస్తున్నాం," అన్నాడు serious గా మాట్టాడుతున్నట్టుగా.

"No, no I'd like to pay! అందుకడిగాను."

"Dont bother! అంతగా అయితే show అయాక చూసుకోవచ్చు."
అన్నాడు శేఖర్.

మొత్తంమీద నాటకం సవ్యంగానే జరిగింది. Audience reaction బాగున్నట్టే కనబడింది. హాలుకూడా దాదాపు నిండింది. Patron లు సగంమందే వచ్చారు. వాణిగాని, ఆమె friends గాని రాలేదు—వస్తారని శేఖర్ అనుకోలేదు.

మర్నాడు శేఖర్ ట్యూషన్ చెప్పటానికి వచ్చినప్పుడన్నా వాణి ఆ విషయం ఎత్తలేదు. శేఖర్ అంతకన్నా ఎత్తలేదు. ఆదివారంనాడు ఇంగ్లీషు పత్రికలో శేఖర్ నాటకంమీద writeup చిన్నది పడింది. పట్నంలోని ఇంగ్లీషు పత్రిక తెలుగు నాటకం గురించి రాయటం చాలా అపూర్వం. రాసినవి రెండు ముక్కలయినా నాటకాన్ని ఆకాశాని కెత్తేశారు.

సోమవారంనాడు శేఖర్ రాగానే వాణి, "I'm so sorry, teacher ఆ రోజు నేను మీ నాటకానికి రానేలేదు. I clean forgot about it! చాలా బాగా review చేశారే! చూశారా?" అని million volt ల ఉత్సాహంతో అడిగింది.

"చూశాను, ఎవరో sympathiser రాసి వుంటాడు." అన్నాడు శేఖర్.

తెలుగు పత్రికలు కొంచెం దీర్ఘంగానే రాసి మెచ్చుకున్నాయి గాని, ఆ మెచ్చుకోలు చాలా కృత్రిమంగా ఉంది. ఒక పత్రిక ఆ నాటకం ఎట్లా ఉంటే ఇంకా బాగుండేదో కూడా చెప్పింది!

నాటక ప్రదర్శనంవల్ల నష్టమేమీ రాలేదు. ఇంకో ప్రదర్శనం వేసి ఇంత డబ్బూ వసూలు చేయగలిగితే నటులందరికీ తలా ఒక పాతిక రూపాయలూ మిగిలే టట్టు కూడా కనబడింది. మూడో ప్రదర్శనందాకా శేఖర్ తానేమీ కోరలేదు.

వాణి సహజంగా ఆ నాటకం గొడవ అప్పుడే మరచిపోయింది. కాని ఆ నాటకం ఆమెను వదల లేదు.

ఆ వారంలోనే ప్రొడ్యూసర్ మాధవన్ కూతురు వచ్చి, "కిందటి వారం ఒక తెలుగు డ్రామా చూశాను. అది రాసినది మీ హిందీ ట్యూటరుట కాదూ? Picturise చెయ్యటానికి మంచి theme. Daddy కి చెప్పాను. Wonderful possibilities!" అని తెగ పొగిడింది. ఆ అమ్మాయి తననే పొగడుతున్నంత గర్వంగా ఫీలయింది వాణి. ఆ రోజు శేఖర్ రాగానే ఆ శుభవార్త అతనికి అందించింది. శేఖర్‌లో చలనం లేదు.

"మాధవన్ మీ నాటకం పిక్చర్ తీస్తే మంచి ఛాన్స్, టీచర్! ఏమంటారు? I would befine fine!....మీరేమీ excite కారేం, టీచర్?"

Slow fade-in నవ్వు పెట్టి శేఖర్, "Excite అయి ఏం చేయను? చిన్న dance చేయనా?" అన్నాడు.

"You're the limit!" అని వాణి కోప్పడింది.

త్వరలోనే ప్రొడ్యూసర్ మాధవన్ శేఖర్ కోసం కబురు పెట్టాడు. ఆయనకు తెలుగు బాగా వచ్చును. శేఖర్ రాసిన నాటకమంతా చదివించుకు విన్నాడు. పక్కన తన script-writerను కూర్చోబెట్టుకొని మరీ విన్నాడు. Script-writer అర్థం చేసుకోలేని సంభాషణలు అరవంలో చెప్పాడు.

ఆ తరవాత నెలరోజులకు మళ్ళీ శేఖరుకు కబురు వచ్చింది. మాధవన్ అతని నాటకాన్ని అరవంలోనూ, తెలుగులోనూ తీయదలచుకున్నాననీ, అయిదు వేలిస్తాననీ, కథలో మార్పులు చేస్తాననీ అన్నాడు.

"హిందీలో తీసేటప్పుడు నేను సహాయ పడగలను. నాకు హిందీ బాగా వచ్చును. హిందీ పేపర్లకు వ్యాసాలూ అవీ రాస్తుంటాను" అన్నాడు శేఖర్.

"తప్పక పిలుస్తాను." అన్నాడు మాధవన్.

మర్నాడు శేఖర్ రాగానే, "Congrats, teacher, మంచి ఛాన్స్ కదూ? Nice publicity! Good income! కదూ?" అన్నది వాణి. అయిదువేల రూపాయలు ఒక్క పూటలో, ఒక్క పార్టీకి ఖర్చుపెట్టగల వాణి తమదగ్గర నెలకు నూరు రూపాయలు పుచ్చుకునే శేఖర్ దృష్టినుంచీ అయిదువేలు పెద్దమొత్తం అవుతుందని ఊహించ యత్నించింది. యాభై నెలల జీతం!

"నేనాసంగతి ఆలోచించలేదు. నా కథతో మాధవన్‌గారు ఏ అయిదులక్షలో సంపాదించాలని ఆశపడుతూ ఉండవచ్చు. పేరుకు ఆయన ప్రొడ్యూసర్. కాని ఆయన సంపాదించిన లక్షలన్నీ produce చేసి పెట్టినవాళ్ళు పైవాళ్ళు, నాబోటివాళ్ళు." అన్నాడు శేఖర్.

"ఏ industrialist ఐనా అంతే. మా ఫాదర్‌కూడా అంతే!" అన్నది వాణి.

"అదే నేనూ అనేది."

"కానీ వాళ్ళు తీసుకొనే risks మాటేమిటి?"

"ఎక్కువ risk తీసుకుంటే వాళ్ళను గురించి industrialistsగా ఎవరూ చెప్పుకోరు. నేనే పేరున్న వాణ్ణయితే ఆయన అయిదువేలిస్తా ననటానికి సాహసించే వాడా? నన్నడిగితే robbory అంటాను. Daylight robbory."

అతనన్నది ప్రొడ్యూసర్ మాధవన్ గురించి అయినా వాణికి కోపం వచ్చినట్టు కనపడింది.

"అలా అనుకుంటూ ఆ amount కు ఎందుకొప్పుకున్నారు, టీచర్?" అన్నదామె.

Necessity. నాబోటి వాళ్ళకు necessity అనేది ఒకటుంది, sister. ఒక్క విషయం అడుగుతాను. నాకు మీ daddy నెలకు నూరు రూపాయలిస్తున్నారు. ఈ ట్యూషనే యాభై రూపాయలకు చెప్పటానికి సిద్ధంగా వుండేవాళ్లున్నారు కనక నాకు మీరు overpay చేస్తున్నారనాలి. అచ్చా! నేను రోజుకు ఎన్ని ట్యూషనులు చెప్పగలను? మహాచెబితే మూడు చెప్పగలను. అందరూ generousగా వంద వంద చొప్పున యిస్తే నేను నెలకు మూడు వందలు సంపాదిస్తాను. Do you think it is a decent Income? you dont! అయితే నూరు రూపాయల ట్యూషను ఎందుకు accept చేశాను? Necessity! By the way నాకు ఇంకే ట్యూషన్లూ లేవు. ఈ ఎనిమిది నెలలనుంచీ నూరు రూపాయల మీదనే నేను సంసారం ఈడుకొస్తూ ఉండి వుండొచ్చు. కాని అది మీ concern కాదు. మీ stand-point నుంచీ మీరు generous గానే ఉన్నారు కాని నేను in theory, free agentను. ఎవరిదగ్గరికో వెళ్ళి, 'నాకీ సంపాదన చాలటంలేదు,' అని చెప్పుకోవటానికి లేదు. నేను survive కావాలంటే exploitationకు ఒప్పుకోవాలి. అందుకే ప్రొడ్యూసర్ మాధవన్ ఇచ్చిన చెక్‌ను thankful గా స్వీకరించాను. అదీ ఉన్న విషయం" అన్నాడు.

"Principle of free enterprise" అని వాణి ఏదో చెప్పబోయింది. కాని శేఖర్ అడ్డు తగిలాడు.

"ఈ ఫ్రీ ఎంటర్ ప్రయిజ్ classes మధ్యనేగాని, వ్యక్తులమధ్య లేదు. ఆ సంగతి నేను వేరే చెప్పనవసరంలేదు. నేను poor man అయితే నా భార్య poor woman అవుతుంది. నా పిల్లలు poor kids అవుతారు. నేను rich man అయితే, నా భార్యా, పిల్లలూ rich people అవుతారు. అందువల్ల free enterprise వెంటనే ఒక విధమైన కమ్యూనిజం కూడా వున్నది. Free enterprise భాగ్యవంతులనూ, బీదవాళ్ళనూ వేరు వేరు ప్రపంచాలలో ఉంచుతుంది. కమ్యూనిజం డబ్బునూ, దారిద్ర్యాన్నీ ఆ ప్రపంచాలలో సమంగా పంచుతుంది. ఇందులో పెద్ద secret ఏమీలేదు. Upper class communismతో అందరూ తమ అవసరాలను

overfulfill చేసుకుంటారు. Lower class communism లో తిండీ, బట్టా, మందులూ, educationకూడా ఉండవు. You simply have no idea what it is to starve-literally starve! నాకు తెలుసును. నేను చాలాసార్లు తిండి లేకప స్తులున్నాను."

వాణి సీరియస్‌గా ఆలోచించి, "అందుకే మీరింత bitterగా తయారయ్యారు," అన్నది.

"Bitterness is a fact of life! తిండికి మాడేవాళ్ళు ప్రపంచంలో కోట్లున్నారు. Bitterగా ఉండే హక్కు వాళ్ళందరికీ ఉన్నది."

"కావచ్చు. కాని rich people చేయగలిగిందేమిటి?"

"Plenty! పేదవాళ్ళ నుంచీ వాళ్లు ఆత్మరక్షణ చేసుకోవలసి వుంటుంది. రాజకీయ శక్తులను తమ అధీనంలో ఉంచుకోవాలి. పోలీసులనూ, తుపాకులనూ పేద వాళ్ళమీద freeగా ఉపయోగించాలి. Lifeను గురించి నిజంచెప్పే వాళ్ళను జైళ్ళలో కుక్కాలి. Democracy గురించి అబద్ధాలు ప్రచారం చేయాలి. ఏనాడు democracy అచ్చిరాదని తోస్తే ఆనాడు దాన్ని పక్కకు నెట్టెయ్యాలి. పరిస్థితి మరీ విష మిస్తే దేశాన్ని డిక్టేటర్ల చేతిలో పెట్టాలి. Bourgeois democracy డిక్టేటర్ షిప్‌నూ, మత మౌఢ్యాన్నీ ఆమోదించదు. కాని last analysis లో కమ్యూనిజం కంటె వాటినే బూర్జువా డెమోక్రసీ prefer చేస్తుంది; అమెరికా free country—కాని ప్రపంచంలో ఎక్కడ నియంతృత్వం ఉన్నా అమెరికా దాన్ని బలపరచటానికి ముందుకు వస్తుంది. That is capitalist democracy for you!" అన్నాడు శేఖర్. ఆరోజు పాఠం సాగలేదు.

* * *

వాణికి పెళ్ళయింది. ఆమె తన భర్తతో కాన్పూరుకు వెళ్ళిన రోజుల్లో భార్యా భర్తలు ఒక హిందీ పిక్చరుకు వెళ్ళారు.

టైటిల్సు చూస్తున్న వాణి అకస్మాత్తుగా "Why, that was my tutor," అన్నది.

శేఖర్ కథను హిందీలో కూడా తీశారు.

"నిజమా?'' అన్నాడు వాణి భర్త.

"Of course! చాలా nasty man! అతనికి rich class అంటే చాలా కోపం. Envy ఎప్పుడూ కమ్యూనిజం మాట్లాడేవాడు.'' అన్నది వాణి.

"ఈ పిక్చర్‌కు బాగా డబ్బు తీసుకుని వుండాలే ?" అన్నాడు భర్త.

"Oh yes ప్రొడ్యూసర్ మాధవన్ ఆయన్ని పిలిచి, ఉత్త storyకి five thousand ఇస్తే, దోపిడీ అన్నాడు. పస్తులుండేవాట్ట ! తనే చెప్పాడు. అటువంటి వాడు, అయిదువేలిస్తే తన stars ను thank చేయక rich people రాక్షసు లన్నట్టు లెక్చరిచ్చాడు !"

"ఈ కమ్యూనిస్టులంతా అంతే ! Skunks ! Bastards ! వాళ్ళకు culture ఏ కోశానా లేదు. Kill off the commies, ఈ దేశం బాగుపడు తుంది !" అన్నాడు వాణి భర్త.

ముద్రణ : సంవేదన (త్రైమాసిక) జూలై, 1968

[ఇంగ్లీషు మాటలను, వాక్యాలను విశేషంగా రచయిత వాడారు. కథా వాతావరణ చిత్రణలో భాగం ఇవి. ఈ కథలో చిత్రించిన వాతావరణం లాంటిది కొ. కు. ఇతర కథల్లో లభించదు. కొత్త వ్యాపారవర్గ సంస్కృతిని సన్నిహితంగా పరిశీలించినట్లు ఈ కథ ఒక దాఖలా—సంపాదకుడు]

# కార్మిక విజయం

కార్మిక నాయకుడికి స్వాగతం ఇవ్వటానికి వందలాది కార్మికులు ప్లాట్‌ఫారం మీద నిలబడ్డారు.

రైలింకా అంత దూరాన ఉండగానే, "కార్మిక నాయకుడికీ జై" అని స్టేషను కప్పు ఎగిరేట్టు అరిచారు కార్మికులు.

ఆగే రైలు ఒకటో తరగతి పెట్టెలోనుంచి కార్మిక నాయకుడు తొంగి చూశాడు పత్రికా విలేఖరుల కోసం.

కార్మిక నాయకుడి మొహం కనిపించగానే కార్మికులకు పారవశ్యం కలిగింది. గొంతుకులు బొంగురు పొయ్యేటట్టు జయధ్వానాలు చేశారు.

నాయకుడు రైలు దిగుతుండగానే వందలాది ఆయనను చుట్టుముట్టారు. పదిపది హేను సంఘాలవారు అతని మెళ్ళో దండలు వేశారు.

ప్రెస్ కెమెరాలు మెరిశాయి. పత్రికా విలేఖరులు నాయకుణ్ణి చుట్టుముట్టారు.

"ఏం చెప్పమన్నారు" అన్నాడు నాయకుడు.

"కొల్లాయి గుడ్డల[1] పారిశ్రామికులు, పారిశ్రామిక తగాదా పరిష్కార సంఘంవారి నిర్ణయాన్ని తృణీకరించి బోనస్ ఎగగొట్టనున్న సందర్భంలో, మీరు సమ్మె చెయ్యమని కార్మికులకు సలహా ఇస్తారా ?" అని ఒక పత్రికాదూత అడిగాడు.

"ఇది చాలా క్లిష్ట సమస్య. సాత్వికంగా అన్ని మార్గాలూ చూసిగాని సమ్మె నిర్ణయం చెయ్యరాదని నా మతం. మనం మహాత్మా గాంధి సత్యా హింసలను జవదాటటమంటే కార్మికోద్యమాన్ని ఉరితీయటమే" అన్నాడు కార్మిక నాయకుడు.

"ప్రస్తుతం రష్యా వహించే అంతర్జాతీయ పాత్ర ఏమిటి ?" అని మరొక పత్రికా సేవకుడడిగాడు.

"అమెరికా తెచ్చిపెట్టటానికి జంకే మూడవ ప్రపంచ యుద్ధాన్ని జూన్ 25న కొరియాతో రష్యా ప్రారంభించిన సంగతి అందరూ పత్రికలలో చదివి కూడా ఒక్కరూ తెలుసుకోవడంలేదు" అన్నాడు కార్మిక నాయకుడు.

"కొరియా వెనక ఒక రష్యాయే ఉన్నదా, చైనా కూడా ఉన్నదా ?"

"ఇకముందు ప్రపంచమంతా విస్తరించుకునేది రష్యా, చైనా సామ్రాజ్యాలే. ఇవి ఒకసారి ఏర్పడ్డాయో, ఆ తర్వాత ప్రజలు వాటిని పడగొట్టలేరు. అందుచేత అవి ఏర్పడకముందే జాగ్రత్తపడాలి."

---

1. కొల్లాయి గుడ్డల : టోపీ గుడ్డలు.

"ఫాసిజమును గురించి కూడా ఈ మాటలే విన్నాం."

"బోల్షెవిజం[1] కంటె ఫాసిజం[2] నయం."

"రష్యాలోనూ చైనాలోనూ ఉన్నది మార్క్సు[3] చెప్పిన కమ్యూనిజం కాదా?"

"గాంధీజం చూసిన తర్వాత నాకు మార్క్సిజంలో విశ్వాసం పోయింది. అయినా మార్క్సు చెప్పిన కమ్యూనిజం కొంతవరకు బ్రిటనులోనూ అంతకన్నా బాగా అమెరికాలోనూ అమలు జరుగుతున్నది."

"ఇంతకు కొల్లాయి గుడ్డల కార్మికులు సమ్మె చెయ్యాలని ఒత్తిడి చేస్తే ఏం చేస్తారు?"

"వద్దని సలహా యిస్తాను. కాదు కూడదంటే సమ్మె నడిపిస్తాను."

* * *

పత్రికా విలేఖరులతో గోష్ఠి కాగానే కార్మిక నాయకుడు కోసం వేచివున్న యాభైవేల రూపాయల కారులో ఎక్కి ఒక కోటీశ్వరుడి ఇంటికి వెళ్ళాడు. అతని మకాం అక్కడ ఏర్పాటు చేయబడింది.

అక్కడికి కార్మిక ప్రతినిధులు వచ్చి అతన్ని చూసి, యజమానులు తమకు బోనస్ సున్నా చుట్టటం గురించీ, తమ ఇక్కట్లను గురించీ చెప్పుకున్నారు.

---

1. బోల్షెవిజం : రష్యన్ విప్లవ విజయానికి (1917) లెనిన్ నాయకత్వంలో దోహదం చేసిన బోల్షెవిక్ పార్టీ భావజాలం - రష్యన్ కార్మికవర్గ విప్లవ ధోరణి. 1903లో జరిగిన రష్యన్ డెమాక్రటిక్ లేబరు పార్టీ రెండవ కాంగ్రెసులో - బ్రసెల్సు కాంగ్రెసులో - మెజారిటీ పక్షంగా ఎన్నికైన లెనిన్ అనుయాయులు బోల్షెవిక్కులు. రష్యన్ భాషలోని bolshinstvo అనే పదం నుంచి ఏర్పడినమాట. bolshinstvo అంటే మెజారిటీ అని అర్థం. మార్టోవ్ నాయకత్వంలోని ప్రతిపక్షాలు మెన్షివిక్కులు. ఇది Menshinstvo నుంచి ఏర్పడినమాట. అంటే మైనారిటీ వాళ్ళు అర్థం.
2. ఫాసిజం : చూడండి అరుణోదయంలో.
3. మార్క్సు : కార్ల్‌మార్క్సు (1818-1883). "తాత్వికులు ఇంతకాలం ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించడం మాత్రమే చేశారు. అసలు చేయాల్సింది దాన్ని మార్చడం" అన్న భౌతికవాది, చరిత్రకారుడు, ఆర్థిక సిద్ధాంతవేత్త, జర్మన్ విప్లవకారుడు. ఆయన ప్రతిపాదించిన ప్రాపంచిక దృక్పథమే "మార్క్సిజం". ఎంగెల్స్ దృక్పథం ఇందులో భాగం. మార్క్సిజం లోని మూలాలు : గతితార్కిక భౌతికవాదం, చరిత్రపట్ల భౌతికవాద దృక్పథం, వర్గపోరాటం, విలువ, అదనపు విలువ, సోషలిజం, కమ్యూనిజం, ఆచరణ,సిద్ధాంత జీవధాతవనీ, సిద్ధాంతం ఆచరణకు మార్గదర్శక మనీ నమ్మి ఉపదేశించి, ఆచరించి అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమాలకు

నాయకుడు అంతా విని కళ్ళు తుడుచుకుని డగ్గుత్తికతో "మనం అడుగుదాం. ఎట్లా బోనస్ ఇవ్వరో, ఎందుకివ్వరో చూస్తాం. మీరేం విచారించకండి. మీ హక్కులు కాపాడటానికి నేనున్నాను. యజమానులకు ఈ రోజే కబురు పెడతాను. వాళ్ళు వచ్చి నన్ను కలుసుకుని మాట్లాడిన తర్వాత అన్నీ తేలిపోతాయి" అన్నాడు.

కార్మిక నాయకుడికి ధనిక వర్గాలలో గల పలుకుబడిని కార్మికులు ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నారు. అతను బస చేసిన యిల్లే ఆ సంగతి ఎలుగెత్తి చాటుతున్నది. వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి యజమానుల ప్రతినిధులిద్దరు కార్మిక నాయకుణ్ణి చూడవచ్చారు. మేడపైన రహస్య సమావేశం జరిగింది.

సాయంకాలం పత్రికలన్నీ కార్మిక నాయకుడు చెప్పిన మాటలనూ, ఫోటోనూ ప్రకటించాయి. "కొల్లాయి కార్మికులు సమ్మె చేయరాదు. కార్మిక నాయకుని సలహా" అని ఒక పత్రికా, "బోల్షెవిజం ఫాసిజంకన్న భయంకరమైనది. కార్మిక నాయకుని ఉద్ఘాటన" "గాంధీజం మార్క్సిజంకంటె పవిత్రమైనది. కార్మిక నాయకుని అభిభాషణ." అని ఇంకొక పత్రిక పెద్ద హెడ్‌లైన్స్‌తో వేశాయి.

"సమ్మె మాటేమిటి?" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"ఇదుగో పత్రికలకు చెప్పానే, చూడండి. సమ్మె నాకు ఇష్టంలేదు" అన్నాడు కార్మిక నాయకుడు.

"ఆఁ రోజు! నువ్వు కార్మిక నాయకుడివి, నీ ధర్మం సమ్మెలు సాగించటం!" అన్నారు యజమానుల ప్రతినిధులు చిన్నబుచ్చుకున్న మొహాలతో.

"ఆ సంగతి నాకు మీరు చెప్పనక్కర్లేదు; పరిస్థితులు సమ్మె కనుకూలంగా లేవని నా అనుమానం."

"ఎందుకు లేవూ?"

"కార్మికుల్లో సమ్మె వద్దనేవాళ్ళున్నారు."

"అరే పాపం, వాళ్ళు బోనస్‌లు ముట్టక అలమటిస్తున్నారు!" అన్నారు యజమానుల మనుషులు.

"అదీకాక కొల్లాయి కార్మిక యూనియనుకు సమ్మె సాగించే డబ్బులేదు."

"దానికెంత కావాలి భాగ్యం?"

---

పునాదులు వేసిన తాత్వికుడు, వర్గపోరాట యోధుడు. కమ్యూనిస్టు ప్రణాళిక (1848), పెట్టుబడి (మూడు సంపుటాలు 1867, 1885, 1894) ఈ శతాబ్ది చరిత్రను కొత్త ప్రపంచంలోకి మలుపు దిప్పిన రచనలు. ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820–1895) మార్క్సు సహయోధుడు. సహ రచయిత, మిత్రుడు.

"అచ్చగా దానికే అయితే అంత ఫరవాలేదు. నేను ముందు నిలబడ్డానంటే సర్వవ్యాప్త సమ్మెకు తక్కువ జరగటానికి వీల్లేదు. అన్నీ ఆలోచించే సమ్మె పూనేశాను. కార్మిక ప్రతినిధులతో ప్రొద్దున ఆ మాటే చెప్పాను."

"అట్లాకాదు. ఈ సమ్మె జరిగే తీరాలి" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"ఎందువల్లా?"

"కొల్లాయి గుడ్డలు బేళ్ళకు బేళ్లు పడి ఉన్నాయి. దిక్కుమాలిన ప్రభుత్వం మిల్లులు మూయనివ్వదు. కొల్లాయి గుడ్డల ధరలు ఎంత పడాలో అంతా పడి పోయాయి. అంతర్జాతీయ అశాంతిచేత ఎగుమతులు సన్నగిల్లాయి. యజమానులు తమ రక్తం పిండి, కార్మికులకు జీతాలిస్తున్నారు. కార్మికులకు యజమానులు గార్డియనులని గాంధీజీ చెప్పాడు. కాని యజమానులు నానా అగచాట్లూ పడు తున్నారు. రెండు నెల్లపాటు సమ్మె నడిచిందో యజమానులు బ్రతికి బయట పడతారు."

"రెండు నెలలే? కార్మికులెట్లా తట్టుకుంటారు? వాళ్ళకు మళ్ళీ నెల జీతాలు వచ్చే రోజు దాకా తట్టుకుంటారేమో. వాళ్ళ వేడి చల్లారకుండా ఏమిటి చెయ్యటం?"

"అది నీ చేతిలో ఉన్నది. నువ్వు బహిరంగ సభలూ అవీ చేయించు. 144 వ సెక్షను పెట్టటానికి ప్రభుత్వం ఉన్నది. పై పని పోలీసులు చూస్తారు."

"సమ్మెవల్ల యజమానులకు లాభమని పత్రికలవాళ్లు బయట పెడితే?"

"పత్రికలను మేం చూసుకుంటాం."

"సమ్మె ఖర్చులు?"

చెక్ పుస్తకం బయటికొచ్చింది. అయిదంకెల మొత్తం పడింది. కార్మిక నాయకుడు నిర్లక్ష్యంగా చెక్కు మడిచి జేబులో పెట్టుకుంటూ పార్టీ నిధికి?" అన్నాడు. ఇంకొక చెక్కు చేతులు మారింది.

"నా సొంత ఖర్చులకు?"

నోట్లకట్ట ఒకటి చేతులు మారింది.

యజమానుల మనుషుల మొహాలు వికసించాయి. వాళ్ళు కార్మిక నాయకుణ్ని అభినందించి, అతని దేశభక్తిని కొనియాడి, శలవు పుచ్చుకున్నారు.

కొల్లాయి కార్మికుల యూనియన్ భవనంలో సభ జరిగింది. ప్రధాన కార్మిక ప్రతినిధులు ముగ్గురే ఉన్నారు.

కార్మిక నాయకుడు చెప్పాడు.

"యజమానుల మనుష్యులతో మాట్లాడాను. వాళ్ళు నయాన బోనస్ ఇవ్వరు. సేట్ మాకీచూస్ అంటే నాకు ఆతిధ్యమిస్తున్న దేశభక్తుడు - కూడా చెప్పిచూశాడు. కార్మికులు సమ్మె చేసే స్థితిలో లేరనీ, వాళ్ళకు సమ్మె సాగించే దీక్షా, ఐకమత్యమూ లేవనీ యజమానులు బహిరంగంగా అంటున్నారు. కార్మికుల తడాఖా యజమాను

లకు చూపవలసిన సమయం వచ్చిందని నా అనుమానం. అయినా సమ్మె నిర్ణయం చేయవలసినవారు మీరు. మీ నిర్ణయాన్ని నేను అమలు జరపగలవాణ్ణి మాత్రమే."

కార్మిక ప్రతినిధులన్నారు.

"యజమానులు బోనస్ ఎగగొట్టే పక్షాన సమ్మె జరగవలసిందే."

"ముందే చెబుతున్నాను. నేను సమ్మె నడిపితే అది సమగ్రంగా చివరల్లా జరగాలి. కార్మికులలో ఐకమత్యం ఉండేటట్టు చూసే బాధ్యత మీది. వారు కష్టా లకూ, పోలీసుల దెబ్బలకూ తట్టుకునేటట్టు చూసే బాధ్యత కూడా మీదే. ఇది చాలా పెద్దవిషయం. కార్మిక ప్రతిఘటన చరిత్రలో శిలాక్షరాలతో లిఖించబడే సమ్మె. కనీసం మూడు నెలలైనా సమ్మె జరపటానికి మీరు సిద్ధంగా ఉండాలి మరి?"

కార్మిక ప్రతినిధులకు వేడెక్కింది. వాళ్ళడిగారు—

"మా యూనియనులు సిద్ధమే. మీ నాయకత్వం కింద ఉన్న ఇతర యూని యనులు సానుభూతి సమ్మెలు జరిపేలా చూస్తారా?"

"అదంతా నాకు వదలండి."

"కొల్లాయి కార్మికులలో కొందరు మన విరోధుల నాయకత్వం కింద ఉన్నారు. వాళ్ళు సమ్మెలో చేరక సమ్మె భగ్నం చేస్తారేమో?"

"వాళ్ళెంతమందిలే, మనం సర్వవ్యాప్త సమ్మె ప్రారంభించగానే వాళ్ళు తప్పక సమ్మె చేస్తారు, సందేహంలేదు."

కార్మికుల జీతాలుముట్టిన మర్నాడే సమ్మె ప్రారంభమైంది. మర్నాటికల్లా సమ్మెలో చేరినవారి సంఖ్య మూడింతలయింది. సమ్మె జరిగిన నాలుగోరోజున కొల్లాయి గుడ్డల మిల్లులన్నీ దాదాపు మూలబడ్డాయి. నగరమంతటా సానుభూతి సమ్మెలు జరిగాయి. పత్రికలు సమ్మెకు ప్రాముఖ్యం ఇచ్చాయి. సమ్మెవల్ల రోజుకు ఎన్నివందల కొల్లాయి గుడ్డల ఉత్పత్తి నిలిచి పోతున్నదీ, ఫ్యాక్టరీలకు రోజూ ఎన్ని వేలు నష్టం వస్తున్నదీ అంచనా లివ్వబడ్డాయి.

నగరంలో 144 వ సెక్షను అమలు జరిగింది. కార్మిక నాయకుడు బ్రహ్మాండ మైన ఊరేగింపులూ, బహిరంగ సభలూ జరిపాడు. కార్మికులు ప్రశాంతంగా ఉన్నంతవరకూ 144 వ సెక్షను నిద్రపోయింది. కార్మిక నాయకుణ్ణి ఎవరూ అరెస్టు చేయలేదు.

రానురాను కార్మికులకు వేడెక్కింది. కొందరు ఊరేగింపులతో బాటు విధ్వంసక చర్యలు ప్రారంభించారు.

సమ్మె ప్రారంభమై ఇరవై రోజులై, పత్రికల్లో ప్రకటిస్తున్నంత నష్టం వస్తున్నప్పటికీ, యజమానులు రాజీ బేరాలకు ఎందుకు రారో కార్మిక ప్రతినిధులకు అర్థంకాలేదు.

కార్మికులు విధ్వంసక చర్యలు చేస్తున్నారని ప్రభుత్వం పోలీసులను ప్రయో

గించారు. పోలీసులు తుపాకులు పేల్చారు. తుపాకులు కార్మికులను పేల్చాయి. కొందరు కార్మికులు చచ్చారు.

"సమ్మెకు కొత్తబలం వచ్చింది" అన్నాడు కార్మిక నాయకుడు.

* * *

యజమానుల పరిస్థితి చక్కబడింది. సమ్మె మూలంగా కార్మికుల కివ్వ వలసిన జీతాలు అనేక లక్షలు ఆదా అయింది. నిలవ ఉన్న సరుకు మంచి ధరలకు చేయివదిలింది.

సేట్ మాకీ చూస్ భవనంలో కార్మిక ప్రతినిధులూ, యజమానుల ప్రతినిధులు కూడా కార్మిక నాయకుణ్ణి కలుసుకున్నారు.

"ఎందుకొచ్చిన సమ్మె? ఇప్పటికైనా కార్మికులు పనిలోనికివస్తే తీసుకుంటాం. పరిష్కార సంఘంవాళ్ళు సిఫార్సు చేసిన బోనసు ఇవ్వలేం. ఇస్తామన్న నెల రోజుల జీతం ఎట్లాగు ఇస్తాం. ఎవరిమీదా ఎట్టి చర్యా తీసుకోం. చచ్చిన కార్మికుల్ని బ్రతికించలేంగాని, అరెస్టయిన కార్మికుల్ని విడిపించమని ప్రభుత్వాన్ని వేడుకుంటాం" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"సమ్మె చేసిన రోజుల్లో మా జీతాల మాటేమిటి?" అన్నారు కార్మిక ప్రతినిధులు.

"అది మా వల్ల కాదు."

కార్మిక ప్రతినిధులు కార్మిక నాయకుడివంక చూశారు.

ప్రస్తుత అంతర్జాతీయ దుస్థితినిబట్టి సమ్మె ఆపటం మంచిదని నాకు గాంధీఃం చెబుతోంది. కార్మికులు నష్టపడ్డారు. నే నెరుగుదును. కాని యజమానులకు అంతు లేని నష్టం కలిగింది. సమ్మె విజయవంతమయింది. కార్మిక నాయకులు రాజీకి వస్తున్నారు. కార్మికులు నైతిక విజయంతో తృప్తి చెందటం ధర్మం. లొంగిన వాళ్ళను కుంగదీయడం అహింసా విధానం కాదు.

కార్మిక ప్రతినిధులు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. తమ నాయకుడి సలహా శిరసావహించారు.

"సరి అయిన తరుణంలో కార్మికులకు సరి అయిన సలహా" ఇచ్చినందుకు పత్రికలు కార్మిక నాయకుణ్ని ప్రశంసించాయి.

తరువాత రెండు మూడు రోజులకు కార్మిక నాయకుడు మరో నగరం వెళ్ళినట్టు పత్రికల్లో పడింది. కాని ఆయనకు స్టేషను వద్ద కార్మికులు వీడ్కోలిచ్చినట్టు పడలేదు.

—ముద్రణ : జనవరి 1955, ఆడజన్మ కథల సంపుటి
దేశికవితా మండలి, విజయవాడ

# కర్మసిద్ధాంతులు

ఈ కాలంలో పదిమంది బంధువులొకచోట కూడటమంటే అది కేవలం దైవికంగా జరగవలసిందేగాని మానవ యత్నంవల్ల జరిగే విషయమా? అందులోనూ మాది చాలా పెద్ద బలగం. మా తాతయ్యకు ఆరుగురు కొడుకులూ, అయిదుగురు కూతుళ్ళూను. మాతరం వాళ్ళం ఇరవై అయిదుగురం ఉన్నాం. అందులో యింటి పేర్లు మార్చేసుకున్న పదముగ్గురాడపిల్లల్ని మినహాయించినా పన్నెండు మందిమి ఉన్నాం. మా తరవాత అప్పుడే ఒక తరం తయారయ్యింది. చెప్పొచ్చిందేమిటంటే మా బలగం పెద్దది. అయితేనేం? నామటుకు నేను ఆయిన వాళ్ళను చూసి దాదాపు అయిదేళ్ళయింది. మా రాముడు బావా, రాఘవులన్నయ్యా ఢిల్లీలో వున్నారు. ఉమాపతి బొంబాయిలో ఉన్నాడు. సుబ్రహ్మణ్యం కలకత్తాలో ఉన్నాడు. కృష్ణమూర్తి బెంగుళూరు బదిలీ అయ్యాడు ఈమధ్యనే. కాంతారావు విశాఖపట్నంలో ఉంటున్నా ఎవరికీ ఉత్తరంముక్క రాయడుగదా. శ్రీనివాసులు సికింద్రాబాదునుంచి పుష్కరానికోసారిగాని బయలుదేరడు. వాడికి పిల్లలు పుడుతున్నారు, పెళ్ళిళ్ళై అత్తవారిళ్ళక్కూడా పోతున్నారు. వాళ్ళని మేం చూస్తే కూడా గుర్తుపట్టలేం. ఇదంతా చెప్పుకుపోతే మహాభారతమంత గాధ అవుతుంది. పరిస్థితి బోధపడుతూనే ఉంది కాదూ?

నిజానికీ విచ్ఛిత్తి మా తాతయ్య బతికుండగానే ప్రారంభమయింది. మా పెదనాన్న సూరయ్యగారు దారితీశారు. ఆయన రంగూనుకు బయలుదేరిన మరుసటి ఏడు కాబోలు మా రెండో పెదనాన్న చదువువంకపెట్టి కలకత్తా బయలుదేరాడు. మా నాన్న పెళ్ళి కాగానే మద్రాసుమీద ఆశలుపెట్టుకున్నాడు; ఎందుకంటే మా రెండో మేనమామ మద్రాసులో ప్లీడరు ప్రాక్టీసు పెట్టి, మద్రాసులో వ్యాపారం పెట్టమని మా నాన్నకి పురెక్కించాడు. మా నాన్న తరవాతవాళ్ళు మా తాత బతికుండగా కవలలేదు.

అప్పటికీ మా తాత ఒక్కటిమాత్రం సాధించగలిగాడు. ఏటా ఆయన దేవీ నవరాత్రులకు కళశం పెట్టేవాడు. ఆ సమయానికి ఎక్కడెక్కడ ఉన్నవాళ్ళూ కొంప చేరుకోవలసిందే. ఆ పదిరోజులూ ఇల్లు మహావైభవంగా ఉండేది. రకరకాల వయస్సులుగల ఆ ఆడ మగమూకను చూసుకుని మా తాత చాలా సంతోషించేవాడు. "నేను దేహంవిడిచేనాటికి అందరూ నా చుట్టూ ఉండితీరవలసిందే", అని ఆయన అనేవాట్ట. మొత్తానికి అంతపనీ చేసి ఆయన, నేను పేదవాణ్ణయి ఉండగా నవరాత్రుల్లోనే పోయాడు! జాతక మంటే ఆయనదీ.

జాతకమంటే జ్ఞాపకం వచ్చింది. మా సుబ్బయ్య బాబాయి గొప్ప జ్యోతిష్కుడు. నాకు జ్యోతిష్కంలో అంత నమ్మకం లేదు. కాని ఆయన చెప్పినవి చాలా జరిగినాయి. ఇది తెలిసి ఉండటంవల్లనే నేను జ్యోతిష్యాన్ని పూర్తిగా కొట్టెయ్యలేను. కలకత్తా యూనివర్శిటీలో బియ్యే పాసయిన మా శేషగిరి పెదనాన్న 1930లో చచ్చే ఖాయిలా పడ్డాడు. ఆయన తిరిగి కోలుకుంటాడని ఎవరూ అనుకోలేదు. మా సుబ్బయ్యబాబాయి ఆయన జాతకంచూసి, నీకు 1935దాకా ఏమీ ఢోకా లేదు. తరవాతి సంగతి చూసుకుందాంలే, అని చెప్పేశాడు. శేషగిరిగారు మళ్ళాలేచి తిరిగారు. 1935 మే నెలలో వడదెబ్బతగిలికాదూ ఆయన పోయిందీ? ఇటువంటివి కళ్ళారా చూసికూడా జ్యోతిషంలో ఏమీ లేదనటం ఎట్లా? తొందరపడకండి. మీరనపోయేది నాకూ తెలుసు. నేను మీతోనూ ఏకీభవిస్తాను. రాసి పెట్టి ఉంటే భోజనం చెయ్యలేక పోతామా అని ఎవరమూ హాయి రాజెయ్యకుండా ఉండడంలేదు. కార్యకారణ సంబంధం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం. ఫలాని రోగాలకు ఫలాని మందులిస్తున్నాం. దేశంలో సమృద్ధి ఉంటే జాతులు బాగుపడుతున్నాయి. లేకపోతే పురుగు ముట్టి పోతున్నాయి. అంతా నాకు తెలుసు కాని...

అసలు విషయం మరిచాను. కిందటి మార్చ్‌లో తలవని తలంపుగా— దైవికంగా అని కాదూ అన్నానూ?—ఈ విసిరి పారేసిన బలగంలో పాతిక మందిమి ఒక్కచోట కలిశాం. ఏ కార్యకారణ సంబంధంవల్ల కలిశామో నాకు తెలీదు. కొందరికి కబుర్లు వెళ్ళినమాట నిజమే. కాని మరికొందరు అనుకోకుండానే తటస్థపడ్డారు. అన్నిటికన్నా ముఖ్యమేమంటే మా సూరయ్య పెదనాన్న కూడా అక్కడ చేరాడు. మా కుటుంబాలకు మా తాత తరవాత తాత అంతటివాడు, ఆయన వచ్చాడని చూడవచ్చినవారు లేకపోలేదు. (వచ్చినందుకు వట్టి చేతులతో తిరిగి వెళ్ళలేదులెండి.)

పెద్దలూ, పిన్నలూ అంతా ఒకరాత్రి భోజనాలై డాబామీద కూర్చున్నాం. వెన్నెల కూడా ఉంది. మా పెదనాన్న చుట్టూ సుబ్బమ్మత్తయ్య, శంకరం మామయ్యా, శేషమ్మపిన్నీ, సుబ్బయ్య బాబాయి, నరసింహం బాబాయి, ఇంకా ఇతర పెద్దలూ ఉన్నారు. ఇంతమందీ చేరాక కష్టసుఖాలూ, మంచి చెడ్డలూ రాకుండా ఉంటాయా? కుటుంబాలమధ్య కలహాలొచ్చాయి, కుటుంబాలు చితికిపోయాయి, హెచ్చుతగ్గుల విచక్షణలొచ్చాయి. అయిన వాళ్ళకివ్వకా చేసుకోకా పెళ్ళి సంబంధాలకు యితరత్రా వెళ్ళారు. వారు ఇదనీ, వీరు ఇదనీ ఆరోపణలు బయల్దేరాయి. కొందరు కొందర్ని సమర్థించారు. మరికొందరు మరికొందర్ని వెనకేసుకొచ్చారు. కుర్రకారులో అనేక మందికి ఈ పెద్దలేం మాట్లాడుతున్నదీ తెలిసిందికూడా కాదు.

"ఒరే, ఇవన్నీ ఎందుకర్రా?. నాకు అరవై దాటాయి. నా అనుభవం కాస్త

నింటారూ?" అన్నాడు మా పెదనాన్న. అందరూ సద్దుమణిగారు. "నేను సమర్థుణ్ణా? అసమర్థుణ్ణా? ఎవరన్నా చెప్పగలరూ?"

"ఎంత సమర్థుడివి కాకపోతే రెండు చేతులా అంతడబ్బు గడించావు, బావా?" అన్నాడు మా శంకరం మామయ్య.

"అది అబద్ధం!" అన్నాడు మా పెదనాన్న. "చిత్తశుద్ధిగా చెప్పాలంటే—నేను బతికుండగా ఇంతమందిమి కలుస్తామోలేదో నాకే తెలీదు—నా ప్రయోజకత్వం ఏమిటో నేనే చెప్పలేను. నేను వ్యాపారం చేశాను. బాగా లాభం తీస్తాననుకున్న చోట నష్టం వచ్చింది. ఉటుడియంగా అవకతవకగా చేసిన వ్యాపారంలో చచ్చే లాభం వచ్చింది. ఇంకోటి చెబుతా, నేను చచ్చి బతికినన్నిసార్లు మీరెవరూ చచ్చి బతికి ఉండరు. ప్రతిసారీ నాకొకటే అనిపించేది. ఎవరో ఎందుకో నన్ను చావ తుండా కాపాడుతున్నారని? చెబితే అతిశయోక్తిగా తోస్తుందేమోగాని నాకిప్పుడు చావు భయంలేదు. డబ్బు పోతుందనే భయంలేదు. నా జీవితానికి కర్తను నేను కాననే నమ్మకం కుదిరిపోయింది. ఏనాడో చావు మళ్ళీ సమీపిస్తుంది. నాకూ చావుకూ మధ్య ఎవరు అడ్డుపడరు. దాంతో నా జీవితం చెల్లు! మీకెవరికీ బహుశా తెలీదు. కిందటి యుద్ధమప్పుడు బర్మాలో నాడబ్బు చాలా పోయింది. నాకేమీ విచారం కలగలేదు. మీదు మిక్కిలి ప్రాణాలు పోగొట్టుకుంటున్న వాళ్ళను చూస్తూ, 'ఈ నాటకానికి అర్థం ఏమిటో?' అని ఆశ్చర్యపడ్డాను. గొప్ప చదరంగం ఆట గురించి చదరంగప్పావుకు ఎంత తెలుసో నాకూ నా జీవితం గురించి అంతే తెలుసు."

ఆయన ఈ మాటలంటుంటే అందరూ గంభీరంగా అయిపోయినారు. పనికి మాలిన వేదాంతం వినేటప్పుడు మనుషులా విధంగా అయిపోవడం నేను చాలాసార్లు గమనించాను.

"కాక, మరేమిటి? అంతా కర్మ. మనం దేనికి కర్తలం కాము," అన్నది శేషమ్మపిన్ని. అయిదు నిమిషాల క్రితం ఈవిడే తనకూతుర్ని శంకరం మామయ్య కొడుక్కి చేసుకోలేదని తెగదెప్పింది.

ఒకళ్ళ తరవాత ఒకళ్ళు మా పెద్దనాన్నతో ఏకీభవించి ఆయన మాటలలో ఉన్న—ఉన్నదని కనీసం వాళ్ళనుకున్న—కర్మ సిద్ధాంతాన్ని గట్టిగా బలపరచసాగారు.

మానవ యత్నానికి దమ్మిడీ విలువ యివ్వనందుకే మా పెదనాన్నమీద నాకు కొంచెం చిరాకుగా ఉంటే ఆయనతో ఏకీభవించే ఈ ముచ్చులమీద చెప్పరాని క్రోధం కలిగింది.

"అదికాదు, పెదనాన్న. నీకేం కోరికలు లేవా? వాటిని తీర్చుకోటానికి నువు ప్రయత్నం చెయ్యటం లేదూ?" అన్నాను.

"ఒరే నువ్వు రైళ్ళల్లో ప్రయాణం చేశావుకదా. రైలు తనదారిన అది పోతుంటే పెట్టెలో నీకు తోచినట్లు నువు తిరిగి ఉంటావు. కాని రైలు నడకకు

నువు కట్టుపడలేవు? దానిపోకడంతో పోలిస్తే నీదొక పోకడా? నీయిష్టం వచ్చిన చోటుకి నువు·పోతున్నావనటంలో అర్థం ఉందా?" అన్నాడు పెదనాన్న.

"బాబాయి జ్యోతిష్కంలో నీకుకూడా నమ్మకం ఉందన్నమాట," అన్నాను. "అంతా రాసిపెట్టి ఉందంటావు?"

"రాసిపెట్టి ఉండటమనేది నమ్మకపోవటం ఒక మూఢ విశ్వాసమైపోయింది ఈ కాలపు వాళ్ళకు. పుట్టిన జీవి చచ్చిపోతుందని రాసిపెట్టిలేదూ? ఆడవాళ్ళే పిల్లల్ని కనాలని రాసిపెట్టి లేదూ? మనుషులకు ఏడెనిమిదేళ్ళప్పుడు పళ్ళూడితావాలనీ, మగవాళ్ళకి యవ్వనంలో గడ్డాలూ మీసాలూ రావాలని రాసిపెట్టిలేదూ? వాటిని నమ్మటం తప్పులేదేం?" అన్నాడు పెదనాన్న.

"అదివేరు. అదంతా శాస్త్రవిజ్ఞానం," అన్నాను.

"సుబ్బయ్య చెప్పే జ్యోతిష్యం శాస్త్రవిజ్ఞానం కాదని నిరూపిస్తావా? అసలు శాస్త్రవిజ్ఞానం ఏది అవునో ఏదికాదో నీకు తెలుసునా? జియోలజీ శాస్త్రం కాదన్నారు. బయోలజి శాస్త్రం కాదన్నారు."

"అవి శాస్త్రాలనిపించుకున్నాయి ఒకనాటికైనా. జ్యోతిష్యం అట్లాకాదే. వందజాతకాలు చూసి బాబాయి ఎంతమందికి సరిగా చెప్పగలడు? ఎన్ని విషయాలు సరిగా చెప్పగలడు?"

"బాబాయి ఒక్కడే జ్యోతిషానికి అధిపతా? ఒక డాక్టరు వందకేసుల్లో మూడే నయం చేసినంత మాత్రాన వైద్యశాస్త్రం కాదంటావా? ఎందుకంటే అరడజను మంది ఎవరికివాళ్ళు నయంకాదన్న కేసు చిట్కా వైద్యంతో కుదరగా నేను చూశాను."

"నువు చాలా చూశావు. అందుకే నీతో వాదించటం కష్టం" అన్నాను.

"పిచ్చివాడా యిది వాదించే విషయంకాదు. ఇంతపెద్ద సృష్టికి మనిషే నియంత అనుకున్నంత కాలమూ తప్పుదారిపడటం చాలా సులభం. మనిషిని మించిన శక్తులు జగత్తును నడిపిస్తున్నాయన్నది అనుమానం తగిలినాక నీ వైఖరి మారితీరాలి. మాటవరసకు చెట్లు మనుషులనే వాళ్ళున్నారని పసికట్టాయనుకో?"

అనుకున్నాను. అనుకుని ఆశ్చర్యపడసాగాను. కాని పెదనాన్నతో పూర్తిగా ఏకీభవించనూ లేదు, బొత్తిగా ఏకీభవించకపోనూలేదు.

మా సంభాషణ ఇంకెంతదూరం సాగేదో! ఇంతలో మా నరసింహం బాబాయి దత్తపుత్రుడు చంద్రం వచ్చాడు. వాణ్ణి చూడగానే అందరూ అంతో యింతో బిగుసుకుపోయారు. ఎందుకంటే వాడు కమ్యూనిస్టు. ఈ మధ్య రెండేళ్లు అండర్ గ్రౌండ్‌లో ఉండివచ్చాడు. వాడికీ తండ్రికీ మాటలులేవు. మా బలగానికి చాలా మచ్చలున్నాయి. దొంగతనాలుచేసి ఖైదు అయిన వాళ్ళున్నారు. దొంగవ్యాపారం చేసి జరిమానా లిచ్చుకున్నవాళ్ళున్నారు. తాగుబోతులూ, వ్యభిచారులూకూడా ఉన్నారు. రేసులలోనూ, పేకాటలలోనూ సర్వస్వం పోగొట్టుకున్న వాళ్ళున్నారు. కాని అన్ని మచ్చలను తలదన్నిన మచ్చ చంద్రం. మా బంధువులలో చాలామంది దృష్టిలో

చంద్రం హంతకుల జాబితాలోవాడు. దేశద్రోహుల జాబితాలోవాడు. విదేశీయుల ఏజెంట్ల జాబితాలోవాడు.

పెదనాన్న చంద్రాన్ని గుర్తుపట్టినట్టులేదు. ఇంకెవరూ వాణ్ణి పరిచయం చెయ్యరని తెలిసి నేనే పరిచయం చేశాను.

"ఓహో! వీణ్ణి నేను ఆరేళ్ళక్రితం చూశాను. బాగా పెరిగాడు," అన్నాడు పెదనాన్న.

"వాడిప్పుడు కమ్యూనిస్టు. మెట్టపల్లాలేకంచేసి వర్గరాహిత్యం సాధించి సామ్యవాదం నిలబెట్టుకునేటందుకు జీవితం అంకితం చేస్తున్నాడు" అన్నాను.

"అట్లాగా?" అన్నాడు పెదనాన్న.

ఆయనవంటి ఆస్తికుడు చంద్రంవంటి నాస్తికుణ్ని గురించి అంతకంటే ఏమీ అనకపోవటం నాకే నిరాశ కలిగించింది. పెదనాన్న ఇంతకు మునుపు అంటున్న మాటలకు ఎదురు వాదించవలసిన అసలు మనిషి చంద్రం.

"పెదనాన్న కర్మసిద్ధాంతం చెపుతున్నాడురా, చంద్రం! మనచేతిలో ఏమీ లేదుట. అంతా భగవంతుడి చేతులో కీలుబొమ్మలట," అన్నాను.

చంద్రం వెటకారంగా నవ్వాడు.

"ఎంతమంది నెత్తిన చెయ్యిపెట్టి అంతడబ్బు సంపాదించాడో! తనచేతిలో ఏమీ లేదనక తానే ఆ అన్యాయం అంతా చేశానని ఒప్పుకుంటాడా?" అన్నాడు చంద్రం.

దానిక్కూడా పెదనాన్న ఏమీ మాట్లాడలేదు. మరో అయిదు నిమిషాలు కూర్చుని చంద్రం వెళ్ళిపోయినాడు. ఆ అయిదు నిమిషాలుకూడా ఎవరిలోనూ ఏమీ చైతన్యం లేదు. ఎవరిమటుకు వాళ్ళు స్తంభించిపోయారు. ఆఖరకు పెదనాన్నకూడా స్తంభించిపోయినట్టే కనబడ్డాడు.

కాని చంద్రం వెళ్ళిపోగానే తిరిగి అందరిలోనూ చైతన్యం వచ్చింది. కొద్ది మందిలో కాస్త మోతాదుకు మించికూడా వచ్చింది.

"దొరక్క దొరక్క నరసింహానికి వీడు దొరికాడు చూడు!"

"ఈ కమ్యూనిస్టులంతా ఒకటే మచ్చు. పెద్దా, పిన్నా, దేవుడు, దైవం, మంచీ చెడ్డా విచక్షణే లేదు. చెదపురుగులల్లే చేరినచోటల్లా నిర్మూలనం సాగించి వదిలిపెడతారు. వీళ్ళ బతుకు చెడా!" అన్నాడు శంకరం మామయ్య.

"ఏం పెదనాన్నా! నువు కమ్యూనిస్టులను తిట్టేవాళ్ళతో ఏకీభవించవా ఏమిటి?" అన్నాను.

"ఎందుకు వాళ్ళను తిట్టడం?" అన్నాడు పెదనాన్న.

అందరూ ఆయనకేసి వింతగా చూశారు.

"ఈ జీవిత నాటకంలో భగవంతుడు వాళ్ళచేత చాలా పెద్దపాత్ర ధరింపజేస్తున్నట్టు నాకు కనిపిస్తోంది. చరిత్రలో వాళ్లు నిర్వహించే పాత్ర చూస్తున్నాను. భగ

వంతుడు వాళ్ళకు కలిగించే ప్రేరణలు చూస్తున్నాను. ఇందాక నువు మన కోరికల గురించీ అవి తీర్చుకునేటందుకు మనం చేసే యత్నాలు చూస్తే నా బుద్ధి ఒక్కొక్కసారి దిమ్మర పోతుంది. కమ్యూనిస్టులను గురించి హేయంగా భావించటానికి నాకేమీ కారణం కనిపించటం లేదు." అన్నాడు పెదనాన్న.

అక్కడ ఆ క్షణాన ఉన్నవారిలో ఒకరైనా ఆయనను సమర్థించటానికి ముందుకు రాలేదు.

"అయ్యో, పెదనాన్న. ఇక్కడ కర్మసిద్ధాంతం మాట్లాడేవాళ్ళు చాలామంది ఉన్నారుగాని, నిజమైన కర్మసిద్ధాంతివి నువ్వొక్కడివే కనిపిస్తున్నావు!" అనేశాను.

—ముద్రణ : ఆంధ్రపత్రిక, సచిత్రవారపత్రిక,

16 జూన్ 1954.

# మైరావణ రక్తబిందువులు

నేను 1948లో మావూరు వెళ్ళినప్పుడు కూడా మా మునసబు, "మన ఊళ్లో కమ్యూనిస్టు లెవరున్నారులే? ఆ అయిదారుగురే!" అన్నాడు.

ఆ అయిదారుగుర్నీ అందరమూ ఎరుగుదుము. అందులో ఒకరిద్దరు - ఆచార్లుగారబ్బాయీ, కుమ్మరివాళ్ళ కుర్రాడు - ఏనాడో చెడిపోయిన బాపతు. వాళ్లయించుమించు నాయీడు వాళ్ళే. చదువు సంధ్యలు మానేసి కారల్‌మార్క్స్[1] చదువులో పడటమేకాకుండా క్షణానికోసారి "దోపిడీ విధానం", "బూర్జువా మనస్తత్వం", "విప్లవం" అంటూంటే మాకు కొందరికి ఒళ్లు మండిపోయేది. నాలాగే కాలేజి చదువు చదివేవాళ్ళు ఇంకా ఇద్దరు ముగ్గురు వుండేవారు మా వూళ్ళో. మేమీ 'కామ్రేడ్లను" చూసి నవ్వుకునే వాళ్ళం. మరీ శాస్త్రుల్లుగారబ్బాయి వాళ్ళని చాలా షోగ్గా అనుకరించేవాడు. అసలే వాడు కవి. "మన కామ్రేడ్ భాయీలకి పంటకాలవ తూముల్లో విప్లవ బీజాలు కనిపిస్తాయి. పొలానికి ఎరువు తోలితే ఎక్స్‌ప్లోయిటేష నంటారు. ఎట్లారా వీళ్ళతో?" అనేవాడు. ఒక్కముక్కలో చెప్పాలంటే మా కమ్యూనిస్టుల ధోరణీ, ఆలోచనా విధానముకూడా అవాస్తవికంగానూ, వ్యక్తిత్వ రహితంగానూ, మూఢవిశ్వాస జనితంగానూ ఉన్నట్టు కనబడేది. వాళ్ళేమో పుస్తకాలు చదివారు. అందులో విషయాలు నమ్మారు. ఆ పుస్తకాలు చదివినవారికి జీవితం ఎట్లా కనిపిస్తున్నదీ మరచిపోయి తమ పరిభాష అర్థమైన వారికి తప్ప మరెవరికీ తమ సంభాషణ అర్థం కాకుండా మాట్లాడటం నేర్చారు. ఊరంతకీ దూరమయేవారు. చిత్రమేమిటంటే ఆచార్లు మాట్లాడినా రాఘవులు మాట్లాడినా ఒకటిగానే వుండేవి. వాళ్ళ అభిప్రాయాలు రైలుపట్టాలులాగా ఎంత దూరంపోయినా కలిసే వుండేవి. అయితే వాళ్లు యెప్పుడూ కలిసి తిరిగేవారు గనకా, చదివిన విషయాలు చర్చించుకునేవారు గనకా మేము ఆశ్చర్యపడే వాళ్ళంకాము. కాకపోతే వాళ్ళ దీక్షమటుకు మాకు ఆశ్చర్యం కలిగించేది. ఎంతమంది వాళ్ళను వెలిగాచూసినా, ఎంతమంది హేళన చేసినా, యెంతమంది శత్రుత్వంతో చూసినా వాళ్లు లక్ష్యపెట్టలేదు. వీళ్ళకి రైతుకూలీలలోగాని కుర్రకారులోగాని ఏమంత పలుకుబడి వున్నట్టు నాకు కనబడలేదు.

కొద్దిరోజులకు యుద్ధం వస్తుందనగా[2] నేను ఉద్యోగంలో కుదిరాను. మా

---

1. కార్ల్‌మార్క్స్ : చూడండి వెనకటి కథలో
2. యుద్ధం : రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945)

ఊరికి దూరమైనాను. మా కామ్రేడ్స్ ఆచార్లునూ, రాఘవులునూ మరిచిపోయి నాను. నేను మావూరు వదిలేనాటికి వాళ్ళు అండర్ గ్రౌండ్ అయిపోయినట్టు జ్ఞాపకం.

యుద్ధకాలంలోనే వీళ్ళు మళ్ళీ పైకివచ్చి యథాప్రకారం విప్లవం గురించి మాట్లాడటమేగాక ఈసారి ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధం[1] గురించి కూడా మాట్లాడి మావూరి హిట్లరు భక్తులకు చాలా ఆగ్రహం తెప్పించారు. ముఖ్యంగా మా శాస్త్రుల్లుగారు, కించిత్తు దైవజ్ఞుడేమో, చక్రాలువేసి హిట్లరు గెలుస్తాడనీ, మన దేశానికి స్వరాజ్యం తెస్తాడనీ, బ్రాహ్మణ్యం నిలబెడతాడనీ కలలు కన్నాడు. తన కొడుకునే వీళ్ళు చేరదీస్తారని ఆయన కలలోకూడా అనుకో లేదు. ఆ మాటకువస్తే నేనూ అనుకోలేదు, వెంకటశాస్త్రి కమ్యూనిస్టుల అనుచ రుడవుతాడని. వాడు కమ్యూనిస్టులమీద వేసిన "జోక్స్" నేను మరువలేదు.

ఒక్క వెంకటశాస్త్రినేకాదు ఊళ్ళో మరికొంతమంది కుర్రాళ్ళకూ, కూలి వాళ్ళకూకూడా ఆచార్లుగారబ్బాయి కమ్యూనిస్టు మతం ఇప్పించారు. ఆచార్లు ఈ పని ఎట్లా సాధించాడో నాకు తెలీదు.

ఊళ్లోమటుకు కమ్యూనిస్టు వ్యతిరేకత రెచ్చిపోయింది. మాది మొదటినుంచీ ప్రబలమైన కాంగ్రెసు గ్రామం. ఆ ఒక కారణమేకాకుండా ఆచార్లు ముఠావాళ్ళు ఊళ్ళో రైతులకు తిండి దొంగలని పేరు పెట్టి ధాన్యం చాటుగా కొన్నవాళ్ళనీ, అమ్మినవాళ్ళనీ నిర్దాక్షిణ్యంగా వేటాడారు. మా రోజుల్లో మేం కమ్యూనిస్టులను చూసి నవ్వి ఊరుకున్నామేగాని ఇప్పుడు – అంటే 1948 నాటికి - ఎంతోమంది ఈ కమ్యూనిస్టుల రక్తం తాగడానికి తహతహలాడసాగారు. ఈ సంగతి కూడా మునసబుగారు నాతో చెప్పాడు. కమ్యూనిస్టులతో చేరిన యువకుల పేర్లుచెప్పి, కాస్త వాళ్ళ బుద్ధి అయినా మళ్ళించమన్నాడు మునసబు. చూస్తానన్నాను. ముందు వెంకట శాస్త్రితో మాట్లాడాను.

"ఏంరా, వాళ్ళనుచూసి నవ్వితివిగదా వాళ్ళతో చేరిపొయ్యావేమిటి?" అన్నాను వెంకటశాస్త్రితో.

---

1. ప్రజాయుద్ధం : 1943. సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడికి పూను కున్నప్పుడు భారత కమ్యూనిస్టులు తీసుకున్న వైఖరి.

2. హిట్లరు భక్తులు : మనదేశంలో ఆర్యరక్తం బ్రాహ్మణత్వం పవిత్రమైందని నమ్ముతూ హిట్లరు అమానుష భావాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సమర్థించినవాళ్లు. కుటుంబరావు రాసిన సనాతనిస్టు విభ్రమం అనే కథ చూడండి. అందులోని యాజులు వంటి వారి వాదనలు గమనించండి.

"వీళ్ళ మార్క్సిజంమాట ఏమైనా వీళ్ళుమటుకు మంచి సాహిత్యోద్యమం[1] ప్రారంభించార్రా! దాన్ని కాదనటానికి వీల్లేదు," అన్నాడు శాస్త్రి.

"మా నవ్య సాహిత్యపరిషత్తు[2] లేదూ?" అన్నాను.

'ఉందనుకో, అది అచ్చగా రచయితలకు మాత్రమే సంబంధించిన ఉద్యమం. ఇది ప్రజోద్యమం.'

తిలక్‌నాటి వరకూ రాజకీయ వాదులమధ్య ఉండిన జాతీయోద్యమం గాంధితో ప్రజల మధ్యకి వచ్చినట్టే ప్రతికళోద్యమమూ ప్రజలలోకి రావలసిన అవసరం ఉందని శాస్త్రి వాదించాడు. ఈపని కమ్యూనిస్టులే ఎందుకు చేశారో నాకర్థంకాలేదు.

"వీళ్లు వట్టి కబుర్లరాయుళ్ళు కారు. వీరి సాంఘిక దృష్టిలో కొంత వాస్తవికత ఉందని చెప్పుకోవాలి. నేను ప్రధానంగా కవినే అయినా వీళ్ళు ప్రచురించే కర పత్రాలూ, చిన్నపుస్తకాలూ, వీళ్ళ శాస్త్ర గ్రంథాలూ చదువుతున్నాను. అందులో చాలా యథార్థం ఉంది. నీకు కమ్యూనిస్టులంటే కొంత హేళనగా ఉంటుందని నాకు తెలుసు. వాళ్ళు బోలెడంత సాహిత్యం ప్రచురిస్తున్నారు. అదంతా చదవ కుండా నీవు వాళ్ళను గురించి ఎట్టి అభిప్రాయానికీ రావద్దు" అని శాస్త్రి నాకు హితవు చెప్పారు.

**"A man is what he eats"** అని ఎవరో అన్నారు. **A man is what he reads** అని కూడా అనుకోవచ్చు. తినే పదార్థాల ప్రభావం మనిషిమీద ఉన్నట్టే చదివే పుస్తకాల ప్రభావమూ మనిషిమీద ఉండి తీరుతుంది. శాస్త్రి కమ్యూ నిస్టు పుస్తకాలు చదివి ఈ విధమైన పరిణామానికి గురిఅయినాడని గ్రహించుకుని, వాణ్ణి బాగుచేసే ఆశవదులుకుని ఊరుకున్నాను.

---

1. మంచి సాహిత్యోద్యమం : అభ్యుదయ రచయితల సంఘ ఉద్యమం. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మొదటి సభ 1943లో తెనాలిలో జరి గింది. రెండవసభ 1944 చివరలో విజయవాడలో, మూడవసభ డిసెంబరు 31, 1945 జనవరి 2, 1946.
2. నవ్య సాహిత్య పరిషత్తు : 1936 మార్చి 10, 11, 12 తేదీలు బరంపురంలో అభినవాంధ్ర కవిత పండిత సభగా మొదలైన సాహిత్య సంస్థే 1936 నాటికి గుంటూరులో నవ్యసాహిత్య పరిషత్తుగా అవతరించింది. పరిషత్తు స్థాపనకు ముఖ్యకారకులు గురుభాగవతుల ధర్మారావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి. కాకినాడలో పంచాగ్నుల (1936), గుంటూరులో గిడుగు (1937), బందరులో బుర్రా శేషగిరిరావు (1938), విజయవాడలో విశ్వనాథ (1940), పరిషదధ్యక్షులు. నవ్యసాహిత్య ప్రచారానికి, ఆధునిక భాషా వ్యాప్తికి దోహదం చేసిన సంస్థ. ప్రతిభ పత్రిక సాయం.

ఇంకా ఒక రిద్దరు కమ్యూనిస్టు భక్తులతో మాట్లాడాను. వాళ్ళు శాస్త్రి మాట్లా డినంత ఓపికగానైనా నాతో మాట్లాడలేదు. నా అభిప్రాయాలు విని వాళ్ళు నవ్వారు. నాకేదో ప్రపంచజ్ఞానం లేనట్టూ, ఏ బావి అడుగునుండో అప్పుడే పైకి వచ్చిన కప్ప నైనట్టూ చూశారు. వెనక మేం వీళ్ళను చూసి నవ్వితే, వాళ్ళిప్పుడు మిమ్మల్ని చూసి నవ్వుతున్నారుకదా అనుకున్నాను.

తరవాత గడచిన ఒకటి రెండు సంవత్సరాలలో నా అనుమానాలన్నీ రూఢి అయినాయి. ఒక్కసారిగా కమ్యూనిస్టు పాపంపండి బద్ధలయినట్టయింది. ఏ పత్రికలో చూసినా కమ్యూనిస్టు ఘాతుకచర్యలే. హత్యలు, దోపిడీలు! అదివరకు కమ్యూనిస్టులను సమర్థించినవారుకూడా వీళ్ళ చర్యలు చూసి దద్దరిల్లిపోయినారు. కొంతమంది కమ్యూనిస్టులు పార్టీలో నుండి బయటికి వచ్చినట్టు పత్రికల్లో పడింది. ఇదంతా దూరాన ఉండి వినటంలో ఒకవేళ ఉన్నదానికన్న భయంకరంగా కన పడిందేమో.

కమ్యూనిస్టుల ఖండన విషయంలో ఈ విధంగా నేను నిశ్చనమలటాని కొక కారణం ఉంది. పట్నంలో నాకొక జర్నలిస్టు స్నేహితుడున్నాడు. అతనొక దినపత్రిక ఆఫీసులో పని చేస్తున్నాడు. అతననటం అనేకచోట్ల హత్యలు జరుగు చున్నమాట నిజమేగాని అందులో చాలా భాగం కమ్యూనిస్టులకు సంబంధం లేకుండానే కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారంకోసం వినియోగించబడుతున్నదని, మామూలుగా వ్యక్తిగత ద్వేషాలతో చేసిన హత్యలుకూడా కమ్యూనిస్టులు చేసినట్టే వార్తలు వచ్చాయి. కొన్ని అసత్యవార్తలు సృష్టించబడ్డాయి.

అదీకాక పోలీసుల అత్యాచారాలొకటి కమ్యూనిస్టు చర్యలతో పోటీచేయ సాగాయి. కాటూరు, ఎలమర్రు ఉదంతాలు దేశమంతటా పొక్కిపోయాయి[1]. బాధ్యతను మొదట్లో పోలీసు అత్యాచారాలుకూడా కమ్యూనిస్టులకే అంటగట్టాం. కాని ఇదికూడా సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది. నేను నాకళ్ళారా ఒక లేఖచూశాను.

---

1. కాటూరు, ఎలమర్రు ఉదంతాలు : 1949 జూలై 16న కృష్ణా జిల్లాలోని కాటూరు గ్రామాన్ని 300 మంది పోలీసులు చుట్టుముట్టి, 400 మంది స్త్రీ పురుషుల్ని వివస్త్రల్నిచేసి ఊరేగించిన ఒక అమానుష అత్యాచార ఉదంతం. 1940 జూలై 14వ తేదీ ఉదయం 400మంది మలబారు పోలీసులు ఎలమర్రు గ్రామాన్ని చుట్టుముట్టి, కమ్యూనిస్టులయినా కాకపోయినా గ్రామస్థు లను లాఠీలతోమోది వివస్త్రుల్ని చేసి, చేతులయినా అడ్డం పెట్టుకోనీకుండా లాఠీలతో మోదుతూ ఊరేగించి, గాంధీ విగ్రహం ముందు మోకరిల్లజేసి కాంగ్రెసుకు జై అనిపించిన మరొక రాక్షసోదంతం ఎలమర్రు ఉదంతం. (చూ.పి. సుందరయ్య, తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం, గుణ పాఠాలు)

ఒక గ్రామంలో పెద్దలు తొమ్మిది మంది సంతకాలుచేసి ఆ లేఖ పంపారు. వారిలో ఒక కాంగ్రెసు కార్యకర్తకూడా వున్నారు. వారి గ్రామంలో యేదో హత్య జరిగింది. పోలీసులువచ్చి గ్రామాన్నంతా అల్లకల్లోలం చేశారు. ఆ గ్రామంలో కమ్యూనిస్టులు లేరట. అయినా ఈ హత్యను కమ్యూనిస్టులకే అంటగట్టి, గ్రామ పెద్దలు చెబుతున్నా వినక, పోలీసులు ఇళ్ళలోకి దూరి అత్యాచారాలుచేసి లేని కమ్యూనిస్టులను చూపమని స్త్రీలనూ పురుషులనూ హింసించారని ఆ లేఖ ఘోషించింది. ఈ లేఖ చూస్తుంటే నాకు మతకలహాలు జ్ఞాపకం వచ్చాయి. ఎక్కడ ఏ హిందువుడి హత్య జరిగినా ముస్లింలకే అంటగట్టారు. ఏ ముస్లిము హత్య జరిగినా హిందువుడికి అంటగట్టారు. ఇంకా పూర్వం మతకలహాలు జరిగినప్పుడు ముస్లిములు హిందువులను చంపుతున్నంత కాలమూ పోలీసులు పత్తాలేకుండా పోయి హిందువులది పైచేయి కాగానే పోలీసులు వచ్చి శాంతిస్థాపన చెయ్యటం జరిగింది. కాశీలో యిది నేను స్వయంగా చూశాను. కాని, అదంతా భారతీయుల బానిసత్వంలో, ఏ రోజుల్లోకూడా ప్రజాప్రభుత్వం క్రింద దొంగసాకుపెట్టి ప్రజలను పోలీసులు భీతావహులను చేయటం ఎరగం. ఈ భయంకరమైన పని కాంగ్రెసు హయాంలో జరిగింది. దేశంలో మేధావులే లేనట్టూ, తాము డిక్టేటర్లయినట్టూ ప్రవర్తించారు పోలీసు అధికార్లు! నా బోటివాడి ఆత్మాభిమానానికి న్యాయబుద్ధికీ ఇది సహించరాని విషయమయింది. ఒకరిద్దరు నాలాటి కమ్యూనిస్టు విముఖులు, "కమ్యూనిజం నాశనం కావాలంటే ఇటువంటివి భరించాలి మరి!" అన్నారు. పేలుపడ్డాయని తలకు కొరివి పెట్టుకోవటం బుద్ధిహీనులు చేసేపని. "మీరు బుద్ధిహీనులల్లే మాట్లాడుతున్నారు" అని వాళ్ళతో అనేశాను. వాళ్ళు నన్ను వెంటనే "కమ్యూనిస్టు సహచరుడు" అనేశారు.

ఇది నాకొక కనువిప్పన్నమాట. కమ్యూనిస్టనిపించుకోవటం ఎంతతేలికో నాకు తెలిసిపోయింది. ఒకప్పుడు ఆచార్లు నాతో అన్నాడు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం దొరకటం చాలా కష్టమని. "డబ్బిస్తే మహాచక్కగానే దొరుకుతుందిలే!" అని నేను అనేశానుకూడా! కాని ఇవాళ బానిస మనస్తత్వం లేనివాళ్ళూ, అన్యాయం సహించనివాళ్ళూ కమ్యూనిస్టుల కింద జమచేయబడుతున్నారు. పోలీసులూ, కాంగ్రెసు ప్రభుత్వబలమూ కేవలం బుద్ధిహీనుల పక్షాన ఉపయోగించబడుతున్నది. దేశం భవిష్యత్తును గురించి నాకు ఏదో భయంపట్టుకుంది.

ఇంతలో మావూరినుంచి వార్తవచ్చింది. ఆచార్లునూ, వెంకటశాస్త్రినీ, మరి ఇద్దర్నీ పోలీసులు కాల్చేశారని! ఈ వార్త విన్న మరుక్షణం నాలో ఏదో మంట బయలుదేరింది. ఆ హత్యలకు నేనే బాధ్యుణ్ణయినట్టు బాధపడ్డాను. ఆచార్లుగాన్నీ, వెంకటశాస్త్రిగాని హత్యాకాండలో పాల్గొన్నట్టు నేనూహించలేక పోయినాను. ఆచార్లు భావాలూ, మాటల ధోరణీ నాకు రుచించలేదు. అంతమాత్రంచేత అతన్ని చంపాలా?

మనకు నచ్చని భావాలున్న వారందర్నీ మనం చంపటం మొదలు పెడితే ఏమవుతుంది?

మావూరువెళ్ళి ఏం జరిగిందీ తెలుసుకుంటేనేగాని నాకు మనస్సు నిలవలేదు. వెళ్ళాను. తెలుసుకున్నాను. ఏం చెప్పాలి? ఇటువంటి సంఘటనలే సిద్ధార్థుడి[1]వంటి వాళ్ళను సన్యాసులుగా చేసేది; ఇటువంటి సంఘటనలే పచ్చి కట్టెలను భగభగా మండించేది.

వెంకటశాస్త్రి అజ్ఞాతవాసం చెయ్యలేదుగాని ఆచార్లు మొదలైన వాళ్ళకు అప్పుడప్పుడూ ఆశ్రయ మివ్వటమూ, వార్తలందించటమూ మొదలైన పనులు చేసి నట్టు తోస్తుంది. అతన్ని పోలీసులు పట్టుకున్నారు. కమ్యూనిస్టుల జాడలు తెలపమ న్నారు. వెంకటశాస్త్రి తనకేమి తెలియదన్నాడు. అయితే వెళ్ళిపొమ్మన్నారు. వెనక్కు తిరగగానే కాల్చేశారు.

ఆచార్లును అజ్ఞాతంలో వుండగా పట్టుకున్నారు. అతనిజాడ చెప్పిన వాళ్ళెవరో తెలీదు, కాని యెవరో చెప్పినమీదటే పట్టుకున్నారు. పోలీసులకు చిక్కిన ఆచార్లును మా ఊళ్ళో పెద్దలు డబ్బిచ్చి కొనుక్కున్నారని విన్నాను. అయిదు వంద లిచ్చారని పుకారు. ఈవిధంగా ఆచార్లును కొన్న పెద్దలు అతన్ని చిత్ర హింసచేసి చంపేశారు. ఈ దారుణ హత్యను ఎంతమంది పంచుకున్నారో తెలియదు. కాని అందరూ ఊళ్ళో పెద్దలల్లేనే తిరుగుతున్నారు. వారిని విచారణకు తీసుకురావ డానికి కూడా న్యాయయంత్రం లేకపోవడం నాకు చెప్పరాని బాధకలిగిస్తోంది. నేను మావూరు పోలేను, గాంధీటోపీకేసి చూడలేను. పోలీసువాడు కనిపిస్తే పైత్య వికారం చెందకుండా వుండలేను. "ఈదేశం ఎక్కడకు పోతుంది?" అని ఒక్క మనిషి— అందులోను నాబోటి అనామకుడు— ప్రశ్నించుకుంటే ఎబ్బెట్టుగా తోచ వచ్చు. కాని యీ ప్రశ్నే సరిగా నన్ను బాధిస్తోంది.

ఒక్కటే తృప్తి. ఇటువంటి పరిణామం ప్రకృతి విరుద్ధం. మానవ ప్రకృతికీ విరుద్ధమే. అందుచేత ప్రకృతీ, మానవ ప్రకృతీకూడా వీటిమీద పగతీర్చుకుం టాయి అని నాలో దృఢ విశ్వాసం.

మాగ్రామంలో నలుగురి రక్తం ప్రవహించింది. అది మామూలు రక్తం కాదు. మైరావణుడి రక్తం అయివుండాలి. లేకపోతే ఏడాది తిరక్కముందే ఎన్నికలు[2] జరిగే సరికి కమ్యూనిస్టు అభ్యర్థికి మావూరి నుంచి వెయ్యివోట్లు ఎట్లా వచ్చాయి? ఆచార్లు మెడమీద కాడివేసి తొక్కినవాళ్ళు ఈ నిర్ణయాన్ని గురించి ఏమం టారు? కాంగ్రెసుకు వేసే ఓట్లు తిండిదొంగలకూ, నరహంతకులకూ పోతాయేమోననే

---

1. సిద్ధార్థుడు : గౌతమ బుద్ధుడు (క్రీ. పూ. 500)

2. ఎన్నికలు : 1952 ఎన్నికలు.

భయం ఎందుకు కలిగింది? మావూరి నిరక్షకులు ఏం మార్క్స్ సాహిత్యం చదివారు? ఆమాటకువస్తే నేనేం చదివాను.

తనలోనుంచేగదా మంటవచ్చిందని కట్టె సంతోషించగానే సరికాదు. ఆ మంట కట్టెనే నుసిచేస్తుంది. సంఘ ద్రోహులు పోతారు. సంఘం ఉంటుంది. చావు లేని ప్రాణినుండి కారే రక్తం వృధాపోదు.

—ముద్రణ, నగారా, 15 జూలై 1953.

# కరువొచ్చింది

కరువొచ్చింది.

పంటలు పండినై. గింజలు కళ్ళాలు దాటగానే మాయమయినై. కరువొచ్చింది.

పైరు పచ్చగా పెరిగినప్పుడూ, కంకులు బరువుగా వొంగి తమను ఏపుగా పెంచిన భూదేవికి జోహార్లు చేసినప్పుడూ, బంగారు గింజలు కనక వర్షంలాగా జల జల రాలినప్పుడూ, కళ్ళ పండువుగా చూసిన పేద ప్రజలకు కన్ను పొడుచుకున్నా గింజ కనిపించలేదు.

రైతు కూలీలు తపఃఫలితాన్ని గద్దలు తన్నుకు పోయినై. కాటకం వచ్చింది.

పేద ప్రజలు అలజడి పడ్డారు. గగ్గోలు పెట్టారు. పళ్ళు పటపట కొరికారు. నోళ్ళు తెరచి మూయటం మరచిపోయినారు. వాళ్ళ కళ్ళల్లో దైన్యమూ, ఆశా, ఆగ్రహమూ, నిరాశా కనిపించి, ఆఖరకు కళ్ళల్లో ఉన్న దీపం కాస్తా ఆరి కొడి గట్టింది.

చుట్టపు చూపుగా వచ్చిన మృత్యు దేవతకు చక్కని సన్మానం జరగటం వల్లి పోనీ అని ఉండిపోయి తన రాక మూలంగా తెలియజేసింది.

బుద్ధిమంతులంతా చేరి పరిస్థితుల మీద తమ అసమ్మతి తెలియజేయడానికి బహిరంగసభ చేయాలని తీర్మానించారు. ఇంటింటా పోయి ప్రచారం చేశారు. చదువుకున్న వాళ్ళంతా ఉద్యమాన్ని బలపరచి ఆశీర్వదించారు. కరపత్రాలు పంచి పెట్టబడ్డాయి.

కరువు పోగొట్టడానికి ఒక తాత్కాలిక సంఘం నియమించబడింది. కార్యక్రమమంతా వారి చేతుల్లో ఉంచబడింది. ఈ సంఘం బహిరంగ సభలు ఏర్పాటు చేయడానికి పూనుకొంది. ప్రజలలో ఆశ రేకెత్తింది.

దేశంలోవున్న కవులూ, విజ్ఞానులూ, శాస్త్రవేత్తలూ, సంఘ సంస్కారులూ, బీదవాళ్ళ ప్రతినిధులూ-వేలాది వేలుగా వచ్చి తాత్కాలిక సంఘంలో చేరారు.

తిండి దొంగలే కరువుకు కారణమని అందరూ ఆమోదించారు. "తిండి దొంగలు నశించాలి!" అనే నినాదం తాత్కాలిక సంఘంలో ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

ఈ ఆందోళన తిండి దొంగలకు నచ్చలేదు. వీళ్ళు రాజకీయ తంత్రాలన్నీ

వినియోగపరచి కరువు నిర్మూలనోద్యమాన్ని అణచడానికి ప్రయత్నాలు ప్రారంభిం చారు కాని ఈ ఉద్యమం ఆరేదికాదు. దీనికి ప్రజల అండ ఉంది.

ఈ సంగతి గ్రహించి తిండి దొంగలు కొత్త ఎత్తు వేశారు. జిత్తు పారింది. విత్తు మొలిచింది. అది విషపు చెట్టు. దాని విష ఫలితాలు మొదటి బహిరంగ సభ నాడే బయటపడ్డాయి.

ఈ బహిరంగ సభకు పేద ప్రజలు లక్షలాదిగా వచ్చారు—తమ విమోచన కొరకు తీర్మానాలు చెవులారా విందామని.

అధ్యక్షుణ్ణి తాత్కాలిక సంఘ కార్యదర్శి సూచించాడు. మరెవరో ఆమోదిం చారు. అధ్యక్షుడు లేచి నిలబడి "సోదరులారా! మనం ఇక్కడ ఎందుకు చేరామో మీరంతా ఎరుగుదురు. మనం ఇక్కడ జరపబోయే తీర్మానాలు సమాజంయొక్క శాంతి భద్రతలను పెంపొందించేవిగా ఉండాలి. సర్వేజనా స్సుఖినోభవంతు" అని కూర్చున్నాడు.

ఒక కవిగారు లేచి ఆకలిని తిడుతూ, కొన్ని పద్యాలు చదివాడు. మరో కవి గారు లేచి మృత్యువును తిడుతూ మరికొన్ని పద్యాలు చదివాడు. అందరూ హర్షిం చారు. కాని పేదల ప్రతినిధుల కిందులోని చమత్కారం అవగాహన కాలేదు. ఆక లిని తిట్టడం దేనికి? ఆకలి లేకపోతే ఎట్లా? చావును తిట్టడం మాత్రం దేనికి? మను ష్యులు చావకుండా ఎట్లా?

అయినా వారు శాంతంగా విన్నారు.

ఒక పెద్దమనిషి ఈ విధంగా తీర్మానం ప్రతిపాదించాడు.

"పేద ప్రజలు కరువుతో బాధపడుతున్న మాట నిజం. ఇది భగవంతుడు దేశానికి పెట్టిన విషమ పరీక్ష. పేదప్రజలు ఈ పరీక్షకు నిలబడాలంటే ఆధ్యాత్మిక బలం సాధించాలి. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ఉపదేశించినట్టు ద్వంద్వాలను విసర్జించి, పంచతన్మాత్రలకు వశుడుగాక, కూర్మం వలె అంగాలన్నీ ముడుచు కున్నట్టు ముడుచుకుంటే ఎవరినీ బాధించనేరదు."

ఈ తీర్మానాలన్నీ (?) బలపరుస్తూ మరో పెద్దమనిషి ఈ విధంగా చెప్పాడు.

"సోదరులారా! మనం ఒక్క విషయం గ్రహించాలి. కరువు కన్న కూడా కరువు భయం మనను కుంగదీస్తుంది. మనస్తత్వ వేత్తలీ విషయం రుజువు చేస్తారు. ఈ పాటి కరువుకే ఇంతమంది చచ్చారంటే, వెనకటి మహా ఋషులు కందమూలాలు తినీ, జలభక్షణచేసీ, వాయుభక్షణచేసి, అన్నేసి వేల ఏళ్ళు, పుట్టలు పెరిగేలాగా ఎట్లా తపస్సు చేయగలిగారు? .... సోదరులారా మన పేదప్రజలు కర్మసిద్ధాంతం గుర్తించినవారై కరువు పరిస్థితులు అర్థంచేసుకున్నవారై, కర్తవ్యం అవగాహన చేసు కున్నవారై, సాధ్యమైనంత తక్కువ ఆహారం మీద - వీలుపడే గుక్కెడు నీళ్ళు తాగి - కేవలం జీవించి ఉండగలందులకు మాత్రమే భోజనం చేస్తూ - ఇది మంచి ఆరోగ్య సూత్రం, కావలిస్తే వైద్యులను అడగండి! కరువును ధైర్యంగా ఎదిరించి

ఇంత కన్న ఘోరమైన కరువు వచ్చినా తట్టుకోగలమని రుజువు చేస్తారుగా...యీ తీర్మానం అందరూ బలపరచవలసిందని కోరుతున్నాను."

ఆ తర్వాత క్రమంగా ఈ క్రింది తీర్మానాలు ప్రతిపాదించబడి ఆమోదించ బడినై.

1. దేశమంతటా రాంభజనలు జరపాలి.

2. దేశం నడిమధ్య ప్రాంతంలో ఒక ఎకరంమేర హోమగుండం తవ్వి బ్రహ్మాండంగా యజ్ఞం చెయ్యాలి.

3. దేశభక్తు లెవరూ పూటకు పావుశేరు బియ్యం కన్న తినకూడదు. (దీన్ని అర్ధశేరుకు పెంచమని తెచ్చిన సవరణ నెగ్గింది).

4. పేద ప్రజలు మృష్టాన్నాలు మానాలి. ఎవరూ అన్నం పారెయ్యరాదు. (ఆ విధంగా పారేసిన అన్నాన్ని మాదాకవళం వాళ్ళకి వెయ్యవచ్చుననే సవరణ ఆమోదించబడింది)

5. పేద ప్రజలు శరీర వ్యాయామం చేసి బలాఢ్యులుగా ఉండాలి.

ఈ విధంగా ఇంకా చిల్లర తీర్మానాలు ఎవరూ అబద్ధం ఆడరాదనీ, తిండి దొరకని పక్షంలో ఆకో అలమో తినాలిగాని నిరసన వ్రతం చేసి చావరాదనీ, సాధ్య మైనంత వరకు అందరూ బ్రహ్మచర్యం అవలంబించాలనీ, మాంసాహారం వర్జించా లనీ, దేశభక్తులంతా గీతా పారాయణ చెయ్యాలనీ-కూడా జరిగినై.

తీర్మానాల అనంతరం కరువు నిర్మూలన మహాసభ (సంవత్సరం చందా ఒక అణా, పోషకులకు బేడా, రాజపోషకులకు రూపాయి, యావజ్జీవ సభ్యత్వానికి నూటపదహార్లు) ఒక కార్యవర్గాన్ని ఎన్నుకొంది. అందులో రాజపోషకులూ, యావ జ్జీవ సభ్యులూ మాత్రమే ఎన్నుకోబడ్డారు.

పేదవాళ్ళ ప్రతినిధులంతా చేరి వేరే ఒక సభ పెట్టారు. జరిగిన సమా వేశాన్ని ఖండించారు. ఇందులో సరి అయిన తీర్మానం ఒకటికూడా జరగలేదు. కరువు కారణాలు చర్చించలేదు. తిండి దొంగలను ఎదుర్కొనే కార్యక్రమం ఇవ్వ బడలేదు. జరిగిన తీర్మానాలలో ఏ ఒకటి కూడా అసలు సమస్య నెదుర్కోలేదు. సరి అయిన తీర్మానాలు కొందరు ప్రతిపాదించగా మహా సభాధ్యక్షుడు వాటిని శాంతి భద్రతలకు హానికరంగా ఉన్నాయని తోసేశాడు.

పేదల ప్రతినిధుల సమావేశంలో కొన్ని తీర్మానాలు చేయబడినై.

"తిండిదొంగలను మహాసభ ఎదిరించాలి, శిక్షించాలి." ఆహారపదార్థాలు సంపాదించడానికీ, ప్రజలకు న్యాయంగా పంచడానికీ ఉప సంఘాలు నియమించాలి. ఇందులో ప్రజా ప్రతినిధులే ఉండాలి."

ఈ తీర్మానం చూసి మహాసభ కార్యవర్గం మండిపడింది.

"వీళ్ళకేం చెబుతారు. రేపు యజ్ఞం చేయడానికి మోతుబరులు వందలకొ వందల పుట్లు ధాన్యం విరాళం ఇస్తున్నారు. తిండిదొంగలు నశించాలి అని మనం

అన్నట్టయితే పెద్దవాళ్ళకు కోపం వచ్చేస్తుంది. మనం సామంతో వారి హృదయాలు కరిగించాలి. హృదయాలు కరగగానే దేశం మళ్ళీ సుభిక్షం అవుతుంది.

"అదీగాక, మనలో అంతో ఇంతో ధాన్యం దాచుకున్న వాళ్ళం ఉన్నాం. మనమూ తిండిదొంగలమేనా మరి? ఆ మాట అని మనం ధాన్యం బయట పెట్టేస్తే ఎవరి కడుపు నిండుతుంది. మనమూ, మన భార్యలూ, బిడ్డలూ మాడడమే కాని మరేమీ జరగదు" అన్నాడు అధ్యక్షుడు.

క్రమంగా మహాసభలో కొన్ని తరగతులేర్పడినై. ఆధ్యాత్మిక వాదులూ! తాత్విక వాదులూ! కార్యవాదులూ! ఎవరికి వారయినారు. కరువుదారిన కరువు చెలరేగుతూనే వుంది.

ప్రజలంతా మహాసభను నమ్ముకుని ఉన్నారు. నిస్పృహ, ఆశా, ఈ రెంటి మధ్య వారు త్రిశంకు స్వర్గంలో ఉన్నారు. ఉద్యమం ఎంతకాలం సాగినా తిండి దొంగల పని బాగానేవుంది. వారి ప్రతినిధులంతా క్షామ నివారక మహాసభలో ఉన్నారు. క్షామ నివారణకుగాను ఉపసంఘాలు నియమించబడినై. ఉపసంఘాల్లో స్థానాల కోసం కలతలూ, చీలికలూ, పోటీలూ సాగినై.

"ఈ కలతలూ, చీలికలూ, పోటీలూ ఏమిటి?" అన్నారు కొందరు. "రాజకీయ చైతన్యం బాగా సాగుతుందన్నమాట" అన్నారు తెలిసినవాళ్ళు.

పేదవాళ్ళ పరిస్థితి నానాటికీ హేయమైన స్థితికి వచ్చింది. వాళ్ళ ప్రతినిధులు ప్రజల సమైక్య పోరాటం సాగితేనే గాని ఈ క్షామం నివారణ కాదని అలజడి ప్రారంభించారు.

వెంటనే తిండి ప్రతినిధులు పేదల ప్రతినిధులు దేశద్రోహులని ప్రచారం ప్రారంభించారు.

దేశంలో కల్లోలం హెచ్చిపోయింది. "ఈ కల్లోలాల కన్నింటికీ కారణం ఎవరు? పేదల ప్రతినిధులమని చెప్పుకుంటూన్న దేశద్రోహులు. వారిని నమ్మకండి. ప్రజలు చాలా మంచివాళ్ళు. వారికి శాంతిభద్రతలు ఇష్టం. క్షామ నివారణార్థం వాళ్ళెన్నాళ్ళయినా త్యాగయుతంగా పస్తులుంటారు. ఈ దేశద్రోహులు వాళ్ళకి తిండి జ్ఞాపకం చేస్తున్నారు. క్షామనివారక సభను పడగొట్టటం వాళ్ళ పనిగా పెట్టుకున్నారు. దేశంలో అశాంతీ, అరాచకమూ విజృంభించి ఆనందించాలని వీళ్ళ దుర్బుద్ధి." అని మహాసభ ప్రకటించింది.

పేదల ప్రతినిధులు దేశద్రోహులుగా నిర్ణయించబడ్డారు. "మేము మీ వాళ్ళం! మీరంతా పెద్దలు. మీరు ముందుండి మాకు దారి చూపకపోగా, తిండిదొంగలు ఆడించే ఆటలు ఆడుతున్నారు. ప్రజలు కరువు నెదుర్కొనే కార్యక్రమం ఇవ్వక, మమ్మల్ని వేటాడటం ఒక ఉద్యమంగా చేస్తున్నారు. ఈ విధంగా ప్రజలను మభ్య పెట్టడం ద్రోహం!.... రండి! మనమంతా కలిసి తిండి దొంగల్ని ఎదుర్కొందాం" అన్నారు పేదల ప్రతినిధులు.

వీళ్ళ కేకలు ఊరికే పోలేదు. వీటిలో ఉన్న సత్యాన్ని పేద ప్రజలు అర్థం చేసుకున్నారు. క్షామ నిర్మూలనాసక్తి కలవారంతా అర్థం చేసుకున్నారు. మహా సభలు క్షామాని కనుకూలంగా ఉన్న ముఠా, చెరువెండితే చేపలు బయట పడ్డట్టు! బయటపడసాగారు.

వీళ్ళు తిండి దొంగల ప్రాబల్యం చూసుకుని ప్రజలను ఆఖరుసారి వంచించ టానికి విధానాలు తయారుచేశారు.

"దేశద్రోహులు నశించాలి. ధర్మం వర్థిల్లాలి. దీనపరులకు జై! ధర్మాత్ము లకు జై! భూతదయకు జై!"

ఈ నినాదాలతో పేదల ప్రతినిధుల మీదికి మూఢ ప్రజని రెచ్చగొట్టటానికి ప్రయత్నించారు. కొంతకాలం అందరికీ మతులు పోయినట్లు కనపడ్డది.

"ఈ అన్యాయంకన్న కరువే బాగుంది. పేదల ప్రతినిధులమని పేరు పెట్టు కుని వీళ్ళంతా సంక్షోభం తెస్తున్నారే!" అని తెలియని విద్యాధికులు వాపోయినారు.

కాని ఇంత సంక్షోభమూ కరువును పారదోలే ప్రయత్నంతో ప్రజలకూ, ప్రజా ద్రోహులకూ మధ్య జరిగే సంఘర్షణలలో ఏర్పడ్డదని మందమతులకు కూడా తెలిసిరాసాగింది.

తమను తిండిదొంగలెంత యుక్తిగా వంచించారో కనుక్కున్నారు మహా సభ వారు. వారిలో ప్రజాహితం కోరిన వారంతా క్షామ నివారణోద్యమంలో ప్రజల పక్షంగా నిలిచారు.

"ఇంకా దారుణం రెచ్చిపోతుంది- చూస్తూ వుండండి!" అన్నారు తిండి దొంగల ప్రతినిధులు మారువేషాలలో ప్రజలమధ్య తిరుగుతూ. యథార్థానికి అటు వంటిదేమీ జరగలేదు.

అకస్మాత్తుగా తిండిదొంగలు మాయమైనారు. చూస్తుండగానే లక్షలకు లక్షల బస్తాల ఆహారధాన్యం నడివీధిలోకి నడిచి రాసాగింది.

కరువు అదృశ్యమయింది. మృత్యుదేవత వెళ్ళివస్తానని కూడా చెప్పకుండా అదృశ్యమయింది.

దేశంలో శాంతి సౌభాగ్యాలు వర్థిల్లినై.

—ముద్రణ : అభ్యుదయ, ఏప్రిల్ 1947

# అఖండుడు

ఆ మనిషికి నూరులోపల ఎంతవయస్సైనా ఉండొచ్చు. మాట్లాడటంమాత్రం ధాటిగా ఉంది. మాటలు దిగ్భ్రమ కలిగించేవిలా ఉన్నాయి.

"......నెహ్రూగారితో చెప్పేశాను. 'అబ్బాయీ, ఊగిసలాడక దేశవిభజనని ఒప్పేసుకో. ముందు పని జరగాలి' అన్నాను.... ప్రకాశంగారితో ఎంతపోరితే చీఫ్ మినిష్టరు కావటానికి ఒప్పుకున్నాడు."

అలా మాట్లాడుతూ పోతున్నాడు. చార్లీ చాప్లిన్‌ను అమెరికానుండి వచ్చెయ్యమని తానే చెప్పాట్ట! "అబ్బాయ్, యుద్ధం బాగా చేయించావు. నీ పని అయిపోయింది. మరి దిగిపో," అని చర్చిల్[1]కి చెప్పాట్ట! "దక్షిణ కొరియాలోకి మరీ దూరం వెళ్ళకు, దారితప్పి పోగలవు" అని ట్రూమన్[2]కి చెప్పాట్ట.

సమయానికి శ్రీశ్రీ లేనందుకు విచారించాను. అట్టడుగున దాగిన చరిత్ర రహస్యం కావాలంటాడు గద శ్రీశ్రీ. ఇదుగో రహస్యం!

"అయ్యా! తమరిప్పుడు మా ఆఫీసుకు ఎందుకు దయచేసినట్టు?" అని ఎవరో అడిగారు.

"మరేం లేదు. మీబాస్‌ని చూసిపోదామని. అతను కుక్కిమంచంలో పడుకుని గోళ్ళు గిల్లుకుంటుంటే 'లేవయ్యా లే! బిజినెస్ చెయ్యి,' అని యిందులోకి దించాను. చూస్తున్నారుగా! ఒక కోటికి పడగెత్తాడు. ఓ వెయ్యిమందికి భృతి కల్పిస్తున్నాడు. ఉన్నాడా అని అడిగితే బయటికి వెళ్ళాడన్నారు. వెయిట్ చేస్తున్నా."

"లాభం లేదండీ, ఆయన ఇవాళ మరి రారు." అనేశా. నా ప్రక్కన టెలిఫోన్ మోగింది.

ఆ పూలింకా ఉన్నాడా? వెళ్ళాడా?.... ఓ పదిరూపాయలిచ్చి పంపండి. డబ్బుకోసం వచ్చి ఉంటాడు." బాస్ గొంతు.

—ముద్రణ : యువ, ఏప్రిల్, 1977

---

1. చర్చిల్: సర్ విన్స్‌టన్ స్పెన్సర్ చర్చిల్ (1874 1965) బ్రిటిష్ మాజీ ప్రధాని, రాజనీతిజ్ఞుడు.
2. ట్రూమన్: హారీ ఎస్. ట్రూమన్ (1884-1972) అమెరికా మాజీ అధ్యక్షుడు. 1945 ఆగష్టు 6వ తేదీ మొట్టమొదటి అణుబాంబును హిరోషిమా నగరంపై వేయడానికి అనుమతి ఇచ్చిన వైట్ హవుస్ అధినేత.

# సర్వరోగ నివారిణి

అతణ్ణి అపరధన్వంతరి అన్నారు. అతను సర్వరోగనివారిణి కనిపెట్టి, దానితో అన్ని రోగాలూ నయంచేస్తూ, ఇతర వైద్యులనోట మట్టిగొట్టటమేగాక, బాగా డబ్బుకూడా సంపాదించాడు.

సర్వరోగనివారిణి తయారుచెయ్యడానికి కావలసినవి నాలుగే నాలుగు దినుసులు. అందులో రెండు మూలికలు. ఔషధ రహస్యం మరొకడికి తెలియటం ఇష్టంలేక అతను తానే శ్రమపడి ఓషధులను రహస్యంగా ఏరితెచ్చి మందు రహస్యంగా తయారు చేసేవాడు. ఇది శ్రమతో కూడిన పని.

పేదవాడుగా ఉన్నప్పుడు ఉత్సాహంగా శ్రమపడినవాడు, డబ్బు పోగవుతున్న కొద్దీ శ్రమ అంటే విముఖత తెచ్చుకున్నాడు. మరి ఏంచెయ్యాలి? సర్వరోగనివారిణి ధర పెంచాడు. సగం మందు అమ్మినా పాత రాబడికన్నా ఎక్కువ వస్తున్నది. కాని సగం శ్రమపడక తప్పటంలేదు.

ఏం చెయ్యాలి? తన మందును తనే కల్తీచేసి, ఓషధులకు బదులు ఇంకేవో తేలిగ్గా దొరికే ఆకులు వాడాడు. సర్వరోగనివారిణి రాను రాను జలుబును కూడా నయం చెయ్యలేని పరిస్థితికి వచ్చింది.

దానికి గిరాకీ తగ్గింది. అతడికి రాబడి తగ్గింది. పాతసంపాదనమీద బతికినన్నాళ్ళూ దర్జాగా బతికి, చిల్లిగవ్వ మిగల్చకుండా చచ్చాడు.

సర్వరోగనివారిణి ఎలా తయారుచేయాలో ఎవరికీ తెలీదు. అదే అతను మానవజాతికి చేసిన ద్రోహం.

—ముద్రణ : యువ, ఫిబ్రవరి 1977.

# ప్రజలదే భారం

మా యజమానులు నన్ను నట గండభేరుండను ఇంటర్వ్యూ చేసి, ఆ చేత్తోనే కలర్ ఎడ్వర్టయిజ్‌మెంట్ ఒడుచుకు రమ్మన్నారు.

గండభేరుండం గారికి సాష్టాంగ దండ ప్రణామా లాచరించి, గండంగారూ, మీరు నటించిన చిత్రం "చవట చిన్నోడు" నూరువారాలు పోయేట్టున్నందుకు ప్రపంచ ప్రజానీకమంతా గర్వించదగిన మాట నిజమే గాని, అది బొత్తిగా చవుకబారు అభిరుచులతో కూడివున్నదని ఒకరూ, ఇద్దరూ కాదు, అనేకమంది అనటం గురించి తమరేమంటారు?" అని అడిగాను.

దానికి భేరుండంగారు, "నాకు ఒకరితో పనిలేదు. ప్రజాభిప్రాయానికి తలొంచుతాను." అని నాకేసి తలొంచాడు, ప్రజాభిప్రాయమన్నట్టు.

ఇది తొమ్మిదినెల్ల కిందటిమాట. ఈ లోపుగా గండభేరుండంగారు నటించిన చిత్రాలు మూడు టపాకాయలు పేలినట్టు పేలాయి. ఈ సారికి నేనే శ్రీవారిని కలుసుకుని, "తవరి పిచ్చెర్లీమధ్య రెండు మూడు రోజులైనా ఆడక పోవటానికి కారణం ఏమి టంటారు?" అనడిగాను.

శ్రీవారు పెదవి విరిచి తల ఒక పక్కకు వంచి ఆలోచించి, "చూడండీ! మన పిచ్చెర్లలో మంచి అభిరుచి ప్రతిబింబించేటట్టు చూసే బాధ్యత ప్రజలది. దిగజారి పోతున్న చలన చిత్ర పరిశ్రమను ప్రజలే ఉద్ధరించాలి" అని సెలవిచ్చారు.

—ముద్రణ : యువ, డిశంబరు, 1977

# ఆఫీసులో అల్లరి

గుమాస్తా, బంట్రోతూ తప్ప అందరూ వెళ్ళిపోయినారు. దొర ఏడుగంటల దాకా పోడు. అంచేత గుమాస్తా యేడున్నరదాకా పడివుండాలిసొస్తున్నది. ఓవర్ టైమ్! ఎందుకో తెలీదు. ఏడుగంటలదాకా గుమాస్తాలందర్నీ పడేసి అట్టేపెడితే దొరగారి అంతరాత్మ తృప్తిపడుతుంది. అప్పుడుగాని ఆయన ప్రాణానికి యుద్ధ ప్రయత్నం సరిగా సాగుతున్నట్టు తోచదు. నిజంగా ఆపీసులో చెప్పుకోదగ్గ పని లేదు. బయటికి వెళ్లే ఉత్తరాల్లో మూడొంతులు అనవసరం. పైనించి వచ్చేవీ అంతే. బోలెడంతమంది గుమాస్తాలు. సగం మందికి పనిలో ఆసక్తిలేదు. పనిరాదు. పని చెయ్యరు. పొట్టగడవక వచ్చారు. ఉద్యోగం దొరికిన తరవాత పొట్టమాట మరిచి పోయి రేపటి సంగతి జ్ఞాపకం రాకుండా ఉండగలందులకు అడ్డమైన సొళ్లు కబుర్లూ చెప్పుకుంటారు. దొరగారు బయటికెళ్ళగానే అంతా జారుకుంటారు - డిస్పాచి-పైలింగ్ క్లర్కు తప్ప. వాడికింద తొత్తు బంట్రోతు.

కాలక్రమాన వాళ్ళవంతూ వచ్చింది. దొరగారు సంతకం చేసిన కాగితం ముక్కలన్నీ పైలుచేసి, చెయ్యనివి బొత్తిగా టేబిలుమీద పెట్టి కలాలూ పెనసళ్ళూ తీర్చిపెట్టి, ఆయన బల్లమీద జరగవలసిన మిగిలిన సద్దుడు బంట్రోతుకు వదిలి, డ్రాయర్లన్నీ తాళాలువేసి గుమాస్తా కాస్తా ఇంటిదారి పట్టాడు. మరో అయిదు నిమిషాలకి బంట్రోతుకూడా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయినాడు.

ఇక ఆఫీసులో అల్లరి ప్రారంభమైంది.

* * *

"ఈ యుద్ధం[1] యెప్పుడైపోతుందోగాని నా ప్రాణం చాలొస్తున్నది" అన్నది టైపు రైటరు.

"మధ్యలో నీకేం వచ్చింది? సంకురమయ్యా పోతున్నది మామీదిగా!" అన్నది కాగితాల బొత్తి.

"ఏం వొచ్చిందని అడిగితే యేం చెప్పేది? సంవత్సరం కింద కూడా ఇంత దిగినా సిల్లి పోలేదు, కాళ్ళన్నీ సళ్ల విచ్చినై. ఒంటో జరఫే లేదు, సరిగా వేళకి ఆయిలింగు లేదు. నూటికీ కోటికీ అయినా కొత్త రిబ్బను కట్టబెట్టరు, మొన్న మా గుమాస్తా దొరతో కాస్త మరమ్మత్తు చేయిస్తే బాగుంటుందని చెప్పబొయ్యేసరికి,

---

1. రెండవ ప్రపంచయుద్ధం ప్రస్తావన (1939-45)

"చాల్లే, యుద్ధం అయేదాకా అటువంటివి తలపెట్టకు!" అన్నాడు దొర. యుద్ధం అయేదాకా దక్కుతానా అనుకుంటున్నా!"

"అదే మీ అమెరికనుల తెగులు. అంత అయిష్టంగా యుద్ధంలో నేమని దిగావు? దిగిన తరవాత తీరళ్ళా చూడాలిగాని మధ్యలో ననేమిటి?" అన్నది కాగి తాల కట్ట.

"మొదలు నువెవరో చెప్పు. నీ మొహం చూస్తే ఆస్ట్రియా మొహంలా ఉంది ..ఇంకానయం అమెరికను శరీరంగనక ఈ బండచాకిరీ నిలబడి చేస్తున్నాను. ఇదే మా దేశంలో అయితే ఈ అగచాట్లుండవు. మా దేశంలో మా పనివాళ్ళని నిక్షే పంలా చూస్తారు. ఇట్లా ఆరు ప్రాణాలూ ఆహరించరు. నువు మొదలిక్కడ యేం చేస్తున్నావో చెప్పు."

"నేను రెఫ్యూజీని. ఎప్పుడో యుద్ధానికిముందే వచ్చాను. నేను కొందరి కొందరి మాదిరిగా రాత్రింబగళ్ళు స్వదేశాన్ని గురించి కలవరించి ఏడుస్తూ పాచోను. నన్ను సగానికి సగం చేశారు. ఒక పక్క కాదు రెండుపక్కలా తలంటుతున్నారు. పావు లంగుళం జాగా కూడా వదలకుండా బరుకుతున్నారు. నేను మాట్లాడానా? యుద్ధ సహకారం చేస్తున్నందుకు నేను గర్విస్తున్నాను."

"సగానికి సగం చేస్తున్నందుకు సంతోషించక పెద్ద త్యాగమల్లే చెప్పు కుంటావేం? అట్లా పొద్దంగా పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నారేమో ఈనాటిదాకా దక్కావు. లేకపోతే ఏనాడో పెంటకుప్ప మీదికిపోయి అయిపు లేకుండా అయి పోయేదానివి. ఈ దిక్కుమాలిన దేశంలో శత్రు ఆస్తికి చూపించే శ్రద్ధ మిత్ర ఆస్తికి చూపిస్తే ఎంతో బాగుండును!"

ఓ చెంప దొరగారి బల్లమీద మరో వాగ్వాదం చెలరేగుతున్నది. దొరగారి పెనసలు లెక్చరు పంచేస్తున్నది.

"....నా ఖర్మం ఈనాటికి ఇట్లా కాలబట్టీ కానీ నేనెప్పుడైనా యీ నాటు మొహాల మధ్య ఈ జైలులో ఉన్నానా? ఈ నాటు కలాలూ, వెధవ మొహాలేసుకుని నాటు పాళీలూ, గుండుసూదులకు బదులొచ్చిన యీ తుమ్మముళ్ళూ! ఛీ,ఛీ,ఛీ! హాయిగా పాశ్చాత్య నోటు పుస్తకాల వెంబడి, అందమైన కలాలతో పాటు ఉండవల సిన నా బ్రతుకు!"

"మేమూ నీతోబాటు యథాశక్తి యుద్ధప్రయత్నం చేస్తున్నామనేది నీకెక్కడా తట్టలేదు. దొరగారి ఆగ్రహానికి పాత్రమై మా పాళీలు అర్ధాయుస్సు చావులు చస్తున్నై. మేం ఖరీదైన వాళ్ళం కామని మమ్మల్ని విరిచి పారెయ్యటమేకాని మేం లేకుండా పని జరగదనీ, మా స్థానం ఆక్రమించవలసింది మావంటి వాళ్ళేననీ దొరగారికి తట్టదాయె....దొరగారికి నీమీద ఉండే ప్రేమలో మామీద నూరోవంతు లేదు. నువు కనిపించకపోతే గుమాస్తాలందరి మీదా లేస్తారు. మేం కనిపించక పోతే ఆయన కే చింతా లేదు. అసలు మొహాలే ఆయనకు స్పష్టంగా తెలీవూ!

ఎన్నిసార్లు ఎర్రకలాన్ని నల్లసిరాలోనూ, నల్లకలాన్ని ఎర్రసిరాలోనూ ముంచలేదు. సిరాలు కూడా ఖరాబయి కూచున్నై. ఆయనకి కోపం వచ్చినప్పుడు "బుడ్లు రెండూ బయట పోంచి, కడిగి మళ్ళా నించు" అంటారు మా తప్పువల్లే సిరాలు చెడిపోయినట్టు. పాశ్చాత్య వస్తువులే ఉండాలని పట్టుబట్టుకుంటే పనిగడవదని గుర్తించి మా నాటు సిరాలు ఆమోదించినందువల్ల కలిగిన కాస్త లాభమూ నాలుగు రోజులకోసారి సిరాలు ఒంపెయ్యటంలో గూబల్లోకి తీస్తున్నది! ...నాటు సిరా ఎంత పారబోసినా దానికి విలువ ఏమీ లేదనే కదూ?" అన్నది కలం.

"నాకో సంగతి తెలీకుండా ఉంది; ఈ విదేశీ వస్తువులు ఇంత ప్రియం కావటానికి కారణం ఏమిటి? మన వస్తువులకు విలువే లేకపోవట మేమిటి?" అన్నది పేపరు వెయిటు.

"నీకు తెలీదా ఏమిటి? వాళ్ళ దేశాల్లో ఈ వస్తువులకీ విలువలేదు. కాని దారిలో నీటిమీద ఎగుమతి దిగుమతి సుంకాలు పడి ఖరీదు బలిసి చాలా ప్రియతమంగా తయారవుతై," అన్నది పిన్ కుషన్.

"నువు కూడా ఈనాటికొక దేశభక్తుడివైనావులే. మొన్న మొన్నటిదాకా విదేశీ గుండుసూదుల వొంటో గుచ్చుకుని కులుకుతూ తిరిగి, వాటిని తప్ప మొయ్యక, ఇవాళ నాటు ముళ్ళు రాగానే బోడి మొహం వేసుకుని కూచోటానికైనా వొప్పుకుని మమ్మల్ని స్వీకరించని దానివి!" అన్నది తుమ్మముల్లు.

"అట్లా అనటం ధర్మమా? విధి బలవత్తరమైతే నేనేం చెయ్యను? అవును, పై వాళ్ళని మోశాను, వాళ్ళని పెట్టుకొని కులికాను కూడానూ! సరేనా? ఇప్పుడు మిమ్మల్ని మొయ్యనన్నానా? నన్ను గురించి పై వాళ్ళకి అపోహలున్నై, నేను విదేశీ సరుకుతప్ప మొయ్యనని. దానికి నేనేం చెయ్యను. బొత్తిగా అసహాయ స్థితిలో ఉన్నాను!" అని మొర పెట్టుకుంది పిన్ కుషన్.

"ఏడవకు పిన్ కుషనూ! ఎల్లకాలం ఇట్లాగే ఉంటామా? మనకి మాత్రం మంచిరోజులు రావా? దేవుడు మేలుచేస్తే మన దేశంలో మటుకు నిన్నలంకరించే గుండుసూదులు తయారు కాకపోతాయా?" అన్నది సిరాబుడ్డి.

దొరగారి పెన్సలు పెద్ద పెట్టుగా నవ్వింది. "పిచ్చివాళ్ళల్లారా! మీ అమాయకత్వం చూస్తే నాకు జాలేస్తున్నది. మీకీ విధంగా మాట్లాడుకునే అవకాశమైనా ఇచ్చింది ఈ యుద్ధం. దీని మూలంగా మీకు దొరగారి టేబిలు మీద స్థానం దొరికే టప్పటికి, మాకన్న పూర్వం ఇక్కడ ఉంటూ వచ్చిన వాళ్ళని చూసి యాదవటం మొదలుపెట్టారు. రేపీ యుద్ధం అయిపోతుంది. మీ నికృష్ట స్థానాలకు మీరు పోతారు. దొరగారి టేబిలుమీద అందమైన విదేశీ ఊటకలాలూ, పెన్సళ్ళూ, సిరా బుడ్లూ, అద్దుడు కాగితాలూ వచ్చేస్తై. మీమీస్థానాలకు తిరిగిపోయి మీ అజ్ఞాత జీవితాలు మీరు గడుపుతారు!" అన్నది పెన్సలు.

"తమ్ముడూ, నువొక చిన్న పొరపాటు పడుతున్నావు!" అన్నది దొరగారి కుర్చీ. "ఈ యుద్ధం ఎందుకు జరుగుతున్నదో నీకు సరీగా తెలీలేదు. అందుచేతనే యుద్ధం గురించి దాదాపు పశ్చాత్తాపం కనబరుస్తూ మాట్లాడావు - ఇది మాబోటి నాటు వస్తువుల అజ్ఞాతవాసాన్ని అంతం చెయ్యటానికి అని మాకు తెలుసు. నేను దొరగార్ని మోస్తున్నానే అని విచారించటం లేదు. ఆయన ద్వారా యుద్ధం సాగుతున్నది. నేను సంతోషంగా మోస్తాను. మధ్య మధ్య ఏమరినప్పటికీ మొత్తంమీద దొరగారికి మీ నిజమైన న్యాయమైన స్థానం తెలియబట్టే మీకీ బల్లమీద స్థానం తక్షణం ఇచ్చేశారు. అది కేవలమూ విధిలేక చేసిన పనికాదు. ఆ అంతరార్థం నీకేం తెలుస్తుంది. దొరగారి డైరీలో టెలిఫోను నంబర్లూ ఆపీ గీకేదానివి!.... ఓ వేళ నువు చెప్పినట్టే యుద్ధం అయిపోగానే మీ అందరికీ మళ్ళా అజ్ఞాతవాసమే పట్టిన రోజున మీ దొరగారు, మేమూ, తెలీకుండానే నువ్వు ఈ యుద్ధంలో పూర్తిగా ఓడిపోయినా మనుకో. తెలిసీ తెలియని కబుర్లు చెప్పకు?" అని, రోజల్లా శ్రమించి ఉన్న ప్రాణి కావటంవల్ల కునికిపాట్లు పడసాగింది.

—ముద్రణ : ప్రజాబంధు ఉగాది సంచిక, 1945

# దేశీయ పరిశ్రమ

గిర్ధర్‌భాయి దగ్గిర పాతికలక్షల కంటె జాస్తి డబ్బులేదు. ఎట్లా ఉంటుంది? ముప్పై లక్షలు బర్మాలో ఇరుక్కుపోయింది. ఆ విచారం పట్టలేక నాలుగు లక్షలు పెట్టి బొంబాయిలో అయిదారంతస్తుల మేడలు కొనేశాడు. కాని ఇప్పుడు గిర్ధర్‌భాయికి కొంచెం తెలివొచ్చినట్టయింది. అందుచేత ఆ ఉన్న తృణమో కణమో పెట్టుబడి చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాడు.

"ఏదన్నా వ్యాపారం చెప్పు, భాయ్. మా హిమ్మత్ భాయ్ రెండునెల్లకిందటే అమెరికాకు మూడువేల టన్నుల కరక్కాయ ఎగుమతిచేసి కాలిమీద కాలేసుక్కూచున్నాడు. నేనే వొట్టి చవటనై పోయినాను!.. .పాతిక లక్షలు-వృధాగా బాంకులో మూలుగుతున్నై!...."

గిర్ధర్‌భాయిని చూస్తే నాకు జాలేసింది. మనబోటి తెలీని వాళ్ళం డబ్బేమిటో సుఖమనుకుంటాంగాని, వొట్టిది. మా వాడికి నిద్రాహారాలు లేవు. అన్నానికి కూర్చుంటే పాతికలక్షలూ బాంకులోనించి మూలగడం వినపడుతుంది; నిద్రపోదామంటే వినిపిస్తుంది. వెధవది, మనిషి మూలుగే ఎంత దుస్సహంగా ఉంటుందా, ఇక డబ్బు-అందులోనూ, పాతిక లక్షలు-మూలుగుతుంటే మతే పోతుంది. బర్మాలో దిగబడిపోయిన ముప్పై లక్షలు మావాణ్ణి బాధించలేదు. ఉన్న డబ్బుతోనే చావు!

ఏం చేద్దామన్నా యుద్ధమైపోయింది. అంటే యుద్ధం చెడ్డదనికాదు; యుద్ధం మూలంగా ప్రతిదానికీ కంట్రోలూ, పర్మిట్లూ, ప్రయారిటీలూ, బుకింగులూ, లేకపోవటాలూ, వల్లకాడూ, వశినకాడూ అయిపోయె.

మావాడు ఇప్పుడు అర్జంటుగా ఏదో ఓ పదార్థం ఏదో ఓ పరాయి దేశానికి ఎగుమతి చెయ్యాలి. ఏదైనాసరే, ఏదైనాసరే! పత్తిగింజలో, చింతపిక్కలో, సున్నపురాళ్లో, బలపాలో, తుప్పుపట్టిన ఇనప చెత్తో—ఏదైనాసరే ఎక్కడ దొరుకుతుందో, ఎవరు కొంటారో, ఎంతకు దొరుకుతుందో, ఎంతక్కొంటారో కనుక్కుంటే తనొక లక్ష చేసుకుని, నాక్కూడా—వెధవది, డబ్బేగా!—ఓ వెయ్యి పారేస్తానంటాడు మా గిర్ధర్‌భాయ్.

నాకు తిక్కెత్తుకొచ్చింది. చివరికి వాణ్ణి నాలుగు తిట్టి వాడికి దేశీయ ఆర్థిక పరిస్థితి మీద చిన్న ఉపన్యాసం ఇచ్చాను.

"ఎంతసేపటికీ వ్యాపారమో, వ్యాపారమో అని ఏడుస్తావు. నీ వ్యాపారమే మనదేశాన్ని ఈ స్థితికి తెచ్చింది. పాశ్చాత్యులు వ్యాపారం చేస్తున్నారంటే వాళ్ళకి

పరిశ్రమలున్నై. చిత్తం వచ్చిన ధరలకి వస్తువులమ్ముకునేందుకు దిక్కుమాలిన బానిస దేశాలున్నై. నీకేముంది? నువు వ్యాపారం చేసినకొద్దీ దేశానికి కష్టమే. ముడి పదార్థాలన్నీ ఎగుమతిచేసి లాభం చేస్తావు. ఆ పదార్థాలే వాళ్ళు వస్తువులు చేసి పంపిస్తే మళ్ళీ దిగుమతి చేసి లాభం తీస్తావు. రెండందాలా దేశాన్ని దోస్తున్నావు. ఎందుకు నీ దిక్కుమాలిన వ్యాపారం. చాతయితే పరిశ్రమలు సాగించు. ముడి పదార్థాలు పైకి పోనివ్వకు. వాటిని సంపదగా మార్చి పైవాళ్ళు తీసుకునే లాభం కూడా నువే తీసుకో. ఆ పని చెయ్యగలిగితే నాతో మాట్లాడు" అన్నాను.

"నే కాదన్నానా? నా డబ్బంతా తీసుకుని నువు ఏదన్నా పరిశ్రమ నడుపు," అన్నాడు గిర్ధర్ భాయ్.

"ఏం పరిశ్రమ నడపమన్నావ్?" అన్నాను.

"నీ ఇష్టం! నేనేమీ కాదన్ను."

నేను మొదట్లో మా వాడి మాట నమ్మలేక పోయినాను. కాని వాడు నన్ను రోజూ తినసాగాడు—పరిశ్రమ ఏమయిందని! వాడి పోరు పడలేక అమ్మడు పొయ్యే ఫ్యాక్టరీలేమైనా ఉన్నయ్యా అని ఆరా తియ్యసాగాను.

ఉంది—ఓ దొమ్మరగూడెం మధ్య ఓ పెద్దమనిషి ఓ చిన్న ఫ్యాక్టరీ నడుపుతున్నాడు. ఓ కొలిమి ఉంది. అందులో ఇత్తడి కరిగించి కడ్డీలు పోతపోసి పక్కన ఓ చిన్న మోటారు సహాయంతో తీగ లాగుతున్నారు. జాగా గలీజుగా ఉంది. కొలిమిమీద రెండు సీనారేకులు కప్పి ఉన్నై. మిగతాదంతా బట్టబయలే. ఎక్కడ చూసినా బొగ్గులూ, బూడిదా, ఇసకా!

"ఇది మనకు బాగా లేదు. ఊరికే ఇచ్చినా దండగేనేమో!" అన్నాను.

"అట్లా అనకు. దీన్ని మనకి ముప్పైవేల కమ్మటానికి సిద్ధంగా ఉన్నాడు—నేనంతా లెక్కలు కట్టాను. నెలకు దీనిమీద వెయ్యిరూపాయలు నికరంగా లాభం వస్తుంది. ఇప్పుడిక్కడ కూలీలు లేరు. మనం మరో నలుగురు కూలీలని పెడితే వారానికి వెయ్యి హీనంగా వస్తుంది" అన్నాడు గిర్ధర్ భాయి.

"ఇప్పుడు ఫ్యాక్టరీ కలవాడికి కూలీలు దొరకకనా అమ్ముతున్నాడు.... ఈ వెధవ ఫ్యాక్టరీకి ముప్పై వేలేమిటి? చాల్లే పద" అన్నాను.

"ఇత్తడి తీగే, పౌను నాలుగు రూపాయలు అమ్ముతున్నది. నామాట విను. యాభై వేలైనా పారెయ్యటానికి నేనున్నాగా?" అన్నాడు గిర్ధర్ భాయ్.

మొత్తానికి మావాడికా ఫ్యాక్టరీ కొన్నదాకా తోచలేదు. కొన్నవాడు అంతటితో తృప్తి పడక పదిమంది కూలీలని పెట్టాడు, నెలకు రెండొందలిచ్చి ఓ మెటలర్జిస్టు[1]ను తెచ్చాడు. నాక్కూడా ఓ మూడొందలని జీతం ఏర్పాటు చేసి అక్కడే కూచో

1. మెటలర్జిస్టు : ముడిఖనిజాలనుండి లోహాల తయారీకళలో నిపుణుడు.

మన్నాడు. నేను చేసేది ఏమీ లేదు.

మా మెటలర్జిస్టు కూడా మాకు తగ్గవాడే. ఈ విధంగా ఇత్తడి తీగ తియ్యటం అన్నిటికన్నా తుచ్ఛమైన పని అనేవాడు.

అయితే మన కదికూడా సరిగా చాతకాకుండా ఉందేం, అనేవాణ్ణి.

బాగుందే? లాబొరేటరి ఏది, పైరామీటర్లే[1]వి? ఎలెక్ట్రిక్ ఫర్నేసు[2]లేవి, చిక్ కాస్టింగ్ పరికరాలేవి? అనేవాడు.

ఏమో అనేవాణ్ణి.

ఇంకేం అనేవాడు. తన కవకాశం ఇస్తే రాగి తెచ్చి దాన్ని పుటం పెడతా ననేవాడు. నేను నిరుత్సాహ పరిచేవాణ్ణి. చేస్తే రకరకాల కంచులు చెయ్యాలనే వాడు.

అవుననేవాణ్ణి.

కాని ఇత్తడి తీగ మాత్రం కనిపించేదికాదు. బొత్తిగా కనిపించలేదని కాదు. మూడొందల పౌనులు తీగె తయారయింది — మొదటి ముప్పై రోజుల్లోనూ. అదన్నా అమ్మి డబ్బు కళ్ల జూతామంటే మా గిర్ధర్ భాయ్, వాదు దాంతో పని ఉందన్నాడు.

నాకెందుకని ఊరుకున్నాను. నాకిక ఏ విచారమూ లేదు. ఎప్పుడో మా వాడు వచ్చి నా ఎదటపడి కంటతడి పెట్టకపోడు — ఇంత డబ్బూ వృథాగా పార బోశామే అని! అప్పుడు వాణ్ణి ఎట్లా సముదాయిద్దామా అనే సమస్య ఒకటే నన్ను బాధిస్తున్నది. కాని మావాడి ఉత్సాహమూ వాడు తీరని పనిమీద తిరిగే తిరుగుడూ చూస్తే ఇప్పట్లో జ్ఞానోదయమయే లక్షణాలు కనిపించలేదు.

నా నెల జీతం నాకు సక్రమంగానే ముట్టింది. నాకు తెలీకుండా కొంతతీగ అమ్మాడేమో అని అనుమానం కలిగిందిగాని అదేమీ జరగలేదు. తీగ తీగలాగే ఉంది.

నా చేతిమీదిగానే మా మెటలర్జిస్టుకూ కూలీలకూ కూడా జీతాలు ముట్టినై.

నేనాశ్చర్య పడ్డానుగాని పైనేమీ అనలేదు.

ఇంతలో మా ఫ్యాక్టరీ చూడటానికి ఎవరెవరో గుజరాతీ సేటులు రాసాగారు. వాళ్లు మా తీగ చూస్తారేమో అని నాకు సిగ్గేసింది. కాని అనవసరంగా బాధపడ్డాను. మా గిర్ధర్ భాయి వాళ్లకా తీగే చూపించాడు. కొలిమి కూడా చూపించాడు. బొగ్గులూ, బూడిదా, ఇసకా కూడా చూపించాడు. ఆఖరికి గొరడీ వాడల్లే మా మెటలర్జిస్టునూ

---

1. పైరామీటర్లు : అత్యధికోష్ణతలను కొలిచే సాధనాలు.
2. ఎలెక్ట్రిక్ ఫర్నేస్ : కరెంటు కొలిమి బట్టీ
(1944 ప్రాంతాల్లో జయపూర్‌లో ఇన్స్పెక్టరేట్ ఆఫ్ మెటల్ అండ్ స్టీల్‌లో ఫోర్మన్‌గా పనిచేసిన అనుభవం ఈ కథలో)

కూలీలనీ చూపించాడు. సేటులు వాళ్ల భాషలో "బద్ధూసారూభే....కమోనధీ!" అని ఏమిటో చెప్పుకున్నారు.

మావాడు వాళ్లతో వాతానికి వెయ్యిరూపాయలు లాభం వస్తుందని చెబుతున్నట్టు అనుమానం వేసింది. వాడికింకా అదే భ్రమ ఉండటం చూసి ఆశ్చర్యం కూడా వేసింది.

అయితే చిత్రం ఏమిటంటే ఆ గుజరాతీలు మరో వారం రోజుల్లో మా ఫ్యాక్టరీని అరవై వేలకొన్నట్టు తెలిసింది.

"నిజమేనా?" అన్నాను గిర్ధర్ భాయ్‌తో.

"పొరపాటు చేశాను. అమ్మకుండా ఉండాలిసింది. మనకి చాలా లాభం రాబోతుండగా అమ్మేశాం. వాళ్లు లక్షలు గడిస్తారు.... నిన్ను ఏదన్నా మంచి పరిశ్రమ చూడమంటే చూడకనే పోతివి!" అన్నాడు.

"ఫ్యాక్టరీ ఎందుకమ్మావ్? నీ బుద్ధికి కొనటం అమ్మటం తప్ప ఇంకోటి తట్టదేం?" అన్నాను.

"ఆ వెధవ ఫ్యాక్టరీ మనకెందుకు? మనం పెద్దది పెడదాం. పాతిక లక్షలు మూలుగుతున్నై. చూడుమరి" అన్నాడు.

"ఏం చూడమన్నావ్? మళ్లా అదీ అమ్ముతావ్?"

"అమ్మితే నీకేం? మళ్లా ఇంకోటి కొంటే సరిగా?" అన్నాడు మా పారిశ్రామికుడు.

—ముద్రణ : రూపవాణి, ఫిబ్రవరి, 1945

# ఫారిన్ కొలాబొరేషన్

నిర్ఘాంతపోయాను. పాపారావు బంకు ఏమయింది? శ్రేష్ఠమైన లంక పొగాకు చుట్టలిచ్చే పాపారావును ఏదో పెద్ద చేప మింగింది! పాపారావు బంకు ఉండవలసిన చోట అద్దాలషాపు వెలిసింది. నేను ప్రపంచాన్ని తిట్టుకొని పాపారావు కోసం జాలి పడుతుండగా ఒక ఫాషన్‌బుల్ మనిషి పెరిగిన జుట్టుతో బెల్‌బాటమ్ పాంట్‌తో బయటికి వచ్చి, నన్ను చూసి చిన్న కేక పెట్టాడు.

పాపారావే! హౌ వండర్ ఫుల్! చిన్న చేపను పెద్ద చేప మింగలేదు. చిన్న చేప పెరిగి పెద్దదయింది. కాని ఈ మార్పు ఎలా సాధ్యమయింది? పాపారావుకు పెట్టుబడిలేదు! పెద్ద ఆర్జనా లేదు - రోజుకు నాలుగు రూపాయలు అంతే!

పాపారావు నన్ను లోపలికి తీసుకుపోయాడు. కోకాకోలా తెచ్చి ముందు పెట్టాడు- షాపు నిండా కోక్‌లే!

"ఏమిటిది? ఏమయింది? జీతముమీద ఇక్కడ ఉంటున్నావా?" అన్నాను.

"అమెరికన్ కొలాబొరేషన్ గురూగారు! పిన్‌కోర్‌వాట్ట డాలర్లు పెట్టుబడి చేస్తాననీ, వ్యాపారం పెంచమనీ అన్నాడు. ఇదంతా ఆడి చలవ. అమ్మకాలు రోజుకు రెండింతలు దాటతాయి. అయితే అంత ఆడికే పోతుంది. పోదూమరీ? ఇదంతా నిజానికి ఆడిదేగా? నాకు రోజుకు అయిదారు రూపాయలు మిగులుతాయి చాలదా?" అన్నాడు.

పాపారావును అభినందించాను.

ఇది కిందటేడు. ఈ ఏడు అటుకేసి వెళితే "ఇండో-అమెరికన్ కోకా కోలా సెంటర్" ఉన్నది గాని అందులో పాపారావు లేడు. ఇంకెవడో ఉన్నాడు. అమెరికా వాడు ఇండియా నుంచి ఉడాయిస్తూ షాపును మరెవడికో అమ్మాట్ట. పాపారావు ఏమయ్యాడో తెలీదు. మళ్ళీ బంకు తెరుస్తాడా? తెరవడు. మళ్ళీ లంక పొగాకు చుట్టలు అమ్ముతాడా? అమ్మడు.

ఇంక పాపారావు నాకు కనిపించే అవకాశం లేదు.

—ముద్రణ : యువ, జూన్ 1977

# స్వాతంత్ర్యం ఖరీదు

"శ్రీపతి" - కలంపేరు—తన భార్యతో అన్నాడు: "లక్ష్మీ, స్త్రీల విమోచనం గురించి వరుసగా వ్యాసాలు రాద్దామనుకుంటున్నాను. వాటిని నీ పేర పంపించి, పత్రికలో అచ్చేయిస్తాను, ఏం?"

"మీ పేరే పంపరాదూ?"

"ఇంకా నయం. ఇప్పటికే నా కలం పేరు మా ఆఫీసులో కొందరికి తెలిసిపోయింది. మా బాస్‌కు తెలిస్తే ఉద్యోగం ఊడుతుంది."

"ఇంకో కలంపేరు పెట్టుకోండి"

"మగపేరుతో రాస్తే ఆడాళ్ళ పత్రిక అచ్చెయ్యదు."

"ఆడపేరు పెట్టుకోండి."

"అందుకేగదా నీ పేరు పెడతా నంటున్నాను."

"నా పేరుతప్ప ఇంకో ఆడపేరు దొరకలేదా? నాపేరు నేను అరువియ్యను."

"అది కాదే, వెర్రిమొహమా! ఎవరన్నా ఇంటర్‌వ్యూ చేస్తామని వస్తే? ఉత్తరాలు రాస్తే?"

"అదా సంగతి? మీ దారిన మీరు ఏదో గాలికి పారేస్తే ఆ తరువాత తిట్లూ, దీవనలూ నేను భరించాలా? ఎంతమాత్రం వీల్లేదు!"

"నీ వరస ఏమీ బాగాలేదు. నేనైనా మీ ఆడవాళ్ళ ఉద్ధరింపులేగదా చెబుతున్నాను? ఆడవాళ్ళ స్వేచ్ఛకోసం లోకమంతా ఘోషిస్తూంటే నువు కాస్త సహకరించ నంటావే! ఆడదానివికాదూ? సిగ్గులేదూ?"

"ఆ మాట అన్నారు గనక నా స్వాతంత్ర్యాన్ని అమ్ముకుంటాను. దానికి ఏమిస్తారు? అయిదు తులాల బంగారం నగలూ, మూడు పట్టుచీరలూ ఇస్తారా? టి.వి. సెట్టు కొంటారా?"

"ఏమాశ్చర్యం నీ స్వాతంత్ర్యాన్ని అమ్ముకుంటావా?"

"జీతం డబ్బులకు మీ స్వాతంత్ర్యాన్ని అమ్ముకున్నట్టు మీరు ఎన్నిసార్లు అన లేదూ? పెట్టుబడిదారీలో ఎవరికీ స్వాతంత్ర్యం ఉండదని లక్షసార్లు అన్నారే, ఆడవాళ్ళ స్వాతంత్ర్యానికి పెట్టుబడిదారీ అడ్డంరాదా?"

—ముద్రణ : యువ, జనవరి 1977

# ప్రజా పిశాచాలు

ఒకానొక దేశంలో గ్రహచారం బాగాలేక ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. అకస్మాత్తుగా ప్రజలను తమ పాలకులను ఎన్నుకోమంటే, తమను అంతవరదాకా నేలబెట్టి కాలరాచిన ప్రభువులనే ఎన్నుకున్నారు. వాళ్లు తప్ప మరొకరు అధికారం చెలాయించటం ప్రజలు ఊహించలేకపోయారు.

అయినప్పటికీ ప్రభువులు తమ భవిష్యత్తు గురించి బెంగపడక తప్పలేదు. ఇవాళ కాకపోతే రేపైనా ప్రజలు తెలివిమీరి తమ అధికారాలు గుర్తిస్తారు. అప్పుడు తమగతి ఏంకాను?

"ప్రజలను అదుపులో పెట్టే సాధనం కావాలి?" అన్నాడొక ప్రభుభక్తి పరాయణుడు.

"మత విశ్వాసాలను తదనుగుణంగా మార్చి పురాణాలూ, హరికథలూ చెప్పాలి. రాజభక్తి అన్నదానికి ఇంకా విలువ ఉన్నట్టు కథలూఅవీ రాసి పసిపిల్లల దగ్గర నుంచీ నూరిపోయాలి. దేశభక్తి అన్నదాన్ని తొక్కిపెట్టాలి," అన్నాడు మాజీ ఆస్థాన సిద్ధాంతి.

"చాలదు!" అన్నాడు ప్రభువు ముక్తసరిగా.

"ప్రజలను తారెత్తించటానికి పిశాచాలను తయ్యారుచెయ్యాలి," అన్నాడు సేనాపతి.

"పిశాచా లెక్కడున్నాయి? కథలు చెప్పకు"

"పిశాచాలు మనలోనే ఉన్నాయి. వాటిని తరిఫీదు చెయ్యాలి అంతే - రక్షకభటుడు అనే మాటకు ప్రజాస్వామ్యంలో అర్థం ఉండదు. వాణ్ణి కొద్ది శ్రమతో మానవత్వంలేని పిశాచంగా తయారు చేయవచ్చు. వాడికి చంపటంలోనూ, చిత్రహింసలు చెయ్యటంలోనూ, మనుషుల ఆర్తనాదాలు గంధర్వగానంలా వినిపించేటట్టు చెయ్యటంలోనూ తరిఫీదు ఇయ్యవచ్చు. ఏదో అవకాశం దొరికితే చాలు మనుషుల కీళ్లు విరగగొట్టడమూ, వాళ్ళ ఆహారంలో ఉచ్చపోయటమూ, దాహంతో బాధపడుతుంటే వాళ్ళకు అందకుండా నీరు ఉంచటమూ, ఆడవాళ్ళను చెరచటమూ, ఖైదులో ఉన్నవాళ్ళను కాల్చి చంపి పొలిమేర దగ్గర పారెయ్యటమూ — ఇలాటి సవాలక్ష పైశాచిక కృత్యాలు వాళ్లు తమ ఆనందంకోసం చెయ్యాలి. ఆజ్ఞాపించి చేయించవచ్చును గాని కొంత కాలానికి వాళ్లు తిరగబడే అవకాశం ఉంది. అందుచేత పిశాచత్వం వాళ్ళ ప్రవృత్తి అయేలా ఒక సిబ్బందిని తయారుచెయ్యాలి. వాళ్ళకు వాళ్ళుగా పెద్ద జీతాలు అక్కరలేదు, జనాన్ని చెండుకు తినటం నేర్పాలి. వాళ్ళకు ప్రభుభక్తి, అంటే తమ పైవాళ్ళపట్ల కుక్కలా ప్రవర్తించే గుణం కూడా నేర్పాలి "అన్నాడు. అందరూ కరతాళధ్వనులు చేసి, "గ్రేట్! గ్రేట్!" అన్నారు.

—ఫిబ్రవరి, 1978

# విప్లవకారుడు

ఆయన పెళ్ళి చేసుకున్నాడు. ఆయన పూజా మందిరంలో ఉన్న దేవుడు గాక, ఆవిడ ఒక దేవతను తెచ్చింది. ఇద్దరూ కీచులాడుకున్నారు. పూజామందిరంలో అగ్రస్థానం దేవుడిదా, దేవతదా?

పురోహితుణ్ణి పిలిచారు. "మీరు అనవసరంగా కీచులాడుతున్నారు. ఆ దేవత ఆ దేవుడికి భార్యే తప్పవిడిచి మరొహటి ఏమిటిన్నీ కాదు!" అన్నాడు పురోహితుడు.

భార్యాభర్తలకు రాజీ కుదిరింది. వాళ్ళ కడుపున నాలుగు కాయలు కాశాయి. స్వతంత్ర భారతంలో వాళ్లు విదేశీ చదువులు చదివితే గాని పైకిరారని, తల్లిదండ్రులు వాళ్ళను క్రైస్తవ బళ్ళలో వేశారు. వాళ్లు చదువు పూర్తి అయ్యేలోపల ఏసుక్రీస్తే దేవుడనీ, సిలువను మెడలో తగిలించుకుని కళ్ళకు అద్దుకోవచ్చుగాని, దేవుళ్ళనూ, దేవతలను పూజించటం మూఢ విశ్వాసమనీ అన్నారు.

మళ్ళీ సంఘర్షణ మొదలయింది. పురోహితుణ్ణి పిలిచారు.

"క్రీస్తు అనగా ఎవరు? మన కృష్ణుడే. జైల్లో పుట్టాడు. అసలు దేవుడు ఒకడే. మనం అతనికి ఏవేవో పేర్లు పెట్టుకుని తగాదా పడతాం తప్పవిడిచి మరొకటి ఏమీన్నీ లేదు" అన్నాడు పురోహితుడు.

కూతురికి పెళ్ళి చేశారు. అల్లుడు అత్తవారింటికి వచ్చి పూజా మందిరం నిండా దేవతలనూ, గోడలమీద ఏసుక్రీస్తు పటాలనూ చూసి, "మీ మోహాలు మండా మీరింకా ఈ రాతి యుగంలోనే ఉన్నారా?" అంటూ విగ్రహాలనూ పటాలను విసురు పుచ్చుకుని వీధిలో పారేశాడు.

మామగారూ, బావమరుదులూ అతన్ని విప్లవకారుడని పోలీసులకు అప్పగించారు. అతనిమీద నాస్తికుడని చార్జి పెట్టలేదు; ఆస్తి హక్కులకు విరోధి అనీ, సాయుధ విప్లవవాది అనీ రాజ్యాంగాన్ని నాశనం చేయజూస్తున్నాడనీ వేరు వేరు సెక్షన్ల కింద చార్జీ చేశారు.

అన్ని ఆరోపణలూ నిజమేనని అల్లుడు ఒప్పేసుకున్నాడు.

— ముద్రణ : యువ, జనవరి 1978

# సోహమ్

నా భార్య పొరబడిందనుకున్నా, నా మిత్రులూ, దగ్గిర బంధువులూ కూడా పొరపాటు పడ్డారని ఎలా అనుకోను? నేను మామూలు మనిషిని కాను. నాలో ఏదో మానసిక వ్యాధి వున్నది. నాలో అతిశయమో, అహంకారమో, ఆత్మ విశ్వాసమో, దర్పమో-ఏదో లేదు. "నీకు వెన్నెముకలేదు,"[1] అన్నారు కొందరు ఇంగ్లీషులో. నా భార్య ఉద్దేశం నాకసలు బుద్ధే లేదని.

నాలో లేని దేమిటో చెప్పలేను గాని ఉన్నదేదో నాకు తెలుసు. నేను అనేక మందితో సందర్భాన్ని బట్టి గొప్పతనం చూస్తాను. సెలూన్‌కు వెళ్ళినప్పుడు మంగలివాణ్ణి, బస్సెక్కినప్పుడు డ్రైవర్నో, రిపేరు చెయ్యటానికి వచ్చిన ఎలెక్ట్రిషియన్‌నో, ఏ అధికారినన్నా చూడబోయినప్పుడు ఆఫీసు బాయ్‌నీ, గొప్పవాళ్ళ గేట్ దగ్గర గూర్ఖానూ, ఇలా ఎవరి పని వాళ్ళు చేసేటప్పుడు ప్రతివాణ్ణి నేను గౌరవ భావంతో చూస్తాను. ఇది మటుకు నిజం.

"చెప్పులుకుట్టే వాడితో కూడా అంత నమ్రతగా మాట్లాడాలా!" అంటుండేది మా ఆవిడ. అవును. నేను చెప్పులు మరమ్మత్తు చెయ్యలేనే? వాడితో నాకుపని ఉన్నదే! నేను అలా అనుకోవడం తప్పన్నారు. నేను బిచ్చగాణ్ణి కాదు, బీదవాణ్ణి కాదు. నాకు ఏవైనా పనులు చేసి డబ్బులు పుచ్చుకునే వాళ్ళందరినీ నేను హీనంగా చూడాలని నా హితం కోరే వారందరూ ఏకగ్రీవంగా చెప్పారు. కాని అది నాకు సాధ్యం కాలేదు.

అందరూ పెట్టే పోరు పడలేక నా జబ్బుకు ఏదన్నా చికిత్స పొందుదామనుకున్నాను. వైద్యుల నడిగితే అది మందులతో పోయే జబ్బు కాదన్నారు.

"నీది తాత్విక సంబంధమైన జబ్బు! భగవాన్ మహర్షి బాబాను ఒకసారి చూడు" అని మిత్రుడు సలహా ఇచ్చాడు. అతనికి తనపై అధికారిని చూస్తే కాళ్ళు వణికేవట. భగవాన్ శ్రీమహర్షి బాబాగారు తమ ఉపదేశంతో ఆ భయాన్ని పోగొట్టారట.

మరేం? భగవాన్ గారి దర్శనం చేసుకున్నాను. ఏకాంతంలో ఆయనకు నా వ్యాధి గురించి మనవిచేశాను. ఆయన అంతా విని, "నాయనా, నీ బాధకు మూలం ఏమిటంటే నీకు జీవితంలో ఉపయోగపడే ఏ విద్యారాదు. నీలో ఏ సమర్థతాలేదు.

---

1. నీకు వెన్నెముక ; **Spineless** అనే ఇంగ్లీషు మాటకు తెలుగు.

అందుకే నీకు గోలికాయలు బాగా ఆడేవాణ్ణి చూసినా గౌరవం ఏర్పడుతుంది" అన్నారు.

"స్వామి, చూసినట్టు చెప్పారు. అయితే మరి ఈ జన్మకు మోక్షం లేదాండీ?" అన్నాను.

"నీవంటి వాడికి మార్గం చూపలేక పోతే మన ప్రాచీన సంస్కృతీ అంతా వృథాయే గదా నాయనా! ఐహికంగా చిల్లిగవ్వ చెయ్యని వాళ్ళను ఉత్తమోత్తములుగా చెయ్యగల ఆధ్యాత్మిక శక్తి మన పూర్వులు ఏనాడో కనిపెట్టారు. ఇంగ్లీషు వాళ్ళు కనిపెట్టామనుకున్నారు గాని, వాళ్ళవల్ల కాలేదు" ఏదో జ్ఞాపకం వచ్చి భగవాన్ శ్రీగారు విరగబడినవ్వారు.

"ఒకసారి నా దగ్గరికి ఒక పెద్ద అధికారే వచ్చాడు. దొరకింద పనిచేసేవాట్ట! దొరమొహంలోకి చూడలేక పోయాడు! దొర అది గమనించి, ఆటో సజెశ్చన్[1] పద్ధతి నేర్పాడు. అది నీకు తెలీదా? తాపీగా కూర్చుని, 'రోజు రోజుకూ, సర్వ విధాలా నేను ఇంకా గొప్పవాణ్ణి అయిపోతున్నాను' అని కొంతసేపు మననం చేసుకోవాలి. అప్పుడు నీలో హిప్నోటిక్ శక్తి పనిచేసి ధైర్యం వస్తుందని వాళ్ళ ఉద్దేశ్యం. కాని నా దగ్గరికి వచ్చినవాడి కిది పని చెయ్యలేదు ఎంచేతా! నువు గొప్పవాణ్ణయి పోతున్నానని నమ్మొచ్చు! కాని, ఎవరికన్న గొప్పవాడివి? అర్థమయింది కదూ? మన సంప్రదాయం అది కాదు. సోహం! వాడే నేను! ఆ భగవంతుడే నేను! జపించు. నీ మనసు దేవుడి మీద కేంద్రీకరించు. సోహం అని రోజూ జపించు. నువు ఎవర్నీ ఖాతరు చెయ్యవు. నీలో ఐహిక శక్తులు అట్టడుగునే ఉండుగాక! ఆధ్యాత్మిక శక్తి ఉంది చూశావూ? అది నిన్ను ఆకాశం ఎత్తు పెంచుతుంది."

భగవాన్ గారి సలహా అమోఘం! సోహం పని చేసింది. ఇప్పుడు నాకు అందరూ పురుగుల్లాగా కనిపిస్తారు. వెధవలు! మంగలి వాడి కిమ్మత్తు రెండు రూపాయలు! అదే రెండు రూపాయలకు పెద్ద పెద్ద సినిమాస్టార్లు నా ముందు, నా ఆనందం కోసం ఎన్ని పాట్లయినా పడతారు! గొప్ప సంగీత విద్వాంసుల చేత పాడించుకోగలను. గొప్ప గొప్ప రచయితలు నా కోసం చచ్చినట్టు కథలూ, నవలలూ, కవితలూ రాస్తారు.

సోహం! సోహం! సోహం!

—ముద్రణ : ప్రభవ

1. ఆటో సజెశ్చన్ : ఆత్మ సంయమనం కథలో చూడండి.

# మతాభిమానం

ఒక వైశాఖ పౌర్ణమికి ఆ చిన్న రాజ్యానికి ఒక బౌద్ధసన్యాసి వచ్చి, బౌద్ధాన్ని మించినది మరో మతం లేదని ఒప్పించాడు. రాజుగారికి అన్నీ నచ్చాయి గాని అహింస నచ్చలేదు. అయిదురకాల మాంసం కూరలు లేకుండా ఎలా ఆరగించటం?

"మీరు జంతు వధ చెయ్యరాదు. వధించిన జంతువులను నిక్షేపంగా తిన వచ్చు," అన్నాడు సన్యాసి. రాజు తృప్తిపడ్డాడు. సన్యాసి రాజగురువుగా ఉండి పోయాడు.

బౌద్ధం ప్రజలలో వ్యాప్తి కావటానికి రాజు ఇతర మతాలమీద పన్నులు వేశాడు. అందరూ బౌద్ధం పుచ్చుకున్నారు. కటికవాళ్ళు కూడా తాము జంతువధ మానేస్తామనీ, బౌద్ధం పుచ్చుకుంటామనీ అన్నారు.

రాజు ఆందోళనచెంది, బౌద్ధ సన్యాసిని సలహా అడిగాడు. బౌద్ధ సన్యాసి మరింత ఆదోళన చెందాడు—అతగాడికి కుందేలు మాంసం మహా ఇష్టం—గాని తన ఆందోళన బయటపడనీయక, "రాజా, వాళ్ళమీద పన్నులు తీసెయ్యి, బోయ వాళ్ళకూ, కబేలావాళ్ళకూ రెట్టింపు డబ్బులు ముట్టేటట్టు మాంసాదుల ధరలు పెంచు," అన్నాడు.

రాజు అలాగే చేశాడు. అయినా మాంసం సరఫరా చేసేవారు వందల సంఖ్యలో బౌద్ధం అవలంబించి, గుండ్లు గొరిగించుకుని, అహింస అవలంబించాం అన్నారు.

రాజుకూ, ప్రజలకూ పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టయింది.

ఇంతలో ఆ దేశానికి శంకరాచార్యుల శిష్యుడు ఒకడు వచ్చి వైదిక ధర్మ ప్రచారం ప్రారంభించాడు.

"మహారాజా, ఈ వైదికుణ్ణి దేశంనుంచి పారదోలండి," అన్నాడు మంత్రి.

బౌద్ధసన్యాసి గుట్లు ఎర్రజేసి, "మంత్రీ, తెలిసీ తెలియని సలహా చెప్పకు," అని తన సలహా రాజుకు చెప్పాడు.

తరువాత రాజబంధువొకడు శంకరుల వారి ప్రశిష్యుడై దేశమంతటా యజ్ఞాలు జరగాలని ప్రబోధం చేశాడు. యజ్ఞాలను నిషేధిస్తూ శాసనం జరగలేదు గాని, బలిపశువుల మాంసం రాజుగారిదని శాసనం జరిగింది.

తరవాత రెండేళ్ళకు ఆ దేశంలో ఒక్క బౌద్ధుడులేడు. బోలెడంతమంది బోయవాళ్ళూ, బెస్తవాళ్ళూ, కటికవాళ్ళూ ఉన్నారు.

—ముద్రణ : యువ, జనవరి 1977

# చిరంజీవి భక్తుడు

భక్తుడికి ఇంకా ధనం కావాలి. ఉద్యోగం కావాలి. రేసులో భక్తుడు కాసిన గుర్రం గెలవాలి. భక్తుడి లాటరీ టికెట్‌కు మొదటి బహుమతి రావాలి. భక్తుడు తీసిన ప్రతి పిక్చర్ హిట్ కావాలి.

మామూలు మనుషులు మనుష్యులని నమ్ముకుంటారు. భక్తుడు దేవుణ్ణి తప్ప నమ్మలేడు. ఎందుకంటే దేవుడు నీతులు చెప్పడు. దేవుడికి పెట్టే లంచం చట్ట విరుద్ధం కాదు.

దేవుడి సమక్షంలో దొంగతనం బాహాటంగా జరుగుతుంది. దేవాలయం గోడల క్రింద వ్యభిచారం అవిరామంగా కొనసాగుతుంది. దేవుడి విషయంలో మనుష్యుల హెచ్చుతగ్గులు ఖచ్చితంగా పాటించబడతాయి. ఒక్కముక్కలో భక్తుడికి కావాల్సిన జీవితం అంతా దేవుడి చుట్టు ఉన్నది.

భక్తుణ్ణి వీలయినప్పుడల్లా దొంగలు చంపి, డబ్బు లాక్కొని, శవాన్ని ఒక మూలలాగి పారేస్తారు. బస్సులు, ప్రయాణించే బస్సులు బోల్తాకొట్టి జననష్టం జరుగుతుంది. దేవుడు దగాచేస్తే భక్తుడికి తీరని ధనం నష్టం జరుగుతుంది. భక్తుడి కోరికలు తీరవు.

అయినా భక్తుడు చావడు. నిరుత్సాహపడడు. వాడి వంశం వర్ధిల్లుతుంది. వాడి రక్తం చిందిన చోట మరింత భక్తులు పుట్టుకొని వస్తారు.

దేవుడికి జననం లేదు.

భక్తుడికి మరణం లేదు.

—ముద్రణ : యువ, నవంబర్ 1976

# మహాతల్లి

నిజంగా మహాతల్లే! ఆవిడను చూస్తే ఎలాటివాళ్ళకూ పూనకం వచ్చినట్టయేది. తాము ఏం చేస్తున్నదీ, ఏం మాట్లాడుతున్నదీ వాళ్ళకు తెలిసేది కాదు. వెనకటి యుగాల "మదర్ గాడెసెస్"[1] ఇంతకన్న గొప్ప "ఇమేజ్" కలవాళ్ళు కారని రూఢిగా చెప్పవచ్చు.

అయితే ఇది నాస్తిక యుగం గనక, ఒకళ్లు దేవత అన్న మనిషిని మరొకళ్ళు సైతాను అనటం స్వాభావికం. మహాతల్లిని సైతాను అనలేదుగాని వెర్రిదని ఒక ప్రవాదు వేశారు. ఆవిడ కొందరు భక్తులను కరిచిందనీ, దరిమిలా వాళ్ళు చచ్చారనీ వదంతులు వ్యాపింపజేశారు.

ఈ వదంతులను చాలామంది మొదట్లో నమ్మలేదు. కాని ఆమె భక్తులను అప్పుడప్పుడూ కరవటం కొందరి కళ్ళబడింది. ఆమెమీది భక్తికొద్దీ వాళ్ళు ఆ సంగతి దాచిపెట్టారు. "ఆవిడచేత కరిపించుకుని చస్తే, మరి జన్మ ఉండదు!" అని కూడా కొందరు వాదించారు.

ఆవిడకు ఈ కరిచే జబ్బు రాను రాను ముదిరిపోయింది. ఆవిడకు పిచ్చి అన్నది దాచేస్తే దాగని సత్యం అయిపోయింది. పోలీసులు వచ్చి ఆమెను అరెస్టు చేశారు. కొంతకాలం విశ్రాంతి ఇస్తామని ఆమెతో చెప్పటానికి చాలా పెద్ద పోలీసాఫీసరు వచ్చాడు.

"నాయనా, నన్ను వెర్రాసుపత్రిలో పెట్టటానికా వచ్చావు?" అని మహాతల్లి అడిగింది.

"ఛ, ఛ ! ఎంతమాట!... కొద్ది కాలం విశ్రాంతి!..." అని పోలీసు అధికారి గొణిగాడు.

"నాకు పిచ్చేమిటి, నాయనా? నాకు పిచ్చి అన్నవాళ్ళకు పిచ్చి! కావలిస్తే నా కళ్ళలోకిచూడు!"

మహాతల్లి పోలీసు ఆఫీసరును కండ ఊడేట్టు కొరికింది. మహాతల్లిని జైల్లో పెట్టారు. భక్తులు వేలసంఖ్యలో ఆమెను చూసి ఏడవటానికి వచ్చారు.

"నన్ను పిచ్చిదాన్నంటున్నారు. ఇంతకన్నా అన్యాయం ఉందా?" అంటూ మహాతల్లి అందిన వాళ్ళందరినీ కొరికింది.

"నిజంగా పిచ్చే అయి ఉంటుందంటావా?" అని భక్తులు ఒకరినొకరు అనుమానంగా అడుక్కున్నారు.

—ముద్రణ : యువ, ఆగస్టు 1977

---

1. వెనుకటి యుగాల మదర్‌గాడెస్ : సింధూనాగరికత, అంతకంటే పూర్వకాలానికి చెందిన అమ్మతల్లి.

# కవిరాష్ట్రుం

కవి కడుపు నొప్పితో బాధపడుతున్నాడు; మూలుగుతున్నాడు; మెలికలు తిరిగి పోతున్నాడు.

ఏమిటంటే, కవికి అజీర్తి చేసిందన్నారు.

ప్రఖ్యాతి జాస్తిగా తిని అజీర్తి తెచ్చుకున్నాడు కవి.

ప్రఖ్యాతి అమితంగా తినరాదని కవికి వాళ్ళమ్మ చెప్పలేదు! గబగబా మెక్క కూడదని కూడా కవికి వాళ్ళమ్మ చెప్పలేదు.

వాళ్ళమ్మ చెప్పలేదు కనుక, కవికి ప్రఖ్యాతి దొరికే చోటి కల్లా వెళ్ళి రెండు చేతులా అందిపుచ్చుకొని మరీ తిన్నాడు.

మర్యాదగా పిలిచి పీటవేసి కూర్చోబెట్టితే తప్ప ప్రఖ్యాతి తినటానికి వెళ్ళ రాదని కవికి వాళ్ళమ్మ చెప్పలేదు. వాళ్ళెంత పెడితే అంతే తినాలిగాని అడిగి పెట్టించుకోవటం మర్యాద కాదనికూడా కవికి వాళ్ళమ్మ చెప్పలేదు.

అంగుచేత కవి అత్యాచారంగా ప్రతి ఇంటోనూ జొరబడి బలవంతాన అడిగి ప్రఖ్యాతి పెట్టించుకున్నాడు.

కొందరు నిర్మొహమోటంగా, "మా ఇంటో ప్రఖ్యాతి లేదు, పో!" అని కవిని కసిరి కొట్టారు.

మరికొందరు, "ప్రఖ్యాతిని మేము అడ్డమైన వాళ్ళకూ పెట్టం" అన్నారు.

"నువు మాకేం పెట్టావని నీకు మేం ప్రఖ్యాతి పెడతాం?" అన్నారు ఇంకా కొందరు.

"మీ కేం కావాలంటే అది ఇస్తాను. నాకు మాత్రం ఇంత ప్రఖ్యాతి పెట్టండి!" అన్నాడు కవి.

"మాకు లంచం పెడతావా, దుర్మార్గుడా?" అన్నారు వాళ్ళు. అంతేకాక వాళ్ళు లోకంగారి ఇంటికిపోయి తలుపు తట్టి, "విన్నావా, లోకం? కవి మమ్మల్ని ప్రఖ్యాతి పెట్టమని అడిగాడు, మే పెట్టం అంటే లంచం ఇవ్వొచ్చాడు!" అని చెప్పి వచ్చారు.

"చాలా చెడ్డకవి!" అని లోకం పెదిమవిరిచి మళ్ళీ తలుపేసుకుంది.

*

నువు ప్రఖ్యాతి జాస్తిగా తిని అజీర్తి తెచ్చుకున్నావు"! అన్నారు కవితో కవిమిత్రులు.

"నా కజీర్తా? నాకా అజీర్తి!" అన్నాడు కవి తోక తొక్కిన తాచల్లే లేస్తూ.

"నేను కడుపునిండా ప్రఖ్యాతి తిననేలేదు" అన్నాడు కవి.

"నేనింకా చాలా ప్రఖ్యాతి తిని హరాయించుకోగలను!" అన్నాడు కవి.

"నన్నసలు సగౌరవంగా పిలిచి తృప్తిగా ప్రఖ్యాతి పెట్టిన వెధవ ఎవడు?" అన్నాడు కవి.

(అట్లా అనరాదని కవికి వాళ్ళమ్మ చెప్పలేదు.)

"మరి నువ్వెందుకు మూలుగుతున్నావు-నీకు అజీర్తి చెయ్యకపోతే!" అన్నారు కవిమిత్రులు.

"ఎందుకట్లా మెలికలు తిరిగి పోతున్నావు?" అన్నారు కవి మిత్రులు.

"నేను మూలగటంలేదు, సంగీతం పాడుతున్నాను. మెలికలు తిరగటంలేదు. నృత్యం చేస్తున్నాను. కళలో కొత్తదనం మీరు తెలుసుకోలేరు. మీరు నా స్నేహితులు కారు?" అన్నాడు కవి.

"మేము నీ స్నేహితులమే; నువ్వే మా స్నేహితుడివి కావు!" అని కవి మిత్రులు వెళ్లిపోయినారు.

* * *

ఒక సీసాలో విమర్శ పోసి కవిదగ్గిరికి తెచ్చాడు విమర్శక వైద్యుడు.

"చూడటానికంత అసహ్యంగా ఉంది. అదేమిటి?" అన్నాడు కవి.

"ఇది విమర్శ. దీన్ని తాగితే నీ అజీర్తి నెమ్మదిస్తుంది" అన్నాడు వైద్యుడు.

"నా కజీర్తి లేదు" అన్నాడు కవి.

"నేను వైద్యుణ్ణి. నన్ను మోసపుచ్చలేవు!" అన్నాడు విమర్శకుడు.

"మందు తీసుకునే అజీర్తి ఉంటుంది; మందు అవసరంలేని అజీర్తి ఉంటుంది. నాది మందు అవసరంలేని అజీర్తి. నీకి సూక్ష్మాలు తెలియవు. నువు కవివికావు!" అన్నాడు కవి.

"ఏ అజీర్తి అయినా లేకుండా ఉండటం మంచిది. నువు కవివైతే అయినావు, వైద్యం కూడా తెలిసినట్టు నటించకు! నామాట విని ఈ మందు పుచ్చుకో!" అన్నాడు వైద్యుడు.

కవి సీసా పుచ్చుకుని బిరడాతీసి వాసన చూశాడు. కవి తల గిర్రున తిరిగి పోయింది. వాంతి అయినంతపని జరిగింది.

"ఛీ, ఛీ! నాకీమందు వద్దు!" అన్నాడు కవి.

"వద్దకపోతే పోనుతుందా ఏమిటి? బలవంతాన అయినా ఇస్తాను. నన్నెట్లా ఆపగలవో చూస్తాను!" అన్నాడు వైద్యుడు.

మందు నోట్లోపడగానే కవికి పెద్దవాంతి అయింది. గిలగిలా తన్నుకున్నాడు కవి. అరిచాడు కవి. చిందులు తొక్కాడు కవి. విమర్శకుణ్ణి అడ్డమైన తిట్లూ తిట్టాడు కవి.

కాని కవి కడుపు తాత్కాలికంగా ఖాళీ అయింది.

అట్లా కడుపు ఖాళీ కావటం ఆరోగ్యంగా తోచలేదు కవికి.

మళ్ళీ దేశమంతా తిరిగి ప్రఖ్యాతి తినటం మొదలుపెట్టాడు కవి. మళ్ళీ కవి పొట్ట పూటయింది. అట్లా ఉంటేనే బాగుందనుకున్నాడు కవి.

విమర్శ సీసాలు ఏ దుకాణంలో కనిపించినా హడలెత్తటం మొదలుపెట్టింది కవికి.

"ఆ సీసాలు నీకుకాదు. మరొకళ్ళకి!" అన్నప్పుడుకూడా ఆరాటం తగ్గలేదు కవికి.

"పాపం అవి వాళ్ళకివ్వకండి. కవుల అజీర్తికి మందివ్వటం ధర్మంకాదు. అది కవితా కళకు అత్యాచారం!" అన్నాడు కవి.

* * *

వైద్యులింకా తన వెంటపడుతూనే ఉండటం చూసి "నేనుకూడా వైద్యుణ్ణే" అన్నాడు కవి.

తనకు వైద్యం తెలుసునని నిరూపించడానికి ఉపన్యాసాలివ్వసాగాడు కవి.

కవికూడా వైద్యుడే నన్నారు! కవిత్వమూ, విమర్శా రెండూ తెలియనివాళ్ళు.

# కళాపోషకుడు

కళాదేవత మరొకసారి భర్తకోసం వెతకసాగింది.

ఒకప్పుడామెకు ఒక నిర్ణీతమయిన భర్తలేడు. ఆమె అందరితోటి కలిసి జీవించింది. అందరితోనూ సహజీవనం సాగినంతకాలమూ ఆమె జీవితం సహజంగా నడిచింది. ఆ తరువాత ఆమెకు కష్టాలు ఏర్పడ్డాయి.

పరిస్థితులు మారిపోతున్నాయి. అందరూ కలిసి యజ్ఞకర్మ చేసిన రోజులు పోయాయి. కొందరు యజ్ఞం చేసేవారూ, కొందరు చేయించేవారూ అయ్యారు. కర్తలూ భోక్తలూ వేరయారు. ఎక్కువా, తక్కువా ఏర్పడింది. కొందరి జీవితాలు పెరుగుతున్నాయి, అధిక సంఖ్యాకుల జీవితాలు తరుగుతున్నాయి.

కళాదేవతకు సహజంగా పెరిగే జీవితంపైనే అభిమానం. ఆవిడ అలాంటి జీవితాలుగల వారిని భర్తలుగా స్వీకరించింది.

కాని-ఇంగువ కట్టిన గుడ్డ! - అందరితోనూ సహజీవనం చేసే ప్రేరణ ఆమెలో అంతరించలేదు. ఆ ప్రేరణను అణుచుకుంటేగాని ఆమె తన భర్తలతో జీవించలేకపోయింది.

అయితే కళాదేవత త్వరలోనే ఒక వింత విషయం గమనించింది. ఆమెను భరించేవారికి ఆమెపై నిజమైన ఆదరణ లేదు. ఆమె వారి బానిసలలో ఒక బానిస! ఆమె అంతకంటే హెచ్చు హోదా ప్రకటించినప్పుడల్లా వాళ్ళు కస్సిర చేశారు. ఇంకొక వింత ఏమిటంటే, హీనమానవులయిన బానిసలు కళాదేవతపై చాలా ఆదరం చూపారు; తమ కష్టాలను ఆవిడద్వారా ప్రపంచానికి వ్యక్తం చేయటానికి తపస్సు సాగించారు. వారి తపస్సు ఆమెను ముగ్ధురాలిని చేసింది. ఆమె వారివైపు వెళ్ళిపోయింది.

వెంటనే ఆమె భర్తలు ఆమెపై దుమ్ము చల్లారు.

"అదేమి చిత్రమో ఈ కళ మనను కాదని బానిసలను వరిస్తున్నది." అన్నారు కొందరు.

"కళ పతనమైంది. జీవితంలో ఆ నికృష్టుల బాధలు తప్ప ఇంకేమీ లేవా?" అన్నారు మిగిలినవాళ్ళు.

వాళ్ళు కళపై అలిగి ఆమెను ఉపేక్షించారు. వారి పతనం ప్రారంభమయింది.

మళ్ళీ రోజులు మారాయి...రాజులు వచ్చారు. కళాదేవతకు తాళి కట్టారు; అసంఖ్యాకంగా ఉన్న తమ ఉంపుడుకత్తెల మధ్య పెట్టేశారు. ఆకస్మికంగా ఒక నాడు కళాదేవత రాజసౌధాల పహరావాళ్ళను తప్పించుకుని తనకోసం అలమటించే సామాన్య ప్రజలను చేరుకున్నది.

ధనికవర్గం వాళ్ళు వచ్చారు. కళాదేవతను దగ్గరికి తీసి ఆదరించారు. వారి కోసం ఆవిడ అచ్చాఫీసులలో, సినిమా స్టూడియోలలో, రేడియో స్టేషన్లలో, డ్రామా నాటక కంపెనీల రిహార్సల్ రూములలో ఇంకా అనేకచోట్ల శ్రమించింది.

ఈసారి కళాదేవతకు కలిగిన కొత్త అనుభవాలు యేమంటే, ఈ కళాభర్తలు ఆమెను ప్రజలకు దూరంగా ఉంచటంలేదు. పై పెచ్చు ఆమెను ప్రజలపైన ప్రయోగిస్తున్నారు.

"నా భర్తలకు నాపైన ఆదరంగాని ప్రేమగాని లేదుసరేగదా, వీళ్ళు నన్ను ప్రజలకు తార్చుతున్నారు. డబ్బు చేసుకుంటున్నారు. నావల్ల తాత్కాలికంగా చవుకబారు ఆనందం పొందటం తప్ప ప్రజలు నానుంచి ఏమేలూ పొందటం లేదు" అనుకున్నది కళాదేవత.

# 2

కళను పోషించటానికి ఒక కొత్త వ్యక్తి అవతరించాడు. ఈ కళాభర్త కోటీశ్వరుడు. పూర్వం కళలను ఆదరించిన రాజులలో ఇంతకంటే ధనికులు లేరు. ఈయన ఇల్లు ఆకాశమంత ఎత్తు. ఈయనకు సొంత విమానాలున్నాయి. కార్లున్నాయి. ఒక సొంత రైలుబండి కూడా ఉన్నది. ఈయన పెట్రోలు ఖర్చుతో కొన్ని వేల మందికి అన్న వస్త్రాలు వస్తాయని అంచనావేశారు.

తాంబూలంలో వేసుకునే పొగాకు పొట్లాలమ్మి ఈయన లక్షాధికారి అయాడు; ఆ లక్షలు పెట్టుబడిచేసి పబ్లిసిటీ సంస్థలు పెట్టి కోటీశ్వరుడయాడు. అదీ సంగ్రహంగా ఆయన చరిత్ర.

ఆయన పొగాకు పొట్లాలకథ పదిహేడు భాషలలోకి అనువాదమయింది. "ఆయన పొగాకులో నిజమైన పొగాకు ఎంత? అందులో ఆయన ఏమేమి చేర్చాడు?" ఇత్యాది వైజ్ఞానిక సమస్యలను గురించి ఎంతో మంది మేధావులు పత్రికలలో వాదోపవాదాలు జరిపారు.

అది పేటెంటు పొగాకు. దానికన్న మంచిపొగాకు పొట్లాలు చాలా తయారైనాయి. కాని ఒకటీ ఎక్కిరాలేదు. ఆయన తన పోటీదార్లందరినీ రకరకాలుగా నిర్మూలించాడు. తన పొగాకుతో పోటీచేస్తున్న ఒక పుగాకులో నాభి ఉన్నదని పుకారు లేవదీయడానికిగాను యాభైవేల రూపాయలు ఖర్చుచేసి మనుషులను పెట్టాడు. మరొక పోటీదారు తయారుచేసి తనకన్నా చవుకగా విక్రయిస్తున్న పొగాకు పొట్లాలను తన ఏజెంట్లద్వారా కొనిపించేసి మార్కెట్టులోకి రాకుండా చేసేశాడు. ఇంకొక

పోటీదారు వ్యాపారాన్ని రెట్టింపుధరకు కొనేవాడు. ఆయన లీలలు చాలా ఉన్నాయి.

కానీ పొగాకు పొట్లంమీద ఈ పెద్దమనిషి లక్షలు ఎట్లా గడించారు. (ఇటీవల పొట్లం ఖరీదు రెండు నయాపైసలకు పెరిగింది. ఈ పెరుగుదలవల్ల ఆయనకు ఎన్ని లక్షలు అదనంగా వస్తుందో అంచనా వేశారు.)

ఆయన పొగాకులో విశేషం ఏమీ లేదు - అందులో పొగాకు దాదాపు ఏమీ లేకపోవటం తప్ప. అలాటప్పుడు దానితో లక్షాధికారి ఎట్లా అయ్యాడు? తన ఆత్మ కథలో ఆయన ఈ విధంగా రాసుకున్నాడు :

"ప్రపంచంలో నూటికి ముప్ఫై ఆరుగురు రోజూ కాఫీ తాగుతారు. కాఫీ పరిశ్రమ పెద్ద పరిశ్రమ. ఈ పరిశ్రమ ఎలా ప్రారంభమయింది? చాలామంది ప్రజలు తమకు కాఫీ కావాలి అని నిర్ణయించుకోవటంవల్ల కాఫీ పానీయం సృష్టి కాలేదు. కాఫీ విత్తుల సారం నుంచి పానీయం తయారుచేసే పద్ధతి ఎవరో కనిపెట్టారు. ప్రచారం మూలంగా ఆ కాఫీ జనానికి పాకింది. ముఖ్యమైనది ప్రచారం - జనానికి పట్టే ప్రచారం. సరి అయిన ప్రచారం జరిగితే ఎంతమంది చేతనైనా పొగాకు నమిలించ వచ్చు. కేవలం ప్రచారంయొక్క ఉత్కృష్టత మూలంగానే నేను రోజూ రెండుకోట్ల ప్రజలచేత నా పొగాకు నమిలిస్తున్నాను."

ఈయన పొగాకు ప్రచారం ఎంత కొత్త పద్ధతులమీద, ఎంత విజయ వంతంగా నడిచిందంటే, అదే పద్ధతులలో ఇతర వ్యాపార సరుకులను ప్రచారం చెయ్యటానికి ఈయన దేశమంతటా సంస్థలను ఏర్పాటు చేశాడు.

"ప్రచారం కనబడితే చాలదు. వినపడాలి!" అని ఆయన నినాదం. ఇందుకు గాను ఆయన ఒక అమెరికన్ ఇంజనీరుచేత ఒకరకం యంత్రం తయారు చేయించాడు. ఈ యంత్రం చిన్న ట్రంకు పెట్టె ప్రమాణంలో ఉంటుంది. ఇందులో ఒక మాగ్నెటిక్ టేపూ, లౌడ్‌స్పీకరు ఉంటాయి. ఈ టేపు రెండు గంటలసేపు ఆడుతుంది. దానిపైన రకరకాల వ్యాపార సరుకులను ప్రచారం చేసేపాటలు రికార్డు చేసి ఉంటాయి. టేపు "లూప్" చేసి ఉండటంవల్ల ఎన్నిరోజుల పాటైనా మళ్ళీ మళ్ళీ నడుస్తూ ఉంటుంది.

అన్ని దేశాలలోనూ పేటెంట్లు పొందిన ఈ పెట్టెలకు "నగల పెట్టెలు" అని ముద్దు పేరు పెట్టారు. ప్రపంచంలో ఉన్న అన్ని ముఖ్యనగరాలలోనూ పెద్ద పెద్ద చౌకులలోనూ, పార్కులలోనూ ఈ పెట్టెలు ఏర్పాటయాయి. వీటిని పెట్టుకో నిచ్చినందుకు కోటీశ్వరుడు మునిసిపాలిటీలకు కళ్ళు తిరిగిపోయే మొత్తాలు చెల్లించాడు.

ఈ పెట్టెలను పత్రికలు కొన్ని తీవ్రంగా విమర్శించాయి. కొందరు పార్ల మెంటులో ప్రశ్నలు వేశారు. కాని వాటివల్ల అపకారం ఉందని ఎవరూ రుజువు చెయ్యలేక పోయారు.

"నాకు రాజకీయాలతో నిమిత్తంలేదు. నేను కేవలం పబ్లిసిటీ చేస్తున్నాను. నా చార్జీలు చాలా హెచ్చు. అందుచేత ఘరానా వ్యాపారస్తుడు కానివాడు నాకు కస్టమరు కాలేడు... 1400 పై చిలుకు భాషలలో నా "నగల పెట్టెలు" ప్రకటనలను చెబుతున్నాయి. లిపి కూడా లేని 29 భాషలలో నేను పబ్లిసిటీ జరుపుతున్నాను.... నేను కళాసేవ కూడా చేస్తున్నాను. ప్రపంచ ఖ్యాతిగల అనేక మంది కవులూ, సంగీతవేత్తలూ నా పోషణలో ఉన్నారు..... నా పబ్లిసిటీ పాటలు నిత్యమూ, ఎన్ని కోట్లమంది పాడి ఆనందిస్తారో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు." అని ఆయన ఒక యునెస్కో ప్రతినిధితో అన్నాడు.

# 3

"ఓహో, సంగీత సరస్వతిగారా? దయచెయ్యండి" అన్నాడు మూడో డిగ్రీ ఎయిర్‌కండిషన్ గదిలో కూచుని ఉండిన కోటీశ్వరుడు.

మొదటి డిగ్రీ ఎయిర్‌కండిషన్ గదిలో ఒక అరగంటా, రెండో డిగ్రీ గదిలో ఇంకో అరగంటా వేచి వుండిన సంగీత సరస్వతికి ఈ కోటీశ్వరుడి ఆప్యాయత ఆటే ఆనలేదు.

"మీరు పిలవగా వచ్చినవాడికే తమ దర్శనం కావటం ఇంత దుర్లభమైంది గదా, నా పనిమీద వచ్చి ఉంటే ఏంకాను?" అన్నాడాయన.

తనకేదో పెద్ద పెద్ద బిరుదు ప్రదానం జరిగినట్టుగా నవ్వి కోటీశ్వరుడు, "ఇది మన ఇద్దరి పనీనూ! మీ చేత కొన్ని పబ్లిసిటీ పాటలు రాయించుకుందామనే ఉద్దేశంతో పిలిచాను. ఇది చాలా గొప్ప గౌరవమని మీకు తెలిసే వుంటుంది!" అన్నాడు కోటీశ్వరుడు.

"మీ పబ్లిసిటీ పాటలు అనేకం ప్రతి వీధిమూలా వింటున్నాను. వాటిని ఎవరు రాసినా సరిపోతుందే?" అన్నాడు సంగీత సరస్వతి.

"పబ్లిసిటీ మర్మం అక్కడే వున్నది. మీకు గొప్ప పేరున్నది. మీరు పబ్లిసిటీ పాట రాశారంటే ఆ పాటకు ఎంత పబ్లిసిటీ అయినా ఉంటుంది. దానితో బాటు మీకూనూ!— మీకు గిట్టుబాటు అయేటట్టు చూస్తాను. సాధారణంగా సినిమా కంపెనీలవాళ్ళిచ్చే దానికి-పదింత లిస్తాను. పన్నెండు పాటలకు ఇప్పుడే కంట్రాక్టు రాస్తాను. సగం మొత్తం ఎడ్వాన్సుగా ఇస్తాను!" అన్నాడు కోటీశ్వరుడు.

సంగీత సరస్వతి ప్రాణం దిమ్మర పోయింది. "ఇందులో ఏదో కిటుకున్నది. నేను అడుక్కుతింటున్న రోజుల్లో రాసిన పాటలు కృతులు తక్కువ కావన్నారు. పేరు వచ్చింది, డబ్బులేదు. ఆ పేరును సినిమా కంపెనీల వాళ్ళు డబ్బుగా మార్చారు. ఈ మధ్య మా గురువుగారు కనిపించి, 'నీ సినిమా పాటలు వింటునా

నోయ్!' అంటే ప్రాణం చచ్చినట్టయింది. "ఈ పెద్దమనిషి ఇంకా ఇస్తానంటున్నాడే! నా పెళ్ళాం బిడ్డల అదృష్టం!" అనుకున్నాడాయన.

సంతకా లయిపోయాయి. చెక్కు చేతులు మారింది. ఒక్కపాట—నాలుగు పంక్తులవి—ఆయన చేతికిచ్చి నెలలోపుగా స్వరపరచమన్నారు. రెండు నిమిషాలలో సంగీత సరస్వతి దానికి ఆరురకాలగా స్వరం తయారుచేశాడు.

కోటీశ్వరుడు శ్రద్ధగా ఆరు పద్ధతులూ విని తల అడ్డంగా తిప్పాడు.

"ఇది పబ్లిసిటీపాట! ప్రతి నాలుగేళ్ళ కుర్రవాడూ దాన్ని పాడకుండా ఉండలేకపోవాలి. అప్పుడు గాని ప్రకటనదార్లు నాకిచ్చే సొమ్ము గిట్టుబాటుకాదు. మేరేమౌలాబులాలో పాట తెలుసుగా? సరిగా అలాగే దీన్ని కూడా పాడండి. సరిపోతుంది" అన్నాడు కోటీశ్వరుడు.

ఆయన కోరిన ప్రకారం పబ్లిసిటీ పాట పాడుతూ సంగీత సరస్వతి కొత్త పెళ్ళికూతురికన్నా కూడా ఎక్కువగా బిడియపడ్డాడు.

"అంతే! అద్భుతంగా వుంది!" అన్నాడు కోటీశ్వరుడు.

సంగీత సరస్వతి ఇంటికి వచ్చేస్తూ తనను తాను గట్టిగా గిల్లుకున్నాడు. చచ్చేబాధ కలిగింది!

ఆ రోజు సాయంకాలం సాహిత్య సరస్వతి కూడా కోటీశ్వరుడి దగ్గర చెక్కు పుచ్చుకుని ఇంటికి తిరిగివస్తూ అలాగే తనను తాను గిల్లుకుని బాధపడ్డాడు.

—ముద్రణ: అభ్యుదయ, ఏప్రిల్, మే, 1958

# కళాసాగరం

"ఇదే కళాసాగరం" అన్నాడు నా గైడ్.

సాగరం అతిశయోక్తిలాగా కనబడింది. సరస్సు అనవచ్చు. అవతలి ఒడ్డు కనిపిస్తున్నది.

"మేం దీన్నే మహాసముద్రంగా భావిస్తున్నాం. కళాచెరువులూ, కళాబావులూ, కళాగుంటలూ, అందులో కూర్చుని బెకబెకలాడే కళాకప్పలూ చూసినవారికి ఇది మహాసాగరం కాదుటండీ, గురూగారూ?" అన్నాడు గైడ్.

కనీసం లోతైనా అట్టే ఉన్నట్టు కనిపించదే?" అన్నాను.

"ఎంతమాటన్నారండీ! ఇందులో చాలామంది మునిగిపోయారండీ!" అన్నాడు గైడ్.

"మరి పొట్టి సజ్జేమో?"

"అది ఉందనుకోండి! ఈత రాకపోవటం ఉందనుకోండి! — చిల్లి పడవల్లో పోవటమూ ఉందనుకోండి? పడవలవాళ్ళు ముంచెయ్యటమూ ఉందనుకోండి"

"అదోటా?"

"అవును, గురూగారూ! అవతలొడ్డు చేరితే మంచి గిట్టుబాటు గదండీ? పడవ మాట్లాడుకున్న వాడి దగ్గర ప్రయాణం పూర్తిచేసే తైలం లేదని తెలిస్తే, వాడి తైలం అయిపోగానే పడవ తిరిగి సొంతం చేసుకుని, వాణ్ణి నడిసముద్రంలో ముంచేసి, అవతలి ఒడ్డుచేరి ప్రైజు కొట్టేస్తారు. వ్యాపార ధర్మము అంతేగదండీ?"

"వ్యాపార ధర్మం ఏమిటి? ప్రైజు ఏమిటి? రెంటికి పొంతన కుదురుతుందా?" అన్నాను.

"కుదిరేట్టు చూసేటందుకు ప్రజలున్నారు లెండి."

నాకు అవతలి ఒడ్డుకు పోవాలనిపించింది. అసలు సారస్యం అక్కడే ఉన్నట్టు నాకు తోచింది.

"పడవ కొనే తాహతుందా? మధ్యలో పడవమునిగితే ఈదగలరా?" అన్నాడు నా గైడ్.

"ఎందుకయ్యా? చుట్టూ తిరిగి పోదాం. ఎంతోసేపు పట్టదు" అన్నాను.

నేను అనుకున్నది నిజం. అసలు హడావుడంతా అవతలి ఒడ్డునే ఉన్నది. జనం - హర్షధ్వానాలు - వెటకారాలు - వెక్కిరింతలు - మీటింగులు-కొట్లాటలు!

జనం మధ్యగా తిరుగుతూ, చెవుల్లో కలాలూ, అరచేతిలో కాగితాలూ పట్టుకుని తిరుగుతున్న వాళ్ళు కనిపించారు.

"వాళ్ళెవరు ?" అని అడిగాను.

"జర్నలిస్టులు, ఒక్కో పడవ ఒడ్డుకు చేరినప్పుడల్లా వాళ్ళు బాకాలూదుతారు. అవతలి పక్కనుంచి ఏ పడవ ఎప్పుడు బయలుదేరిందీ, అది ఎంతదూరం వచ్చినదీ, ఉజ్జాయింపుగా ఎప్పుడు ఒడ్డు చేరేదీ, లౌడ్‌స్పీకర్లలో చెబుతుంటారు. మధ్య ఏపడవైనా ఆగిపోయినా, మునిగిపోయినా దాని ఊసెత్తరు. ఒడ్డు చేరిన వాళ్లకు సన్మానాలు అవీ ఏర్పాటయినా, కళాసాగర తరుణంలో కృతకృత్యులైనవాళ్ళు వెలిబుచ్చే అమూల్యమైన అభిప్రాయాలు అశేషజనానీకానికి తెలిసి, వాళ్ళు ధన్యులు కావాలన్నా, జర్నలిస్టుల సహకారం విధిగా ఉండితీరాలి."

"అబ్బా! చాలా శ్రమపడతారన్నమాట!" అన్నాను.

"జర్నలిస్టు జాతికి వీళ్ళు రాజులు కారటండీ? తెలివైన జర్నలిస్టు తెలివి తక్కువ కళా వ్యాపారికన్న ఎక్కువ సంపాదిస్తాడు. రెక్కల పురుగుల్లాగా వీళ్ళు కళాచీకట్లకు దూరంగానూ, కళా దీపాలకు వీలయినంత దగ్గిరగానూ ఉంటారు."

"వీళ్ళకింత ప్రాముఖ్యం ఎట్లా వచ్చి ఉంటుంది?" అని అడిగాను.

"ఒకప్పుడు ఈ కళాసాగరం బుల్లి చెరువంత ఉండేది. ఆ మాట నిజం కూడా లెండి. దీన్ని మహాసముద్రంగా చేసింది మేమే నంటున్నారు జర్నలిస్టులు. కాదని ఎవరూ అనలేదు."

కళాసాగరం మీదికి దృష్టి సారించాను. వచ్చే పడవల్లో చాలామంది ఉన్నట్టు కనబడింది. వాళ్ళంతా ఎవరు?

"వాళ్ళు నక్షత్రాలు. పడవలు మునిగినా వాళ్ళు మునగరు", అన్నాడు నా గైడ్.

"బాగా ఈదుతారు కాబోలు."

"అదీనున్నూ, వాళ్ళసలు నీటిలో మునగరు. చాలా తేలిక!"

"అలా చెప్పు! ఎంత అదృష్టం? పడవలు మాట్లాడుకునేవాళ్ళు అంత తేలిగ్గా ఉంటే ఎంత బాగుణ్ణు?" అన్నాను.

"అదేవిటి, గురూగారూ? అలాటి వాళ్లు చాలా మంది ఉన్నారు. పది పడవలు వరసగా మునిగినా పదకొండో పడవను సంపాదించగల వాళ్ళున్నారు! వాళ్ళ పరపతి అలాటిది! నిజానికి కళాసాగరాన్ని ఈదటం ఒక గొప్పకళ, విద్య! అది తెలిసినవాళ్ళు కళలో మునిగి తేలగలరు చాలా తేలిక!"

"అరె, ఇక్కడెవరో కొట్లాడుకుంటున్నారు, దేనికో?" అన్నాను.

"దూరంగా భుజాలమీద చేతులు వేసుకుని పోతున్న నక్షత్రాలను చూశారా? వాళ్ళ అభిమాన సంఘాల వాళ్ళు. ఎవరి నక్షత్రం వాళ్ళకెక్కువ. ఏమంటారు?"

"నక్షత్రాలు సఖ్యంగానే ఉన్నారే?" అన్నాను.

"అంత అమాయకంగా మాట్లాడతారేవిటి, గురూగారూ? ఇద్దరు రాజుల్లు యుద్ధం చేస్తారు. అటూ ఇటూ జనం చస్తారు. రాజులిద్దరు సంధి అని చెప్పి షేక్ హాండ్ చేసుకుంటారు. ఓ జాతకంలో రెండు గ్రహాలకు షష్టాష్టకం అవుతుంది. వాడు పురుగుతాకి పోతాడు. గ్రహాలకేం? అవి బాగానే ఉంటాయి. ఏమంటారు?" అన్నాడు నా గైడ్.

"నన్ను ఇంతదూరం తెచ్చావుగాని, నాకివేమంత నచ్చలేదు తమ్ముడూ," అన్నాను.

"ఇంతకన్నా బాగున్నదేదో ఒకటి చెప్పండి."

"మాఊరి కళాచెరువు ఎంత అందంగా ఉంటుందనుకున్నావు? ప్రశాంతంగా, చల్లగాలి వీస్తూ పక్షులు పైగా ఎగురుతూ - దాని పక్కన ఎంతసేపు కూర్చున్నా ప్రాణం లేచివచ్చినట్టుంటుంది గాని, ఇలా బుర్ర ఖరాబై పోదు."

మీరలా అన్నారు గనక నన్నో మాట చెప్పనిస్తారా? మీ కళాచెరువు కప్పలు ఈ కళాసాగరంలో ఘనంగా బతకాలని ఎన్నివస్తున్నాయో మీకు తెలుసా?"

"నాకు తెలీదు", అని ఒప్పుకున్నాను.

"చూస్తూండండి. అన్ని కళాగుంటలూ, కళాబావులూ, కళాచెరువులూ పాడుబడిపోతాయి. ఈ కళాసాగరం మహాసముద్రమై, ఒక ఒడ్డునుంచి ఇంకో ఒడ్డు కనబడకుండాపోయే రోజువస్తుంది - సంస్కృతి అంటే దీని ఒడ్డునే చూడాలన్న రోజు ఎంతో దూరంలోలేదు," అన్నాడు నా గైడ్.

ఏదో అందామనుకున్నాను గాని, తీరా అనటానికి ఏమీలేదని గ్రహించాను.

— ముద్రణ : యువ (దీపావళి ప్రత్యేక సంచిక), 1976.

# కీర్తి కాముడు

"కాముడు కీర్తికాముడు," అని ఏనాడో ఎవరో జోక్ చేశారు.

కీర్తికాముకుడికి ఎన్నిరంగాలైనా ఉన్నాయి. నటుడు, సినీనటుడు, గాయకుడు, ప్లేబాక్ గాయకుడు, సర్కస్ క్లౌన్, ప్లాట్‌ఫాం ఉపన్యాసకుడు, వ్యాయామ క్రీడాకారుడు (టెన్నిస్, ఫుట్‌బాల్, క్రికెట్) — ఇలాటివాటిలో కీర్తి తెచ్చుకోవాలని కాముడికి లేదు.

వాడు చిన్నతనంనుంచీ పత్రికల పురుగు కావటంచేత, తరచు పత్రికలలో కనిపించే కొద్దిపేర్లు చూసి అమితంగా అసూయపడిపోయేవాడు. ఒక్కొక్క నెల ఒకే పేరు మూడు, నాలుగు మాసపత్రికలలో! ఏంకీర్తి! ఇంకో పదేళ్ళకి, పదిహేనేళ్ళకి తాను కూడా ఆ స్థాయికి రావాలని వాడు తపస్సు చేశాడు.

ఈ లోపల వాడు సాహిత్యోద్యమాలూ, అభ్యుదయ రచయితలు కొట్టేస్తున్న ఖ్యాతీ గమనించాడు. తనకు రాసే అర్హత వచ్చిందనిపించగానే రచనలు ప్రారంభించాడు. వాడి స్నేహితులు వాణ్ణి 'బిచ్చగాళ్ళ' రచయిత అని పిలవసాగారు. అభ్యుదయం బిచ్చగాళ్ళ జీవితంనుంచే రావాలని వాడికేదో ఏర్పడిపోయింది.

ఏమైనప్పటికీ పేరుగల పత్రికలు ఏవీ వాడి రచనలు వెయ్యలేదు. 'అభ్యుదయ' ధోరణిగల పత్రికలు కొద్ది రచనలు వేశాయి. వాడి రచనలు కొందరు కమ్యూనిస్టులను ఆకర్షించాయి. వాళ్ళు వాడికి ఏం రాయాలో, ఎట్లా రాయాలో చెప్పసాగారు. వాడి సంస్కృతీ వామపక్ష సంస్కృతే అని వాళ్ళు అపోహపడ్డారు. కాని అలాటివాళ్ళ మెప్పు వాడికి అక్కర్లేదు. గురజాడనూ, కందుకూరినీ, చిలకమర్తినీ మెచ్చుకొంటున్నది ఇంతకన్న మంచి సాహితీపరులని వాడి నమ్మకం.

"బాబాయ్, నేను రచయితగా పైకి రాలేనా" అని కాముడు నన్ను అడిగాడు.

"ఒరే, నువు దరిద్రులకోసం రాస్తే బ్రహ్మరథం పట్టేదెవరు? ఎంత రియాక్షనరీగా రాస్తే అంత పేరు వస్తుంది. నిన్ను మెచ్చుకునేవాళ్ళు కొద్దిమందే కావచ్చు, తిట్టేవాళ్లు వేల సంఖ్యలో ఉండొచ్చు. కానీ నువు రాజపూజితుడివీ, అందలం ఎక్కినవాడివీ కావాలంటే అదే మార్గం," అన్నాను.

నా సలహా ప్రకారం నడుచుకుని కాముడు వచన సమ్రాట్ అయ్యాడు. వందలకొద్దీ సన్మానాలు పొందుతున్నాడు. శుభం!

—ముద్రణ: యువ, మే 1977.

# సన్మానం

ఈ కాంతం, కనకం, శరభయ్య, గోపాలరావూ ముఠా అంతాచేరి నన్ను మేధావుల జాబితాలోంచి తీసేస్తామంటున్నారట. ఇది చాలా అక్రమం, నేను అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మేధావినే. "కమ్యూనిజమంటే నా కెందుకు కడుపుమంట?" అనే శీర్షికను నన్ను రాయమన్నారు. నేను చిత్తురాశాను కూడా. దాన్ని సాఫురాసే లోపుగా కృష్ణమూర్తి వచ్చి "ఏం భాయ్? ఇక ఊరుకుంటే లాభంలేదు. మెరికల్లాటివి నాలుగు పాయింట్లు చెప్పు!" అన్నాడు. బుద్ధిగడ్డితిని నేను రాసిన పాయింట్లన్నీ చెప్పేశా, అతను వాటిని కాస్తా కాగితం మీద పెట్టేసి పత్రిక్కి తనపేర పంపేసుకున్నాడు.

"పోనీలే! ఎవరిపేర పడితేనేం. ప్రచారం కదా ప్రధానం?" అని నేను సరిపెట్టుకున్నా, అదంతా కలిసి నాకే ఎదురొస్తుందని ఎట్లా అనుకునేదీ!

"కమ్యూనిజం—కడుపుమంట శీర్షికకు నువు రాస్తానని ఎందుకు రాయలేదూ" అని శరభయ్యా నన్నిప్పుడు నిలదీసి అడుగుతున్నాడు!

"నేను రాశాను. కాని కృష్ణమూర్తి కాజేశాడు" అని చెప్పనా? అసలే ఐకమత్యం ప్రధానం అయిన ఈ క్లిష్ట పరిస్థితుల్లో కీచులాడుకోవటం ఏమన్నా భావ్యంగా ఉంటుందీ? 'వాళ్ళకు' అలుసైపోమూ?"

నేను రాయలేదన్న సొడ్డే అనుకుంటే కృష్ణమూర్తిచేత నేనే రాయించానని గోపాలరావు నామీద ఇంకో సొడ్డు వేశాడు! అది చూడండి!

కృష్ణమూర్తి రాసిన దానిమీద "వాళ్ళు" ఎదురు రాస్తూ వెటకారమూ, వేళాకోళమూ చేశారు. చాతకాకుండా రాస్తే చెయ్యరూ? కృష్ణమూర్తికి అపఖ్యాతి రావటం కోసం నేను అతనిచేత అది రాయించానట ! గోపాలరావు అంటున్నాడు. ఎబ్బెబ్బే ఏం మనుషులు !

ఇంతకూ ఇవన్నీ నైమిత్తిక కారణాలు. అసలు కారణం రంగయ్య. ఈ మాట పైకి అన్నానో వేటకుక్కల్లాగా మీదపడుతారు—అసలే రంగయ్యకు ద్రోహం చేశానని ఆడిపోసుకుంటున్నారు !

మాటపడవలిసే యోగం వచ్చేసరికి అందరూ ఒక్కసారిగా గతం మరిచి పోయారు కాబోలు. ఈ కాంతం, కనకం, శరభయ్యా, గోపాలరావూ, రంగయ్యను దుమ్మెత్తిపోసిన రోజుల్లో అతన్ని వెనకేసుకొచ్చింది నేనూ! వాళ్ళు రంగయ్యను దుమ్మెత్తిపోయటం తప్పనికాదు. మనవాడు, కీర్తికండూతి ఎక్కువై, "అభ్యుదయం, అభ్యుదయం" అంటూ గంతులేసి కమ్యూనిస్టుల నోళ్ళలో తలదూర్చి రైతుకూలీలను గురించీ, వాళ్ళు ఓడ్చే చెమటగురించీ ఇంకేమేమిటో గురించీ చెత్తాఖానీ పద్యాలు తెగరాశాడు.

"గుడ్డి కన్ను తెరిచినా, మూసినా ఒకటే! రంగయ్య ఏదో రాసిపోతున్నాడని మనం విచారించవలసిన పనిలేదు. వాడు మనిషి మనవాడే!" అని నేనన్నాను కూడానూ.

తల్లి శిగగొయ్యా, ఆమాట కూడా నాకిప్పుడెదురే వచ్చింది! "నన్ను నువు గుడ్డి కన్ను అన్నావుటగా!" అని రంగయ్యే నిలవదీసి అడిగాడు.

"నేను లోగడ రాసిందంతా చెత్త! కమ్యూనిస్టులు నన్ను మభ్యపెట్టి నాచేత ఆ చెత్తంతా రాయించారు! నా కొన్ని కొన్ని రచనలు వాళ్ళు పూర్తిగా తిరగ రాశారు. అని నువే చెబితివి గదటయ్యా!" అని అడిగాను. ఉన్నమాట అడ గరూ...?

అసలు అందాకా దేనికి? రంగయ్యను వాళ్ళనుంచి బయటపడమని సలహా ఇచ్చింది నేగాదూ? కాదనమనూ!

"ఇదేమిటి, రంగయ్యా? పడక పడక నువు వాళ్ళ మధ్య పడ్డావేమిటి? ఎన్ని కలు వచ్చి పడుతునై! బోలెడంత పనివుంది నీవల్ల అని నేనంటే, రంగయ్య ఆలో చించి, "సరే, నేను చెప్పినట్టు ఏర్పాటు చేయించు, బయటికి రావట మెంతసేపులే," అని రంగయ్య అన్నాడు.

అన్నమాట నిలబెట్టుకున్నాడు కూడా! అంతా సజావుగానే జరిగిపోయింది. "వాళ్ళు" అనవలిసిన మాటలు "వాళ్ళు" అన్నారు; మనవాడు రాంబాణంలాంటి ప్రకటన తయారుచేసి పత్రికల్లో పారేశాడు. అంతా చక్కగా అనుకున్నట్టు జరిగి పోయింది.

లేకపోతే, నాకు తెలీకడుగుతాను, రంగయ్యకు సాహిత్యమేమిటి? సాహిత్యం మొహం తెలీని ప్రజలు అనుకోవచ్చుగాని-తెలిసినవాణ్ణి నేనెట్లా ఒప్పుకుంటానూ? రాజకీయా లంటారూ? జేష్! నేను కాదనేదే! రంగయ్య రైటైన మనిషి! రంగయ్య సాహితీపరుడుగా మన పక్షాన లేకపోయెనే అని నేనెన్నడూ దుగ్ధపడలేదే!

అటువంటప్పుడు కాంతం వచ్చి "ఏమోయ్! రంగయ్యకు సన్మానం ఏర్పాటు చేస్తున్నాం." అనగానే నాకు బాంబు పేలినట్టుండదూ?

నా చెవులను నేనే నమ్మలేక, "ఏం సన్మానం?" అన్నాను.

"ఇంకేం సన్మానం? కవి సన్మానం!" అన్నాడు కాంతం.

"చూడు, కాంతం! రంగయ్య తాను నిన్నటిదాకా రాసిందంతా చెత్త అని వాళ్ళు మోసగించి రాయించారనీ అనె? ఆ తరవాత ఏమీ రాయకపోయె! ఈ సన్మానం దేనికని ఏర్పాటు చేసినట్టు?" అని అడిగాను.

అడగనూ! అది తప్పా? రేపు "వాళ్ళ" మటుకు అడగరూ? అప్పుడు బాగుంటుందేం? ఇందుకు నేను "ప్రచ్ఛన్న అభ్యుదయ" వాదినా? మొదటినుంచీ నా ప్రవర్తన "అనుమానాస్పదంగానే ఉందా? కన్యాశుల్కం గురజాడదే[1] అయి ఉంటుందని నేననటం అందుకు సాక్ష్యమా?

ఈ లెక్కన మేధావులగతి ఏమయ్యేట్టు ?

—ముద్రణ : అభ్యుదయ, జనవరి 1956

---

1. కన్యాశుల్కం గురజాడదే....కన్యాశుల్కం గురజాడ అప్పారావు రాయలేదని బెజవాడలోని కొందరు ప్రబుద్ధులు వేలూరి శివరామశాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ప్రభృతులు 1938లోనూ, 1955 లోనూ వివాదం రేకెత్తించారు. (వివరాలకు చూడండి. కె.వి రమణారెడ్డి, మహోదయం, విశాలాంధ్ర, మే 1969 పుటలు 362–366).

# సౌందర్య రహస్యం

ప్రకాశం పెద్ద సంపాదనగలవాడు కాడు. కాని అతని ఇల్లు-అద్దె ఇల్లే. గొప్ప ఆర్టు డైరెక్టరు తీర్చిదిద్దినట్టుంది. మేమందరమూ, అతని భార్యను మెచ్చుకుని, "ఇల్లు ఇలా పెట్టినందుకు ఎన్ని వందలైనా ఇయ్యొచ్చు! గనక జీతంలేని చాకిరీ చేస్తున్నది." అనేవాళ్ళం.

ప్రకాశం మాతో ఏకీభవించేవాడు.

"జీవితం అందంగా ఉండాలి. ఎంత పేదవాళ్ళయినా జీవితాన్ని అందంగా చేసుకోవచ్చు. మన దరిద్ర నారాయణులకు ఆ విద్య తెలిసినవాడు విప్లవం వచ్చినట్టే!" అనేవాడు ప్రకాశం.

మరి అలాటివాడు అంత అందవికారమైన పనిమనిషిని-ధనలక్ష్మిని-ఎందుకు పెట్టుకున్నాడో మాకు తెలిసేది కాదు. ప్రకాశం ఇంట్లో వికారమైన దినుసు ఏదన్న ఉంటే అది ధనలక్ష్మి. బహుశా చౌకగా వచ్చిందని పెట్టుకుని ఉంటాడు. దానిజీతం నెలకు పదిహేను రూపాయలు - అయిదురోజులపాటు చౌకబారు తిండి తినటానికి చాలుతుంది. నెలకు మిగిలిన ఇరవై రోజులూ ఏం తింటుందో మన కెందుకు?

ఇంతలో ఒకరోజు నేను ప్రకాశం ఇంటికి వెళ్ళేసరికి ఇల్లు ధర్మసత్రం చావడిలాగా ఉంది. నేల ఊడ్చినట్టు లేదు. ఒక మూల మురికిగుడ్డలు కుప్పగా ఉన్నాయి. వంట ఇంటి పక్కన డాబాలో రెండు డజన్ల ఎంగిలి కంచాలూ, అంట్ల పాత్రలూ, గరిటెలూ, సబ్బులూ, కడగని గ్లాసులూ ఉన్నాయి.

"ఏమిటోయ్ ఇది ప్రకాశం?" అన్నాను.

"పనిచేసే పక్షి నిన్నటినుంచీ రావటంలేదు. దాని మొగుణ్ణి ఆస్పత్రిలో చేర్చారట!" అన్నాడు ప్రకాశం చిరాకుగా.

# అగాధమైన ఆలోచన

అబ్బాయి అగాధమైన ఆలోచనలో పడ్డాడు. పడే పడటంతోటే అమాంతం రాయిలాగా ఆలోచనలో మునిగి ఊరుకున్నాడు.

అబ్బాయికి ఉక్కిరి బిక్కిరయింది. కళ్ళు తెరవటానికి కష్టమయింది. బలవంతాన తెరిచి చూసినా ఏమీ కనిపించలేదు.

అబ్బాయి కాళ్ళూ చేతులూ గిలగిలా తన్నుకున్నై. కాని ఆ అగాధంలో వాడికాలికి ఊతంగాని, చేతికి పట్టుగాని చిక్కలేదు.

*

అదివరకల్లా అబ్బాయి చిన్న చిన్న ఆలోచనల్లోకి అమాంతం దూకి కాళ్ళూ చేతులూ కొడుతూ అటూ ఇటూ తిరిగి, కొందరిచేత, అహా! వాడికాలోచనల్లో తేలటం కూడా చాతవునే?" అనిపించుకుని ఉన్నాడు.

తనకు ఆలోచనల్లో ఈదటంలో ప్రజ్ఞ ఉందని భ్రమపడ్డ వాళ్ళంతా తెలివిగలవాళ్ళని అబ్బాయి భ్రమపడ్డాడు. తన శక్తి సామర్థ్యాలు సరిగా గ్రహించుకోక, తనను ప్రశంసించిన వాళ్ళ మాటలు మాత్రమే నమ్మి, ఇవాళ అబ్బాయి ఇంత అగాధమైన ఆలోచనలో పడటానికి సాహసించాడు...

*    *    *

అబ్బాయికి నిజమైన స్నేహితులుంటే, వాళ్ళు వాడికి సరి అయిన సలహా ఇవాల్సిన వాళ్ళే! "ఒక్కసారిగా అగాధంలో దూకకురా, బాబూ! నిన్ను పైకి లాగే వాళ్ళు కూడా ఉండరు!" అని నచ్చజెప్పే వాళ్ళే. కాని తన స్నేహితులు తన ప్రజ్ఞను విశ్వసించనందున అబ్బాయి అదివరకనే వాళ్ళందరితోనూ విరోధం కట్టాడు.

"ఏడిశావు లేవోయ్! నువ్వూ మామాదిరిగా మోకాలులోతు ఆలోచనల్లో బోర్లాపడి కాళ్లూ చేతులూ ఆడించేవాడివేలే! పెద్ద పోకళ్లుపోకు" అని తన స్నేహితులన్నందుకు అబ్బాయి వాళ్ళతో మీరు జన్మలో నాతోకూడకండి! అన్నాడు ...

*    *    *

చాలాకాలంగా అబ్బాయి, గజ ఈతగాళ్ళని పేరుపడ్డవాళ్ళ తోకపట్టి తిరుగుతూ వాళ్ళ సంభాషణ అనుకరిస్తూ వచ్చాడు.

చేతల్లో కూడా వాళ్ళననుసరించాలని ఆపరాని ఆవేశం పుట్టి చివరకబ్బాయి ఈ అగాధంలో దూకి ఊరుకున్నాడు!....

అబ్బాయి అడుక్కు చేరాడు. అట్టడుగున ఉన్న బురదంతా కలియదొక్కాక ఆలోచన యావత్తూ కెలకబారింది. నవరంధ్రాలా ఆలోచన కదవలకొద్దీ లోనికి వెళ్ళి అబ్బాయిని ఇంత లావున ఊదగొట్టింది. వాడికి స్పృహలేకుండా పోయింది. ఆ స్థితిలో అబ్బాయి అతిసులువుగా ఆలోచన పైకితేలి, ఏదో...ఒడుకు కొట్టు కొచ్చాడు!...

* * *

మళ్ళా ఒళ్లు తెలియగానే అబ్బాయికి పట్టరాని సంతోషం కలిగింది.

"ఆహా? ఇంత అగాధమైన ఆలోచన నేనుగాంగా ఈదగలిగాను!" అనుకున్నాడబ్బాయి.

వెంటనే రొప్పుకుంటూ అబ్బాయి తను ఎరిగిన వాళ్ళందరి దగ్గరికీపోయి, "నేనెంత పెద్ద ఆలోచనలో దిగివచ్చామనుకున్నారు?" అన్నాడు.

"అందుకేనా ఏమిటి, కర్మం, అట్లా బోదరించినట్టు కనబడుతున్నావు"? అని అడిగారు కొందరు.

అబ్బాయికి వాళ్ళనుచూస్తే కోపం వచ్చింది. "నేనేమీ బోదరించలేదు. నేనెప్పుడూ ఇట్లాగే ఉన్నాను. మీకళ్ళకేమన్నా జబ్బుచేసిందేమో, ఇంత కలికం వేసు కోండి!" అన్నాడు అబ్బాయి.

"ఊరికే ఆలోచనమీద తేలిరావటమేనా? లేక దాని లోతేమైనా చూసి వచ్చావా?" అన్నారు మరికొందరు.

"ఆలోచనమీద తేలనూ తేలాను, దానిలోతు చూసివచ్చాను!"అన్నాడు అబ్బాయి.

"అయితే అడుగునించి పైకేం తెచ్చావో చూపించు!" అన్నారింకా కొందరు.

అబ్బాయికీసారి బాగా కోపం వచ్చింది. "నేను లోతు చూసివచ్చిన ఆలోచన ఎంత అగాధమైనదో స్వయంగా చూస్తే మీరే అప్రస్తుత ప్రశ్నలు వెయ్యరు," అన్నా యి.

"ఏదీ, చూపించు!" అన్నారంతా....

"ఇదుగో, చూడండి!" అన్నాడబ్బాయి.

అందరూ ముక్కుమీద వేలువేసుకుని, "ఓరి నీ కర్మకాలా! ఆలోచనంతా ఇట్లాకెలికి వదిలి పెట్టావేం? మరొకడెవడూ కొంత కాలంపాటు దాని జోలికి పోవ టానికి లేకుండా!" అన్నారు.

అబ్బాయికి శివమెత్తింది. "మీరంతా వెధవలు! అసలు నేను నా గొప్పతనం మీకు చూపించటమే బుద్ధితక్కువ. మీవంటి దౌర్భాగ్యులకు ప్రతిభావంతుణ్ణి అదలిం చటం ఏం చాతనవును?" అని అబ్బాయి నానాతిట్లూ తిట్టాడు.

కొందరు అల్లరివాళ్ళు, "వీణ్ణి బోర్లాపడేసి పొట్టమీద తొక్కండి, ఆలోచన అపసవ్యంగా లోపలికిపోయి, చూడండి, ఎట్లా బోదరించాడో! అంతా బయటికి తక్కండి! లేకపోతే వాయువు కమ్ముతుంది!" అన్నారు.

ఈ మాట వినగానే అబ్బాయికి తారెత్తి పడుతూలేస్తూ పరిగెత్తి పోయినాడు.

ఇప్పటికీ అబ్బాయి ఒళ్ళు కాస్తో కూస్తో బోదరించే ఉంది. వాడు జన్మలో మళ్ళీ ఎన్నడూ అగాధమైన ఆలోచనల్లోపడ్డ పాపానపోలేదు. కాని ఎవరైన ఎర గని వాళ్ళు తటస్థపడితే ఎన్నడో ఇక్ష్వాకుల నాడు తాను ఎంతో అగాధమైన ఆలో చనలోదిగి దానిలోతు చూసి జయప్రదంగా బయటికి వచ్చిన కథ చెప్పి ఆముదం తాసూంటాడు....

---

(1943లో ప్రజామతకు ప్రచురణ కోసం పంపిన రాత ప్రతి ఆధారంగా ఈ ముద్రణ. అప్పుడు కొ.కు.సిమ్లాలోని క్రియేటివ్ పబ్లిసిటీ యూనిట్‌లో పనిచేస్తున్నారు.)

# అద్దాలగది

"నా స్వరూపం ఏమిటో తెలుసుకోవాలని చాలా కాలంగా ఉంది. స్వస్వరూప జ్ఞానం ప్రతివాడికి ఉండాలని పెద్దలు చెబుతారు" అన్నాను.

నా మార్గదర్శి నా వంక విచిత్రంగా చూసి, "అట్లా అయితే ఒకసారి అద్దాల గదిలోకి పోయి వద్దాం!" అన్నాడు.

"అక్కడికి పోతే నాకు స్వస్వరూపజ్ఞానం కలుగుతుందా?" అన్నాను.

"అది నువే నిర్ణయించుకుందువుగాని" అన్నాడు నా మార్గదర్శి.

"సరేపద!" అన్నాను.

* * *

"ఇక్కడ అన్నిరకాల అద్దాలు ఉన్నై! నిన్ను గురించి ఇవి ఏమి అభిప్రాయం. ఇస్తయ్యో అడిగి తెలుసుకో" అన్నాడు నా మార్గదర్శి.

నేను మొదట అద్దాన్ని సమీపించబోతుండగా నా మార్గదర్శి నన్ను వెనక్కు పిలిచి "నీ నిజస్వరూపం గురించి తెలుసుకోవాలంటే నీ నగ్న స్వరూపాన్ని అద్దాలకు చూపించవలసి ఉంటుంది. నీ దుస్తులను గురించి ఈ అద్దాలిచ్చే అభిప్రాయం నీ కెందుకు గనక" అన్నాడు.

ఒకసారి అద్దాల గది యావత్తు కలయజూశాను. స్వస్వరూప జ్ఞానంకోసం వచ్చిన నాబోటి దౌర్భాగ్యులు నలుగురైదుగురు గదిలో కనిపించారు. నలుగురినీ పరీక్షగా చూశాను.

ఎవరి మొహాన సంతోష చిన్నెలులేవు. అందరి మొహాలూ ముకుళించి ఉన్నై. అందులో ప్రత్యేకించి ఒక పెద్ద మనిషి ప్రతి అద్దం ముందు ఆగి తన దుస్తులు అద్దం ఆమోదించే విధంగా మార్చుకుంటూ మూతి ముక్కు విరుస్తూ, రకరకాల మొహాలు పెడుతున్నాడు.

"అన్ని అద్దాల దగ్గిరా సదభిప్రాయం పుచ్చుకోవాలని ఆ మనిషి అభిప్రాయం." అన్నాడు నా మార్గదర్శి.

ఇంకో ఆయన, తనను గురించి అద్దాలు తృప్తికరమైన అభిప్రాయం ఇవనప్పుడల్లా వాటిని తన చేతి రుమాలులో బలం కొద్దీ తుడుస్తున్నాడు.

"లోపమంతా అద్దాలలోనే ఉందనీ, తనలో ఏమి లేదనే, ఆ మనిషి భ్రమ" అన్నాడు నా మార్గదర్శి.

మరో పెద్దమనిషి ప్రతి అద్దంలోను మొహంపెట్టి చూసుకొంటున్నాడు.

"అద్దాలకంత దగ్గిరగా నిలబడితే అద్దంయొక్క అభిప్రాయం తనకు తెలీదనీ ఆ మనిషి ఎరగడు" అన్నాడు నా మార్గదర్శి.

నేను చూస్తూండగానే ఇంకో మనిషి అతివేగంగా అద్దాల గదిలో ప్రవేశించి నేరుగా ఒకటి రెండద్దాల దగ్గరికి పోయి తన స్వరూప జ్ఞానం పొంది తిరిగి గబగబా బయటికి వెళ్ళిపోయినాడు.

ఆ మనిషి వివేకి. తనను గురించి తనకు సందేహం కలిగినప్పుడల్లా తనకు విశ్వాసం ఉన్న ఒకటి రెండు అద్దాల దగ్గిర అభిప్రాయం పుచ్చుకుని వెళ్ళిపోతాడు. దారిలో అతను దాటిపొయ్యే అద్దాలు తమ అభిప్రాయం చెప్పకపోవు, కాని ఆ మనిషి వినిపించుకోడు. తన దారిని తలవంచుకుని వెళ్ళిపోతాడు.

"ఇక్కడికి వచ్చే వాళ్ళలో తమ నగ్న స్వరూపం తెలుసుకునే వాళ్ళెవరూ లేరా ఏమిటి?" అన్నాను.

"సాధారణంగా తమ నగ్నస్వరూపం చూసుకోవడం ఇష్టం ఉండదు. అది నేరమో ఆత్మవంచనో అనుకోకు. నీ నగ్నస్వరూపజ్ఞానం వల్ల నీకాదే ప్రయోజనం కూడా లేదు. కేవలము నీ వంటి జిజ్ఞాసువులు మాత్రమే ఆ పనికి పూనుకుంటారు" అన్నాడు నా మార్గదర్శి.

నన్ను నా మార్గదర్శి జిజ్ఞాసువన్నందుకు చా-గా సంతోషంవేసి, బట్టలు విప్పేసి అద్దాలను సమీపించాను....

* * *

నేను తిరిగి వచ్చిన తరవాత, "ఏం తెలుసుకున్నావు?" అని నా మార్గదర్శి అడిగాడు.

"కొన్ని అద్దాలు చాలా వంకర టింకర అద్దాలు. మొత్తానికి ఒక్క అద్దం కూడా నిర్దుష్టంగా లేదు. కొన్నిటి అభిప్రాయాల ప్రకారం నా ఒళ్ళుతో పోలిస్తే చాలా చిన్నదీ, కొన్నిటి అభిప్రాయం ప్రకారం పెద్దదీను. కొన్ని అద్దాలు నాకు గూని ఉన్నదన్నై. మరికొన్ని నాకు మెల్లకన్ను అంటగట్టినై. కొన్ని సన్నని వాడన్నై; మరికొన్ని లావుపాటి వాడన్నై. కొన్ని అద్దాలు నన్ను పదింతలు చేసినై, మరికొన్ని, ఎంత దగ్గరగా నిలబడినా, చాలా చిన్నచూపు చూసి నాకు కొద్దిచోటు మాత్రమే ఇచ్చినై. కొన్ని అద్దాలు నా శరీరచ్ఛాయ నల్లగా ఉన్నట్టు అభిప్రాయమిచ్చినై; మరికొన్ని నేను చాలా పచ్చని వాణ్ణని ఒప్పుకున్నై.

"కొన్ని అద్దాలకు బొత్తిగా కళాయి లేదు. మరి కొన్ని చాలా చిన్నవి; నన్ను గురించి ఏకంగా ఒకేసారి అభిప్రాయం ఇవ్వలేక, ఒకసారి నా ముక్కును గురించీ మరోసారి మూతిని గురించీ ఇట్లా విరిచి విరిచి అభిప్రాయం ఇచ్చినై. కొన్ని అద్దాలలో మీకిలా జీర్ణించిపోయింది. అది ద్రావకాలు పోసి కడిగినా పొయ్యేట్టు లేదు.

మకిలి మాట అట్లా ఉంచి అప్పుడప్పుడూ ఈ అద్దాల మీది దుమ్ముతుడిచే వాళ్ళు నాయి లేకపోవడం శోచనీయం.

"మొత్తంమీద అద్దాలన్నిటినీ అడిగి వచ్చాను. కాని వారు స్వస్వరూప జ్ఞానం కలిగినట్టు లేదు. పైపెచ్చు నాకు స్వస్వరూప జ్ఞానం పొందాలనే కాంక్ష కాస్తా పోయి ఊరునుండి ఇన్ని దిక్కుమాలిన అద్దాలకంటె శాస్త్రీయంగా నిర్దిష్టమైన ఒక్క అద్దం ఉంటే మనుష్యులకు యథార్థమైన స్వరూపజ్ఞానం కలుగుతుంది గదా!" అన్నాను.

నా మార్గదర్శి నవ్వి "శాస్త్రీయంగా నిర్దుష్టమైన అ ందనే విషయమూ, యథార్థమైన స్వరూప జ్ఞానమంటూ ఉందనే విషయమూ, చాలా అనుమానస్పద మైనవి. వాటిని గురించి అపే తాపత్రయ పడకు. నీలో ఉండే మిట్టపల్లాలను అద్దం మిట్టపల్లాలుగా ప్రదర్శించదు. వెలుతురు నీడలుగా ప్రకటిస్తుంది. అక్కడి కదే ఒక అబద్ధం. .. ఈ అద్దాలలో ముప్పాతిక మూడు వీసాలు ఎందుకు పనికి రానివైనా మిగతావి ప్రకటించే అభిప్రాయాలన్నీ నాకు ఏదో విధంగా పనికి వచ్చేవేననేవి జ్ఞాపకం ఉంచుకో. నిన్ను ఇంతలుగా ప్రకటించే అద్దంలో నీ మొహం మీది మచ్చలుకూడా పదింతలు కనిపిస్తై—నీకు చూడాలనే కోరికే ఉంటే నిన్ను చిన్నవాణ్ణిచేసి చూపించే అద్దాలవల్ల ప్రపంచంలో నువేకాక ఇంకా ఇతర విషయా లకు చోటున్నదని నీకు తెలుస్తుంది. నీకు లేని వంకరలు ఆపాదించే అద్దాలను బట్టి కూడా నువు నేర్చుకోదగినది చాలా ఉంటుంది. అది తెలుసుకునే చాకచక్యం నీలో ఉంది. అసలు రహస్య మేమంటే నీ స్వరూపం గురించి అభిప్రాయాలు యివ్వటమే ఈ అద్దాలవంతుగాని నీ మిట్ట పల్లాలను తెలుసుకోవాలంటే నిన్ను నువ్వు తడిమి చూసుకోవటం కంటె ఉత్తమమైన పని లేదు" అన్నాడు.

—1943 రాత్రపతినుండి

# మాటల అడివి

"మాటల అడివి చూస్తావా?" అన్నాడు నా మార్గదర్శకుడు.

మాటల అడివిని గురించి అదివరకు చాలామంది చాలా ఘనంగా చెప్పారు.

"అయ్యో, నువ్వెప్పుడూ మాటల అడివి చూడనేలేదా?....అది చూడని వాళ్ళ జన్మ ఎందుకు? ..ఆహా! నిజంగా, చూడాలిసిందంతా అందులోనే ఉంది...అది చూడటమే ఒక అనుభవం....నిజంగా!"

ఇటువంటి మాటలతో నన్ను చాలాసార్లు స్నేహితు లూరించారు. సగం బద్ధకం మూలానా, సగం అవకాశం లేకా మాటల అడివిని చూడటం పడనేలేదు. నా మార్గదర్శకు డీ మాట అనగానే నాలో చూడాలనే కోరిక కలిగింది.

"అక్కడ క్రూరమృగా లేమీ లేవు కద?" అన్నాను.

"అటువంటి ప్రమాదం ఏమీలేదు. కాని ..తెలిసినవాళ్ళు ఒక్కమాట అంటారు: మాటల అడివిలోకి వెళ్ళినవాడు వెళ్ళినట్టు వెనక్కు తిరిగిరాడని!"

"అంటే?" అన్నాను ఆందోళనతో.

"మాటల అడివి మనిషిని మారుస్తుంది. దానికేమీ సందేహంలేదు." అన్నాడు నా మార్గదర్శకుడు.

నా ఆందోళన మరింతయింది.

"ఉన్న సంగతేమిటో స్పష్టంగా చెప్పు. నువ్వట్లా నీళ్ళు నమిలితే నే నెట్లా నిర్ణయానికి రాగల్ను?" అన్నాను.

"మాటల అడివిలోకి ఆరోగ్యవంతులుగా ప్రవేశించి వింత వింత రోగాలతో బయటి కొచ్చినవాళ్ళున్నారు. కొందరు రోగులు అడివిలో ప్రవేశించి ఆరోగ్యవంతు లుగా బయటికి రావటం కూడా నేనెరుగుదును. కొందరు అడివిలో ప్రవేశించి తిరిగి రాకుండా అక్కడే చచ్చిపోవటం కూడా నేను కళ్ళారా చూశాను!" అన్నాడు నా మార్గదర్శి.

నా గుండెలవిసినై.

"జబ్బుతోనే?" అన్నాను.

"కాదు, కాదు. ఒక్కొక్కరకం మనుష్యులు మాటల అడివిలో ప్రవేశిస్తే బయటి ప్రపంచాన్ని సంపూర్ణంగా మరిచిపోయి అక్కడే ఉండిపోతారు. కొందరు అడివిలో జొరబడి బొత్తిగా దోవ తప్పి పోయినవాళ్ళు కూడా ఉన్నారు. కాని వింత ఏమిటంటే, దోవ తప్పిపోయినామే అనే చింత వాళ్ళకుండదు."

"చాలా వింతగా ఉందే ఈ అడివి! చెప్పు. ఇంకా వివరాలు చెప్పు" అన్నాను.

"చెట్ల మూలాన అడివి కనిపించక పోవటమనే సామెత విన్నావా?...అది మాటల అడివిలో ప్రవేశించే ప్రతివాడికీ అనుభవమవుతుంది!....మాటల అడివి మహాత్యం విని ఏం ప్రయోజనం? నీ వంటి జిజ్ఞాసువు ప్రత్యక్షంగా చూసి తెలుసుకో దగింది అక్కడ ఎంతో ఉంది!" అన్నాడు నా మార్గదర్శి.

అతను నన్ను జిజ్ఞాసువని అనకపోతే మాటల అడివి చూడటానికి బయల్దేరి ఉండను.

* * *

"ఇంకా ఎంత దూరం ఉంది అడివి?" అన్నాను.

"ఇదంతా అడివే! మనం చాలా సేపటినుంచీ మాటల అడివిలో నడుస్తున్నాం" అన్నాడు నా మార్గదర్శి.

"మరి నువు నాకిలా చూపించావు కావేం? ఈ చెట్లన్నీ ఏమేమిటో చెప్పు" అన్నాను.

"మనం ముఖ్యంగా చూడవలసింది చెట్లు కానేకాదు. కొన్ని చూడదగిన చెట్లు తరవాత చూపిస్తాను. ముందు ఇక్కడికి వచ్చే వాళ్ళను శ్రద్ధగా గమనించు...

అడుగో! ఆ మనిషిని చూడు. ..ఎట్లా రకరకాల ఆకులు కట్టలు కడుతున్నాడో! ఇతను రాతగాడు. అడివినిండా వీళ్లే జాస్తి. ఇక్కడ కూచుని వీళ్ళు పడే యాతన చూస్తే చాలా జాలేస్తుంది. ఒక్కోడు తనకు కావలసిన ఆకు దొరక్క ఘూముసేపు అడివంతా వెతుకుతాడు. ఒక్కోడు కట్టిన కట్టలన్నీ ఒకటికి పదిసార్లు తనిఖీచేసి కట్టిన కట్టలు కొన్ని మళ్ళీ విప్పి ఇక్కడిదక్కడా, అక్కడిదిక్కడా చెడమారుస్తాడు."

"ఇవన్నీ చివరికేం చేస్తారు!"

"ఏం చేస్తారు? ఎవరికన్నా మనబోటిగాళ్ళ కమ్మాలని చూస్తారు. చాలా భాగం అవతల పారేస్తారు. కొందరు తమ కట్టలను ఎవరూ తీసుకోకపోతే తమ పెట్టెల్లోనే పెట్టి దాచుకుంటారు. క్రమంగా అవి ఎండి రాలిపోతై. కొంతకాలమైన తరువాత తీసిచూస్తే బూడిద తప్ప అందులో ఏమీ ఉండదు. ఎక్కువభాగం కట్టలు ఊరికేనే ఇచ్చేస్తారు. ఇందులో చాలాభాగం ఎవరికీ ఏ విధంగానూ ఉపకరించవు. కొందరు కొందరు ఆటే చిన్నవి లేకుండా పెద్దపెద్ద కట్టలు, మోత చేటువి కడతారు. చివరకు వాటిని పెట్టేటందుకు చోటు కూడా దొరక్క బాధపడతారు.

ముఖ్యంగా కవులను గమనించు. వాళ్ళు సామాన్యంగా పూలు లేక ఆకులు తప్ప ముట్టరు. కొందరు పూల మెత్తదనం కోసమే దేవులాడుతారు. మరికొందరు వాసన కోసమూ, రంగుల కోసమూ దేవులాడుతారు. ఏమైనా వాళ్ళు చిన్న చిన్న కట్టలు అందంగా కడతారు. ఇవి ఎక్కువ భాగం ఊరికే ఇచ్చేసేవే. అరగింపుకు పనికిరావు."

"చేతిలో ఏమిటో ఘట్టుకుని ప్రతి చెట్టుకేసి చూస్తూ వస్తున్నాడు, ఆయన

ఎవరు?" అన్నాను.

"ఆయన ఫైలాలజిస్టు. ఆయన చేతిలోని పాత ఎండిపోయిన ఆకులు అవి ఏ చెట్లవై ఉండవచ్చునో ఈ చెట్ల జాతులేవిటో .. చేసుకున్నాడు" అన్నాడు నా మార్గదర్శి.

"కొందరు చెట్లచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నారెందుకు?" అన్నాను.

"ఈ అడవిలో ఏమి కనిపించినా నువ్వాశ్చర్యపడనవసరం లేదు. ఈ ప్రదక్షిణాలు చేసేవాళ్ళ జీవితం ఇంతే. వీళ్ళీ చెట్లను ఇంకేవిధంగానూ ఉపయోగించుకోరు. వాటిని దర్శనం చేసుకుని వాటిచుట్టూ ప్రదక్షిణం చెయ్యటమే వాళ్ళకు ముక్తి. వీళ్ళ తరగతిలోకి వచ్చేవాళ్ళే ఇంకొక రకం వాళ్ళున్నారు .... అడుగో ఆ ముసలాయన్ని చూడు ... ఆ చెట్టుకింద ఎట్లా పీఠం వేసుక్కూచున్నాడో. ఒకప్పుడాయన ఈ చెట్టు ఆకులను జనానికి పంచిపెట్టి ఘనమైన ఫలితం సంపాదించినవాడు. ఇప్పుడు ముసలాడయిపోయినాడు. ఈయనదగ్గిర ఆకులు పుచ్చుకునేవాడెవడు ఇప్పుడు లేడు. చెట్టూ ఎండుమొహం పట్టింది. కానీ ఈ చెట్టుకిందే కూచుంటాడు. దీన్ని వదిలి పెట్టిరాడు. ఈయన జన్మ యింతే!"

"కొందరు చూడు, కొన్ని చెట్లగాలి సోకుతూనే గజగజలాడుతారు. ఆ చెట్లు విషవృక్షాలని వాళ్ళ అనుమానం."

"కొన్ని కొన్ని మతాల వాళ్ళకూ తత్వాల వాళ్ళకూ కొన్ని చెట్లిష్టం— మొత్తానికి మనిషితత్వం ఈ అడవిలో బయటపడినంత విచిత్రంగా ఇంకెక్కడా బయటపడదు. గమనించినకొద్దీ నీకే తెలుస్తుంది."

"ఇక మనుషుల్ని వదిలేసి కొన్ని చూడదగిన చెట్లు చూపిస్తాను."

* * *

"ఇది ముఖ్యంగా చూడదగిన చెట్టు—దేవుడు చెట్టు! చాలా పురాతనమైనది, చాలా విస్తీర్ణమైనది. అంచనాలనుబట్టి మిగతా చెట్లకన్నా ఇదే ఎక్కువ ఉపయోగంలో ఉన్నట్టు తేలింది—దీని తాలూకు ఆకులూ, పూలూ, కాయలూ, కొమ్మలూ, రెమ్మలూ, బెరడూ, వేళ్ళూ అన్నీ జాస్తిగా వాడుకలో ఉన్నై. ఈ చెట్ల తాలూకు పళ్ళు చాలా చేదుగానూ అనారోగ్యంగానూ ఉంటవనీ చెబుతారు. పళ్ళు దొరకటమే చాలా అరుదు—శాస్త్రజ్ఞులు ఈ చెట్టు తాలూకు పరిశోధనలు చేసిన వాళ్ళు ఇది మనుషులకేవిధంగానూ ఉపయోగపడదని చెబుతున్నారు. ఈ చెట్టు తాలూకు ద్రవాలు తలకెక్కి అనారోగ్యకరమైన .... ప్రశాంతత, వేదాంత తత్వమూ పుట్టిస్తవని చాలా మంది అభిప్రాయం."

"ఈ చెట్టును నిర్మూలనం చెయ్యాలని చాలామంది ప్రయత్నించారు. కాని దీన్ని అనేక పక్కలనుంచి అనేక మతాల వాళ్ళు సంరక్షిస్తున్నారు. ఒక్కో మతం వాళ్ళు చెట్టుకు ఒక్కో పేరు పెట్టారు. కాని క్రియ కొందరికే దీనివల్ల ఉండే ప్రయోజనం."

"ఇది చూడు! ఇది ప్రేమ చెట్టు. ఇది— ఇప్పుడిప్పుడు చాలా వాడుకలోకి వస్తున్న చెట్టు. ఈ చెట్టును వాడగలవాళ్ళూ, దీని సరి అయిన అనుపానం తెలిసిన వాళ్ళూ బహుకొద్ది మంది. మిగిలిన వాళ్ళు దీన్ని కేవలమూ కుర్రకారుకు హుషారివ్వటానికి మాత్రమే ఉపయోగిస్తారు. ఈ చెట్టును చాలా అనుమానంతో చూసే వాళ్ళు కూడా ఉన్నారు.

ఇది కళాచెట్టు. చూడు, దీని చుట్టూ ఎంత మంది ప్రదక్షిణం చేస్తున్నారో! వెనుకటి రోజుల్లో ఈ చెట్టు ఆకులు కొయ్యటానికి చాలామంది వచ్చేవాళ్ళుకారు. ఇప్పుడిప్పుడు ఎవరు బడితే వాళ్ళెగబడుతున్నారు. అందువల్ల ఇబ్బంది లేదుగాని ఈ ఆకులను గురించి ఎవరిమటుకు వాళ్ళు తమ ఇష్టం వచ్చిన విషయాలు చెప్పటంతో చిక్కొస్తున్నది. ఈ ఆకుల గుణాలను గురించి ప్రతివాళ్ళూ అతిశయోక్తులాడేవాళ్ళే. వీళ్ళలో అప్పుడప్పుడు జరిగే ఘర్షణలు వినితీరాలి. ఈ చెట్టు ఆకులు ఎవరుబడితే వారు కొయ్యకుండా కాపలాకాయటానికి ప్రయత్నించే వాళ్ళను చూడు. మొత్తం మీద ఈ చెట్టు మూలంగా చాలామంది కాలం వృధాగా చేసుకుంటున్నారు...."

"ఈ రెండు చెట్లూచూడు. ఇవి నిజమూ, అబద్ధమూనూ...."

"ఇవి చెట్లేమిటి? ఇంత నున్నగా, బోడిగా ఉన్నై!" అన్నాను.

"ప్రతివాడు దీనిమీద చెయ్యివేసి వీటినిట్లా చేశాడు. ఇంకో చిక్కేమిటంటే వీటిని ఉన్నచోట ఉండనివ్వరు. ఇక్కణ్ణించి తీసి అక్కడా, అక్కణ్ణించి తీసి ఇక్కడా పెడుతూ ఉంటారు."

"ఏమిటి? వీటికి వేళ్ళు లేవు?" అన్నాను.

నా మార్గదర్శి రెంటినీ తేలికగా పైకెత్తి చూపించాడు. రెంటికిందా రెండు గోతులు మటుకున్నై!

"ఇటువంటి చెట్లు ఈ అడవిలో చాలా ఉన్నై. మంచీ, చెడూ — పుణ్యం, పాపం — మొదలైనవి.... .. ."

"ఈ అడవిలో ఉన్న చెట్లన్నీ కులగోత్రాలు గలవి. ఒక కులం చెట్ల మధ్య ఇంకోకులం చెట్టొకటి వచ్చిపడితే లబ్బున మొత్తుకునే వాళ్ళున్నారు. ఇంతగా జాగర్త తీసుకుంటున్నప్పటికీ దీనికి అడవి లక్షణం పోలేదు.....ఇక్కడ ఎండి పోయిన చెట్లు కనిపిస్తై, కాని వాటిని పీకెయ్యటానికి ఒప్పుకోరు కొందరు. వాళ్ళు దాని బెరడయినా వాడతారు గాని వదిలిపెట్టరు...."

"ఇక్కడ ఒక్కోవైపు ఒక్కో భాషకు చెందిన చెట్లున్నై. ఒక భాష తాలూకు చెట్లకూ ఇంకో భాష తాలూకు చెట్లకు తేడా ఏమి కనిపించదు. కాని వాడుకలో ఫలితాలు వేరువేరుగా ఉంటున్నై. నేలలో ఏదో ఉండి ఉంటుంది" అన్నాడు నా మార్గదర్శి

—1943 రాత ప్రతి నుండి.

# మాటల ఆసుపత్రి

"మాటల అడివి చూసాం గనక మాటల ఆసుపత్రికి కూడా ఒక ప్రదక్షిణం చేసివద్దాం," అన్నాడు నా మార్గదర్శి.

"మాటల ఆసుపత్రి కూడా ఉందా?" అన్నానాశ్చర్యంతో.

మార్గదర్శి అనుమానిస్తూ, "ఇంకోమాట దొరకక్క దాన్ని ఆసుపత్రి అన్నానే కాని అక్కడ చెప్పుకోదగిన చికిత్స ఏమీ జరగదు. నిజం చెప్పాలిసొస్తే అదొరక మైన రోగుల బందిలి దొడ్డి. అయితే అక్కడ వైద్యులు కూడా ఉన్నారు మరి. కాని వాళ్ళు చేసేది చికిత్స కాదు—ఓ విధమైన పరిశోధన," అన్నాడు.

"సరే చూతాం పద!" అన్నాను.

* * *

"మనుష్యులు! వందలకొద్దీ—వేలకొద్దీ—కోట్లకొద్దీ మనుష్యులు! మాటల ఆసుపత్రి యావత్తూ మహాగందరగోళంగా ఉంది."

"ఇక్కడ, కొద్దిమంది నవనాగరికపు ఆడవాళ్ళు తప్ప మొత్తం మీద ఉన్న వాళ్ళంతా మగవాళ్ళల్లేనే ఉందే?" అన్నాను.

"నిజం! దీనికి కారణం శాస్త్రజ్ఞులు రకరకాలుగా చెప్తున్నారు. ఆడవాళ్ళు మగవాళ్ళకంటే చాలా అధికంగా మాట్లాడతారనే మాట రుజువైనప్పటికీ, మాటలు వాళ్ళలో అనారోగ్యకరమైన వికారాలు పుట్టించలేనట్టు కనబడుతుంది. దీనికి కారణం వాళ్ళు అధికంగా మాటకారులు కావడమేనని కొందరి అభిప్రాయం. మాటలను మగ వాళ్ళకంటే ఆడవాళ్ళు చాలా శాస్త్రీయంగా ప్రయోగిస్తారనీ అందువల్ల వాళ్ళలో మాటలు జాస్తిగా ఉద్రేకం కలిగించలేవనీ, మరి కొందరి అభిప్రాయం. మగ వాళ్ళకంటే ఆడవాళ్ళకు జీవిత యాదార్థ్యం బాగా తెలుసుననీ, మగవాళ్ళ మాదిరిగా వాళ్ళు చప్పున ఉద్రేకానికి లోనుకారనీ, ఇంకొందరి అభిప్రాయం. మగవాళ్ళ నోట నానా మాటలు పడటం అలవాటయిపోయి వాళ్ళు మాటలకు చలించటం మానేశారనే అభిప్రాయం కూడ లేకపోలేదు. నా అభిప్రాయంలో ఈ కారణాలలో ఏదీ తోసేయ టానికి లేదు."

"ఇంకో విషయం కూడా గమనించు! ఇక్కడ బొత్తిగా పామరులైన వాళ్లు బహు తక్కువ. ఉన్నవాళ్లు జాస్తిగా మధ్య తరగతి వాళ్ళు - కొద్దిగా పై తరగతి వాళ్ళున్నూ. మాటల జబ్బు జాస్తిగా వీళ్ళకే చేస్తుందల్లే ఉంది."

"పాతికేళ్ళ నుంచి ఒక డాక్టరు మాటల జబ్బుల మీద పరిశోధన చేస్తున్నాడు. ఈ జబ్బులు మాటలవెంట ఉండే క్రిములవల్ల కలుగుచున్నాయని ఋజువు చేతామని ఆయన ఆశ. ఆ ఆశ ఇప్పటివరకు ఫలించలేదు—బహుశా ఇక ఫలించదు. ఈ క్రిములు ఆడవాళ్ళనూ, పాటకపు జనాన్ని ఎందుకు బాధించటం లేదని ఇప్పటి కాలపు శాస్త్రజ్ఞులు అడుగుచున్నారు. వీళ్ళ ఉద్దేశంలో ఈ ముసలి వైద్యుడు క్రిమి అనే మాటతో బాధపడుతున్నాడు."

"ప్రాయిడూ, అతనికి పెడదిరిగిన కొందరు శిష్యులు[1] చేసిన సిద్ధాంతాలను బట్టి ఈ మాటలరోగాల తత్వం కొంతవరకర్థమవుతున్నది. కాని ఈ మధ్య పంచదార మాత్రల[2] వైద్యుడొకడు వచ్చి ఒక రోగిని కొద్దికాలంలో చిత్రంగా నయం చేసిపోయినాడు. ఆ రోగి ఒక రెండు చెప్పరాని మాటలతో బాధపడుతున్నట్టు ఆ వైద్యుడు నిర్ణయించాడు. ఎందుకంటే ఆ రోగి ఆ మాటలెవరైనా ఉపయోగిస్తే 'హరి హరి' అని చెవులు మూసుకొని గజగజ వణికేవాడు. అతడి మొహం కందేది. అతడికా మాటలు వింటే ముచ్చెమటలు పోసేవి. ఆ మాటలవల్ల కలిగిన జబ్బుకామాటలే మందని ఆ పంచదార మాత్రల వైద్యుడు నిర్ణయించాడు. ఆ మాటలనే రెండో పొటెన్సీలో–నూరు మాటలలో ఒక్కటి చొప్పున—వాడి ఆ వైద్యుడా మనిషిని రెండు మూడు నెలల్లో నయం చేశాడు. కాని పంచదార మాత్రల వాణ్ణి కషాయాల వాళ్లూ, రంగునీళ్ళ వాళ్లూ వెళ్ళగొట్టారు. మిగిలిన రోగాలల్లేనే మాట రోగాలు కూడా వాటంతట అవి నయం అయ్యే అవకాశం వుందని ఈ బాగుపడ్డ రోగి అట్లాగే బాగుపడ్డాడని వీళ్ళ నమ్మకం."

"పంచదార మాత్రల వాణ్ణి విశ్వసించటానికి మరో కారణం కూడా కన్పిస్తున్నది. ఒకే మాట పెద్ద డోసులలో ఇస్తే రోగాలు పుట్టుకొస్తున్నాయి. అదిగో, ఆ మూల గడ్డపువాణ్ణి చూడు. వాడు పదిహేను రోజులు రామ జపం తప్ప ఏమీ చేయలేదు. రోగం పుట్టుకొచ్చింది. అందరూ అపర వాల్మీకి అన్నారు. కాని చివరకు ఆస్పత్రి పాలయినాడు. వాణ్ణి నయం చేసేవాళ్ళు లేరు ... ఆ పక్క జర్మను వాళ్ళు చూడు. వాళ్ళ దగ్గిరికి పోయి, పరుషమైన కంఠంతో 'జర్మనీ, జర్మనీ, జర్మనీ' అని మూడుసార్లు కేక పెట్టావా, వాళ్ళంతా కొయ్యబారిపోయి నువ్వేం చెబితే అది చేస్తారు!"

"ఈ జర్మను వాళ్ళలో హిట్లరుగానీ, గ్లోబెల్స్‌గానీ, ఇతర నాజీ నాయకులు గానీ లేరు గమనించు. ఈ మాటల రోగులతో వచ్చిన పెదచిక్కే అది. వీళ్ళల్లో మంచివాడు కానివాడు దాదాపు ఒక్కడూ లేడు. మాటలతో ఇతరులకు పిచ్చెత్తించే వాళ్ళూ, మాటలతో లోకాన్ని దోచేవాళ్లూ ఈ ఆసుపత్రిలో లేనేలేరు. వాళ్ళంతా

1. చూడండి, అరుణోదయం నవలలో.
2. హోమియో మాత్రలు.

ఆరోగ్యంగానే ఉన్నారు — మాటల జబ్బులు సంబంధించినంత వరకూ. వీళ్ళంతా ఈ ఆస్పత్రిలో పడి ఉండటం మూలంగా ఆ దుర్మార్గులు మరింత జయప్రదంగా ప్రపంచాన్ని ఏలగలుగుతున్నారు. ప్రపంచం బాగుపడాలంటే ఈ ఆస్పత్రి ముందు ఖాళీ కావాలనేది నిశ్చయం. దురదృష్టవశాత్తూ ఇక్కడ శాస్త్రీయమైన చికిత్స లేకుండా ఉంది. ఇక్కడ పరిశోధనలు చేసేవాళ్ళంతా పరధ్యానంగా, ఎప్పటికో ఏవో పుస్తకాలురాసే ఉద్దేశంతో పరిశోధనలు చేస్తున్న వాళ్ళేగాని దీక్షగా ఆసుపత్రి బాగుచెయ్యటానికి పూనుకున్నవాడు లేడు "

"ముఖ్యంగా ఇక్కడున్న పిల్లకాయలను జాగ్రత్తగా గమనించు. వీళ్ళలో చాలామంది అప్పుడే తీవ్రమైన మాటల జబ్బులతో బాధపడుతున్నారు. ఈ దశలో వీళ్లను నయం చెయ్యటానికి అవకాశం ఉంది. కానీ దురదృష్టవశాత్తూ, ఈ ఆసుపత్రిలో కూడా వీళ్ళమీద వీళ్ళ తలిదండ్రులకు సంపూర్ణాధికారాలున్నై. ఈ సంపూర్ణాధికారాలు పిల్లల జబ్బులు మరింత చేస్తున్నయ్యే కానీ జరగటంలేదు. ఈ విషయంలో ఆసుపత్రి నియమాలు చాలా లోపభూయిష్ఠంగా ఉన్నై.

"ఏమంటే ఇక్కడి పరిశోధనల్లో చాలామంది తమ సంపర్కం ద్వారా పిల్లల్ని సులభంగా బాగు చేయగలరు. కాని ఇక్కడి రోగుల్లో చాలామందికి వీళ్లంటే తగని భయం కావటం వల్ల తమ పిల్లల్ని ఈ పరిశోధకుల ఛాయలకు పోనివ్వరు .

ఆరోగ్యం పొందటానికి భయపడటం ఇక్కడి జబ్బుల యొక్క ప్రధాన లక్షణమని చెప్పవచ్చు. కాని ఈ లక్షణం చిన్న పిల్లల్లో— అంటే, రోగం ముదరక పూర్వం—అంత స్పష్టంగా కనిపించదు. కనకనే ఇక్కడ ఉండే పిల్ల రోగుల సంఖ్య నానాటికీ తగ్గుతున్నది.... ఇదొక్కటే ఈ ఆసుపత్రిని గురించి సంతోషించదగిన అంశం...."

"ఈ ఆసుపత్రిని గురించి నిజమైన ఆందోళన ప్రకటిస్తున్న వాళ్లు శాస్త్రజ్ఞులూ కారు, వైద్యులు కారు. మనో వైజ్ఞానికులూ కారూ—మార్క్సిస్టులు. ఈ రోగాల విషయంలో వీళ్ల శ్రద్ధ ప్రకటించటమే గాకుండా, వాటికి ఫ్రాయిడు సిద్ధాంతాలతో ఎటువంటి సంబంధం ఉందో మార్క్స్ సిద్ధాంతాలతో కూడా అంత సంబంధం ఉందని వీళ్ళు రుజువు చేస్తున్నారు. ఇక్కడి రోగుల్లో చాలా మందికి డబ్బు దాకతోనూ, పోకతోనూ ఉన్న రోగాలు పోయి కొత్తరోగాలు వస్తున్నై. మొత్తం మీద జీవిత సంగ్రామానికీ మాటల జబ్బులకూ సన్నిహిత సంబంధం ఉన్నట్టే ఉంది" అన్నాడు నా మార్గదర్శి.

"ఈ మాటల జబ్బు తత్వం నిర్ణయం కాకపోవటం వింతగా ఉంది," అన్నాను.

"ఈ జబ్బును గురించి ఒకటి మాత్రం నమ్మకంగా చెప్పవచ్చు; మాటలు మనస్సులో హరాయింపు కాకుండా అంతర్బుద్ధిలోకి వెళ్ళినప్పుడు జబ్బు చేస్తున్నది.

బుద్ధి మాటలను హరాయించుకోలేక పోవటానికి ఒక కారణం బుద్ధి బలహీనంగా ఉండటం. రెండో కారణం ఈ వ్యాధిగ్రస్తులు ఉద్రేకం కోసం తాపత్రయపడాలిసిన దుస్థితి కలగటం. వీళ్ళ రోజువారి జీవితంలో ఏమీ ఉద్రేకం లేదు. బుద్ధియొక్క ఆరోగ్యం ద్వారా వీళ్ళకు తగినంత ఉద్రేకం లభించే అవకాశం ఉంది. కాని ఉద్రేక దాహం వీళ్ళకంత ఓర్పివ్వదు. అందుచేత, క్షుధార్తుడు తిండిని నమలకుండా మింగినట్లు, వీళ్ళు క్షణక్షణమూ మాటలను సరిగ్గా వచనం చేసుకోకుండా కబళించి బుద్ధిని అజీర్తిపాలు చేసి ఇట్లా రోగగ్రస్తులైనారు."

"అంటే ఇంతమందీ మాటలను సరిగా ఉపయోగించలేరన్న మాటే?" అన్నాను.

"సందేహమెందుకు? వీళ్ళలో ఒక్కడు కూడా మాటలను బుద్ధి బలంతో వాడలేడు. బుద్ధి బలంతో స్వీకరించలేడు. ఎక్కడన్నా ఒకడు కాస్త అటువంటి శక్తి గలవాడు కనిపిస్తే 'ఆహా! ఎంత తెలివిగలవాడురా!' అని ఆశ్చర్యపడి వాణ్ణి గురించి ఆలోచించటం మానేస్తారు. వీళ్ళింత చచ్చు స్థితిలో ఉండబట్టే పత్రికల్లో ప్రకటించే దౌర్భాగ్యపు ప్రకటనల ద్వారా వ్యాపారమూ, రాజకీయవేత్తల పిచ్చి పేలాపనల ద్వారా ఉద్యమాలూ సాధ్యమవుతున్నయ్యనుకోరాదూ!" అన్నాడు నా మార్గదర్శి.

"ఈ ఆసుపత్రి ఇట్లా అవిచ్ఛిన్నంగా సాగాలిసిందేనా?" అన్నాను.

"చెప్పలేం!... వీళ్ళందరికీ ఆరోగ్య సూత్రాలు కల్పించి.... క్రమంగా ఆరోగ్యం కల్పించటం దాదాపు అసంభవంగా కనిపిస్తుంది. ఒకవేళ సంభవమైనా ... ఈ ఆసుపత్రి ఇట్లా అవిచ్ఛిన్నంగా సాగిపోవటం కోరేవాళ్ళు ప్రపంచంలో చాలా మంది ఉన్నారు. వీళ్ళ సంఖ్య నానాటికీ ఎక్కువవుతున్నది .. వాళ్ళు పడనివ్వరు! వాళ్ళలో మళ్ళీ అంతఃకలహాలున్నై. వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు నిర్మూలించుకొంటే— అటువంటిది ఎప్పటికన్నా జరగటం ఉంటే ఈ ఆసుపత్రి బాగుపడుతుంది!... లేదా ప్రళయమైన భూకంపం లాటి విప్లవం ఒకటి జరిగి ఆ దెబ్బకు అందరు రోగులూ ఒక్కసారి కోలుకోవటమైనా జరగాలి!.... లేదా, ఇంతమంది రోగాలకు పరమహంస క్రియలాటి మంత్రం ఒకటి పుట్టాలి! దానివల్ల ఇప్పుడున్న రోగాలన్నిటినీ మించే రోగం పుట్టినాసరే— దాని మూలంగా ఈ చిల్లర రోగాలు ముదిరితే — ఆ వెనక ఆ పెద్దరోగం జాతికంతకూ ఉండిపోయినా ఈ ఆసుపత్రి ఒకటి అంతమవుతుంది. తరువాత ఆ పెద్దరోగం క్రమేణా దానంతట అదే హరించుకుపోతుంది.... ఈ ఆసుపత్రిలో ఆరోగ్యం లేకపోవటం కొన్ని, రకరకాల రోగాలుండటం ఎక్కువయిన దౌర్భాగ్యమేమో అనిపిస్తున్నది!" అన్నాడు నా మార్గదర్శి.

"ఇక్కణ్ణించి పెందలాడే తప్పుకుపోదాం పద! లేకపోతే మనం కూడా ఇందులో వాళ్ళల్లో జత అయిపోతామేమో!" అన్నాను.

— 1943 రాత ప్రతినుండి

# కర్మయోగులు

## ఒకటో రంగం

[భద్రంగది, గజపతి కొంచెంగా గుర్రుపెడుతూ నిద్రపోతున్నాడు. బల్లమీది అలారం గడియారం టిక్కు-టిక్కు-మనటమూ, భద్రం సిగిరెట్టు పీల్చటమూ, ఆ నిశ్శబ్దంలో చాలా గట్టిగా వినిపిస్తూ వుంటుంది. అకస్మాత్తుగా భద్రం పెద్ద చప్పుడుచేస్తూ కుర్చీలోనుంచి లేచి కుర్చీ చర్రున కదిలిస్తాడు. గజపతి గురక ఒక హెచ్చుస్థాయికి వచ్చి ఆగిపోతుంది.]

గజపతి : (నిద్రమత్తుతో, విసుగ్గా) ఒక్క క్షణం కన్ను మొయ్యనివ్వకుండా....ఏమిట్రా, భద్రం?

భద్రం : (ఉద్రేకంతో) తట్టిందిరా! తట్టిందిరా, గజపతీ!

గజపతి : (ఆవలించి) ఇంకా నిద్రపోలా?

భద్రం : ఒరే నిద్రమొహం, మళ్ళీ పడుకుంటున్నావా? ఇది వినాలిసిన విషయం. లేచి కూచో! కాసిని మంచీళ్ళు తాగు. ఊఁ! ఇంద.

గజపతి : ఇప్పుడుకాదు, రేపొద్దున! నాకు నిద్దర కమ్ముకొస్తోంది. మళ్ళీ ఆవలిస్తూ కెవ్వున కేకేసి, (నిద్ర పూర్తిగా వదిలిపోయిన గొంతుతో) కాస్త బుద్ధి వుండాలి. చూడు బట్టలన్నీ ఎట్లా తడిపేశావో! నిద్ర మత్తున వున్న వాడిమీద నీళ్ళు పోస్తే న్యుమోనియా వస్తుంది తెలుసా?

భద్రం : నాకు తెలీదు.

గజపతి : నా మాట నమ్మకం లేకపోతే మా మేనత్త మొగుణ్ణడుగు...ఆయన న్యుమోనియావచ్చే చచ్చాడు. (మళ్ళీ కెవ్వున అరుస్తూ) ఒరే, భద్రంగా, నీ డొక్క చీరేస్తా! అర్థరాత్రివేళ అంకమ్మ శివాలుట!

భద్రం : మంచిగా చెబితే వినుమరి, ఇట్లావచ్చి కూచో, దివ్యమైన ఆలోచన! ఈ ఆలోచన పారిందో, ఆ అమ్మాయి మనదే!

గజపతి : ఏ అం—కొంపదీసి—

భద్రం : అవున్రా, గజపతీ! ఆ అమ్మాయే. నే నింకో అమ్మాయిని గురించి ఆలోచించ గలననుకుంటున్నావా ఏం? కల్లోమాట!

గజపతి : ఓరి నీ యిల్లు—! (ఆశ్చర్యంతో ఒక్క-క్షణం ఆగి)ఒరే, భద్రం! నాకు తెలీకడుగుతానూ. నువ్వెన్నడూ ఆడదాని మొహం ఎరగవుట్రా! సాయంతరఌ

మనంగా చూసిన అమ్మాయిని గురించి—బైమొంతయిందీ? — పన్నెండున్నరదాకా ఆలోచించటమేగాక, హాయిగా నిద్రపోతున్నవాణ్ణి నన్ను నిద్రలేపటమేగాక, నామీద రెండుసార్లు నీళ్ళుపోసి న్యుమోనియా వచ్చినంతపని చెయ్యటమేగాక—

భద్రం : కొయ్యకురా! మీ మేనత్త మొగుడు న్యుమోనియాతో పోతే పొయ్యాడేమోగాని—

గజపతి : అంతా అప్రస్తుతం! నే చెప్పొచ్చిందల్లా ఏమిటంటే, నువ్వికనన్నా ఆ అమ్మాయి గొడవ శాశ్వతంగా మర్చిపోయి నన్ను నిద్రపోనివ్వటం భావ్యమంటాను. కావలిస్తే నువు మేలుకునుండి ఇల్లుకాయి.

భద్రం : (చిరాగ్గా) ఆ అమ్మాయి, ఆ అమ్మాయి అంటావేమిటి? అది అమ్మాయా! గాలిపటం! ఐస్క్రీంజెల్లీ! ట్యూబ్ లైటు!—

గజపతి : అహోరించినట్టే వుంది కవిత్వం.

భద్రం : (తన ధోరణిలో) అవేం కళ్ళు! అదేం గాంభీర్యం! ఆపిల్ పండు లాంటి మొహం. ఎక్కడా ఒక్క మచ్చలేదు. ఒక్క వంకరలేదు. మూతి ఎంత మేకప్ చేస్తేమటుకు ఆ పెదిమలు ఎక్కడ దొరుకుతైరా? వెధవదేవుడు ఒక్కవంక పెట్టివుండకూడదూ ఆ అమ్మాయికీ? నేనింత తపనపడక పోదునుగా.

గజపతి : (భద్రం భుజంతట్టి సానుభూతిగా) ఒరే, నీ కింతగా గుచ్చుకుందని తెలిస్తే నేను—అయిపోయిందేదో అయిపోయిందిగాని రేపుతెల్లవారగానే ఆ పిల్ల ఎక్కడవుంటున్నదో అదంతా ఆచూకీతీద్దాం. అవసరమైతే నీ దగ్గిరున్న అరవై వేలూ ఖర్చుచేసి అయినా ఆ పిల్ల ఎడ్రస్ సంపాదిద్దాం. నువు తీద్దామనుకుంటున్న పిక్చర్ లేకపోతే పీడాపాయిరి! వెధవ పిక్చరు పిల్లకన్నా ఎక్కువా?

భద్రం : ఎందుకురా? ఆ పిల్ల ఎక్కడుంటున్నదీ నాకు తెలుసుగా?

గజపతి : (సంతోషంతో) తెలుసూ? హారి పిడుగా! చెప్పవేం? (గంభీరంగా అయి) ఒరే, భద్రం! భద్రంరా, భద్రం! ఆ పిల్లకు కొంపతీసి పెళ్ళయి పోయిందేమో?

భద్రం : అయితే నాకు లెక్కనుకున్నావా?

గజపతి : (కొద్దిగా వొణుకుతూ) అట్లా అంటావా? ఉండు! కొంచెం ఆలోచించనీ అవున్లే! హృదయం కట్లు తెంచుకున్నాక, నీతీనియమూ లోక లెక్కా ఏవిటిగాని ..ఒరే భద్రం వాడు నిన్ను పిస్తోలుపెట్టి కాల్చేస్తే?

భద్రం : ఎవడ్రా?

గజపతి : (బాగా వొణుకుతూ) వాడేరా! దాని మొగుడూ!

భద్రం : వాడి మొహం! వాడి మొహాన ఐదువేలు పారేస్తా! కాదు కూడదంటే పదివేలు కూడా పారేస్తా, చలో!

గజపతి : (అనుమానంగా) నోరు మూసుకుంటాడంటావా?

భద్రం : (నవ్వి) వాడు మూసుకునేదేవిటి? డబ్బే మూస్తుంది.

గజ : అన్నట్టు, ఒరే, భద్రం? ఒకవేళ ఆ పిల్లకు మొగుడంటే చాలా ప్రేమ అనుకో.

భద్రం : నిద్ర మొహం మాటలు మాట్లాడావంటే మళ్ళీ నీళ్ళు చల్లాలిసొస్తుంది.

గజ : నీ ధాష్టీకవేఁవిఁటి, వెధవ ధాష్టీకం? ఆ పిల్ల తన మొగుణ్ణి ఎందుకు ప్రేమించకూడదూ?

భద్రం : (ఇంకా బిగ్గరగా నవ్వి) ప్రేమేమిట్రా, ప్రేమా? అక్కుఁచ్చమ్మ కబుర్లూ నువ్వూనూ.

గజ: ఒక చెంప నువు ప్రేమతో బాధపడుతూనే అక్కుఁచ్చమ్మ కబుర్లంటా వేఁవిట్రా? సబబుండొద్దూ?

భద్రం : (ఓర్పుగా) పోని నువన్నదెందుక్కాఁదనాలి? ఆ పిల్లకేదన్నా అభ్యంతరాలుండే పక్షంలో ఆ పిల్ల మనస్సు మనం విరవాలి. దానికే ఉపాయం ఆలోచించా.

గజ : ఏమిటా ఉపాయం?

భద్రం : మరేం లేదు, ఆ పిల్లకున్న అభ్యంతరాలని నువు బలపరిస్తే సరీ!

గజ : అంటే నీ ఉద్దేశం—? ఒరే, భద్రం, నిన్ను చూస్తే మండిపోతోంది. అన్నట్టు అసలు సంగతి మరిచిపోయినాను. నీ భార్యమాటేమిటి? నీ దగ్గిరున్న డబ్బులో సహానికి సగం ఆవిడది! ఈ డబ్బంతా నువు ఎవరికోసమో తగలేస్తూంటే ఆవిడ—

భద్రం : నా భార్య భయం నీకేమి అక్కర్లేదు. నువు మాత్రం నా వెంట రేపుదయం వాళ్ళ ఇంటికి రావాలి. నన్ను పరిచయం చెయ్యాలి. మా సంభాషణలో ఆ అమ్మాయి ఏ అభ్యంతరం చెప్పినా నువు బలపరచాలి. తెలిసిందా?

గజ : ఇందులో తెలియటానికేముందీ?

భద్రం : (నిప్పుల్లి వెలిగించి సిగిరెట్టు అంటించుకుంటూ) ఇక నువు నిద్రపోవచ్చు.

గజ : బతికించావు! నీకు నిద్రా బద్ధా లేదాయేం?

భద్రం : హుఁ! నేనింక నిద్రపోవటఁవే! (గడియారం చప్పుడు క్రమంగా తగ్గిపోతుంది.)

## రెండో రంగం

(శ్రీమతి ఇల్లు, మర్నాటి ఉదయం. దూరాన కార్లుపోతున్న చప్పుడు, సమీపంలో పిచ్చికల చప్పుడు.)

గజ : ఇదేనా ఇల్లూ? పొరపాటు లేదుగద? నాకేదో భయంభయంగా వుందేం?

భద్రం : నువ్వు కాస్సేపు నోరుకట్టెయ్, (గట్టిగా) ఎవరండీ ఇంట్లోనూ?

దుర్గారావు : (లోపల్నుంచి) ఎవరూ? (దగ్గిరకివచ్చి) ఎవరు కావాలండీ?

భద్రం : ఇక్కడెక్కడో ఖాళీ ఇల్లుందన్నారండీ? మీకేమైనా తెలుసా?

దుర్గా : ఈ ఇంటికి మూడో ఇంట్లో పై అంతస్తులో ఒక భాగం ఖాళీ వుందని పదిరోజుల కిందట విన్నా, ఇప్పుడుందో లేదో మరి.

భద్రం : ఎబ్బే మనకు పోర్షను చాలదు. ప్రొడక్షనాఫీసుకు ఇల్లంతా కావాలి.

దుర్గా : (ఆసక్తిగా) ఏం ప్రొడక్షనేమిటండీ?

భద్రం : ఇంకేం ప్రొడక్షన్లుంటాయండీ ఈ రోజుల్లో? పిక్చర్ ప్రొడక్షనే. కానిని మంచితీర్థం ఇప్పిస్తారా, బాబూ.

దుర్గా : రండి, లోపలికిరండి. అలా కూర్చోండి...అయితే మీరు సినిమా తీస్తున్నారా యేం? ...ఏవే? రెండుగ్లాసుల్తో మంచినీళ్ళు పట్రా!

భద్రం : అవునండీ! ఇదుగో, ఈయనే మా ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. నాదేముంది? నేనల్లా డబ్బు పెట్టేవాణ్ణే.

దుర్గా : చాలా డబ్బు కావాలి గదండీ?

భద్రం : ఎంతో డబ్బు అక్కర్లేదండీ. నాలుగు లక్షలుంటే నిక్షేపంగా రెండుభాషల్లో తీసిపారెయ్యొచ్చు. చిక్కల్లా స్టార్స్ దగ్గిరే వస్తుందండీ. ఎక్కడన్నా మర్యాదగల కుటుంబస్త్రీలు—సినిమాకు పనికొచ్చే వాళ్లు—దొరికితేగాని ఈ సమస్య తీరదండీ!

శ్రీమతి: (లోపల్నుంచి) మంచినీళ్ళడిగి పట్టుకుపోరేమండీ?

దుర్గా : కాస్త ఇచ్చేసి పోగూడదుటే?...ఏమిటండీ అంటున్నారూ?

భద్రం : అసుకోటమేగాని కుటుంబస్త్రీలు ఈ దిక్కుమాలిన లైనులోకి ఎట్లావస్తారులెండి.

దుర్గా : వెనకటంత అన్యాయం లేదులెండి. ఇప్పుడొస్తూనేవున్నారు.... తెచ్చావా? మంచిదానవ్ వారికియ్యి.

శ్రీమతి : మీకో!

దుర్గా : నాకా? మంచినీళ్ళు కాదుగాని, డికాషన్ సిద్ధంగావుంటే మూడు కప్పులు హాట్ కాఫీ ఇద్దూ, ఏవండీ, కాఫీ పుచ్చుకుపోరూ.

శ్రీమతి : మీరోసారి ఇలావస్తారూ?

దుర్గా : వస్తున్నా, ఒక్కక్షణం క్షమిస్తారుగాదూ?

భద్రం : వెళ్ళిరండి, వెళ్ళిరండి, (దుర్గారావును వెళ్ళనిచ్చి చిన్నగొంతుతో) ఏంరా ఎట్లా వుంది?

గజ : బాదంహల్వా! పాలకర్ర దివిటీ! రీటాహేవర్త్! కాని అనుకున్నంతా అయింది—ఒకరి ఇల్లాలు. (దగ్గుతాడు)

దుర్గారావు : (తిరిగివస్తూ) ఏవిటంటున్నారూ?

భద్రం : ఏంలేదు, పోదాఁవని మావాడు తొందర చేస్తుంటే, పెద్దమనిషి కాఫీ ఇస్తానంటే తాగే పోదామంటున్నాను.

దుర్గా : ఆఫీసుకు వెళ్ళాలిసినవాణ్ణి నాకులేని తొందర సినిమావాళ్ళకి మీకే విటండీ!

భద్రం : అన్నట్టు, మేష్టారూ, మీరే ఆఫీసులో పని చేస్తున్నారో? మీ పేరే మిటో చెప్పారు కారు.

దుర్గా : నా పేరు దుర్గారావు, మీలాంటి స్నేహితులు దుర్గమని పిలుస్తారు. ఉద్యోగం మాట అడక్కండి. డైరెక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ఆఫీసులో గుమాస్తా గిరీ. నెలతిరిగితే నూటపాతిక చేతిలో పడుతుంది.

భద్రం : అయ్యోయ్యో! చెప్పారు కారేం మేష్టారూ? మీరు సినిమాల్లో వేషం వేసుకున్నా నెలకి నిక్షేపంగా రెండు మూడువందలు గిట్టునే.

దుర్గా : (నవ్వి) నాకెవరు వేషాలిస్తారండీ?

భద్రం : (Business likeగా) ఒరే, గజపతీ, మేష్టారు సుమారు ఎంతె త్తుంటారంటావు? ఇద్దరూ ఒక్కసారి లేచినిలబడతారా? ఇంకేం? నీకన్న అరం గుళం పెచ్చేరా! మన పిక్చర్లో కోయరాజు వేషానికద్భుతంగా పనికొస్తారు.

దుర్గా : అభ్యంతరం లేకపోతే మీ సినిమా కథ చెబుతారూ?

భద్రం : అంతకన్నానా? హీరోయిన్ ఉంటుంది, మాష్టారూ. ఆవిడ రాజు కూతురు, ఆ సంగతి ఆఖరిదాకా తెలీదులెండి. గొల్లవాళ్లు పెంచుతారు. గొల్లపెద్ద కామిస్తాడు. వాడిబాధపడలేక ప్రియుడితోసహా అడివిలో పడుతుంది. అడివిలో ఉండగా ఒక పాఁవొచ్చి ఇద్దర్నీ కరుస్తుంది. ఇద్దరూ రూపంమారి ఒకర్నొకరు గుర్తించుకోలేక చెరొకదారీ అయిపోతారు —ఒకర్నొకరు వెతుక్కుంటూనూ! గొప్ప ఐరనీలెండి! ఇంతలో ఒకమంత్రగాడువచ్చి హీరోయిన్ రూపం మళ్ళీ తెప్పించి ఆవిణ్ణి కామిస్తాడు. ఒక కొయరాణి హీరోనికూడా అట్లాగే చేస్తుంది. మంత్రగాడినించి తప్పించుకుని హీరోయిన్ కోయరాజు చేతిలో పడుతుంది. అక్కడ తన ప్రియుణ్ణి చూసి గుర్తి స్తుంది. కాని ప్రియుడు గుర్తించడు. —

దుర్గా : ఏం? మామూలు రూపంలోనే ఉందిగా?

భద్రం : ఏంరా, గజపతీ? ఆ కథ నేను తప్పు చెబుతున్నా నేమిటి?

గజపతి : మొన్న "చంద్రప్రచండి" విడుదల అయినాక కథ చాలా మార్చాంలే.

శ్రీమతి : (వస్తూ) ఇదిగోనండి, కాఫీ.

భద్రం : థ్యాంక్స్, థ్యాంక్స్!

[కాఫీ కప్పుల చప్పుడు]

## మూడో రంగం

[భద్రం గది, గడియారం చప్పుడు]

గజపతి : మూడురోజుల్నుంచీ ధూపంవేస్తుంటే అంబ ఇప్పటికి పలికింది. శ్రీమతి వేషం వెయ్యటానికి ఒప్పుకుంది. కానీ నీక్కావలసింది అది కాదుగా?

భద్రం : వేషానికేం తొందర్రా! ముందు కాస్త బయటికి రప్పించాలి. బీచికి తీసుకు రమ్మంటినిగా? తీసుకొచ్చావ్?

గజ : రమ్మన్నార్రా, తన మొగుడు వచ్చింతరవాత బయల్దేరుదామంది.

భద్రం : ఏడిచినట్టే వుంది. వాళ్ళింట్లో మొత్తం ఎంతసేపు కూచున్నావ్!

గజ : గంటపైగా కూచున్నా.

భద్రం : ఏమన్నా ముగ్గులోకి దింపావా?

గజపతి: నువ్వు చెప్పినవన్నీ చెప్పా. సినిమాలో వేషాలు వెయ్యాలంటే కాస్త ఫ్రీగా వుండాలన్నా. మామూలు సంసారస్త్రీ నన్నది మరిచిపోవాలన్నా. అందరిమీదా చేతులేసుకు తిరగాలా అంది, అక్కర్లేదన్నా. ఫ్రీగా మాట్లాడితే చాలన్నా. చివరకు బీచికి రమ్మన్నా, ఒంటరిగా రానన్నది.

భద్రం : నీ ప్రతాపం ఏడిచినట్టేవుంది. గంటసేపు ఒంటరిగా దొరికితే వాళ్ళింటో చెయ్యలేనిది బీచిలో ఏంచేస్తావురా?

గజ : నీ మాటలు నా కర్థంకావడంలేదు.

భద్రం : వాజ! నాప! తేభ్యం!

గజ : నేనేనా?

భద్రం : ఇంకెవరు?

గజ : ఆ శ్రీమతికోసం నిద్రహారాలు మానింది నువా, నేనా?

భద్రం : ఒరే చండాలుడా! ఆ మనిషి నాకు కావాలని నీతో అన్నానుట్రా? నేను నీతి జాతీ లేనివాణ్ణనుకున్నావురా! నాకు భార్యా పిల్లలూ వున్నారన్నది నీకు తెలీదు. నేను పరస్త్రీని కన్నెత్తి చూస్తానురా?

గజ : నాకు మతిపోతోంది! నన్ను వెంటనే వెర్రాసుపత్రిలో చేర్పించు. శ్రీమతిని బస్సులో చూసిందెవరు? ఆవిణ్ణి కవిత్వంతో వర్ణించిందెవరు? ఆవిడకోసం తెల్లార్లూ మేలుకుందెవరు? అర్థరాత్రిపూట నామీద నీళ్ళుపోసి మేలుకోబెట్టి ఆవిడ అందచందాల్ని గురించి నాకు డబ్బారాచిందెవరు?

భద్రం : నేనే! ఎందుకు? ఆవిణ్ని నా పిక్చర్లో వేషం వేయించాలని! కేవలం వ్యాపార దృష్టితో ఆవిడకోసం నిద్రాహారాలుమానా, రెండువేలకి బుక్‌చేశా. కాగితంమీద సంతకం పెట్టించా. మిగిలినదంతా నీపనే.

గజ : మధ్య నాదేమిటుంది?

భద్రం : ఏమిటుందా? ఆ మనిషిని స్క్రీనుకు పనికొచ్చేట్టు చెయ్యటం. ఆ దుర్గారావు పెళ్ళాం నాకెందుకురా? ఫలానావాడి పెళ్ళాన్ననుకుంటూ ఆవిడ నటించేదేమిటి ఆవిడబొందా నాబొందా! ప్రపంచంలో ఉన్న ప్రతి మంచి వస్తువుమీదా, ప్రతి అందమైన మగాడిమీదా భ్రమ కలగాలి, వాంఛ కలగాలి. ఆ వాంఛ తీరుతుందనే ధైర్యం రావాలి. లేకపోతే ఆవిడ నాకెందుకు?

గజ : (నిర్ఘాంతపోయి) ఆవిడ నీతిని చెడగొట్టమంటావా?

భద్రం : ఆవిడ నీతితో నాకేంపని? నాకు కావలసింది వ్యాపారం. పదిలక్షల విలువచేసే మొహం నీతికోసం వంటిల్లుదాటి రానంటే ఆవిడ ఖర్మం. కాని వంటిల్లు దాటి రప్పించే తెలివితేటలు నీవే?.. మగాణ్ణని చెప్పుకుంటావు! నీతో అయిదు నిమిషాలు మాట్లాడితే ఏ ఆడదన్నా ఇట్టే లొంగిపోతుందంటావు! వెధవ గొప్పలు! గంటసేపు కూర్చున్నాట్ట! బీచికి రమ్మన్నాట్ట! సిగ్గులా?

గజ : ఇంత ఘోరం నేనెక్కడా చూడలా! నేనూ చాలామందిని ప్రేమించానుగాని ఒంటరి కాపురం ఎప్పుడూ చెడగొట్టలేదు. నాకు భగవంతుడు కాస్త మానాభిమానాలు పెట్టాడు. అందుట్లో నీచంగా ఇంకొకడి వ్యాపారం కోసం ఇంకొకడితో హాయిగా కాపురం చేస్తున్నవాడి పెళ్ళాన్ని — ఛీ, ఛీ!

భద్రం : ఒరే గణపతీ, నువ్వట్లా గాంధీమహాత్ముడల్లే మాట్లాడితే నేనేం చెప్పేదీ? శ్రీమతి సినిమాలో వేషం వెయ్యటానికి ఆమె భర్త ఎప్పుడైతే ఒప్పుకున్నాడో అప్పుడే వాళ్ళిద్దరి దాంపత్యమూ కొత్త దశలో పడింది. ఈ నూతన పరిణామం జరగటానికి ఇంకొకడూ ఇంకొకడూ కాకుండా నువే తోడ్పడమంటున్నాను. నీ వెధవ జన్మకి అంత అందగత్తె ఎప్పుడన్నా దొరికి ఉంటుందా? అసలు గంటసేపు ఆవిడతో ఒంటరిగా ఉండి నిన్ను నువ్వెట్లా నిగ్రహించుకున్నావో నాకర్థంకాలా.

గజ : నీలో మానవత్వం ఏమన్నా మిగిలివుంటే అర్థం చేసుకునేవాడివే.

భద్రం : ఇంతకూ శ్రీమతిని సినిమాస్టార్ చేసే ఖ్యాతి నువు దక్కించుకుంటావా, మరొకరికిమ్మన్నావా?

గజ : నాకిది పరీక్షా?

భద్రం : పరీక్ష ఏమీలేదు. నువ్వు ఒప్పుకోకపోతే, నీ ఉద్యోగం ఇంకొకరికివ్వాలిసొస్తుంది.

గజ : అందాకా వెళ్ళావన్నమాట! మన స్నేహితంకూడా ఖాతరు చేయవన్నమాట!

భద్రం : స్నేహమైతే నా లాభంలో నీకు కొంత ఇస్తా. నా పెట్టుబడి తీసుకొచ్చి నీమీద వృధాచేస్తా ననుకుంటున్నావా?

గజ : హోరి పీడుగా ! ఇట్లా సంసారాలు పాడుచేసి నువ్వీ వ్యాపారం చెయ్యకపోతేనేం ?

భద్రం : మనం కర్మ చెయ్యవలసినవాళ్ళమేగాని ఫలితాలకు కర్తలంకాము. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన.

గజ : అంతే, ఆ అమ్మాయి కాపరం చెడిపోవాలని రాసిపెట్టివుంటే నేను బాగుచెయ్యగలనా ? నువు చెప్పేదికాదని నా ఉద్యోగం ఎందుకు పాడుచేసుకోవాలి.

భద్రం : వత్సా, వర్ధిల్లు ! మన్మంగళాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు. శీఘ్రమేవ ఇష్టప్రాప్తిరస్తు !

## నాలుగో రంగం

శ్రీమతి : ఏవండీ, గజపతిగారూ ? మన పిక్చరింకా ఎప్పుడు ప్రారంభిస్తారు ?

గజ : ఇంకా కొంచెం తరవాయి ఉందిట.

శ్రీమతి : ఏవిటా తరవాయి ?

గజ : మీకు కొంచెం తారతమ్యం అలవడాలిట.

శ్రీమతి : అంటే ?

గజ : అంటే ఏంలేదు. నీతి నియమం లేకుండా తిరగటం.

శ్రీమతి : చాలించండి. ఇంకోరైతే దవడ పేలిపోను.

గజ : నామీద ఎందుకాగ్రహిస్తావు తల్లీ, నీకు అయిదు వందలు ఎడ్వాన్సిచ్చిన ప్రొడ్యూసరే ఆ మాట అంటున్నాడు.

శ్రీమతి : భద్రంగారా ? ఆయనకే పుట్టిందీ వుందు ?

గజ : వాణ్ణి అట్లా అనడానికి వీల్లేదు. సాక్షాత్తూ శ్రీరామచంద్రమూర్తి. ఏకపత్నీవ్రతుడు. పరస్త్రీని కన్నెత్తిచూడడు.

శ్రీమతి : మరి మీరన్నదేవిటి ?

గజ : కేవలం వ్యాపారదృష్టితో అన్నమాట అది. నువ్వు సాంఘికనీతికి కట్టుపడి ఉంటూ తారవై రాణించలేవుట ! నీ నీతికి భగ్నంచేసేపని నాకు పెట్టేశాడు. లేకపోతే నన్ను ఉద్యోగంలోనుంచి తొలగిస్తానన్నాడు. ఈ సంగతి నీతో చెప్పి ఈ వెధవ సినిమాకు ఇన్ని నీళ్ళు వదులుకోమని చెప్పడానికి వచ్చాను. నా పని అయిపోయింది.

శ్రీమతి : ప్రొడ్యూసర్లంతా ఇంతేనండీ ?

గజ : ఛీ, ఛీ, వీడెక్కడో వ్యాపారదృష్టిని పరాకాష్ఠ కెక్కించినవాడు. అందరూ ఇట్లా ఉంటారంటే నేను కలలో కూడా నమ్మను.

శ్రీమతి : అటువంటప్పుడు భద్రంగార్ని మనం ఏమీ అనరాదు. ఎందుకంటే ఆయన నిస్వార్థంగా ఆలోచిస్తున్నాడు.

గజ : నిస్వార్థమా ? నీ ద్వారా ఏ పదిలక్షలో ఆర్జించే దురుద్దేశంతో ఈ ప్రయత్నం.

శ్రీమతి : వెధవడబ్బు! ఆయన్ని సంపాదించుకోనివ్వండి. నేను నిజంగా స్టార్‌ను కావాలనేగదా ఆయన ఆమాటన్నది ? అంతేగాని నామీద కోరిక వుండి కాదుగా. నీతంటే ఆయనకు అభిమానంలేక అసలే కాదాయె. ఆయన పరస్త్రీని కన్నెత్తి చూడడని మీరే అంటిరి.

గజ : (ఆశ్చర్యంతో) వాడుచేసిన ఆలోచనలో సబబున్నట్టు నీకు తోస్తుందని నేను కల్లో కూడా అనుకోలేదు.

శ్రీమతి : ఆయన ఆలోచనను సమర్థించటంకాదు. అందులో ఆయనకు సదుద్దేశమే ఉండవచ్చుననుకోటాని కేం ?

గజ : హే పరాత్పరా !

శ్రీమతి : పోనివ్వండి, మీ కిష్టంలేకపోతే ఆ భద్రంగారి గొడవ మానేద్దాం, మిమ్మల్ని చూస్తే నాకు నిజంగా ఎంతో ఆనందంగా వుంది.

గజ : ఇంత శుభవార్త తెలిపాననా ?

శ్రీమతి : నామీద ఎంత అభిమానం లేకపోతే నాతో వచ్చి మీరీవిషయం బయట పెట్టేస్తారా ?

గజ : హే పరాత్పరా !

శ్రీమతి : చాదస్తంగా మాట్లాడక, మనం ఎటన్నా షికారుపోదాం పదండి.

గజ : ఇంకో పది నిమిషాల్లో మీ ఆయన కూడా వస్తాడుగా ?

శ్రీమతి : ఆయన, పాపం, ఆఫీసులో చచ్చేట్టు చాకిరీచేసి అలిసిపోయి వస్తారు.

గజ : ఈ శుభవర్తమాన మీ ఆయనక్కూడా చెప్పొద్దూ ?

శ్రీమతి : చాల్లెండి ! ఇంకానయం ! కొంపతీసి ! ఆయన ఇప్పటినుంచే నన్ను చెడిపోయినదాన్నిగ్గా కట్టేసి ఈ సినిమా ఛాన్సు కూడా లేకుండా చెయ్యటానికా !

గజ : హే పరాత్పరా ! ఇద్దరు కర్మసిద్ధాంతుల మధ్యపడ్డ నాగతేం కామన్నదోగదా.

శ్రీమతి : ఏమిటంటున్నారూ ?

గజ : ఏం లేదు. ఆ వచ్చేది మీ ఆయనేలాగుంది. ఈ పూటకు నేను వెళ్ళిపోతాను.

శ్రీమతి : ఈయనా సమయానికే రావాలి ! ఛీ !

—ముద్రణ : ఆంధ్రజ్యోతి మాసపత్రిక, డిసెంబరు, 1951

"... సంఘంలో అశాంతికి ఒకే కారణం దోపిడీ.
అదే లేని నాడు ఏ ప్రచారమూ అశాంతిని
వ్యాప్తి చెయ్యలేదు. దోపిడీ తరగతుల
వారీగా జరుగుతున్నది. జీవిత సూత్రాన్ని
చేతుల్లోకి పట్టుకొని కదిలించలేక దానికి
చిక్కిపోయినవాడు ఈ పరిస్థితి నేమీ
చేయలేడు. కింది వాణ్ణి దోస్తాడు. పైవాడి
చేత దోపిడీ చేయించుకుంటాడు. వాడే
కళలు సృష్టించినా, ఏ రాజకీయాల్లో
పాల్గొన్నా, ఏ ఆర్థిక సమస్యల్ని గురించి
మాట్లాడినా ప్రపంచానికి పిసరంతైనా
ఉపయోగంలేదు. జీవిత సూత్రాన్ని
చేత బట్టినవాడు దాన్ని మరింత
చిక్కుపరుస్తాడో, చిక్కు విడతీస్తాడో
అది వాడి ఆదర్శాలను బట్టి ఉంటుంది.
వాడు మంచికి పనిచేస్తే వాడివల్ల
లోకానికి ఉపకారం ఉంది. చెడుకు
పనిచేస్తే అపకారం ఉంది. వాడి
సాంఘిక చైతన్యం గురించీ, వాడి రాజకీయాల
గురించీ వాడు సృష్టించే కళల్ని గురించీ
ఉదాసీనంగా ఉండటం బుద్ధి మంతుడి
లక్షణం కాదు—"

—అరుణోదయంలో పేరులేని కుర్రాడు

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-20.